# శతక కవుల చరిత్రము

( రివైజ్డ్ ఎడిషన్ )

గ్రంథకర్త

కీ. శే. పండిత వంగూరి సుబ్బారావు పంతులు



ప్రకాశకర్త

దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు



రివైజ్డ్ ఎడిషన్ : పీఠిక, అనుబంధము

శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.,

ఆంధ్రభాషాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము.




ప్రకాశకులు...

కమల కుటీర్

ప్రెస్ అండ్ పబ్లికేషన్స్

నరసాపురము

 1957 [ రు. 12-0-0

ద్వితీయ ముద్రణము
సెకండ్ ఎడిషన్
1957 నవంబరు



ముద్రణము
కమలకుటీర్ (పవర్) ప్రెస్
నరసాపురము

# ప్రకాశకుల విజ్ఞప్తి

సుప్రసిద్ధపరిశోధకులును, ప్రఖ్యాతగ్రంథకర్తలు నగు కీ. శే. పండిత వంగూరి సుబ్బారావు పంతులుగారి 'శతకకవుల చరిత్రము' యొక్క సవరింపఁబడిన నూతన ముద్రణము (రివైజ్డు ఎడిషన్)ను ఆంధ్రవిద్వల్లోకమునకు సమర్పింపగలిగి నందులకు మా యిలవేలుపగు శ్రీప్రత్యక్షరామచంద్రమూర్తికి వందనము లర్పించుచున్నాము.

ఆంధ్రవిద్వల్లోకమున నఖండ ఖ్యాతి నార్జించిన కీ. శే. శ్రీ సుబ్బారావుగారి గ్రంథముల నెఱుంగని వారుండబోరు. వారు రచించిన గ్రంథములలో అప్పుడు వారు ప్రకటించిన ఊహలు కొన్ని నేఁడు సిద్ధాంతము లగుటయే పరిశోధనలో వారికిఁగల దీర్ఘదర్శిత్వమును వెల్లడిచేయుచున్నవి. ఇంతేగాక వారి గ్రంథములలో అనేక విషయములను అనేక గ్రంథకర్తలు తరువాత వెలువడిన తమ గ్రంథములలో పేర్కొనుట వలనకూడ శ్రీ సుబ్బారావుగారి గ్రంథముల ప్రాముఖ్యత స్పష్టపడుచున్నది.

మేమీ సంవత్సరమున ప్రకటించిన కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుపంతులుగారి 1. ఆంధ్రవాఙ్మయ చరిత్రము. 2. శతకకవులచరిత్రము, అను రెండు గ్రంథములకును, సద్గ్రంథముల యెడలను, గ్రంథకర్త అమూల్య పరిశోధనల

మొదలను గౌరవాభిమానములతో, భాషసేవయే పరమార్థముగ నెంచుకొని, అనుబంధములను, పీఠికాదులను వ్రాసియొసంగియు, ఏతద్గ్రంథముల ప్రకటనకై మమ్ము ప్రోత్సహించియు, అనేక అమూల్య సలహాల నొసంగియు, సహాయపడిన ప్రఖ్యాత పరిశోధకులును, బహు గ్రంథకర్తలును, విశాల హృదయులును, మదరాసు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులును, మా శ్రేయోభిలాషులు నగు విద్యారత్న శ్రీనిడుదవోలు వేంకటరావు, ఎం.ఏ., గారికి మా కృతజ్ఞతానేకవందనము లర్పించుచున్నాము.

ఈ గ్రంథ ముద్రణ ప్రారంభోత్సవ సందర్భమున (తే 26-5-57 ది) మా కమలకుటీర్ (పవర్) ప్రెస్ ఎలెక్ట్రిక్-విద్యుద్యంత్ర ప్రారంభోత్సవము జరిపిన ప్రస్తుతాంధ్రప్రదేశ్ న్యాయ, దేవాదాయ, ధర్మాదాయ శాఖామాత్యులగు గౌ॥ శ్రీ గ్రంధి వెంకటరెడ్డినాయుడు, బి. ఏ; బి. ఎల్., గారి సమక్షమున జరిగిన మహాసభలో, ఏతత్సభాధ్యక్షులైన శ్రీయఱ్ఱమిల్లి నారాయణమూర్తి పంతులు, బి.ఏ.,బి.ఎల్., గారు, ఈ గ్రంథ ముద్రణకై వేయినూటపదారు ద్రవ్యముతే గాక ఇంకను తమకు వీలైనంత అధికముగ విరాళము నొసంగెదమని వాగ్దాన మొనర్చి మాకు ప్రోత్సాహ మొసంగినందులకు వారికి మా నమోవాకములు! ఉదార హృదయులును, వదాన్యశేఖరులును, భాషాపోషకులు నగు శ్రీరాజా

యణమూర్తి పంతులుగారికి పరమేశ్వరుఁడు సర్వశుభముల నొసంగుగాక!

ఈ మహాగ్రంథములో నిదివఱకున్న ౨౦౦ కవుల చరిత్రములును గాక - అనుబంధములో ౧౮౩ గురు కవుల చరిత్రములు చేర్చఁబడినవి. మూల గ్రంథములోఁగల కొందరు కవుల చరిత్రలలో క్రొత్త పరిశోధనలవలన తేలిన విషయము లీ యనుబంధమునఁ జేర్చఁబడినవి. అనేక శతకములనుండి మచ్చుపద్యము లుదాహరింపఁబడినవి.

ఈ గ్రంథము మొత్తము 1000 పుటలు దాటిపోయినను, యింకను అనేకమంది శతకకవులు మిగిలిపోవుట తటస్థించినది. వారిలో ప్రఖ్యాతకవులగు శ్రీఆదిభట్ల నారాయణదాసు, శ్రీభోగరాజు నారాయణమూర్తి, శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులు, శ్రీ వేంకటరామకృష్ణకవులు, శ్రీదువ్వూరి రామిరెడ్డి, శ్రీకూచి నరసింహము, శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహము, శ్రీ రెంటాల వేంకటసుబ్బారావు, శ్రీఆదిపూడి సోమనాథరావు, శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము, శ్రీ దాసు శ్రీరాములు, శ్రీపురాణం సూర్యనారాయణతీర్థులు మొదలగువా రెందరో కలరు. అంతేగాక సంస్కృతశతకములను తెలుగుభాషలోని కనువదించిన కవులును - సంస్కృతభాషలో శతకములు రచించిన తెలుగుకవులును కొందరు కలరు.

అందువలన ఈ గ్రంథములో నున్న నాలుగుభాగములును - అనుబంధములో నాలుగుభాగములును గాక, ప్రత్యే

కముగ ఐదవభాగమును ముద్రించుచున్నాము. ముద్రణ సాగుచున్నది.

ఈ గ్రంథము చివర శతకకవుల యొక్క అకారాద్యనుక్రమణికయును – వారి నామముల క్రమముగా వారు రచించిన శతకముల పేరులును ప్రకటింపఁబడినవి. ఇది యొక నూతన పద్ధతి. ఈ అనుక్రమణికలో మొత్తము రమారమిగ 900 శతకకవులు చేర్చబడినారు. వారు రచించిన రమారమి 1200 శతకముల పేర్లు కూడ చేర్చబడినవి. ఈ శతకములలో ముద్రితములు – అముద్రితములు – అలభ్యములు కూడ కలిసి ఉన్నవి. అట్లే పైన వివరించిన రమారమి 900 కవులలో, ఈ గ్రంథములో 300 కు పైగా కవులచరిత్రలు మాత్రమే ప్రకటింపఁబడినవి. ఐదవభాగములో ఎందరు కవులు చేర్చ బడుదురో ప్రస్తుతము చెప్పజాలము. వివరములు తెలియని కవులు చాలమంది ఉందురు. కొందఱు కవులు కొన్ని శతకములు రచించినట్లు తెలియుచున్నది కాని అవి లభ్యమగుట లేదు. అందువలన వాటి నామములుకూడ తెలియుట కవకాశములేదు. ఉదాహరణకు – ఏకామ్రనాథకవి, ఇద్దయకవి, నెలిచేటి వేంకటరామప్రధాని, పోచిరాజు వీరకవి – మొదలగు కవుల శతకములు లభ్యమగుటలేదు.

ఈ గ్రంథము సమగ్రముగను – సప్రమాణముగను ఉండుటకై వలయు ప్రయత్నములను మా శక్తివంచన

# విన్నపము

ఆంధ్రవాఙ్మయచరిత్ర రచనకుఁ గీర్తిశేషులు శ్రీవంగూరి సుబ్బారావుగా రెట్లు శ్రీకారము చుట్టిరో అట్లే, వాఙ్మయమునగల ప్రత్యేక శాఖాచరిత్రములకును వారే ప్రారంభకులు. వారి శతకకవులచరిత్ర — శతకశాఖాపరిణామమునుగూర్చి వివరించు గ్రంథములలో మొదటిది! ఆనాఁటికి అనగా క్రీ.శ. 1923 లో అప్పటికి లభించిన శతకవాఙ్మయ సంబంధ గ్రంథము లన్నింటిని నామూలాగ్రముగఁ బరిశోధించి, సప్రమాణముగ, శతకకవుల చరిత్ర వ్రాసిరి. ఈనాఁడు, నూతనశతకములు - ముద్రితములు అముద్రితములు - అనేకములు లభ్యమగుచున్నవి. శతకవాఙ్మయ పరిశీలనముపైని, శతకములను గూర్చి సమ్యక్పరిశోధన, సమీక్ష జరుగుచున్నది. "శతకవాఙ్మయసర్వస్వము" అను గ్రంథము కూడ వెలువడినది.

కాబట్టి యిట్టి తరుణమున శ్రీ సుబ్బారావుగారి గ్రంథమును సమీచీనముగ తిరిగి ముద్రించి, ఆంధ్రవిద్వల్లోకమున కందించిన శ్రీ వంగూరి నరసింహారావుగారిని, నేను మనఃపూర్వకముగ సంభావించుచున్నాను.

ఈ గ్రంథపరిష్కరణభార మంతయు నాపైని వైచినారు నరసింహారావుగారు. వారి కోర్కె ననుసరించి నేనీ వఱకున్న చరిత్రములకుఁ గ్రొత్త విషయములు చేర్చుట -

కముగ ఐదవభాగమును ముద్రించుచున్నాము. ముద్రణ సాగుచున్నది.

ఈ గ్రంథము చివర శతకకవుల యొక్క అకారాద్యనుక్రమణికయును - వారి నామముల కెదురుగా వారు రచించిన శతకముల పేరులును ప్రకటింపఁబడినవి. ఇదియొక నూతన పద్ధతి. ఈ అనుక్రమణికలో మొత్తము రమారమిగ 900 శతకకవులు చేర్చబడినారు. వారు రచించిన రమారమి 1200 శతకములపేర్లు కూడ చేర్చబడినవి. ఈ శతకములలో ముద్రితములు - అముద్రితములు - అలభ్యములు కూడ కలిసి ఉన్నవి. అట్లే పైన వివరించిన రమారమి 900 కవులలో, ఈ గ్రంథములో 300 కు పైగా కవులచరిత్రలు మాత్రమే ప్రకటింపఁబడినవి. ఐదవభాగములో ఎందరు కవులు చేర్చబడుదురో ప్రస్తుతము చెప్పజాలము. వివరములు తెలియని కవులు చాలమంది ఉందురు. కొందఱు కవులు కొన్ని శతకములు రచించినట్లు తెలియుచున్నది కాని అవి లభ్యమగుట లేదు. అందువలన వాటి నామములుకూడ తెలియుట కవకాశములేదు. ఉదాహరణకు - ఏకామ్రనాథకవి, పెద్దయకవి, వెలిచేటి వేంకటరామప్రధాని, పోచిరాజు వీరకవి - మొదలగు కవుల శతకములు లభ్యమగుటలేదు.

ఈ గ్రంథము సమగ్రముగను - సప్రమాణముగను ఉండుటకై వలయు ప్రయత్నములను మా శక్తివంచన

# విన్నపము

ఆంధ్రవాఙ్మయచరిత్ర రచనమున కీర్తిశేషులు శ్రీ వంగూరి సుబ్బారావుగారు శ్రీకారము చుట్టినారే అట్లే, వాఙ్మయమునగల ప్రత్యేక శాఖాచరిత్రములకును నారే ప్రారంభకులు. వారి శతకకవులచరిత్ర — శతకశాఖాపరిణామమునుగూర్చి వివరించు గ్రంథములలో మొదటిది! ఆనాంటికి అనగా క్రీ.శ. 1923 లో అప్పటికి లభించిన శతక వాఙ్మయ సంబంధ గ్రంథము లన్నింటిని నామూలాగ్రముగఁ బరిశోధించి, సప్రమాణముగ, శతకకవుల చరిత్ర వ్రాసిరి. ఈనాఁడు, నూతనశతకములు — ముద్రితములు అముద్రితములు — అనేకములు లభ్యమగుచున్నవి. శతక వాఙ్మయ పరిశీలనముపైని, శతకములను గూర్చి సమ్యక్పరిశోధన, సమీక్ష జరుగుచున్నది. ''శతకవాఙ్మయసర్వస్వము'' అను గ్రంథము కూడ వెలువడినది.

కాబట్టి యిట్టి తరుణమున శ్రీ సుబ్బారావుగారి గ్రంథమును సమీచీనముగ తిరిగి ముద్రించి, ఆంధ్రవిద్వల్లోకమున కందించిన శ్రీ వంగూరి నరసింహారావుగారిని, నేను మనఃపూర్వకముగ సంభావించుచున్నాను.

ఈ గ్రంథపరిష్కరణభార మంతయు నాపైని పైచినారు నరసింహారావుగారు. వారి కోర్కె ననుసరించి నేసి వటుకున్న చరిత్రములకుఁ గ్రొత్త విషయములు చేర్చుట —

క్రొత్త శతకకవులగూర్చి వ్రాయుట - అను ప్రణాళిక నేర్ప
ఱచుకొని పని పూర్తికావించితిని. ఇదివఱలో దీనినిఁ గూర్చి
వ్రాసిన వ్యాసములు - గ్రంథములు అన్నియు నామూలా
గ్రముగ జదివితిని. శతకకవుల చరిత్రకు సంబంధించిన విష
యములను వానినుండి గ్రహించి, వానిని యుట్టంకించితిని.
ఆ యా గ్రంథకర్తలకు వ్యాసకర్తలకు నే నెంతయేని కృత
జ్ఞుఁడను.

ఇట్లు నూతనవిషయములు వ్రాయుటయేగాక కవులను
గూర్చి తెలిసికొనుట కనుకూలపడునట్లుగా "అకారాద్యను
క్రమణిక" చేర్చితిని. దీని నీవఱ కెవ్వరు చేయలేదు. ఈ
గ్రంథమును, సాధ్యమైనంతవఱకును, సమగ్రముగ, సప్రమా
ణముగ నుండునట్లు చేసియున్నాఁడను. ఇంకను క్రొత్తవిష
యములు, క్రొత్తకవులు బయలుపడిన వానిని తప్పక మఱి
యొకముద్రణమున చేర్చెదను. ప్రస్తుతము, తెలుఁగుసాహి
త్యక్షేత్రమున ప్రాథమికశాఖాచరిత్రమగు నీ శతకకవుల
చరిత్ర ఆంధ్రదేశమం దెల్లెడల, పఠనప్రచారములతో నల్లు
కొనుగాత! ఆంధ్రదేశమున, ప్రతి ఉన్నతపాఠశాలలోను
కళాశాలలోను, గ్రంథాలయములలోను, నీగ్రంథ మాభాం
డాగారముల నలంకరించుగావుత! శ్రీ సుబ్బారావుగారి కీర్తి
చంద్రిక లాంధ్రసాహితీజగదాహ్లాదకరము లగుగాత!

ఇట్లు,
నిడుదవోలు వేంకటరావు.

# పీ ఠి క

ఆంధ్రవాఙ్మయమున ప్రత్యేకవిశిష్టతగల శాఖలలో శతకశాఖ యొకటి. ఇది పండితులను, పామరులను, నొకేరీతి రంజింపఁజేయఁగల లక్షణములు గలది. శతకములు, పురాణములవలె కథాప్రధానములు గావు. ప్రబంధములవలె వర్ణన ప్రధానములు గావు. గేయకృతులవలె సంగీతప్రధానములు గావు. ద్విపదవలె దీర్ఘపరిమితిగలవి కావు. ఇవి ముక్తకము లయ్యును, నేక సూత్రత గలిగి, సులభగ్రాహ్యములై, కవి యాత్మానుభవమును ప్రకటించుచుండును. కావుననే హృదయమున కత్యంత సన్నిహితములు,

శతకములు తెలుఁగున క్రీ.శ. 12 వ శతాబ్దినుండి నేఁటిదనుక వర్ధిల్లుచునే యున్నవి. నవీనకాలమున నీరచన యంతగా లేకపోయినను, పూర్తిగా విస్మృతమైన దనుటకు వీలులేదు. ఆద్యతనులలో కూడ చాలమంది శతకరచనకుఁ గడంగుటయే, దీనికి నిదర్శనము. ఇక కేవలము సంఖ్యయే ప్రధానముగ దీసికొనినచో నీ శాఖలో నున్న రచనలు, ప్రబంధాది శాఖలలో లేవని నిరాఘాటముగా చెప్పవచ్చును. ఒక్క తెలుఁగులోనే కాని, సంస్కృతభాష యందును నిన్ని శతకములు లేవు. అందలి శతకములు శతసంఖ్యను మించవు. సజాతీయములైన ద్రవిడ కన్నడ మళయాళ భాషలలో, నా యా వాఙ్మయచరిత్రలు పరిశీలించగా, నిన్ని శతకములు

లేనేలేవు. ఇది యొక్కటియే తెలుగుసాహిత్యము యొక్క ప్రత్యేకతను, ప్రదర్శించును.

గతానుగతిక మగు ననువాదరచన గాక శతకము స్వతంత్రరచన. ప్రాయికముగా తెలుగు కవితారచన సంస్కృత ప్రాకృత ద్రవిడ కర్ణాట రచనల వెనుక వెలసినది. ఆ యా భాషల యందలి, విశేషములను గ్రహించి, స్వతస్సిద్ధమైన లక్షణములతో సమ్మేళనము చేసికొని, ప్రతిభా సంపన్నమైన ప్రశస్త రీతిని విస్తరింపఁజేసినది.

శతకమునందలి ముఖ్యలక్షణములు సంఖ్యానియమము, మకుట నియమము. సంఖ్యానియమము సంస్కృతస్తోత్రముల నుండి గ్రహింపఁబడినది. మకుట నియమము, కొన్ని శంకరాచార్యరచిత స్తోత్రములలో కన్పట్టుచున్నది. కాని సంస్కృతశతకములకు మకుటనియమము లేదు. కన్నడభాషలో నన్నయకు మున్నుగా "త్రైలోక్యచూడామణి" శతకము వెలసినది. అందు రెండు నియమములును గలవు. ఆ కాలమున తెనుగు కన్నడములకు గల సన్నిహితసంబంధమునుబట్టి కన్నడ శతకరచనలే తెనుగు శతక రచనలకు మార్గదర్శకము కావచ్చును. ఇట్లే తక్కిన శాఖలలోను కన్నడమునకు తెనుగునకును దగ్గఱచుట్టరిక మున్నది. * కాని కన్నడపద్యము

* తెలుఁగు కన్నడ సాహిత్యముల పరస్పర సంబంధమును గూర్చి, నా తెలుగు కవుల చరిత్ర, "నన్నయ యుగము" అను శీర్షికను చూడుఁడు. అది మదారాసు విశ్వవిద్యాలయము వారిచే ప్రకటితము.

లలో యతి నియమము లేదు. ప్రాస మాత్రమే యున్నది. ఆంధ్రభాషా స్వభావ సిద్ధములగు యతిప్రాసలు రెండింటిని నియతముగా పాటించి, తెలుగువారు శతకమున కొక ప్రత్యే కలక్షణత్వము నాపాదించిరి. మకుటము సాధారణముగ శత కము యొక్క వృత్తమును దెలుపుచుండును. కొన్ని పట్టుల యతిస్థానవర్ణమును నిర్ణయించును. మల్లికార్జున పండితుని శ్రీగిరి మల్లికార్జున శతకము, సోమనాథుని వృషాధిపశతకము (బసవా! బసవా! బసవా! వృషాధిపా అను మకుటము) చం పకోత్పలమాలికావృత్తములచే రచితము లని మకుటమును బట్టి చెప్పవచ్చును. వృషాధిపశతకమకుటమున 'నా' యతి స్థానమగుటచే నావర్ణమునకు సజాతీయములైన వర్ణములతో తప్ప తక్కిన వానితో యతి వేయుటకు వీలులేదు. ఇలానంప సర్వేశ్వరశతకము, కృష్ణా దేవకీనందనా శతకము, ఒంటిమిట్ట రఘువీరా జానకీనాయకా శతకము, మత్తేభ శార్దూలములతో రచితములైనవని మకుటమును బట్టి నిర్ణయింపఁగలము. మఱియు, యతిస్థానము లా వృత్తముల కెచ్చట యుండునో నా స్థానమును నిర్ణయింపగలము.

పూజాసమయములలో పుష్పములు ప్రధానములు కాబట్టి మల్లికార్జునపండితుఁడు చంపకోత్పలమాలికలతో శివుని సంబోధించుచు శతకము రచించెను. సోమనాథుఁడు నాతని ననుకరించెను. ప్రాయికముగా తెలుఁగు వాఙ్మయ మున వెలసిన తొలిశతకములు శైవమతప్రతిపాదకములు.

శైవసంప్రదాయికములు. దీని ననుసరించియే, యథావాక్కుల అన్నమయ్య గజాజిన, వ్యాఘ్రచర్మాంబరధారియగు శివుని, మత్తేభశార్దూలవృత్తములతో స్తుతించినాఁడు. శివదేవయ్య, శివదేవధీమణీశతకము, త్రిపురాంతకుని అంబికాశతకము చంపకోత్పలసహితములు.

శైవమునకు వెనుక వచ్చిన వైష్ణవమున తొలిశతకమగు వేంకటేశ్వరశతకము కూడ చంపకోత్పలములతో రచితమైనది. ఇదియును పైనిచెప్పినరీతి పూజాసంబంధమైనదే. ఆపైని కృష్ణాదేవకీనందనా మొదలగు శతకములు మత్తేభశార్దూలములతో రచితములైనవి. తరువాతి శతకములు చాలవఱకు చంపకోత్పలములే

ఈ సందర్భమున, ఒక్క శార్దూలవృత్తమే సంస్కృత వృత్తము. అనగా సంస్కృతచ్ఛందోగ్రంథములలో చెప్పబడినది కాని తక్కిన, మత్తేభచంపకోత్పలములు దాక్షిణాత్యులు సృష్టించినవి.

ఇట్లక్షర గణ నిబద్ధము లగు వృత్తములే కాక మాత్రా గణ నిబద్ధములగు, సీసములు, ఆటవెలఁదులు, గీతములు, కందములు మొదలగువానితో శతకములు రచితములైనవి. సీసము శీర్షక శబ్దభవము. ఈ ఛందస్సుతో శతకము రచించిన, నది శీర్షమును, శిరమును నలంకరించిన ట్లగును. సీసము సాధారణముగ నేదేని విషయమును గాని, కథా సం

దర్భములను గాని వివరించు పట్టున ప్రయుక్తమగును. సీసములతో మొదట శతకము రచించినవాఁడు పాల్కురికి సోమనాథుఁడే యని చెప్పనొప్పును. సోమనాథుఁడు రచించిన చతుర్వేదసారమునకు బసవలింగశతకము అని నామాంతరము. ఇందలి సీసములకు ఆటవెలఁదులే చాలవఱకు ననుసంధింపఁబడినవి. "బసవలింగ" అను మకుటము ప్రతి పద్యమునకు గలదు. ఇందు నాలుఁగు శతకములు అనగా నాలుగువందల పద్యము లున్నవి. ఇదిగాక ప్రబంధరత్నాకరమున "పాలపర్తి సోమేశ్వరుఁడు" అను పేరిట నుదాహృతమైన యీ క్రింది సీసపద్యములు రెండును, పాలకురికి సోమనాథుని వని నా యభిప్రాయము. తాళపత్రప్రతిలో నీ పేరు స్పష్టముగా "పాలకుర్తిసోమేశ్వరుఁడు" అని కలదు. పాలకుర్తి – పాలకుర్కి– రూపాంతరములే కదా!

"సీ॥ తలకమ్మి కొండయు, విలుకమ్మి కొండయు
గడయును నడుముగాఁ గలుగు తేరు
సరసిజముకుళంబు సద్వాక్యసకలంబు
మాతయు నాలుగు మాతలియును
మిన్నులఁ జనువాఁడు కన్నుల వినువాఁడు
నంకపర్యంకము లైనశరము
చల్లని పవనంబు నెల్లైన భువనంబు
మేపును మోపుగా మెలఁగు నారి

ఆ. వె. కాక కోర్చు విల్లు గతిగల గుఱ్ఱాలు
పగలు రేయుఁ దిరుగు బండికండ్లుఁ
గలుగఁ బురజయంబుఁ గైకొన్న నినుఁ గొల్తు
చిరశుభాంక! సోమశేఖరాంక!"

సీ|| వింటి క్రిందికి కొమ్ము వికలించి పెఱికిన
భూకాంతమును నాభి పొలుపు మిగిలె
నమ్ము పుచ్చుకొనంగ నమితతరంగముల్
పాలసంద్రంబునఁ బ్రిజ్వరిల్లె
బండికండులు రెండు పండ్లిగిలించిన
కలువలుఁ దామరల్ చెలిమిచేసె
వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ
జిచ్చుకు నాకలి చిచ్చువుట్టె

గీ. నారి సంధింపఁ గశ్యపు నారి వడకెఁ
గోల సంధింప లచ్చికి గోలపుట్టె
విల్లుఁ దెగఁ బాపి పురములఁ ద్రెళ్లనేసి
తడిది విలుకాఁడ వాదువో! శరభలింగ.

పై రెండును త్రిపురాసురసంహారమును గూర్చినవి. అందును రెండవ పద్యమునందలి వ్యంగ్యచమత్కృతి యసమానమైనది. ఇవి రెండును రెండు శతకములలోని వని యాంధ్రకవితరంగిణీకారు లూహించి యున్నారు. (పదియవ సంపుటము పుట 88) ఇది యెంతయు సమంజసము.

కందము నీతులను దెల్పుటకు నుపయుక్తమైనను నది తొలుత శివసంబంధమైనదియే. కందము స్కందశబ్దభవము. స్కందుఁడనఁగా కుమారస్వామి. కావున తొలుత శివకవులే, కందపద్యశతక రచనకు మూలపురుషులైరి. మల్లికార్జునపండితుఁడు శివతత్త్వసారము కందములతోనేగదా రచియించి నాఁడు. మఱియు చక్రపాణి రంగనాథుఁడు చంద్రాభరణ శతకమును కందములతో రచించినాఁడు. ఇందుండి లభ్యము

త్రైన పద్యము లాతని చరిత్రలో నుదాహరించి యున్నాను. నన్నెచోడడు కుమారసంభవమున వృత్తములలో కందపద్యములే హెచ్చుగా వాడియున్నాఁడు. మరియు స్కందుఁడు కుమారస్వామి స్తుతితో తన గ్రంథమున కందపద్యము ప్రారంభించి యున్నాఁడు.

ఆటవెలఁది ఛందస్సుతో సహస్రాధికములగు పద్యములు రచించిన మహాకవి వేమన! ఇందు "విశ్వదాభిరామ వినరవేమ" అను మకుటనియమ ముండుటచేత శతకవాఙ్మయమున నివి చేరినవి. ఆఁటవెలఁది పేరు సార్థకమగునట్లు రెండుపాదములుగల వృత్తము. ఈ నాఁడు మనము నాలుగు పాదములుగా వ్రాయుచున్నను, రెండు పాదములుగా వ్రాయుటయే ప్రాచీన సంప్రదాయము. అప్పు డది నియమముగా సీసపద్యమునకు చేర్చబడుచుండెడిది. ఆ వెనుక గీతపద్యము చేర్చుట సంభవించినది. కాబట్టియే దానికి "ఎత్తుగీతి" అను పేరు వచ్చినది. కాగా నన్నయ, నన్నిచోడాదుల గ్రంథములలో సీసపద్యములకు నాటవెలదియే విశేషముగా కానవచ్చును. ఇది సీసమునకు చేర్చబడినను, ప్రత్యేకవృత్తముగా పరిగణితమైనది. కావుననే, నన్నయాదులు దీనిని తమ కావ్యములలో వాడిరి. కాని తొలుత ఆటవెలఁదిలోనే శతకములను రచించి యాఛందస్సును లోకోత్తరముగ నాచంద్రార్కముగా నాంధ్రవాఙ్మయవీథిని వెలుఁగ జేసిన యశస్సు వేమనది.

నవీనకాలమున వేమన ననుసరించుచు నాటవెలది ఛందస్సును పునరుద్ధరించి, నవ్యసాహితీప్రపంచమున దానిని నిలువఁజేసిన కీర్తి నార్లవారిది. ఆంధ్రప్రభ సంపాదకులగు నార్లవారిని (నార్ల వేంకటేశ్వరరావుగారిని) యెఱుఁగని యాంధ్రు లుండరు. వారు రచించిన "వాస్తవమ్ము నార్లవారి మాట" అను పద్యములు వేమనపద్యముల స్థాయి నందుకొనినవి. వానివలెనే చిరముగ నిల్చునవి. అవి యింకను సహస్రాధికము కావలసియున్నవి. ఆంధ్రవచనశాఖయందే గాక, శతకశాఖయందు నార్లవారి కొక యగ్రస్థానమున్నది.

తమిళమున తిరువళ్ళువరు (తిరుక్కురళ్) గ్రంథకర్త, తెలుఁగున వేమన, కన్నడమున సర్వజ్ఞుఁడు దాక్షిణాత్యభాషాసాహిత్యమున నొకే స్థానమలంకరించువారు.

ప్రథమమునుండియు మనలాక్షణికులు శతకములను చాల నాదరించిరి. మహాకావ్యములతో సమానముగా వానిని ప్రామాణికములుగా గ్రహించి, వానినుండి పద్యము లుదాహరించిరి. ప్రాచీనలాక్షణికు లుదాహరించిన పద్యములు కొన్నిపట్టుల కొన్ని శతకము లున్నవని గుర్తించుటకును లభ్యములైన శతకములలోని లోపించిన పద్యములు తెలుసుకొనుటకును నెంతయో తోడ్పడి వాఙ్మయచరిత్రకారుల కమూల్యములుగా నున్నవి. సులక్షణసారకర్త యుదాహరించిన శరభాంకలింగశతకమునందలి పద్యము (చాపముగా నహో

ర్యమును......ఇత్యాది) ముద్రితగ్రంథములో లేదు. గణపవరపు వేంకటకవి యుదాహరించిన శివతత్త్వసారమునందలి పద్యము ముద్రిత ప్రతిలో లేదు. ఇట్లు లోపించిన పద్యములు చూపుటయే కాక శతకములు కొన్ని యున్నట్లు లక్షణగ్రంథములవలన తెలియనగును.

ప్రెగ్గడపల్లి పోతయ్యగారి గోదావరీశతకము లక్షణగ్రంథములనుండి యెత్తఁగినదే. నే నుదాహరించిన పద్యముగాక మఱియొకటి సంకలనలక్షణగ్రంథమున లభించినది.

మ॥ ద్విరదాకారతఁ జేర్చి, సంతమసకీర్తిం బాల్చి, మేఘాంశ్వాం
బరపై శైలధృతిం దనర్చిన మహాపాపౌఘముం గట్టి చే
సరిమాడ్కిం రవిభాతి గాఢ్వగతి, వజ్రిస్ఫూర్తి దారింపు, నే
హరియించున్ విరియించుఁ ద్రుంచు భవమద్యద్వారి గోదావరీ!

అప్పకవి యుదాహరించిన ముకున్దశతకమునుండి మఱియొకపద్యము లక్షణగ్రంథములందే లభించినది.

శా॥ నీ బంటెవ్వఁడు వాని బంటను సుమీ నిర్ణిద్ర శోభాఘన
ప్రాబల్యోజ్జ్వలకింకిణీకగణసౌభాగ్యంబు లెన్నానిఁకన్
శాబా సత్కృపమారసంహారణ ముష్టాముష్టి సంగ్రామ బా
హాబాహిక్రియ రామదాస తపబాసోహ మ్మనాన్నంపనా!

ఇంకను మన లక్షణగ్రంథములను బరిశీలించినయెడల మనకు ప్రాచీనశతకములలోని పద్యములు లభింపఁగలవు. దీనినిఁబట్టి లాక్షణికులకు శతకము లన్న యాదరం బున్న దను మాట వాస్తవము గదా!

శతకములు తొలుత భక్తిపరములే యైనను తరువాత నవి శృంగారరసప్రధానములై నీతివేదాంత బోధకములై విలసిల్లినవి. శతకశాఖను శృంగారపరముగా ద్రిప్పినవాఁడు రావిపాటి త్రిపురాంతకుఁడు. అతని యంబికాశతకము ననుసరించి అన్నమయ్య వేంకటేశ్వరశతకము రచించియున్నాఁడు. ఇవి గాక సంస్కృతశతకాంధ్రీకరణములును గలవు. కాని యివి పదునేనవశతాబ్ది కీవలివగుటచే, శతకరచన స్వతంత్రమని చెప్పనొప్పను. ఇంకను రాజకీయ సాంఘిక దురాచారముల నవహేళనముచేయు శతకములును గలవు. ఆ నాఁడేడవశతాబ్దిని సంస్కృతవాఙ్మయమున మయూరుడు సూర్యశతకమును రచించి తన కుష్ఠురోగమును నిర్మూలించుకొనినట్లుగా, పదునెనిమిదవ శతాబ్ది మధ్యమున, గోగులపాటి కూర్మనాథకవి సింహాద్రినారసింహ శతకముచే, శత్రువులను పాఱఁదోలి, క్షేత్రమునకు స్తోమతయు, కవిత్వమునకు ఘనతయు గల్పించినాఁడు. ఇది శతకవాఙ్మయచరిత్రలో నొక సువర్ణఘట్టము.

శతకములయందలి భాషావిశేషములు. పలుకుబడులు నానుడుల్ను పరిశీలించిన మన కెన్నియో విశేషములు గోచరించును. అది ప్రత్యేకముగా జరుగవలసిన కృషి. మఱియు శతకవాఙ్మయ మంతయుఁ దీసికొనుటకంటె, భక్తి, శృంగారాది శాఖలను దీసికొని ప్రత్యేక పరిశ్రమ చేసిన నింతకంటె నీ వాఙ్మయవిశిష్టత తేటతెల్లమగును.

వివరింపఁబోయిన నిల్లెన్ని యేని విశేషము లున్నవి. శ్రీ సుబ్బారావుగారు వాఙ్మయ పరిశోధనలో సిద్ధహస్తులు. వారు క్రీ.శ. 1923 లో నీ గ్రంథమున నూహించిన కొన్ని సంగతులు నేఁడు సిద్ధాంతము లగుటయే వారి దీర్ఘదర్శిత్వమున కుదాహరణము. శ్రీసుబ్బారావుగారి గ్రంథము పరిష్కరించు భాగ్యము నాకు కల్గించిన కమలాకుటీరాధ్యక్షులగు శ్రీ నరసింహారావుగారికి నా కృతజ్ఞతను దెలుపుకొనుచు నీ పీఠిక ముగించుచున్నాను.

ప్రమాదములు మానవసహజములు. నా యీ శతక సాహితీ పరిశ్రమలోని గుణదోషములను విచారణసేయు కర్తవ్యము ప్రాజ్ఞులది. ఈ గ్రంథ మితోఽధికవ్యాప్తిఁ బడసిన నా యీ సేవ ఫలవంతమగును.

చెన్నపురి
20-9-57

ఇట్లు
విద్వద్విధేయుఁడు,
ని. వేంకటరావు.

---

కృతజ్ఞత —

ఈ గ్రంథముయొక్క అనుబంధములోని చతుర్థభాగమున నుదాహృతములైన యారాధ్యవంశీయులగు శతకకవుల చరిత్రములు, ఆయుర్వేదాచార్య, డాక్టరు ముదిగొండ మల్లికార్జునరావు H. P. I. M. గారి సంపాదకత్వమున వెలువడుచున్న "శైవమత పత్రికాశిక" అను మాసపత్రిక నుండి గ్రహింపఁబడినవి. అందులకు నేను వారి కెంతయు కృతజ్ఞుఁడను.

ని. వేంకటరావు.



ది 26-5-57 తేదీని ఈ శతకకవులచరిత్ర (రివైజ్డు ఎడిషన్) యొక్క ముద్రణమునకు ప్రారంభోత్సవము జరిగినది. ఆ సమయముననే ఈ గ్రంథము ముద్రిణ మగుచున్న మా 'కమలకుటీర్ (పవరు) ప్రెస్' యొక్క విద్యుద్యంత్రమునకు కూడ ప్రారంభోత్సవము జరిగినది. ఏతత్సభకు అధ్యక్షులు శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారు, బి. ఏ., బి. ఎల్. ప్రారంభోత్సవము జరిపినవారు ప్రస్తుతాంధ్రప్రదేశ్ న్యాయ, దేవాదాయ శాఖామాత్యులగు గా॥ శ్రీ గ్రంధి వేంకటరెడ్డినాయుడుగారు, బి.ఏ.,బి.ఎల్. ఏతత్సభలో కవిభూషణ, కవిశేఖర, శ్రీ శిష్టా వేంకట సుబ్బయ్యగారు ఆశువుగా చెప్పి సభ్యుల నానందపరచిన పద్యరత్నములు ప్రక్క పుటలో ముద్రించఁబడినవి.



కవిభూషణ, కవిశేఖర,

# శిష్టా వేంకట సుబ్బయ్యగారు

ఆశువుగా చెప్పిన పద్యములు (26-5-57)

ఇరవుగ నీ ప్రపంచ పరి
వృద్ధికి నెట్టులో సూర్యచంద్రముల్
సరసపురప్రపంచకము
నకు వెలుగొందెదు సూర్యచంద్రు లి
య్యిరువురు గ్రంథివంశజుఁడు
ని య్యెరమిల్లికులుండు వీరలకు
హరిహరుఁ డోముఁగావుత చి
రాయు రభీష్టము లిచ్చి నిచ్చలున్

సీ. గ్రంథకర్త యటన్న ఘనయశస్సందిన
సుకృతుఁడు వంగూరి సుబ్బరావు
అల ప్రకాశకుఁడన్న నాంధ్రభాషాంగనా
సేవారతుఁడు నరసింహరావు
ప్రారంభకుండన్న నాంధ్రప్రదేశ మం
త్రివిధుఁడు వేంకటరెడ్డివరుఁడు
ఉద్ధారకుండన్న నుత్సన్నబహుళ సం
స్థావలంబకుఁడు నారాయణుండు

గీ. యత్నమన్న సమస్తజనాభయప్ర
దానవైద్యుతయంత్రసంధానసంవి

ధానవిజ్ఞానసంసిద్ధి గాన వాణి
దయ నిది దినదినోన్నతిఁ దనరుఁగాక!

చ. శతకము సంఖ్య సత్కవుల
చారుకవిత్వము దోహదించె నే
స్తుతమతి యెర్రమిల్లి కుల
తోయధిచంద్రముఁ డాత డిప్పు డీ
శతకములన్ రచించిన ప్ర
శస్తకవీంద్రవిచిత్రగాథ లు
న్నతిని సముద్ధరించు టని
నన్ నుతిపాత్రపుఔచితిం గనెన్

కం. సుమనోమనోజ్ఞ కావ్యౌ
ఘములను బ్రకటించి లోకకల్యాణార్థం
బమృతత్వము గూర్చుత మీ
"కమలకుటీ ర్ప్రవరు ప్రెస్సు" కలకాలంబున్

కం. విద్యావ్యాప్తికిఁ బాత్రిం
బుద్యద్గ్రంథాభిముద్రణోపకరణ మీ
విద్యుద్యంత్రము విద్యా
హృద్యుల రీ యుభయుల దయ నింపెసలారున్.

# మహారాజపోషకులు



శ్రీ యఱ్ఱమిల్లి నారాయణమూర్తి పంతులుగారు
బి. ఏ., బి. ఎల్.
అడ్వొకేట్, నరసాపురము

# పీఠిక

శ్రీయుత వంగూరి సుబ్బారావుగా రాంధ్రవాఙ్మయమునకు జేసిన సేవకు గృతజ్ఞతను దెలుపుటకే గ్రంథ పీఠికను వ్రాయ బూనితిని. గతసంవత్సరమునం దాంధ్రవాఙ్మయ సేవాపరాయణులైన శ్రీయుతులు కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు, లచ్చారావుగారు, సుబ్బారావుగారు పరమపదించుట యాంధ్రలోకమునకు గలిగిన దురదృష్టము. సుబ్బారావు గారు ముప్పదియేడవయేటనే పరమపదము నొందిరి. ఈ స్వల్ప కాలమునందే సుబ్బారావుగారు "ప్రభాతము, వేమన, ఆంధ్రక్షత్రియులు, వసంతలేఖలు, ఆంధ్రవాఙ్మయచరిత్రము, శతకకవులచరిత్రము, మొదలగు గ్రంథములను వ్రాసి యాంధ్రభాషకు విశేషమైన సేవనుజేసి యాంధ్రవాఙ్మయము నందు స్థిర ప్రతిష్ఠను బడసిరి. సుబ్బారావుగారి మిత్రులకును ఆంధ్రభాషాభిమానులకును వారి యకాలమరణము విచార మును గలుగజేసినది. ఆంధ్రభాష నిజసేవాపరాయణులు లేకను తన ప్రతిభను గోల్పోవుచున్నసమయమునందు సేవా పరాయణుల నిర్యాణము భాషాభిమానులకు విచారకారణం బగుచున్నది. సుబ్బారావుగారి గుణములందు మాతృభాషాభి మానమును ఆత్మగౌరవాభిమానమును గణనీయములు. ఆంధ్ర నామస్మరణము సుబ్బారావుగారి కావేశమును గలుగజేయు చుండెడిది. ఏ ప్రాంతములకు బోయినను సుబ్బారావుగా

రాంధ్రుల ప్రతిష్ఠను సమర్థించుట కధికోత్సాహమును గను పరచుచుండిరి. పునహో, కలకత్తానగరములందు జరిగిన పరిశోధక మహాసభలయం దాంధ్రుల వ్యక్తిత్వమును ప్రతిపాదించుటకు జేసిన ప్రయత్నములు వారి యాంధ్రత్వాభిమానమును విశదము చేయుచున్నవి. అధికారపాత్రకముగల ద్రవిడ ప్రముఖుల పన్నుగడలను ప్రతిఘటించి యాంధ్రశిబిరములను స్థాపించి యాంధ్రవ్యక్తిత్వమును వ్యక్తముచేసిరి. ఈ యాంధ్రత్వాభిమానము వారి గ్రంథములందును జీవితవిధానమునందును బ్రత్యక్షమగుచున్నది. ఈ యభిమానము వలన సుబ్బారావుగారికి ప్రతికూలానుకూలపక్షము లేర్పడినవి. సుబ్బారావుగారి యాత్మగౌరవాభిమానము వారి జీవితమునందలి వ్యత్యస్తములకు గారణంబైనది.

ఆంధ్రదేశమునందు సారస్వతజీవనము దురారాధ్యముగ నున్నది. సరస్వతీప్రసన్నులకు లక్ష్మీప్రసన్న మపురూపముగ నున్నది. సరస్వతీదేవి నుపాసించుటకు గంకణమును గట్టుకొనినవారలకు లక్ష్మీకటాక్షము దుర్లభముగ నున్నది. శ్రీమంతులను, రాజులను, మహారాజులను నాశ్రయింపకను సరస్వతీదేవి నుపాసించుట కవకాశములు లేవు. పూర్వయుగములం దట్టి సేవ కవకాశము లుండినను భౌతికాడంబరమయమైన కలియుగమునందు బొత్తిగా నవకాశములు లేవు. ఈ కారణమువలననే సుబ్బారావుగారివంటి

భాషాసేవకులకు సారస్వతజీవనము దుర్లభమై అకాలమృత్యువు సంప్రాప్తమైనది. సుబ్బారావుగారు పిఠాపురమునందును చెన్నపురియందును జీవయాత్రను గడుపుచున్నప్పుడు వారికి గలిగిన యసంతృప్తి వారి యకాలమరణమునకు మూలము. పిఠాపురమునందు బ్రతిభావంతులైన శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారికి బ్రియశిష్యులై* రచనాకౌశలమును బడసిరి. శ్రీయుత చెలికాని లచ్చారావుగారి యాదరణపోషణముల క్రింద నాంధ్రపరిశోధక మహామండలిని స్థాపించి దాని నిర్వహణమునందపారమైనశక్తిని గనుపరచిరి. ఆంధ్రపరిశోధకమండలియందు లభించిన యనుభవము వేమన, యాంధ్రవాఙ్మయచరిత్రము, శతకకవులచరిత్రము మొదలగు రచనలకు దోడ్పడినది.

సుబ్బారావుగారి మేధాశక్తియందు సంభావనాశక్తి విశేషము. పరిశోధనలందు గొంకవిశేషము గనుపడినప్పుడు పరమోత్సాహభరితులై కావ్యసిద్ధాంతనిర్మాణముల కుపక్రమించుచుండిరి. ఈ యూహాశక్తియే సుబ్బారావుగారి వ్యక్తిత్వమును స్థాపించి ఖండనమండనములకును దూషణభూషణ

*ప్రియశిష్యులు కాదు, ప్రియమిత్రులు. అంతకు పూర్వమే సుబ్బారావుగారనేక గ్రంథములు వ్రాసియున్నారు.

ములకును గారణంబైనది. ఆంధ్రక్షత్రియులు, వేమన, ఆంధ్రవాఙ్మయచరిత్రము, శతకకవులచరిత్రము, వసంత లేఖలు మొదలగు గ్రంథములు సుబ్బారావుగారి యూహా శక్తిని విశదముచేయుచున్నవి. వీరు సామాన్యవిషయాధార మున మహోనిర్మాణములను జేసి పండితుల ఖండనమండనము లకు బాలగుచుండిరి. ఆంధ్రవాఙ్మయచరిత్ర పీఠిక యందు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన భావము లీ విషయమును స్పష్టముచేయుచున్నవి.

"వాఙ్మయచరిత్ర సంఘశాస్త్రసంబంధిగా వ్రాయఁ బడియుండుట శ్లాఘనీయమైన విశేషము. అనేకస్థలముల సుబ్బారావుగారు నూతనయోజనముల ప్రయోగించి క్లిష్టార్థ ములకు నన్వయము నద్భుతభంగి కల్పించియున్నారు. ఇవి మొత్తముమీఁద వెఱ్ఱియూహలకుఁ జేరినవిగాక విమర్శనా పద్ధతి ననుసరించిన దృఢసత్త్వములుగానున్నవి." రామలిం గారెడ్డిగారు వాఙ్మయచరిత్రపీఠికయందు వ్రాసిన భావములు శతకకవులచరిత్రమునకును నన్వయించుచున్నవిధము శతక కవులచరిత్ర పఠనము విశదముచేయుచున్నది.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారీ గ్రంథ మునకు పీఠికను వ్రాయుట కనుగ్రహించిరి; కాని, కారణాం తరములవలన నాపని సంభవముగాలేదు. గ్రంథము ముద్రి తమై పదిమాసములైనను పీఠికకై ప్రచురణము నిలిచినది.

సుబ్బారావుగారు ముద్రితమైన కాగితములను నాతావున కంపి పీఠికను వ్రాసి ప్రచురింపుమని కోరుచుండిరి. కాని, నే నట్టి సాహసమునకు బూనుకొనలేదు. సుబ్బారావుగారి ప్రోద్బలముననే నేను శతకములను ప్రత్యేకముగ కవులచరిత్రములుగల పీఠికలతో ప్రచురించుటకు బూనుకొంటిని. వృషాధిప, సర్వేశ్వర, నారాయణ, రఘువీర, కాళహస్తీశ్వర, దాశరథీ శతకములు మొదలగు పదిశతకములను పీఠికలతో ప్రచురించితిని. సుబ్బారావుగారు జీవించియున్నపుడు నేను పీఠికను వ్రాయుటకు నిరాకరించియును వారి మరణానంతరము గ్రంథపరిచయమునకు పీఠిక వ్రాయుట యవసరంబై పూనుకొనినందులకు బండితులు మన్నింతురుగాక!

సుబ్బారావుగారి ప్రయత్నఫలమును, నాకృతజ్ఞతను వెల్లడిచేయుటకే పీఠికను వ్రాయుటకు బూనితిని. సుబ్బారావుగారు గ్రంథమునకు 44 పుటల ప్రవేశవ్యాసమును వ్రాసి శతకవాఙ్మయచరిత్రము నాంధ్రలోకమునకు బరిచయము చేసిరి. గ్రంథము 540 పుటలను గలిగి భావగర్భితముగ నున్నది.

ఆంధ్రవాఙ్మయమునందు బురాణములు, కావ్యములు, ప్రబంధములు, శతకములు, నవలలు, నాటకములు మొదలగు వ్యక్తిత్వముగల విభాగములు గలవు. ఆ విభాగము లన్నియును బ్రత్యేకచరిత్రము నపేక్షించుచున్నవి. ఆ

విభాగములందు శతకవాఙ్మయ మొకఘట్టముగ నున్నది. ఆంధ్రశతకములు ప్రాకృతసంస్కృత గ్రంథముల పరిణామము లైనను ప్రత్యేకవ్యక్తిత్వమును గలిగి యాంధ్రలోకాదరణ మును బడసినవి. శతకవాఙ్మయము పండితపామరులకు ప్రియ తరమైనను, లాక్షణికుల యాదరణమునకు విశేషముగ పాత్రము గాలేదు. లక్షణగ్రంథములను వ్రాసిన యప్పకవి యనంతామాత్యాదులును, గవులచరిత్రను వ్రాసిన వీరేశ లింగము పంతులుగారును శతకవాఙ్మయము నాదరించియుం డలేదు. ఆ లోపమును దీర్చుటకు సుబ్బారావుగా రీ గ్రంథ మును రచించినటులు వారి పీఠిక విశదము చేయుచున్నది.

శతకవాఙ్మయ మాంధ్రభాషయం దపారముగ నున్నది. సుబ్బారావుగారు 600 శతకములను జూచినటులు వ్రాసియున్నారు. ఇంకను బరిశోధన చేయవలసిన శతకము లనేకములు గలవు. ప్రస్తుతము గనుపడుచున్న శతకములందు పాల్కురికి సోమనాథవిరచితమైన వృషాధిపశతకము ప్రాచీన శతకము. ఇది పండ్రెండవశతాబ్దికి జెందినది. అప్పటినుండి నేటివరకును శతకరచన లవిచ్ఛిన్నముగ గనుపడుచున్నవి. ఆంధ్రభారతకాలమునుండియు నవిచ్ఛిన్నజీవితముగల శతక వాఙ్మయ మాంధ్రవాఙ్మయపరిశోధకులకును భాషాభిమానుల కును నాదరణీయముగ నున్నది. ఆంధ్రవాఙ్మయమునందు శతకవాఙ్మయస్థానమును ప్రయోజనమును నిర్ణయించుటయె

శతకకవులచరిత్రమునకు బ్రయోజనము. కావ్యప్రయోజనము నిర్ణయించుటయందు పండిత ప్రయోజనములను గ్రంథ బాహుళ్యమును రసాత్మకమునుబట్టి నిర్ణయించుట యాచారమైనను కేవలము రసపోషణమూలముననే యాదరణమును బడసిన కావ్యములు గలవు. మేఘసందేశము చిన్నదైనను కావ్యముగ బరిగణింపబడుచున్నది. "రసాత్మకమైనవాక్యము" కావ్యమనియును, "రమణీయార్థప్రతిపాదకమైన శబ్దము" కావ్యమనియును,

"శ్లో. నిర్దోషలక్షణవతీ సరీతి ర్గుణభూషితా,
సాలంకార రసానేక వృత్తి ర్వా క్కావ్యనామభాక్."

కావ్య మనియును, లాక్షణికులు వ్రాసియున్నారు. ఆంధ్రలాక్షణిక గ్రంథకర్తలు శతకములను జాటుప్రబంధములందు జేర్చిరి. విన్నకోట పెద్దన్నగారు శతకములను క్షుద్రకావ్యములందు జేర్చిరి. శతకముల కావ్యవిభాగమును నిర్ణయించుటకు గావ్యప్రయోజనమును నిర్ణయించుట సమంజసము. మమ్మటాచార్యుడు నిర్ణయించిన కావ్యప్రయోజన మాదరణమును బడసినది :—

శ్లో. కావ్యం యశసే ఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే.

కావ్యప్రయోజనము రసౌచిత్యమూలమున స్థాయీభావమును గలుగజేయుట యైనను నయ్యది పురుషార్థసిద్ధికి

సాధనము గావలయును. పద్యభేదమును సంఖ్యనుబట్టి కావ్య స్వరూపమును నిర్ణయించుట ప్రయోజనకరముగాదు. భావా నుసంధానము లేని పద్యముల సముదాయము కావ్యముగ బరిగణింపబడదు. భావానుసంధానముగల మేఘదూతము చిన్నదైనను కావ్యముగ బరిగణింపబడుచున్నది. రసౌచిత్య ముగల భావగీతములును గావ్యవిభాగములుగ బరిగణింపబడు చున్నవి.

సుబ్బారావుగారు శతకములు భావగీతములను బోలి యా వాఙ్మయశాఖకు జెందినవని నిర్ణయించిరి. ఆంగ్లవాఙ్మ యరీతుల లక్ష్యముతో శతకవాఙ్మయరీతిని బరిశీలించినప్పు డీ నిర్ణయము యుక్తముగ దోచినను నీ పోలికయును నిర్ణయమును నసంగతములు. భావగీతములకును శతకములకును బోలికయుం డదు. భావగీతములందు గవి ప్రకృతిస్వరూపముల గుణసౌం దర్యములనుగాని మనోభావములనుగాని మనోహరముగ వర్ణిం చుచు భావవికాసమును గలుగజేయును. భావగీతములు గలుగజేయు భావవికాసము మానసికానందమును గలుగజేసి నను నాత్మానందమును గలుగజేసి పురుషార్థమునకు ప్రయో జనకరముగాదు. శతకములు భావగీతముల కతీతమైన యాత్మా నందమును గలుగజేయుచు పురుషార్థమును బడయుటకు సాధనములుగ నున్నవి. శతకములు సామాన్యముగను భక్తి శతకములుగ నున్నవి. పురుషార్థమునకు బరమావధియైన

మోక్షప్రాప్తి శతకమునకు ప్రయోజనము. కవులు ధన కనక వస్తు వాహనముల నర్థించుచు ప్రబంధాదులను వ్రాసి నను మోక్షకాములై శతకములను వ్రాయుచుండిరి. కవులు చిన్నతనమునందు శతకములను, పెద్దతనమునందు కావ్యాదులను రచియించి రనుట యనుభవమునకు విరుద్ధముగ నున్నది. ధూర్జటి ధనార్థియై శ్రీ కాళహస్తీమాహాత్మ్యమును, మోక్షార్థియై శ్రీ కాళహస్తీశ్వరశతకమును రచియించిన విధము వు గ్రంథములే తెలుపుచున్నవి. శతకముల రచనావిభాగములును నీయర్థమును బరిస్ఫుటము చేయుచున్నవి. నారాయణశతకము నందుగల శతకవిభాగము శతకప్రయోజనమును దెలుపుచున్నది.

> "రమణీయంబుగ నాదిమంబు నవతారమ్ముల్ సద్భవ్య స్వరూ
> పము నామామృతమున్ దలంప దశకప్రాప్తమ్యు కృష్ణావతా
> రము సుజ్ఞానము మోక్షము న్ద్వివిధసంప్రాప్తిన్ శతాంగత్య కా
> వ్యము నర్పించితి నీ పదాబ్జములపైన్ నైపుణ్య నారాయణా!
>
> (నారాయణశతకము ప. 101) శతకకవులచరిత్ర 125 వ పే.

శతకము ౧. ఆదిదశకము ౨. అవతారదశకము 3. దివ్యరూపదశకము ౪. నామదశకము ౫. కృష్ణావతార దశకము ౬. జ్ఞానవింశతి ౭. మోక్షవింశతి యని ఏడుభాగ ములుగను విభజింపబడినది. శతకము భగవదవతారవర్ణనము లతో నారంభమై మోక్షాపేక్షతో నంతము నొందుచున్నది. శతకములందు గామసూత్రాత్మకమైన కథలు వర్ణనాదులు లేకపోయినను భాగవతాత్మకమైన కథలు వర్ణనలు గలవు. భాగవతపరములైన పద్యములందుగల పరమేశ్వర లీలా విలా

సములవర్ణనలు భావగీతభావవర్ణనముల కతీతమై వ్యక్తిత్వ మును భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. భావగీత ములు భౌతికానందమును, శతకము లాధ్యాత్మికానందమును గలుగజేయుచున్నవి, ప్రాచ్యసంస్కారపరములైన శతకముల కును, పాశ్చాత్యసంస్కారపరములైన భావగీతములకును సామ్యత్వము దుర్లభము. భక్తి జ్ఞాన వైరాగ్య బోధకము లైన శతకము లాంధ్రభాషాభూషణములై పండితపామరజను లకును బాలబాలికలకును బఠనార్హములుగ నున్నవి.

రసానుభవము కావ్యమునకు ప్రయోజనము. నవరస ములందును శృంగారకరుణరసములు ప్రధానములు. శృంగార కరుణరసములు కామపరములైనపుడు బంధనమునకును, దైవ పరములైనపుడు మోక్షమునకును మూలము లగుచున్నవి. శృంగారకరుణామూర్తియైన భగవంతుని శృంగారకరుణాలీలా విలాసము లనంతములు. అనంతమైన శృంగారకరుణావిలాస ముల యానందానుభవమున కనన్యమైనభక్తి సాధనముగ నున్నది. అనన్యమైన భక్తిపారవశ్యానందమును వర్ణించుటకు శతకములు యోగ్యముగ నున్నవి. కవు లిష్టదేవతాప్రార్థన మును బలువిధములను జేసి తరించుటకు శతకము లుత్కృష్ట సాధనములు. సర్వేశ్వర శతకము, కృష్ణశతకము, నారాయణ శతకము, రామతారకశతకము, దాశరథీశతకము, కాళహస్తీ శ్వరశతకము మొదలగు శతకములందలి ఈశ్వరస్తవములు భక్తిరసానందమునుగలుగజేయుచు ముక్తిమార్గమును గఱపు

చున్నవి. కవులు తమతమగ్రామములందు నెలసిన పరమేశ్వ రావతారములను శతకరూపమున బ్రార్థనచేయుచు గవిత్వ మును సార్థకము చేయుచున్నారు. భక్తహృదయావేశమును దెలిపెడి శతకము లనేకము లాంధ్ర భాషయందు గలవు. శతకముల పరిశీలన మాంధ్రహృదయ వికాసమును భాషా వికాసమును విశదముచేయగల విధమును సుబ్బారావుగారు గ్రంథమునందు విశదముచేసిరి. గ్రంథము శతకవాఙ్మయము వృద్ధి నొందిన విధమును జక్కగ వివరించినది. శతకములందు భక్తిశతకములే కాకను నీతి హాస్య శృంగారశతకములును గలవు. పండ్రెండవశతాబ్దియందు భక్తిభావముతో నారంభ మైన శతకవాఙ్మయము పదునేడవశతాబ్దియందు శృంగార రూపమును దాల్చినది. శతకకవులచరిత్రము మతసిద్ధాంతము లందును సాంప్రదాయములందును సాంఘికవ్యవస్థలందును గలిగిన మార్పులను విశదముచేయుచు నాంధ్రహృదయ పరి ణామమును నిరూపించుచున్నది.

గ్రంథము నాలుగుభాగములుగలిగి ౨౦౦ శతకకవుల చరిత్రను గలిగియున్నది. ప్రథమభాగమునందు 1150-1500, ద్వితీయ భాగమునందు 1500-1700, తృతీయ భాగమునందు 1700-1800, చతుర్థభాగమునందు1800-1900 వరకును జీవించిన శతకకవుల చరిత్రములు గలవు. శతకకవుల జీవితము లంజలి సుబ్బారావుగారినూతనాన్వేషణములు వారి పరిశోధనసామర్థ్య

మును విశదముచేయుచున్నను గ్రంథబాహుళ్య మనవసరముగ గలిగినది. సుబ్బారావుగారి గ్రంథరచనాసక్తి వలన బునరుక్తి దోషమును నిర్నిమిత్తమైన బాహుళ్యమును గలుగుచున్నవి.

శతకకవులచరిత్రమును ఆంధ్రవాఙ్మయచరిత్రమువలె నాంధ్రవాఙ్మయమునకు సుబ్బారావుగారు సమర్పించిన నూతనాలంకారము. గ్రంథము సుబ్బారావుగారి రచనాసామర్థ్యమును బరిశీలనాకౌశలమును విశదముచేయుచు నవవిధానమును సూచించుచున్నది. అయిదారు వందల శతకములను నితర గ్రంథములను బరిశీలించి విషయమును సమన్వయముచేసి వ్రాయుటయందు గల పరిశ్రమను బండితులు గ్రహింపనోపుదురు. నూతన రచనలయందును గల్పనలందును లోపములు సహజముగ గనుపడుచుండును. భావికాలమునందు శతకకావ్యాభిమానులీ లోపములను సవరింపనోపుదురు. ఆంధ్రవిద్యావంతులకు జిరపరిచితమైన సుబ్బారావుగారి శైలి, రచనాసామర్థ్యము, నితరగుణములును జర్చించి వర్ణించుట యనవసరము. ఆంధ్రవాఙ్మయసేవకై జీవితమును సమర్పించిన శ్రీయుత వంగూరి సుబ్బారావుగారి కృతికి చిరంజీవిత్వమును వారి యాత్మకానందమును విశ్వకళ్యాణమూర్తి విశ్వేశ్వరుడనుగ్రహించుగాత!

రక్తాక్షి వైశాఖ శుద్ధ ౧౪ శనివారము

కా. నాగేశ్వరరావు.

# విషయసూచిక



## ప్రథమభాగము

## 1150—1500

## ద్వితీయ భాగము

## 1500—1700



## 1600—1700

# తృ తీ య భా గ ము
## 1700—1800

## చతుర్థ భాగము
## 1800--1900

# అనుబంధము — విషయసూచిక

## ప్రథమ భాగము

( క్రీ.శ. 1150 - 1500 )

## ద్వితీయ భాగము

( క్రీ.శ. 1500 - 1600 )



## తృతీయ భాగము

( క్రీ.శ. 1700 - 1800 )

## చతుర్థ భాగము

( క్రీ.శ. 1800 - 1940 ప్రాంతము ) *



---

* ఈ గ్రంథములో అనుబంధము - చతుర్థభాగము క్రింద క్రీ.శ. 1800 - 1950 అని ముద్రింపఁబడినది. అప్పటికి 1950 వరకును గల శతక కవుల నందరను చతుర్థభాగములోనే చేర్పఁదలచి అట్లు ముద్రించితిమి. కాని గ్రంథము 1000 పుటలు దాటిపోవుటచే మిగిలిన కవులను ఐదవ భాగములో చేర్పదలచుటచే యీ గ్రంథము ముగించబడినది.

# సూచన

అనుబంధము — చతుర్థభాగములో చేర్చబడిన కవులలో కొన్నిచోట్ల కొందరు, ముందుచేర్చవలసినవారు వెనుకను, వెనుక చేర్చవలసినవారు ముందుగను పొరపాటున చేర్చబడిరి. అయితే వీరందరును కొలది సంవత్సరములు తేడాలోనివారే! ఈ పొరపాటు పునర్ముద్రణమున సవరింపఁబడును.

— ప్రకాశకులు.

# గ్రంథప్రవేశము



## ప్రాచీన ప్రాకృత శతకములు

శతకరచనము ప్రాకృతమునందే కాక వేదపురాణముల యందుఁ గూడ నారంభమైనట్లు పెక్కు నిదర్శనములు కనఁబడుచున్నవి. కేవల స్తుతిమాత్రము లైన భాగములయందనేకప్రదేశములలో పరమేశ్వరుని గుణవర్ణనమునను సహస్ర నామములఁ జెప్పుట, పలుమాఱు గుణవర్ణన మొనర్చుట మన కగపడును. ఒకసారి చేసినపని పలుసార్లు చేసిన ఫలితమధికమని జపతపములు వృద్ధి యైనవి. ఆ జపమొనర్చుటకు విధించిన నియమములయందు భగవద్గుణవర్ణనము నియమిత సంఖ్యగా నొనర్చుచుండిరి. స్తోత్రము లష్టోత్తరశత మని యుండుట పలువు రెఱిఁగినదే! కాని వేదపురాణములయందును గ్రంథమునడుమ సందర్భానుసారముగ మంత్రపుష్పము, ఏకాదశరుద్రములవంటివి – శతకముల పోలికలు నియమిత సంఖ్య గల ప్రార్థనాదికము – లున్నను, అవి వేఱుగ వ్రాసిన శతకములు కాని, చాటుప్రబంధములుకాని కావు. అందువలన వానినిఁగూర్చి వివరింపక, వేఱుగ శతకము లారంభ మెట్లయినవి మనకుఁ దెలిసినంతలోఁ బరీక్షించి చూతము.

ప్రాకృతములో నిట్టి వేఱుశతకము లారంభమైనట్లు

తెలియుచున్నది.* అం పవదానశతక మను గ్రంథము ప్రతిశత
కమునందు పదివిభాగము లున్నవి. పదిపదిపద్యములుగా వ్రాన

* "A particular species of avadanas are those in which the Buddha instead of a story of the past relates a prognastication of the future. These prophetic anecdotes serve like the stories of the past to explain the present Karma * * All the species of avadanas occur sporadically also in the Vinaya and the Sutra pitakas. They, however are grouped in large collections with the object of edification or for more ambitious literary motives. A work of the first variety is "Avadana Shataka" which is most probably the most ancient of its kind. It is a collection of a hundred avadana legends. Since it was already rendered into Chinese in the first half of the 3rd century and since it makes mention of the Dinara we may with certainty assign it to the Christian century. That it belongs to the Hinayana (హీనయాన) is indicated already by the character of the anecdotes; but this is likewise corroborated by the circumstances that in the stories relating to the present there are fragments embodied from the Sanskrit canon of the Sarvastivadas relating to the Parinivana and other Sutras. In these legends the worship of the Buddha, plays a Great Part.

(P. 46 Literary History of SANSKRIT BUDDHISM.)

దాససంగతిదశకము, మనోవృత్తిదశకము, సంసారదశకము, మాయాదశకము, తత్త్వదశకము, అభేద, దీనత్రాణ, అవతార, నీతి, దశకము లని విభాగించియున్నారు. కొందఱు వింశతులనికూడ విభాగించియున్నారు. ఈ సంప్రదాయము ప్రాకృతశతకములనుండి పరంపరగా వచ్చుచున్నది. ఈ విభాగము మన ప్రాచీనశతకములయందు గనబడుచునే యున్నది. నామ, అవతారదశకములు ప్రతి ప్రాచీనశతకము నందును సాధారణముగాఁ గనఁబడుచున్నవి. ఒంటిమిట్ట రఘువీరశతకమందీ నియమ మున్నది.

పైని చూపిన యవదానశతకమునందలి మొదటినాల్గు దశకములును కర్మస్వభావమును వ్యక్తీకరించుకథలను జెప్పును. అనఁగా నేకర్మయొనర్చిన ప్రత్యేకబుద్ధుఁ డగుటను వీలగునో యట్టికర్మల వివరించును. ప్రాకృతమునందు "వర్గము" లని పాలిభాషలో "వగ్గము" లని పది పది విషయముల విభాగించుట యిట్టిగ్రంథములలో నాచారము. ప్రాచీనబౌద్ధయుగమునుండియు నీయాచారము కనఁబడుచున్నది. ప్రథమదశకము నందలికథ లన్నియు, మూఁడవదశకము నందలి కథలు చాలభాగమును భవిష్యద్విషయఫలసూచకములు. రెండవ నాలవ దశకములయందు జాతకకథ లున్నవి. ఐదవదశకమునందు "ప్రేతవస్తువు"ను గూర్చి వివరణముకలదు. ౭.కఋషి సాధారణముగా మౌద్గల్యాయనుఁడు ప్రేతలోకమునకుఁ బోయి, తల్లోక వాసులదుఃఖ

ములఁ జూచి యొక ప్రేతము నెందుల కీజన్మమునకు వచ్చిన దని ప్రశ్నించును. ఆప్రేతము బుద్ధునిఁ జూపును. బుద్ధుఁ డాప్రేతము పూర్వజన్మమున నార్జించినపాపమునుఁగూర్చి చెప్పును. ఆపాపము దానమీయమియో, యోగితిరస్కారమో యైయుండును. ఆఱవదశకము మృగమానవులు మంచికార్యములు చేసి స్వర్గలోకవాసు లైనవారలకథల వివరించును. అర్హత (Arhat) నొందుట కనువగు కథలను గడపటినాల్గుదశకములును వివరించును. శాక్యవంశాన్వయుల నేడవదశకము, స్త్రీల నెనిమిదవదశకము, అనిందితచరితులవర్తనమునుగూర్చి తొమ్మిదవదశకమును, ముందు పాపులై వనక నెుంది, మంచిగొనర్చి సుఖు లైనవారిఁగూర్చి పదవ దశకమును వివరించును. (48 పుట)

ఇట్లే కర్మశతకముకూడ "అవదానశతకము" వంటి ప్రాచీనశతకము. అవదానశతకము సంస్కృతమునం దున్న దే కొంచము శీర్షికల భేదముతో నవదానశతక మని "పాలిభాషలో" నున్నది. కర్మశతకమునందు నూరుకర్మలనుగూర్చి కథ లున్నవి. దీనికి టిబెటుభాషాంతరీకరణమునూత్రమున్నది. మూలము లేదు. చీనాభాషలోనికిఁ బరివర్తించిన ప్రాచీనగ్రంథ మున్నది. దివ్యావదానశతక మని మఱియొకటి కలదు. ఈ మూఁడవశతకము పై గ్రంథములతరువాతఁ బుట్టినది. మూలము సంస్కృతములో నున్నది. (౫౨,౫౩ పుటలు)

ఇవి యన్నియు వినయపిటకము నుండి పుట్టియుండ వచ్చు నని తజ్జ్ఞు లనుచున్నారు. ఇందశ్వఘోషునిసూత్రా లంకారమునుండికూడ గాథలు తీసికొని చేర్చిరి. దివ్యావ దానమునందు వచనము, గాథలు కూడ నున్నవి. దీర్ఘసమా సభూయిష్ఠములగు సత్యమైన కావ్యశైలి గల శ్లోకము లున్నవి. సులభమైన వచనములలో సంస్కృతభాగము లున్నవి. దివ్యావదానమున విషయవిభాగము లేదు. భాష శైలియు సక్రమముగ లేవు. కావున వివిధగ్రంథములనుండి యిది సంపాదితమైయుండును. ఏకకర్తృకము కానేరదు. కావున నీగ్రంథము వేర్వేరుకాలములకుఁజెందిన కావ్యభాగ ములకూర్పనవచ్చును. ఇది మూడవశతాబ్దమునాఁటికే చీనా భాషలోనికిఁ బరివర్తన మొందె నని చెప్పుదురు. ఇం దశోకుఁడు, పుష్యమిత్రుఁడు, శుంగవంశమునుగూడఁ జేర్కొని యుంట దీనికాలనిర్ణయము విచార్యము. ఇందు "దీనార" శబ్దము పలుమార్లు ప్రయోగించుటచే నిది రెండవశతాబ్దము నకుఁ బిమ్మటఁ బుట్టిన దనియే నిర్ణయింపవలెను. అశ్వఘో షుని సూత్రాలంకారమునుండి యిందుదాహరణములుంట నిది యాతనికిఁ బిమ్మటిది కావలెను. ఇందలి "శార్దూల కర్ణుని" కథ క్రీ.శ.265 నాఁటికే చీనాభాషలోనికిఁ బరివ ర్తించినట్లు ప్రబల నిదర్శనము లున్నవి. (54, 55 పుటలు)

"కల్పద్రుమావదనమాల" యనునది యవదానశత కమునుండి కథలు తీసి కూర్చిన మఱియొకగ్రంథము. ఇట్టివే

యశోకావదనమాల, రత్నావదనమాలయు ననిసూచించుచున్నవి. ఇవి పురాణసంప్రదాయము ననుసరించి యున్నవి. ఇంతటి శ్లోకములు నట్టివ!

ఇవి యన్నియు లిఖితగ్రంథములు. అచ్చు కాలేదు. కొన్నిటికి టిబెట్టు, చీనా భాషాంతరీకరణములు మాత్రము ముద్రితములై యున్నవి.

శైవ వైష్ణవ మహాత్మ్యములు, స్తోత్రములును దెలుపు కొన్ని భాగములు పురాణములయందున్నట్లే బుద్ధదేవుని స్తోత్రములు కొన్ని కలవు.*

ఇవి వేలు వేలు కావ్యములే. కొన్ని గ్రంథములలోని కెక్కినవి. కళ్యాణపంచవింశతిక, లోకేశ్వరశతకము, సుప్రభాత స్తవము, పరమార్థనామసంగీతి, మొదలగున వీమాదిరివి. ఇందు కళ్యాణపంచవింశతిక అమృతానందుడు 25 స్రగ్ధరలలో వ్రాసెను. లోకేశ్వరశతకము వజ్రదత్తుండనునతడు నూఱుశ్లోకములలో లోకనాథుని స్తుతించుచు వ్రాసెను. శాక్యముని, బుద్ధులు, బోధిసత్త్వులస్తుతి నలువదితొమ్మిది శ్లోకములలో నున్నదానినే సుప్రభాతస్తవమందురు. భగవద్గుణ విశేషస్తవముకలది పరమార్థనామసంగీతి.

అవలోకితేశ్వరునిభార్యయగు తారాదేవిని గురించిన - వనేకస్తుతులున్నవి. ఇవి మిక్కిలి పవిత్రమైనవి. సర్వజ్ఞ మిత్రుడు

* మనకిట్టి పురాణస్థస్తోత్రములు శతకములుగా నున్నట్లు విస్తరింపులైన దాసు శ్రీరాములుగారి దేవీభాగవతమునందు జూచునది.

డను కాశ్మీరదేశపుఁగవి తారాదేవినిఁగూర్చి స్రగ్ధరాస్తోత్రము వ్రాసెను. (Panegyric). దీనికే "ఆర్యతారాస్రగ్ధరా స్తోత్ర" మని మారుపేరు. "స్రగ్ధర" యనగా హారధారిణి. ఈపేరు తారాదేవికిని, శ్లోకనామమునకుఁగూడఁ జెందును. కవి యెనిమిదవశతాబ్దమువాఁడు. కాశ్మీరరాజున కల్లుఁడే కవి యని తారానాథుఁ డనుచున్నాఁడు. ఒకప్పుడీతడు దాతయై యొకనరమేధ మొనరింపఁ బూనుకొనినరాజున కమ్ముడు వోయి విప్రుని విడిపించి సంతోషపెట్టి, తాను "ఆర్యతారా నామాష్టోత్తరశతస్తోత్రము" వ్రాసి తాను ప్రాణభయము నుండి తప్పించుకొని నూరుమంది రాజకుమారుల ప్రాణ ముల రక్షించెను. ఈ 108 శ్లోకములును తారాదేవి నామగు ణవర్ణనమే. ఆమెస్తుతియే!

ఏకవింశతిస్తోత్ర మనునది మఱియొకగ్రంథము.

ఇవి యన్నియుఁ బాశ్చాత్యులు భాషాంతరీకరించు కొనిరి. శాలివాహనసప్తశతి మన శ్రీనాథుడు భాషాంతరీక రించినను మనకుఁ జిక్కలేదు*. ఈనడుమ శ్రీరాళ్ళపల్లి

---

* ఈ క్రిందిపద్య మొక్కటి మాత్రము శ్రీనాథుని దని శ్రీమా. రామకృష్ణకవిగా రనుచున్నారు.

ఉ. వారణసేయఁదావగొనవా నవవారిజమందుఁ దేఁటి కొ
వ్వారుచునుంట నీవెఱుఁగవా ప్రియహా తెలిగంటి గంటి క
వ్వారికిఁ గెంపురాదె తగవా మగవారలదూఱ నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగు నంతకు నంతకు నోర్వ నెచ్చలీ.

యనంతకృష్ణశర్మగారాంధ్రపత్రిక సారస్వతానుబంధమున రుచిఁ జూపిన యీ గ్రంథము మనకు లేకపోవుట యెంతనష్టమో తెలిసినది. పాలి, ప్రాకృతములు మననా రభ్యసించి యందలిగ్రంథము లెన్నియో భాషాంతరీకరించుకొనవలసి యున్న దని వేఱుగఁ జెప్ప నగత్యములేదు.

చంద్రగోమి యనుమఱియొకకవి తారాసాధనశతక మొకటి వ్రాసెను. ఇట్లే తారాదేవిపై శతాధికస్తోత్రకావ్యములు పుట్టినవి. ఇట్టివి 96 గ్రంథములం గూర్చి సతీశచంద్రవిద్యాభూషణుఁ డొకగ్రంథపీఠికలో నుదాహరించియున్నాఁడు (అతని స్రగ్ధరాస్తోత్రము. పీఠిక చూడుఁడు). ఈస్తోత్రములలో 62 టిబెటుభాషాంతరీకరణము లగపడుచున్నవి. (G. K. Narayan in his Literary History of Sanskrit Buddhism.)

[వింటర్నిజు, సిల్వెయినులెవి, హ్యూంబాగు, మొదలగు పండితులవ్రాతలనుండి తీసినసారాంశసంగ్రహము.]

ప్రాకృతములనుండి తెనుఁగులోనికి భాషాంతరీకరించిన గ్రంథములు తక్కువ. శృంగారసప్తశతినుండి శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారివి రెండు రెండు భాషాంతరీకరణపద్యములను జూపెదను. శృంగార సప్తశతి యనేక కావ్యములకూరుప్పు.

కుందపుత్రుఁడు

ఆ. లోభివానిచేతిలోని సిరి పెరిగిన, ఫల మొకింతలేదయొనఁ గొలుగఁ జూడ
తెరువునడుచు వేళ గటువు వేసవియెండ, మాఁడువానికిఁ దన నీడయట్లు.

డను కాశ్మీరదేశపుఁగవి తారాదేవినిఁగూర్చి స్రగ్ధరాస్తోత్రము వ్రాసెను. (Panegyric). దీనికే "ఆర్యతారాస్రగ్ధరాస్తోత్ర" మని మారుపేరు. "స్రగ్ధర" యనగా హారధారిణి. ఈపేరు తారాదేవికిని, శ్లోకనామమునకుఁగూడఁ జెందును. కవి యెనిమిదవశతాబ్దమువాఁడు. కాశ్మీరరాజున కల్లుఁడే కవి యని తారానాథుఁ డనుచున్నాఁడు. ఒకప్పుడీతడు దాతయై యొకనరమేధ మొనరింపఁ బూనుకొనినరాజున కమ్ముడువోయి విప్రుని విడిపించి సంతోషపెట్టి, తాను "ఆర్యతారానామాష్టోత్తరశతస్తోత్రము" వ్రాసి తాను ప్రాణభయమునుండి తప్పించుకొని నూరుమంది రాజకుమారుల ప్రాణముల రక్షించెను. ఈ 108 శ్లోకములును తారాదేవి నామగుణవర్ణనమే. ఆమెస్తుతియే!

ఏకవింశతిస్తోత్ర మనునది మఱియొక గ్రంథము.

ఇవి యన్నియుఁ బాశ్చాత్యులు భాషాంతరీకరించుకొనిరి. శాలివాహనసప్తశతి మన శ్రీనాథుడు భాషాంతరీకరించినను మనకుఁ జిక్కలేదు*. ఈనడుమ శ్రీరాళ్ళపల్లి

---

* ఈ క్రిందిపద్య మొక్కటి మాత్రము శ్రీనాథుని దని శ్రీమా. రామకృష్ణకవిగా రనుచున్నారు.

ఉ. వారణసేయఁదావగొనవా నవవారిజమంపుఁ దేఁటి క్రో
వ్వారుచునుంట నీవెఱుఁగవా ప్రియహా తెఱగంటి గంటి కే
వ్వారికిఁ గొంపురాదె తగవా మగవారలదూఱ నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగు నంతకు నంతకు నోర్వ నెచ్చలీ.

యనంతకృష్ణశర్మగా రాంధ్రపత్రిక సారస్వతానుబంధమున రుచిఁ జూపిన యా గ్రంథము మనకు లేకపోవుట యెంతన ష్టమో తెలిసినది. పాలి, ప్రాకృతముల మనమా రభ్యసించి యందలిగ్రంథము లెన్నియో భాషాంతరీకరించుకొనవలసి యున్న దని వేఱుగఁ జెప్ప నగత్యములేదు.

చంద్రగోమి యనుమఱియొకకవి తారాసాధనశతక మొకటి వ్రాసెను. ఇట్లే తారాదేవిపై శతాధికస్తోత్రకావ్యములు పుట్టినవి. ఇట్టివి 96 గ్రంథములం గూర్చి సతీశచంద్ర విద్యాభూషణుఁ డొకగ్రంథపీఠికలో నుదాహరించియున్నాఁడు (ఆతని స్రగ్ధరాస్తోత్రము. పీఠిక చూడుఁడు). ఈస్తోత్రములలో 62 టిబెటుభాషాంతరీకరణము లగపడుచున్నవి. (G. K. Narayan in his Literary History of Sanskrit Buddhism.)

[వింటర్నిజు, సిల్వెయిను లెవి, హూర్న్యాంబుస, మొదలగు పండితులవ్రాతలనుండి తీసినసారాంశసంగ్రహము.]

ప్రాకృతములనుండి తెలుఁగులోనికి భాషాంతరీకరించిన గ్రంథములు తక్కువ. శృంగారసప్తశతినుండి శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారివి యొండు రెండు భాషాంతరీకరణపద్యములను జూపెదను. శృంగార సప్తశతి యనేక కావ్యములకూర్పు.

కందపుత్రుఁడు

ఆ. లోభివానిచేతిలోని సిరి పెరిగిన, ఫల మొకింతయైనఁ గలుగ [illegible]
తెరువునడుచు వారి [illegible] వేసవి నొంప, మాఁడునానికఁ [illegible].

హాలుఁడు.

క. చెలులు కడుజాణ లాతఁడు, వలపుల దాఁచుకొనలేనివాఁడిఁక నే సి
గ్గులదానను నాపాదం, బుల లత్తుక వన్నె లేల పూసెను పోవే!

మన శతకవాఙ్మయమును పై విషయములతోఁ బోల్చి చూచుకొనినచో ననేక వందల సంవత్సరములక్రితము బహుశః ఆంధ్రభాషకుఁ దొలిరూపమైన ప్రాకృతవాఙ్మయచ్ఛాయ లిప్పటికిని మనశతకవాఙ్మయమునఁ జిహ్నితమైయున్నవి. కాఁబట్టి మనశతకములు చిరకాల సంప్రదాయము (Tradition) ననుసరించియే పెరుగుచున్నవి. ప్రాకృతమే యాంధ్రభాష తొలిరూపము కాదనువారున్నచో వారు జైనులను, వారిదేవాలయములను, వారి వాఙ్మయస్వరూపములను నాశనమొనర్చి శైవులు తమవానిగాఁ జేసికొని రట్టిసమయమున జైనుల ప్రాకృతవాఙ్మయమునుండి శతక స్వరూపమును దీసికొని రని యంగీకరింపక పోరు. ఏది యెట్లున్నను క్రీస్తుపూర్వము ప్రాకృతములో నున్న సంప్రదాయము లిప్పటికి మనశతకములలో నుండుట యాశ్చర్యజనకమైనవిషయము.

---

# సంస్కృతశతకములు

ఆర్యులజీవితము వేదమంత్రములతో నారంభమైనట్లు మనకుఁ దెలియును. అందువలననే మనకు వేదము లనాదివై

నవి. అవి యపౌరుషేయములుగా మనవారు పరిగణించిరి. ఆర్యులమతము, దినచర్య యివి వేదానుసారములు. వేదవిరుద్ధమైనమతముల కార్యావర్తము చోటీయలేదు. వేదములు భక్తిప్రతిపాదకములైన మంత్రములు, స్తుతులు, ప్రార్థనలతో నిండియున్నవి. వీనికిఁ బిమ్మటఁ బుట్టినవేదాంతములగునుపనిషత్తులు వానిసారములయినను వేదమునందు భక్తి ప్రధానముగఁ గనఁబడును. భగవత్ప్రీతికై స్తోత్రములు, తదనుగుణ్యములగు జపతపములు, మంత్రములు, కర్మలు, కనఁబడుచున్నవి. మంత్రములు, శాస్త్రములుగాను, ప్రార్థనలు క్రమముగా నుపనిషత్తులుగాను మారుటకుఁ గొంతకాలము పట్టినదని విమర్శకు లంగీకరించినవిషయమే కాని వేదకర్మలుమాత్రము నేఁటికిని జరుగుచునేయున్నవి. యథారూపముగ నిప్పటికి వానియధికారము సాగుచున్నది. ఈ వేద స్తుతులయందే భక్తిభావముల కనుగుణముగఁ బుట్టినశాంతులు. స్తుతులు, జప తప రూపము నొంది, మంత్ర తంత్రములు క్రియలుగాఁ బరిణమించినవి. ఈ కర్మలలోఁ గొన్ని నియమములు నేర్పడినవి. "ఒక మంత్ర మిన్నిసారులు జపింపవలెను." అని సంఖ్యాబద్ధములైనవి. తాంత్రిక వాఙ్మయముకూడ శతశతవాఙ్మయమునకుఁ బోషకమైనది. వానికారణములతో మన కిచ్చుటఁ బ్రసక్తిలేదు. అష్టోత్తరశత మనునది మనకు మిక్కిలి పరిచయమగు మాట. ఒక మంత్రముకాని, ఒక నామము కాని, స్తుతికాని, 108 మారులు జపించుటవలన లాభ మున్న

దని మనపూర్వులగు తాంత్రికులును దలంచిరి. 108 ప్రదక్షిణ ములు, 108 సూర్యనమస్కారములు, పునశ్చరణలు నియ మించిరి. జపమాలయందుఁగూడ 108 పూసలే నిర్ణయించిరి. ఈ శతసంఖ్యాన్వితమగు నిర్ణయము భక్త్యావేశముచేతఁ జేసి నస్తోత్రము లయిన భక్తిశతకములయందుఁ గూడ వ్యాపించి నది. కావుననే ప్రాకృతశతకములు, ఆంధ్రశతకములు కూడ 100 లేదా 108 పద్యములతో రచియింపసాగిరి.

వేదములో "శతయాతుఁ" డను ఋషికలఁడు. నూఱుమంత్రశక్తులు-కల ఋషినామ మని విజ్ఞులు వక్కాణిం చియున్నారు. ఈ శతశక్తులనిర్ణయ మధిక సంఖ్యాసూచ కమో సత్యముగ నాఋషి కట్టిశక్తి కలదో- మన కవసరము కాదు. ఆ సంఖ్యయందు మనవారికి గౌరవమున్నట్లు మనకుఁ దెలియుచున్న దదిచాలును. శతరుద్రియ, శతరుద్రీయ యమను పదములు వేదమునం దున్నవి. దీనికర్థము నూఱ్వురు రుద్రులను గూర్చిన స్తోత్రము అని వ్యాఖ్యాతలు చెప్పుచు న్నారు. ఈ శతరుద్రీయము యజుర్వేదము నందలి భాగము. దీని కీశతకనామము నిచ్చిరి. [తైత్తిరీయసంహిత 4. 5-1-11; కథకసంహిత 17-11-16; మైత్రాయణిసంహిత 2-9-1, వాజ సనేయసంహిత. 16.1] ఇందు రుద్రుని నూఱుగుణముల వర్ణన ముండును. గుణభేదము ననుసరించి నూర్గురు రుద్రుఁ లని యందురు. శతబాలాక్షమౌద్గల్యుఁ డను ఋషి ముద్గలఋషి

సంతతి నా శ్లోకుఁడు కలఁడు. ఇతఁడు వ్యాకర్తయఁట. గాలవమైత్రేయునితో వాదించినట్లు గోపద బ్రాహ్మణమునందుఁ జెప్పయున్నది.

మనపూర్వులకు "శత" శబ్దమునం దాదరణ మున్నది. అట్లే "సహస్ర" శబ్దమునందు నున్నట్లు గాన నగును. దేవతా పూజలయందు సహస్రనామావళి చదువుట మనకుఁ గ్రొత్త కాదు. పురాణము లన్నిఁటియందు నిర్దిష్టదైవమునుఁగూర్చి సహస్రనామావళియు, స్తుతిసమయములయందు స్తుతిమాలలు, స్తవరాజములు, దండకములు, శతకములు, సహస్రనామములను వ్రాయుట వాడుకగాఁ గనబడుచున్నది. పురాణ వాఙ్మయమునం దిట్టినిదర్శనము లనేకము లున్నవి. ప్రసిద్ధములగుట నుదహరింపనైతిని. కావున శతకస్వరూపము భక్తికొఱకు పుట్టె ననవచ్చును.

తెలుగువాఙ్మయము చాలవఱకు సంస్కృతానుసరణమే. మనపురాణములు కేవలభాషాంతరీకరణములు కాకపోయినను, సంగ్రహములుగా ననుసరణములు. మూలము కంటె భాగవతమునం దభివృద్ధికూడ నున్నది. అయినను స్వరూపస్వభావము లనుసరణములే యనవచ్చును. ప్రబంధములుకూడఁ గేవలభాషాంతరీకరణములు కాకపోయినను సంస్కృతలక్షణానుసారము వ్రాసినవి. కథ, పాత్రలు, రీతి, యివి యన్నియు సంస్కృతము నందలివే! స్వకల్పనము మిక్కిలి తక్కువ. కాని శతకము లట్లు కాదు. శతకస్వరూపము,పద్య

సంఖ్య, దశకవిభాగము, మొదలగునవి ప్రాకృతజనితము లయ్యు, శతకములలో సంస్కృత భాషాంతరీకరణములు మిక్కిలి తక్కువ. ఈ పరిమితి యెంతవఱకో, సంస్కృతశతకముల స్వరూప, స్వభావ, ప్రచారము లెట్టివో కనుగొందము. అనఁగా "చాటుప్రబంధములు"గా సంస్కృతమున నీఖండకావ్యము లెన్ని, యెట్లు, యెప్పుడు పుట్టినవి, యెట్లభివృద్ధి నొందినవి, అవి తెలుఁగు వాఙ్మయమున నేమిమార్పు లొనరించినవి, మొదలగు విషయములఁ చూచాయఁగఁ గనుఁగొనఁ బ్రయత్నించెదముగాక!

## భావగీతములు - వానిలక్షణములు

భక్తియే శతకములు మొదలగు చాటుప్రబంధముల రచనకుఁ మూలకారణ మని తెలిసికొనియుంటిమి. భావగీతములని మనవారిప్పు డనుచున్న లిరిక్కులు (Lyrics) శృంగార, భక్తిభరితములు. వేఱొకచోటఁ గాళిదాసుని మేఘదూత శతకస్వభావము కల దని చెప్పియుంటిని. అది భావగీతమనియే నాయభిప్రాయము. సంస్కృత భావగీతములలో నెల్ల మిన్నయై మనదేశమునందేగాక జర్మనీదేశము నందలి "గటె" వంటిపండితుని మెప్పునొందిన దీ మేఘదూతయే! దీనియందుఁ గొంచముకథ, కావ్యలక్షణములు నున్నవి. ఎడ తెగకుండ కథ పద్యములపైఁ బ్రాకును. ఇది శతకములలో సాధారణముగా నుండదు. ఏపద్యమున కాపద్యమే

యొకసంపూర్ణస్తుతి. ఆభావమంతతో ముగియును. అయినను దెలుఁగులోఁగూడ మేఘదూత వంటికథ గల శతకములు లేక పోలేదు. (1) ప్రసన్నరాఘవశతకము వంగూరినరస కవిప్రణీతము. రెండునూర్ల పద్యము లున్నవి. శతకమునకు మకుటము న్నది. రామాయణకథ యితివృత్తము. ఉదాహరణమున కొక పద్యము చూపెదను.

"తల్లడ మంద దేవతలు దాసవులున్ రఘురాముఁ డప్పుడున్
వి ల్లవలీలఁగాఁ దునిమె వేడుక మెచ్చ నృపాలుఁ డాత్మలో
నల్లుఁడు రామభద్రుఁ డన నాదిసురేశ్వరుఁ డంచు సీతయున్
బల్లవపాణి యాత్మఁ దనభాగ్యము మెచ్చెఁ బ్రసన్నరాఘవా॥"

(ప్రసన్న రాఘవశతకము, 53 పద్యము.

(2) ఇట్టిదే రంగేశకృష్ణశతకము రెండవది. ముకుంపై వేంకటరామనృసింహాచార్యకృతము. ఇందు రుక్మిణీకళ్యా ణాది భాగవతకథ లున్నవి.

(3) "ఇందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్" అనుమకుటముతో పుసులూరి సోమకవి "చంద్ర దూత" యను మనోహరకావ్యము కృష్ణవిరహముచే నొక గోపిక యడిగినట్లు తానే గోపికనని వర్ణించియున్నాఁడు. ఇది మిక్కిలి మనోహర మైనది.

ఇఁక ననేకము లిట్టికథలు వర్ణించుశతకము లున్నవి. కాని శతకమునం దితివృత్తముండక పోవుట యేతర్చుగాఁ గాన వచ్చుచున్నది.

సంస్కృతమున భావగీతములు శృంగారరసోద్దీపకములు. తెలుఁగున భక్తిభరితములు. కొందఱు భక్తిశృంగారము లొక్కటియే యని నిరూపించెదరు.

సంస్కృతమునందు ఋతుసంహారము, ఘటకర్పరము, చోరపంచాశత్తు ననున వన్నియు శతకస్వభావము కలవే.

ఈ చౌరపంచశతకమునే చళ్ళపిళ్ళ నరసకవి యామినీపూర్ణతిలకావిలాస మనియు, చెన్నూరి శోభనాద్రికవి శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయ మనియు వ్రాసిరి.

సంస్కృతమునందు శతకత్రయ మని వాడుకలో నున్న భర్తృహరిసుభాషితరత్నావళి ప్రసిద్ధమైనది.

సంస్కృతమునందలి శృంగారశతకము, శృంగారతిలకమునుగూడ మనోహరకావ్యము లనుటకు సందియము లేదు. ఇట్టి మంచిశతకములు తెలుఁగులో నెక్కువ లేవు. భావకావ్యములలో నమరుశతకము సుప్రసిద్ధమైనది. దీనిగుణము వ్రాఁత కలవికానిది. ఇందుఁ గాముకీకాముకులు వేర్వేరవస్థలయం దెట్టియెట్టిపాట్లు పడుదురో ప్రకృతిననుసరించి కవి చిత్రింపఁగలిగెను. ప్రణయకోపము, వియోగము, పునఃసమాగమమును అమరుశతకమున మనోహరముగఁ జూపెను. దంపతులసమాగమసుఖము, ఆనందము, వియోగము, నిరుత్సాహము, భక్తి, ప్రేమము వీనిదశ లన్నియు నతిచిత్రముగ స్ఫురింపఁజేయును. అన్నిఁటికంటెఁ జిత్రమేమనగా

నందలు నెఱిఁగినవిషయమునే క్రొత్తరూపమునఁ గవి చెప్పును. అది మన మెఱిఁగినవిషయమైనను నందు నవ్యత ప్రదర్శన మొంది క్రొత్తభావములఁ బుట్టించి యానంద మొనవించును. ఇది కవితాధర్మములో నుత్కృష్టమైనది. విచిత్రమైన సృష్టినైపుణ్య మని చెప్పవచ్చును. ఇందు వర్ణించిన ప్రేమ మాదర్శప్రాయమైనది కాక మోహమై కనఁబడుచున్నది. మనవాఙ్మయమునందుఁ బవిత్రప్రేమము లేదనియు, పూర్తిగా మోహపూరిత మనియుఁ గొందఱందురు. ఇది సత్యముకాదు. మనవాఙ్మయమునందు మనమిప్పుడు రసమును గూర్చి మాటలాడుచున్నాము. ఏరస మెట్లున్నదని మనప్రశ్నము. అంతేకాని యది నీతిమంతమా కాదా యని కాదు. కావ్యగుణపరీక్షయందు ధర్మశాస్త్రప్రయోజనము స్వల్పము. అమరుశతకము నందలి శృంగారము నిషిద్ధమైనది కాదు.

సత్యమైనమాట భావపూరితమైన శతకములు, ఖండకావ్యములే గాక తారావళులు, ఉదాహరణములు, తుదకు చాటుపద్యములు, ఒక వాక్యముకూడఁ గావ్యమే యనవలెను. ఉద్రిక్తహృదయముతోఁ గవి వ్రాసినది భావగీతము. అనఁగా శిల్పి నేర్పుతో మనయందు రసోదయ మొదవింపఁ గలఁడు. తాను చేయుపని నిర్ణయించుకొనును. ఇక్కడ నీరూప మీవిధముగ బ్రదర్శించినఁ జూపరులయం దీరస ముప్పొంగునని చిత్రించును. అది చిత్రించునప్పు డతని కారస ముదయింపవలె నని శాసనము లేదు. చూపరుల కొదవించు

నేర్పున్నదా? లేదా? యనియే విచారించెదము. కావ్యమన్లో కవి యొకపంథ వేసుకొని, కావ్యాంతము తానెఱిఁగి, లోకము కొఱకుద్దేశపూర్వకముగ నిర్మించును. తత్తదుచితస్థలముల నుచితరసము లుద్భవిల్లునట్లు ప్రయత్నించును. భావగీతము నందుఁ గవి యది వ్రాయునప్పటికె రససముద్రములో మునిఁగి యుండవలెను. పులకాంకురములతోడనో, కన్నీళ్ళతోడనో, తాను వ్రాయునది తానెఱుఁగకుండ లక్ష్యలక్షణసమన్వయ మొనర్పలేనంత యొడలు తెలియనిస్థితిలో వ్రాయవలెను. లేనియెడల నాయభిప్రాయముచేఁ గావ్యమునందువలె "సాగు డుకథ" లేకుండుటతప్ప, కావ్యమునకు భావగీతమునకు భేదమే నిరూపింప వీలులేదు. ఆంగ్లేయమున "లైరు" (Lyre) శ్రుతి సహాయమునఁ బాడువానికి లిరిక్కు లందురు. అట్టివి మన కీర్తనలు, పాటలు మున్నగునవి. ఐనఁ బెద్దలు చర్చించెదరు గాక!

సంస్కృతమునందునన్లే మనకుఁగూడ భక్తిపూరిత పద్యములు, పాటలు, కృతులు, శతకములు ననేకములున్నవి. తెలుఁగులో లిరిక్కులకుఁ బ్రత్యక్షనిదర్శనములఁ గొన్నిఁటినిఁ జెప్పెదను.

(1) చిన్నతనమునందే వైధవ్యము నొందిన బుద్ధి రాజువారి చిన్నది చెప్పినపద్యము లనునవి కొన్ని చదువు దురు. ఇవి కరుణరసపూరితములై శ్రోతలకుఁ గన్నీళ్లొద వించును. ఇందా బాలికకన్నీళ్ళు పద్యముతో మన మనోరం

గముల రాలుచున్నట్లు తోఁచును. ఈమొదని చెప్పిపద్యము "అయ్యలరాజు రామభద్రుని సకలనీతికథాసారమునందు నలరాజుకథలో దమయంతివిరహమునఁ" గలదు.

(2) శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపతి కొలువున సరస్వతీ కనకవిగ్రహమును జూచుటతోడనే చేతులుజోడించి, కన్నులుమూసికొని, చెప్పిన "దీనారటంకాల" పద్యమునందు రాజస్తుతి, ఆత్మస్తుతియుఁగూడ నున్నవి. రాజును స్తుతింపవలెఁగాని యది స్తోత్రముగాఁ గనఁబడరాదు. తనశక్తి నెల్లఁజాటవలెఁగాని యాత్మస్తుతి చేసికొనరాదు. భక్తిచే నుప్పొంగినశరీరము గల శ్రీనాథునిపారవశ్యము దైవానుగ్రహమున నతని కా రెండుకావ్యముల సమకూర్చినది.

(3) అడిదము రామకవి "కదలుమిటనూని దవిజగంగా భవాని"యని మొలలోతునీళ్ళలో నిలువఁబడి చేతులు జోడించి తడిబట్టలతోఁ - గుంచితగ్రీవాయుగ్మముతో - నొనర్చిన ప్రార్థనాపూర్వకముగు నాజ్ఞవలె నున్నపద్యము శాంతిని యుద్రేకస్వరూపమునే కనఁబరచుటలేదా?

ఇవి యన్నియుఁ గావ్యములేలకావు? ఇవియే లిరిక్కు-లని నా తాత్పర్యము. భావగీతములని మనవారు వీనికే పేరు పెట్టియున్నారు. సంస్కృతభావగీతములకును నాటకములకును నడుమ జయదేవుని గీతగోవిందము పుట్టి యీ రెండుస్వరూపములకావ్యములకును నతుకువలె నున్నది. ఇది నాటకము ననవచ్చును. భావగీతము ననవచ్చును.

మనలో భామ వేష మని యాడు నంపు వీథినాటకము భామాంకలాప మందురు. ఇందు సత్యభామ విరహవేదన మితి వృత్తము. ఇది యక్షగానరూపమున నున్నను, దీనినిఁ బెద్ద భావగీత మనవచ్చును. ఇందలి భావోద్రేకము "పదపద్మ ములు తడఁబడ సాగె నోయమ్మా!" అనుదరువు వినినప్పుడు విశదము కాఁగలదు. అనఁగా భావగీతములుకాని పెద్దకావ్య ములనఁగుమకూడ, వ్రాయుకవి విశ్వరూపము నొందినప్పుడు కాని, తానాపాత్రమైనప్పుడుకాని– అనఁగా నాపాత్రస్థితికి దిగి పోయినప్పుడు కాని– కవియుద్రేకము నొంది తన్ను తా నెఱుఁగకుండఁ గొన్నిభాగములు వ్రాయవచ్చును. అట్టిభాగము లలో "లిరిక్కు" ఉద్భవించిన దని చెప్పవచ్చును. భామాక లాపమునందు స్వభావసిద్ధమైన పత్రిలేఖనాదు లున్నను, వీధి నాటకప్రదర్శనమునందుఁ బ్రకృతికాంత గుగ్గిలపుపొడుల పొగ లలో కన్నులుమూసికొని, హరిదళపుఁగంపులకు ముక్కు బిగిం చుకొని, దరువులచప్పుడులో చెవిటిదియై, గంతులచిందుల లోఁగలిసి బెదరి యదృశ్య మగు చున్నను, వాఙ్మయచరిత్ర కారున కీ మన యక్షగాననిర్మాణము, ఖేలనము, నాట్యకళ, మున్నగువాని పూర్వచరిత్రము, వానిరహస్యములు నూహిం చుట కత్యంతోపయోగముగ నున్నవి.

సంస్కృతవాఙ్మయము నందలి శతకములు మన తెలుఁగుశతకములుగాఁ గొన్ని భాషాంతరీకరింపఁబడినను, మనశతకవాఙ్మయము స్వతంత్రమైనదిగానే కనఁబడుచున్నది.

వేణుగోపాల చంద్రశేఖరశతకములు పూర్ణముగ స్వతంత్ర రచనములు. ధూర్జటికాళహస్తి శతకమునందుఁ గొన్నిశివానందలహరిపోలికలు, సుమతిశతకమునందు సంస్కృతనీతిపద్యచ్ఛాయలు, కనఁబడినను మనశతకములు మూఁడుపాళ్ళు స్వతంత్రరచనము లనవచ్చును. కొందఱుశతకకర్తలు సంస్కృతశ్లోకములభావము లనుకరించినట్లుకూడఁ గనఁబడుచుండును.

ప్రాస్తావికపద్యావళినుండియేమి నీతిమంజరి, హితోపదేశ, పంచతంత్ర, భారతము మొదలయినవానియందలి శ్లోకాభిప్రాయములనేమి, కొందఱు శతకకవులు సాంగముగఁ దీసికొని భాషాంతరీకరించిరి. తాంబూలనిర్ణయము, భార్యాధర్మములు మొదలగునవి భాషాంతరీకరించిరి. మనవారు పూర్వుల ననుసరించుట గౌరవ మని యభిప్రాయము కలవారు. మంచివస్తువు కనఁబడినప్పు డది తెలిఁగించుచు వచ్చిరి. ఇట్లయ్యు మన శతకవాఙ్మయ ముపజ్ఞాసహిత మనియే చెప్పవీలు కలదు.

## భాషాంతరీకరణములు.

నడుమ సందర్భానుసారముగఁ జూపినవికాక సంస్కృతము నందలి నృసింహ, రామ, కృష్ణ కర్ణామృతములు, ముకుందమాల, మహిషశతకము, సూర్యశతకము మున్నగు శతకములను మూలానుసారము భాషాంతరీకరించుకొని యున్నాము. భర్తృహరి శతకములను నలుగురైదుగురు తెలిఁ

గించియున్నారు. (1) ఏనుఁగు లక్ష్మణకవి, (2) పుష్పగిరి తిమ్మన్న, (3) ఎలకూచి బాలసరస్వతి, (4) గురురాజకవి, (5) పోచిరాజు వీరన్న యీయైదుగురును సంపూర్ణముగఁ దెలిఁగించిరి. సూర్యశతకము నాథునికులేగాక పూర్వకవి యొకఁడు తెలిఁగించినట్లు ప్రబంధరత్నావళివలనఁ దెలియుచున్నది. ఇందు సంస్కృత పంచకావ్యములఁ దెలిఁగించి యనేకకృతు లొనర్చిన పోచిరాజు వీరన్న యిట్లు తనభళ్ళాణచరిత్రాదిని నుడువుచున్నాఁడు.

"సంస్కృతంబైన శంకరాచార్య విరచి
తంబు లానందలహరి సౌందర్యలహరి
భర్తృహరికృతమైన సుభాషితమును,
శతకములుగాఁగ మత్ప్రకల్పితములయ్యె."

భక్తిపుంజమగు ముకుందమాలకూడఁ (కులశేఖరాళ్వారుకావ్యమునుఁ) దెలిఁగించియున్నారు.

(1) ఇట్లే పలువురు తెలుఁగుకవులు సంస్కృతమునఁ గూడ శతకములు వ్రాయుచువచ్చిరి.

"నిర్మించినాఁడవు నిర్జరభాషచే శతకంబు, భాస్కరస్వామి కెలమి"

(రామవిలాసమున ఏనుఁగులక్ష్మణకవి)

(2) చిత్రాడ వేంకటేశ్వరశతకము.

(3) కుమారశతకము ననునవి తెలుఁగువారు వ్రాసిన సంస్కృత శతకములు. ఇంకను బెక్కులుండవచ్చును.

అమరుశతకమును తాళ్ళపాక వేంకటేశ్వరదీక్షిత పుత్త్రుఁడగు తిరువేంగళప్ప శృంగారామరుశతక మని తెలిఁగించెను. శిష్టు సర్వశాస్త్రికవికూడ దీనినే తెలిఁగించి కాళహస్తి సంస్థానాధిపతులకుఁ గృతి యిచ్చెను. మండపాక పార్వతీశ్వర శాస్త్రికూడఁ దెలిఁగించెను.

ఇంకను శృంగారతిలకాదులుకూడఁ దెలుఁగులోనికి వచ్చినవి. ఈ భాషాంతరీకరణములకుఁ బూర్వమునుండియు మన తెలుఁగుశతకము లున్నట్లు కనఁబడుచున్నది. ఆ శతకములజన్మమును, నభివృద్ధియుఁ బరీక్షించుకొందముగాక!

ఇతర భాషలు.

ఆర్యావర్తమునందలి ప్రతిదేశభాషయందు నీశతకము లున్నవి. అందు ముఖ్యముగ నఱవము, కర్ణాటకము, మళయాళము నందేగాక వంగభాషయందుఁ గూడ నీశతకములు కనఁబడుచున్నవి. "శచినందన శతక" మని సంస్కృతమున రఘునాథుడను వంగకవి యనేకచాటుకృతులతోపాటు వ్రాసెను. శచినందనశతకము చైతన్యస్వామిస్తుతి యై యుండును. ఇదిగాక బంగాళీభాషలోఁ గూడ భక్తిశతకము లున్నవి. ఇట్టివి గ్రీకు, ఆంగ్లేయ, వాఙ్మయములయందును "సెంచురీసు, గార్లెండ్సు" అను నామములతో నున్నట్లు పాశ్చాత్య వాఙ్మయచరిత్రములు నుడువుచున్నవి. కాని మకుటనేప్రధాన మగుట తెలుఁగుశతకముల కొకప్రధానలక్షణము.

ఇతర భాషాశతకములకును నీ నియమ ముండియుండవచ్చును గాని యీ పై వివరము లింతకంటెఁ బెంచుట కవసరము లేదు. ఏమనఁగా? వానివలనఁ దెలుఁగుశతకములయం దేమార్పులును గలిగియుండకపోవచ్చును.

---

## శతకవాఙ్మయాభివృద్ధి

మనశతకములు క్రీ॥శ॥ 12 వ శతాబ్దమునకుఁ బూర్వమున్నట్లు కానరాదు. పండ్రెండవశతాబ్దమునం దున్నట్లు స్పష్టముగఁ జెప్పఁదగినది వృషాధిపశతక మొక్కటే! ఇంతకుఁ బూర్వము పండితారాధ్యులవారి శివతత్త్వసార మొకటి శివమతప్రతిపాదకమైన గ్రంథము శతక స్వభావముకలది కనఁబడుచున్నది. శివతత్త్వసారము "శివా"యను మకుటముగలది. ప్రాయకముగనే మకుటము వచ్చును గాని కొన్నిచోట్ల మారును. కొన్నిచోట్ల పద్యమధ్యమున కేగును. కేవలశతకరూపమున నున్నది వృషాధిపశతకమే!

13 వ శతాబ్దము నడుమ మఱియొక ప్రసిద్ధశతకమున్నది. ఇదియే యథావాక్కుల అన్నమయ్య వ్రాసిన సర్వేశ్వరశతకము. వృషాధిపశతకము సర్వేశ్వరశతకమును రమ్యమయినవి. వృషాధిపశతకము జాను తెనుఁగు మొదలగు భాషావిశేషములఁ జర్చించుకొనుట కనువైనది. సర్వేశ్వర

శతకమున భావములు భక్తిప్రధానములై యీశ్వరుని.... కవిత్రియప్రయోగములకు విరుద్ధములై.... [illegible] కనఁబడుచున్నవి. ప్రాకృతములో బౌద్ధ, జైనవాఙ్మయముల యందలి శతకములు శైవులవలనఁ దెలుఁగులోనికిఁ బ్రాకినట్లు తోఁచుచున్నది. జైనదేవాలయము లనేకములు శైవు లాక్రమించినట్లే, నారిప్రాకృతవాఙ్మయము వ్యాప్తినిఁ గని శైవులు "జాను తెనుంగు"లో శైవమతవ్యాప్తి నొనరించుకొని రనుటకు పాలకురికి సోమనాథుని ద్విపదవాఙ్మయమే ప్రబలనిదర్శనమని చెప్పవచ్చునని తోఁచుచున్నది.

ఇందువలన మనకుఁ జిక్కిన మొదటి శతకములు రెండును 12వ శతాబ్దమునాఁటి వున్నవి శైవమత ప్రతిపాదకములు. 13వ శతాబ్దమునందున్న తిక్కన కృష్ణశతక మొండు రచించెనని "పూర్వకవిచరిత్ర"కారుఁ డనినమాట త్యాజ్యము. ఏపద్యము తిక్కన్నదని యిదివఱకుఁ జెప్పిరో యాపద్యము దేవకీనందనశతకములో నున్నది. దేవకీనందనశతకము తిక్కనకృతము కానేరదు. అది జక్కన విక్రమార్కచరిత్ర కృత్యాదివాక్యానుసారము వెన్నెలకంటి జన్నయ్యది కావచ్చును. "పరమహృద్యం బయిన పద్యశతంబుచే దేవకీతనయు విధేయుఁ జేసె"నని యున్నది. అప్పకవినాఁటికి దేవకీనందనశతకము లక్ష్యగ్రంథముగాఁ బ్రసిద్ధి నొందియున్నది. దేవకీనందనశతకము నాఁటి కనేక వేల శతకములు సుహాసినీ

శ్వరులు వ్రాసియుండి రని యీశతకమే సాక్ష్యమిచ్చు చున్నది వినుఁడు.

శా॥ కొండలవంటికవీశ్వరుల్ శతకముల్ గూర్పంగఁ గోటానఁగో
ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదేమో యంటివా వింటివా
వండేనేర్పులఁ బెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకముల్
చండాలామన వాలకింపు మదిఁ గృష్ణా దేవకీనందనా॥

లేదా కొన్నిప్రతుల యందలిగద్యముల ననుసరించి కవిరాక్షసుఁడే శతకకర్త కావలెను. సర్వేశ్వర, వృషాధిపశతకములయం దంతఁగా గవిత్రయవైరుధ్యము లగు ప్రయోగములు కనఁబడవు కాని యీ దేవకీనందనశతకము (15వ శతాబ్దము) మొదలు "వండేనేర్పులు, అంతామిథ్య, కూడీకూడని," మొదలగు ప్రయోగములు జన్నయ, పోతన్న, ధూర్జటి మొదలగువారు ప్రయోగించినట్లు కనఁబడు చున్నది. ఇట్టివి ప్రౌఢకవి ప్రయోగములుగ లాక్షణికు లంగీకరించిరి. ప్రబంధముల యందును బెక్కులు చూపఁబడెడిని. ఇవి ప్రస్తుత రచయితలకు ప్రయోగార్హములుగ నొనర్చుటయే లెస్సగాఁ దోఁచుచున్నది. పండిత కుంజరులు నిర్ణయించెదరుగాక !

పావులూరి మల్లన భద్రాద్రిరామశతక మొండు కనఁబడుచున్నది. కాని యిది గణితశాస్త్రకర్త రచించినది కాదని గోత్రభేదము వలనఁ దెలియుచున్నది. ఈ శతకకర్త ఒంగోలు తాలూకా పావులూరి వాఁడట. క్రీ॥శ॥ 1350లో నున్న రావిపాటి త్రిపురాంతకుఁ డంబికాశతక మొండు రచించెనుగాని

యది చిక్కుటలేదు. ఒకటి రెండుపద్యములు మాత్రము శ్రీమానవల్లి రామకృష్ణకవిగారివలన మనకు లభించినవి.

ఈ కవియే వ్రాసిన త్రిపురాంతకోదాహరణము, "చంద్రా రోహిణీవల్లభా" యనుమకుటముగల చంద్రతారావళి, యను గ్రంథములును జాటుప్రబంధములలోఁ జేరదగినవే. పాలుకురికి సోమన్న వ్రాసిన చెన్నమల్లుసీసములు, చతుర్వేదసారసూక్తులు మొదలగు చాటు కావ్యములుగూడఁ గొన్ని కలవు.

ఇఁక సుమతిశతకము తగ నొక్కటి ప్రబలమైనదిగ కనఁబడుచున్నది. దీనికర్తృత్వముగాని, కాలముగాని తెలియదు.

ఇట్లే భాస్కరశతకము మొదలగు కొన్ని శతకములకాలము నిర్ణయ మొనరించుటకు వీలులేక యున్నది. ఇవిసుమారుగఁ గృష్ణరాయనికిఁ బూర్వపువే యైయుండవచ్చును. 12–15 శతాబ్దములనడుమ 10–16 చాటుకావ్యములుమాత్ర మగపడుచున్నవి.

ఇఁక 16వ శతాబ్దారంభమునకు వచ్చిచూతము. ఇది పోతన్నకుఁ జేరువకాలము. కృష్ణరాయభానూదయకాలము. శైవముతగ్గి వైష్ణవము హెచ్చుసూచన లున్నవి. దక్షిణహిందూస్థానమున తురకల బాధలు కథలుగాఁ బ్రాకుచున్నవి. రాయలవా రార్తజనరక్షకుఁడై విజయనగరసామ్రాజ్య మధిష్ఠించుచున్నాఁడు. కర్ణాటకరాజ్యము ప్రబలమయ్యె నోరుఁగల్లుపతనము భీతి కలిగించినది. ఆంధ్రరాష్ట్రమునుండి యనే

కులు దక్షిణదేశమునకు వలసపోయిరి. వేఁగిదేశమును రెడ్లు పాలించుచుండిరి. గజపతులు దండెత్తుచుండిరి. రాజ్యములు స్థాపించియుండినవి చెడినవి. కృష్ణరాయలుకు రెడ్లు శత్రువులు. ఈ కాలమునందుఁ గృష్ణా గోదావరులనడుమనాని, పల్నాడు నందుఁగాని, బయలుదేరిన గ్రంథములు తరచుగాఁ గనఁబడవు. ఆంధ్రకర్ణాటక రాజ్యసమ్మేళన మొందినది. వేఁగి, కళింగదేశములు బలహీనములై రాయల కెఱగా నున్నవి. వేఁగి కళింగము లనేకప్రభువులపాలై యున్నవి. మహాత్మ్యాదీయుల ప్రచార మధికముగ లేక పోయినను, ఒత్తిడి రాజుల కైనఁ గలదు.

15వ శతాబ్దాంతమున 16వ శతాబ్దాదినిఁ గల యుపస్థితిలో కడపమండలము నందలి యొంటిమిట్ట రామచంద్రమూర్తిని గుఱించి రచించిన యొకశతకము ప్రసిద్ధమై కనఁబడుచున్నది. దీని సంపూర్ణప్రతియున్న ట్లాంధ్రపత్రికలో నేను ప్రకటించియుంటిని. దీని కే జానకీవరశతక మనియు, రఘువీర శతకమనియుఁ బేళ్ళు గలవు. అయ్యలరాజు రామభద్రుఁడు తన రామాభ్యుదయగద్యయందు "ఇది శ్రీమదొంటిమిట్టరఘువీరశతకనిర్మాణకర్మఠుఁ" డగు తిప్పయపాత్రకృత మని వ్రాసి కొనినాఁడు. శతకమునకే యింత బడబడ లేల యని విచారింపఁ గొన్నిపద్యములే చేకురుచుండినవి. ఈ శతక మిటీవల నియోగిపత్రికలో రామభద్రకృత మని పొరపాటునఁగా బోలు ప్రకటించుచున్నారు. ఇందుఁ గవిత్రయప్రయోగము

లకు వైదుష్యము లధికములు. కాని యీతఁడు కావ్యములు వ్రాసినందులకే యధికగౌరవ మందిన ట్లీక్రిందిపద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

శా. "ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబునన్
నాకావ్యంబులు మెచ్చఁజేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యము లిచ్చుచో నిపుడు వాణీదేవి నాజిహ్వకున్
రాకుండన్ వసియించు టెట్లు రఘువీరా! జానకీనాయకా॥"

స్వతంత్రప్రయోగము లధికములు. భావము లింతకుఁబూర్వపు శతకములలో నున్నవానికంటె మిన్నకావు. కొన్ని మిరియములవంటి పద్యము లున్నమాట సత్యము. కర్ణాటకరాజుల కావ్యపోషణము ప్రసిద్ధము. ఇతఁడు రామభద్రుని తాత యగుట వీరనరసింహుని కాలమునఁగాని, కృష్ణరాయని తండ్రికాలమునఁగాని, జీవించియుండవలెను. ఈతని గౌరవించిన కర్ణాటకమండలాధిపతి నరసింహరాయఁడో వీరనరసింహరాయఁడో తెలియదు. వీరనరసింహునికాలమున రాధామాధవుఁ డుండెను. బహుశః తిప్పయయు నీతఁడును సమకాలికులు కావచ్చును. పోతనామాత్యుఁడుకూడ నాలెక్కప్రకారము వీరికి సమకాలికుఁడై యుండవలెను. లేదా కొంచెము పూర్వుఁడై యుండవలెను. ఇప్పటి భాగవతము, నారాయణశతకము, జానకీవరశతకము, రాధామాధవవిలాసము, తారకబ్రహ్మరాజీయమునుగూడఁ గర్ణాటకరాజ్యపరిసరప్రదేశములనేగాక దేశము నల్గడల వైష్ణవప్రాబల్యమును సూచించుచున్నవి. ఈ కాలమునందే యున్న ప్రబోధచంద్రోదయ

కర్తలు శైవులు. వారికిఁ గొంచెము తరువాతవాఁడగు ధూర్జటి శైవుఁడు. పినవీరన్న శైవుఁడు. కావున శైవులు లేక పోలేదు. వైష్ణవము ప్రబలముగ నున్నదని మాత్రమే చెప్ప వీలగుచున్నది. శతకములును వైష్ణవమత ప్రతిపాదకముగ బయలుదేరినవి. శ్రీనాథుఁ డింతకుఁబూర్వము రచియించిన శాలివాహనసప్తశతి చిక్కుటలేదు. ఇతఁడును శైవుఁడే కాని శాలివాహనసప్తశతి భాషాంతరీకరణ మగుట నందు శైవమతప్రమేయ ముండకపోవచ్చును.

ఇఁక గృష్ణరాయని కాలమునుండియు వచ్చిన శతకములఁ బరిశీలింపఁదొరకొనిన ధూర్జటి కాళహస్తీశ్వరశతకమే ముందుగఁ గనఁబడుచున్నది. ఇందు శివానందలహరి, సర్వేశ్వరశతకముల ఛాయలు కనఁబడుచున్నవి. కాని దానినడక, భావములపరివాహము, భక్త్యుద్రేకము నీశతక మాశువుగఁ జెప్పినట్లు కనఁబడుచున్నవి. ఇది కవి ప్రౌఢవయస్సున వ్రాసినట్లు గ్రంథస్థవిషయములవలనఁ దెలియుచున్నది. శతకమీతనిచేతిలో సంపూర్ణస్థితికి వచ్చిన దని చెప్పవచ్చును.

సర్వేశ్వర దాశరథిశతకముల విషయమయి యతిమానుషములగు కథలు చెప్పుచున్నారు. అవి సత్యమైనదియుఁ గానిదియుఁ జెప్పుటకు వీలులేదు కాని, దేవకీనందనశతకవిషయమై యొకపద్యము గ్రంథస్థమై రెండుప్రతులలోఁ గానవచ్చుచున్నది. కొందఱు శతకకర్తలు భక్తితోఁ బద్యములు వ్రాసి గోదావరిలో వేసిరనియు, నీటి కెదు రీఁదినవి మాత్రమే

తీసికొని శతకముగఁ గూర్చినదనియుఁ జెప్పుదురు. భక్తిభరితములగు పద్యము లన్నియుఁ జక్కని వనుట కీకథ చెప్పుదురని తోఁచుచున్నది. ఎట్లయిన నున్నకథ కేవల మసత్యమనుటకుఁ దగినకారణములు లేనప్పుడు, అట్లు సిద్ధాంతములు చేయుటకు మన కధికారము లేదుకదా! దేవకీనందనశతకము పరిషత్ప్రతి నె 2347 నులోఁ గొన్ని పద్యము లధికమున్నవి. కొన్ని నారాయణశతకపద్యములతోఁ దుల్యములు. అందలి 110 పద్యములకుఁ బిమ్మట నున్న తుదిపద్య మిది:—

"సదయస్ఫూర్తిగళల్ ఘటించి కవిరత్నశ్రేష్ఠుఁ డామోదియై
పదివేల్ పద్యము లందు నూటపది సత్పద్యంబు లర్పించె మీ
పదనీరేజములందు దివ్యతటినీపాథః పవిత్రాభిము
ఖ్యదయన్ (ఘునిన్?) గాంచినదాట మీకరుణ కృష్ణా! దేవకీనందనా!"

ఇఁక కృష్ణరాయనికాలమునఁగూడ చాటువులు పెక్కులు కనఁబడవు. ముక్కు తిమ్మన్న త్రిస్థలీదండకము, తెనాలి రామలింగని దశావతారపద్యముల పిడుగుబాళ్ళు, రామరాజభూషణుని వని చెప్పు రామతారావళియు ననేకములు చాటుపద్యములు నున్నవి. శతకములు మఱి కనఁబడుట లేదు.

కృష్ణరాయనికి నప్పకవికి నడుమ గొన్నిశతకములు కనఁబడుచున్నవి. వజ్రపంజరశతకము, ముకున్దానందనశతకము, గువ్వల చెన్నశతకము, బాలగోపాలశతకము, చంద్రమౌళి మొదలగున వీకాలము లోనివి.

వేణుగోపాల, చంద్రశేఖర, కుక్కుటేశ్వర, రామలింగ, కవి చౌడప్పశతకములు 16, 17 వ శతాబ్దప్రాంతములఁ బుట్టిన వనితోఁచుచున్నది. ఇవి యన్నియుఁ దిట్టు, హాస్యశతకము లని చెప్పవచ్చును. వేణుగోపాలశతకము లావణ్యశతకకర్త యొనర్చె నని కొందఱందురు కాని సత్యము తెలియదు. కూచిమంచి తిమ్మన్న, కవిచౌడప్ప, అడిదము సూరకవులచరిత్రములు మనకుఁ దెలియును.

17 వ శతాబ్దమునందు శతకవాఙ్మయము మిక్కిలియభివృద్ధిఁ గాంచినట్లు పెక్కునిదర్శనములు కనఁబడుచున్నవి. వేనవేలుశతకములు పుట్టిన వనఁదగిన ట్లున్న యీక్రిందనిదర్శనములఁ జూడుఁడు. పెద్దాపురసంస్థానాధిపతులగు బలభద్ర జగపతిరాజుగారు రామశతకమును, రాయజగపతిరాజుగారు భద్రాద్రిరామశతకమును వ్రాసిరి.

(1) చింతలపల్లి వీరరాఘవకవి తాను వ్రాసిన మధురవాణీ విలాసమునందుఁ దాను

"జాములో శతకంబు సంధించి కంకణా
దులు గొంటి వల రాయదుర్గమునను"

అని తన్నుఁగూర్చి చెప్పుకొనినాఁడు. కవి తాత మల్లయనంతుఁడు. పూలరంగపతిరాజులకాలమునాఁడఁట! అనఁగా కవిచౌడప్పకు సమకాలికుఁడు. వీరరాఘవకవి పెదతండ్రి

యగుగోపాలకవి యార్యాశతకమును వ్రాసినట్లు చెప్పుచు న్నాఁడు.

"విలసత్పాండితిఁ గల్పనాగతి జగద్విఖ్యాతుఁడై జాములో
పల నార్యాశతకంబు వ్రజగిరిగోపాలాంకితం బూహచే
సి లలిన్ నిస్వసుమాంబగాభరణముల్ శ్రీమించఁ జేకొన్న మో
గ్యాలమేటికిన్ గనిరాజు నెన్నఁదరమే గోపాలవిద్వన్మణిన్॥

ఆకాలమునందు శతకము లాశువుగఁ జెప్పి బహుమానము లందుకొనుచు యున్నట్లు పెక్కునిదర్శనములఁ జూపవచ్చును.

(2) గణపవరపు వేంకటకవి కఠినప్రాసశతకము, యమకశతకమును, కస్తూరిరంగని సాంబనిఘంటువు సీసశతకమునుఁ జెప్పుటయు శతకవాఙ్మయవ్యాప్తినే సూచించును. హంసవింశతికర్త అయ్యలరాజు నారాయణకవి "నఖగర్త పురాంజనేయ నతజనగేయా" అని కందశతకము వ్రాసెను.

వైష్ణవభక్తులలోఁ దాళ్ళపాకవారి శతకములు 15,16, 17 శతాబ్దములలో ననేకములుపుట్టినవి. తాళ్ళపాకవారి వేడెనిమిది శతకములు దొరికినవి. శతకము లాది నకారాదిగ నియమమేర్పరచుకొని వ్రాసినట్లు సుమతి భాస్కర వేణుగోపాల శతకములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఇందువలనఁ గవి వ్రాసిన పద్యములవరుస తప్పకుండఁ దెలియనగును. సుమతిశతకకర్త బాలురకొఱకీ నియమము పాటించెనని తోఁచుచున్నది. అందలి మొదటిపద్యము "అక్కఱకురాని చుట్టము." పిమ్మట

"అ" "ఇ" "క" "గ" ఈవిధముగ వ్రాయుటకుఁ గవి నియమ మేర్పఱచుకొనెను. వివరములు గ్రంథమున సూచించితిని.

17వ శతాబ్దమునకుఁ బిమ్మట శతకములు మితిమీరి పోయినవి. అందఱును శతకములే వ్రాసిరి. నృత్త్యసాధనము నకుఁ బ్రారంభమున నీశ్వర దైవప్రార్థనమునకుఁ గూడఁ బనికి వచ్చి, యుభయతారకముగనుండు నని యొక్కొక్క నృత్త్యముతో నొక్కొక్క శతకము చొప్పున ప్రతికవియు పదులు వందలు శతకములు వ్రాసినట్లు కనఁబడుచున్నది.

(1) పంచడబ్బులలో నొకటగు కృష్ణార్జునసంవాదము వ్రాసిన నెలిచేటి జగ్గయ్య పుత్రుఁడగు వేంకటరామప్రధాని తనగ్రంథమున నిట్లు వ్రాసెను.

సీ. మృదువుగా విజయలక్ష్మీ నృసింహవిలాస ◆ మంచితగతిని రచించినాఁడ
పరగ వియన్నదీ పరిణయంబను కావ్య ◆ మొప్పుగా విలసిల్లఁ జెప్పినాఁడ
వినయంబుతోఁ బంచవింశతిశతకముల్ ◆ విరచించి హరికి సమర్పించినాఁడ
భాసురమతిని బాణాసురయుద్ధాది ◆ నానాటకములఁ గావించినాఁడ
గీ. సరసుఁడవు నీవె రచియించు సవ్యసాచి ◆ కృష్ణసంవాద మను మహోత్కృష్టకావ్య
మొసరమానేరఁ గృతియిచ్చి ఘనతమీర ◆ విస్తరింపుము లోకప్రశస్తిఁ గాను.

(2) శ్రీరాజా గొడే నారాయణగజపతిరాయనింగారి మేనత్తయగు మదిన సుభద్రయ్యమ్మగారు 1781లో జన్మమొందెను. ఈమె 5,6 శతకముల రచియించెను.

(3) మండపాక పార్వతీశ్వరశాస్త్రి రమారమి 60, 70 చిన్నగ్రంథములు శతకములవంటివి రచియించెను.

(4) విశాఖపురిమండలమునందలి పాలతేరులో నమలాపురపు సన్యాసి యను నొక కుమ్మరి నూఱుశతకముల వ్రాసెను.

(5) ఏనుఁగు లక్ష్మణకవి మున్నగువారితో సమకాలికుఁడని చెప్పుచున్న సత్యవోలు జనార్దనామాత్యపుత్రుఁడగు భగవత్కవి

క. ధీరత శతశతకంబులు, దారావళులున్, దశావతారావళులున్
జారాదారాహరణంబులు, శ్రీరాజితదండకములు చెప్పినవాఁడన్.

అని చెప్పుకొనినాఁడు. ఈతని రుక్మిణీపరిణయమునందలి పద్యములే "రక్షణపరాయణుండ! నారాయణుండ!" అను మకుటముకలవి భోజన సమయమున మననారు చదువుచుందురు.

(6) అంతకంతకు చీపురుపుల్ల శతకములు, సోడాబుడ్డి శతకములు కూడ వాడుకలోనికి వచ్చినవి.

ప్రతిగ్రామమునందును లక్షణ మెఱిఁగినవా రందఱు నేదోయొక శతకమునయిన వ్రాసి యా యూరనున్న దేవుని కంకితముచేయుచు వచ్చిరి. కావున మన దేశమునందు దేవాలయము లెన్నికలవో శతకము లన్నిఁటికి ద్విగుణముగ నైనఁ గలవనుట తప్పుకాదు.

19వ శతాబ్దమునందును శతకములు విరివిగనే పెరిగినవి. ఇందువలన 17, 18, 19 శతాబ్దములయందుఁ బుట్టినశతక

ములు కొన్ని లక్షలుండునని తోఁచుచున్నది. వేదాంతశతకములు, ఉత్సాహవృత్తశతకములు, పద్యలక్షణములు లేని శతకములును గొన్ని వేలు పెరిగినట్లు కనఁబడుచున్నది. ఇందువలన మనకున్న శతకములకంటెఁ బోయినవే యధికముగఁ గన్పట్టుచున్నవి. తాళపత్రగ్రంథములలోఁ బ్రతిదినమును ప్రాతశతకములు నూతనముగఁ గనబడుచునే యున్నవి. పరిషత్తు, ప్రాచ్యలిఖితపుస్తకాగారము, అడయారుపుస్తకాలయములలో రమారమి 300 శతకములు వ్రాఁతశతకము లున్నవి. నాకడ నచ్చుపడినవి 300 కుఁబైఁగా నున్నవి. నాకు దొరకని వెన్నియున్నవో! మన కీవఱకు 600 శతకములకంటె నధికముగఁ గనఁబడుచున్నవి.

## శతకముల యాదరణము

పూర్వము మనప్రభువులును, ప్రజలును, లాక్షణికులునుగూడ మనప్రాచీనశతకముల నాదరణబుద్ధితోఁ జూచినట్లు పెక్కునిదర్శనము లున్నవి. శతకము లాశువునఁ జెప్పించి బహుమానము లిచ్చిన ప్రభువు లున్నారు. తమపై శతకములఁ జెప్పించుకొన్న ప్రభువులు మంత్రులుకూడఁ గనఁబడుచున్నారు. ఒంటిమెట్టరఘువీరశతకము, ఆర్యాశతకము,

వానయ్యామంత్రిశతకము, పొనుగుపాటి వేంకటమంత్రి శతకము, బుక్కా వెంకనమంత్రి శతకము, ఎరగుడికన్న శతకము, గువ్వలచెన్న శతకము, కృష్ణభూపతిలలామశతకము మొదలగునవి యిందులకు నిదర్శనములు. అప్పకవీయము, రంగరాట్ఛందము మున్నగు లక్షణగ్రంథములయందు భాస్కర, నారాయణ, వజ్రపంజర, మదనానందన సుమతిశతకాదుల నుండి యుదాహరణము లున్నవి. వేలకొలఁది నూఱ్ఱు లచ్చుపడిన దాశరథీ, సుమతీ, కుమారీ, వేణుగోపాల, చెంగల్వరాయ, నాయకీనాయక, కాళహస్తీశ్వర, భాస్కర, వేమన, మానసబోధ, తాడిమళ్ళ రాజగోపాల శతకములు ప్రజల యాదరణమును, వ్యాప్తిని సూచించుచున్నవి. ఐనను మన లాక్షణికులును, చరిత్రకారులు నీశతకవాఙ్మయము నెట్టియాదరణబుద్ధితోఁ జూచి రని విచారించిన మన యిప్పటిపండితులలోఁ గొందఱ కించుక గౌరవము తక్కువయున్నట్లు కనఁబడును.

లాక్షణికులలో నగ్రగణ్యుఁ డని యింతవఱకు మనవారెంచిన యప్పకవి చాటుప్రబంధలక్షణము నిట్లు చెప్పియున్నాఁడు. మనకథలలోఁ జాటుకవిత్వమైనఁ జెప్పకొనలేక పోవునా? యని యూసడించినట్లు విందుము. అప్పకవిలక్షణము – కావ్యభేదములు.

సీ. ఉచ్చారణక్రియ నొప్పారువర్ణంబు ♦ వర్ణసంచయమున వఱలుఁబదము
పదవితానంబున భాసిల్లు వాక్యంబు ♦ వాక్యభేదమున నివ్వటిలు నర్థ

మస్థవశంబున నమరును భావంబు ♦ భావసంగతిఁ గనుపట్టు రసము
రససంప్రశక్తిచేఁ బొసఁగును పద్యంబు ♦ పద్యరాశినిఁ గూర్పఁ బడును గావ్య

తే. మట్టికావ్యంబు ద్వివిధమై యతిశయిల్లు,
బరువడిఁ బ్రబంధచాటుప్రబంధములన
సర్గముల సంస్కృతమున నాశ్వాసములను,
దెనుగునఁ బ్రబంధమనునది తనరుఁ గృష్ణ. ౧-౧౩౦

అని "ప్రప్లులో" నడుగువైచినాఁడు. "పద్యరాశిని" గూర్పఁబడును గావ్యమని వేసినాఁడు.

ఇఁక నర్సభూపాలీయకర్త యేమనుచున్నాఁడో చూడుడు. "విగతదోషంబులును, గుణాన్వితము లధిక లసద లంకార భావోపలక్షితములు నైన శబ్దార్థములు కావ్యమనఁ జెలంగు"* అని శబ్దార్థసంఘటితమైన వాక్యమైనచో గావ్యత్వము పట్టవచ్చునని సంస్కృతలాక్షణికులలో మమ్మటుని యభిప్రాయమును బ్రతిధ్వనించి యున్నాఁడుకదా!

విన్నకోట పెద్దన్నగారు లౌక్యము చేయుచున్నారు వినుఁడు. ఆయనకూడ నప్పకవిగారి మార్గమునే యనుసరించి శతకాదులు క్షుద్రకావ్యములని నిర్ణయించినాఁడు. క్షుద్రకావ్యము లనఁగా, నల్పకావ్యములు, ఖండకావ్యములు నను టకుఁ బర్యాయపదముగా వాడిరనిన నా కాక్షేపము లేదు. అవి నీచకావ్యము లను భావముండిన నది తప్పని చెప్పవ

*"తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి" కావ్యప్రకాశిక.

చ్చును. పెద్దన్నగారు "ఒకపాటి గంతచాటు చాటుకృతులకు మెచ్చునే విశ్వేశచక్రవర్తి" అని చక్రివాళ, దండక, మంజరి, రగడ, గుచ్ఛము లాదిగాఁగల కావ్యములు హెచ్చు గుణము గలవిగ నుండవలె ననెను. గుణములేని దెవ్వరును మెచ్చరు. ప్రబంధాదులుమాత్రము గుణ ముండనివి మెచ్చు చున్నామా? శతకములన్నియు మంచివని యనుచున్నామా? కాదు. మన లాక్షణికులు కావ్యతత్త్వము బాగుగ వివరింప లేదని మనవిచేయుచున్నాను. అప్పకవి పై పద్యమునకు వ్యతిరేకముగఁ మఱలఁ జెప్పుచున్నాడు.

క. కనుగొన సంఖ్యాబద్ధంబు నసంఖ్యాకంబు నాఁగ భువి నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వకవిమత మన నా చాటుప్రబంధములు జలజాక్షా! ౧-౧౩౨

తే. నాల్గుదెగల యుదాహరణముల ముక్త
కాది పంచాదశమును సంఖ్యాన్వితములు
గద్య రగడ ద్విపద దండకములు మంజరులును,
సంఖ్యారహితచాటువులు నృసింహ. ౧-౧౩౩

వ. ముక్తకాది పంచాదశ తెట్టి దనిన,

సీ. ఒనరు ముక్తకమన నొక్కపద్యము ద్వికం
బగు రెండు త్రికము మూడైనఁ బంచ
రత్నంబు లైదు వారణమాల యెనిమిది
నవరత్నములు పద్యనవక మైన
భాస్కరమాలిక పండ్రెండు శశికళ
పదియాఱు నక్షత్రపంక్తి యిరువ
దియు నేడు త్రింశద్వ్యాహాయము ముప్పది
రాగసంఖ్య వెండియు రెండుసాగ నేని

తే. వరుస పంచాదశాఖ్య మవ్వల శతకము
నష్టసమధిక శతకంబు ననఁగ వెలయు
నేబఁదియునూరు నూటిపై నెనిమిదియును
సప్తశతి సప్తశతమై శార్ఙ్గపాణి. ౧-౧౩౪

ఈతనికిఁ బూర్వుఁడగు ననంతామాత్యుఁడు తన ఛందములో జాటు ప్రబంధలక్షణ మిట్లు చెప్పినాఁడు.

సీ. ఒకపద్యమైన ముక్తకము రెండును మూఁడు
ద్వికమును త్రికమునై విస్తరిల్లు
బంచరత్నము లైదు, పదిగ నెన్మిది గాఁగ
వళికి నామావళి యష్టకంబు
నెన్నంగ నిరువదియేను తారావళి
యొనయ ముప్పదిరెండు నేఁబదియును
నూఱు నూటెనుబది నుతికెక్కు ద్వాత్రింశ
దభిధాన పంచాదశాఖ్య నాఁగ

గీ. వెలయు శతకమున వెండి యష్టోత్తర
శతకమనఁగ నిట్లు సకలసుకవి
సమ్మతముగ నెగడుఁ జాటుప్రబంధము
లభిమతార్థరచన నబ్జనాభ! ౩-౬౭

ఇతఁ డప్పకవికంటెఁ దక్కువభేదములఁ జెప్పెను. ఎట్లయినను వీనికిఁ గావ్యసిద్ధి కలిగినట్లు వారు చెప్పినను సవతితల్లి ప్రేమమునే కనఁబఱచిరి.

కవిజీవితకారు లీ శతకములవిషయము వ్రాయలేదు. కవి చరిత్రకారు లగు శ్రీవీరేశలింగముపంతులుగారు వీని

యందు నిరసనభావముకూడఁ గనఁబఱచినారు. శబ్దరత్నా కరకర్త పేరు కొఱకొకటి రెండు శతకములనుండి ప్రయోగముల నిచ్చెనుగాని, తాను గ్రంథాదిని సూచించిన గ్రంథములపట్టికలో శతకముల నాల్గవతరగతిలో నైన నుదాహరింప లేదు. స్త్రీలు కవిత్వము చెప్పిరనిన సంతోషపూర్వకముగ నట్టి స్త్రీలచరిత్రమును గనుఁగొని ప్రకటింపవలసిన కవిచరిత్రకారులగు శ్రీ వీరేశలింగంపంతులుగారు శ్రీ మదిన సుభద్రమ్మగారు శతకములు వ్రాసినారని తరికొండ వేంకమాంబచరిత్రము తుదను చెప్పివిడిచినారు. శతకములు వ్రాసిన స్త్రీ లనేకు లున్నా రనిరేకాని వారి పేళ్ళయిన నుడువలేదు. బహుజనపల్లి సీతారామాచార్యులు గారు "జాలమ్యాల రారకృష్ణ" యని తాళరాగముల నడుమ విరిగి ముక్కలైన మువ్వగోపాలపదములపాటియైన గౌరవము శతకములలో ముఖ్యమైనవానికైన నిచ్చినారు కారు. శ్రీరామమూర్తి పంతులుగారు వ్రాసిరో లేదో సందేహము. ఇది యంతయు శతకముల నాదరణబుద్ధితోఁ జూచి రనుట కనువుగా నున్నదా?

క్షేత్రయపదములు నిఘంటుకర్తలకు క్షేమలాభము లిచ్చి ధూర్జటి కాళహస్తీశ్వరశతకము, పానకాలరాయని మానసబోధశతకము, కాసుల పురుషోత్తముని యాంధ్రనాయకశతకము, కవిచౌడప్పశతకము, వేమనశతకము, నీయఁజాలవనఁగలమా? తెలుఁగుపలుకుబడులకు శతకములకంటె మంచి

పద్యగ్రంథములు లేవనియే నా మతము. ఇవి పాటలంత విపన్నపదసంకలితములు కావు. శబ్దశాస్త్రసిద్ధ లేనివి కావు. శతకకవులు లాక్షణికులు కారందురమా? పాలుకురికి సోమన్న బసవపురాణము లాక్షణికమై దానికిఁ బిమ్మట వ్రాసిన వృషాధిపశతకము వికృతమైన దనవచ్చునా? కవిసంశయవిచ్ఛేదము వ్రాసిన లాక్షణికుఁడగు సూరకవి రామలింగేశశతకము గడ్డితుక్కయి, కవిజనరంజనము ఘనమైన దయినదా? ఆంధ్రనామ శేష మాదరణపాత్రమై శతకము, హీతవుకాకపోయినదా? అప్పకవి వజ్రపంజరశతకాదుల లాక్షణికముగ నెంచలేదా? రావిపాటి తిప్పన్న చాటుధారలు, మేధావిభట్టు పద్యములు లాక్షణికములు కాఁగా, కావ్యగౌరవముగల శతకములు పనికిరాకపోవుట న్యాయమా? ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యము పనికివచ్చి, తరువాత పౌఢవయస్సున వ్రాసిన కాళహస్తీశ్వరశతకము గౌరవార్హత లేనిదైనదా? శతకములవంటి చిన్నగ్రంథములు వ్రాసిన గట్టుప్రభువు గట్టివాఁడైనాఁడు? లాక్షణికుఁడైన కూచిమంచి తిమ్మకవి, [సర్వలక్షణ సారసంగ్రహకర్త] వ్రాసిన కుక్కుటేశ్వరశతకము, కుకవిత్వమా? ప్రబంధమార్గములు ప్రాఁతవి సమకూర్చిన రుక్మిణీపరిణయాదులు పౌఢగ్రంథములా? ఇది వింతగా లేదా?

మీకొక్క యుదాహరణము చూపెదను. శ్రీ వడ్డాది సుబ్బారాయుఁడుగారు మంచిపండితులు, కవులు నని లోకమెఱుఁగును. వా రనేక పెద్దగ్రంథములు వ్రాసినారు.

భాషాంతరీకరించినారు. కాని వానియం దెల్లయెడల వారి పాండిత్య, భాషాంతరీకరణ నైపుణ్యము వెల్లడియైయుండవచ్చును. కాని వారి భక్తచింతామణి పండితపామరప్రియమైనది. ఇది యుపజ్ఞాసహితమగు స్వకల్పితాకావ్యముకదా! ఇది శతక స్వభావము కలది. అది పెక్కుమార్లు పునర్ముద్రిత మైనది; వేనవేలు ప్రతులు చెల్లిపోవుచున్నవి. తక్కిన-వారివే—— యితరగ్రంథములు రెండుమూఁడు ముద్రణములు దాటియుండవు. కారణమేమి? గ్రంథము సుబోధ మయిన చోఁ బామరు లైనను రసమును గ్రహింపఁగలరు. కనుక దాని నాదరింపక మానరు. కావ్యగుణము సులభలభ్యముగ నున్నచోఁ వా రది యాదరించి తీరెదరు. వ్యాప్తినిఁబట్టి గ్రంథగుణము సర్వదా నిర్ణయముకాదు. కాని శతకకవిత్వము నందు కావ్యగుణము సులభముగ లభ్యమగు నని నాయాశయము.

లక్షణవిరుద్ధముగ వ్రాసి రని నింద లొందుచున్న పోతన్న భాగవతము, కృష్ణరాయని యాముక్తమాల్యద, వేంకటకవి విజయవిలాసమును నైఘంటికు లంగీకరించిరి. పచ్చిబూతులు వ్రాసె ననుచున్న ముద్దుపళని రాధికాస్వాంతనము, కుచకచాదుల వర్ణించిన సారంగు తమ్మయ్య వైజయంతీవిలాసము, బిల్హణీయమును బనికివచ్చినవి. ఈ గ్రంథముల పేరుల వినిన నేవగించు కొందు మని వ్రాయనేర్చిన శ్రీ వీరేశలింగము పంతులుగారికి భక్తి, వైరాగ్యములు,

నీతి, మతము, శరంపరలుగఁ బామరులకు బోధచేయుట కుపయోగించిన శతకరాజము లుప్పుగల్లునకైనఁ బనికిరాక పోవుట శోచనీయము. మష్టగ్రంథములని వారు చెప్పినవాని కర్తలగు వేశ్యలు, వేశ్యాపుత్రుల చరిత్రములు బాగుగఁ బరిశీలించి వ్రాసిరికాని యాంధ్రదేశ మంతట సనునిమిషము పండితపామరుల నోడలు పులకరింపఁజేయు "దాశరథీ కరుణా పయోనిధీ" యనువాక్యము వ్రాసిన కర్తచరిత్రమును వారు కొదకుటకుఁ బ్రయత్నింపరైరి.

శివభక్తులు, విష్ణుభక్తులు, వేదాంతశిఖామణులును వ్రాసిన తేట తెలుఁగు కావ్యరాజము లనఁదగిన శతకకవుల చరిత్ర మీవలకే వ్రాయక, భక్తిజ్ఞాన వైరాగ్యమూర్తు లగు వారి పేళ్ళే దలఁపెట్టక, వారిపై గ్రీఁగంటిచూపులైనఁ బంపక మనచరిత్రకారు లాలసించియున్నారను దుఃఖముచేఁ బెద్దల నిట్లు పైవాక్యములలో నడిగినందులకు మహాజనులు మన్నించెదరుగాక!

పర్యవసానమున నామనవి యేమనగా మనపూర్వులగు కొందఱు లాక్షణికులు, చరిత్రకారులవలె మన మీవాఙ్మయ ముపేక్షించి రామబాణము లను క్రిములకు నప్పగింపఁదగినదో, మనమే పుస్తకక్రిములమై వానిదుమ్ము దులిపి యందలి గుణమును గొనియాడఁదగినదో విచారించెదరుగాక! శతకము లలోఁ గవిత్రయ ప్రయోగవైరుధ్యములు కొన్ని యున్నను,

తేట తెలుఁగుసొంపులు కొన్ని యట్టిచోటులనే రసనమంజసములై నాటుక భాషావాదులవాదమునకు బలమును గలుగఁ జేసి, శబ్దసిద్ధి లోకమువలనఁ దెలియవలె నను సిద్ధాంతము నందలి న్యాయమును వెల్లడించుచున్నవి. ప్రయోగమూలము వ్యాకరణమగుట నట్టి ప్రౌఢప్రయోగముల తారతమ్యము చొప్పున మన వ్యాకరణము కొంతవఱకు సవరించుకొనుట న్యాయ మని నేనుఁ దలంచుచున్నాను.

ఇదివఱకువారు శతకములఁగూర్చి వ్రాయలేదనియు, నేనిప్పుడు వ్రాయుచున్నాననియు, నందువలన నేను వారి కంటె ఘనుఁడ ననియు నే నీవాక్యములు వ్రాయుటలేదు. అట్టి దుష్టాభిప్రాయము నాకుండినను లోకమును మోసగించి నేనట్టి సాహసమున కొడిగట్టినను లోక మూరుకొనదు. పైన నేనుచూపిన భావములు పెద్ద లనేకు లంగీకరించుచున్నారు. వ్యాకరణసంస్కరణము, శతకములయాదరణము నవసరమనుచున్నారు. కాని యెవ్వరు నాపనుల కింతవఱకు నాకుఁ దెలిసినంతలోఁ బూనుకొనలేదు. ఒక శతకము మంచిదని మనకు సత్యముగఁ దోఁచినప్పుడు ఒక ప్రయోగము బహుళమై కవిత్రయప్రయోగములకు విరుద్ధమయ్యు రసప్రకటనమున కనువైయున్నట్లు మన కగపడినప్పుడు మన మది లోకమునకుఁ జూపి చెప్పవలెను. ఆవిధముగఁ బ్రయోగించి భావప్రకటనమునకు, రసస్ఫూర్తికి, భాషాసౌలభ్యమునకుఁ దోడ్పడవలెను. ఇది భాషాభివృద్ధి చేయుటకాని, భాషాభివృద్ధికావలె నని

యొవరి తెన్నున వా రూరకుండిన నగునా? విద్యాధికులైన వారు తమకు సత్యము లని తోఁచిన విషయములు మాబోఁట్లకు వెల్లడించుచుండవలదా?

ఇదివఱకు మన పెద్దలు శతకకవులను విస్మరించిన మాట సత్యము. అది వారుద్దేశపూర్వకముగ విస్మరించిరి. చేతఁగాక యీ స్వల్పకార్యమును వారు మానియుండరు. అనేక ప్రబంధముల నామూలాగ్రముగఁ జదివిన సీతారామాచార్యులుగారుకాని, ఎన్నో గ్రంథపీఠికలును, గద్యలను చదివి, బ్రౌనుగారి గ్రంథచరిత్రములఁ బరిశీలించి, కవిచరిత్రము వ్రాసిన శ్రీవీరేశలింగముపంతులుగారుకాని ప్రయోగముల నీయలేరా? శతకకవులనుఁగూర్చి వ్రాయలేకపోవుదురా? వారిది యనవసర మని తలంచిరి. తప్పు లధిక మని విడిచిరి. ప్రౌఢప్రబంధములే సత్యమైన వాఙ్మయ మనుకొనిరి. అందు లేని ప్రయోగములకుఁ బదములకే నిఘంటువులో స్వల్పముగ గేయశతకవాఙ్మయసాయము నందిరి.

శతకములపై శ్రీవీరేశలింగము పంతులుగారి కంతగా గౌరవములేదనుట కాధారముగా వారివాక్యములే చూపనగును. కాని యదియిచ్చట నవసరము లేదు. అయినను సందియమున్నవారు వారి కవుల చరిత్రమునందలి 393, 396, 397, 400 పుటలుఁ జూడవచ్చును. కూచిమంచి తిమ్మకవి "మఱియుఁ బెక్కు శతక దండక సత్కృతుల్ ప్రతిభఁ

గూర్చి" యని చెప్పుకొని యుండఁగా శ్రీవీరేశలింగము పంతులుగారవి యన్నియు బాల్యకృతము లగు చిన్నకృతులని యాతని సారంగధరచరిత్రముతో పాటుగా త్రోసివేసిరి. తిమ్మకవి కుక్కుటేశ్వరశతకము మొదలగు నాతని యితరగ్రంథములు పేర్కొనుటకైన నర్హతలేని వని విజ్ఞులకుఁ దెలియని విషయము కాదు. "సత్కవితామహాసామ్రాజ్య భారధౌరేయుండ బుధజనప్రియసచివుండ" నను తిమ్మకవి శతకమునందలి వాక్య మాతఁ డాశతకము బాల్యమున వ్రాసెనని యేతోఁచిన శ్రీవీరేశలింగముపంతులుగారి నేమనఁగలము! ఇట్లే సూరకవి రామలింగేశ్వరశతకము, ధూర్జటి కాళహస్తీశ్వరశతకమును గూడఁ బ్రౌఢవయస్సుననే వ్రాసినట్లు "రోసిందేమిటి రోత" "అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె" "కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు" "రాజుల్మత్తులు వారి సేవ నరకప్రాయంబు" "ఎన్నాళ్ళుండితి నేమిగంటి నిఁక నే నెవ్వారి రక్షించెదన్" మొదలగు వాక్యములచేఁ దెలియుచున్నది. నఱసిన వెండ్రుకల ప్రక్క వెండితీఁగెల రుద్రాక్షలల్లాడుచుండ ధూర్జటి యాపద్యములు చదువుచున్నట్లు నాకుఁ గనఁబడుచున్నది. అది బాల్యకృతమని యెట్లనఁ గలుగుదును?

శతకము లన్నియుఁ గవులు బాల్యమునందు వ్రాసినవగుట నాదరణపాత్రములు కావని మొటికలవంటి ప్రౌఢశతకములఁగూడ విడుచుట న్యాయముగాఁ గనఁబడదు. అందు

వలనఁ జేతనైనంతవఱకు మన శతకముల పరిశీలన మొనరించి యందుండి గుణములఁ గొంచెము చవిచూపింపఁ బ్రయత్నించెదను. నేను మంచివే యనుకొనిన శతకము లన్నియుఁ జూపలేను సరికదా, ప్రసిద్ధశతకము లన్నింటిని గూర్చియైనఁ జెప్పుట సులభముకాదు. కావున స్థాలీపులాకన్యాయమునఁ గొంచెముభాగమే పరిశీలించుకొందముగాక!

---

## శతకపరిశీలనము

ఆంధ్రభాషలో రమారమి 600 శతకములు కనఁబడినవి. (1) ఇందు భక్తిశతకము లధికము. శైవము, వైష్ణవము, కూడ నున్నవి. రామశతకములు, ఆంజనేయశతకములును వైష్ణవములని యంగీకరించినచో శైవశతకములకంటె వైష్ణవశతకము లధికముగఁ గనఁబడుచున్నవి. (2) వేదాంతశతకములు కొన్నియున్నవి. ఇవి వేమన, ఆత్మలింగ, అప్పాలయోగి మొదలగువారి శతకములు. బైరాగులు చదువుచుందురు. వేదాంతబోధకులు తెలుఁగులో నిర్వాచింపనట్టి యద్వైతమతబోధకములుగా నుండు పద్యము లుండును. తత్త్వములలోఁ బ్రతిపాదింపఁబడునట్టి విషయములే యీ శతకములయందు నుండును. శృంగారము భక్తిలో నొకభాగమనినచో మనశతకవాఙ్మయములో మూఁడువంతులు భక్తి

శృంగారములపా లగును. శృంగార శతకములు వేఱుచేసిన యెడల నివి రమారమి యిరువదిశతకముల కొకటి చొప్పున రావచ్చును. చాలవఱకు శృంగారశతకములు కృష్ణునిపై నుండుటనే నవి భక్తిప్రతిపాదకము లన వీలున్నది. కేవల శృంగారశతకములు మిక్కిలి తక్కువ. కావున భక్తిశృంగా రముల రెంటిని నేనొక్కటిగాఁ బరిగణించుటకే యంగీకరించె దను. భక్తిశృంగారములును, జ్ఞానవైరాగ్యములును గలుపు కొని భక్తి జ్ఞానశతకము లని రెండువిధములుగా శతకముల విభజించుకొనవచ్చును. ఇవి పోఁగా మిగిలినవానిలో నీతిశతక ములు, హాస్యశతకములును మిగిలియుండును. ఇన్ని విభాగము లొనర్చుకొనినను వివిధవిషయములుండు సంకలితములు కూడఁగలవు. భక్తిలోను, శృంగారములోను శాఖలు విభ జించుకొన వీళ్ళున్నవి. ఆ భేదము లన్నియు వేఱొకచో వివ రించెదను.

మనశతకములు సాధారణముగా స్వతంత్రరచనములే కాని కొన్ని కేవలభాషాంతరీకరణములు—సూర్యశతకము, భర్తృహరివంటివి; కొన్ని యనుసరణములు—సుమతి, కాళ హస్తీశ్వరశతకముల వంటివి; కొన్ని సంకలితాభిప్రాయసూ చకములు— భాస్కర, దాశరథీశతకముల వంటివి; స్వతంత్ర రచనము లున్నవి—వేమన, కవిచౌడప్ప, వేణుగోపాలశతకము లవంటివియుఁ గలవు. రాజనీతి, సేవకనీతి, లోకనీతి, బాలబా లికనీతినిఁ బ్రకటించినవి కొన్ని యున్నవి. ఇవికూడఁ గొంత

వఱకు సంస్కృతానుసరణము లనవచ్చును. నీతిశతకములు ధర్మశాస్త్రములవంటివి, ప్రభుసమ్మానములగు వేదములవంటివి. కావున నీనికిఁ గావ్యత్వముఁ సిద్ధింపదు.

భక్తిశతకములయందు వారి వారి యాత్మసంక్షోభమును భక్తులు వెల్లడించుకొనిరి. శృంగారశతకములయందుఁ గాంతాలలామ, లావణ్య, చంద్రవదన శతకములు కేవల కాముకజనార్హములుగఁ గన్పట్టును. తాడిమళ్ళ రాజగోపాల, మల్లికార్జున, కలువాయి శతకములు భగవంతుని గుఱించి చెప్పిన శృంగారశతకములు. ఇవిగాక నీతిశాస్త్రములు, జ్యోతిషము, శబ్దశాస్త్రసంబంధ మగు నిఘంటువులును గూడ శతకరూపమున నున్నవి. బద్దినీతులు, నీతిమంజరి, శిఖినర సింహశతకము, సాంబనిఘంటువు మొదలగునవి యీ తరగతిలోఁ జేరును. ఇవికూడఁ గావ్యములు కావు. ప్రాయికముగా భక్తి శతకములే యెక్కువ. రెండవస్థానము వైరాగ్యశతకములకే వచ్చును. ఈ రెంటికి నడుమ శృంగారశతకము లుండును.

శతకములయందు సాధారణముగాఁ గవి తన యిష్టదైవమును గాని, పోషకుఁడగు ప్రభువును గాని, సంబోధించి చెప్పుచున్నట్లు ప్రతిపద్యముచివర నిర్దిష్టనామమును జేర్చును. "వేణుగోపాలబాల" యనికాని "దాశరథీకరుణాపయోనిధీ" యనికాని; "కృష్ణభూపతిలలామ!" "వేంకటమంత్రి" అని కాని చేర్చు చుండును. నూఱుపద్యములకును చివర నీవిధముగ నే

చేర్చును. దీనినే మకుట మనుచున్నాము. ఈ మకుటము చేర్చు పద్ధతి సంస్కృతమునందును ఇంగ్లీషు పాటలయందును క్వాచిత్కముగఁ గనఁబడుచున్నది.

(1) ఆంగ్లేయమునను సంస్కృతమునను మకుట మున్నవి చూపెదను. థామ్సన్ వ్రాసిన 'Rule Britannia'; బరన్సు వ్రాసిన 'My heart's in the High lands'; రెజినాల్డు హీబరు వ్రాసిన 'God Provideth for the marrow'; మూరు వ్రాసిన 'Oft in the chilly night'; క్యాంబెల్ వ్రాసిన "The Irish Harper & the Dog" నందును మకుటము లున్నవి.

THE HOUR OF PRAYER.

"Child, amidst the flowers at play
While the red light fades away
Mother, with thine earnest eye
Ever followingly silently
Father by the breeze of eye
Called thy harvest work to leave
Pray, ere yet the dark hours be,
Lift the heart and bend the knee!"

ఇక్కడ కడపటిపాదము ప్రతిపద్యము చివర వచ్చుచుండును. సంస్కృతమునందు నిట్టివి కనఁబడుచున్నవి. మచ్చు చూపెదను.

చతుష్పాదయుక్తం సరోజంచచిత్తం
షడానందసారం స్ఫురద్ద్వాదశారం
స్వరద్వంద్వయుక్తం సరోజం స్మరేయం
చిదానందరూప శ్శివోహం శివోహం॥ 1

అనాకాశ మాకాశ మాకాశరూపం
నిరాకార సాకార మోంకారగమ్యం
సహస్రార మధ్యస్థ బిందుస్వరూపం
చిదానందరూప శ్శివోహం శివోహం॥ ౨

(చిదానంద స్వామిస్తోత్రము)

సంస్కృతమునందును భక్తుల స్తుతులు, స్తవములు మకుట సహితములు.

(2) ఇట్లే ఋగ్వేదము. 1-17 లో పదిఋక్కులు “మరుద్భిరగ్న ఆగహి” అని కొట్టకొనను మకుటము గలవి యున్నవి.

(3) ఇట్లే పాళీభాషలో నున్నవి.

కాని మనశతకముల కీ మకుటము తప్పనిసరిగాఁ గనఁబడుచుండును. లేనివి లెక్క కొకటి రెండుమాత్రమే యున్నట్లున్నది. ఈ మకుటమును బట్టియే శతకనామ మేర్పడును. శతకనామమే కాదు, శతకము వ్రాయవలసినవృత్తమును ఒకప్పుడు యతిప్రాసలనుగూడ నీమకుటముపై నాధారపడి యుండును. “ఇందూ నందుని మందనుండికద నీవే తెంచుటల్ రాకల౯” అని మకుట మేర్పఱచుకొని చంద్రదూత వ్రాసిన

పుసులూరి సోమరాజకవి శతక మంతయు బిందుపూర్వక దకార ప్రాసముతో వ్రాయవలసివచ్చెను. వేమన నాల్గవపాద మంతయు మకుటముతోనే నింపుటచే నాతఁ డాటవెలదుల తోనే రచింపవలసివచ్చెను. "సుమతీ" యనుమకుట మున్న కవి కందములే వ్రాయవలసివచ్చెను. "శ్రీకాళహస్తీశ్వరా" యన్నమకుట మేర్పఱచిన ధూర్జటి నాల్గవపాదము మొదటి యక్షరముపై నొక కన్నుంచి ప్రతిపద్యము వ్రాయవలసి వచ్చెను. కవిచౌడప్పయు నిట్లే కదా! చూపుచుఁ బోయిన ననేక వైచిత్ర్యము లున్నవి.

కాబట్టి శతకమునందు మకుటనిర్ణయము ప్రధాన కార్యము. ఇది మన తెలుఁగు శతకములయందు వైలక్షణము దాల్చుటకుఁ గారణము మన యతిప్రాసనియమములయందలి రహస్యముపై నాధారపడి యున్నది. మకుట మొకటి పద్యములకన్నిఁటికి స్థిరముగ నుండవలసివచ్చుటచే నొక శతకమునందలి పద్యము లన్నియు సంస్కృతకావ్యముల యందలి సర్గలవలె నొకేతీరు పద్యములతో వ్రాయవలసియుండెను. ఉత్పల చంపకమాలల వంటి యన్యోన్య సంబంధముగల పద్యములు మాత్రము మారుచుండుట గలదు. కాళహస్తీశ్వరశతకమునందు మత్తేభ శార్దూలములు, భాస్కరశతకము నం దుత్పల చంపకమాలలు దాశరథీశతకమునందు నట్లే యొకటి రెండు వృత్తములలోఁ జెప్పవలసివచ్చినది. సూక్ష్మ మగు నీతులు సులభమైన శైలిలోఁ దేట తెలుఁగుపదము

లతో వ్రాసిన కొందఱు శతకకర్తలు నీతి, వేదాంతముల కాటవెలఁది కందపద్యముల వంటి జాతుల నాశ్రయించిరి. కందపద్యము నీతిశతక కవులకుఁ బ్రీతికర మని తోఁచుచున్నది. సులభముగ బాలురు బాలికలు చదువుటకు, నందఱును జ్ఞప్తియం దుంచుకొనుటకును, వీ రీ కందము నాశ్రయించి రనుకొందును. నీతిపద్యముల కీ కందము లందముగ నున్నవి. కందము చెప్పినఁగాని కవి కాఁడనుటవలననే తెలుఁగుభాష కీ జాతిపద్యము ప్రాముఖ్యమని పరినురము కాఁగలదు. తిక్కన భారతము శాంతిపర్వములో నీ కందము నెక్కుడుగ వాడియున్నాఁడు. అందువలననే కవిచౌడప్ప యిట్లు పలికెను.

"ముందుగ ననుదినములలో ♦ కందమునకు సోమయాజి ఘనుఁడండ్రు దా
నందఱు ననుఘనుఁడందురు ♦ కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా!"

చౌడప్పకూడఁ గందమునకు ఘనుఁడనుట సత్యేతరము కాదు. కాని మకుటముకొఱకు నాల్గవపాదము నొకటికి 'క' కారమును దెచ్చి కవి పై పద్యమునందలి వాక్యక్రమము నెట్లుమార్చవలసివచ్చెనో చూచెదరుగాక! కావున మకుటము శతకస్వరూపమును నిర్ణయించుటకు ముఖ్యకారణ మైనది.

భక్తిశతకములు వృత్తమయములు రాగాలాపనము చేసి భక్తులు పాడుకొనుట కిది రమ్య మని యట్లొనరించి యుండవచ్చును. శృంగారశతకములు ప్రాయికముగా సీసపద్యములతో నున్నవి. వేణుగోపాలశతకము వంటి హాస్యశతక

ములు విశ్లే యున్నవి. చంద్రశేఖరశతకము వంటి యచ్చ తెలుఁగు పామరభాషమాత్రము వృత్తములలో నున్నది. భాషాంతరీకరణము లగు శతకములు వివిధవృత్తములతో నున్నవి. ఇందుఁ దెలిగించిన కవికి స్వాతంత్ర్యము తక్కువ. అందువలన నివి చంపువులవలె వివిధవృత్తసమన్వితములు కావలసివచ్చినవి. ఈ చర్చపై నాయభిప్రాయములు తెలియఁగోరువారు నా వాఙ్మయచరిత్రమును జూడుఁడు. భాషాంతరముచేయు కవికి భావములపై స్వాతంత్ర్యము లేదు. కావు ననే మకుటము నేనుఁగు లక్ష్మణకవి భర్తృహరి తెలిఁగింపులో మానుకొనెను. తెలుఁగుసంప్రదాయానుసారము కృతిభర్తనామము ప్రతిపద్యము చివరను జేర్చిన బాలసరస్వతి మల్లభూపాలీయ మను భర్తృహరి తెలిఁగింపులో మకుటమును జేర్చి మూలముకంటె భిన్నముగను, కొన్నిచోట్లఁ గ్లిష్టముగను, వ్రాసి పాట్లుపడవలసివచ్చినది. చిన్నశ్లోకమును మకుటమునకై పెద్దపద్యముగా వ్రాయవలసిన యాతఁడు మూలానుసార మెట్లు వ్రాయగలఁడు? ఈ నడుమ నొకకవి సీసపద్యములో గీతము తీసివేసినట్లు, త్రిపాదులు ద్విపాదులు వృత్తములు వ్రాసి యుండవలసివచ్చి యుండెడిది.

శతకస్వభావము గల మేఘసందేశము వంటి కావ్యములు మందాక్రాంతము మొదలగు సమజాతివృత్తములు వ్రాసియుండిరి. ఇచ్చట శతకస్వభావ మనఁగా "లిరిక్"ని నా యభిప్రాయము. మేఘసందేశమునందు శృంగారము

ప్రధానము. తనకోర్కె తీరుటకు సంక్షుభితమనస్కుఁడైన యక్షుఁడు రక్షించు నని తాను తలంచుకొను మేఘు నుద్దేశించి పలుకుచున్నాఁడు. మన భక్తిప్రతిపాదక శతకముల యందు భక్తుడు ఘోరసంసారజలధిలో బంధింపఁబడి, సంక్షుభితమనస్కుఁడై రక్షకుఁ డని యాతఁడు తలంచుకొను భగవంతుని యిష్టావతారమును, సాకారముగ సంబోధించి తన యావేదనము వెల్లడించుకొని మోక్షమును గోరుచున్నాఁడు. ఈ రెంటియందును గామపరితృప్తి ప్రధానము. తాను రక్షింపఁబడుట లేదా తన కోరిక తీరుట ప్రధానము. "ధూమజ్యోతిస్సలిలమరుతా" సన్నివేశ మగు మేఘము తన వియోగ దుఃఖమును బాపఁగల్గునా లేదా యను విచారము యక్షునకు లేనట్లె కామముచే నజ్ఞానుఁడైనట్లె యిచ్చట శతకముల యందు భక్తుఁడును, సాకారు లగు రామకృష్ణాద్యవతారములు కాని యిష్టదైవ మగు విగ్రహము కాని తన్ను సంసారజలధినుండి యుత్తరించి పరమాత్మనుండి తన కైన వియోగదుఃఖమును బాపఁగల్గునా? లేదా? యనువిచారము చేయక యక్షుని వలెనే భక్తుడు భక్తిచే నున్మాదుఁడై (మోక్షకాముఁడై) భగవదంశము గల విగ్రహమునుగూర్చి మొఱపెట్టుకొనును. మేఘము ప్రియురాలిని సందర్శింపవచ్చును. కాని మాటలాడలేదు. అట్లే విగ్రహము జ్ఞానము కుదుర్చుటకు సాధనము కావచ్చును. కాని మోక్షము నీయ లేదు. మోక్షసాధన మగు భక్తిజ్ఞానముల నీయవచ్చును,

కాని మోక్ష మీయఁజాలదు. ఇచ్చట నేను వేదాంత ముప న్యసింపఁ దలంపలేదు. నేను చెప్పిన యుపమానము నందలి సాధర్మ్యమును వెల్లడింపఁబూనితిని. ఇందువలన మనశతకముల యందలి భావోద్రేకమునఁ బుట్టి యావేదనము వలనఁ గలిగిన స్తుతియందు "లిరిక్కు" గుణ మున్నదని చెప్పఁగలిగితి నని తలంచెదను. అయితే మేఘసందేశమునందుఁ గర్త యగు కాళిదాసుకంటె వేఱుగ యక్షుఁ డను పాత్రి కలదు. యక్షుఁడే కవి యని నాయాశయము. కాని యది యట్లుండుఁడు. శతకములలో రచయిత యగు కవియే పాత్ర. శతకము నందలి భక్తుఁడును, శతకము వ్రాసిన కవియు వేఱని చెప్పవచ్చును. పరమాత్మ కవి, జీవాత్మ భక్తుడు. భక్తుఁడే శతకము నందలిపాత్ర. యక్షుని వంటి పాత్ర! అని సమర్థింపవచ్చు ననుకొందును.

ఇట్లు సమర్థించుటకుఁ దనకుఁ దానే సంబోధించుకొనిన శతకము లుదాహరణముగఁ జూపవచ్చును. కవిచౌడప్ప ప్రసిద్ధికొఱకును, బద్దిభూపతి కీర్తికొఱకును తమ్ముతామే సంబోధించుకొని శతకములు వ్రాసి రంద మనినను, వేమన వంటి విరాగమూర్తి "వినురావేమా" అని సంబోధించుకొనుటకుఁ గారణము లరయవలయును. ఈ సంబోధనములఁ జూచినకొంద ఱివి, వేఱుకవులు వారిపై వ్రాసిన వనియు వేమన తనకుఁ దాను సంబోధించుకొనఁ డనియు వాదించుచున్నారు. వేమన్న యను పేరు కూడ నశ్వర మగు శరీరము

ప్రధానము. తనకోర్కె తీరుటకు సంక్షుభితమనస్కుఁడైన యక్షుఁడు రక్షించు నని తాను తలంచుకొను మేఘు నుద్దే శించి పలుకుచున్నాఁడు. మన భక్తిప్రతిపాదక శతకముల యందు భక్తుఁడు ఘోరసంసారజలధిలో బంధింపఁబడి, సంక్షు భితమనస్కుఁడై రక్షకుఁ డని యాతఁడు తలంచుకొను భగ వంతుని యిష్టావతారమును, సాకారముగ సంబోధించి తన యావేదనము వెల్లడించుకొని మోక్షమును గోరుచున్నాఁడు. ఈ రెంటియందును గామపరితృప్తి ప్రధానము. తాను రక్షిం పఁపడుట లేదా తన కోరిక తీరుట ప్రధానము. ''ధూమజ్యో తిస్సలిలమరుతా'' సన్నివేశ మగు మేఘము తన వియోగ దుఃఖమును బాపఁగల్గునా లేదా యను విచారము యక్షునకు లేనట్లె కామముచే నజ్ఞానుఁడైనట్లె యిచ్చట శతకముల యందు భక్తుఁడును, సాకారు లగు రామకృష్ణాద్యవతార ములు కాని యిష్టదైవ మగు విగ్రహము కాని తన్ను సంసారజలధినుండి యుత్తరించి పరమాత్మనుండి తన కైన వియోగదుఃఖమును బాపఁగల్గునా? లేదా? యనువిచారము చేయక యక్షుని వలెనే భక్తుడు భక్తిచే నున్మాదుఁడై (మోక్షకాముఁడై) భగవదంశము గల విగ్రహమునుగూర్చి మొఱపెట్టుకొనును. మేఘము ప్రియురాలిని సందర్శింప వచ్చును. కాని మాటలాడ లేదు. అట్లే విగ్రహము జ్ఞానము కుదుర్చుటకు సాధనము కావచ్చును. కాని మోక్షము నీయ లేదు. మోక్షసాధన మగు భక్తిజ్ఞానముల నీయవచ్చును.

కాని మోక్ష మీయఁజాలదు. ఇచ్చట నేను వేదాంత ముప న్యసింపఁ దలంపలేదు. నేను చెప్పిన యుపమానము నందలి సాధర్మ్యమును వెల్లడింపఁబూనితిని. ఇందువలన మనశతక ముల యందలి భావోద్రేకమునఁ బుట్టి యావేదనము వలనఁ గలిగిన స్తుతియందు "లిరిక్కు" గుణ మున్నదని చెప్పఁగలి గితి నని తలంచెదను. అయితే మేఘసందేశమునందుఁ గర్త యగు కాళిదాసుకంటె వేఱుగ యక్షుఁడను పాత్ర కలదు. యక్షుఁడే కవి యని నాయాశయము. కాని యది యట్లుం చుఁడు. శతకములలో రచయిత యగు కవియే పాత్ర. శత కము నందలి భక్తుఁడును, శతకము వ్రాసిన కవియు వేఱని చెప్పవచ్చును. పరమాత్మ కవి, జీవాత్మ భక్తుడు. భక్తుఁడే శతకము నందలిపాత్ర. యక్షుని వంటి పాత్ర! అని సమర్థింప వచ్చు ననుకొందును.

ఇట్లు సమర్థించుటకుఁ దనకుఁ దానే సంబోధించు కొనిన శతకము లుదాహరణముగఁ జూపవచ్చును. కవిచౌడప్ప ప్రసిద్ధికొఱకును, బద్దిభూపతి కీర్తికొఱకును తమ్ముతామే సం బోధించుకొని శతకములు వ్రాసి రంద మనినను, వేమన వంటి విరాగమూర్తి "వినురావేమా" అని సంబోధించు కొనుటకుఁ గారణము లరయవలయును. ఈ సంబోధనములఁ జూచినకొంద ఱివి, వేఱుకవులు వారిపై వ్రాసిన వనియు వేమన తనకుఁ దాను సంబోధించుకొనఁ డనియు వాదించుచు న్నారు. వేమన్న యను పేరు కూడ నశ్వర మగు శరీరము

వంటి మానవకల్పిత మగు బాహ్యశరీర సంబంధమైన సాంకే తిక మనియు, జ్ఞాని యగు వేమన్న, అజ్ఞాని యగు తన మన స్సుతో ననఁగాఁ బరమాత్మ యగు తాను జీవాత్మ యగు నజ్ఞాని వేమన్నతో నీ వేదాంతము బోధించినట్లును, మనకుఁ దట్టుచున్నది. లేదా వేమన్నకే కలిగిన సందేహములను, తట్టిన యూహలను, "చెప్పర వేమా!" "చాటర వేమా!" అని తాను బ్రహ్మజ్ఞానానందమున నోలలాడుసమయమున వినిపించిన దనవచ్చును. వేమన్నకవి వేమన్నరాజగు సోద రునిఁ గూర్చి చెప్పె ననుమాట నిలువఁజాలదు. తనయందే యున్న "సుబుద్ధి" కీ వేదాంతమును సంబోధించి చెప్పినట్లు మనము తలంప వీలగుచున్నది. ఇందువలన శతకమునందలి కవి జీవాత్మ పరమాత్మలఁ గూడ విడఁదీసి మేఘసందేశము నందలి యక్షుని వంటిదే జీవాత్మ యనవచ్చు ననుకొందును. అదిగాక శివ కేశవ భేదము లేని వేమన - "అహమ్బ్ర హ్మాస్మి" యనిన యద్వైతి యగు వేమన - జీవాత్మపరమా త్మలకు భేద మంగీకరింపని వేమన - సర్వసృష్టియు దానొ క్కఁడే యనుకొనిన వేమన - తన్ను తాను గాక మఱియెవ్వరి నుద్దేశించి పలుకుట కంగీకరించును? అట్టివేదాంతి కీ కవిత్వ మేల యనవచ్చును. కాని వేమన సహజకవిత్వము కలిగి పక్షివలెఁ బాడెనే కాని వ్రాయలేదు. అందువలననే యాతని శతకమునం దిన్ని భేదములు.

సులభమైన తేట తెలుఁగులో నున్న యీజాతి

వేదాంతశతకములయం దనేక వైచిత్ర్యములు గన్పట్టు చున్నవి. కొందఱు వేమన స్వర్ణకారవిద్య తన శతకమునందు బోధించె నని దానికై పాటుపడుచున్న వారున్నారు. శతకములలో గూఢార్థప్రతిపాదకములు, (Mythical) యంతరార్థ సంఘటితములు (allegorical) కొన్ని శృంగారరసప్రకటితములయ్యు గీతాంజలి, గీతాగోవిందములవలె నంతరార్థబోధకములుగ సాధింప దగిన శతకము లున్నవి.

కావున శతకములు ప్రచురముగాఁ గవుల స్వీయాభిప్రాయములు ప్రకటించినవి. వీనియందుఁ బాత్రలకు తెఱల యడ్డములేదు. కవి భగవంతునితో ముఖాముఖి మాటలాడును. అందువలన శతకములయందు "గవిహృదయము" సులభముగ గ్రహింపఁగల మని నాతలంపు. శతకములు కవి భావోద్రేకమునఁ బుట్టిన "లిరిక్సు" అగుటచే భక్తి, శృంగారము, క్రోధము, భయము, అద్భుతము మొదలగు భావోద్రేకములు కలిగినప్పుడే శతకములు పెక్కుమంది రచించియున్నారు. మహాపండితుల బంధ చిత్ర కవిత్వ శతకముల కంటెఁ దప్పులకుప్పలగు భావోద్రేక జనితములగు తేట తెలుఁగు శతక రాజములే మణులవలెఁ బ్రకాశవంతము లగుచున్నవి. వానికి మరణము లేదు. మంచి యభిప్రాయముల వెల్లడించినవి.

ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యము కంటెఁ గాళహస్తీశ్వరశతకము, తిమ్మకవి ప్రబంధము కంటెఁ గుక్కుటేశ్వర

శతకమును, మనకు గొప్పనిధులు, వారి ప్రబంధము లాంధ్ర వాఙ్మయమున లేకపోయినను నేను విచారింపను. దానికి లోటులేదు. కాని వారిశతకములు మనవాఙ్మయమునుండి తీసివేయుటవలన మనకుఁ గొంతయాస్తి తరిగినట్లగును.

✓ శతకములు భావోద్రేకజనితము లనుటకు ప్రబల నిదర్శనముగ నొక్కశతకము చూపెదను. తురకలు సింహాచలముప్రక్కల దోపిడిచేయుచు వచ్చి దేవాలయమును జుట్టుముట్టినప్పుడు కోపముతో—భయముతో— భక్తుఁడైన గోగుల పాటి కూర్మకవి యాదేవుని నిందాగర్భముగ "వైరిహరరంహా! సింహాద్రినారసింహా!" అని చెప్పిన నారసింహశతకమునందలి వాక్యముల వినుఁడు.

"పొంచియుంటివి యవనులఁ ద్రుంచుమింక
దోలు పారసీకాధిపుల పటాపంచలుగను
ప్రజలఁరక్షించు యవనేశు బలముగూర్చి
ఘనతురుష్కులఁ బడఁగొట్టు మనసుఁ బెట్టు"

అని యుద్రేకముతో సంబోధించుచున్నాఁడు. ప్రోత్సహించు చున్నాఁడు. నిందాగర్భముగఁ బలుకుచున్నాఁడు. తెగఁబడి తిట్టుచున్నాఁడు. దేవుని భయపెట్టుచున్నాఁడు. ప్రబతిమాలుచున్నాఁడు. "అదె! తురకబలము వచ్చె" నని చూపుచున్నాఁడు. "సేన నిర్జించి యీయాంధ్రసృష్టి నిల్పు" మని ప్రబతిమాలుచున్నాఁడు. ఇచ్చటి భావావేగము వర్ణనాతీతము. చదువరులకే తెలియవలయును. ఆ భయము దర్శ

నీయము. ఆ భక్తుఁడు మనోరంగమునఁ దిలకింపఁదగినవాఁడు. కరుణరసపూరితమగు హృదయముతో నాశతకమును ముగిఁపవలసినదే! ఇట్టివి పెక్కుశతకము లున్నవి.

మన గ్రంథములలో భావము లుండ వనియుఁ బ్రకృతిపరిశీలన ముండ దనియుఁ బలువురి తలంపు. అట్టివారి కీ క్రిందిపద్యము పఠనార్హమైనది. చూడుఁడు. కృష్ణానది నలుపు, అదిసంగమ మగుచోట సముద్రము నలుపు, పై యాకాశము నలుపు, ఆ మహారంగమును మనస్సులో ధ్యానించుకొనుఁడు. నది సాగరగతియైన సంగమస్థలియం దుల్లోలకల్లోలితములగు గభీరజలములలోతు, అందుఁ బ్రదర్శితమగుచున్న నీలవుటాకసపు లోతును ధ్యానించుకొనుఁడు. గట్టుదరి నేర్పడిన దీవినిఁ బరికింపుఁడు. దీవి చుట్టును లేచి కరగిపోవు తెల్లనుఱుగులఁ దిలకింపుఁడు. ఆ హంసలదీవి పరిసరముల విహరించిన నల్లదొంగపై నల్లిన కాసుల పురుషోత్తముని పద్యమును వినుఁడు.

సీ. భువనత్రయైక సంపూర్ణుఁడవగు నీకు
నందకుటీరమా? మందిరంబు?
పాలమున్నీటిలో నోలలాడెడు నీకు
మహి యశోదాస్తన్యమా? బలంబు?
పదపద్మమునగంగ యుదయమందిన నీకు
జలకమా? గోపికాంజలిజలంబు
అహిరాజు భోగపర్యంకంబుగల నీకు
తల్పమా? రాధికాతరుణియంక?

గీ. మహహా! వారలభాగ్య మెంతనఁగవచ్చు
భావజవిలాస! హంసలదీవి వాస!
లలితకృష్ణాబ్ధి సంగమ స్థలవిహార!
పరమకరుణాస్వభావ! గోపాలదేవ!!

మహానీలరంగమున నీలమేఘశ్యాముఁడగు గోపాలదేవుని యాలయముతో నున్న హంసలదీవిని నిలువఁబడి యానల్లనిసంద్రము, నాకాశమును, అందుఁ గలియుచున్న కృష్ణయగు కృష్ణనుఁ జూచి భక్తుఁడు తన కొఱమాలిన జీవితమును దలంచుకొని పరమేశ్వరుఁడు పరమకరుణాస్వభావుఁ డనుచున్నాఁ డందలి స్వభావపరిశీలనము పాశ్చాత్యకవులలో మహాకవులనైనఁ జూపు మనుఁడు!

"రవిసూనున్ బరిమార్చి యింద్రసుతునిన్ రక్షించినాఁడందునా?
రవిసూనున్ గృపనేలి యింద్రసుతుఁ బోరం ద్రుంచినాఁడందునా?
యివి నీయందును రెండునుం గలవు నీకెద్దిష్టమో వెంటనే
రవివంశాగ్రణి తెల్పవయ్య రఘువీరా జానకీనాయకా!"

(అయ్యలరాజు త్రిపురాంతకుఁడు.)

( ఏలూరు సాహిత్యపరిషత్సభలోఁ జదివిన వ్యాసభాగము లిందుఁ గలవు.)

శ్రీరస్తు
శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః!

# శతక కవుల చరిత్రము

## పండితారాధ్యులు

సర్వమతములకు ఖండనము లున్నవి. కాని మతమును సంపూర్ణముగ ఖండించువారు వేఱు - అభిప్రాయములలోఁ గొంచెము భేదము లున్నవారు వేఱు. రెండవతరగతివా రున్న మతమునందలి లోపములనే సంస్కరించెదరు. బసవన్న వేదాదరణము లేకుండ, జాతిభేదములు లేని వీరశైవమత మును స్థాపించినప్పుడు ద్విజేతరుల కామతము నచ్చినప్పటి కిని, బ్రాహ్మణులలోఁ జాలమంది శైవమతప్రియులు కూడ జాతిని విడనాడి కర్మబాహ్యులై జంగములలోఁ గలసిపోవుట కిష్టపడలేదు. ఆ యభిప్రాయమును వెల్లడించి వీరశైవమత మును సంస్కరించుటకుఁ బ్రయత్నించినవాఁడు పండితారా ధ్యులు. ఇతఁడు బసవన్న స్థాపించిన వీరశైవమతము నందలి లోపములు — అనఁగా బ్రాహ్మణు లామతములోఁ జేరకుం డుట కడ్డముగానున్న రెండుప్రధాన విషయములను సంస్క-

రించె నని చెప్పవచ్చును. బసవన్న చెప్పినట్లు జాతిని, వేద ములను (కర్మలను) నిరాకరింపకుండ నితఁడు వీరశైవము సాంగముగ నంగీకరించె నని చెప్పవచ్చును. ఇతఁడు తన మత వ్యాప్తి కనేకగ్రంథములు రచియించెను. మనకుఁ బ్రస్తుత మిచ్చుట ప్రసక్తి గల గ్రంథము "శివతత్త్వసారము." * శివతత్త్వసారము కందపద్యములలోఁ బండితారాధ్యులవారు వ్రాసియున్నారు. దొరకినంతవఱకు 489 పద్యము లున్నవి. ప్రతిపద్యము చివరను శివుని సంబోధించియున్నాఁడు. కాని పెక్కుపద్యములలో శివునికిఁ బర్యాయపదములగు (1) సర్వా నందా (2) మహేశా (3) రుద్రా (4) అజా (5) సురమునీం ద్రవరేణ్యా (6) సమస్తకామాతీతా (7) హరా (8) నిరుపమ మహిమా (9) అతిలోకా (10) దురితారాతీ మొదలగుపద ముల నాడినాఁడు. ఐనను "శివా" యను సంబోధనమే హెచ్చుగా వాడినందున నిది శివసహస్రముగ వ్రాసియుం డిన నుండవచ్చును. ప్రాకృతశతకములు వ్రాసిన జైనుల వాఙ్మయానుసార మిది వ్రాసియుండిన ప్రారంభశతకములలో మన కదృష్టవశమున మిగిలియుండిన "సహస్రము" లేశ మగు టచే నిందుఁ గొన్ని విషయములు శతకవాఙ్మయారంభస్థితి నూహింప నవకాశమిచ్చుచున్నవి. ఆంధ్రశతకములలోఁ

---

* ఈ గ్రంథమును గవర్నమెంటు ఓరియంటలు లైబ్రరీవారు సంపా దింప దానిని శ్రీ కే.వి. లక్ష్మణరావుపంతులుగారు విపులమగుపీఠికతోఁ బరి షత్పత్రికలోఁ బ్రకటించిరి. అందలివిషయము లిందుదాహృతమైనవి.

బ్రిధానప్రత్యేకలక్షణముగఁ బరిణమించిన యేకమకుటము దీనిలోఁ బ్రారంభమైనది. ఇప్పటికి మకుటము గ్రంథమంతట నొకటే యుండక సంబోధనము పర్యాయపదసూచితమయ్యు దోషము లేనట్లుండుటఁ జూడ నీగ్రంథము శతకారంభస్థితినిఁ దెలుపుచున్నది. ఇందలి మకుటము పర్యాయపదసంశోభిత మగుటవలననే గాక కొన్నిఁటికిఁ బద్యమునడుమనే సంబుద్ధి వచ్చుటచేతను, కొన్నిపద్యములలో సంబుద్ధి లేకపోవుటచే తను గూడ శతక మకుట మిప్పటికి స్థిరపడలేదని యాకాల మునందలి యితరశతకము లట్టివి దొరకువఱకును నిర్ణయింప వీలగుచున్నది. ఆ కాలమునందును దరువాతను గూడ నూఱు కాని నూటయెనిమిదికాని పద్యము లుండక, యధికముగ నున్నను దీనిని శతక మనియే పండితులును బ్రజలును గూడ వాడుచుండిరి. కావున శతాధిక పద్యము లున్నను, తక్కువ యున్నను చాటుకృతులను శతక వాఙ్మయ మని సర్వసాధా రణముగ వాడవచ్చు నని ద్యోతక మగుచున్నది. చాటుకృ తులలోఁ జేరిన ముక్తకాదికావ్యములు మొదలు సహస్రము లవఱకు శతకవాఙ్మయమని సాధారణసాంకేతికముతో నీగ్రం థమునఁ గొన్నిచోట్ల వాడుట కిదియే కారణము. పండితా రాధ్యచరిత్ర మని పాల్కురికి సోమనాథుఁడు ద్విపదలో రచి యించియున్నట్లు మన మెఱుఁగుదుము. అదిగాక పిడుపర్తి సోమనాథుఁడు బసవపురాణమునం దిట్లు చెప్పియున్నాఁడు.

" సీ॥ విరచించె జైమిని వేదపాదస్తవం
బొకపాదమున వేదయుక్తి నిలిపి
హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డాచరిత పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి"

కావున శ్రీనాథాదులు కూడ నీపండితారాధ్యచరిత్రము వ్రాసినట్లు కనఁబడుచున్నది. ఈ గ్రంథము లన్నియు మన శివతత్త్వసారప్రణేతయగు మహాకవిపండితారాధ్యుల చరిత్రములే! ఇట్టి చరిత్రములలో మొట్టమొదటిదైన పాలుకురికి సోమన్న గ్రంథమునం దీ శివతత్త్వసారము శతకమనియే యుండెను.

"ద్వి॥ శతకంబు శివతత్త్వసారము పీప
కళికమహానాటకము సుదాహరణ॥"

—పర్వతప్రకరణము (369).

ఈ పాదములకు "శతకమును శివతత్త్వసారమును గూడఁ జేసియుండవచ్చుననియు, శివతత్త్వసార మందువలన శతకము కానక్కఱలే" దనియు, గొంద ఱందురుకాని యదియే సిద్ధాంత మనుట కట్టివారీ కవి వ్రాసిన శతకమును జూపవలసియుందురు. ఈ శతకము మనకిప్పటి వఱకుఁ దెలియకయున్నను పూర్వలాక్షణికు లీగ్రంథము నెఱిఁగియున్నట్లు (1)గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరము (2) అనం

దరంగ రాట్ఛందము నిందలి పద్యముల నుదాహరించియుండు టచే సాక్ష్య మిచ్చుచున్నవి. అం దుదాహృతమైన యీ క్రింది పద్యము ప్రస్తుతము శ్రీలక్ష్మణరావుగారు ప్రకటించిన శివ తత్త్వసారమునందు లేనందున నిందలిపద్యము లింకను నుండి యుండవలె నని నా రూహించుచున్నారు.

"కం॥ ఆయతి త్రిపురాంతక దే
వా యని పిలుచుటయుఁ గటక మంతయు వినఁగాఁ
బాయక కిన్నర బమ్మయ
కో యని యెలుగిచె తొల్లి యురగాభరణా॥"

ఈ యూహ కవి శివతత్త్వసారమును సహస్రముగా వ్రాసియుండునను నాయూహను బలమిచ్చుచున్నది.

ఈ కవిని "పండితారాధ్యు"లని "ఆరాధ్యదేవర" యని "మల్లికార్జునుఁ"డని "పండితయ్య"యని పలువిధములఁ బిలిచెదరు. పాలుకురికి సోమన్న పలుమారు పండితా రాధ్యు లీగ్రంథము వ్రాసెనని చెప్పుటచేఁ బ్రసిద్ధు లగు పం డితులవారే యీగ్రంథమును వ్రాసి రని నిర్ధారణ మగుచు న్నది.

(1) "శివతత్త్వసారసంచిత మహామహిమ
శివతత్త్వసారమ న్శివకృతిఁ బొగడు
—దీక్షా ప్ర. పుట 63.

(2) శతకంబు శివతత్త్వసార మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచును
—వాద ప్ర. పుట 173.

(3) గీ|| ఎట్టు లనుచు సంశయింపక శివతత్త్వ
సారగద్యపద్య సమితి శివుని
మహిమ తెల్పునట్టి మల్లికార్జునపండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు"

—అనుభవసారము.

ఇట్లు పాలుకురికి సోమన్న పండితులవారీ గ్రంథములు వ్రాసినట్లు చెప్పుటయేగాక యితని కందపద్యము లనేకము లాతఁ డనుకరించి యున్నాఁడు. ఒక్క సోమనాథుఁడే యన నేల? ఆ కాలమునందలి శైవకవు లందఱు నట్లొనర్చినవారే! ఇందలి 338 పద్యముతో నన్యవాదకోలాహలమునందలి 73 వ పద్య మొకటి పోల్చి చూచిన సత్యము వెల్లడియగును. వేమనచరిత్రమునం దీతనిగ్రంథము వేమన చదివియుండు నని వ్రాసియుంటిని. ఇటీవలఁ గొన్ని పద్యము లాతఁ డనుకరించి నవి కనఁబడినవి. మచ్చు చూపెదను. కాని వేమన శివభక్తి కలిగియుఁ బండితునివలెఁ గాక కేవ లాద్వైతభావముల వెల్లడించెను.

క|| నిన్నెఱుఁగుచు దన్నెఱుఁగని
యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడు(మదిలో)
నిన్నును దన్ను నెఱింగెడి
యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడును శివా.

—శివతత్త్వసారము 269.

తే|| నిన్నుఁ జూచెనేని తన్నుఁదా మఱచును
తన్నుఁ జూచెనేని నిన్ను మఱచు
నేవిధముగ జనుఁడు నెఱుఁగు నిన్నునుఁ దన్ను
విశ్వదాభిరామ వినుర వేమ||

—135 పుట "వేమన" 1922.

ఇంకను వేమన వాడిన "లలితశివతత్త్వపదమున" మొదలగు వాక్యము లనేకము లాతఁ డీ గ్రంథము చదివి ఛాయల మెఱుఁగు పెట్టి గ్రహించెనని చూపవచ్చును. సోమ నాథుని యనుకరణములకు శివతత్త్వసారమునందలి 386, 387 పద్యములతోఁ బండితారాధ్యచరిత్రము పర్వతప్రకరణము 405 పుట పోల్చిగాని, శివతత్త్వసారమునకు శ్రీలక్ష్మణరావు పంతులుగారి పీఠిక చదివిగాని చూడవచ్చును.

ఇట్లనేక ప్రసిద్ధాంధ్రకవులకు బిచ్చము వెట్టిన యీ మహాకవి గ్రంథభాగ మిప్పటికైనఁ బ్రకటన మొందుట వాఙ్మయప్రియుల యదృష్టవిశేష మనుట యతిశయోక్తి కాదు. పండితుని కాలమునుండియు నీ గ్రంథము శైవులలో మిక్కిలి వ్యాప్తిలో నుండెను.

సోమకవి పండితారాధ్యచరిత్రమునం దీ కవి యనేకేతర గ్రంథములు వ్రాసినట్లు మహిమాప్రకరణమునందుఁ జెప్పి యున్నాఁడు. అవి లింగోద్భవదేవుగద్యము, రుద్రమహిమ, గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము నను నవి. ఇతఁడు కర్ణాటకభాషలో గణసహస్రనామము, ఇష్టలింగస్తోత్రము, బసవగీతలు నను గ్రంథములు రచియించినట్లు కర్ణాటకకవిచరిత్రమునందు వ్రాయఁబడియున్నది. కావునఁ బై గ్రంథము లే భాషలో రచియించెనో తెలిసికొనలేము. ఇంక ననేక కృతు లీతఁడు రచియించెనని యనుమానించుట

కనువగు మాటలు దీక్షా ప్రకరణము పుట 26 లో నున్నవి. పండితుని శివతత్త్వసారాదికృతులు వెనుకఁబడుటకు నశించుటకును గూడఁ గారణములు తరువాతకవు లీతని సాంగముగ ననుకరించుటయే యని శ్రీలక్ష్మణరావుగారు చూపిన కారణములు సత్యేతరములు కావు.(చూడుడు.పుట 13, 14, 15, 16 శివతత్త్వసారపీఠిక.)

పండితారాధ్యులు బసవన్నకు సమకాలికుఁడగుట నీతని కాలము నిర్ణయించుట కష్టకార్యముకాదు. బసవఁడు క్రీ॥ శ॥ 1167 లో మృతి నొందెను. కావున పండితారాధ్యులు 12 వ శతాబ్దము నడుమవాఁ డనవచ్చును. ఈశతాబ్దమే మన శతక వాఙ్మయారంభముగ నింతవఱకు దొరకిన గ్రంథములవలనఁ దెలియుచున్నది. పండితారాధ్యునితో సమకాలికులైన రాజులు (1) వెలనాటి చోడుఁడు 1163-1180(2) ఉదయావనీశుఁడు 1162 (3) బుద్ధరాజు 1171, నను ముగ్గురురాజులకాలమువలనను పండితారాధ్యచరిత్రము నాతనికిఁ బిమ్మట 60, 70, సంవత్సరములలో నున్న పాలుకురికి సోమనాథుఁడు వ్రాయుటవలనను, కన్నడకవి సోమరాజు కాలములవలనను గూడ 12 వ శతాబ్దమే యని శ్రీలక్ష్మణరావు గారు సకారణముగ నిర్ణయించియున్నారు. (చూడుడు. పీఠికపుట 16, 20) పండితారాధ్యచరిత్రమునందలి సంగతులవలనను, శివతత్త్వసారము నందలి కొందఱు భక్తుల ప్రసంగములను జూపి యీ శతకము బసవన్న మరణానంతరము పండితుఁడు వ్రాసియుండ

వలె నని శ్రీలక్ష్మణరావుగా రూహించిరి. (పీఠిక పుట 20)

పండితారాధ్యచరిత్రము పండితుని కరువది తెబ్బది సంవత్సరములలోఁ బుట్టినదని శ్రీలక్ష్మణరావుగా రనిరి. ఇంకను జేరువయని నేనూహించుచున్నాను. చరిత్రము నందలి సంగతులవలనఁ బండితుఁడు "గోదావరిమండలమునందలి భీమేశ్వరమున భీమేశ్వరలింగమున కర్చకుఁడగు భీమన పండితునికిఁ గొడుకని తెలియుచున్నది. గౌరాంబ యీతని తల్లి.* వీరిది ఋగ్వేదము, గౌతమగోత్రము, శ్రీశైల మల్లికార్జున దేవు నుపాసించిన తరువాతఁ బుట్టినందున నీతనికి మల్లికార్జునుఁ డన్న పేరు పెట్టిరి."(చూడుడు పీఠిక 21 పుట.)

ఈతని గురువు కోటిపల్లి యారాధ్యదేవుఁడు. ఈ యారాధ్య దేవర గురువు "అవాంతరయ్య."

పండితారాధ్యులు బాల్యమునుండియు విద్యావివేక సంపన్నుఁడై తనగురువుకడ సమస్తవిద్యలను, శైవమతరహస్యములను గ్రహించి, తన యనుభవముల గ్రంథముల వ్రాసి, జంగముల నారాధించుచు, భక్తులచరిత్రములను, మహిమలను వినుచు, తానుబోధించినట్లు నడుచుకొనుచు శివపూజాధురంధరుఁడై జీవితము గడపెనని చరిత్రమునందు సోమనాథుఁడు వివరముగ వర్ణించియుండెను. ఇదిగాక బసవన యంతవాఁ డీతని జందెముతీసి జాతివిడచి తనమతము నంపఁ గలియు

* చతుర్మతనిర్ణయ మను సంస్కృతగ్రంథము.

10

మని వార్త నంపఁగాఁ బండితుఁడు "భక్తిమీఁదవలపు బ్రాహ్మ్యంబుతోఁబొత్తు బాయలేను నేను బసవలింగ" యని ప్రత్యుత్తర మంపెనని శైవులలో వాడుకగలదు. ఈ కథ వలనఁ బండితుఁ డెంతగొప్పవాఁడో - సత్యము నంగీకరించిన యీతని "బ్రాహ్మ్యంపుఁ బొత్తు" వీడలేని మతాభిమాన మెంతయో కూడ - వెల్లడియగుచున్నది. ఈతఁ డనేక సంస్థానములకుఁ బోయి యనేకబౌద్ధపండితుల నోడించినట్లును, తీవ్రమగుమతప్రచార మొనర్చినట్లును దెలియుచున్నది. బౌద్ధపదపదాచార్యుఁ డీతనికి సమకాలికుఁడు. పండితుఁడు బసవసందర్శనార్థము బయలుదేరి కర్ణాటకమునకుఁ బోవుచుండఁగా దారిలో బసవఁడు మరణించెనని విని శ్రీశైలమునకుఁ దిరిగిపోయెను. ఆ ప్రాంతములందున్న నెల్లటూరునందే వృద్ధత్వమున బసవన తరువాతఁ గొలఁది కాలమునకే పండితుఁడు మరణించియుండు నని శ్రీ లక్ష్మణరావుగా రూహించుచున్నారు. ఈ యూహలకుఁ గారణము పండితారాధ్యచరిత్రమునందలి వ్రాతలే! పండితారాధ్యునిమహిమలు, అతిమానుషము లగు కథలు నెన్నియో చరిత్రమున వ్రాసియున్నారు. వానిసత్యాసత్యములు చర్చించుట కిది తావుకాదు. కాని శైవులలోఁ బండితుని సమకాలికులే యాతని యవతారపురుషునిఁగా భావించి పూజించిరని పెక్కునిదర్శనములఁ జూపవచ్చును.

చందవోలు కైఫీయతులో [లోకలురికార్డ్సు సంపు

టము 19-433] మల్లికార్జునపండితులు "వానస" వంశోద్భవు లని యున్నది. మన కీవఱకు నన్నయమిత్రుఁ డగు నారాయణ భట్టు వానసవంశోద్భవుఁడని భారత కృత్యాది నున్న "పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నారాయణునట్లు * వానసధరామరవంశ విభూషణుం" డను వాక్యములవలనఁ దెలియును. మఱికి సింగన తనవాసిష్ఠరామాయణములోఁ గందనమంత్రి "వాణసవంశాబ్ధిసుధాకరుండును, గార్గ్యపగోత్రపవిత్ర అబ్బనార్యతనూభవ కందనామాత్యుండు నాకు నతిస్నేహబాంధవుండు" నని వ్రాసియుండెను. ఈ ముగ్గురును వానసవంశోద్భవులే! ఈ వంశవివరములఁ జారిత్రకపరిశోధకులు చర్చించెదరుగాక! గోత్రభేద ముంట నీ మువ్వురు బందుగు లనవీలు కలుగుటలేదు. కర్ణాటకకవిచరిత్రము పండితయ్య వాణసవంశమువాఁ డనియే చెప్పుచున్నది.

ప్రస్తుత మాంధ్రదేశమునందు "ఆరాధ్యబ్రాహ్మణు"ల మని చెప్పుకొను లింగధారు లీపండితుని సంప్రదాయమువార మని చెప్పుకొందురు. కాని పండితునిగ్రంథమునందు దొరికిన భాగములో లింగధారణమునుగూర్చి యేమియుఁ జెప్పలేదు. ఇతఁడు శివభక్తినే ప్రతిపాదించిన "ద్వైతి" యని శ్రీలక్ష్మణరావుగారు నిర్ధారణ మొనరించియున్నారు.

ఇతని గ్రంథమునందు శివనింద చేయువారినిఁ జంపవలె

* ఈ పాఠ మిట్లుభారతమువారి (మల్లేశ్వరపుఁబండితులు) ప్రతిలో నున్నట్లు నేను కనుగొని 5, 6 సం॥రముల క్రితము ప్రకటించితిని.

ననియు, నట్టి గ్రంథములను నాశన మొనర్పవలయు ననియు ఖండితముగ వ్రాసియుండెను. పాలుకురికి సోమన్న కూడ శివ మతము నొందనివారిని రాజులసాయమున హింసించినట్లును గ్రంథములు చెప్పుచున్నవి. ఈ కాలమునందు బౌద్ధులను, బౌద్ధజైనవాఙ్మయములను శైవులు నాశన మొనర్చిరి.

ఈతనిగ్రంథము సలక్షణముగ నన్నయాదులమార్గము ననే వ్రాయఁబడినది. నన్నయ వాడినపదజాలమును పద్యలక్ష ణములు నిందున్నవి. కొన్ని రూపములు పండితునికాలము నాఁటి విశేషములఁ జూపుచున్నవి. పండితునకుఁ గర్ణాటక సంప్రదాయానుసారము "వలపల గిలక ప్రాస" మిష్ట మని శ్రీలక్ష్మణరావుపంతులుగారు సెల విచ్చి యున్నారు. ఈ సంప్రదాయము కర్ణాటాంధ్రభాషలఁ గవిత్వముచెప్పినవారి కే గాక యితరాంధ్రకవులయందును గానవచ్చెడిని.

"అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండు," —దాశరథీశతకము.

ఇచ్చట "ర్ల" యింటిపేరులోని దగుట "కంచెర్ల" కుల మని రూపాంతర మంగీకరింప వీలులేదు. కావున తెలుఁ గుకవులే యీప్రాసమును గన్నడములోనికిఁ బంపియుందురు. ఇది మనలాక్షణికులలోఁ గొందఱు చర్చించియున్నారు. శబ్ద శాస్త్రము ననుసరించి సాధువే!

ఈ గ్రంథము నన్నయ తిక్కన్నలకు నడుమ పుట్టి

నది. నన్నెచోడుని కావ్య విూకాలము నందలిదే మైయుండు నని శ్రీవీరేశలింగము పంతులుగారు క్రొత్తకూర్పు కవిచరిత్రములో వ్రాసిరి కాని తెలుఁగుకావ్యములలోఁ దిక్కనయే షష్ఠ్యంతములు మొదట వ్రాసినవాఁ డను సిద్ధాంత మందువలనఁ బోవుటకు వారర్థాంగీకారమునే వెల్లడించిరి. కాని యీ శివతత్త్వసారమునందుఁ గృత్యాదికిఁ జివర 18, 19, 20 పద్యములు మూఁడుమాత్రము "జయ మగు వేదంబులకును జయ మగుఁ బంచాక్షరికిని జయ మగు నిటలాశ్రయ మగు భసితంబునకును, జయమగు నుమామహేశ్వరులకు సతతము శివా" అని వ్రాసినది చూడ షష్ఠ్యంతములు* వ్రాయుపద్ధతి తిక్కనకుఁ బూర్వమే కలదని నిర్ణయమగుచున్నది.

ఈతఁడు వ్రాసిన కావ్యమును స్థాలీపులాకన్యాయమున నించుక పరిశీలించెదముగాక! గ్రంథారంభమున బ్రహ్మవిష్ణువులే నీమహిమ నెఱుఁగలే రనియైన "శ్రీపతి వాక్పతి ముఖ్యమహాపురుషులఁ" దలఁపెట్టి శ్రీకారముతోనే గ్రంథమారంభించెను. మనకు దొరికినంతవఱకు గ్రంథములో నీ క్రిందిపద్యములు శ్రీకారముతో నున్నవి. 1, 16, 71, 206, 299, 357, 359, 454, కృత్యాదిపద్యములు కొన్ని తగ్గించి చూచినప్పు డీ శ్రీకారములు కర్త నూఱేసిపద్యముల కొక్కటి

* ఇది రా. సా. గిడుగు రామమూర్తి పంతులుగారి తలంపు. నాకును బ్రమాణముగనే తోఁచినది.

వేసెనా యని యనుమానింప వీలగుచున్నది. లేఖకులు కొన్ని పద్యములు తారుమారు చేసియుండవచ్చును. 299 వ పద్యము శ్రీకారముతో నారంభించి శివుని భృత్యులు గణాధిపతులను వారిచర్యలను వర్ణించుట కారంభించి 388 వ పద్యములో నిట్లు ఫలశ్రుతి చెప్పియున్నాఁడు.

క॥ పరమేశ్వర నీప్రమథుల
చరితలు సతతమును విన్నఁ జదివినఁ బ్రమథు
స్మరణము చేసిన శుభములు
దొరకొను దురితంబు లెల్లఁ దొలఁగు మహేశా॥ 388.

387 వ పద్యములో దననామము కూడ జెప్పియున్నాఁడు.

ఇట్లు ప్రత్యేకోపాఖ్యానములకు ఫలశ్రుతులు మన పురాణములుయందుంట మన మెఱుఁగుదుము. కావునఁ బండితుఁడుకూడ నీప్రమథులచరిత్రము 87 పద్యములలోఁ గాక 100 పద్యములలోఁ జెప్పియుండునని. నే ననుమానించుచున్నాను. నడుమఁ గారణములేని శ్రీకారములయునికి యీగ్రంథ మీతఁడు నూటేసిపద్యములో, నూటఎనిమిదేసి పద్యములో నియమ మేర్పఱచి వ్రాసియుండునని యనుమాన మొదవించుచున్నది. సంపూర్ణగ్రంథము చిక్కినప్పుడు దానిసత్యము తేలఁగలదు.

ఈతఁడు ప్రయోగించిన పదజాలము, శైలి, కావ్య

రీతులు నాకాలమునందుఁ బుట్టిన నన్నెచోడుని కుమారసంభవమునందును, బద్దెన నీతిసారముక్తావళియందును గనఁబడుచున్నవి. తిక్కనకంటె నిమిడికఁగ వ్రాసిన బద్దెనకందము లందముగ నున్నవని యొకసారి వ్రాసియుంటిని. ఆ కాలము నాఁటి కందములసొగసు, వ్యర్థపదములులేమి, ఇమిడిక వ్రాఁతయు మన కీతని కావ్యమునందును బ్రదర్శకమై నాఁటి సహజకవితాశక్తుల వెల్లడించుచున్నది.

పండితుఁడు పండితుఁడే యని చెప్పవలసినపనిలేదు. ఇతఁడు సంస్కృతభాషయందు వ్యాకరణము, తర్కము, వేదాంతము నభ్యసించుటయేగాక శ్రుతి స్మృతి పురాణ విజ్ఞాత యని యీతని రచనమే వేనోళ్ళఁ జాటుచున్నది.

క॥ పూని యుతద్గుణసంవి
జ్ఞానబహువ్రీహి మాన్పఁ జనుదెంచిన యణ్
మానితషష్ఠీతత్పురు
షానూనసమాస మెఱుఁగ రజ్ఞులు రుద్రా॥ 23

క॥ అమరఁగఁ బ్రపంచమిథ్యా
త్వము చెప్పెడువాది మున్న దానికి సద్భా
వము దానెఱుఁగక మిథ్యా
త్వ మనాశ్రయ మెట్లు జెప్పఁదలపోయు శివా॥ 36

ఇట్టి క్లిష్టవిషయములఁ గూర్చి యింత యిమిడికఁగ వ్రాయఁగల పండితునిశక్తి యసాధరణ మైనదే కాని, మల్లికార్జునుఁడు వ్రాసినశైలి పామరులకుఁ దెలియునది కాదు.

ఇతని కావ్యము మఱుగుపడుటకుఁ గారణము సోమనాథా దుల యనుకరణ మొకకొంత కావచ్చును గాని యీతని రచనావిధానమునందును గొన్నిలోపములు లేకపోలేదు. ఆనాఁటి భాష యట్టిదనుకొందమనిన నీతనికంటెఁ బూర్వుఁడగు నన్నయ భారతము నందలి నలోపాఖ్యానాదులు బాలురకుఁ బఠనార్హములై బద్దెన, నన్నెచోడ, మల్లికార్జునుల గ్రంథములు కాకపో నేల? కావున నీకవుల శైలి కఠినము. అన్వయకాఠిన్య మున్నది. ప్రాఁతవడ్డ రూపములు కలవు. ఐనను పండితుల కివి యనేకవిషయములలో నమృతప్రాయమైన వనుట కెంతమాత్రము ననుమానము లేదు. ఒండేమి, వేయేమి, మొదలగు పదములయం దీతనికిఁ బ్రీతి మెండు. కులశబ్దమీతఁడును సత్కులుఁ డను నర్థమున స్పష్టముగఁ బదితావుల వాడియున్నాఁడు. విప్లవము, పండుగ, పావలు, కసి, పీనుగులు, పిండకూడు మొదలగుపదముల కీనాఁటి యర్థమే యానాఁడు నున్నది, వక్కఁడు. ఓడు, ఆలరి, ఎయిదఁడు, ఆలాపు, ముద్దటలడిఁచిన, పాదటి, సూడుపట్టె, త్రిప్పటము, నొడ్డణము, ప్రిప్పులు, బడరుఁడు, మొదలగుపదములిప్పు డప్రరూపము లై పోయినవి.

ఇతఁడు సంస్కృతవాక్యములు శ్రుతులనుండి పద్యమధ్యమున నెక్కువుగ నిమిడ్చియున్నాఁడు. ఈ సంప్రదాయము శైవకవులలోఁ దరువాతఁగూడ నెక్కువుగఁ గనఁ

బడును. "ఓడునఁ బోసినజలంబు; మంటఁ గని సీతు వాసిన కంటెను; మీస మెదుకులమెఱపుల్," మొదలగు లోకో క్తులఁ గొన్ని వాడియుండెను.

ఈతని యన్యమతఖండనభాగములు మిక్కిలి కఠిన వాక్యములతో నిండియున్నవి. కాని యీతఁడు ప్రతిపాదించినభక్తి యుత్తమమైనది. వైష్ణవ విశిష్టాద్వైతులవలెనే యీతఁడు నాయకనాయకీభావముతోఁ గూడిన ప్రేమనునే జీవాత్మపరమాత్మలసంబంధముగా బ్రకటించిన ట్లీ క్రింది పద్యములు జూపవచ్చును.

క॥ దురితహర మనియు శుభములు
దొరకొను ననియును దలంచి దురితారి భవ
చ్చరణాబ్జభక్తిలలనా
పరవశభావమున నిన్ను బ్రణుతింతు శివా॥ 12

భక్తి "లలనాపరవశభావమునఁ" బ్రణుతింతు నను టలోఁ బండితున కీ భావము సంపూర్ణముగ లేదను నా రున్నను పండితునిభక్తి పైయంతరువులోనిదే యని యంగీక రింపకపోరు. "శివుఁడు విష్ణువరేణ్యుఁడు గోవిందవరేణ్యుఁడు" నని యీతఁడు చెప్పుటలోఁ గ్రొత్త లేదు. కేవల వైష్ణవులు కానివా రందఱును శివాధిక్యము నంగీకరించుచున్నారు. పైసమాస మీయర్థమునఁ బొసఁగునా?

భక్తిపై నీతఁడు వ్రాసిన రెండుమూఁడు పద్యములు శైలికిఁ జూపెదను.

క. ఒక్కండ డీశ్వరుఁ డని మది
నిక్కముగా నెఱిఁగి భక్తి నిష్ఠావృత్తిన్
ముక్కంటి నిన్నుఁ గొలిచిన
దిక్కక దొరకవె సమస్తదివ్యసుఖంబుల్॥

క. అరుదుగ భవత్ప్రసాద
స్ఫురణము దొరకొనుశివభక్తి గాన దుస్తరభవని
ష్ఠురదుఃఖసముద్రసము
త్తరణవహిత్రింబు భక్తి దానయ్యె శివా॥

క. వసుమతిఁ జిత్రము జిత్రచి
త్తసంభవా "నకర్మణా నతపసా నజప్తై
ర్న సమాధిభిరవ్య య నీ
యసదృశభక్తి"కినిఁ బ్రియుఁడ వగు దీశానా॥

కన్నడకవి చరిత్రమునం దీతని గూర్చి వ్రాసిన విశేషములు.

"ఇతఁడు (పండితయ్య) గణసహస్రనామము, ఇష్టలింగ స్తోత్రము, బసవగీత మొదలగు గ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది. గురురాజు వ్రాసిన సంస్కృత పండితచరిత్రము (15వ శతాబ్దము) నీలకంఠుని యారాధ్యచరిత్రము (15వ శతాబ్దము) సిద్ధనంజేసుని గురురాజచరిత్రము (16వ శతాబ్దము) ఇవి మొదలైన గ్రంథములయం దీక్రింది యంశము లీతనిగుఱించి తెలియుచున్నవి. (ఇచ్చట మనకుఁ దెలిసినవిషయములే వివరించిరి. ఈతఁడు బసవనిభస్మము నంది కర్ణాటకభాష రానందే పై గ్రంథముల వ్రాసెను. ఈతని గణసహస్రనామము మాత్రము దొరకుచున్నది. తక్కినవి దొరకలేదు. గణసహస్రనామము వెలనాటిచోడుని సభలో హరనింద విన్నదోషము, బౌద్ధాచార్యులతో వాద మొనరించినపుడు కలిగినందున నది పోఁగొట్టుకొనుటకును, పరవాదిసంహరణ దోషపరిహారము చేసికొనుటకును యీగ్రంథము వ్రాసె నని సిద్ధనంజేసుఁ డనుచున్నాఁడు. ఇందు ప్రమథగణ, రుద్రగణ,

వృషభయోగాచార్యులు, అరువదిముగ్గురుభక్తులు, షోడశసునుతులు, దశగణ ప్రాచీనభక్తులు, మొదలగునామములు చెప్పియుండెను. (161—162 పుట.)

గణసహస్రనామము మహాపురుషులనామములే! అవి పండితారాధ్యచరిత్రమునందు సోమనాథుఁడు వ్రాసియున్నాఁడు. పేరులజాబితా యేభాషలో వ్రాసిననేమి? అది యొక వేఱుకావ్యముగాఁ దలంప వీలులేదు. ఈతని శైవవాఙ్మయము చేసినమార్పులు, ఉపకారములును ముందు ముందుఁ జూచుకొనుచుఁ బోవుదము.

ఈ పండితమల్లికార్జునుఁడే నన్నెచోడుని గురునగు మల్లికార్జునయోగి కావచ్చునని కొందఱు తలంచుచున్నారు. కుమారసంభవపీఠికలో నీ విషయము శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు చర్చించి నన్నెచోడుని గురువు ముని యనియు, అస్ఖలితుఁ డనియు, బ్రహ్మచారి యనియుఁ జూపి, సంతానవంతుఁ డగు పండితయ్య నన్నెచోడునిగురువు కాఁ జాలఁడని నిరూపించిరి. "పాల్కురికి సోముఁడు పండితమల్లయ యనియే సవిశేషముగాఁ జెప్పుచుండును. నన్నెచోడుఁ డెక్కడను మల్లికార్జునునకుఁ బండితశబ్దమును జేర్చినవాఁడు కాఁడు" కావున పండితయ్య నన్నెచోడునిగురువు కాఁడని కవిగా రనిరి. ఈ వాదములో సత్యము లేకపోలేదు. కాని పండితయ్య బ్రహ్మచారిగా నున్నప్పుడే నన్నెచోడుని గురువుగా నుండఁ గుమారసంభవము వ్రాయఁగూడదా? కుమార

సంభవ మాశ్వాసాంతపద్యములలోఁ గవి గురువున కీ క్రింది విశేషము లున్నవి.

(1) శివతత్త్వజ్ఞానసన్మానసున్ 8. 195; (2) పరవాదీంద్ర ఘనాఘనానిలు; మహీసురేంద్రు 8. 197; (3) కవీంద్రుఁ 9. 364; (4) బ్రహ్మకులాధీశుఁడు 10. 568; (5) అపరిమితవిద్యాపరిణతు 10. 780. (6) శివాగమవేది (7) అమోఘవచోనిధి 10. 781 (8) బ్రహ్మకులోత్తంసుఁడు (9) సంసారపదవియుక్తుఁడు 1008.

ఈ విశేషములలోఁ గొన్ని పండితయ్యకును బ్రసిద్ధమైనవి. బ్రాహ్మణుఁడు, కవి, పండితుఁడు, యతి, అమోఘవచస్కుఁ డన్నవి శివతత్త్వశబ్దముతోఁ గలిసి యనుమానమును బలపఱచుచున్నవి. నన్నెచోడుఁ డొకచోట శివు నిట్లు పేర్కొనెను.

"(1) జంగమమల్లికార్జున (2) జంగమమల్లయ;" కుమారసంభవము 8. 61; 8. 62 శివునకుఁ దనగురువునకుఁ సమాననామముల వాడినాఁడు. ముని, జంగము, బ్రహ్మచారి యగు మల్లికార్జునుఁడు పండితమల్లికార్జునుఁ డనుట కింకను బలవత్తర మగు ప్రమాణములు దొరకవలసియున్న వనియే ప్రస్తుతము నాయూహ! అత్యధికముగఁ బూజనీయుఁ డగు నీ పండితుని రచన మాంధ్రభాష యందలి శైవవాఙ్మయమునకు, శతకవాఙ్మయమునకుఁ బునాదివంటిది. ఆంధ్రు లిది చదివినకొలఁది యింకను దీని ప్రాముఖ్యము తేటపడును.

పండితయ్యనుగూర్చి విశేషములు పాలుకురికి సోమన్న పండితారాధ్యచరిత్రమున నిట్లు వ్రాసెను. చదువువారికి మనోహరముగ నుండున ట్లాతని ద్విపదలే యుదాహరించెదను.

శ్రీశైవసమయదేశకచక్రవర్తి । పాశవిమోచనపటుకళామూర్తి
జృంభద్దిగంతవిశ్రుతసితకీర్తి । శాంభవదీక్షాభిజాతానువర్తి
సత్తమోత్తముఁడు సంయుతవీరభక్తి । వృత్తచిత్తుఁడు చతుర్వేదార్థవేత్త
గహనసంసృతి శిఖిఖండనహేతు । మహితపంచాక్షరీమంత్రసిద్ధుండు
వేదాగమపురాణ విహితశాస్త్రప్ర । పాదితరుద్రాక్షభసితభూషణుఁడు
యమనియమాది వ్రతాచారసార । శమదమోత్కృష్టనిష్ఠాగరిష్ఠుండు
సంతర్బహిర్ధ్యానయజనవంతుం డ । వాంతగయ్యాయనంగ హరగణాఢ్యుండు
వారిశిష్యుండు దుర్వారసంసార । దూరవీరవ్రతోద్ధురవర్తనుండు
శైవధర్మోత్తమాచార్యుండు నత స । ద్దైవంబునద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయవైశేషికోదాత్తశాస్త్రప్ర । పాయదర్శన పరిపాలనక్షముఁడు
స్వకృతావలోకనోత్సారితశిష్య । నికరమలత్రయనిరసితేంద్రియుఁడు
తంత్రాధిగతవీరతంత్రస్వతంత్ర । మంత్రాధిపతిరాజమంత్రసిద్ధుండు
వేద వేదాంత వివిధపురాణోప । పాదితకేవలభక్తివర్ధనుఁడు
పండితనుతపాదపద్ముఁడు సుకవి । మండలవిబుధ సమాజ పూజితుఁడు
నారూఢకీర్తిశుఁడగు కోటిపల్లి । యారాధ్యుఁడనఁగ లోకారాధ్యమూర్తి
యసమతదివ్యలోకారాధ్యశిష్య । వినరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
చనుసరుద్రోనాత్రసంశయోయనఁగ । జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
సకలయోగవాదాది పరవాదివిసర । విశసనప్రత్యక్షవీరభద్రుండు
దండితాఘుఁడు జగత్పావనకాగ । ణుండు విశ్రుత జగన్నుతసితకీర్తి
అధికశాపానుగ్రహ సమగ్రబలస । మధిగత దివ్య పంచాక్షరీవేత్త
వావధూకానీక వాగ్బంధనక్రి । యావిశారదుఁడు లోకారాధ్యమూర్తి
పరగిశైవేదశ ప్రత్యయోయనఁగ । బరువడిజను దశప్రత్యయాన్వితుఁడు
ధన్యుండు దేశికోత్తముఁడు లోకైక । మాన్యుండు పండితమల్లికార్జునుఁడు||

— పుట 7 పం|| ఆరాధ్యచరిత్ర.

* * * *

"అలరుచు నసమలోకారాధ్యమూర్తి । అతులశాపానుగ్రహాసమగ్రకీర్తి
యతిచక్రవర్తి నిరస్తాఖిలార్తి । పండితేంద్రుండు శుంభన్మహాభక్త
సముదాయ శ్రీపాదజలజాత్ముఁడగుచు॥" 269 పం॥ ఆ॥ చరిత్రము.

---

# పాలుకురికి సోమనాథుఁడు

ఇతఁడు బసవన్న స్థాపించి, పండితారాధ్యులు సంస్కరించిన వీరశైవమతమున కుద్ధారకుఁడు, ప్రచారకుఁడు నగు మహాకవి యని చెప్పవచ్చును. శైవమతవ్యాప్తి కాదిని శైవులు జైనులఁ జూచి దేశభాషలలో నెక్కుడువాఙ్మయమును సులభకావ్యములుగ రచియించినారు. మతవ్యాప్తికీతని సులభవాఙ్మయ మాంధ్ర కర్ణాటక దేశములయం దొనర్చిన కార్య మద్భుతమైనది. సులభవాఙ్మయముచేఁ బ్రజాహృదయము నెట్లుమార్పనగునో చూపుట కీతని చరిత్రమునే చూపవచ్చును.

ఇతఁడు కర్ణాటాంధ్రభాషలయందును, సంస్కృతమునందును గూడ ననేకగ్రంథములను రచియించియున్నాఁడు. ఇతఁ డష్టభాషాకవియని బిరుదముకలవాఁడు. కవులచరిత్రము నూతనముద్రణమునం దీతని గ్రంథములపట్టికను గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"పాలుకురికి సోమనార్యుఁడు బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము, చతుర్వేదసారసూక్తులు, సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురురగడ, చెన్నమల్లుసీసములు, నమస్కారగద్యము, వృషాధిపశతకము మొదలయిన గ్రంథములు రచియించినట్లు బసవపురాణకావ్యమునం దీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది.

సీ॥ బసవపురాణంబు ♦ పండితారాధ్యుల
చరితంబు ననుభవ ♦ సారమును చ
తుర్వేదసారసూ ♦ క్తులు సోమనాథభా
ష్యంబు శ్రీరుద్రభా ♦ ష్యంబు బసవ
రగడ గంగోత్పత్తి ♦ రగడ శ్రీబసవాఢ్య
రగడయు సద్గురు ♦ రగడ చెన్న
మల్లుసీసములు న ♦ మస్కారగద్య వృ
షాధిపశతకంబు ♦ నక్షరాంక

గీ॥ గద్య పద్యము ల్పంచప్ర ♦ కారగద్య
యష్టకము, పంచకము నుదా ♦ హరణయుగ్మ
మాదియగు కృతు ల్భక్తిహి ♦ తార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తసభలలోఁ ♦ జెల్లుచుండు॥

ఈ కవిగ్రంథములలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము— తెలుఁగు; అన్యవాదకోలాహలము, బసవపంచగద్య, సోమనాథభాష్యము, —సంస్కృతము, తక్కినవి కన్నడము."

(223 పుట, నూతనముద్రణము, ఆంధ్రకవులచరిత్రము.)

సోమనాథుని పై గ్రంథములలో నే నెఱిఁగియున్నంత వఱకు క్రింది గ్రంథములు మన కిప్పుడు లభ్యము లగుచున్నవి. కవులచరిత్రలోని భాషావిభాగము సరియైనది కాదు.

1 బసవపురాణము (ద్విపద) తెలుఁగు ముద్రితము.
2 సోమనాథభాష్యము సంస్కృతము ,,
3 అనుభవసారము (పద్యము) తెలుఁగు ,,
4 పండితారాధ్యచరిత్రము (ద్విప) ,, ,,
5 చతుర్వేదసారము (పద్యము) ,, ,,
6 వృషాధిపశతకము ,, ,, ,,

ఇంతవఱకీ గ్రంథము లన్నియు రాజమహేంద్రవరమున భాండాగారమున నున్నవి.

7 చెన్నమల్లు సీసములు ,, ,, ,,

8 రుద్రభాష్యము
9 బసవరగడ
10 గంగోత్పత్తిరగడ
11 శ్రీబసవాఢ్యరగడ
12 నమస్కారగద్య
13 అక్షరాంకగద్య
14 సదురురగడ
15 పంచప్రకారగద్య

ఈగ్రంథములు నేను చూడలేదు. ఇంకను గొన్నికన్నడగ్రంథములు వ్రాసినట్లు కన్నడకవిచరిత్రమునందున్నది. ఈవ్యాసాంతమున నుద్ధృతమైన భాగమును జూడుఁడు. అందుఁ గన్నడగ్రంథముల వివరములు తెలియఁగలవు. సోమనాథుని గ్రంథములు కొన్ని కన్నడమునను, సంస్కృతమునను గూడఁ జిక్కుచుండవచ్చును. ఈతని బసవపురాణమే కర్ణాటక బసవపురాణము వ్రాసిన భీమకవికి మాతృక.

పాలుకురికి సోముఁడు ప్రథమప్రతాపరుద్రుని కాలమువాఁ డని కవులచరిత్రమునందు వివరముగఁ జర్చించి

యున్నవిషయ మగుట నిందుఁ దిరిగి[illegible] 1222 క్రీ
నున్న సోమరాజు తన యుద్భటకావ్యములో[illegible] పాలుకురికి
సోమన్నను బొగడియుంట దీనికిఁ జర్చయవసరము లేదు.

ఇవిగాక యీతఁడు కర్ణాటకభాషయందు సోమేశ్వర శతకాదులు వ్రాసినట్లు తెలియుచున్నది. కొందఱు పరిశోధకులు సోమేశ్వరశతకము పులిగిరి సోమన్నకృత మనుచున్నారు.* పైపద్యములోఁగూడ నీ సోమనాథశతకము పాల్కు

* "Palukuriki Soma (C 1195) was a learned scholar born at Palkuriki in the Godaveri District. After defeating in controversy the Vyshnava Sastris there, he removed to Kalleya in the Kanarese country. He wrote more especially in Sanskrit and Telugu. A Telugu Basavapurana by him is said to have formed the basis of Bhima Kavi's Basavapurana. Among his Kanarese Works there is said to have been a Sataka, and some have identified this with the wellknown and widely read Someswara Sataka, an attractive cento of verses on moral subjects. This work is however so loose and faulty, in grammar and style that Mr. Narasimha Chariar thinks it could not have been written by one who like Palkuriki Soma, was acquainted with Sanskrit. He also points out that Lingayats themselves do not include it in the list of writings by Palukuriki

రికె సోమన్నకృత మని చెప్పియుండలేదు. ఐనను కన్నడసోమ నాథశతకమునుండి యొండు రెండుపద్యములఁ జూపెదను. ఇవి కన్నడపద్యసారమునుండి గ్రహించితిని. ఈ విషయము (23-6-1917) లో నేను కృష్ణాపత్రికలోఁ బ్రకటించియుంటిని.

మ॥ "రవి యాకాశకె భూషణం రజనిగం చంద్రం మహాభూషణమ్
కువరం వంశకె భూషణం సరసి గంభోజాళి గెవభూషణమ్.
హవి యజ్ఞాళిగె భూషణం సతిగె పాతివ్రిత్యవే భూషణమ్
కవి యస్థానకె భూషణం హరహరా! శ్రీచెన్నసోమేశ్వరా॥

మ॥ చెరిపారణ్యక పక్షిగొందు తరుగోత్రాగల్ ఫలంబీవిదా
మరగళ్ పుట్టవె పుష్పమొందు బళలల్ భృంగక్కె పూవిల్లవే
దురుళన్ సత్కాని గోష్ఠిగళ్ప్రసంగం తాం [illegible] లోభదిం
గరయున్ దాతరు పుట్టరే హరహరా! శ్రీ చెన్నసోమేశ్వరా॥

ఇందు మొదటి పద్యమున కర్థము :—

"ఆకాశమునకు రవి భూషణము, రాత్రికిఁ జంద్రుఁడు భూషణము, వంశమునకు పుత్రుఁడు భూషణము, కాసారము నకుఁ బద్మములు భూషణము, యజ్ఞమునకు నేయి భూషణము. సతికిఁ బాతివ్రత్యము భూషణము, ఆస్థానమునకుఁ గవి భూషణముకదా. హర హరా! శ్రీచెన్నసోమేశ్వరా!"

---

Soma. Besides which, the author never calls himself Palukurike Soma, but implies that he belonged to Puligire (Lakshmiswer). The date of Puligire Soma is not certainly known, but he may have belonged to this period." - p. 44 Rice's Kan. Lit.

ఈతఁడు కవియగుటయేగాక ప్రౌఢపండితుఁ డని సోమనాథభాష్యము సాక్ష్య మీయఁగలదు. ఇతని భక్తులగు పిడుపర్తి సోమనాథుఁడు బసవపురాణపద్యకావ్యమును మఱి యొకకవి యన్యవాదకోలాహలమును సోమనాథుని పేర కృతుల నిచ్చిరి. పిడుపర్తి బసవకవి తన ప్రభులింగలీలపద్యకావ్యము గద్యలో "ఇది శ్రీమత్పాలుకురికి సోమేశ్వరవరప్రసాదలబ్ధకవితాచాతుర్యుఁ" డ నని వ్రాసికొని భక్తినిఁ జూపి యున్నాఁడు. అనేక శైవకవు లీతని దైవమువలె నారాధించి కావ్యాదినిఁ బ్రశంసించియున్నారు.

ఇతఁడు భృంగిరిటగోత్రజుఁడు. జంగమలింగార్చనావిశారదుఁడు. సంగీతశాస్త్రపారంగతుఁడు. యతీశ్వరుఁడు, శైవదేశికుఁడు, వేదవేదాంగవేత్త, వేదభాష్యకారుఁడు, అతిదయాంతఃకరణుఁడు, మంచితార్కికుఁడు, అతివిరాగసంపన్నుఁడు. ఆ కాలమునందు రాజులను మంత్రిలను తనవాక్కుచేతను, యుక్తిచేతను మెప్పించి దాసులనుగా, శిష్యులనుగాఁ జేసికొనినవాఁడు. శైవమతము నిరంకుశగమనము నొందునట్లొనర్చినవాఁడు. మంచివిజ్ఞానశాలి. అభినవవ్యాసుఁ డని శిష్యాళిచేఁ బొగడ్తఁ గన్నవాఁడు. మిక్కిలి మేధావంతుఁడై యనేక శిష్యపరివృతుఁడై యుండువాఁడు. ద్వైతాద్వైతసిద్ధాంతములఁ జర్చించుటలో మంచి ప్రవేశము కలవాఁడు. ఈ విశేషణము లన్నియుఁ బిడుపర్తి సోమనాథుఁడు వ్రాసిన బసవపురాణ, చంపూకావ్యము నందలి యాశ్వాసాంతపద్య

ములఁ జదివినవారి కతిశయోక్తులు కావని తెలియఁగలదు. బసవన్న చారిత్రకయుగము నందలి మహావీరుఁడు. ఆతని చారిత్రమునకు దివ్యతేజస్సు కల్పించి సోమనాథుఁడు వీర పురుషారాధన మొనర్చి వీరశైవమతమును బ్రజ్వలింపఁ జేసె. మతముతో దేశ, దైవభక్తులఁ గలిపిన గొప్పరాజకీయ పరిజ్ఞాతయనియు, మహాపురుషుఁ డనియుఁ జెప్పవచ్చును. ఆతని మతసిద్ధాంతము లప్పటి దేశ, రాజకీయముల ననుసరించియు, జైనమత ప్రాబల్యానుసారముగను, అతనిబుద్ధికిఁ దోఁచినట్లు సంస్కరణములఁ గోరి, ప్రజలయం దాభావములు వ్యాప్తి నొందుటకు వలసిన వాఙ్మయమును దాటియాకులపై వ్రాసి, స్వయముగఁ జదివి, శిష్యులఁ బ్రోగుచేసి, రాజులను, మంత్రులను స్వాధీనము చేసికొని, దేశసంచార మొనరించి, యన్యభాషల నేర్చి, యందుఁ గావ్యము లల్లి. వీరశైవముచే దేశము నుద్ధరింపఁ దలపెట్టిన గొప్పనాయకుఁడు. యతీశ్వరుఁడై సర్వసుఖముల వర్జించి పాలుకురికి సోమనాథుఁ డొనర్చినపని యనన్యసామాన్యము. దాని మంచిచెడ్డలు, ఫలితమును విమర్శింపని దేశీయచరిత్రకారునిది. కావున దేశజులు మన సోమనాథుని కవిగ నేకాక యింక ననేకవిధములఁ బూజింపవలసినట్లు తోఁచక మానదు.

ఇతనిచరిత్ర మింకను దెలియఁగోరువారి కనుపుగ చంపూబసవపురాణము కృతి నిచ్చుచు పిడుపర్తి సోమనాథుఁడు వ్రాసిన యీాతని చరిత్రము చదువుకొనుఁడు.

వీరశైవులలో నీతని దైవమునలె నారాధింతురు. ఈతని ద్విపదకావ్యములలోని మతాభిప్రాయముల నటుంచి చూచిన నీతఁడు వాడిన శబ్దజాలము, శైలీప్రవాహము, నాడుకభాషానిరంకుశత్వమును భాషాభిమానులు వేనోళ్ళఁ బొగడుచుందురు.

బసవపురాణపద్యకావ్యమునందు సోమనాథుని చరిత్రమును కృతిపతి వర్ణనగా నొనరించియుండెనుగదా! వీరశైవదీక్షాబోధ రచియించిన పిడపర్తి బసవన యిట్లు సోముని, పండితయ్యను బొగడియున్నాఁడు.

"సవిశేషశివతత్త్వసారాదికృతుల । శివభక్తి నిష్ఠించి సృష్టికిదృష్ట
ముగ నిల్పగన్నులు ముక్కంటిచేత । దగఁ బడసిన పండితస్వామిఁ గొలిచి
బసవపురాణాదిబహుకృతు లెప్పి । వసుమతి వీరశైవముఁ బ్రతిష్ఠించి
సకలమాహేశప్రసన్నతఁ గన్న । సుకృతాత్ముఁ బాల్కురికి సోమేశుఁ బొగడి
కావ్యము లెప్పి శంకరు కృపఁగన్న । భవ్యుల శివకవిప్రవరులఁ దలఁచి."

ఇతఁడు ప్రభులింగలీలలు పద్యకావ్యముగ వ్రాసిన బసవనకుఁ బూర్వుఁడు. ఈ బసవన తనకావ్యము భరద్వాజగోత్రుఁడు, శైవభక్తుడుఁ, వీరబాణావనీనాథునికొడుకగు తిమ్మనృపాలునిపుత్రుఁ డగు వీరభూపాలునకు గృతి నిచ్చెను. ఈ కవికొడుకే సోమనాథుఁడు. బసవపురాణము పద్యకావ్యముగ వ్రాయుటయేగాక ప్రభులింగలీలలు కర్ణాటకమునుండి ద్విపదగా భాషాంతరీకరించినాఁడు.

ఈతఁడు శైవబ్రాహ్మణుఁడు. మొదట నారాధ్యుఁడుగా నుండి యుత్తరవయస్సున కేవలజంగముగా మాఱి సిద్ధిపొందినట్లును, జీవించి యుండఁగనే సమాధి ప్రవేశించి యదృశ్యుఁడైనట్లును భక్తులు వ్రాసియుండిరి. ఈతఁడు సంస్కృతాంధ్రకర్ణాటకభాషలలోనేగాక మఱికొన్నిభాషల లోఁగూడ పద్యములను వ్రాసెను.

ఈతని వంశమునుగూర్చి యిదివఱ కనేక వివాదము లున్నవి. ఈ క్రిందివాక్యములవలన నీతని తలిదండ్రులనామములే యిదివఱకు సుస్పష్టముగఁ దేలలేదని తెలియఁగలదు.

(1) అనుభవసారమం దిట్లున్నది.

క. భృంగిరిటగోత్రుఁడను గురు । లింగ తనూజుండ శివకులీనుఁడ మాయా
సంగవివర్జితుఁడ....... । జంగమలింగప్రసాద సత్ప్రాణుండన్॥

ఇందువలనఁ దనగోత్రము భృంగిరిటగోత్ర మని, గురు లింగపుత్రు డని, శివకులమువాఁడని చెప్పుకొనినట్లు కనఁబడును. కాని బ్రాహ్మణులలో నిట్టి గోత్రసూత్రములు, కులములు లేవు. అందువలన నిందు సోమన్న తాను శివపుత్రుఁడ, శివగోత్రమువాఁడ, శివకులీనుఁడ, నని చెప్పిన భక్తి వాక్యములుగా వీనినిఁ దలంపవలసియున్నది. ఏమనఁగా?

(2) పండితారాధ్యచరిత్రమునం దిట్లు చెప్పుకొనె నని కవులచరిత్రము నూతనముద్రణము 221 పుటలో నున్నది.

"శ్లో॥ గురులింగార్యస్య దయాహస్తగర్భ సముద్భవః
బసవేశస్య తనయః బసవేశ్వర గోత్రికః
శ్రీమత్పాల్కురికి సోమేశనామాహం సర్వవిత్తమః
పండితారాధ్యచరితాలంకృతాం కృషిమారభే
తతశృణు నతామాత్య సూరనామాత్య శేఖర॥"

ఇందు దాను గురులింగార్యునిహస్తపుత్రుఁడని, బసవేశపుత్రుఁడనని చెప్పుకొనినట్లు శ్రీపంతులుగారు భావించి మొదటి కులగోత్ర వివరణమునకు భారతపద్యము నుదాహరించి గురువును జనకునిగాఁ గవి చెప్పెఁజూచె నని సమర్థింపఁ బోయిరి. కాని యిందును సోమన్న తనకులగోత్రముల సరిగఁ జెప్పలేదు. బసవకులము, బసవగోత్రము ననియే భక్తివాక్యములనుచున్నట్లు ఛాందసమే కనఁబడుచున్నది. సత్యముకాదు. ఏమనఁగా? కొన్ని పండితారాధ్యచరిత్రముల ప్రతులయందీతడు *వీరపోచేశ్వరునికొడుకు నని చెప్పుకొనెను. అదియుఁగాక.

(3) పాలుకురికి సోమన్న తన బసవపురాణమును గర్ణాటకమునందలి గొబ్బూరగ్రహార జనోత్తముఁడగు గొబ్బూరి సంగనామాత్యునకుఁ గృతి యిచ్చుచు నందుఁ దనకులము విషయ మిట్లు చెప్పుకొనెను.

---

* ఆంధ్రులచరిత్రములో శ్రీవీరభద్రరావుపంతులు గారు కృతిపతి వివరములు కవి కట్టఁగట్టిరి. సోమన్న వీరపోచేశ్వరుని కొడుకని లేదు. కృతిపతి తండ్రి వీరపోతేశ్వరుఁడు.

"ధరనుమామాతా పితారుద్రియనఁగ । బరగు వేదోక్తి నీశ్వరకులజుండ
శరణగణాశ్రియసకలస్వరూప । గురులింగవరకరోదరజనితుండ
భక్తకారుణ్యాభిషిక్తుఁడఁ బాశ । ముక్తుండఁ గేవలభక్తిగోత్రుండు
భ్రాజిష్ణుఁడగువిష్ణురామదేవుండు । తేజిష్ణువగు శ్రియాదేవియమ్మ యును
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ । వీరమాహేశ్వరాచారవర్తుండ
ఖ్యాతిచేసద్భక్తిగల కట్టకూరి । పోతిదేవునిపదాంబుజషట్పదుండ
సుకృతాత్ముఁడగు కరస్థలమువిశ్వేశు । ప్రకటవరప్రసాదకవిత్వయుతుఁడ
వడగాము రామేశు వరశిష్యుఁ డనఁగఁ । బడు చెన్న రాముని ప్రాణ సఖుండ
సంభావితుఁడ భవిజనసమాచరణ । సంభాషణాది సంసర్గదూరగుఁడ
నలిబాల్కురికి సోమనాథుఁ డనంగ । వెలసినవాఁడ నిర్మలచరిత్రుండ"
(బసవపురాణము. పుట 3)

ఇందువలన నీతఁడు శ్రియాదేవి, రామదేవుల పుత్రుఁడనియు, కట్టకూరి పోతిదేవుని భక్తుఁ డనియు, వడిగాము రామేశు శిష్యుఁడగు చెన్నరాముని సఖుఁ డనియుఁ దెలియుచున్నది. పండితారాధ్యచరిత్రమునం దిట్లు చెప్పుకొనెను.

"ధర నుమామాతాపితారుద్ర యనఁగ । వరపురాణోక్తి నీశ్వరకులజుండ
పే రెన్నఁబడిన శ్రీబెలిదేవ వేమ । నారాధ్యులను పరమారాధ్యదేవు
మనుమనిశిష్యుండ మద్గురులింగ । ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ
మును బసవపురాణమున నెన్నఁబడిన । పెనుపారుభక్తుల పెంపుడుకొడుకు
బసవపురాణప్రబంధమన్ పేర । బసవపురాణి యనె పటిగలవాఁడ
బసవనిపుత్రుఁడ బసవగోత్రుండ **** బసవన్న యిబ్బుట్టు బానిసెకొడుక
** మసలక మాచెన్నమల్లికార్జునుని । బసవనామం బిడి భక్తి పెక్కనను**
శుద్ధభక్తస్థల శ్రుతిమతాచార । సిద్ధవీరవ్రత శీలాన్వితుండ
నలిబాల్కురికి సోమనాథుఁ డనంగ । వెలయువాఁడను చతుర్వేదపారగుఁడ॥

*   *   *   *

పండితారాధ్యచరిత్రము తన ముద్దుమఱఁదియు, నెచ్చెలికాఁడును, సాహిత్యపరుడును, బసవభక్తుఁడును, వీర

పోచేశ్వరాచార్యుని శిష్యుడును, మంత్రియును, ఆపస్తంబ సూత్రుఁడు, హారితసగోత్రజుఁడు నగు సూరనామాత్యునకుఁ గృతి యిచ్చెను. "గణసహస్రనామము, దీపకలి చరిత్రము నీ యారాధ్యబ్రాహ్మణుఁడు వ్రాసె" నని పద్యసారమున వ్రాసిరి గాని యవి బండితయ్య కృతులని సోమన్నయే చెప్పెను. కావున నీతనివి కానేరవు.

ఈతఁడు వ్రాసిన గ్రంథములలోఁ జాలుకృతులు పెక్కు లున్నట్లు తెలియుచున్నను మనకుఁ జిక్కినవి స్వల్పము. అందు ముఖ్యమైనవి (1) వృషాధిపశతకము (2) చెన్నమల్లుసీసములు (3) చతుర్వేదసారసూక్తులు*

ఇందలి వృషాధిపశతకము (108 పద్యములు) చంపకోత్పలమాలా సంఘటితమైన భక్తిశతకము. ఇది బసవేశ్వరుని శివస్వరూపునిగా నెంచి యాతని సంబోధించి చెప్పినది. "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" అని మకుటము. నూఱువిధంబుల స్తుతింతు నని కవి యనుచున్నాఁడు.

> "నోరికి వచ్చినట్లు లోకనూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే
> నేరుతు నేరఁ బొమ్మనక నీపయి పొచ్చము లేని నుచ్చికన్
> గారవ మొప్ప మత్ప్రణుతిఁ గైకొనఁగాఁ దగు గారవింపు నిం
> పారఁగఁ గూర్మిఁ బూని బసవా బసవా బసవా వృషాధిపా॥ 106

* ఇది బసవన్న వ్రాసినదానికిఁ దెలుఁగనియు వీరశైవము శ్రుతిసమ్మతమనియు సమర్థించును.

తాను రచించిన బసవపురాణమును ప్రజలు మెచ్చుటఁ జూచి, భక్తులు బసవన్నను స్తుతించుట కనువుగానుండున ట్లీశతకము నీతఁడు వ్రాసియుండె నని యీ క్రిందిపద్యము వలన ద్యోతక మగు చున్నది గావున నీ శతక మీతఁడు బసవపురాణానంతరమే వ్రాసి యుండెను.

> "బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తి మెయిన్ విరచించినాఁడు మున్
> బసవపురాణ మంచు నను బ్రస్తుతిసేయుమ రట్లుఁగాన నీ
> యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ న
> న్వసిఁగొని బ్రోవుమయ్య బసవా॥"

పండితమల్లికార్జునుఁడు బసవస్తుతిగాఁ గొన్ని కావ్యములు రచియించె నని మనము తెలిసికొనియున్నాము. ఆ విషయము సోమనాథుఁ డీ క్రింది పద్యమున సూచించెను.

> "దండితవాదియై శివుఁడె దైవముగా కని కన్నులిచ్చి తా
> నిండుమనంబుతో నిలుపునిద్దపుకన్నులు దాల్చి పాల్చమా
> పండితమల్లికార్జునుఁడు బ్రస్తుతి సేయఁగ నేర్చునిన్ను నె
> వ్వండు నుతింపనేర్చు బసవా॥"

బసవడే శివుడు. శివుఁడే తనవల్లభుఁ డని సోమనాథుఁడు పల్కుచు విశిష్టాద్వైతుల నాయకనాయకీభావభరిత మగుభక్తి నీతఁడును బ్రకటించియున్నాఁడు. బసవఁడు "భక్తి కళత్రుఁ డ"ని చెప్పుటయే గాక యీ క్రిందిపద్యమున స్పష్టపఱచెను.

"నాయొడయండ నావిభుఁడ నాహృదయేశ్వర నామనోహరా
నాయిలవేల్ప నావరద నాగురులింగమ నామజంగమా
నాయదినాథ నావరుఁడ నన్నుఁ గృపామతి బ్రోవు మయ్య దే
వా యమిబృందవంద్య బసవా" 105

ఇట్లు "నాహృదయేశ్వర!" "నామనోహరా!" యని వాడిన పదములే సోముని భక్తినిఁ బ్రకటింపఁజాలి యుండును.

ఇతఁడు పలుభాషలలోఁ బండితుఁ డగుట, వేర్వేఱు భాషలలో స్తుతించినయెడల ఫలప్రద మని యట్లొనర్చి యున్నాఁడు.

## సంస్కృత భాష

చూర్ణితమన్మథాయ పరిశోభితభస్మవిలేపనాయ సం
పూర్ణమనోరథాయ గతపూర్వభవాశ్రితవర్ణనాయ ని
ర్వర్ణనిరాసకాయ సశివాయ నమో యని సంతతంబు ని
స్వర్ణన సేయువాఁడ బసవా॥ 58

## ద్రావిడ భాష

పరమనె యన్నయాండవనె పన్నుదయానె యనాథనాథనే
పెరియనె పేనివుండవనె పేరుదయాయనె పేరుజెప్పనే
తరిమురియాయనే యనుచు ద్రావిడభాష నుతింతు నిన్ను మ
ద్వరకరుణావిధేయ బసవా. 59

## కన్నడ భాష

హానుళియనన్న రక్షిసువు హారయ డెన్నవనీవనందు మ
న్నినువడి నిమ్మడింగలిగె నిమ్మబ్రిసాదిత నిమ్మతోత్త నే

కసిగతి యంచు భక్తి నిను కన్నడభాష నుతింతు సద్గుణ
వ్యసన శరణ్యమయ్య బసవా.

## నవార్య భాష (మహారాష్ట్రము.)*

దేవతకీతు హేంచిగురుదేవమణూనతకీతు మోంచిగో
సావతకీతు హేంచితుమసాచిప్రసాదయమీకృపాకరా
యీనరదాయ యంచు నుతియింపెద నిన్ను నవార్యభాష
దేవా వినుతార్యలోక బసవా.

## జాను తెనుంగు

పలుపాదతోటిచీరయును పాపసరుల్ నిరుమోము కన్ను నె
న్నెల తలచేతికత్తుకయునిండిన వేలుపు పేరుపల్కు పూ
సలుగల రేని లేఖవని జాను తెనుంగున విన్నవించెదన్
వలపుమదిం దలంతు బసవా.

ఇదియే యచ్చ తెలుఁగని తరువాతవారు తలంచి కొత్తమాటలఁ జేర్చిరి.

## అరుదుమణిప్రవాళము

సంస్కృత ద్రావిడ పదముల సమ్మేళనరచనమున కలవ లీపేరు వాడెదరు.

అరుళగిరిప్రసాదము దయానభవద్గుణవర్ణ నిల్పినాని
వెరవున నేస్మరామి పరమేశ్వర రేగణవర్య యంచు ని
ట్లరుదుమణిప్రవాళమున నంకనజేయుదు నిన్ను మన్మనో
వరకరుణావిధేయ బసవా.

* దీనినే “ఆరెభాష” యందురు.

ఇట్లు మణిప్రవాళము, వాస్థేయమణిప్రవాళము నం దును స్తుతించుటయెగాక "పెక్కు-భాష" లఁ గలిపి యొక పద్యమునఁ గూడ స్తుతించియున్నాఁడు.

ఈతఁ డంత్యనీమయుక్తముగ వ్రాసిన పద్యములు శత కారంభమున మిక్కుటము. ఈ శతకమే పోతన్న యంత్యనీ మములకు సర్వేశ్వరశతకముతో పాటు భిక్ష పెట్టియుండ వచ్చును.

ఆర్య వితానవర్య భువనాధికశౌర్య యుదాత్తసత్ప్రథా
చార్య యవార్యవీర్య బుధ సన్నుత చర్య విశేషభక్తితా
త్పర్య వివేకధుర్య పరిపాలితచార్య శరణ్యమయ్య దు
ర్వారయనూనధైర్య బసవా॥

వినుత నవీనగాన గుణవిశ్రుతభక్తివిధేయకాయ య
త్యనుపమగణ్యపుణ్య నయనాంచల దూరభవోపతాప స
ద్వినయవికాసభాస సముదీర్ణశివైక్యసుఖైకపాక దే
వ నమ భరియింపు మయ్య బసవా॥

ఈ శతకాంతమున నీతఁడు ఫలశ్రుతి నిట్లు చెప్పి యుండెను.

అకుటిలలీల జంగమసమగ్రదయాకలితప్రసాది పా
లుకురికి సోమనాథుఁ డతిలౌల్యమునన్ బసవన్నదండనా
యకునకు నొప్పనీశతక మర్పణఁ జేసె నిదిం బఠించువా (?)
రికి వినువారికిం గలుగు శ్రీయును నాయువు భక్తి ముక్తియున్॥ 108

పాలుకురికి సోమనాథుఁడు గానకళాప్రవీణుఁ డనియు,

స్వరూప మిట్టిదనియు నింక ననేక విశేషము లీక్రింది యాశ్వాసాంత పద్యములవలనఁ దెలిసికొన వీలగుచున్నది.

భృంగిరిటగోత్రసంభవ జంగమలింగార్చనావిశారదవిలస
త్సంగీతశాస్త్రపారగ గంగోత్పత్తిప్రకార కావ్యధురీణా. 3. 451

పి. సోమనాథుని బసవపురాణము.

ఇందువలన సోముఁడు సంగీతశాస్త్రజ్ఞుఁ డనియు, గంగోత్పత్తిరగడ శైవులు సరసకావ్యముగ నెంచువారనియు, బహుశః సోముఁడు తన ద్విపదకావ్యముల సంగీతమునఁ బాడి ప్రజల నాకర్షించియుండుననియుఁ దలంప వీలగుచున్నది.

పాలుకురికి సోమన్న బాహ్యవేషము నీక్రిందిపద్యము తెల్పును.

శ్రీభశితత్రిపుండ్రకపవీతవిశంకటఫాలు జూట జూ
టీభరదారు నిర్మలపటీపటలావృతదేహు నక్షమా
లాభరణాఖిలాంగు బసవాక్షరపాదపవిత్రవస్త్రిఁ జి
చ్ఛోభితచిత్తుఁ బాల్కురికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్.

పాలుకురికి సోమన్న వర్ణనము పిడుపర్తి సోమనాథకవి తన బసవపురాణకృత్యాది నొనర్చియున్నాఁడు.

సీ॥ లిపి లిఖింపకమున్న యపరిమితార్థోక్తి♦ శక్తి యాతనిజిహ్వ జరుగుచుండు
ఛందోధికరణాది సరణి చూడకమున్న ♦ మది నుండుఁ గావ్యనిర్మాణశక్తి
భాష్యసంతతులు చెప్పంగ జూడకమున్న♦ రుద్రభాష్యక్రియారూఢి వెలయుఁ
దర్కశాస్త్రాదివిద్యలు పఠింపకమున్న ♦ పరపక్షనిగ్రహప్రౌఢి వెలయు

తే॥ నతని నుతియింప నాఁబోఁటి కలవి యగునె
జైనమస్తక విన్యస్త శాంతశూల
కలిత బిజ్జలతలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాభిధుండు॥

పాలుకురికి సోమన్న గురువు విశ్వనాథుఁ డనుటకు సాక్ష్యము.

క. ఆతఁడు గురువరకరసం ♦ జాతుండై విశ్వనాథు సన్నిధిఁ గవితా
చాతురి యెఱింగి బసవ ♦ ప్రీతిగ రచియించి నట్టికృతు లెవ్వియనన్॥ 126

ఓరుగల్లులో బసవపురాణపఠనము నాక్షేపించినవారిని జయించి, శిష్యులకు డొంకిప ట్టగ్రహార మిప్పించి తాను కన్నడమునకు పోయినట్లు బసవపురాణమునందే యున్నది. ఈతఁడు గంగ గోదావరి చెంగటనున్న పాల్కురికిలో సమాధి రచించుకొని సిద్ధినొందెను. ఇతఁడు యతి (1. 79.) నవ్య వ్యాసుఁడు (1. 186.) ఇతఁడు తన గ్రంథమున 'ఆతత బసవ పురాతన భక్తగీతార్థసమితియె మాతృక గాఁగ' బసవపురాణము వ్రాసితి నని కృత్యాదినిఁ జెప్పుకొనెను.

పాలుకురికి సోమనాథుని గ్రంథములలో నత్యద్భుత మైన విషయము లున్నవి. మతవిషయము లక్కఱలేనివారికి దేశ, భాషా, వాఙ్మయ, సాంఘిక, రాజకీయ విషయము లెన్నియో తెలిసికొన వీలగుచున్నది. కాని యీతని కావ్యము లింతవఱ కంతగాఁ జదివిన పరిశోధకులు కనఁబడరు. బసవ పురాణకృతిపతి యగు గొబ్బూరి సంగనామాత్యుని గూర్చి కాని, అనుభవసారకృతిపతి యగు గోడగి నారయాఖ్యు

(త్రిపురారి)ని గూర్చికాని మనకు వివరములు తెలిపినవారు లేరు. పాలుకురికి సోమనాథుని గురువు విశ్వేశుఁ డని సోమన్నయే వ్రాసిన యీ క్రింది పద్యభాగముల వలనఁ గూడ దెలియఁగలదు.

ఈ విశ్వేశుఁడే బెలిదేవి వేమనారాధ్యుల మనుమఁడై యుండును.

"కుశలున్ విశ్వేశు విమలగురుహారు శరణున్" 1

అనుభవసారము.

"విమలచిత్తవృత్తి విశ్వేశువరమూర్తి, వినయవర్తి భువనద వినుతకీర్తి
విభు కరస్థలంబు విశ్వేశుకారుణ్య, జనిత వినుత కావ్య శక్తియుతుఁడు"
"చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ" 2

అనుభవసారము.

వరకృపాంచిత కవిత్వ స్ఫూర్తిఁ బేర్చి"

బసవపురాణము గద్య. 3

ఈ నడుమ ననేక వివాదములకుఁ గారణ మైన "రేవఁడు" శబ్ద మీా విధముగ ననుభవసారమునం దున్నది.

క. వంటని దుర్వ్యసనంబుల ♦ పెంటకుఁ గా కీశుభక్తి వెరవునకుంగా
కుంటఁ జెడు భక్తివాసన ♦ రెంటికి నెడతాకి చెడ్డ రేవనిభంగిన్.

ఈ సామెతనే తరువాత వా రనుకరించినట్లు తోఁచుచున్నది.

సుమతిశతకమున కనుకరణమో, లేదా యీతనినే సుమతి శతకకర్త యనుకరించెనో చెప్పలేము కాని యట్టి భాగము లీతని గ్రంథముల నున్నవి.

"కలనాఁడె ధనము ప్రాయము
గలనాఁడె జవంబు బలము కలనాఁడె విని
శ్చలమతియు గతియుఁ దనకున్
గలనాఁడె భజింపవలయుఁ గరుణానిలయున్"

అనుభవసారము.

ఈ పద్యము ననేకాంధ్రకవు లనుకరించుచువచ్చిరి. సోమనాథుని గ్రంథము లన్నియుఁ జదివిన నిట్టి వైచిత్ర్యము లెన్నియో తెలియఁ గలవు.

ఈ క్రిందిపద్యమును వేమన్న యనుకరించె ననవచ్చును.

క. అడుగమి నిచ్చుట యుత్తము
మడిగినయెడ నీఁగిణయొస్న నగు మధ్యము మ
ట్లడిగిన మెయ్యి (య్యా?) రపులగా
నిడుటయె యధమంబు భక్తియొదఁ ద్రిపురారీ.

అనుభవసారము.

ఆ. అడుగ కర్థ మిచ్చు నతఁడు బ్రహ్మజ్ఞాని
అడుగ నర్థ మిచ్చు నతఁడు త్యాగి
అడుగ నియ్య లేని యాతఁడె పెనులోభి
విశ్వదాభిరామ వినుర వేమ||

వేమనపద్యములు

తిక్కనకంటెఁ బూర్వుఁడైన సోమనాథుని యనుభవసారము నందు షష్ఠ్యంతము లున్నవి. కావునఁ గవుల చరిత్రము తిక్కనయే మొదట షష్ఠ్యంతములు వ్రాసె నని స్థాపించి, యాస్థాపనమునకు సరిపడని చాముండికావిలాసాదుల షష్ఠ్యంతముల నెపమునఁ గల్పితగ్రంథము లనినమాటలు నిలు

చుట లేదు. నేను చూచినకొలఁది నీ కవిగ్రంథము లెన్నియో విశేషములతో నున్నట్లు కనుగొంటిని. పరిశోధకు లీక నైన నీతని యితరగ్రంథములు శ్రద్ధతోఁ బఠింపవలసియున్నది. ఈతని పండితారాధ్యచరిత్రకృత్యాదిని "ప్రాసోపాయ తిగ్గా" యనుటవలన నితని నాఁటికే తెలుఁగుఛందోగ్రంథము లున్నట్లు తెలియఁగలదు.

ఈతన కించుమించుగా సమకాలికుఁ డని తలంచు చున్న నన్నెచోడుఁడేకాక బద్దెన్నకూడ నీతని పద్యముల వంటివి వ్రాసెను. నన్నెచోడ బద్దెన్నల కాల మింకను సంశయాస్పదము లగుట నెవ్వ రెవ్వరి ననుకరించిరో తెలియదు.

క॥ "బలిమికిఁ బాడి, తపంబున
కలుగమి సిరి కోర్పు, విద్య కభిమానము, వా
గ్బలమునకు బొంకు వోరయమి
కులమున కాచార మెప్పుఁ గొమరుర భీమా॥ లోకనీతి. 5

క॥ హీనునకు బలిమి, పరా
ధీనునకు సుఖంబు దుర్మతికి రిపుజయము, మ
జ్ఞానికిఁ బరమును, నలిగెడు
వానికి సైరణ యసంభవము బద్దినృపా॥" లోకనీతి. 6
బద్దినీతులు.

వీనినిఁ బోలియున్న సోమనాథుని పద్యములు.

క॥ "సురవడికిఁ జెలిమి; భక్తికిఁ
బరిచర్య, కృతార్థమతికి భయమును; వ్రతత

త్వరత కచలనమును; దగస
చ్చరితకు నిస్పృహాయు; నొప్పు సద్భక్తినిధీ॥ 48

క॥ వలవునకుఁ దలఁపు; నేతకు
నలయమి; పలుకులకు వినయ; మారాధన క
గ్గలమగు సన్మానము; మతి
కలమికి వినికియును; నొప్పు కరుణాంబునిధీ॥ 49

అనుభవసారము.

ఇట్లే నన్నెచోడుని కుమారసంభవమునం దోరయూరి పురవర్ణనమునందలి "కలోఁడికూఁతలు, కలొప్పన్నవిరులు" మున్నగు సమానాంశము లున్నవి.

"ఈతఁ డారాధ్యచరిత్రము, బసవపురాణము, అన్యవాదకోలాహలము, బసవనపంచగద్య, సద్గురురగడ, చెన్నబసవరగడ, శరణుబసవరగడ, వీనిని కల్పించి సకల వేదాగమ పురాణవాక్యముల నుంచి యిరువదియైదు ప్రకరణములుగ సోమనాథభాష్యమునందు సంగ్రహించి ప్రకటించెను." అని భైరవేశ్వరకావ్యము కథాసూత్రరత్నాకరము నందున్నది.

"జ్యోతిర్మయశాంభవీజ్ఞాన దీక్షాబోధయొక్క పరమ రహస్యార్థమును" సంగయ్య అనే శరణునికి 160 వచనములలో సంగ్రహముచేసి ఉపదేశ మొనర్చెను. ఇవియేకాక యీతఁడు శీలసంపాదనము, సోమేశ్వరశతకము, సహస్రగణ నామము, అను గ్రంథములుకూడ వ్రాసియుండెను. పైనఁ జెప్పిన గ్రంథములలో ఆరాధ్యచరిత్రము, బసవపురాణమును

తెలుఁగు; అన్యవాదకోలాహలము, బసవన్న పంచగద్య, సోమనాథభాష్యము, యివి సంస్కృతము. పంచగద్యలలో నచ్చటచ్చట కన్నడ కందపద్యము లున్నవి. తక్కిన రగడలు, వచనములు. శీలసంపాదనము, సోమేశ్వరశతకము, సహస్రగణనామము కన్నడభాషలో వ్రాసెను.

ఈతనికి తత్త్వవిద్యాకలాప, కవికాసార, అన్యవాద కోలాహళ, ప్రత్యక్షభృంగీశావతార మొదలగు బిరుదులు కలవు. ఇతఁడు బసవనికిఁ బిమ్మట 30 సంవత్సరములలో నుండెను. కర్ణాటకభాషలో సోమనాథుఁడు వ్రాసిన గ్రంథము లిప్పటికిఁ జిక్కుచున్నవి.'' అను విషయములు కర్ణాటక కవి చరిత్రిలో వ్రాసియున్నారు.

---

# బద్దెన

బద్దెన వ్రాసిన నీతిసారముక్తావళిలో నీతఁడు తన్నుఁ దానే యీ క్రిందనామముల సంబోధించుకొనినాఁడు. (1) బద్ది భూపతీ (2) బద్దన (3) కీర్తినారాయణుఁడా (4) ఉదారవైరోచనుఁడా (5) బద్దెనరేంద్రా (6) రాజమనోజభూభుజా (7) నరేంద్రచతురాననుఁడా (8) వివేకచతురాననుఁడా (9) కార్యచతుర్ముఖా (10) నన్నెచోడనరేంద్రా (11) దశ

దిశాభరణాంకా (12) పరపక్షభైరవా (13) నన్నగంధవారణా (14) వివేకభూషణా (15) రాజరాజమనోజా (16)కొమరభీమ. ఇందుఁ గొన్ని కేవల గుణవాచకములు, బిరుదులు నై యున్నవి. ఇవియన్నియుఁ గవిపరముగఁ జెప్పుకొనినవే! కొంద ఱివి పరులను సంబోధించె ననవచ్చును గాని కవి కొన్ని తన్ను, కొన్ని యితరులను సంబోధించి గ్రంథము వ్రాయువాఁడుక లేదు. అట్టి సంప్రదాయము మృగ్యము. ఈ బిరుదులలోఁ గీర్తినారాయణాదు లొరయూరుపురాధీశు లగు చోడవంశజుల కున్నట్లు నిదర్శనము లున్నవి. ఈ విష్ణుభక్తుఁ డగు కవి, శివభక్తుఁడగు కుమారసంభవకర్త కాఁడు. వీరిరువురు చోడులు, సూర్యవంశజులు. సుమతిశతకము వ్రాసితి నని బద్దెన చెప్పినట్లు మానవల్లిరామకృష్ణకవిగా రుదాహరించిన పద్యములో "శ్రీవిభుఁడ" నను పదము రాజుపరముగ నర్థము చెప్పవచ్చును గాని "లక్ష్మీవల్లభపదపద్మారాధకుఁ" డగు కవి యిట్లు "లక్ష్మికి మగఁడ" నని స్ఫురించునట్లు వ్రాసికొనునా?

రుద్రదేవుఁడు వ్రాసిన నీతిసారమునందు బద్దెన పద్యము లుండుటచే బద్దెన క్రీ॥ శ॥ 1150 లో నున్న రుద్రదేవునకుఁ బూర్వుఁ డనుచున్నారు. భువనైకమల్లునికి సామంతుఁడగు భద్రభూపాలుఁడు (బద్దెన?) 12 వ శతాబ్దమువాఁడని శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగా రాంధ్రులచరిత్రమున వ్రాసిరి. కాకతీయరుద్రమదేవి సామంతుఁడుగా క్రీ॥శ॥ 1261 సం॥ర

మునఁ జిన్నరాజ్యమును బాలించిన బద్దెన యంతపూర్వుఁడు కాఁడని శ్రీజయంతి రామయ్యపంతులుగారు వ్రాసిరి. వీరు స్ప్యాయులు పట్టిక ననుసరించి మూలము తెప్పించి ప్రకటించిన శాసనములో నున్న "వీరనారాయణచోడబద్దిగదేవరాజు" మన బద్దెన యని శ్రీరామయ్యపంతులుగారి యూహ. బద్దెన గ్రంథమునందున్న 16 బిరుదులలో నొక్కటియైన శాసనమునఁ గనఁబడదు. కేవలము బద్దెన నామమునుబట్టియే కాలనిర్ణయము చేయవలసినచో శక్తివర్మశాసనము నందొక బద్దెన కలఁడు. కావున నీతనికాలము సందేహముగనే యున్నది. "శ్రీవిభుఁడ"అను పద్యము బద్దెనదేయైనచో నట్టి శతకము మఱియొకటి యుండునా? సుమతిశతకపు వ్రాఁతప్రతుల నింకను బరిశీలింపవలసియున్నది.

సుమతిశతక మాబాలగోపాలమునకుఁ బఠనీయమై చిరకాలమునుండి యాంధ్రదేశమున రాజ్యము చేయుచున్నది. ముద్రణ మారంభమైనది మొదల లాంధ్రమున నిది యెన్ని వేలప్రతు లందినదో చెప్పుటకు వీలులేదు. ఇంతప్రచారము గల యీశతకకర్తృత్వ మింతవఱకు మనకుఁ దెలియదు. పోనిం డిది యేకాలమునందుఁ బుట్టినదో కూడఁ దెలియదు. కొన్ని లక్షణగ్రంథములలో సుమతిశతకము భీమకవికృత మని యుదాహరణము లిచ్చిరి. అట్లుదాహరించిన పద్యము లొకటి రెండు నేను పోల్చి చూడఁగా నా కవి ప్రస్తుత సుమతిశతకమునందుఁ గాన్పింపలేదు. ఒకటి చూపెదను.

"క. కాదన్న వాఁడె కరణము
వా దడచినవాఁడె పేడి వసుధేశుకడన్
లే దన్న వాఁడె చనవరి
గాథలు పెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ||"

ఈ లక్షణగ్రంథ మెప్పటిదో తెలియదు. కాని యీ పద్యము భీమన్నగారి సుమతిశతకము లోని దని "దథ" లకుఁ బ్రాసమైత్రికలదని చూపుట కీయఁబడినది. (పరిషత్పత్రిక సంపుటము 6, పుట 456 చూడుడు) ఈ పద్యము ప్రస్తుత సుమతిశతకమున లేదు. ఈ భీమన్నగారినే వేములవాడ భీమకవి యని మనవా రీ శతకకర్తృత్వ మాతని దని యుండి యుండవచ్చును. ఈతఁడే భీమన్నయైనను సుమతిశతక మీాతనిది వేఱని తోఁచుచున్నది.

సుమతి యను జైనముని యొకఁడు కలఁడు. "వేమా!" యని "కవిచౌడప్పా!" యని తమకుఁ దాము సంబోధించు కొను కవులవలె 'సుమతి' యను జైనముని దీనిని రచించి యుండు నేమో యని యొకప్పుడు నేను సందేహించితిని. కాని యది సత్యమైనట్లు నిదర్శనములు లేవు.

ఇట్లు భీమన్న, జైనమునికర్తృత్వము లీ సుమతిశతక మునుండి తొలఁగిపోఁగా నిఁక నిది కర్తలేని శతక మనవలసి వచ్చుచున్నది. ఇట్లుండగా నీ నడుమ శ్రీ మానవల్లి రామ కృష్ణకవిగారు తాము వెలువరించిన నీతిశాస్త్రముక్తావళి (?) లో నీక్రింది పద్యమును బ్రకటించిరి. ఈ పద్యమైన వారికి

దొరకిన యాగ్రంథము ప్రతు లైదారింట నొక దానియందు మాత్ర మున్నదఁట. పద్యము వినుడు.

"క. శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధ జయలక్ష్మీ సం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించిన ప్రోడఁ గార్యకమలాసనుఁడన్"

ఈ నీతిశాస్త్రముక్తావళియే "నీతిసారముక్తావళి" యని ఇంకొక ప్రతిలోనుంట నిది యాంధ్రపరిశోధకమహామండలి వారు ప్రకటించియున్నారు. శ్రీకవిగారి గ్రంథమునందుఁ బ్రకరణవిభాగము లేదు. పాఠములు మాఱియున్నవి. ఆ రెండు గ్రంథములు పోల్చిచూచినవారికి వివరములు తెలియఁగలవు. ఈ గ్రంథమును వ్రాసినవాఁడు 'బద్దెన' యను చోడుఁడు. ఇతఁడు నన్నెచోడుడని నామాంతరము వాడుకొనెను. ఇదిగాక పెక్కుబిరుదులు కలరాజు, సూర్యవంశజుఁడు, కుమారసంభవము వ్రాసిన నన్నెచోడుఁ డీతఁడు కాఁడు. అతఁడు శివభక్తుఁడు. ఇతఁడు విష్ణుభక్తుఁడు.

మాకు దొరికిన ప్రతియందు పై రామకృష్ణకవిగారి పద్యము లేదు. కావున నతఁడు సుమతిశతకము వ్రాసెనా? లేదా? యనునది పరిశీలనార్హము. రెండుగ్రంథములను దగ్గఱఁబెట్టుకొని పరిశీలించినచో భాషయందు, పాకమునందు, శైలియందును, మిక్కిలిగ వ్యత్యాసము కనఁబడుచున్నది.

రెండు గ్రంథములు నేకకర్తృత్వము లనుటకు వీలుకనఁబడదు. ఐనను సుమతిశతకము బాల్యకృతమనియో, బాలురకొఱకు నుపయోగింపవలె ననియట్లు, సులభముగ వ్రాసెననియో, తలంపవచ్చు ననుకొందమన్న నాసందేహమునకును బ్రత్యవాయములు లేకపోలేదు. అవి విచారించెదము గాక!

## కాలనిర్ణయము.

బద్దెన క్రీ॥ శ॥ 1070 సం॥ రము వాఁడని శ్రీ కవిగారి యభిప్రాయము. శ్రీ జయంతి రామయ్యపంతులవారి యభిప్రాయానుసార మీతఁడు క్రీ॥ శ॥ 1261 స నున్నవాఁడు. ఈ రెండు వాదములును సందేహాస్పదములే గాని సునిశ్చితములు కావు. శ్రీ రామయ్యపంతులుగారు "వీరనారాయణ చోడబద్దిగ దేవరాజులే" మన బద్దెన యందురు. ఆతని శాసనము ననుసరించి ఈతని కాలనిర్ణయ మొనర్చిరి. ఆతఁడు నీతఁడు నొక్కఁడే యనుట కాధారములు లేవు. ఐనను పైసంగతి విచార్యము. కేవలము నామమునుబట్టియే నిరువు రొక్కటి యనవచ్చు ననిన శక్తివర్మ పభుపట్టుశాసనములో "బద్దెమశ్చ మహారాజోమద్యానో బలిణే" యని యొక బద్దెన్నను చేర్కొనియున్నారు. ఈ శాసనము క్రీ॥ శ॥ 1003—1015 లోనిది. ఈ బద్దెన యాతఁ డేల కాఁగూడదు? మన బద్దెన "కీర్తినారాయణుఁడా!" అని సంబోధించుకొని నాఁడు కాని వీరనారాయణుఁడ నని జెప్పుకొనలేదు. కీర్తినారాయణుఁడు

దేవుఁడుకూడ నున్నట్లు తెలియుచున్నది. కావున బద్దెనకాల మింక ననిశ్చిత మనియే చెప్పవలసియున్నది.

ఇది బాలురకొఱ కుద్దేశించె ననుటకును గొన్ని యాటంకములు కనఁబడుచున్నవి. సుమతిశతకము నందలి యీక్రింది వాక్యములు బాలురకొఱ కుద్దేశించె ననఁ జాలము.

(1) "పాలయలుక నాఁటి కూటమి-"
(2) "చేడెల యధరామృతంబుఁ జెందని నోరున్"

పద్యసంఖ్య - 25. "కడు బలవంతుం డైనను"
,, - 38. "ఎక్కువ చదువులు చదివిన"
,, - 54. "తలమాసిన నొలుమాసిన"
,, - 95. "వెలయాలి వలనఁ గూరిమి."

మొదలగు పద్యములు బాలురకొఱ కుద్దేశించినట్లు కనఁబడదు. పైఁగా బద్దెన నీతులపద్య మొకటి యిట్లున్నది. "బాలబోధకరుఁ" కావున నెద్ది బాలబోధ కని యనుమానము కలుగుచున్నది. ఈ పద్య మన్ని ప్రతులలోఁ గనఁబడదు. అర్థమును జింత్యము.

కావున శ్రీకవిగారు సుమతిశతకమును బద్దెన వ్రాసె ననువాదము రెండువిధముల సందేహాస్పద మగుచున్నది. భాషయు, శైలియు, విపరీతమగు భేదమును బొందుట యొకటి, సుమతిశతక కాలనిర్ణయమును, బద్దెన కాలనిర్ణయమును సుల

భముకాకపోవుట రెండవది. ఐనను స్థూలముగ బద్దెనకాలము నిర్ణయమైనట్లే, సుమతిశతకము నందలి మాటలనుబట్టి దాని కాలనిర్ణయ మొనర్పఁ బ్రయత్నించి చూతము. వేఱాధారములు లేనప్పు డీ క్రింది మార్గముకంటె నన్యము కనఁబడదు. కాలనిర్ణయమునకు పీఠమైన తులికపదము లెవ్వియు నిందు నేఁ జూచినంతవఱకుఁ గనఁబడలేదు. ఇతర సాధనములకుఁ బ్రయత్నింతము. మనము చూడఁబోవునట్టి యాధారములు స్థూలవిభాగమునకు వీలగునా యనుసందేహముతో — నాశతోఁ — జేయుప్రయత్నములే కాని యివి సిద్ధాంతములు కాఁజాలవనియు, సిద్ధాంతీకరింప నీవ్యాసకర్త యభిలాషము కాదనియు, సత్యనిర్ణయమున కొనర్చు సత్ప్రయత్నము లనియు సహృదయు లెఱుఁగకపోరు. ఈ క్రింది వెట్టిప్రయత్నములకు నవ్వకుండుటకై పై యుపోద్ఘాత మవసరమైనది.

(1) శతకమునందుఁ బద్యము లకారాదిగ వ్రాసియున్నాఁడు. ఇట్టినియమము శతకవాఙ్మయ మభివృద్ధియైన పిమ్మటనైనఁ గావచ్చును. ప్రారంభమున నిందున్న నియమ మెఱుఁగక తరువాతవారు విడిచియుండవచ్చును. ఇట్టి నియమము కనఁబడుచున్న భాస్కర, వేణుగోపాలశతకములు 15వ శతాబ్దమునకుఁ బూర్వపువైనట్లు తోఁచదు. కావున నీ నియమమువలననే యిది ప్రాచీనశతక మనుటకు వీలులేదు. ప్రాచీనపద్యములవలె నిందు ప్రాసలోఁగూడ నఱసున్న పాటించియున్న పద్యము లగుపడుచున్నవి. కావున నీ రెండు నియమ

ములవలన నిది ప్రాచీనశతక మైనఁ గావచ్చును. ఇందు దాధునిక మని చెప్పుటకు వీలైన పదజాలము లేక పోవుటకూడ దీని ప్రాచీనతకే సాయపడుచున్నది.

(2) ఇందు పెక్కుచోట్ల "ఒకయూరికి నొక కరణము" (22) "కరణము కరణము నమ్మిన" (29) " కరణము సాదై యున్నను" (31) అని కరణము పదము చాలమారు లుపయోగించినాఁడు. "కరణము" సంస్కృతశబ్దము. కరిణీకములు, కరణములు నెప్పటినుండి యుండెడివారో తెలియు సాధనము లున్నచో నీశతక మప్పటికిఁ బిమ్మటి దనవచ్చును. ప్రాచీనప్రబంధములలో "గణకవిద్య" యని కరిణీకమును గూర్చి కాఁబోలు మంత్రికులమువారినిఁగూర్చి వ్రాసినట్లు కొన్నినిదర్శనములు చూపవచ్చును. కాని గణకుని కరణ మనిపిలుచుట యెప్పు డారంభమయ్యెనో తెలియదు. ఈ శతకమునందే మఱియొక చోట నీ క్రిందిపద్యమున్నది.

క. నరపతులు మేరఁ దప్పిన। దిర మొప్పఁగ విధవ యింటఁ దీర్పరి యైనన్।
గరణము వైదికుఁ డైనను। మరణాంతక మౌనుగాని మానదు సుమతీ. 62

ఇట్లు వైదికుఁడు కరణ మైన మరణాంతక మగు ననుటయు, చాలపద్యములలో "కరణములను" పొగడుటయు "మంత్రి లేని మండలాధిపతి తొండము లేని యేనుఁగువంటివాఁ"డనియు - 84, "కాఁపు కొండె మయిన కరణాలకు బ్రతుకు లే" దనియు-81, "మంత్రి గలవాని రాజ్యము తంత్రము చెడకుండ

నిలుచు" ననియు - 85, నియోగులపైఁ బ్రీతి కనఁబఱచు టయుఁ జూడ నీ శతకకర్త మంత్రికులమువాఁడుకాని, తత్ప్రియుఁడుకాని కావచ్చునని తోఁచుచున్నది. ఈ పై పద్యములన్నింటియందును సత్యముంట నివి కేవల మితరకవికూడఁ జెప్పి యుండవచ్చును. వైదికుఁడు కరణము కారా దను నీతి సరియైనను కాకపోయినను, భావము లట్టివి గోపరాజు రామప్రధానికిఁ బిమ్మట రావలెను. రామప్రధానికథ సత్యమైనచో నాతనికాలము క్రీ॥ శ॥ 1185 అగుచున్నట్లు కొన్ని నిదర్శనములు కనఁబడుచున్నవి. (చూడుఁడు. శ్లోకములు, చాటుపద్యమణిమంజరి ) " గోత్రశాస్త్రింబరేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే" మొదట విప్రులనుండి వేఱుపడి యాఱువేలమంది నియోగులు కరణికవృత్తిలోఁ బ్రవేశించి, నియోగిశాఖ వేఱుపడిన పిమ్మటఁ గొంతకాలమునకు. గదా వైదికుఁడు కరణీకమునకుఁ బనికిరాఁ డనుమాట పుట్టవలసినది. కావున నీమాట వ్రాసిన సుమతిశతకము 12వ శతాబ్దమునకుఁ జాలతరువాత కావలసియున్నట్లు తోఁచుచున్నది.

(3) ఇందు "కాఁపు" శబ్దముకూడ రెండు మూఁడు సార్లుపయోగించియున్నాఁడు. "కాఁపు" శబ్దమునకుఁ బ్రస్తుతము కేవలము "తెలఁగా" యని, శూద్రుఁడని యర్థమున్నను "కాఁపు కరణము" లని పూర్వము వాడుకలో నుండెను. అనఁగాఁ బ్రస్తుతము "మునసబు కరణము" లను నట్లే కొంతకాలమునకుఁ బూర్వము "కాఁపు కరణము"

లనుట కలదు. తురుక ప్రభుత్వములో "మునసబు" అనుపదము మనకు వచ్చినది. "మున్సిఫ్" అనివాడుటయుఁ గలదు. కావునఁ దురుక ప్రభుత్వమునకుఁ బూర్వము "మునసబు" పదమునకు మాఱుగా 'కాఁపు' శబ్దము వాడియుందురు. కాపు ననే యీ క్రింది పామరపదమునం దాసత్యము వెల్లడియగుచున్నది. తగవులాడిన భార్య భర్త ననుచున్నది.

"కాఁపూ కరణం నాపట్టయితే? ఏలా కొడతావు కొట్టర! మగఁడ!"

ఇటులఁ గాఁపుశబ్దము గ్రామాధికారి పరమని స్పష్టము. మునసబులు కొండెకాఁడ్రయిన వనియే యీ క్రిందిపద్యమునందలి 'కాఁపు' శబ్దమున కర్థము తీయవలసినట్లు తోఁచుచున్నది.

క. పొరుగునఁ బగవా డుండిన
నిరవొందగ వ్రాతకాఁడె యేలిక యైనన్
ధర గాఁపు కొండె యైనను
కరణాలకు బ్రతుకు లేదు గదరా సుమతీ. 81

ఇప్పటికిని గ్రామపరిపాలనమునందు మునసబు కరణము లైకమత్యము చెడినచోఁ గరణమునకు వచ్చు కష్టములు వేఱుఁగ నిర్వచింపనక్కరలేదు. అనగా గ్రామాధికారి యగు మునసబునకు వ్యతిరేకముగఁ గరణము దుష్టుడయ్యు నేమియుఁ జేయఁజాలఁడు. పూర్వము పెత్తన దార్లను కాఁపు లుండుటయు, వారికిఁ గరణము బాసటయై, లెక్కలు వ్రాసి, సాయపడుటయు, గ్రామపాలనము సుఖముగ నుండి ప్రభు

త్వము సాగుటయు మనపెద్దలు చెప్పుదురు. కావునఁ బ్రస్తు తము "మునసబు" పదము గ్రామాధికారికి నాడిన తుఱక ప్రభుత్వమునకుఁ బూర్వ మీశతకము వ్రాసి యుండవలసినట్లు కనఁబడుచున్నది. అనఁగా స్థూలముగ 12, 15 వ శతాబ్దముల నడుమ నిది పుట్టి యుండవచ్చును. బద్దెనకూడ 12, 13 వ శతాబ్దములవాఁడని కొందఱనుచున్నారు. కావున వ్యతిరేక నిదర్శనములు లేనంతవఱకు బద్దెన దీనికర్తయని శ్రీకవిగారి పద్యానుసారము నమ్మవలసివచ్చుచున్నది. స్థితిగతు లీవిధ ముగ సందేహాస్పదముగ నుండఁగ నీనడుమ నొక విచిత్రవిష యము కనఁబడినది. అది శ్రీకవిగారి సిద్ధాంతమును బలపఱ చునది. కావున వారివాదమును ఖండించుట కింతకంటెఁ బ్రబలవాదము మానవలసివచ్చినది. విజ్ఞులుకూడఁ బరికించె దరుగాక!

## కర్తృత్వము సరియా?

ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారము నెం.1679 వ తాటియాకు గ్రంథములోఁ బ్రసిద్ధ మగు నీ క్రింది సుమతి శతకపద్య మిట్లున్నది.

(1) సుమతిశతకమునం దున్నవిధము.

"పతికడకుఁ దన్నుఁ గూర్చిన । సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల । మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ. 67

(1) పరిషత్తువారి తాటియాకుప్రతిలో నొకచోట

"సుతుకడకు తన్నుఁగూర్చిన । సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
మతియుతులు రిత్తచేతుల । పతికడకుం బోవఁజనదు బద్దనరేంద్రా!

ప్రసిద్ధమైన సుమతిశతకపద్య మిట్లీప్రాచీన లేఖకుఁ డేల మార్చెనో - బద్దెనీతులలోవలె నీ సంబోధన ముండుటకుఁ గారణమేమో - తెలియుటలేదు. ఈ తాటియాకుల వ్రాఁత వలన శ్రీకవిగారేగాక సుమతిశతకము బద్దెన దనువారు ప్రాచీనులుకూడఁ గలరని నిర్ణయమై దీనివలన శ్రీకవిగారి వాదము కొంచెము బలమగుచున్నది. నే నిదివఱ కొనర్చిన వ్యతిరేకవాద మీకారణమున నిట వివరింపక మానితిని. ఇప్పటికిని చాలవఱకు సందేహముగనే యున్న యీవాదము సాధనాంతరములచేఁ దేలునని తలంచెదము.

(4) ఇంకొక పద్యమును వినుఁడు.

(1) "క. నమ్మకు సుంకరి జూదరి। నమ్మకు మగసాలివాని నటు వెలయాలిన్"
(2) "వెలయాలు సేయు బాసలు వెలయంగ నగసాలి పొందు వెలమల చెలిమి యున్"

ఇట్లు కంసాలిని, వెలయాలిని, వెలమలను, గర్హించి యున్నాఁడు. ఈ జాతుల గర్హించిన దాని యందలి సత్యాసత్యములతోఁ బ్రస్తుతము మనకు నిమిత్తములేదు. ఒక్కరి యనుభవముచేఁగాని, యనేకుల యనుభవముచేఁ గాని యొక జాతి నొకరు గర్హించుట యేరికిని దగదు. ఐనను బ్రస్తుతము మన కావిమర్శనముతో నిమిత్తములేదు.

(5) కంసాలురు 12 వ శతాబ్దమునకుఁ బూర్వము గజపతి రాజ్యమున కరణములుగా నుండినట్లు గోపరాజు రామన్న కథ నుడువుచున్నది. కావునఁ గంసాలురయం దనిష్టముకూడఁ దరువాతనే కలిగినదా? ఇట్టి స్థూలసందేహములతోఁ గవికా లనిర్ణయము సూక్ష్మముగఁ గానిమాట సత్యమేకాని బుద్ధి మంతుల కిట్టి దృష్టితోఁ బరిశీలన మొనర్చినప్పుడు మంచి నిదర్శనములు పొడఁగట్టిన తెలియఁజేసి సత్యనిర్ణయమునకుఁ దోడ్పడుదు రని వ్రాసియున్నాను.

ఇతర విషయములు.

సుమతిశతకము నీతులనిధి. భాష, శైలి, పాకము, నతి మృదు మధురము లనుటకంటె నధికముగఁ జెప్పవలసినది లేదు! పద్య ము తేటతెల్లముగ నుండి, వేమన పద్యమువలె, నరఁటిపండు వలె విడిపోయి, పండిత పామరజనైకవేద్యముగ నుండును.

ఇట్టి మహాశతకమునందును స్వల్పముగ దోషములు కనఁబడుచున్నవి.

(1) అనవసర పదములు.

"గట్టిగ ద్రవ్యంబు గలుగఁ గదరా సుమతీ॥" 44

మిక్కిలి బిగువుగ నుండు సుమతిశతకములో నొక్క పదమైనఁ దీయుటకు వీలుండదు. అట్టియెడ నొకటి రెండు కొఱసు లుండిన నవి లేఖకదోషములై యుండనోపును.

(2) వ్యాకరణదోషములు.

"నారే నరులకు రత్నము" 65

"మెచ్చునదె నేర్పు వాదుకు"

నారియే యనఁగా వనితయే యని కవి యభిప్రాయము. ఇట్టివి ప్రౌఢప్రయోగములుగ స్వీకరింపవలసినది లేనిది భాషా తత్త్వవేత్తలు నిర్ణయించెదరుగాక !

శతకమునందుఁ గవి చాలచోట్ల వేశ్యలను, స్త్రీలను గర్హించి యున్నాఁడు. వేశ్యాగర్హణ మేకాలమునందును గోరఁదగినదే కాని, "కులకాంతపై వట్టితప్పు ఘటియించిన సిరియుండ" దని మనల భయపెట్టిన యీతఁడే స్త్రీలను నమ్మ రాదని, స్త్రీలకు రహస్యములు చెప్పవలదని, కోమలికి విశ్వాసము సున్న యని చెప్పినమాటలు నవనాగరకులకుఁ గష్టముగ నుండునని తోఁచుచున్నది. ఇందలి సంసారానుభవములు, బంధుగులు, మిత్రులు, రాజులు, మంత్రులు, రసికులు, వీరికి సంబంధించి చెప్పిన విషయములు కవి లోకానుభవమును, దూరదృష్టిని మనకు వెల్లడించి కవి ప్రతిభాశాలి యని తోఁపింపఁజేయుచున్నవి.

ఈ కవి కొన్నిపద్యములు కేవలము సంస్కృతశ్లోకముల ననుసరించి వ్రాసియున్నాఁడు. ఒండు రెం డుదాహరణముల నిచ్చెదను.

(1) స్త్రీధర్మములలో "శ్లో॥ కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ" అను శ్లోకమునకుఁ దెలుఁగుసేఁత.

కం. పని సేయు నెడల దాసియు
నునుభవమున రంభ మంత్రి యాలోచనలం
దన భుక్తియెడలఁ దల్లియు
ననఁ దన కులకాంత యుండ నగురా సుమతీ. 68

## (2) భర్తృహరి శ్లోకములకుఁ దెలుఁగు సేఁతలు.

కం. పాలను గలసిన జలమును
బాలవిధంబుననె యుండుఁ బరికింపంగాఁ
బాల చవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁ డగు వాని పొందు వలదుర సుమతీ.॥ 75

‘‘యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితమ్ స్తోకంమహద్వాధనమ్’’ అను శ్లోకమునకుఁ దెలుఁగు.

కం. పెట్టిన దినములలోపల
నట్టడవుల కైన వచ్చు నానార్థములుం
బెట్టని దినములఁ గనకపు
గట్టెక్కిన నేమి లేదు గదరా సుమతీ॥ 80

‘‘మేరౌచనాతోధికమ్’’ అనువఱకుఁ గడపటి పాదమునఁ దెచ్చినాఁడు. ‘‘కూపే పశ్య పయోనిధా’’ మొదలుత్తరార్థము కందపద్యములో నిముడకఁ గాఁబోలు విడిచినాఁడు.

## కొన్ని పదముల ప్రయోగ విశేషము.

‘‘లావొక్కింతయు లేదు’’ పోతన్నగారు ‘బల’ మను నర్థమున వాడిరి. ఈ కవి ‘‘లావుగలవానికంటెను భావింపఁగ నీతిపరుఁడు బలవంతుఁ డగు’’ నని వ్రాసినాఁడు. గంజాము

విశాఖపురి మండలములలో, 'లావు' అనుశబ్దము "అధిక" మను నర్థమున వాడెదరు. "తీపి మాలావుగా వుంది" అనఁగా నధికముగా నున్నదని. ఈ శబ్దమును బట్టి కవిమండలము నిర్ణయ మగునా ?

కం. వీడెము సేయని నోరును
జేడెల సుగుణములు మెచ్చి చెప్పని నోరున్ (?)
పాడంగ రాని నోరును
బూడిద కిరవైన పాడు బొందర సుమతీ॥ 94

ఈ 'బొంద' శబ్దము దూష్యార్థమున గుంటూరు కృష్ణామండలములలో వాడెదరు. "ఏందిరా? నీబొంద!" అని వాడుక. ఈ శబ్దమును బట్టి కవిజన్మస్థాన మూహింప నగునా ?

వరిపంట లేని యూరు రుద్రభూమినంటి దని నిందించుచునాఁ డీతఁడు గుంటూరు మొదలైన మెట్టసీమల వాఁడు కాఁజాలఁ డన నగునా?

ఈ క్రింద రెండు పద్యములును మనవారు వినోదముగఁ జదివి సంతసించి మన ప్రభువుల జీవితములతోఁ బోల్చుకొందురుగాక!

క. మేలెంచని మాలిన్యుని
మాలను నగసాలివాని మంగలి హితుఁగా
నేలిన నరపతి రాజ్యము
నేలఁగలసిపోవుఁ గాని నెగడదు సుమతీ. 99.

క. కేశరపుజాతి గానీ
వీసము దాఁజేయనట్టి వ్యర్థుఁడు గానీ
దాసికొడు కైనఁ గానీ
కాసులు గలవాఁడె రాజు గదరా సుమతీ. 103.

కవిరాజు రాజుకంటె నధికుఁ డనుట కీతఁడు రాజుల గోటమీటు వ్రాఁతలే నిదర్శనములు. కవికిఁ గావలసినది సత్యముకాని ధనము కాదు. సత్యప్రియుఁడగు సుమతిశతక కర్త సేవ నాశక్తికొలఁది యాతని గ్రంథపఠనముచే నొనరించు కొంటిని. చదివినప్పుడు నాకుఁ దట్టిన యభిప్రాయముల వెల్లడించితిని. ఇందు నాయభిప్రాయములలో దోషము లున్నచో నా యపాండిత్యమే వెల్లడికావలెఁగాని యాంధ్రులకుఁ బూజ్యపదార్థ మగు శతకమునకు గౌరవము తగ్గదు. సుమతిశతకము నందలి నీతుల నాంధ్రబాలురు బాలికలు పెద్దలుకూడఁ జదివి, యాచరించి ధన్యు లగుచున్నారు. కాఁగలరు.

క. "పలుదోమి సేయు విడియము
తలఁగడిగిన నాఁటి నిద్ర తరుణుల యెడలం
బొలయల్క నాఁటి కూటమి
వెలయింతని చెప్పరాదు వినురా సుమతీ॥

ఈ సుమతిశతకము శ్రీరామస్తుతితో నారంభ మగుటచేతను, విప్రులఁ బూజ్యార్థమున వాడినందునను దీని కర్తృత్వము జైనమునిది కాదని శ్రీ బండారు తమ్మయ్యగారు వ్రాసియున్నారు. వా రట్లువ్రాయుటకుఁ బూర్వమే నేను

జైనముని దని యనుమానించినది సత్యము కాలేదని పత్రికలోఁ బ్రకటించియుంటిని. ఇప్పటికైన నీతిసారముక్తావళి, సుమతిశతకములఁ జక్కఁగఁ జదివినవారవి యేక కర్తృత్వము లని యంగీకరింపఁజాలరు. ఐనను వ్యతిరేకసాక్ష్యము లేనంత వఱకు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి పద్యము ననుసరించి బద్దెనయే దీనికర్త యని తలంచు చుందుముగాక!

శ్రీతమ్మయ్యగారే వ్రాసిన యీ క్రిందిసంగతుల వలనఁ బాలుకురికి సోమనాథుని గ్రంథమునందు సుమతిశతక ఛాయలు కనఁబడుచున్నవి. సత్యమే కాని యవి యెవరినుండి యెవ్వరు గ్రహించిరో చెప్పఁజాలము. సోమనాథుని గ్రంథములలో శివతత్త్వసారము, కుమారసంభవము మున్నగు గ్రంథభాగములు పెక్కు లుదాహృతములై యున్నవి. కావున శతకకర్తనే సోమనాథుఁ డనుకరించె నని యేల యనరాదు?

"ఈ బద్దెభూపాలుఁడు క్రీ॥శ॥ 1251 ప్రాంతమువాఁడని కొన్ని శాసనములవలనఁ జరిత్రజ్ఞులు తేల్చియున్నారు. ఇందులకు మఱియొక దృష్టాంతముగూడఁ గలదు. ఈ కవిగూడఁ దన కించుమించుగ సమకాలికు లయిన నన్నెచోడ తిక్కనాది కవులవలెనే జాతీయకవితా నిర్మాణశేఖరుఁ డగు పాలుకురికి సోమనాథుని గ్రంథములను జదివి యాతని ననుకరించినాఁడు. మచ్చునకీ క్రింది దృష్టాంతమును జూడుఁడు.

ద్వి. నల్లవో భామల యుల్లం బెఱుఁగక । గొల్లఁవాడైనను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి । నొల్లని చెలిఁబాయ నొల్లఁడేనియును
గొల్లఁడు వాఁడెగా కెల్లకు జాతిగొల్లఁడు గొల్లండె గొల్లడేనియును।
(పాల్కురికి సోముని పండితారాధ్యచరిత్రము, ప్రకరణము 2)

క. ఒల్లనిసతి నొల్లనిపతి । నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే
గొల్లండు గాక ధరలో । గొల్లండును గొల్లఁడౌనె గుణమున సుమతీ.

పాలుకురికి సోమనాథుఁడు క్రీ. శ. 1192 ప్రాంతమువాఁడు. బద్దెభూపాలుఁ డాతని తరువాత రమారమి డెబ్బది సంవత్సరములకు వెలసినవాఁడు. కావున సుమతిశతక మిప్పటి కాఱువందల యేఁబది యేండ్లకుఁ బూర్వము రచింపఁబడి అప్పటినుండి ప్రచారములో నున్నట్లు తెంచవచ్చును.” బం.తే. ఆంధ్రపత్రిక. సారస్వతానుబంధము.

బద్దెనకాల మిదివఱకు నిశ్చితము కాలేదు. ఆ సంగతి పైన వివరించియున్నాను. సోమన్న పెద్దగ్రంథములు వ్రాయ వలసినవాఁడు. చిన్నశతకముకొఱకు సుమతిశతకకర్త యీ యనుకరణ మొనరించి యుండెనని సిద్ధాంతీకరించుట పునాదిలేనిగోడపై బొమ్మవేయుటవంటిది. కావున నీ శతక చారిత్ర మింకను గర్త, కాలము విషయములలోఁ జర్చింప వలసియున్న దని మామిత్రులకు మనవిచేయుచున్నాను.

అంతవఱకు సుమతిశతకమును సోమన యనుకరించెనో, సోమన్నను సుమతిశతకకర్త యనుకరించెనో నిర్ణయించుట సాధ్యముకాదు.

సుమతిశతకము నందొక పద్య మిట్లున్నది.

క. కొంకోక మెల్లఁ జదివిన । చక్కనివాఁ డైన రాజచంద్రుం డైనన్
మిక్కిలి రొక్కము లీయక । చిక్కదురా వారకాంత సిద్ధము సుమతీ॥
४० (వావిళ్ళ).

పై పద్యమునందున్న “కొంకోకము” శబ్దమువలనఁ గొందఱీశతకము 15వ శతాబ్దప్రాంతముల నున్న ఎఱ్ఱయ

కవి రతిశాస్త్రమునకుఁ బిమ్మట వ్రాసె నందురు కాని, కొక్కోకము సంస్కృతమునందు నుంట నిది సిద్ధాంతము కానేరదు. ఈ వ్యాస మిట్లు ముగించిన పిమ్మట కొన్ని లిఖితశతకములమూలములఁ బరిశీలించుచుండ నొకప్రతిలో గ్రంథాదినీ క్రిందిపద్యము కనఁబడినది.

" శ్రీకరముగ భీమన మును । లోకమునకు పొగడఁగా విలోకించి మదిన్(?)
ప్రాకటముగ సుమతికి మతి । చేకూడఁగ సుమతినీతి చెప్పఁదొడంగెన్।"
(11-4-27 ఓ. లై. తాటియాకుప్రతి.)

ఇందు 97 పద్యములు మాత్ర మున్నవి. ఇందు సుమతిశతకము భీమనకృత మనియుంటను, కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున వేములవాడ భీమకవి సుమతిశతక మనుటను, దీనికర్త భీమన్నయేనా యని సందేహము కలుగుచున్నది. బద్దెనకు "భీమా!" యను బిరుదము కలదు. పండితు లింకను జర్చింతురుగాక! శైలి కిదివఱకే పద్యములు కొన్ని యుంట నిఁక మానెదను.

---

.(?) మాతృక:— * గడ గాదిలో సెంచి మనెన్॥

# యథావాక్కుల అన్నమయ్య

ఈతఁడు ప్రసిద్ధ శైవకవి. ఈతఁడు సర్వేశ్వర శతకమను శివభక్తి ప్రతిపాదకమైన శతకమును రచియించి యున్నాఁడు. ఈతని వంశావళినిఁ గూర్చి యీక్రింది వివరములు పరిషత్తువారు సంపాదించి తాము ప్రకటించిన సర్వేశ్వరశతకము పీఠికలోఁ బ్రకటించియున్నారు.

"ఈ కవి వీరశైవుఁడు. కవిని గుఱించియు, శతకరచనమును గుఱించియు, పల్నాడు (గురజాల) తాలూకాలోని చెర్లగుడిపాడు గ్రామమునకుఁ గరణ మయిన సోమరాజు వేంకటశివుఁ డను నాయన వ్రాసియుంచిన వృత్తాంతము శేషగిరిరావుగారి వలన మాకు లభించినది. దానిలోని ముఖ్యాంశముల నీక్రిందఁ బొందుపఱచుచున్నారము.

"యథావాక్కుల అన్నమారాధ్యుఁ డాత్రేయసగోత్రోద్భవుఁడు. యజుశ్శాఖాధ్యాయి. గోదావరీతీరవాసి. రాజమహేంద్రవరమునకు సమీపమున నున్న పట్టిసమను గ్రామమందు వెలసిన వీరభద్రేశ్వరస్వామి యీయనకు నిలువేలుపు. ఈ మహనీయుఁ డొకప్పుడు శ్రీశైలయాత్రకు వెడలి శ్రీమల్లికార్జునస్వామిని సేవించి తిరిగివచ్చుచుఁ బల్నాడుతాలూకాలోఁ జెట్టిపాలెము దాపునఁ గృష్ణాతీరమందు విశ్వామిత్రాశ్రమ మనఁబడు సత్రశాల యను పుణ్యస్థలమున శ్రీమల్లికేశ్వరస్వామిని సేవించుచుఁ గొంతకాల ముండి యచ్చటనే యీ సర్వేశ్వరశతకమును రచించెను. ఒక్కొక్క పద్య మొకొక్క తాటియాకుపై వ్రాసి యా యాకును గృష్ణలో వైచి యది ప్రవాహమునకెదురీఁది వచ్చెనా దానినిఁ దీసి సూత్రమున నెక్కించెను. అట్లేయైన గాక క్రిందికిఁ గొట్టుకొనిపోయెనా యప్పుడే నాశిరము ఖండించుకొనియెద నని శపథము చేసి మెడకు గండకత్తెర వైచుకొని యాకుల మీఁదఁ బద్యముల వ్రాసి నీళ్ళలో విడిచిపెట్టఁగా నవి తిరిగి వచ్చుచుండినవి. కొంతసేపటికి —

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హరి మీపాదపయోజపూజితములై యత్యద్భుతం బివ్విధుల్
కరులో నశ్వములో ననర్ఘమణులోఁ గర్పూరమో హారమో
తరుణీరత్నములోఁ బటీరతరులోఁ దథ్యంబు సర్వేశ్వరా. 87

ఆపద్య మెదురుగా రాక కొట్టుకొనిపోవుటఁ జూచి కంఠమును గత్తిరించుకొనుట కుద్యమించుచుండఁగా నొకపసులకాఁపరి "నాకొకతాటి యాకు దొరికినది చూడుఁ"డని యిచ్చి యదృశ్యుఁ డయ్యెను. కవి యా యాకును జూడఁగా దానిపైఁ దాను వ్రాసిన పద్యమునకు మాఱుగా వేఱొక పద్యముండుటఁ జూచి యిది సర్వేశ్వరకృత మని గ్రహించి యాపద్యమును సూత్రమున కెక్కించి తాఁ జేసికొన్న నియమము ప్రకారముననే శతకమును బూర్తి చేసి కొంతకాలమునకుఁ బిదప నా పత్రిశాలయందే సిద్ధిఁబొందెను. (ఆపద్యమిది)

"ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబులే దన్నఁ బా
యక కాలత్రితయోపచారముల ని న్నర్చించుచోఁ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా॥ 88

ఈ యన్నమారాధ్యునికొడుకు వీరంరాజు, వీరంరాజు కుమారుఁడు నాగరాజు, నాగరాజు తనయుఁడు చిట్టెమరాజు. ఈయన పల్నాటిసీమకు వచ్చి యచ్చట చెర్లగుడిపాడు, మిరియాల, పల్లిగుంత, పశ్వేముల, వద్దిరేల, సీతానగరము నను నాఱు గ్రామములకుఁ గరిణీకము సంపాదించెను. అప్పటి నుండియు నీవంశమువారు పల్నాటిసీమవాసులైరి. చిట్టెమరాజు కొడుకు గోప రాజు, గోపరాజు కొడుకు సోమరాజు. ఈ సోమరాజు సుప్రసిద్ధుఁడై యుండు టచే నాతని నాఁటినుండి యావంశమునకు యాఝావాక్షులవా రను పేరు మాఱి సోమరాజువా రను పేరు గలిగినది. ఇప్పటికి నిదియే వాడుకలో నున్నది."

ఇది సోమరాజు వేంకటశివుఁడుగారు వ్రాసినదానికి సంగ్రహము. తాను పెద్దలవలన వినినదానిని వ్రాసినానని వేంకటశివుఁడుగారు వ్రాసినారు. ఈయన వ్రాసినదానినిఁబట్టి "యన్నమయ్యగారి వంశావళి" యను గ్రంథ మొకటి యున్నట్లు కనఁబడుచున్నది. దానిలోని వని వేంకటశివుఁడుగారు

వ్రాసిన పద్యములఁగొన్నిఁటి నుదాహరించుచున్నారము. తప్పుల తడికెలుగా నున్నవి.

గీ॥ ధర యథావాక్కులాన్వయు ల్తత్త్వవిదులు
వారిలో నొక్క సద్గుణుం డమితయశుఁడు
అన్నమారాధ్యుఁ డనియెడు నార్యనుతుని
వంశవృద్ధిని వర్ణింతు వరుసతోడ॥

ఉ॥ శ్రీమదనంతసద్గుణ సుశీలుఁడు నాత్మవిహారహారుఁడున్
ఆమదనాంతకాంఘ్రియుగళామృతపానరతాంతరంగుఁడున్
సోమధరాక్షిమత్పరమసుందర తేజవిరాజమానుఁడుం
గామనివారకుం డఖిలకారణుఁ డన్నమరాధ్యుఁడో యనన్॥

క. ఆ యన్నమరాధ్యుండును, స్వాయంభుసమానసర్వశాస్త్రవిదుం
డా యమరేశుపదాధిపు, పాయక వేదాంతవేదపారాయణుఁడున్॥

ఉ॥ శ్రీలుఁడు ధర్మమార్గపరిశీలుఁడు ఖండితమోహవల్లికా
జాలుఁడు సత్కృపాలుఁడు ప్రసంగవిశాలుఁడు ధర్మసత్క్రియా
లోలుఁడు చిట్టిమంత్రి చెరులోగుడిపాడును పిల్లిగుంత మి
ర్యాలయు పశ్వేముల మీరాసిగఁ జేకొనె మూఁడుసీమలన్॥

గీ॥ సాగరాబ్ధియు పావకసోమసంఖ్య*
శాలివాహనశకమున జరుగువేళ
గ్రామపట్కంబు చేకొనెఁ గరణకంబు
చిట్టైనామాత్యఘనునకు స్వార్జితంబు॥

సీ॥ శ్రీమ దుమాదేవి చిత్తాబ్జభృంగమా సితకంఠుభక్తిని సిద్ధకీర్తి
సతతంబు బగళాది సన్మంత్ర జపితుఁడై నిగమాగమాంతాది నిరతుఁడగుచుఁ
జిత్తంబు గురుపాద సేవను హత్తించి నిర్మలానందుఁడై నేర్పుమీఱఁ
దన పేరు లోకమందునఁ బ్రశస్తంబుగా నాచంద్రతారార్క మగుచు
వెలయు

* 4431 = 1344 శా॥ శ॥

గీ॥ నార్యజనులను బ్రోచుచు నధికప్రీతి
రాజయోగాను సంధాన రసికుఁ డగుచుఁ
బుణ్యచరితుండు గోపనపుత్రుఁ డెలమి
సోమరాజను సుగుణాభిరాముఁ డగుచు॥

గీ॥ సోమరాజు కీర్తికాముఁడై విలసిల్లెఁ
దనదుసంలతికిని ధరణియందు
గోపనార్యసుతుఁడు గృహనామధేయుఁడై
పెంపుఁబడసెఁ బ్రస్తుతింప జనులు.

మ. అజరుద్రాదులు మిమ్ము దెంగి నుతిసేయన్లేరు నే నెంతవాఁ
డ జగద్రక్షణదక్షు నిన్నుఁ గొనియాడ న్నీస్వభావంబు వా
సజనానుగ్రహనిశ్చితంబగుట నాజన్మంబు సాఫల్యమం
ద జడుం డంచు నిరాకరింపక ప్రసన్నుండౌట సర్వేశ్వరా.

ఈ సర్వేశ్వరశతకము వీరశైవమతసంప్రదాయానుసారము. భక్తి రసప్రధానము. శైలిహృద్యము, ధార యనర్గళము, చదువువాని కేపాటి నాచ కత యున్నను జాలును; తమంతఁదాము దొరలిపోవును. పద్యరచనాశిల్పమున కిది ముఖ్యలక్షణము.** పద్యముల నడకను బట్టియుఁ గల్పనములఁబట్టియు నీ శతకము కొన్నిచోటులందు సంస్కృతములోని శివమహిమ్నస్తోత్రమును, కన్నడములోని సోమేశ్వరశతకమును, తెలుఁగులోని కాళహస్తీశ్వర శతకమును దలంపునకుఁ దెచ్చునది. బహువిధముల నీ పుస్తకము సకలాంధ్రజన పఠనయోగ్యమని మా యభిప్రాయము.”(సర్వేశ్వరశతక పీఠిక -2-4 పుటలు)

ఈ శతకము శైవులలో మిక్కిలి వాడుకగ నుండె ననుట కీతని యనుకరించిన పోతన నారాయణశతకము, ధూర్జటి కాళహస్తీశ్వరశతకమును జూపవచ్చును. కొన్నిపద్యములు పోలికలు కనఁబడును.

ఈ శతకము క్రీ॥ శ॥ 1884 సం॥రమునందే చెన్నపురి

శ్రీశైవసిద్ధాంతముద్రాక్షరశాలయందు ముద్రించిరి. సాధారణసంవత్సరములో శ్రీశివధర్మవర్ధనీ రామలింగేశ్వరముద్రాలయము, వరంగల్లులో మఱియొకమారి ముద్రించిరి. ప్రాఁతప్రతుల సాయమునఁ బైపీఠికతోఁ బరిష్కృత్తువా రీ యుత్తమశతకమును జక్కఁగ ముద్రించి కృతకృత్యులైరి. ఈ మూఁడుప్రతులును వావిళ్ళవారిప్రతినిఁ గూడ నేను సంపాదించి రెండు మూఁడు లిఖితప్రతులఁ గూడఁ జూచి దీనినిఁ బరిశీలించితిని.

ఈ కవి తన శతకాంతమునఁ జెప్పిన యీరెండుపద్యములలోఁ దన వివరములను, శతకరచనాకాలమును వివరించి యున్నాఁడు.

"శాకాబ్దంబులు వార్ధి షట్కపురభిత్సంఖ్యం బ్రవర్తింప శు
శ్లోకానందకరంబుగాఁగ మహిలో శోభిల్లు సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె శుభకృత్ప్రవ్యక్తవర్షంబునన్
శ్రీకారారవసంతమై మహిమతోఁ జెన్నొంద సర్వేశ్వరా॥ 127

ధాత్రిన్ భక్తజనానురంజనముగా తత్త్వప్రకాశంబుగా
చిత్రార్థాంచిత శబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాన్వితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రంబన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా॥ 129

138 పద్యమునందుఁ గూడ నిట్లే స్వవిషయ మున్నది.

పూర్వప్రతులకంటెఁ బరిష్కృత్ప్రతిలో రెండుపద్యము లెక్కువ యున్నవి. పద్యములవరుస మారియున్నది. నేను పరిష్కృత్ప్రతి ననుసరించి పైనఁ బద్యసంఖ్య నుంచితిని.

శైలికి, భక్తికి, మంచిభావములకు, తరువాతశతకము లకు భిక్షముపెట్టి, మన వృత్తశతక నిర్మాణమునందు మంచి మార్గముల నడపించుట కీ శతకము చాలముఖ్యమయినది. దీని నాకాలమునందలి శైవులు మాత్రమేగాక, వైష్ణవభక్తి శతకములు వ్రాసినవారుకూడఁ జదివియుందురు. తనకాలము తానే చెప్పుకొనిన శతకకవులలో నీతఁడు ప్రథముఁడు. శైవాగమములేగాక శాస్త్రములుగూడ నెఱిఁగిన పండితుఁడు. ప్రౌఢశతకములలో వృషాధిపశతకమునకుఁ బిమ్మట నిది ప్రధానమైనది. ఇతఁడు పూర్వకవుల ననుకరించె ననుట కీతఁడు శివతత్త్వసారాదులనుండి గ్రహించిన భావములు చూపవచ్చును.

ఇతఁడు వ్రాసిన శతకమునుండి కొన్నిపద్యములఁ జూపి యీతని చరిత్ర మింతతో ముగించెదను.

మ. సతివేడ్కన్ దనప్రాణవల్లభునితో సంయోగ మాసించుఁగా
కతనిం బ్రార్థన సేసి సొమ్ముఁగొని పోనట్లౌనె తత్కాంక్షలో
క్షితి నీభక్తియ వేడుఁగాక మఱి నీ శ్రీపాదముల్గొల్చి సం
చిత కామ్యార్థము లొంద వేడుకొను నే చింతింప సర్వేశ్వరా॥ 45

మ. భ్రమరధ్యానముదాల్చి కీటకము సద్యఃప్రాప్తి సంయుక్తిగా
భ్రమరంబై ఖగవీధి నాడుఁగని నిష్ఠాభావించి నిష్ఠాత్మ నై
య్యముతో ధ్యానముసేయు మర్త్యుఁడును నీయట్లే పరంజ్యోతిస
త్త్వమునం దవ్యయలీలనుండు టరుదే తర్కింప సర్వేశ్వరా. 46

దీనినే దాశరథీశతకకర్త 100 వ పద్యముగా ననుకరించెను.

శా॥ ఎచ్చోట్ నీ పద భక్తుఁడుండు మది నింపెక్కం బ్రియత్నంబుతో
నచ్చో నీ వనిశంబునుండుదు త్వదీయధ్యాన చిన్మూర్తులై
యచ్చో సన్మును లెల్ల నుండుదురు మంత్రాంగాక్షరాయుక్తులై
యచ్చో తీర్థములెల్ల నుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా: 54

ఈ పద్యమును. 117వ పద్య మగు "శా॥ ఏ దేశంబున నేదిశాముఖమునం" అను పద్యమును శివతత్త్వసారము నందలి 207 పద్యమున కనుకరణములు.

మ. భవదాకార మెఱాంచు నీ స్తవకదంబ శ్రేష్ఠ సద్వాక్యముల్
చెవులారన్వినఁ నిన్నె చెప్పుమది దుశ్శీలేంద్రియాటోప దు
ర్వ్యవసాయాత్ములఁ గాంచుచో వినెడిచో వర్ణించుచోఁ జీవనుం
జెవిటి న్మూకయునై చరించు మహానీ శీలుండు సర్వేశ్వరా. 50

మ. బలవంతుండును దుర్బలుఁడును మహాప్రౌఢుండు మూఢుండునున్
గులజుండుం గులహీనజాతుడు ఘనక్రూరుండు శాంతాతి ని
శ్చలచిత్తుండును నొక్కరూప మది నీసద్భక్తి చిత్తంబు లో
పల వర్తించిన మీఁద నేవిభమునన్ భావింప సర్వేశ్వరా. 61

ఈ పద్యము శివతత్త్వసారము 126, 134, 191, 192 పద్యముల కనుకరణము.

మ. అతి వాఙ్జాలమునై యజాండనిలయంబై యాదిమధ్యాంత వ
ర్జిత రూపాధిక నిష్కలంకపదమై సిద్ధాంతమధ్యాత్మ సం
యుతమై కోటి రవిప్రకాశయుతమై యోంకారమంత్రాది సం
స్తుతమై యేచి యచింత్యమై నెగడు నీ సూక్ష్మంబు సర్వేశ్వరా॥104

దీనినే పోతన నారాయణశతకమున "ధరసింహాస నమై" యిత్యాదిపద్యముల ననుకరించెనా?

ఈతఁడు తనగురువు నీవిధముగఁ బేర్కొనెను.

మ॥ అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర
ప్రభుకారుణ్య వసంతసంజనిత సద్భావప్రసూనావళి
న్విభవంబొప్పఁగఁ గూర్చియొంతయు లసద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవంబైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా. 128

దూదికొండ సోమేశ్వరారాధ్యులీతనిగురువు. ఈతఁడు క్రీ॥ శ॥ 1241లో నున్నవాఁడగుటఁ దిక్కన సోమయాజి కాలమువాఁడు. ఈతని శతకము భక్తిరసప్రవాహము; అనేక శతకములకు మాతృక!

---

# శివదేవమంత్రి

ఇతఁడు కాకతిగణపతి దేవునికడను రుద్రమదేవికడను మంత్రిగా నుండిన పరమశైవుఁడు, మహాభక్తుఁడు, పండితుఁడే గాక యీతఁడు కొన్ని గ్రంథములఁగూడ రచియించి నట్లు తెలియుచున్నది. శ్రీమానవల్లి రామకృష్ణకవిగా రీతఁడు పురుషార్థసారము రచియించినట్లు వ్రాయుటయేగాక త్రిపురాంతకోదాహరణముపీఠికలో 11 వ పుటలో నే క్రింది పద్యము శివదేవయ్యశతకములోని దని యుదాహరించియు న్నారు. ఇంతకంటె వేఱాధారములేదు.

చ. అరయఁగఁ జిన్ననాఁట సిరియాలుఁడనై యెలఁబ్రాయమందు సుం
దరుఁడను నంబినై పదనుదప్పిన గుండయగారి చందనై
ధరఁ జరియింపఁ గల్గినఁ దథాస్తు వృథాపరిపాకరూపదు
ష్కరజననం బిదేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ!

ఈ పద్యము శివదేవయ్య నుద్దేశించి మఱియొకకవి వ్రాసిన శతకములోనిదో, శివదేవయ్య వేమనాదులవలెఁ దనకుఁ దానే సంబోధించుకొనెనో తెలియదు.

ఈతనిఁగూర్చి శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులు గారు వారి యాంధ్రులచరిత్రము మధ్యయుగము 251 పుటలో నిట్లు వ్రాసియున్నారు.

"విశ్వేశ్వరశివదేశికులు:- వేదవేదాంతార్థము లెఱింగిన జ్ఞానసంపన్నుఁడని ఖ్యాతిఁగాంచిన యీ శివయోగి శైవగురుపరంపరలోనివాఁడు. కాకతిగణపతిదేవచక్రవర్తికి గురువును మహాప్రధానియునై రాజకీయార్థిక సాంఘికవిషయంబులఁ దగు నాలోచనములం జెప్పుచు రాజ్యతంత్రమును నడపించుచు నాచక్రవర్తియౌన్నత్యమున కంతకుఁ గారణభూతుఁ డయ్యెను. ఆంధ్రదేశములోఁ బ్రఖ్యాతిగాంచిన శ్రీగోసఁగి, శ్రీశైలము, శ్రీపుష్పగిరి మొదలగు శైవమఠముల కెల్ల నధికారిగ నుండి శ్రీకాకతిగణపతిదేవచక్రవర్తిచే శైవమతము నాంధ్రదేశమున వ్యాపింపఁజేసిన గురుమల్లికార్జునపండితారాధ్యులవారి తరువాత నితఁడు సుప్రసిద్ధిఁగాంచెను. సోమదేవరాజీయాది గ్రంథములలో గణపతిదేవుని సచివాగ్రణి యని పేరెన్నిక గాంచిన శివదేవయ్య యను నాతఁ డీ విశ్వేశ్వరశివదేశికులే యని చెప్పవచ్చును. ఇతఁడు గానియెడల నితనివలెఁ బ్రసిద్ధిగాంచినట్టి యితనికుమారుఁడగు పరిపూర్ణశివ మహామునియై యుండవలయును గాని యన్యులు మాత్రము గారు. విశ్వేశ్వరశివదేశికులే శివదేవయ్య యని నా యభిప్రాయము. వీర లిరువుర దానశాసనములు భట్టిప్రోలు, త్రిపురాంతకము మొదలగుప్రదేశములఁ గానంబడుచున్నవి. కాకతిగణపతిదేవచక్రవర్తినిఁ జూడవచ్చిన తిక్కనసోమయాజి,

గీ॥ వసుమతీనాథ యీతఁ డీశ్వరుఁడు గాని
మనుజమాత్రుండు గాఁడు పల్మారు నితని
యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలు ...........॥

అని చెప్పి కొనియాడిన యీ విశ్వేశ్వర శివదేశికులనే రైయుండవల యును గాని యట్టివారు మఱియొక గాయాస్థానమున గనుపట్టరు.”

“కాకతిగణపతిదేవచక్రవర్తి ప్రజారంజకముగఁ బరిపాలనము సేసి సత్కీర్తివడయుటకుఁ గారణభూతుఁ డైనవాఁడు శివదేవయ్య యను నాతని ప్రధానమంత్రియే గాని యన్యుఁడు గాఁడని యిదివఱకే తెలిపియున్నాను. ఈ శివదేవయ్యయను నైయోగికారాధ్యబ్రాహ్మణుఁడు, రాజ్యతంత్రజ్ఞుఁడు మాత్రముగాక పండితకవియుం గూడ నైయుండెను. అతఁ డాంధ్రమున “పురుషార్థసార” మను నీతిగ్రంథమును రచించెను. ఇందలి కవనము మృదు మధురపదఘటితమై యొప్పుచున్న దని తెలుపుటకై రెండుపద్యములను మాత్ర మీదిగువ నుదాహరించుచున్నాను.”— 296 పుట మధ్యయుగము. ఆం. చ.

ఈ పై వాక్యములకు శ్రీవీరభద్రరావుపంతులుగారి కాధారము శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన నీతిశాస్త్రముక్తావళి పీఠికవాక్యములే! కాని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారికైన నీగ్రంథము దొరకలేదు. క్రీ॥ శ॥ 1420 ప్రాంతముల నున్న మడికి సింగన్న “సకలనీతిసమ్మత” మని యొక గ్రంథ మావఱకున్న యనేక రాజనీతి గ్రంథ ముల యందలి పద్యముల నవిూకరించి కూర్చెను. అందుఁ బురుషార్థసారమునుండియుఁ బద్యములఁ దీసికొనెను. కాని నేను చూచిన ప్రతిలో నది శివదేవయ్య కృతమని వ్రాసి నట్లు లేదు. ఆ గ్రంథమును గూర్చి నే నిదివఱకుఁ బ్రకటిం

చిన సంగతులు సాంగము నిచ్చుటఁ జూపుచున్నవి. గ్రంథములలోఁగూడ శివదేవయ్య పురుషార్థసారమునుండి పద్యము లుదాహరించిరఁట !

ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము దుందుభి శ్రావణ శు ౫ శనివారము ప్రకటించినది: —

*“మడికి సింగన:—ఈతని గ్రంథము లీవఱకు (1) జ్ఞానవాసిష్ఠము (2) పద్మపురాణోత్తరభాగము నను రెండుగ్రంథము లెఱుఁగుదుము. ఈతఁడు వ్రాసిన ద్విపద భాగవత దశమస్కంధమును సకలనీతిసమ్మతము నను రెండుగ్రంథముల పేరులు వినుచున్నాము. ద్విపదభాగవతము తంజావూరు పుస్తకశాలయం దున్నది. కొంతకాలము క్రిందట తాము సంపాదించి శ్రీ పిఠాపురము రాజావారి కిచ్చితి మని” యొకరు పత్రికలలోఁ బ్రకటించియున్నట్లు జ్ఞాపకము. ఆ గ్రంథ మింతవఱకు బయటికి రాక లోకము నూరించుచున్నది.

ఇట్లే సకలనీతిసమ్మతమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి కడ నున్న ట్లిదివఱకు వినుచున్నాము. వీరికడ నున్న గ్రంథములు లోకమున కీయక దాఁచిపెట్టుచున్నారని శ్రీ వీరేశలింగముపంతులుఁ గారు గ్రంథస్థ మొనర్చిరి. కాని నేను శ్రీకవిగారి నడుగ వారు నాకు గొంతకాలముక్రిందటఁ

* ఈతని సకలనీతిసమ్మతములోఁ గొన్ని శతకములవంటి గ్రంథము లుంట నీతని చరిత్రసార మిటఁ జూపితిని.

శాస్త్రగ్రంథమును జూపుటయేగాక, యిటీవల దానిప్రతి యొకటి వ్రాయించి కవులచరిత్రమునకు వలసినవివరములఁ దీసికొనుటకుఁ గొన్నిదినములు నాకెఱ విచ్చియున్నారు.

చారిత్రకముగ మన కీగ్రంథ మత్యంతోపయోగకమై నది. మడికి సింగన తనకాలము క్రీ॥ శ॥ 1420 అని తానె వ్రాసి కొనెను. ఈ సకలనీతిసమ్మతము సంకలితగ్రంథము. అనఁగా దనకుఁ బూర్వ మున్న రాజనీతి గ్రంథములనుండి యా యా విషయముల గ్రహించి, వలసినచోట్లఁ దన పద్యములు వ్రాసి పూర్తి చేసినది. నేను వాఙ్మయచరిత్రము వ్రాయునప్పటికి రాజనీతిగ్రంథములు తెనుఁగులో మిక్కిలి తక్కువ యని వ్రాసియుంటిని. కాని యీ సకలనీతిసమ్మతమువలన మనకెన్ని యో విశేషములు తెలియవచ్చుచున్నవి.

క్రీ॥ శ॥ 1420 నాఁటికే "ఆంధ్రభాషాకోవిదు లగు సుకవీంద్ర విరచితంబైన ముద్రామాత్య, పంచతంత్ర, బద్దె భూపాల, చాణక్య, ధౌమ్య, విదుర, ధృతరాష్ట్ర, బలభద్ర, కామందక, గజాంకుశ, నీతిసార, నీతిభూషణ, క్షేమేంద్ర, భోజరాజవిభూషణ, పురుషార్థసార, భారతరామాయణాది మహాకావ్యంబులు, పురాణేతిహాసంబులు, కందనామాత్యనీతి తారావళి, లోకోక్తి, చాటుప్రబంధంబులయందును గల నీతి విశేషంబు లూహించి" తా నీ సకలనీతిసమ్మతమును వ్రాసి నట్లు కవి చెప్పుచున్నాఁడు. దీనినిఁబట్టి యొక్క రాజనీతిపై

మన పూర్వాంధ్రకవు లెన్ని గ్రంథములో వ్రాసి రని తెలియుచున్నది. ఊరక తెలియుట కాదు. ఆ గ్రంథములనుండి పద్యము లనేకము లీగ్రంథమున వ్రాయఁబడి యున్నవి. గ్రంథభాగములఁ గొన్ని ముందుఁ జూపెదను.

## గ్రంథారంభము.

శ్రీమహిళాకటాక్ష తులసీదళ కౌస్తుభరత్న కాంతు లు
ద్దామగతిన్ వెలుంగ విదితంబుగ శక్రధనుస్సమేత మే
ఘామలభాతిఁ బొల్చు సుగుణాఢ్యుఁడు రామగిరీంద్రకేశవ
స్వామి త్రి(లోకనాథుఁడు) ధ్రువంబుగ మత్కృతినాథుఁ డయ్యెడున్॥

దీనినిఁబట్టి గ్రంథము రామగిరీంద్రకేశవునకుఁ గృతి యిచ్చెనని తెలియుచున్నదికదా!

క. సరసకవితావిలాసుఁడ । గురుభారద్వాజ రమ్యగోత్రాబ్ధిసుధా
కిరణాయ్యలార్యతనయుఁడ । హరిదాసుఁడ మడికిసింగయాఖ్యుఁడ ధాత్రిన్.

ఇదివఱకు మనకుఁ దెలిసిన విశేషములకంటె నూతన మిందు లేదు. "హరిదాసుఁడ—విష్ణుభక్తుఁడ" ననునది విశేషము. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు "మడికి" అని యున్న యింటిపేరు మార్చుటకుఁ బ్రయత్నించిన దనవసర మని రూఢియైనది.

## నీతిశాస్త్రప్రశంస.

చ. కరిహయశిక్షలందు నృపకార్యములందును సంధియానసం
గరములయందు వర్తకముఖంబునఁ గర్షకలీల మోక్షత
త్పరుఁ డగుచోట నీతి యను దర్పణముం బరికించి చూడ కే
వెరవునఁ గార్యనిశ్చయ వివేకము దోఁచునె బ్రహ్మకేనియున్.

నీతిఁ దెలియుట రాజున కవశ్య మని, మోక్షసాధన మని చెప్పుటయేగాక యప్పటి మంత్రు లెంత నయకోవిదులో, వా రెట్టి నీతిశాస్త్రగ్రంథముల రచియింపఁజేసిరో, వారి నెట్లు రాజులు నియమించుకొనువారో సింగన్న వ్రాఁతలు ఋజువుచేయుచున్నవి. "ఈధర్మచారిత్రు నేధాత్రిపతియేలు। నాధాత్రిపతి యేలు। నఖిలజగము" అని కందనామాత్యునిఁ గూర్చి చెప్పిన వాక్యమును బట్టియు, కందనామాత్యుని కంకితముగఁ గూర్చిన తారావళిపద్యములను బట్టియు, కాకతిగణపతి యీ మంత్రుల నేలయాదరించెనో తెలిసికొనుట కనువగుచున్నది. నా వాఙ్మయచరిత్రమునందు నే నూహించి వ్రాసిన కొన్ని వాక్యములకు నాకీగ్రంథము ప్రబలసాక్ష్యమై నేను చరిత్రసిద్ధాంతము నొక్కటియైన సరిగ నూహింపగలిఁగితినని నాకు సంతస మొదవించినది.

నారాయణభట్టువంశము 'వానస' వంశ మని మన కిదివఱకుఁ దెలియును. ఇందుఁ గందనామాత్యునిది కూడ వానసవంశమని కవి తెల్పెను.

## గ్రంథసంకలనకారణము

సీ॥ ఆలోలకల్లోల మగు దుగ్ధనిధిఁ దర్చి<br>దేవామృతము తేట దేల్చుపగిది<br>గంధకారుఁడు మున్నుఁ గల వస్తువులు జోకఁ<br>గూర్చి సుగంధంబుఁ గూర్చినట్లు<br>అడవిపువ్వుల తేనె లన్నియు మధుపాళి<br>యట్టలంబుగ జున్నుఁ బెట్టుభంగి

తన నేర్పు మెఱసి వర్తకుఁడు ముత్తెము లీడుఁ
గూర్చి హారంబు తాఁ గూర్చుచ్చుకరణిఁ
గీ॥ గృతుల మునుఁ జెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
కాంచుకంటెను నొకచోటఁ గానఁబడగ
సకలనయశాస్త్రమతములు సంగ్రహించి
గ్రంథ మొనరింతు లోకోపకారముగను॥

ఇట్టి సంకలితగ్రంథము వ్రాయుటలోఁ గవి చౌర్యము చేయక యుదారబుద్ధినే ప్రకటించెను గాని మన కదివఱకు గ్రంథములు నశించుట కీతని గ్రంథ మొకకారణమైన దని చెప్పకతీరదు. అప్పకవీయము పుట్టుటచేఁ గొంతవఱకసంపూర్తిగ నున్న ప్రాచీనలక్షణగ్రంథము లపురూప మైనట్లే, యీసకలనీతిసమ్మతమునం దన్నివిషయములును గల వని యీవిషయము కావలసినవారు దీనినే వ్రాసికొని, తక్కువ విషయము లున్న పూర్వగ్రంథముల వ్రాసికొనరైరి. వ్రాఁత కుఁ బ్రతులు లేక పూర్వగ్రంథములు నశించి వానిచరిత్రము మన కెంతయో నష్టమైనది. గ్రంథవిషయ మిందు మిగిలియుండిన నుండుఁగాక! ఆ పూర్వరాజనీతిగ్రంథములే చిక్కినచోఁ క్రీ॥ శ॥ 1420 కి పూర్వ మున్న పదిమంది మంచి కవులచరిత్రము, కృతిపతులగు రాజులు, మంత్రుల చరిత్రమునుగూడ మనకుఁ జిక్కి యుండెడివి.

ఈ పని చేసినందులకుఁ గవియే యిట్లు విన్నవించుకొనుచున్నాఁడు.

గీ|| అక్రమం బని తలఁపకుఁ డఖిలములును
వర్గవులు చేసి చెప్పిన వరుసతోడఁ
జూచి సకలంబుఁ దెలియుఁడు సుకవులార
చెఱకు దా (?) బొమ్మ కైవంక చేదుగలదు (?)

క. కడవెఁడు దుగ్ధములోపల
దొడిలడ కొణిదెండు సల్లతోడం బడిన (?)
ట్లెడ నెడ నొక్కొకపద్యం
బడరించి మదీయకావ్య మని వ్రాయింతున్||

ఇచ్చట 'వ్రాయింతుఁ' క్రియాప్రయోగము గమనింపఁదగినది. దీనివలన సింగనరచనావిధానము నెఱుకపడఁగలదు.

గ్రంథవిషయములు.

"వ|| అది యెట్లనిన కవిత్వగుణవిశేషంబు, నీతిశాస్త్రప్రశంసయు, రాజ్యాంగప్రధానంబైన దుర్గసంరక్షణంబును, రాజున కవశ్యకర్తవ్యం బగు నాజ్ఞాపాలనంబును, ప్రజాపాలనంబును, బ్రాహ్మణాచారమును (?) దుష్టశిష్టమంత్రపరిశీలనంబును, గణక, పురోహిత, విద్వద్యాచక, జ్యోతిషక, వైద్య, దూత, చార, సేనాపతి, భట, సేవకోత్తమాధమలక్షణంబును, సామ దాన భేద దండ మాయోపేక్షేంద్రజాలికాక్రమంబులను, సంధి విగ్రహ యానాసన ద్వైధీభావంబులును, సప్తవ్యసననిరూపణంబును * * *

ఇట్లే పెక్కువిషయముల వర్గవులుగా విభాగించి, యాయా విషయములపై సంస్కృతాంధ్రకవుల నీతిధర్మములఁ

దెలుఁగులో వ్రాసి యమర్చెను. ఇట్లు చెప్పుట కవి తిరిగి "మాలకరి పుష్పదామము కట్టినట్లు కట్టెద మన్నింపుఁడు. వ్రాయ నేల యని విజ్ఞులు ప్రశ్నింపకుఁ" డని వ్రాసెను.

"గద్య:—ఇది శ్రీ నరసింహప్రసాదలబ్ధకవితావిలాస భారద్వాజస గోత్రాయ్యలార్యపుత్ర సరసగుణధుర్య సింగనార్య ప్రణీతంబైన సకలనీతిస మ్మతంబను ప్రబంధంబునందుఁ * * తృతీయాశ్వాసము."

కవి ప్రతిజ్ఞ చేసిన విషయము లన్నియు ముగింపనందున గ్రంథము కొఱవడియున్నట్లు తోఁచుచున్నది. ఎవ్వరికడ నైనఁ బ్రతియున్న లోకోపకారముగఁ బ్రకటించెదరుగాక! ఇందు 1. నీతిభూషణము. 2. నీతితారావళి 3. నీతిసారము 4. ముద్రామాత్యము 5. పంచతంత్రి (దూబగుంట నారాయణకవిది(?) కాదు.) 6. పురుషార్థసారము 7. కామందకము 8. చారుచర్య మొదలగు గ్రంథములనుండి యేర్చి వ్రాసిన పద్యరాజము లున్నవి.

పురుషార్థసార కృతికర్త శివదేవయ్యయే యని శ్రీకవి గారు చెప్పినట్లు నిర్ధారణమైనచో నాతని గ్రంథభాగము మడికి సింగన సకలనీతిసమ్మతమున మన కించుక దొరకు చున్నది. శైలి కందలి పద్యములు కొన్ని చూపెదను.

క. తనప్రజనుఁ బిదప నిర్భయ
మని యూఱడి తొలఁగిపోయి యహితులఁ గెలుచన్
జనినైనఁ జుట్టముట్టిన
దునుము నృపుం డశ్రమంబు దుర్గబలమునన్॥

క. పుఱ్ఱులుండు పొదల నేనుఁగు
లలఘు గిరీంద్రములనుండు ననిశము సింహం
బులు గుహలనుండుఁ గావున
బలవంతుల కైన దుర్గబల మది వలయున్॥

చ. ధర తృణ కాష్ఠ తైల ఘృత ధాన్య జలాధిక వస్తుపూర్ణమై
గురుతరమై మహాటవులఁ గోటల భూరి గభీర[వాపులన్]
పరివృతమై పరిదీరసులభం బగు దుర్గము గల్గు ధారణీ
శ్వరుఁడు దలంప నెవ్వరిఁ కసాధ్యుఁడు వానికి సాధ్యులే యొరుల్॥

క. పరనృపతులు బుత్తెంచిన
పరవస్తుచయంబు ముట్టవలవదు విష దు
స్తరమంత్రయంత్ర మాయా
పరిశుస్కాస్పదము లగుట పార్థివుఁ డర్థిన్॥

క. ప్రజఁ జెఱచి కూడఁబెట్టిన
నిజధన మది వలయు వ్యయము నిచ్చలుఁ జేయన్
బ్రజయును ధనమును బోలిసిన
భుజబలమున నిలువఁదలమె భూపతి కెందున్॥

క. జనలక్ష్మికి ధనలక్ష్మికి
ననుపమ మగు ధర్మలక్ష్మి కాత్మయ మూలం
బని యాత్మరక్ష మఱువక
జననాథుఁడు సేయవలయు సతతము ప్రీతిన్॥

ఈ కాలమునందే పుట్టిన శివదేవయ్య శతకముగాని, కొంచము పూర్వుఁడైన రుద్రదేవుని నీతిసారముకాని, మఱికి సింగన్న పేరొకొనిన యితరగ్రంథములుకాని ప్రచురము కాలేదు. సింగన గ్రంథమువలనఁ దెలుగులోఁ గాకతీయయుగమున జాళుక్యచోళయుగములలోవలెనే యనేకగ్రంథములు

బయలు దేరి నశించినట్లు తెలియుచున్నది. జైనగ్రంథములు శైవులవలనను, ఆర్యులగ్రంథములు మహమ్మదీయులవలననుఁ గాకతీయయుగమునఁ బుట్టినవి కొన్ని వేలో, లక్షలో నశించి యుండవలెను. ఇప్పటికైన నైజాముమండలము సంపూర్ణముగ గాలించిన లాభ ముండకపోదు.

శివదేవయ్య యారాధ్యబ్రాహ్మణుఁడు. తిక్కనకవికి సమకాలికుఁడు. క్రీ॥ శ॥ 13 వ శతాబ్దములోనివాఁడు. ఈతని గ్రంథములు దొరకువఱకు సీవివరములతోనే మనము సంతృప్తి నొందవలసి యున్నది.

---

## రావిపాటి త్రిపురాంతకుఁడు

ఈతనినే రావిపాటి తిప్పన్న యందురు. ఈతఁడు త్రిపురాంతకోదాహరణము, మదనవిజయము, చంద్రతారావళి, అంబికాశతకము నను తెలుఁగ్రంథములును, ప్రేమాభిరామ మను సంస్కృతనాటకమును, రచియించినట్లు తెలియుచున్నది. మన కిప్పుడు త్రిపురాంతకోదహరణము మాత్రము చిక్కుచున్నది. తక్కిన గ్రంథభాగములు కొన్ని దొరకుచున్నవి.. ప్రేమాభిరామమునే వినుకొండ వల్లభరాయఁడు క్రీడాభిరామ మను వీధిగా భాషాంతరీకరించితి నని

చెప్పియున్నాఁడు. ఈ రావిపాటి తిప్పన్న గ్రంథము లప్రరూపములై పోయి శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి పరిశ్రమమునఁగొన్నియైనఁ జిక్కుచున్నవికాని, భాషాభిజ్ఞులకే కవి కొ్రత్తవాఁడు కాఁడు. అప్పకవీయమునం దీ తిప్పన్న యీ క్రిందిపద్యమును యతిప్రాసప్రకరణమునం దనుస్వారసంబంధయతి కుదాహరణముగ నుదాహరించి యున్నాఁడు.

ఉ॥ సంబేసై రపుడేల భాస్కరులు భాషానాథ పుత్రా వసుం
ధరయం దొక్కఁడు మంత్రియయ్యె వినుకొండ న్రాయనామాత్య భా
స్కరుఁడో యా నయినన్ సహస్రకరశాఖ ల్లే వవే యున్న వే
తిరమై దానము చేయుచో రిపుల హేతిన్ వ్రేయుచో వ్రాయుచోన్।

ఈ పద్యమునకుఁ బాఠభేదముగ "రాయనామాత్య" భాస్కరుఁడని ద్వాత్రింశన్మంత్రులచరిత్రమునం దున్నది. అచ్యుతదేవరాయని కాలమునం దొక రామయభాస్కరుఁడును, నాదెళ్ళ యప్పమంత్రి క్రీ. శ. 1516 లో భర్తపూడి గ్రామ మొక రాయనిభాస్కరుని కిచ్చినట్లున్న శాసనమువలన నింకొక భాస్కరుఁ డాకాలమునందు నున్నట్లును తెలియుచున్నది. కాని యీ రావిపాటి తిప్పన్న పేర్కొనిన భాస్కరుఁడు వీ రిద్దరిలో నెవ్వఁడును కాఁజాలఁడు. ఏమనఁగా? క్రీ. శ. 1420 లో నున్న వినుకొండ వల్లభరాయఁడు రావిపాటి త్రిపురాంతకుని గ్రంథమును భాషాంతరీకరించియుండుటచే నితఁడు వల్లభరాయనికంటెఁ బూర్వుఁడు కావలెను. కావున రావిపాటి తిప్పన్న 1420 కిఁ బూర్వుఁడగు భాస్క

డనే పొగడియుండవలెను. ఈ క్రిందిపద్యమువలన క్రీ. శ. 1386 లోఁ గాటయ వేమారెడ్డికాలమున నొక భాస్కరుఁ డున్నట్లును. ఆతఁడు "దానము, యుద్ధము, వ్రాఁత" లయం దుఁ ప్రసిద్ధుఁడైనట్లును గనఁబడుచున్నది.

చ|| కలయఁ బసిండిగంటమునఁ గాటయ వేము సమక్షమందు స
త్ఫలముగ రాయనిప్రభుని భాస్కరుడు వ్రాసినవ్రాల ప్రోఁతలన్
గలుగలు గల్లుగల్లు రనఁ గంటకమంత్రులగుండె లన్నియున్
జలుజలు జల్లుజల్లు రనె సత్కవివర్యులు మేలు మేలనన్||

ఈ కాటయ వేము సమక్షమం దున్న భాస్కరుఁడు కూడ 'వ్రాఁత' లోఁ బ్రసిద్ధుఁ డగుట నీతఁడే రావిపాటి తిప్పన్న పొగడినవాఁడై యుండు నని శ్రీ వీరేశలింగము పంతులుగారు శ్రీ రామకృష్ణకవిగారి పీఠిక వాక్యానుసార మూహించుచున్నారు. కావున రావిపాటి త్రిపురాంతకుఁడు క్రీ. శ. 1380 ప్రాంతములవాఁ డనుట కంగీకరింప వచ్చును. ఈ రాయనిభాస్కరునే వేమన్నయుఁ బొగడియుండె నని వేమనచరిత్రమువలనఁ దెలియఁగలదు.

ఈ కవి వ్రాసిన త్రిపురాంతకోదాహరణము మృదు మధురమైన శైలిగల మంచికావ్యము. ఉదాహరణములు చాటుకృతులలో నొక విధమైనవి. ఇవి ప్రాచీనకాలమునం దెక్కువ వాడుకలో నున్నట్లు నిదర్శనము లున్నవి. పండితా రాధ్యులు, పాలుకురికి సోమనాథుఁడు, శేషనార్యుఁడు మొద లగువా రుదాహరణముల వ్రాసినట్లు నిదర్శనము లున్నవి.

ప్రాచీను లుదాహరణలక్షణము నిట్లు చెప్పియున్నారు.

సీ॥ ఘాసిల్లు సప్తవిభక్తులందును మఱి సంబోధనంబున సరవిఁగాఁగఁ
బ్రభునామయుతముగాఁ బద్య మొక్కటియును దగఁ జెప్పి రగడ భేదం బులందుఁ
గళికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి తత్పూర్వార్థముల నుత్కళిక లనగఁ
నేకసమాసమై యేడుదళంబులఁ దుద విభక్త్యర్థంబు దోఁపఁ బలుక
గీ। దాని కెనగాఁగఁ జిక్కన దళ మమర్చి
ఫణితు లాడఁగఁబూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టి కడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణం బగు నబ్జనాభ! 3-63.

అనంతునిఛందము.

ఈ లక్షణము ననుసరించియే త్రిపురాంతకాదులు వ్రాసియుందురు. ఈతఁడు త్రిపురాంతకదేవు నుద్దేశించియే యీయుదాహరణము వ్రాసియున్నాఁడు. ఇట్టిగ్రంథములు పూర్వము చాలవాడుకలో నుండినను దరువాత తరువాత నీరూపము ప్రజాభిరుచికి సరిపడక నిలువలేకపోయిన వనవచ్చును. పండితారాధ్యులవా రిట్టిగ్రంథములు వ్రాసి రని పాల్కురికి సోమనాథుఁ డనుచున్నాఁడు.

"శతకంబు శివతత్త్వసారము దీపకళికమహానాటకము నుదాహరణ"
—పర్వత ప్ర. 369.

పాల్కురికి సోమనాథుఁ డుదాహరణములు రెండు వ్రాసినట్లు నిదర్శనము.

సీ। గీ। గద్యపద్యము ల్పంచప్రకారగద్య
యష్టకము పంచకము నుదాహరణయుగ్మ।

సాని యసుకృతుల్భక్తి హితార్థబుద్ధి
జెప్పినవి భక్తసభలలోఁ జెల్లుచుండు॥"
—పి. సో. బసవపురాణ పద్యకావ్యము.

ఇంక నెందరో వ్రాసినవి వ్రాసికొని చదువువారు లేక నశించి యుండవచ్చును.

ఈతని కులగోత్రములు కాని తలిదండ్రులనామములు కాని స్థలము కాని తెలిసికొనుట కాధారములు లేవు. ఈతఁడు వ్రాసిన యంబికాశతకము సంపూర్ణముగఁ జిక్కుటలేదు. చంద్రతారావళి 27 పద్యములు గల చాటుకృతి. మదనవిజయము ప్రబంధమై యుండును. ఒక్కొక్క గ్రంథమునుండి శ్రీమానవల్లి రామకృష్ణకవిగా రుదాహరించినపద్యము లీ క్రిందఁ జూపుచున్నాను. వారి కీ పద్యములు ప్రబంధరత్నాకరమునందే దొరికినవి కాఁబోలును. మదనవిజయము వాత్స్యాయన కామసూత్రములకు దెలుఁగైన రతిశాస్త్రి మని శ్రీకవిగా రనుచున్నారు. * ఉదాహృతమైన పద్యములనుబట్టి యట్లూహించియుందురు. లేదా ఎట్టియ కొక్కోకమునందు రతిశాస్త్రముల రచియించినకవులఁ బొగడుచు చివర "రావిపాటి త్రిపురాంతకాదిశృంగారకవుల నెల్ల గారవించి కళాశాస్త్రసుకవిరాజశ్రేణిఁ వినతిచేసి" అనినవాక్య

* మదనవిజయము 8 ఆశ్వాసముల గ్రంథ మనియు, రతిశాస్త్ర మనియుఁ దా మా గ్రంథము చదివితి మనియు మానవల్లి రామకృష్ణ కవిగారు చెప్పుచున్నారు. ఆ గ్రంథ మెక్క గడియ వారు చూచిరఁట!

ములవలన నిట్లు తీర్మానించియుందురు. (చూడుడు. ఎఱ్ఱయ కళాశాస్త్రము కృత్యాది 4, 5, పద్యములు.)

౧. త్రిపురాంతకోదాహరణము.

ఉ. శ్రీనగ చక్రవర్తి తుదిశృంగము చూచెదనంచు నేటికిం
బో ననిశంబు మానవుల పుట్టువుఁ జావును లేనిమందు నా
చే ననుచుం బతాకయను చేఁ దరుణాచల మెక్కి చీరుఁ బం
చాననుఁ డిందుచూళి త్రిపురాంతక దేవుఁడు భక్తలోకమున్॥

కళిక. మఱియు సజ్జనభక్తగృహముల మరిగితిరిగెడు కామధేనువు
కఱదలెఱుఁగక వేఁడు దీనులఁ గవియు జంగమరత్నసానువు
శైలజాముఖచంద్రరోచుల చవుల దవిలెడు నవచకోరము
వేలుపుం దపసుల తలంపుల వెల్లిగొల్పెడు నమృతపూరము
దేవతలు ముప్పురకు నవ్వాలి దెస వెలుంగుచు నుండు నెక్కటి
భావవీథులఁ గలసి పలుకులఁ బట్టి చెప్పఁగ రాని చక్కటి
ఆఱురేకుల మంత్రకుసుమము నందు నెలిఁగెడు చంచరీకము
వేఱు సేయక యోగిజనములు వెదకి పొందెడి నూర్ధ్వలోకము.

ఉత్కళిక. ఆడుగుఁదమ్ములఁ జొప్పవసిగని యదరి శునకాకృతులు గైకొని
మీఱి చదువులు దవులముందటఁ బాఱుక్రోడము నేసి మంచట
లాడి తను మాఱ్కొనఁగ వచ్చిన క్రీడి గోరిన వరము లిచ్చిన
యాటవికకులసార్వభౌముఁడు జూటభాస్వస్త్రుహినధాముఁడు.

ఉ. ఆఱడియాన నీరసధరాధిప లోకము నిండ్లు వాకిళుల్
దూఱుట మాని శ్రీనగము తూరుపువాకిలిఁ జొచ్చి పాసముల్
నీఱుగఁజేసి గంధవతి నీటను గ్రుంకి మనంబులోని చి
చ్చాఱగఁజేయు టొప్పు త్రిపురాంతక దేవునికై మనస్స్పృహల్.

ఉ. పోయెడుఁ గాల మన్యగతిఁ బొందదు మోక్షము నెండికొంచెపుం
బోయెడు త్రోవ మీఁ కెఱుఁగఁ బోలదు మానవులార యందు లేఁ
ద్రాయపుఁగొండ కంచు శివభక్తులలోపల నద్రిరాజ క
న్యాయుత పుణ్యమూర్తి వలనం గడతేఱెడు జన్మఖేదముల్.

## చంద్రతారావళి

మ. చరమక్ష్మాధర చారుసింహముఖ దంష్ట్రాకోటియో నాఁగ సం
బరశార్దూల నఖంబొ నాఁగ గిమిరేభప్రస్ఫురద్దర్వ సం
హరణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల నీరేఖ ని
త్యరుచిం బొల్పగుఁ బెంపగున్ విదియచంద్రా! రోహిణీవల్లభా॥

మ. అమితధ్వాంత తమాలవల్లిల వనవ్యాపారపారీణ చా
త్రెమొ సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాణధురీణ కుంచికయొ నాఁగం బెంపునం నీ కళా
రమణీయత్వము చూడ నొప్పెసఁగుఁ జంద్రా! రోహిణీవల్లభా॥

## అంబికాశతకము

ఉ. ఉప్పలబోరుఁ బల్కులిసిఱింతలు నా ఉడుచూపుఁ గుంచియుం
గ్రిప్పి తఱుక్కునం దెరచి తిన్నని మోమునఁ గాయు వెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూఁగిన సిగ్గసియాడఁ బ్రీతిపెఁ
పప్పరమేశుఁ జూచి తను వర్ధము గొంటి పొసంగ నంబికా.

చ. బెడఁగగు రత్నదర్పణముఁ బేరిన వెన్నెలపోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరు మేనికంపు పోఁ
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతిన్నై
తొడరినఁ దల్లి నీమొగముతో సరిపోల్పఁగఁ జాలు నంబికా.

ఉ. కూఁడెడు వెంద్రుకల్ నిడుదకూఁకటిఁ బ్రోవఁగ బొడ్డుపైవళుల్
జాపలుదోఁపఁ గ్రొమ్మొలకచన్నులమించు బోలంక సిగ్గునం
జూడగ నేరముల్ మెఱుఁగుఁ జూపుల నీవ హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుటగాదె తలంప నంబికా.

ఉ. భారతివై సరోజభవు పాలవసించి రమావధూటివై
నీరజనాభుఁజెంది ధరణీధరనందనవై మహేశ్వరున్
గోరివరించి తమ్ము నిసుఁ గొల్వఁ యూఁకిక యేలఁగల్గు సం
సారసుఖంబు లీ మనుజసంతతికిన్ దలపోయ నంబికా.

ఉ. లాచి పరాంగనల్ వరవిలాస మనోహర విభ్రమంబులన్
జూచినఁజూడఁ డుత్తముఁడు చూపర జూచును మధ్యముండు తాఁ
జూచిన జూడకుండినను జూచుఁ గనిష్ఠుఁడు నన్ను వీరిలోఁ
జూచిన జూడకుండు గుణిఁజూచిన చూపునఁ జూడు మంబికా॥

ఉ. వాలిన కన్ను ముంగురులు వాతెర కెంపు మెఱుంగు జంటిపైఁ
గ్రాలెడు తారహారమును గంకణ చారు కరంబు డాఁపలన్
దూలుచునున్న పయ్యెదయుఁ దోఁచిన కన్నుల మోడ్చి మోడ్చి నీ
పాలగు నీశు మేని సగబాలు మనంబునఁ జేర్తు నంబికా॥

ఈ పద్యములు మానవల్లి రామకృష్ణయ్యగారి త్రిపు రాంతకోదాహరణ పీఠికనుండి తీసికొంటిని. దీనినిఁ గూర్చి శ్రీరామకృష్ణయ్యగా రిట్లు వాకొనుచున్నారు.

"అంబికాశతకమునఁ బార్వతీనాయకాగుణవర్ణనాదులు రసజ్ఞుల కింపుగా మృదుభాషతోఁ గూర్పఁబడినవి. నేఁటికాలమున శృంగారసముద్రసారవిధురులు గొందఱును, భక్తిరసనియమప్రణాళికాపారీణులు గొందఱును, ఉత్తమదేవతావర్ణనముల శృంగారరసాభాసములఁగాఁ దలఁచుచున్నారు. దీనిలో నుత్తమదేవత లైనను నంబికాశివులపరస్పర శృంగారరసోన్నతి వర్ణింపఁబడినదికాని ధ్వనికారులమతమున రసాభాస మనునదిమాత్రము దీనిలో నెచ్చటఁ గానరాదు."

## మ ద న వి జ య ము.

ఈ క్రింది పద్యములు రెండును మదనవిజయములోని వని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు త్రిపురాంతకోదాహరణపీఠికలో నుదాహరించిరి.

క. సతి గుణవతి యగు నేనియుఁ
బతి కది గన్నంబ ప్రాణబంధువ యమృతం

బతివయ దుర్గుణి యగునో
బతి కెడపని చిచ్చు కాలుపక యది కాల్చున్॥

మ. గుణమున్ సుందరరూపమున్ విభవముం గూటంబు సౌభాగ్య ల
క్షణముం జారుచరిత్రమున్ వినయమున్ జాతుర్యమున్ ధర్మభూ
షణముం గల్గి పతివ్రతామహిమ మించన్ గల్గనే దత్సతీ
మణి చింతామణి దానిఁ దాల్పఁగలుగన్ మర్త్యుండె ధన్యుం డిలన్॥

---

# వెన్నెలకంటి జన్నయకవి

మన కిప్పుడు దేవకీనందనశతక మొకటి మిక్కిలి వ్యాప్తి కలది కనఁబడుచున్నది. "కృష్ణా దేవకీనందనా!" యని మకుట మున్నది. సరిగ నూఱు పద్యము లున్నవి. శత కాంతమున నీపద్య మున్నది.

క. ఈ కృష్ణ శతక మెప్పుడు
పైకొని విన్నట్టివారు వ్రాసిన వారల్ ।
చేకొని పఠించువారలు
శ్రీకృష్ణుని కరుణ గలిగి చెలగుదు రెలమిన్॥

దీనిని వ్రాసిన దెవ్వరో యావఱకుఁ దెలియదు. కొంద ఱిది తిక్కనసోమయాజి కృత మందురు. కొందఱు ముద్రాపకులు దీనిని "పానకాలరాయ విరచిత" మని ముద్రించిరి. తిక్కనసోమయాజి కృష్ణశతక మొండు రచి

యించె ననియు, నందు "అరయన్ శంతను పుత్రుపై విదు రుపై" యను పద్య మున్నదనియు నొకానొకఁడు వ్రాసినట్లు కవులచరిత్రము నుడువుచున్నది. అందీ పద్యమకుటము మారియున్నది. ఈ పద్యము తిక్కనది కాదని యముద్రిత గ్రంథచింతామణిలోఁ బ్రత్యుత్తర మీయఁబడుటయేగాక, యిది దేవకీనందనశతకములోని దనికూడ వ్రాసి యాకల్పన మును జిరకాలముక్రిందటనే ఖండించి యున్నాడు. "కరినే లింది సూళక్కి ద్రౌపదికిఁ గోకల్ మెచ్చియిచ్చింది దబ్బర" యిత్యాది ప్రసిద్ధ పద్యము లిందును జానకీపతిశతకము నందును గనవచ్చును. ఎందలివో? ఈ శతకము నందలి పద్యములు రామదాసుచరిత్ర మను ప్రాచీనకావ్యమునందుఁ గానవచ్చు చున్నవి. కాని యాకావ్యము వ్రాసిన దెప్పుడో తెలియదు. ఈ శతకమునందలి పద్యములే యప్పకవీయమునం దుదాహ రింపఁబడినవి. ఇందలి 33-వ పద్యము దేశ్యనిత్యసమాసవి భ్రాంతి కుదాహరణముగ నిచ్చినాఁడు. ఆపద్యమిది.

"మ. చతురంబోధిపరీత భూవలయ రాజానేకకోటీర రం
జితమాణిక్య విరాజమానపదరాజీవుండు ధర్మాత్మజుం
డతి కారుణ్యముచేత మత్స్యపతి కొల్వాసింపఁడే నీదు శా
శ్వత కారుణ్యము గల్గు నంతకును కృష్ణా దేవకీనందనా!"
అప్పకవీయము 3-209.

అప్పకవి క్రీ॥ శ॥ 17-వ శతాబ్దమువాఁడని మనకు స్పష్టముగఁ దెలియును. కావున నీ శతక మతని నాఁటికే

ప్రసిద్ధమై. లాక్షణికముగ నెంచుచున్నట్లు తెలియుచున్నది. క్రీ। శ॥ 15-వ శతాబ్దములో "దేవరాయని కరుణాకటాక్ష వీక్షణముఁ గాంచి"న నెన్నెలకంటి సిద్ధన్న కొడుకు కగు జన్నయ్య యొకఁ డుండెను. అతఁ డొక దేవకీనందనశతక మును వ్రాసినట్లు పేరమరాజు జక్కన తన విక్రమార్కచరిత్రములో నీవిధముగఁ జెప్పియున్నాఁడు.

సీ॥ విమలవర్తనమున వేదశాస్త్రపురాణవాక్యార్థసరణికి వన్నె వెట్టె
పరమహృద్యంబైన పద్యశతంబున దేవకీతనయు విధేయుఁజేసె
రసికత్వమున దేవరాయమహారాజ కరుణాకటాక్షవీక్షణము గాంచె
కర్ణాటకటకమ్ము కలయంగ మెచ్చంగ గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె

గీ। గురులఁ బోషించె సత్కవీశ్వరుల మించెఁ
బ్రజల బాలించె భాగ్యసంపద వహించె।
హరిత మునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్దయజన్న మంత్రి॥

ఇందుఁ జెప్పినట్లు "పద్యశతమే" ఈ దేవకీనందనశతకమునందున్నది. ఇతఁ డప్పకవికంటె రమారమి 200 యేండ్లు పూర్వుఁడు. కాఁబట్టి మన కితరాధారములు దీనికి వ్యతిరేకము లైనవి దొరకువఱకు నీ జన్నమంత్రియే యీ దేవకీనందనశతకకర్త యనుకొనుట కభ్యంతర ముండఁగూడ దని తోఁచుచున్నది.

ఈ జన్నయ్య కొడుకుపేరు తాతగారి పేరగు సిద్ధన్న. ఈ రెండవసిద్ధన్నయే విక్రమార్కచరిత్ర కృతిపతి.

ఈతని నందులకే జన్నయ సిద్ధమంత్రియని కవి చెప్పినాఁడు. ఈ రెండవ సిద్ధమంత్రి దేవరాయనిమంత్రి యగు చామరసుచే "చామరచ్ఛత్రాదికము" లందినట్లు విక్రమార్కచరిత్రము నుడువుచున్నది.

చామరసు కర్ణాటకభాషలోఁ బ్రభులింగలీలలు వ్రాసినకవి. అవి యాతఁడఱవము తెలుఁగులలోనికి భాషాంతరీకరింపఁజేసెను. ఈ చామరసు వల్లభమంత్రి కుమారుఁడు. పిడుపర్తి వారికి ఁబోకిప అగ్రహారమును తిరిగి యిప్పించిన దీ మంత్రియే!

విక్రమార్కచరిత్రములోని షష్ఠ్యంతములలోఁ జెప్పిన యీ క్రింది పద్యమువలన విష్ణుపురాణమును దెలిఁగించిన వెన్నెలకంటి సూరన్న తాతయై రెండవసిద్ధన్నకుఁ బెదతండ్రియని తేలుచున్నది.

ఉ. వెన్నెలకంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్ర
సంపన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్రకుంజరుఁ డనంతితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిఁగన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్॥

అనఁగా దేవకీనందనశతకము వ్రాసిన జన్నయ్యయు, విష్ణుపురాణము తెలిఁగించిన సూరన్న తాతయు, సోదరులని తోఁచుచున్నది. "సత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటి వారిలోఁ" అను విష్ణుపురాణ వాక్యమువలనఁగూడ వెన్నెల

కంటివారిది కవిత్వసంప్రదాయముగల కుటుంబ మని మనకుఁ దెలియుచునే యున్నది.

వెన్నెలకంటి జన్నయ్య ఆపస్తంబసూత్రము వాఁడు. హారీత గోత్రిజుఁడు. ఇతని తాత సూరనసోమయాజి. ఆతఁ డెద్దనపూడి రాజేంద్రచోడునిచే నగ్రహారములు, కనకదండాందోళికాచ్ఛత్రచామర ప్రముఖరాజచిహ్నముల నందిన వాఁడు. సర్వతోముఖ మను యజ్ఞమును చేసినవాఁడు. అన్నదాత. శైవాచారపావనుఁడు. జన్నయ్యకవి తండ్రి సిద్ధ మంత్రి శ్రుతిశాస్త్రముల నెఱిఁగినవాఁడు. పురాణకావ్య నాటకములఁబోషించినవాఁడు. క్రతువులఁ జేయించినవాఁడు. ఇతఁడు నన్నయగంధవారణుఁ డను రాజునకు మంత్రి. ఇతని తల్లి సూరమాంబిక. ఈమె పేరయనన్ననార్యుఁ డను కవికి సోదరి. జన్నయకవి సోదరుఁడు మంత్రిభాస్కరుఁడు. జన్నయ కవి మహాదాత. ఈతని భార్య అచ్చమాంబ మహాపతివ్రిత. ఈతని కొడుకులు సిద్ధన్న, భైరవన్నలు. ఈ సిద్ధన్నయే విక్రమార్క చరిత్ర కృతిపతి. ఈ సిద్ధన్నకూడ కవి. ఈ సిద్ధన్న కొడుకు తిప్పన్న. తాతలు, తండ్రులు, కొడుకులు, మనుమలు కూడ వేదాచార సంపన్నులై క్రతువు లొనర్చుచు, నొకప్రక్క మంత్రులై రాజ్యాంగముల నడుపుచు, నొకచక్క కవిత్వశ్రీని విడువక కావ్యములు వ్రాయుచు, నొకదిక్క నీ వెన్నెలకంటివా రాంధ్రబ్రాహ్మణకుటుంబములలో నధికకీర్తిని

సంపాదించుకొని యిహపరములఁ జూరఁగొనిరి. వీరి వివరము లింకను దెలియఁగోరువారు చక్కని వైదుష్యము గల జక్కన వ్రాసిన పద్యములు విక్రమార్కచరిత్రకృత్యాదినిఁ జదివి ధన్యులగుదురు గాక! ఈ కవి 15-వ శతాబ్దమువాఁడనుట సుస్పష్టము.

దేవకీనందనశతకము లాక్షణికు లంగీకరించిన దయ్యు నిందు కొన్ని వ్యాకరణవైరుధ్యములు లేకపోలేదు. కాని యివి యీకాలపు వారు పెక్కురు వాడినందున ప్రౌఢప్రయోగములుగఁ దీసికొనఁదగినవి. "కూడికూడని, వండే నేర్పులు, మనవాలకింపు," ఇత్యాది ప్రయోగము లనేకము లున్నవి. దీనికిఁ బిమ్మట పోతన్న రచియించినట్లు కన్పడు చున్న నారాయణశతకమునందు దీనితో సంపూర్ణముగఁ జోల్పదగిన పద్యము లున్నవి. ఈ శతకమునందలి 15, 19, 82 మొదలగు పద్యములు సంస్కృతశ్లోకభావముల కనుసరణములు. 72 వ పద్యము సుమతిశతకము నందలి పద్యమున కనుకరణము. శైలిమంచిది. భక్తిరసపరిపూరితము. అన్నియు వృత్తములు. కృష్ణచర్యలే ప్రాయికముగ నుద్ఘాటింపఁబడినవి. కొన్ని పద్యములు ముద్దు లొలుకుచుండును. శైలికిఁగొన్ని పద్యములు చూపుచున్నాను.

మ॥ విరటుం గొల్చినవాఁడు నొక్కఁడిలఁ బృథ్వీనాథులన్ గూల్చి సం
గరభూమిన్ ఘనవైరి వీరతతులన్ గారించుచున్ బ్రుంచి యు
ద్ధరకున్ వగ్రజురాజుఁ జేసియు తుదిన్ బా నీకృపంబాయఁడే
సరిపోదే భువి నింద్రసూనుధృతి కృష్ణా దేవకీనందనా॥ 50

ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ గల యొక దేవకీనందన శతక ప్రతిలోఁ గొన్నిపద్యము లధిక మున్నవి. సర్వేశ్వర శతకము, దాశరథీశతకమును, తత్కర్తలు తాటియాకులపై వ్రాసి యొక్కొక్క పద్యము గోదావరిలో వైచి యెదురెక్కిన పద్యమునే తీసికొని శతకముగఁ గూర్చిరని కథలు చెప్పుదురు. శతకమునందలి పద్యము లన్నియు మణులవంటివనుట కీ కథ వాడుకలోనికి వచ్చినదో? ఈ కథలకుఁ గేవలము నాడు కయేగాక యీపరిషత్ప్రతిలో దేవకీనందనశతకమున నీ పై కథకు బలమిచ్చు పద్య మొండుఁ గానంబడియెడిని.

సదయస్ఫూర్తికిఁ కళల్ ఘటించి కవి రత్నశ్రేష్ఠుఁ డామోదియై
పదివేల్ పద్యములందు నూటపది సత్పద్యంబు లర్పించె, నీ
పదనీరేజములందు దివ్యతటినీపాథః ప్రపూర్ణాబ్ధి ము
ఖ్యదయన్ (ధునిన్?) గాంచిన దాట మీకరుణ కృష్ణా॥
1104 పరిషత్ నె 2347 రు వ్రాఁతప్రతి.

ఇట్లే "అడయారులైబ్రరీ" 32—1—44 సంఖ్య గల దేవకీనందనశతకము [వ్రాఁతవడ్డలిపి] లో నీ క్రిందిపద్యములు రెండు కనఁబడుచున్నవి. యథామాతృకముగఁ జూపెదను.

సదయస్ఫూర్తి కళల్ ఘటించుకవిరత్నశ్రేష్ఠుఁ డుత్సాహియై
సదివేల్పద్యము లందు నూటపది సత్పద్యంబు లర్పించు నీ
పదనీరేజములందు పావననదీపాద ప్రఘూజాభి ము
ఖ్యదశన్ గాంచినదా (వా?)ట మీకరుణ కృష్ణా॥ 100.

లేఖకుని గద్య యిట్లున్నది.

కవనాచాతురిమీర మున్న కవిరత్న శ్రేష్ఠుఁడా (వా?) మోదియై
భువిగావించినయట్టి కృష్ణశతకంబున్ భక్తి తాత్పర్య వై

భవమొప్పన్ లిఖియించి (చెరి?) సద్వాకవిప్రావీణ్యుఁడౌ భాస్కరా
ర్యవరగ్రామణి మీ లసత్కరుణ కృష్ణా దేవకీనందనా॥ 102॥

“ఖర సం॥ ఆషాఢ శు ౧”

ఈ కవిరక్షశ్రేష్ఠుఁ డెవ్వరు? వెన్నెలకంటి జన్నయ కర్తృత్వ మిందువలన సందేహింపనలసిన దగుచున్నది. శబ్దార్థమునే పురస్కరించుకొని చెప్పిన నది కవిరాక్షసుఁడు వ్రాసె ననవలెను. వెన్నెలకంటి జన్నయయే కవిరాక్షసుఁడా? కవిరాక్షసు డీతనికి సమకాలికుఁడై యామోదించె నని కవి హృదయమా? లేక కవిరక్షకశ్రేష్ఠుఁ డనదగిన కవిపోషకుఁ డగు జన్నయకృతమే యనమా? రక్షకశ్రేష్ఠుఁడు రక్షశ్రేష్ఠుఁ డనరాదు గావునను, కవిరాక్షసులేగాక వారిలో శ్రేష్ఠుఁ డుండుటను జాతివాచక మగుచున్నది. కావున నీ రెండు యూహాలును వాస్తవ మనుటకు వీలులేను. పండితులు చర్చించెదరుగాక! ముద్రితశతకముల తాటియాకులప్రతులు కలవారు ప్రతిశతకమును బరిశీలించుచుండుట ధర్మము. శతక కవులు కూడ గద్యలో కవి వివరములను పద్యముగా శతకాంతమున వ్రాయువారు. అవి కొందఱు లేఖకులు విడిచి వేయుచువచ్చిరి. చర్చచే దేవకీనందనశతకకర్తను నిరూపింపవచ్చును. నేను సాహసింపలేదు.

(1) కొన్నిపోలికలు చూపుచున్నాను.

శా॥ నాళిన్ పింఛపుదండ యొప్పగ నటింపన్ కాను శృంగారపున్
శ్రీ లెంచంగను పిల్లఁగ్రోవి రవమున్ చేకోలముం జెక్కుచున్

కేలన్ మెచ్చొదవింప గోపకులతోఁ గ్రీడారసస్ఫూర్తి నీ
వాలంగాచు విధంబు నేఁ దలఁతుఁ గృష్ణా దేవకీనందనా॥
— దేవకీనందనశతకము 16.

మ॥ కేలన్ గోలయుఁ గూటిచిక్కము నొగిం గీలించి నెట్టంబుగాఁ
బీలీపింఛముఁ జుట్టి వెన్నడుమునన్ బింఛావళిన్ గట్టి క
ర్ణాలంకార కదంబగుచ్ఛ మధుమత్తాలీ స్వనం బొప్ప నీ
వాలన్ గాచిన భావమిట్టి దని నే వర్ణింతు నారాయణా॥
— నారాయణశతకము 48.

మ॥ లలనాకుంచితవేణియం దడవిమొల్లల్ జార కస్తూరికా
తిలకంబున్ గరుగంగ లేతనగవున్ దీపింప నెమ్మోముసన్
తళుకుల్ జూపెడి చూపు లోరగిల నానారీతులన్ వేణువు
ష్కల నాదంబులఁ బెంపుజూపుదువు కృష్ణా దే॥
— దేవకీనందనశతకము 18

మ॥ లలితాకుంచిత వేణియం దడవిమొల్లల్ జార, ఫాలస్థలిన్
దిలకం బొప్పలరంగఁ గుండలరుచుల్ దీపింప లేఁ జెక్కులన్
మొలక న్నవ్వుల చూపు లోరగిల మే న్మువ్వంకలన్ బోవఁగా
నలి గైకొందువుగాదె నీవు మురళీనాట్యంబు నారాయణా.
— నారాయణశతకము 53

ఇట్లు 80 వ నారాయణశతకపద్యమునకు 88 వ దేవకీనందన సర్వేశ్వరశతకమునఁగూడఁ బోలిక లున్నవి చూడ నగును. పోతన్నవంటి వారేగాక యనేక శతకకర్త లీ ప్రాచీన శతకరత్నము నందలి భావముల సంగ్రహించుచువచ్చిరి. దేవకీనందనశతకము ప్రాయికముగా భారతము నందలి విషయములను, నారాయణశతకము భాగవతమునందలి విషయములను జెప్పును. ధూర్జటికూడ దేవకీనందనశతకమును జదివి

యుండవలెను. దేవకీనందనశతకమునందలి 76 వ పద్యమున యతితప్పు "నా నా వేదపురాణ – మీనామాంక – నాశ్చ ర్యమే." 70, 71 పద్యములలో రాజుల నిందించెను.

శైలికి మఱికొన్ని పద్యములఁ జూపెదను.

శా॥ నీడల్ దేఱెడు చెక్కుటద్దములతో నిద్దంపుఁ గెమ్మోవితో
కూడీకూడని చిన్నికూకటులతో గోపార్భకశ్రేణితో
వ్రీడాశూన్యకటీరమండలముతో వేడ్కన్ వినోదించుచు
న్నాఁడా శైశవమూర్తి నేఁ దలఁతు కృష్ణా దేవకీనందనా॥ 4

మ॥ కొలిచేదిన్ వగలేక నే, నడిగితే కోపించు టీలేక నే
చెలువం జెప్పుట కోక నే, విభవముల్ చేకూరుటల్ రూక నే
బలవంతుండగు మూక నే సతిజెడున్ బ్రాణేశుగైకోక నే
జలదశ్యామల శంఖచక్రధర కృష్ణా....॥ 42

శా॥ శ్రీలక్ష్మీధవ వాసుదేవ వరరాజీవాక్ష పద్మాసనా
న్యాశాధీశ్వర శర్వషణ్ముఖ శుకాద్యస్తోత్ర సత్పాత్ర గో
పాలానీకముఖాబ్జభాస్కర కృపాపాథోధి నన్ గావు మూ
ర్ధాలంకారమయూరపింఛధర కృష్ణా దే....॥ 47

మ॥ అరయన్ చందనగంధపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయిన్ నందవ్రజస్త్రీలపై
గరుణంగల్గు భవత్కృపారసము నామీఁదన్ గొంతరానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాఁడ హరి కృష్ణా....॥ 91

మ॥ కరి నేలింది హుళక్కి, ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర, కాకాసురునిన్ కటాక్షమునఁ జేపట్టిం దబద్ధం, బహో
శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యం బిచ్చుటల్ కల్ల, యి
త్తరి నన్నేలిన నిక్క మీ కథలు కృష్ణా....॥ 100

# వేమన్న

ఇతఁడు మనదేశమునం దాబాలగోపాలమునకుఁ దెలిసిన మహాకవి. ఈతని పద్యములు విననియాంధ్రుఁడుకాని యీతని పద్యమును జదువలేని యాంధ్రాక్షరాస్యుఁ డొక్కఁడుగాని లేఁడనుట యతిశయోక్తి కాదు. ఆంధ్రేతరు లగు ద్రావిడులు కర్ణాటకులును గూడ నీతని గూర్చి వినియున్నారు. వేమన్న పేరు విననివారు దక్షిణహిందూస్థానమున లేరు. ఇంత మహాకవి చరిత్రము మాత్రము సత్యముగ నిర్ధారణము గాకపోవుట శోచనీయము. వేమనచరిత్రములు పదిపండ్రెండుగురు వ్రాసియున్నారు. కాని కొన్ని వాడుకకథలు, కొన్ని వాడుకమాటలను విని వ్రాసినవేకాని యవి సత్యములో యసత్యములో మనకుఁ దెలియదు. వేమన్న 500 సం॥రముల కాలములో దైవముగాఁ దలఁపఁబడుచుండుటచే నీతని పేరుతో ననేక మహిమలు, అతిమానుషచర్యలు గల కథలు చేరిపోయినవి.

ఈతఁ డేయూరివాఁడని చర్చలు జరిగియున్నవి. కొందఱు కొండవీడువాడనిరి. బ్రౌనుదొర దత్తమండలము వాఁడనెను. క్యాంబెలు కటారుపల్లె ప్రాంతములవాఁడనెను. నే నొకసారి రాజమహేంద్రమువాఁడైయుండు నని తలంచితిని. కాని వేమన్నయే తన పద్యములలో నొకచోట నిట్లు చెప్పుకొనెను.

"ఆ. ఊరు కొండవీడు వునికి పశ్చిమవీధి
మూఁగ చింతపల్లె మొదటియిల్లు
ఎడ్డిరెడ్డికుల మదేమని తెల్పుదు
విశ్వదాభిరామ వినురవేమ"।

పాఠాంతరము.

ఆ॥ ఊరు కొండవీడు నునికి పశ్చిమవీధి
మూఁగ చింతపల్లె మొదటియిల్లు
అరసిచూడ బయలు నదెముక్తి శివుఁడయా
విశ్వదాభిరామ వినురవేమ॥

వేమన్న స్పష్టముగఁ దనది కొండవీ డని చెప్పుకొని నను సమాధి కటారుపల్లెలో నుండుటచే నీతఁడు తనకడపటి దినములు కటారుపల్లెలో గడపె నని కొంద ఱూహించుచు న్నారు. ఇది సత్యమే కావచ్చును.

వేమన్న యేకాలమువాఁ డనునది కూడ నిదివఱకు విస్పష్టము కాలేదు. బ్రౌనుదొరగారు 17 వ శతాబ్ద మనిరి. క్యాంబెలుదొర 16వ శతాబ్ద మనెను. ఇంకకొంద ఱింకొక విధముగ ననిరి. ఎవ్వరు చెప్పుదానికి నుపపత్తులు చాలవు. ఒకవిధముగఁ జూపుచున్నాను చూడుఁడు. వేమన యీక్రింది పద్యములో రాయనిభాస్కరు నిట్లు పొగడియున్నాఁడు.

"ఆ. పరగ రాయనికుల బాచని ధన మెల్ల
బట్లపాలు కవులపాలు తలఁప
నొనర హీనజనుని ధనము దాయాదుల
పాలు జారకాంత పాలు వేమ"

ఇందువలన నీతఁడు రాయనిభాస్కరునికిఁ బిమ్మటివాఁడని తెలియుచున్నది. కాని క్రీ॥ శ॥ 1386 మొదలు క్రీ॥ శ॥ 1530 వఱకు నెందఱో భాస్కరు లుంట వేమన్న యేభాస్కరునిపొగడెనో తెలియదు.

ఇఁక వేమన్న నీ క్రిందికవులు పొగడియున్నారు.

(1) కౌండిన్యగోత్రి నిమ్మల వెంకటార్యసుతు డగు లక్ష్మణకవి తన యేకామ్రలింగశతకమునందు "భీమ వేమానంత బిరుద కవుల" అని పొగడెను.

(2) ఇవ్వటూరి శరభనారాధ్యశిష్యుఁడును, అష్టవిధకవిత్వప్రవీణుఁడును, సర్వేశ్వరచరిత్ర మను తోభ్యచరిత్రమును వ్రాసినవాఁడును నగు పింగళి ఎల్లనార్యుఁడు తన గ్రంథమునందు సర్వేశ్వరశతకకర్త యగు యథావాక్కుల అన్నమయ్యను, వృషాధిపశతకకర్త యగు పాలుకురికి సోమన్నను, శివదేవుని, గణపతిదేవునిఁ బొగడి "వేమనఁ గీర్తించి విమలమతిని" అని మన వేమన్నను నుతించెను. ఈ కవి క్రీ॥ శ॥ 1590–1620 వాఁ డని కవులచరిత్రము నుడువుచున్నది. కావున వేమన్న యింతకు బూర్వుఁడు కావలెను.

(3) అన్యవాదకోలాహలకర్త శివయోగీంద్రులు (సోమనాథుఁడు?) కూడ నొక వేమన్నను బొగడియుండెను. కాని శైవభక్తులలో "చేటల వేమయ్య" యొకఁడు "బెలిదేవర వేమయ్య" యొకఁడు పండితమల్లికార్జునుని కాలమునందే

యున్నందున శివభక్తుఁ డగు వేమయ్య మన వేమన్న కాఁజాలఁడు. ఐతే పై కవులుకూడ శివభక్తు లగు వేమయ్య లనే పొగడియుండఁగూడదా? అని శంకచేసికొనవచ్చును. కాని వారు కృత్యాదినిఁ జేయునట్టి యాదికవిస్తుతులతో నితర కవులతోపాటు పొగడిన వేమన్నను మన కవివేమన్న యనియే తలంపవచ్చును.

(4) తురగా రామకవి నాగరఖండమును వ్రాసెను. ఇతఁడు 16 వ శతాబ్దాంతమం దుండవచ్చు నని కవుల చరిత్ర మనుచున్నది. నాగరఖండము క్రీ॥శ॥ 1581 నందున్న కుతుపుశాహి కాలమునందుఁ బుట్టినది. ఈ గ్రంథమునందు "శరభాంకు రాజశేఖరుని వేము" అని రామకవి పొగడి యుండెను. కావున వేమన్న క్రీ॥శ॥ 1581కిఁ బూర్వుఁడై యుండవలెను.

ఇదిగాక కోమటి వేమన్న కాలమున తురగా రామ కవి (రాయనిబాచనితో సమకాలమున) నుండె నని చాటు పద్యమణిమంజరిలో నున్నది కాని దానియాదార్థ్యము సరిగఁ దెలియదు.

(5) కృష్ణరాయలకాలమునం దున్న ఎడపాటి ఎఱ్ఱా ప్రెగడ తన మల్హణచరిత్రమునందు వ్రాసినపద్యములు రెండు చూపెదను.

ఉ॥ ఇట్టి మహాప్రధానపరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చుండిపురపాలక కాశనమంత్రిచంద్ర ము

నట్టిగఁ గృష్ణరాయ జనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడి యైన యెఱ్ఱకవి రాజిత మళ్హణ కావ్యకన్యకన్।

ఈ కవి కృష్ణరాయని కాలమువాఁడు కదా! ఈతఁడు వేమన్నను బొగడెను.

"వినుతులొనర్తు నాంధ్ర సుకవిప్రభు నన్నయభట్టుఁ, దిక్కయ
జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన, నాచనసోము, సర్వదే
వుని, భవదూరు, వేము, నలపోతనఁ, బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని, శరభాంకు, వీరకవి, ధూర్జటిఁ, గేతన, భట్టబాణునిన్"

కాఁబట్టి వేమన్న యీ యెఱ్ఱాప్రెగడకంటెఁ బూర్వుఁడు కావలెను. అనఁగా కృష్ణరాయనికిఁ బూర్వుఁడు. వేమన్న మిక్కిలి ప్రఖ్యాతి నొందిన పూర్వుఁడు కానియెడల బ్రాహ్మణు లగు ఎఱ్ఱాప్రగడ, తురగా రామకవి, మున్నగు వారితని ప్రాచీనకవులలోఁ జేర్చి నుతు లొనర్పరుకదా! కావున వేమన క్రీ॥ శ॥ 1505కుఁ బూర్వుఁడు కావలయును.

ఇట్లొకవిధముగ వేమన్న రాయనిబాచ (క్రీ॥ శ॥ 1386) నికి కృష్ణరాయ (క్రీ॥ శ॥ 1505) నికి నడుమకు వచ్చినట్లు తలంపవచ్చును.

ఇది వేమన్న కాలము కనుగొనుట కొకమార్గమే యైనను దీని కొక ప్రతిబంధక మిటీవల చేర్పఁబడినది. కొన్ని వేమన శతకప్రతులలో పై రాయనిబాచని పద్యమునకుఁ బిమ్మట నీ క్రిందిపద్యముకూడ వెంటనే కనఁబడుచున్నది.

"ప్రాకటముగ నిట్టిలోకములో గంటి,
పల్లెముత్తఁ డెన్న పరమగుణుఁడు
అన్న దానమునను హరిపూజచేతను
హరినిలోనఁ గలసె నరయ వేమా||"

ఈ రెండుపద్యములు వరుసగా నొకదాని వెనుక నింకొకటియే కొన్ని వ్రాతప్రతులలో నుండెను. "లోకములోఁ + గంటిన్ + పల్లెముత్తఁడు" అని కొంద ఱర్థము చేసి యీ "పల్లెముత్తఁ" డెవ రనుకొనిరి? వావిళ్ళవారి వ్యాఖ్యాతలు "గంటిపల్లె ముత్తఁ" డనిరి. శ్రీఅనంతకృష్ణ శర్మగారు "గంటిపల్లె ముత్తఁ"డని మాత్రము వేమన్న పొగడె ననిరి. ఈ నడుమ ముప్పదియిద్దఱుమంత్రుల చరిత్రమున నొకపద్యము కనఁబడినది.

చ. కమలభవాండభాండమునఁ గల్గిన నందవరంపు టిండ్లలోఁ
ప్రముఖుఁడు రాయనిపఱిఖునిభాస్కరుఁడే సెఱదాత, పిమ్మటన్
విమలగుణౌఘు "గుంటుపలి వీరయముత్తఁడె" దాత, భట్టసం
ప్రభమఘనదానరూఢి నొకపాటి వదాన్యుల నెన్న నేటికిన్||

ఈ "గుంటుపల్లి ముత్తఁడు" రాయనిభాస్కరునివలెనే ముప్పదియిద్దరు మంత్రులలోనివాఁడు. కావున వేమన్న పొగడిన దీ"గుంటుపల్లెముత్తఁ" డనుమంత్రినే కావలయును కదా! ఏమనఁగా? పైపద్యములో రాయన బాచని తరువాత నీతఁడే దాత యని యున్నది. ఈతఁ డన్నదాత యని మంత్రులచరిత్రము విశదము చేయుచున్నది. కావున వేమన్న

యీగుంటుపల్లి ముత్తని పొగడి యుండవలెనుకదా! అట్లు యినచో నీ ముత్తఁడు,

క॥ పొందుగ శరజలనిధి హరి
చందనతరు చంద్రసంఖ్య (1545) శకవర్షంబుల్
దుందుభి నాషాఢంబున
నందముగా వీరముత్తఁ డరిగెన్ దివికిన్॥

అని ముత్తమంత్రి క్రీ॥ శ॥ 1622 లో మరణించె నని యున్నది. ఈ చాటుపద్య మసత్య మనుకొంద మనిన నీతఁడు శా॥ శ॥ 1500 మల్కిభరాముపాదుషా కాలమునందు సంస్థానమును పాలించినట్లును శా॥ శ॥ 1528 లో చినపసుమ అగ్రహార మిచ్చినట్లును మంత్రులచరిత్రము చెప్పుచున్నది. (చూడుడు పుట 74, 76, మంత్రులచరిత్ర, నియోగిపత్రిక వారిప్రతి.) ఈ మంత్రులచరిత్రమునందుఁ జెప్పిన కాలమునందే ముత్తమంత్రి యుండుట సత్యమగునేని వేమన్న యీతనికొఱకు 17 వ శతాబ్దమునకు వచ్చియుండఁడుకదా క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమునందున్న వేమన్నను క్రీ॥ శ॥ 1530, 1590, 1600 లలో నున్నకవు లెట్లు పొగడియుందురు? కావున నీ పద్యము ప్రక్షిప్తము కావలసియున్నది. ఏ భట్రాజులో వేమన మకుటమున కనువగున ట్లతికించి యుందురా?

ఇది యిట్లుంచి యింకొకమార్గమున వేమన్న కాలనిర్ణయమును బరిశీలించెదముగాక !

వేమన్న యొకచోట నాదికవిస్తుతి నిట్లొనరించియుండెను.

"భవదూరుఁడు, శరభాంకుఁడు
శివశీలుఁడు వేయుగోటి సిద్ధేశ్వరుఁడున్
శివభృత్యుఁడు, పటుమూలుఁడు
శివమయ చిన్మయుఁడు సోమశేఖరగురుఁడున్॥

(12—1—35 ఓ. లై.)

ఈ సోమశేఖరగురుఁ డెవ్వ రని చూడ 15 వ శతాబ్దమునందుఁ బోతన్నగురు వని వీరభద్రవిజయమునందుఁ జెప్పిన "సోమశేఖరుఁడు" కనఁబడుచున్నాఁడు. ఈ సోమశేఖరుఁడే వేమన్న, పోతన్న లను స్వతంత్రకవుల నిద్దఱ "శైవాద్వైతుల" నొనరించి మనకుఁ బ్రసాదించె నని తోఁచుచున్నది. పోతన్నకాలముకూడఁ గృష్ణరాయని కించుక పూర్వమే గనుక నీ వేమన్నకవికూడ మన మూహించినట్లు 15 వ శతాబ్దము వాఁడే కావలయును. వేమన వ్రాసిన కొన్ని పద్యములవలన నాతఁడు 15 వ శతాబ్దమునందే పుట్టుట నిర్ధారణ మగునేని క్రీ॥ శ॥ 1412 సం॥ రమునకు సరియైన నందన నామసంవత్సర కార్తిక శుద్ధ పున్నమినాఁడు పుట్టి, క్రీ॥ శ॥ 1480 కి సరియైన శార్వరినామసంవత్సర చైత్ర శు॥ నవమినాఁడు సిద్ధిపొందె నని యూహింప వీళ్ళున్నవి.

వేమన్న కాఁపునని యాతఁడే చెప్పుకొనెను. వేమన చరిత్రము ద్విపదకావ్యము (అముద్రితము. ఆంధ్రసాహిత్య పరిషత్తులో నున్నది. నె 744 రు. చూడుఁడు.) నందు నట్లే

యన్నది. దక్షిణమండలములలో రెడ్లనే కాఁపు లందురఁట. వేమన్న రెడ్డి నని ప్రభువంశము వాఁడ ననికూడఁ జెప్పుకొని యున్నాఁడు.

"వితతముగాఁగను వేమనరెడ్డి"

(వేమన పుట 52)

"వేమనృపాల శేఖరా !" (వేమన పుట 54)

"గోరాజవేమాహ్వయా" (వేమన పుట 55)

ఈతని తండ్రి తుంగ కేశవుఁ డని, తల్లి లక్ష్మాంబ యని, జ్యేష్ఠ సోదరుఁడు పాపన్న యని, తమ్ములు కేశవ నారాయణు లనియు ద్విపదకావ్యమునం దున్నది. తక్కిన గ్రంథము లింకొకవిధముగ వ్రాయుచున్నవి.

వేమన్న రెడ్డిరాజ్యము పతన మగుననగాఁ బుట్టి తన యెదుట రాజ్యము నశించుట కన్నులారఁ జూచినవాఁడు. భోగములు నశ్వరము లని కనుగొనినవాఁడు. చిన్నతనమున నిష్టమువచ్చినట్లు సంచరించెను. బుద్ధిశాలి. జ్ఞానముకలిగి, సోమశేఖరునివంటి గురుసంబంధముచే శైవాద్వైతియై తన పూర్వజీవితమును, దేశము నందలి శైవవైష్ణవకలహములను, బ్రాహ్మణప్రాబల్యమును జూచి, మొదలే, మాయాసమన్విత మగుప్రపంచమునందు – దానివ్రృత్తమునందు – విముఖుఁడై సత్యమార్గమును, ఋజుమార్గమును వీడి, భక్తి మతముల పేరఁ బ్రజలు మూర్ఖాచారపీడితులై పోవుచున్నా రని తలంచి వారికందఱకు జ్ఞానము గోరుముద్దలుగాఁ బెట్టుట కారంభిం

చినవాఁడు వేమన. ఈతనికాలము నందే యీతనిఁ బ్రజలు మహాత్మునిగాఁ దలంచి పూజించువారు. ఇతఁడు చిన్నతనమునందు వేశ్యాలోలుఁడని, బంగారము చేయువాఁడు, పుచ్చకాయలలో బంగారము పండించె నని విచిత్రకథ లెన్నియో చెప్పుదురు.

వేమన్న గొప్ప భాషాతత్త్వవేత్త కాఁడు. సంస్కృత పండితుఁడు కాఁడు. కాని తనకు వచ్చిన స్వచ్ఛమైన తెలుఁగుభాషలో నమృతమును బామరుల కందజేయఁగల తేటమాటలలోఁ దేనెల తేటల నూటలూరించినవాఁడు. సులభశైలిలోఁ సంగ్రహరచనములో, సూటిసూక్తులలో, అన్వయసౌలభ్యములో నీతని కీతఁడే సాటి. ఇంతమధురముగఁ దేటగఁ బద్యములు వ్రాసిన కవు లీతనికిఁ బూర్వమందుఁగాని, పరమందుఁగాని కనఁబడరు. వేమన్న పాదపూరణములు మొదలగు వ్యర్థపదములు లేకుండఁ జక్కని యుపమానములతోఁ సహజ మగు పోలికలతో, జాతీయములతో చంటిపిడ్డలకు, గూడఁ దెలియునట్లు వ్రాయును. తెలుఁగు చదువుకొనువారి కీతని పద్యములు చనుబాలవంటి వనుట యతిశయోక్తి కాదు.

వేమనను ద్రావిడభాషయందు నీతివాక్యములు వ్రాసిన 'అవ్వాయి' తోను, కర్ణాటకమునందలి 'సర్వజ్ఞు'నితోను, గ్రీకు కవి యగు 'లూషియన్'తోను, మహారాష్ట్రుఁ డగు 'తుకారాము' తోను బోల్చవచ్చును. వేమన్న వేదాం

తము, నీతులు, సత్యములు, నింద, హాస్యము మొదలగు విషయము లనేకములు వ్రాసెను. ఆతఁ డవి చేతితో వ్రాయ లేదు. వినువారు, శిష్యులు వ్రాసికొనిరి. వేదములవలె నవి నిలచియున్నవి. వేమన్న యుత్తరవయస్సున నీపద్యము లన్నియు నాతని శిష్యులుకోరఁగా నొక గ్రంథరూపమున సమకూర్చియుండినట్లు ఫలశ్రుతి, పద్యసంఖ్య, కావ్యాదిని కవిస్తుతి, గురుస్తుతి చెప్పుచున్నవి.

ఈతఁడు శైవాద్వైతి. శివుని నామము పరమాత్మార్థమున వ్రాసి యున్నాఁడు. శైవమునం దించుక యభిమానమును జూపిన ట్లనుమానింపవచ్చును. వేమన్న దిగంబరియై వీధుల వెంబడి తిరుగువాఁ డని వాడుక కథలేగాక యాతని వాక్యములును, చిత్రపటములును సాక్ష్య మిచ్చుచున్నవి. వేమన్న జీవితకాలమునందే గాక యిప్పటికిని ననేకులు వేల మంది శిష్యులు గలరు. అనేకు లీతనివలెఁ బద్యములు వ్రాసినట్లు రమారమి యేఁబది గ్రంథములు చూపవచ్చును. వేదాంతకవుల కీతఁడు మార్గదర్శి. ఈతఁడు తనకుఁ బూర్వులైన శైవకవులగు పండితారాధ్యులు, పాలుకురికిసోమన్న, యథావాక్కుల అన్నమయ్య మొదలగువారి ననుకరించుటయే గాక సంస్కృతమునం దున్న వేదాంతగ్రంథముల భావములు పామరులకుఁ దెలియునట్లు తేటపఱచిన భాగము లనేకము లున్నవి. వేమన్న ముక్తిపిపాసియై వేదాంతి కుండరాని యహంభావము కలవాఁ డని యాతని వాక్యములే చూపవచ్చును

గాని యా కోపము సత్యము తెలియక ప్రపంచము పెడదారి నున్నది కావునఁ దన మార్గమునకు రమ్మని కోరుసట్టి యు ద్రిక్తహృదయమునఁ బల్కిన పల్కులేకాని యాతఁ డొక జాతిని గాని, వేదములఁ గాని, కర్మలఁగాని, నీచబుద్ధితో గర్హించినవాఁడు కాఁడు.

ఈతని మరణానంతర మీతని శిష్యు లొక సమాధిఁ గట్టి కటారుపల్లెలో నీతని పూజించుచున్నారు. ప్రతిసంవత్స రము చైత్ర శు॥ నవమి నాఁడు తిరునాళ్ళు జరుగుచుండును. వేమన్నకు మ్రొక్కులు చెల్లించెదరు. ఆరాఁబడి యధికమై, వేమన్న వంశీకుల మని చెప్పుకొనువంశములవారు వేఱుపడి యిప్పుడా ప్రాంతముల ననేక సమాధులు కట్టుచున్నారు. వేమ న్నల మని గుఱ్ఱము లెక్కి యాతని శిష్యులు సంచార మొనర్చి ప్రజలకడ ధనము స్వీకరించుచుందురు.

వేమన్న శైలి తెలియుటకుఁ గొన్ని పద్యములఁ జూపి ముగించెదను.

ఆ. వంపుకఱ్ఱ కాల్చి వంపు దీర్పఁగవచ్చు,
కొండ లన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరగింపఁగారాదు॥ వి॥

ఆ. కోపమునను ఘనత కొంచమైపోవును
గోపమునను మిగుల గోడు గలుగుఁ
గోప మణఁచె నేని కోర్కెలు నీడేరు॥ వి॥

ఆ. ఉప్పులేని కూర యొప్పదు రుచులకుఁ
బప్పులేని తిండి ఫలము లేదు

అప్పులేనివాఁడె యధిక సంపన్నుఁడు॥ వి।

ఆ. పట్టి విడువరాదు పదిలక్షలకునైనఁ
బెట్టి చెప్పరాదు పేదకైన
వెట్టి గొలువరాదు విభుఁ డెంత ఘనుఁడైన॥ వి।

ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మారు
కాఁచి యతుకవచ్చుఁ గ్రమముగాను
మనసు విఱిగెనేని మఱిచేర్చరాదయా ॥వి॥

ఆ. చంపఁదగినయట్టి శత్రువు తన చేతఁ
జిక్కెనేనిఁ గీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు॥ వి।

ఆ. పనసతొనలకన్నఁ బంచదారలకన్న
జుంటితేనె కన్న జున్నుకన్నఁ
జెఱకురసము కన్నఁ జెలిమాట తీపిరా॥ వి॥

ఆ. పతిని దూరరాదు సతి మానవతియైనఁ
బెట్టి చెప్పరాదు పెద్దకైనఁ
బతిని విడువరాదు పదిలక్షలకు నైన ॥ వి॥

ఆ. తనకు సవతితోడఁ దన యాయుధముతోడ
నగ్ని తోడఁ బరుల యాలితోడ
హాస్యమాడు టెల్ల హానిప్రాణమునకు ॥ వి॥*

—o—

* వేమన్న సంపూర్ణజీవితము— బోధనలు తెలియఁగోరు వారు నేను వ్రాసిన "వేమన" యను పెద్దగ్రంథమున విశేషములఁ జూచునది.

# బమ్మెర పోతనామాత్యుఁడు.

ఈ మహాభక్తుని చరిత్రము తెలుఁగుదేశమునం దాబాలగోపాలమునకుఁ దెలియును. ఈతఁడు వ్రాసిన యాంధ్రభాగవతము సుప్రసిద్ధమైనది. ఇందలి గజేంద్రమోక్షము, రుక్మిణీకళ్యాణము, కుచేలోపాఖ్యానము, శ్రీరామచరిత్రమును గూడ బాలురు బాలికలును వీధిబడులలోఁ బఠించుచుండెడివారు. ఆంధ్రకవులచరిత్రములలో నీతని చరిత్రము వివరముగ వ్రాసియున్నారు. కావున విశేషములే యిందు వ్రాయుదును.

ఇతఁడు వ్రాసినట్లు చెప్పు గ్రంథములు (1) వీరభద్రవిజయము (2) నారాయణశతకము (3) భోగినీదండకము (4) శ్రీమద్భాగవతము. ఇందలి కడపటి గ్రంథములోఁ జాలభాగ మీతఁడు వ్రాసిన దైనను పంచమ షష్ఠస్కంధములు, ఏకాదశ ద్వాదశస్కంధములును పోతన్న శిష్యులో, తరువాతవారో యైన గంగన, ఏర్చూరి సింగన, హరిభట్టు, వెలిగందల నారయ, మొదలగు కవు లనేకులు వ్రాసియున్నారు. తక్కిన మూఁడు గ్రంథములును గూడఁ బోతన్న వ్రాసె ననువారును వ్రాయ లేదనువారును గూడఁ గలరు. వీరభద్రవిజయ భోగినీదండక కర్తృత్వ విషయమై నా యభిప్రాయము స్థూలముగఁ జెప్పి, పిమ్మట నారాయణ శతకకర్తృత్వమును గూర్చి విచారించెదముగాక !

## వీ ర భ ద్ర వి జ య ము .

ఇది స్పష్టముగఁ బోతనకృత మని కృత్యాదివలనఁ దెలియుచున్నది. కాని యందలి యీక్రిందిపద్యమువలన నిది పోతన్నకృతము కా దని వాదించుటకు వీలగుచున్నది.

> "భాగవతప్రబంధ మతి భాసురత న్రచియించి దక్షుకృ
> ద్యాగకథాప్రసంగమునఁ దల్పవచస్కుఁడ నైతిఁ దన్నిమి
> త్తాగమవక్త్రదోషపరిహారత కై యజనైకశైవశా
> స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్."

ఈపద్యము పోతన్న వీరభద్రవిజయపుశైలిలో లేదు సరిగదా యిందలి కథయు సత్యముకాదు. ఈ చర్చ సంపూర్ణముగ శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తమ కవిజీవితములో వీరభద్రవిజయవివేక మని 623 పుటలోఁ జర్చించియున్నారు.

పై పద్యము సత్యమైనచో వీరభద్రవిజయము సృష్టిగ్రంథ మనుట కావంతయు సందేహములేదు. ఏమందురా? అనర్గళప్రవాహమువలె భాగవతప్రబంధము వ్రాసిన పోతన్న తప్పులతడిక యగు వీరభద్రవిజయమును దానిపిమ్మట వ్రాసియుండ నేరఁడు. పైఁగా నాపద్యము ముద్రిత ప్రతిలోనే కనఁబడుచున్నదికాని వేర్వేఱు దేశములయం దున్న పది తాటియాకుల గ్రంథములఁ బరికించినను పైపద్యము వ్రాఁతప్రతులతోఁ గనఁబడదు. కావున వీరభద్రవిజయ

మును ముద్రించిన శైవులో లేక వారిప్రతివ్రాసిన వారి పూర్వులో దక్షకథలోఁ బోతన్న శివనింద వ్రాసె నను భ్రాంతిచే నీ పద్యము వ్రాసి దాని కతికించియుందురు. కాని దేశమునం దది వఱకే వాడుకలో నున్న యితరప్రతులలోని కాపద్య మెక్కడ లేదు. వీరభద్రవిజయము శైవగురువుల ప్రోత్సాహముచే వ్రాసితి నని పోతన్నయే చెప్పియున్నాఁడు. పోతన్న శుద్ధశైవకుటుంబమునఁ బుట్టినట్లు భాగవతకృత్యాదియే సాక్ష్య మిచ్చుచున్నది. ఆ శైవాచారసంపద కల కుటుంబమునఁ జిన్నతనములోఁ దా నీగ్రంథము వ్రాసితి నని పోతన్న చెప్పెను.

"వ. అయ్యవసరంబున సోమశేఖరుఁడు (ఇవ్వటూరిసోమశేఖరగురువు) ఇట్లనియె.

సీ. గీ. ఉన్నదైనను మా కెల్ల నూహలోన
వింతపండువు బోలెను వీరభద్ర
విజయ మెల్లను వినఁ గడు వేడ్క యయ్యె
నది తెలుఁగున రచియింపు మభిమతముగ॥

ఆ. పిన్నవాఁడ ననియుఁ బెక్కు సత్కృతులను
విననివాఁడ ననియు వెఱపు మాని
మత్ప్రభావదివ్యమహిమచే నెంతైన
కవిత చెప్ప లావు గలదు నీకు॥

కావున నిది బాల్యమున వ్రాసె ననుట స్పష్టము. అట్టిదైన గురువు బలవంతముచే వ్రాసెను గాని "పలికించెడువాఁడు రామభద్రుండఁట" యని భాగవతమువలె

తనగంటము కసితీర్చుకొనుటకు వ్రాసినది కాదు. భావము లున్నవి. భాష లేదు. కవితాధార యున్నది. గంటము నడువదు. ఈ స్థితి గురువు కనిపెట్టి "సాధకముగ నిది వ్రాయుము నాయనా!" అని కోరెను. పోతన్న వ్రాసెను. భాగవతము నకుఁ బిమ్మట వ్రాయక బాల్యముననే వ్రాసె ననినచోఁ బ్రతిపక్షు లేమియు నీవాదమును ఖండింపలేరు.

భో గి నీ ద ం డ క ము.

భోగినీదండకము నందలి కథ యసత్యము. అట్టికథ యేడెనిమిది చోట్ల జరుగదు. పోతన్న కాలములో భోగినీదండకమునందుఁ జెప్పిన కుమారాన్నపోతావనీనాథుఁడు తండ్రియు, పోచమాంబ తల్లియుఁ గల సింగభూపతినిఁ జూపుటకు నాదండకము పోతన్న వ్రాసె ననవీలులేదు. అది రాజసౌందర్యవర్ణనముకొఱ కెవ్వరో కవి వ్రాసియుండును. ఒకవేళఁ బోతన్న వ్రాసినను దానియందు దోషము లేదు; శైలిచూచి భ్రాంతిపడి యిది పోతన్న కంటఁగట్టి యుందురు. ఇంతకంటె నధికవివరములు వలసినవారు ఆంధ్రవాఙ్మయ చరిత్రము పుటలు 381–386 చూడుఁడు. భోగినీదండకకర్తృత్వమును గూర్చి వేఱుగఁ జర్చింపవలసినంతసాధనసామగ్రి చేర్చియున్నాను. కావున నిది పోతన్నదే యనుటకుఁ దగినంత నిదర్శనము లేదనియు, నొకవేళఁ బోతన్న వ్రాసినను దండక రచనమునందు దోషముగాని, యాతని నియమభంగముకాని కలుగలేదనియు మనవిచేయుచున్నాను.

## నా రా య ణ శ త క ము.

పరిషత్పత్రికలోను, ఆంధ్రపత్రికలోను దీని కర్తృత్వమును గూర్చి విపులముగఁ జర్చ జరిగియుండెను. కాని యీ వివాదము యుక్తులతోఁ గూడినదేకాని సరియైన కావ్యపఠన మొనర్చి చేసినచర్చ కాదు. నా వ్యాసమునందు ముందీచర్చ చేయుదునని చెప్పియుంటిని. కావున సాధ్యమైనంతలో నిచ్చట వివరించెదను.

ఈ శతకము ప్రతులు నేను నారాయణశతకము మొట్టమొదటఁ బ్రకటించిన నాఁటికి రెండున్నవి. ఒక టున్న దని వింటిని. ఇప్పుడు పదిప్రతులు దేశములో దొరకుచున్నవి. ఎన్నిప్రతులు చూచినను రెండుప్రతులలోఁ దప్ప గద్యము లేదు. ఆ గద్య మైనను శతకము పోతన్నదని యెఱిఁగియున్న వారు వ్రాసిన భాగవతగద్యమే కాని యీగద్యము శతకాంతమునఁ బోతనామాత్యుఁడే వ్రాసియుండె నని ఋజువుచేయ లేము. కాని చిరకాలమునుండి యీశతకము వాడుకలో నున్నది. వెల్లంకి తాతంభట్టు పోతన్న భాగవతము లాక్షణికముగ నెంచలేదని శ్రీ వీరేశలింగముపంతులుగారు (కవుల చరిత్రము 141 పుట 1899) వ్రాసిరి గాని, పోతన్న భోగినీ దండకమును తాతఁభట్టు లాక్షణికముగ గ్రహించినాఁడని వారే (పుట 231 ఆంధ్రకవులచరిత్రము 1899) వ్రాసియున్నారు. వెల్లంకితాతంభట్టు, కస్తూరిరంగకవియుఁ గూడ నారాయణశతకమునుండి పద్యము లుదాహరించియున్నారు.

పరిషత్తులో నెం 2167 వ నెంబరు లేఖకుఁడు భోగినీదండక, నారాయణ శతకములఁ గలిపి వ్రాసికొని యిట్లు వ్రాసినాఁడు. "ముష్టూరి బాలమురాజుకొమారుఁడు పెదవెంగయ వ్రాసిన నారాయణశతకం, భోగినీదండకం" ఒక వేళ నీలేఖకుఁ డివి రెండును బోతన్న వని విని వాడుక వలన నట్లు వ్రాసెనేమో? దండకము చివర పోతన్న వ్రాసినట్లు చెప్పుటకు వీలైన పద్య మున్నది. ఇదిగాక నారాయణశతకము నందలి పదవ పద్యమైన యీక్రింది పద్యమును జూడఁగనే "యీక్రింది పద్య మాంధ్రులా బాలగోపాలము నెఱుఁగుదురు. ఇది పోతన్నది కావుననే జీవించి యున్న" దని శ్రీ వడ్డాది సుబ్బారాయుఁడుగారితో నంటిని.

మ॥ ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా॥

ఈ పై పద్యమును వినని యాంధ్రుఁడును, అనుకరింపని మంచివృత్త శతకమును గూడ లేదని చెప్పవచ్చును. ఈ పై కారణము లన్నియు నారాయణశతకము పోతన్న దనుకొనుటకుఁ గొన్ని యనుమానాస్పదము లైన కారణచ్ఛాయలే కాని, కారణములు కావు. ఈ క్రిందఁ జూపఁబోవు పద్యములఁ జూచి యీశైలి పోతన్న దగునో కాదో పాఠకులే నిర్ణయించెదరుగాక !

మ. తమలోఁ బుట్టినవిద్య గప్పికొనుచున్ దన్మూలసంసారవి
భ్రములై కొందఱు దేలుచున్ గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునందే పరమేశుఁగొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టినీవు కరుణం బాలింపు మవ్విశ్వరా॥
—పోతన్న భాగవతము 8—321.

మ. ఘనభోగాస్పదులై గతౌఘమతులై కారుణ్యులై పుణ్యులై
ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మాత్ములై నిత్యులై
మనుజాధీశ్వరులై మనోజనిభులై మాన్యస్థులై స్వస్థులై
ఒనర న్నొప్పెడువారు నీపదనుతుల్ యూహింప నారాయణా॥
—నారాయణశతకము 80

వ॥ "అత్యుపద్యావైపుణ్యము గల భూపకుమారులతోఁ బనులకాపరు
లెత్తువత్తురే యని క్రొవ్వున నవ్వుచుఁ బలికిన" —భాగ, దశ, ఉ,
వచనము

మ. పనులంగాపరి యే మెఱుంగు మధురప్రాయోల్లసద్వృత్తి వా
గ్విసరారావము మోవిదా వెదురుగోవిం జెట్టినాఁ డంచు నిన్
గసరుల్ దోఁపఁగ నాఁడు గోపికల తద్గానంబులన్ మన్మథ
వ్యసనాసక్తులఁ జేయుచందములు నే వర్ణింతు నారాయణా॥
— నారాయణ. 51

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై?
—భాగవతము 8. గజేంద్రమోక్షము 79.

మ. వరదుగ్ధాబ్ధితరంగడోలికలలో వైకుంఠలోకంబులో
విరజాక్షీరధినదీకోటలలో మధురాలలో శ్వేతశైలలో ద్వారకా
పురిలో బ్రహ్మశివేశ్వరాదిక హృత్పద్మాంభోజంబులో నుండు వై
ఖరి నాలోపల నుండు భాగవతపూజ్యాకార నారాయణా॥
— నారాయణశతకము 58.

"శా॥ ఏరూపంబున దీని గెల్తు నిటమీఁ దేవేల్పుఁ జింతింతు"
—గజేంద్రమోక్షము - భాగవతము.

మ. ఏభావంబున నిన్ దలంచె గజయూథేంద్రుండు, నాపన్నుఁడై
యేభావంబున ద్రౌప దీయెడ రమాధీశా యనెన్ వాయసం
బేభావంబున నీ శరణ్య మనెనో యీశా కృపాదృష్టిచే
నాభావంబు దలంపు నేర్పు కృపసేయం బాడి నారాయణా॥
—నారాయణశతకము 91

నారాయణశతకమునందు భాగవతశైలి నున్నవని నే ననుకొన్న మరికొన్ని పద్యములఁ జూపెదను.

మ. మనమార న్నచలేంద్రజాధిపతికి న్మస్తాగ్రిమాణిక్యమై
మునికోపానలదగ్ధరాజతతికిన్ ముక్తిస్ఫురన్మార్గమై
యొనయన్ సాయకశాయికిన్ జననియై యేపారు మిన్నేటికిన్
జని మూలంబగు నంఘ్రి నాదు మదిలోఁ జర్చింతు నారాయణా! 7

మ. జగదాధారక భక్తవత్సల! కృపాజన్మాలయాపాంగ! భూ
గగనార్కేందుజలాత్మ పావక మరుద్ధాత్రి! ప్రదీప ప్రియో
గిగణస్తుత్య మహాఘనాశన! లసద్గీర్వాణసంసేవితా
త్రిగుణాకార! ముకుంద! నాదు మదిలో దీపింపు నారాయణా! 23

మ. పరుషాలాపము లాడ నోడి మది నీపాదార్చితారంభుఁడై
పరమానందసుయోగదీపకళచే భస్మంబు నొందించి యా
నిరతజ్ఞాన సుకాంతిదర్పణమునన్ నిస్సంగుఁడై తన్నుఁ దా
నరయం గాంచినవాఁడు నిన్నుఁగనువాఁ డజ్ఞాతు నారాయణా!

ఇంక ననేకము లిట్టి వున్నవి. గ్రంథవిస్తరభీతిచే నీభాగము విడిచి యంత్యనియమయుక్తమగు శబ్దాలంకారములు పోతన్న యెవరినిఁ జూచి నేర్చుకొనెనో చూపెదను. పాఠకులు పై పద్యములలో నంత్యనియమము పోతన్న బీజ

రూపకముగఁ జూపి భాగవతమునందుఁ గన్నులకు, చెవులకు. చిత్తమునకుఁ గూడ నానంద మొదవింపఁ గలిగెనని తెలిసి కొనియుండురు.

ఈతని శతకమునందు దేవకీనందనశతకప్పుఁ బోలికలున్నట్లు వేఱొకచోటఁ జూపియుంటిని. ఈతఁడు శైవకుటుంబమునఁ బుట్టినవాఁడగుటఁ జిన్నతనములోఁ బాలుకురికి సోమనాథుని వృషాధిపశతకమును, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకమును దప్పక చదివియుండును. చూడుఁడు.

మ. సకలాధీశ్వరులై గణాధిపతులై సర్వజ్ఞులై నిత్యులై
యకలంకాత్మకులై మహామహితులై యంభోజగర్భాండ ర
క్షకులై యుండుదు రెల్లవారును భవత్సద్భక్తి నానాగణా
ధికలీలావిధి నంతరంగముల వర్తింపంగ సర్వేశ్వరా!

(సర్వేశ్వరశతకము. 125 వరంగల్ ప్రతి).

మ. ఘనభోగాస్పదులై గతౌఘమతులై కారుణ్యులై పుణ్యులై
ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మాత్ములై నిత్యులై
మనుజాధీశ్వరులై మనోజనిభులై మాన్యస్థులై స్వస్థులై
వనర న్నొప్పెడువారు నీపదరతుల్ వర్ణింప నారాయణా!

(నారాయణశతకము 80).

మ. ఖలులై యాచకులై విరుద్ధవికటాకారాంగులై పంగులై
బలహీనాతురులై రుజాపటలతాపచ్ఛన్నులై ఖిన్నులై
చలనాందోళితచిత్తులై మలినులై జాత్యంధులై దుష్టులై
యిల జన్మించెద రాత్మ నిమ్ముదక దా కీక్షింప సర్వేశ్వరా!

(సర్వేశ్వరశతకము. 36 వరంగల్ ప్రతి)

మ. నిరతానందవియోగులై నిరసులై నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై కఠినులై కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై భగ్నాంగులై గ్రమ్మఱన్
నరయన్ మిమ్ము దలంచి మోక్ష మిదె నారాయణా! ...

(నారాయణశతకము. 79)

ఇట్లే పాలుకురికి సోమనాథుని శతకము కూడ నీతఁడు చదివియుండె నని చెప్పవచ్చును. బాల్యమునందు శైవగురువుల యాజ్ఞచే వీరభద్రవిజయము కేవల శైవగ్రంథము వ్రాసినను, మఱికొన్ని దినములకు స్మార్తగురువువలన నద్వైతజ్ఞానము నొంది శివకేశవభేదము లేనివాఁడై "చేతులారంగ శివుని పూజింపఁ డేని" యని చెప్పిన వెంటనే శ్రీరామచంద్ర శ్రీకృష్ణుల కభేదము నొనర్చుకొని భావముల వెల్లడించెను. ఈ నారాయణశతకము వీరభద్రవిజయము రచించిన పిమ్మట విష్ణుభక్తి కలిగి వ్రాసియుండును. పోతన్న భక్తి జ్ఞాన వైరాగ్యము లీ శతకము నందు బీజరూపముగ మన కగపడుచున్నవి. ఈతఁ డీ శతకము వ్రాయునప్పుడే భాగవతము వ్రాయ నుద్దేశించినట్లును, క్రమముగా సహజపాండిత్యముచేతనే ధార నలవరచు కొనుట కీ శతకము వ్రాసినట్లును మనము తలంపవచ్చును. అదియునుగాక ముందుఁ దాను చేయఁబోవు భాగవతరచనావిషయ మీ శతకమునం దనేక విధముల పలుమార్లు వెల్లడించి యున్నాఁడు. ఈ నారాయణ శతకమునందుఁ గూడ శ్రీరామ శ్రీకృష్ణభక్తిని వెల్లడిం

చెను. ఈతఁడు పరమేశ్వరవర్ణనము దిన్యరూపదశకములో వెల్లడించినది చదివినవా రీ శతకము పోతన్నకృత మనుటకు వెనుదీయరు.

మ. భూతవ్రాతము నంబుజాసనుఁడవై పుట్టింతు విష్ణుండవై
ప్రీతిం బ్రోతు హరుండవై చెఱుతు నిర్భేద్యుండవై త్రైగుణో
పేతుండై పరమాత్ముఁడై నిలుతు నీ పెం పెవ్వరున్ గానర
బ్జాతోద్భూతసుజాతపూజితపదాబ్జ శ్రీస్థ నారాయణా!

నారాయణశతకము 24.

ఇతఁడు శతకము నందలి కృష్ణావతారవింశతిలో భాగవతము ముందు వ్రాసెద నని చెప్పె ననుట కీ క్రిందివాక్యములు నారాయణశతకమున నున్నవి చాలును.

"కసవొప్పన్ పసిమేసి * * పసిగోంచు వచ్చుటలు నే భావింతు" 45
"గోబృందంబుతో వచ్చు మీ వన్నెల్ * * నే వర్ణింతు" 46
"ఈ వర వృత్తాంతము లేను ఘణ్యకథగా వర్ణింతు" 47
"నీ వాలన్ గాచిన భావ మిట్టిదని నే వర్ణింతు" 48
"గోపాలవ్రాతము గండు గోయిలలుగా వర్ణింతు" 49
"గోశ్రేణుల్ చిందులు ద్రొక్కి యాడుటలు నే జర్చింతు" 50
"గోపికలు తద్గానంబులన్ * * చందములు నే వర్ణింతు" 51

ఇట్లే రాసక్రీడ, వేణునాదము, గోపికా విరహము, పూతకీహారణము, కంసవధ, మొదలగు కృష్ణచర్యలు వర్ణించి చెప్పెద నని యనేక పద్యములలో స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. కృష్ణకర్ణామృతము నీతఁ డనుకరించినట్లు శతకము నందలి 47 వ పద్యము చదివినవారికిఁ దెలియఁగలదు. నారా

యణశతకములో భాషాదోషము లని మన యిప్పటి వ్యాకరణకర్తలలోఁ గొందఱు నిర్ణయించునవి యున్నమాట సత్యము. కాని పరిశీలించినవా రిట్టి సమానదోషములే భాగవతమునఁ గనఁగలరు. ఈ విషయముకూడ నారాయణశతకము పోతన కృత మనియే రాద్ధాంత మొనర్ప సాయపడునుగదా!

ఈతఁడు తన శతకమును బ్రాకృతశతకములలోవలె దశకములుగా విభజించెను. ఈ సంప్రదాయము శైవశతకములోఁగూడ నుండియుండును. దానిని లేఖకులో ముద్రాపకులో విడిచియుందురు. ఈతఁడు పదేసిపద్యము లొకదశకముగ (1) ఆదిదశకము (2) అవతారదశకము (3) దివ్యరూపదశకము (4) నామదశకము (5) కృష్ణావతారవింశతి (6) జ్ఞానవింశతి (7) మోక్షవింశతి యని విభాగించెను. ఆ విషయము నాతఁడే ఇట్లు వ్రాసెను.

"రమణీయంబుగ నాదిమంబు నవతారమ్మున్ భవద్దివ్యరూ
పము నామామృతమున్ దలంప దశక ప్రాప్తయ్యె కృష్ణావతా
రము సుజ్ఞానము మోక్షమున్ ద్వివిధ సంప్రాప్తిన్ శతాంధ్రాఖ్య కా
వ్యము నర్పించితి మీపదాబ్జములకున్ వైకుంఠ నారాయణా! 101

పరిషత్తుసంఖ్య 2167 ప్రతిలోఁ బై పద్యముతోపాటిక్రింది రెండుపద్యములు నధికముగ నున్నవి.

## మోక్షవింశతి తుదిపద్యము.

నీమూర్తి ల్గన, నీకథ ల్విన, మదిన్ నీపాదనిర్మాల్యని
ష్పావమోదంబు నెఱుంగ, నీచరణతోయం బాడ, నైవేద్యమున్
నీమం బొప్ప భుజింప నీజపము వర్ణింపం గృపం జేయవే
శ్రీమించన్ బహుజన్మ జన్మములకున్ శ్రీఆదినారాయణా! 99

తపముల్ సత్క్రతుపంచయజ్ఞ ఫలముల్ దానక్రియారంభముల్
జపముల్ పుణ్యనుతీర్థ సేవఫలముల్ సద్వీప విజ్ఞానముల్
ఉపవాస వ్రత ధర్మశీల ఫలముల్ ఒప్పారు నిన్నాత్మలో
నుపమింపంగల వారికిం గలవు వేయున్నేల నారాయణా!

(పరిషత్ 864 బి. ప్రతి.)

పైనఁ జూపిన "ధరసింహాసనమై—విరించి కొడుకై" యను పద్యమేగాక భాగవతము నందలి "కమలాక్షునర్చించు కరములు కరములు" మొదలగు పద్యములు పోతన్న కుల శేఖరాళ్వారు లోకమున కనుగ్రహించిన 'ముకుందమాల' చదివి వ్రాసిన ట్లనుమానింప వీలుకలుగఁ జేయుచున్నవి.

శ్లో॥ దారావారా కరవరసుతా తేతనూజో విరిఞ్చిః
స్తోతా వేద స్తవసురగణో భృత్యవర్గః ప్రసాదః
ముక్తిర్మాయా జగదవికలంతావకీ దేవకీతే
మాతా మిత్రం వలరిపుసుత స్త్వయ్యతో న్యన్న జానే॥ 32॥

శ్లో॥ జిహ్వేకీర్తయ కేశవం మురరిపుం చేతోభజ శ్రీధరం
పాణిద్వన్ద్వసమర్చ యాచ్యుతకథా శ్రోత్రద్వయ త్వం శృణు
కృష్ణం లోకయలోచనద్వయహరే ర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం
జిహ్వేఘ్రాణముకున్ద పాద తులసీం మూర్ధన్నమాధోక్షజమ్॥ 19

ఒక్క నారాయణ శతకమునం దే కాదు. పెక్కు శత కములలో ముకుందమాల, శివానందలహరి, భజగోవిందం, మహిమ్నస్తోత్రం మొదలగు స్తుతికావ్యములు, అష్టకములు పరమసత్యముల వెల్లడించు సంస్కృత కావ్యముల ననుకరించిన పోలికలు కన్పట్టునని చూపి యుంటిని.

పోతనామాత్యుఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కేసన లక్కమల తనయుఁడు, కౌండిన్య గోత్రుఁడు. బమ్మెర నివాసి యగుటచే నీతని కింటి పేరు గ్రామ నామమే యైనది. ఈతని వాసస్థలమును గూర్చియుఁ గాలమును గూర్చియుఁ జర్చలు జరిగి యున్నవి. వివరములు విడిచి నాకుఁ దోఁచిన యభిప్రాయము లీ క్రింద సంగ్రహముగఁ దెలుపుచున్నాను.

## స్థ ల ని ర్ణ య ము.

పోతన్న తన భాగవతకృత్యాదిని తా నేకశిలానగ రంబున కేగి గురుజనుల యనుజ్ఞ వడసి భాగవతంబు రచి యింప నారంభించితినని చెప్పియుండెను. శైవుఁడగు తాను కేవల విష్ణుకథ యగు భాగవతము వ్రాసినచో పట్టుదల గల శైవ గురువుల కాగ్రహము వచ్చునని తలఁచి వీర శైవ గురువుల కాస్థానమగు నేకశిలానగరమునకుఁ బోయి యుం డును. ఈ యేకశిలానగర మను నామము చూచి మొట్ట మొదట భాగవతమును ముద్రించిన పురాణం హయగ్రీవ శాస్త్రిగారు వారికిఁ దెలిసియున్న కడపమండలము నందలి

'ఒంటిమెట్ట' కిది గీర్వాణీకరణ మని భ్రాంతిపడి, ఒంటిమెట్ట లోఁ గోదండరామస్వామి యాలయ ముండుట చేతను, అయ్యలరాజు తిప్పనాదుల కా దేవుఁడు సంబంధించినవాఁడగుటను, పోతన కడపమండలము లోని ఒంటిమెట్ట వాఁడని సూచించిరి. కవులచరిత్రమునం దా సూచనమును గ్రహించినప్పటికిని కవిజీవితకర్త ఒంటిమెట్ట, ఒరంగల్లులలో నేదియో తెలియదని యనుమానించెను. ఇటీవలఁ గొందరు పండితులును, పరిషత్తువారును దీని విషయమై విచారింపఁగా ఒరంగల్లు ప్రాంతమున బమ్మెర యున్నట్లును, అచ్చటఁ బోతన్న వంశీకుల మని చెప్పుకొనువా రున్నట్లును గనుగొనిరి. అప్పుడు భాషాభిమాను లీ విషయమును జర్చింపసాగిరి. ఏకశిలానగర మను పదము "ఒంటిమెట్ట"కుఁ బర్యాయపదము కాఁజాలదనియు, "నెల్లుట్లవారము పోతన వంశీకులము" అని చెప్పుకొనువారు సత్యముగఁ బోతన బంధుగు లైనను గాకపోయినను, పోతన్న ఓరుగల్లు ప్రాంతము నందలి బమ్మెర వాఁడనియును దేల్చిరి. శ్రీవావిలికొలను సుబ్బారావు పంతులుగారు వారి రామాయణము నొక చేతను, పోతన్న భాగవతము నింకొక చేతను గోదండరాముఁ డందుకొనుచున్నట్లు బొమ్మ చెక్కించి ప్రకటించువఱకును శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, లోకములో నిర్వురు మువ్వురు తక్క

తక్కిన వారును గూడ ఒంటిమెట్టయే పోతన్న జన్మస్థలమని నమ్ముచుండిరి. కాని యీ చర్చ పెరిగిన కొలఁది సత్యము బయటబడి శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్రము నూతన ముద్రణములో నోరంగల్లు వాదము సరియైనదని తమ తొంటి యభిప్రాయమును మార్చుకొనిరి. అందుపై నాంధ్రవాల్మీకులును, వారి శిష్యులగు కడప మండలమువారును గోదావరీ మండలమువారు స్థలాభిమానముచే సృష్టి గ్రంథముల నొనరింపఁ జేయుచున్నారని యస్మదాదుల నందఱఁ గలిపి నిందింప నారంభించిరి. ఆ వాదోపవాదములో కొండెకు గ్రంథము* లైనవి కాని సత్యము నిర్ధారణము కాలేదనియే కడపమండలము వారిలోఁ గొందఱనుకొనుచున్నారు. ఈ వాదము స్థలాభిమాన మున్నంతవఱకుఁ దేలదు. కాని పోతన్న చెప్పిన యేకశిలానగరనామము తమ యొంటిమెట్టకుఁ బర్యాయపదముగా వాడుక యున్నట్లు 13, 14, 15 శతాబ్దములలోఁ బుట్టిన యొక్క శాసనమునందుఁ గాని, యొక్క గ్రంథమునందుఁ గాని చూపలేనప్పుడును, వరంగల్లున కేకశిలానగరనామము పర్యాయపదముగ నుండుటయేగాక నూఱుప్రయోగములు వరంగల్లున కేకశిలానగర నామమున్నట్లు మనము కనుగొనఁ గలిగినప్పుడును, గోదావరి

* (ఈ వాద గ్రంథములఁ జూడదలఁచినవారు పరిషత్పత్రిక, సంవత్సరాది సంచికలు, పెద్దిభొట్ల వీరయ్యపంతులు గారి గ్రంథములు, కడప పోతన సమాజము వారి గ్రంథములను జూచుకొనుఁడు.)

వారివాదము నెగ్గినదో, కడపవారివాదము నెగ్గినదో తెలుప నక్కరలేదు. సత్యము, న్యాయము నెగ్గినదని చెప్పవచ్చును. వరంగల్లుచేరువను బమ్మెరయే గాక దానికిదగ్గఱలో వెలిగందల, ఏర్చూరు, ఖమ్మమెట్టు నను గ్రామములు కలవు. భాగవతము పూరించిన వెలిగందల నారయ, ఏర్చూరి సింగన, చంద్రాభట్ల హరిభట్టు లిట్లు బమ్మెరకుఁ జేరువలోఁ గనఁబడు చుండఁ బోతన నొంటిమెట్ట వాఁడనుట కంటె నన్యాయ మింకొకటి లేదు. నా యభిప్రాయముచేఁ బోతన వరంగల్లు ప్రాంతము నందలి బమ్మెర వాఁడనియే!

## కాలనిర్ణయము.

భాగవత పీఠిక కర్తలు, కవిజీవిత, కవిచరిత్ర కర్తలును గూడ నీతని కాలనిర్ణయము ననేకవిధముల నొనర్చిరి. విజయనగరము నందలి సాహిత్య పత్రికలో బోతన్న యెఱ్ఱాప్రెగడ కంటెఁ బూర్వుఁడా యని యనుమానించిరి. ఈ వాదము లన్నింటికిఁ గలిపి నేనొకప్పు డాంధ్రపత్రికలో వ్రాసిన వ్యాసము నీ క్రిందఁ బొందుపఱచుచున్నాను:—

"పోతనామాత్యుఁడు - కాల నిర్ణయము:—

ఈ నడుమ నీ పత్రికలో "సాహిత్య" నుండి పునర్ముద్రితమైన యొక్క వ్యాసమునఁ బోతన్న కాల నిర్ణయమును గూర్చిన ప్రసంగమును బ్రకటించిరి. అం దీతఁడు తిక్కన

కాలమువాఁడని శంభుదాసునకుఁ బూర్వుఁడని యుదాహ రించిరి. దీని కుపబలముగ నెల్లూరుశాసనములలో నొక శాస నమును జూపుచు దానిలో నున్న సంవత్సరము నుదాహ రించిరి. రెండవకారణము శంభుదాసు నాదికవిస్తుతిలోఁ బోతన్నను పేర్కొనకపోవుటకూడఁ గారణమనిరి. 12వ శతాబ్ద మునందలి శిలాశాసనము నందుఁ బోతన్న పద్యము లుండు టచేఁ బోతన్న యంతకుఁ బూర్వమే భాగవతము వ్రాసి యుండవలెనని మొదటి కారణమువలనను, గావుననే శంభు దాసుని స్తుతించి యుండలేదని రెండవకారణమువలనను, ఋజువుచేయుటకుఁ బ్రయత్నించిరి. ఈ వాద మితరస్థితిగతు లతోఁ బోల్చినప్పుడు సరిపోయినయెడల మన మంగీకరింప నగును. ఐనను శాసనమునందు వారే చూపిన కారణములలో నున్న బలహీనభాగముల ముందుఁజూపెదను.

ఈ శాసనమునందలి సంవత్సరము సందేహాస్పద మని "బట్టరువర్తి గారు" నెల్లూరి శాసనముల సంపుటములలోనే గుర్తించియున్నారు. అది మనమిత్రులు చూచి యుండ వలెను. ఇదిగాక శాసనలిపికిఁ బ్రతిబింబమైనఁ జూచిన నది యేకాలపు లిపియో నిర్ణయింప నగును. పైఁగా శాసనము వ్రాయించిన యాతఁ డిది "యుద్ధరించడ మైనది" అని వ్రాసినాఁడు. "ఉద్ధరించుట" యనఁగా నదివఱకు వేయించిన శాసనము శిథిలమగుచుండ నిటీవల దిరిగి వేయించినది

కావలెను. నెల్లూరి శాసన సంపుటములలో నీశాసనమును గుఱించి వ్రాసినప్పు డిదియొక రాతిపలకమీఁద నున్నట్లు చెప్పియున్నారు. అందొకభాగము ముగించి రెండవభాగ మారంభించి నట్లున్నది.

శాసనపుఁ బ్రతి చదివినప్పు డది రెండుభాగములుగఁ గనఁబడుచున్నది. కావున నీ కాలనిర్ణయము నిలుచుటలేదు. అందువలన నితఁడు శంభుదాసునిఁ బొగడక పోవుటవలన నతనికంటెఁ బూర్వుఁడనునట్టి యాలోచనమును యథార్థముగఁ గనఁబడుట లేదు.

వ్యాసకర్తల రెండవయూహయే సరియైనచో మనకుఁ బోతన్న కాలనిర్ణయ మొకకష్టకార్యము కాదు. చూడుఁడు. మడికి సింగన తన పద్మపురాణములోఁ దా నా కావ్యమును "ఆ కరయుగానల మృగాంకశక వత్సరములఁ బూర్తి చేసితి" ననుచున్నాఁడు. ఇతఁడు దీనినిఁబట్టి క్రీ॥శ॥ 1420లో నున్నది సుస్పష్టము. ఇతఁడు భాగవతము దశమస్కంధము ద్విపదగా రచియించియున్నాఁడు. ఇతఁడును శంభుదాసునకుఁ జాలపిమ్మటివాఁ డయ్యు నాతని స్తుతింప లేదు. (378 పుట ఆంధ్రకవుల చరిత్రము 1918) శంభుదాసు కవిత్రయములోఁ గడపటివాఁ డగుటను, 14 వ శతాబ్దమువాఁడై వారి కాధునికుఁ డగుటను, కవిత్రయము భారతము పూర్తి చేసిన విషయము శంభుదాసు

నకుఁ బిమ్మటఁ గొంత కాలమునకుఁగాని వాడుకలోనికి వచ్చి ప్రమాణముగ నంగీకారము నొందకపోవుటను, శ్రీనాథుని వంటి దగ్గఱకవు లొకరిద్దఱు శంభుదాసు నుగ్గడించినను, క్రీ॥శ॥ 14, 15 శతాబ్దములయందలి కవులు శంభుదాసు నెఱుఁగకయో, యెఱిఁగియుఁ బ్రమాణముగ నాథునికుఁ దగుట నంగీకరింప నిష్టములేకయో స్తుతింపలేదు. కవిచరిత్రము నను సరించి కవిత్రయమును మొట్టమొదట స్తుతించినవాఁడు జక్కన. శ్రీనాథుడు, అనంతామాత్యుఁడు, ప్రౌఢకవి మల్లన్నలు కూడఁ గవిత్రయమును వర్ణించియున్నారు. ఈవిషయ మిట్లుండనిండు. మడికి సింగన్న భాగవతము దశమస్కంధము ద్విపదగా రచియించినాఁడు కదా! ఈతఁడు తనకు నూఱు సంవత్సరములు పూర్వము పోతన్న భాగవతమును రచియించినచో నది యెఱుఁగక యుండునా? పోతన్న నీతఁడు తన దశమస్కంధమునకైన బేర్కొనవలదా? దివ్యమహిమలు కలవాఁడని మహాభక్తుఁడని పేరుగాంచిన పోతన్న ప్రసిద్ధుఁడు గాక యుండునా? సింగన్న ద్విపదభాగవతము శ్రీపిఠాపురమురాజావారి ·లిఖిత గ్రంథములలో నున్నది. కాఁబట్టి మడికిసింగన్నకుఁబూర్వము పోతన్న యుండె ననుట యుక్తి యుక్తముగ లేదు.

నాచన సోమన్న "అరిఁజూచుఁ హరిఁజూచు"నను పద్యమునకుఁ బ్రతిగఁ బోతన్న "వరుఁజూచుఁ పరుఁజూచు"

నను పద్యమును భాగవత పీఠికకర్తలు చూపియున్నారు. భాగవతమూలకథలో లేని విష్ణుపురాణ హరివంశకథలను, వర్ణనలను జేర్చి పెంచిన పోతన్న నాచన సోమనాథాది కవులకుఁ బిమ్మటివాఁడు కావలెను. ఒకవేళ వీరే యాతనిఁజూచి యనుసరించి రన్నప్పుడు పోతన్న నితర కవు లెవ్వరును 13, 14 శతాబ్దములలో స్తుతింపకపోవుటకుఁ గారణములు ప్రతిపక్షులు చూపవలసి యుందురు. ఈ పై రెండు సందేహములు నంతబలమైనవి కావు. ఈ క్రింద బలవత్తరమయిన కారణములచేఁ బోతన్న కాలనిర్ణయము వీలగునా? చూతము.

(1) మడికి సింగన్న (1420) కుఁ బోతన్న పిమ్మటవాఁడైనప్పు డెప్పటివాఁడని చూడవలసియున్నది. దోనేరు కోనేరుకవి తన కాలము తన గ్రంథములో వ్రాసికొనినాఁడు. ఈతఁడు బాలభాగవతమును వ్రాసెను. ఇతఁడు క్రీ॥శ॥ 1560 ప్రాంతములవాఁడు. ఇతని భాగవతసారము సంపూర్ణభాగవతముండినప్పుడే యుండవలెను. పైఁగా దోనేరు కోనేరుకవియే "పెద్దభాగవత ముండగా నీ చిన్నది రమ్యమా? అని నిరసింపకుఁడు, తల్లికంటె నాయమె పిల్ల మనోహరముగ నుండదా!" యని సమాధానము చెప్పినాఁడు. అదివఱకున్న సంస్కృత భాగవతమున కిది పిల్ల యనుకొన వీలులేదు. ఏమందురా? అట్టియెడఁ దెలిగించితి ననియే చెప్పును కాని యీ యుక్తి చెప్పియుండెడఁడు. కావునఁ బోతన్న క్రీ॥శ॥ 1420 కిని 1560

కిని నడుగు నున్నాఁడని నిర్ణయింపవచ్చునని తోఁచుచున్నది. దీని కితర కారణములు కూడ బల మీయవలెను.

(2) కృష్ణదేవరాయని కాలమున నున్న వైష్ణవుఁడగు పెద్దన్న గాని, శైవుఁడగు ధూర్జటికాని పోతన్నను స్తుతింప లేదు. "మహిమున్ వాగనుశాసను" అను పద్యమున రామ రాజభూషణుఁడు పోతన్న పేరెత్తలేదు. వీరందఱును రాజా శ్రితులు కావున రాజులఁ దిట్టిన పోతన్న యెడ వైముఖ్యము నొందిరో - కర్ణాటకుల నాశ్రయించిన వీరు "కర్ణాటకిరాట కీచకాధము" లనిన పోతన్నను విస్మరించిరో - లేదా పోతన్న వారి సమకాలికుఁడో - చెప్పవీలులేదు. పోతన్నను మొట్ట మొదట స్తుతించిన వాఁ డయ్యలరాజు రామభద్రుడు. "ఆంధ్ర సద్భాగవతకర్త నభినుతించి" అని యున్నది. ఎఱ్ఱా ప్రెగడ తన మల్హణచరిత్రము నందలి యాదికవిస్తుతిలో "వేము నల పోతన" అని స్తుతించెను. ఇతఁడు కృష్ణరాయని కాలమువాఁడు. వెల్లంకి తాతంభట్టు సంక్షేపభాగవతమును వ్రాసినట్లు సంవత్సరాదిసంచికలోఁ బుష్పాంజలిలోఁ బద్య ముఁ జూడుఁడు. ఈ విషయము కడపవాదమువారికి బలము. ఐన నిదియే యాధారము కానేరదు. అయ్యలరాజు రామ భద్రుఁడును క్రీ॥ శ॥ 1550 ప్రాంతములవాఁ డగుట నాంధ్ర భాగవతము కృష్ణరాయనికిఁ గొంచ మీవలావల రచియించి యుండవలె నని మనము చెప్పవచ్చును. అయితే మనమిత్రు

లగు ప్రతిపక్షులు చెప్పునట్లు 12 వ శతాబ్దమున వ్రాసియుండఁ గూడదా? యను సందేహ మింకను వీడలేదు. వారివాదము నకుఁ బ్రతిబంధకములు కూడఁ జూతము.

(1) పోతన్న వని చెప్పు "కర్ణాట కిరాట కీచకాధ ముల" మున్నగు పద్యము లసత్యము లని మన మంగీకరింప వలసివచ్చుచున్నది. ఏమనఁగా? క్రీ. శ. 12, 13 శతాబ్దముల లోఁ గర్ణాటక రాజ్యము లేదు. కర్ణాటక దేశము నేలు చాళుక్యులో, చోళులో కర్ణాటకరాజులు కావచ్చు నను కొందము. ఇంకొక సాధనమును బరికించెదముగాక?

(2) బమ్మెరపోతన్న కొడుకు మల్లన్న. మల్లన్న కొడుకు కేసన్న. ఈ కేసన్నకుఁ బోతన్న తండ్రిపేరు పెట్టిరి. ఇతనికే ప్రౌఢసరస్వతి యని పేరున్నది. ఈ ప్రౌఢసరస్వతి కిరువురు భార్యలు. ఇరువురు భార్యల కిరువురు పుత్రులు. కేసన్న, మల్లన్న లని వారిపేర్లు. వీరిరువురు జంటకవులై కొన్ని గ్రంథములు వ్రాసిరి. ఇందు దాక్షాయణీపరిణయము, విష్ణుభజనానందమును లోకమునకుఁ జిక్కినవి. ఈ రెంటిలో దాక్షాయణీపరిణయమును బోడూరి పెదరామామాత్యుఁ డనుకవి (శివరామాభ్యుదయమను ద్వ్యర్థికావ్యకర్త) ప్రతి వ్రాసి శా॥శ॥ వర్షములు గ్రంథముచివర వ్రాసియున్నాఁడు. శా॥ శ॥ 1678 లోఁ దా నీప్రతి 80 సంవత్సరముల నాఁటిది

వ్రాసి యిచ్చితి నని చెప్పినాఁడు. ఈ క్రింది వంశవృక్షమును జూడుఁడు.

గురిజాల రంగరాజు

|

మల్లన సోమయాజి (ముత్తాత) 1685 క్రీ. శ.
(దాక్షాయణీ పరిణయ కృతిభర్త)

|

యజ్ఞామాత్య (తాత) 1695 క్రీ. శ.

|

పార్వతీశ్వరుఁడు (తండ్రి) 1725 క్రీ. శ.

|

పేరమంత్రి
(శివరామాభ్యుదయకృతిభర్త) 1755 క్రీ. శ.
(1678 శా॥ శ॥)

ఈ శివరామాభ్యుదయము వ్రాసిన కవి పోడూరి పెద రామామాత్యుఁడు. తత్కృతిభర్తకాలము మనకు సుస్పష్టముగఁ దెలియుచున్నది కదా! ఈ పోడూరి పెదరామామాత్యుని పద్య మొక్కటి వినుఁడు. కృతిభర్త యగు పేర మంత్రినిఁ గూర్చి చెప్పినది.

"సీ. ఏమంత్రి కులపూర్వుఁ డిల జమత్కార భా
రత మంచి శ్రీరంగ రాజనాముఁ

డే మంత్రిశ్రీముత్తాతై యా మల్లయజ్వా దా
క్షాయణీపరిణయగ్రంథ మందే। ”
(శివరామాభ్యుదయము.)

అనఁగా క్రీ॥ శ॥ 1755 లో నున్న పేరమంత్రి ముత్తాత యగు మల్లన సోమయాజి దాక్షాయణీపరిణయము కృతినందెను. ఇప్పుడు మనకు దాక్షాయణీపరిణయకృతికర్త లున్న కాలము తేలదా? పోడూరి పెదరాముఁడే వ్రాసినది వినుఁడు.

“సీ. భా తాశ్వయుజ కృష్ణ దశ మీంచువారంబు
వరకు దాక్షాయణీపరిణయంబు

.... .... .... .... .... ....

గీ. జేసి వంశ వర్ధనుడయి సిరుల వెలయు
పేరమంత్రీశ్వరునకుఁ బోడూరి పెద్ద
రాముఁ డెనుబది సంవత్సరములనాఁటి
ప్రతి విమర్శించి వ్రాసిచ్చె పత్కు మునకు॥”

కావున పేరమంత్రి ముత్తాత పేరమంత్రి కెనుబది సంవత్సరములు పూర్వు డనవచ్చును గదా! క్రీ॥ శ॥ 1755 లో 80 సం॥ రములు తీసివేసినచో క్రీ॥ శ॥ 1675 ప్రాంతముల దాక్షాయణీపరిణయము వ్రాసియుండవలెను. ఈ కృతి వ్రాసిన కేసన మల్లకవుల ముత్తాతయగు పోతన కాలమిప్పుడు సులభసాధ్య మగుచున్నది. ఈ 1675 లో 100 సం॥ రములు తీసివేసినచో దాక్షాయణీపరిణయకర్తల ముత్తాత కాలనిర్ణయము స్థూలముగఁ దేలవలయునుకదా! అనఁగా క్రీ॥ శ॥ 1575 లో పోతనామాత్యుఁ డుండవలెను. ఆ కాలమునందుఁ బురుషులు చిరకాలజీవు లైనను, 75 సం॥ రములు మన

యూహాల భేదములక్రిందఁ, దీసివేసినను, క్రీ॥ శ॥ 1500 కంటెఁ బోతనామాత్యుఁడు వెనుకకు వెళ్ళఁడు. మన విజయ నగరము మిత్రులు పోతన్న నింకొక 200 సం॥ రములు వెనుకకుఁ బంపనెంచుచున్నారు.

ఈ కాలనిర్ణయము నిశ్చయమైనయెడల భాగవత పీఠికకారులు వ్రాసిన క్రీ॥ శ॥ 1378 లోఁగాని, పునర్ముద్రణమైన యాంధ్రకవులచరిత్రము నందలి 1405 సం॥ రమున జననమొందికాని, శ్రీనాథునికి సమకాలికుఁడై కాని, కాక, బహుశః క్రీ॥ శ॥ 1480–1520 ప్రాంతముల పోతన్న యుండె ననవచ్చు నని కనఁబడుచున్నది. వెల్లంకి తాతంభట్టు భాగవతసారము వ్రాసెను. ఇతఁడు నారాయణశతకము నుండి పద్యములు తన లక్షణములో నుదాహరించి యున్నాఁడు. భోగినీదండకము తాతంభట్టునాఁటికే యున్నది. ఈ విషయముల ననుసరించి కూడఁ బరిశీలించి యనేక కలహముల కాకర మైన పోతన్న కాలము నిర్ణయించెదరుగాక!''

(ఆంధ్రపత్రిక. 22-3-1920, 23-3-1920.)

నా యూహచేఁ బోతన కృష్ణరాయని కించుకఁ బూర్వుఁడు. స్పష్టముగ క్రీ॥శ॥ 1420–1560 లకు నడుమవాఁడని మన విజయనగరపు మిత్రులవాదము ననుసరించియే (మడికి సింగన్న) పొగడకపోవుటచే చెప్పవచ్చును.

బమ్మెర పోతన్న కొడుకు మల్లన యనియు, నాతనికి ప్రౌఢసరస్వతి కొడు కనియు, నా సరస్వతి కిరువురు భార్య

లనియు, నాభార్య లిరువురకు నిరువురు పుత్రు లుదయించి రనియు, వారిపేళ్ళు కేసన, మల్లనకవు లనియు, వారిర్వురును గలసి దాక్షాయణీపరిణయమును, విష్ణుభజనానందమును వ్రాసిరనియుఁ గదా తెలియుచున్నది. బమ్మెర ప్రౌఢసరస్వతి యల్లుఁడును, పై జంటకవుల బావమఱఁదియు నగు అజ్జరపు పేరయ లింగకవి ఒడయనంబివిలాసమువలనఁ గూడఁ గొన్ని వివరములు చిక్కెను. పోతన్న మనుమఁడగు ప్రౌఢసరస్వతి గోదావరీతీరము సందలి యజ్జరము, ఆచంట, ఐతంపూడి, ప్రాంతములకు బమ్మెరనుండి గురిజాలవారితో వలస వచ్చియుండుననియు, పోతన్న వంశీకు లిప్పటికిని దౌహిత్ర సంబంధమువారు తణుకుతాలూకాలో మాబందుగులై యున్నా రనియు, మనవి చేయుచున్నాను. ఈ గ్రంథముల వివరములు కావలసినవారు నా యీ క్రిందివ్యాసములఁ జూడవచ్చును. (1) దేశమాత 12-12-1917; (2) హితకారిణి 28-4-1918; (3)ఆంధ్రపత్రిక(పైది). దాక్షాయణీపరిణయము వ్రాతప్రతి నాకడను, విష్ణుభజనానందము ఓరియంటలు లైబ్రిరీలోను గలవు.

"బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదవ యెల్లపుడున్ భవనాశ హేతుభూ
తమ్మయి; లోకనాయకకథావిని వేశిత సర్వసాధు చి
త్తమ్మయి; గోస్త నీరసయుతమ్మయి యున్కినో; పాపివిన్కినో"
(అముద్రితగ్రంథచింతామణి సం. 10. సం. 10-1897)

---

# అయ్యలరాజు త్రిపురాంతకుఁడు

మన మీవలకు "అయ్యలరాజు" వారిలోఁ బ్రథమ కవిగా రామాభ్యుదయమును రచించిన రామభద్రుఁడు నెఱుఁగు దుము. ఈ వంశమునందుఁ బుట్టిన అయ్యల భాస్కరకవులు రెట్టమతశాస్త్రమును, నారాయణామాత్యుఁడు హంసవింశతియు రచియించిరి. కాని వీరందఱకుఁ బూర్వుఁడైన త్రిపురాంతకుఁడు రామాభ్యుదయకర్తయగు రామభద్రునకుఁ దాతయైనట్లు కన్పట్టుచున్నాఁడు. ఇతఁడే రఘువీరశతకమును రచియించినవాఁడు. ఈతని శతకము సంపూర్ణముగ దొరకుచున్నది. వీరి యింటిపేరు "అయ్యలరాజు" వారని యీ త్రిపురాంతకుని తండ్రి వలన వాడుకలోనికి వచ్చినను, రంగరాట్ఛందాది లక్షణగ్రంథముల వలన వీరి యింటిపేరు "పుత్తేటి" వారని వాడుక యున్నట్లు కన్పట్టుచున్నది. పుత్తేరు వాసమున నీయింటిపేరు వచ్చినదేమో యనవచ్చును.

రామభద్రకవి కృష్ణరాయని ప్రోత్సాహముచేఁ దన చిన్నతనమున సకలకథాసంగ్రహమును వ్రాసినట్లు చెప్పుకొనుటచేత రామభద్రుని తాతయగు త్రిపురాంతకుఁడు క్రీ॥శ॥ 1460 ప్రాంతముల నుండి యుండివచ్చును. కాని యిటీవల దొరకిన "ఏకశిలానగరమాహాత్మ్య" మను నొక కల్పితగ్రంథమునం దీ క్రింది విశేషములు కాన్పించుచున్నవి.

"శివదేవరాయ లను ప్రభు, సవినయత న్విజయనగరసామ్రాజ్యం బై
నవఖండంబుల నేలుచు, నవిరళముగ రామదేవు నర్చనచేసెన్.

వ. అట్టికాలంబున శాలివాహనశకవర్షంబులు వేయిన్నూటడెబ్బది మొదలు ఎనుబదిరెండువఱకుఁ దన రాజ్యంబునకు లోఁబడిన సిద్ధవటపురంబున కిరుదెసల వంటిమిట్ట శ్రీరాములవారికి సకల భోగంబులు జరుగునటులఁ గొన్ని పురంబుల నరణంబిచ్చె. ఆ సమయమునందు,

ఉ. అయ్యలరాజవంశజుఁడు నాలుగు బంధులు మిత్రులాదిగాఁ
జయ్యనఁ బుత్రునెత్తుకొని స్వామికి నర్చనసేయ వేళఁ ద
ల్లయ్యెడఁబుత్రునుంచి బహుళమ్ముగ వేడుచునుండి రాత్రియై
పొయ్యెరి బిడ్డయం చనక పొల్పుగ రాముల మాయ ! చిత్రమో!

గీ॥ ఉదయమున లేచి బిడ్డను వెదకుకొనఁగ
నెల్లెడలఁ గాన కాత్మలోఁ దల్లడిల్లి
బదియునొక్క నెలయు బాగుగాఁ బెంచితి
నిచ్చి నతని కియ్య నేమి కొదవ॥

క॥ అనుచును మూఁడుదినంబులు
తనయాత్మం బుత్రుఁ దలఁచి తారకనామం
బును జపియించుచు నుండిన
గనుగవకున్ దోఁచె సుతుఁడు కాపున్నక్రియన్॥

క. నాలవనాఁడును పూజా మూలంబుగ నంబియరుగ మురహరివలెఁ దా
కాలుని గెలిచిన పుష్కరు వాలెం గుడినుండి వెడలె వసుధవు నెంతన్॥

గీ. తల్లిదండ్రిమొదలు దగ వారివారలు
హర్ష మొదవ దా మహర్నిశముల
దలఁచుకొంచుఁ బేరుదగు రామభద్రయ్య
యనుచుఁ బిలిచికొనుచు నరిగి రపుడు॥

క. ఆ రామభద్రయాఖ్యుఁడు,
శ్రీరాముల దయను బొంది చెలగుచుఁ గవిస్తు

యా రాయుప్రభువువద్దను,
పాఱుఁడు ప్రబలకవియయ్యెఁ బరగుచు నుండెన్॥''
(మూఁడు. అధ్యా. ఏకశిలానగరమహాత్మ్యము.)

అను విచిత్రకథ రామభద్రుఁడు శా॥ శ॥ 1470–1482 వఱకు ననఁగా క్రీ॥ శ॥ 1548–1560 వఱకు (?) పాలించిన శివదేవరాయలప్రభువు కాలములోనివానిగాఁ జేయుచున్నది. ఒకవేళ కృష్ణరాయనికాలమున బాలుఁడై తరువాత రామభద్రుఁడు పెద్దవాఁడయ్యె ననుకొందమనిన, రామభద్రుఁడు శివదేవరాయలకాలమునఁ బసిబాలుఁడైనట్లును, ఆతని తల్లిదండ్రులు గుడిలో బిడ్డను మఱచి వచ్చినట్లును; మఱి మూఁడుదినములకు దొరికినట్లును, తల్లి యగు సీతాదేవియే పాలిచ్చి పెంచెనా, బిడ్డ యెట్లు జీవించె నని తల్లిదండ్రులాశ్చర్యము నొందినట్లును పైకథ చెప్పుచున్నది. మూఁడు దినములకుఁ బిమ్మట బిడ్డఁడు బ్రతికియుండఁ దలిదండ్రు లిట్లనుకొనిరఁట!

క॥ సీతారాములు పెంచిరొ, యేతీరున బ్రతికివచ్చె నీసుబ్బఁడు శ్రీ
మాతయయి సీత స్తన్యం, బీతనికిని నిచ్చె ననిరి పృథివిని దివినిన్॥ 3 ఆ॥

కావున శివదేవరాయలు కాలమునాఁటికిఁ జంటిబిడ్డఁడుగా నున్న యీ రామభద్రుఁడు కృష్ణదేవరాయని కాలమున నెట్లుండఁ గలుగును? కావున నీ గ్రంథవిషయములు విశ్వాసజనకములు కావు. ఐనను పరిశీలింపవలసియున్నది. కావునఁ బ్రస్తుతము రామభద్రకవి కృష్ణరాయనికి సమకాలికుఁడని యంగీకరించి యాతని తాత యగు రఘువీరశతక

కర్త మఱి 40 సంవత్సరములకు వెనుక, అనఁగా క్రీ॥ శ॥ 1460 ప్రాంతములనుండు నని నిర్ణయించుకొందము. రఘువీర శతకము వ్రాసినది త్రిపురాంతకుఁడా, రామభద్రుడా యను వివాద మీ క్రిందిగద్య వలనఁ గలిగినది.

"ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరశతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజు తిప్పయమనీషి పర్వతాభిధాన పౌత్రాక్కయార్యపుత్రి, పరిశీలిత సమిద్ధ రామానుజ మత సిద్ధాంతమర్మ ముమ్మిడివరదాచార్య కటాక్షవీక్షాపాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీరామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయంబునందు ... ..."

రఘువీరశతకనిర్మాణకర్మఠుఁడు తిప్పయ్య యను త్రిపురాంతకుఁ డని కొందఱును, రామభద్రుఁ డని కొందఱును నిర్ధారించిరి. కాని క్రీడాభిరామము పీఠికలో నున్న యీ క్రింది పద్యము సందేహము తీర్చుచున్నది. పై గద్యమున నానిశేషణము తాతకే చెందునని కవి యభిప్రాయ మని స్పష్ట మగుచున్నది.

చ॥ అతులప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యలార్యుజు సత్పుత్రుఁ డం
చితభక్తిన్ ద్రిపురాంతకుండు రచియించెన్ తెన్గుపద్యంబులన్
శతకం బొక్కటి దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
ర్వతకన్యానుత యొంటిమిట్టరఘువీరా జానకీనాయకా *॥

* ఈ పద్యము తంజాపూరు రఘువీరశతకప్రతిలోఁ గాము చూచితి మని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడఁ జెప్పుచున్నారు.

ఈ పద్యమువలన రఘువీరశతకకర్త త్రిపురాంతకుఁడు గాని రామభద్రుఁడు గాఁడని తేలుచున్నను, రంగరాట్ఛందాది గ్రంథములలో "పుత్త్రేటి రామభద్రుని రఘువీరశతకమునందు" అని లక్ష్యము లుదాహరింపబడినవి. రామభద్రుఁడు కూడ మఱియొక రఘువీరశతకమును నిర్మించెనో, పై రామాభ్యుదయగద్యమే తల్లాక్షణికులఁ గూడఁ బొరపెట్టెనో తెలియదు. రామాభ్యుదయగద్యయందలి "శతకనిర్మాణ కర్మఠ" విశేషము తాతగారికే చెందు నని పై పద్యము ననుసరించి తలంచెదముగాక!

పై పద్యమునందలి "రాయకవి యయ్యలరాజు" అను విశేషణమువలనఁ ద్రిపురాంతకునియింటిపే రావఱకు "రాయకవివా" రని కాని, లేక త్రిపురాంతకుని తండ్రికూడఁ గవియనియు, సామాన్యకవి గాక కవిరాయఁడనికాని, ప కర్ణాటకరాయలకడనో కవియని కాని సందేహించుటకు వీలగుచున్నది. కాని యాతని విశేషము లేవియుఁ దెలియవు. ఆతని గ్రంథములును జిక్కవు.

త్రిపురాంతకుని రఘువీరశతక మాకాలమున మిక్కిలి వ్యాప్తి నొందుటయేగాక లాక్షణికు లంగీకరించుటచేఁ బ్రౌఢగ్రంథముగఁ బ్రసిద్ధికెక్కియుండును. కావుననే రామభద్రుఁడది యొక విశేషముగ-నీ శతకనిర్మాణకర్మఠుఁ డగు నాతని మనుమఁడ నని గద్యలోఁ జెప్పుకొనినాఁడు. రఘువీరశతక

మా కాలమున మిక్కిలి ప్రసిద్ధికి వచ్చినట్లును, శతకకవులఁ గూడ మనపూర్వులు గౌరవించినట్లును, జెప్పుట కిది ప్రబల నిదర్శనముగఁ జూపవచ్చును.

ఇందలి యొంటిమిట్ట కడపమండలములోని దనుట కేయభ్యంతరము లున్నట్లు తెలియదు. ఓరుగల్లువలె నిచ్చట వాదప్రతివాదములు కన్పట్టవు. కాని యీ కవులలో నెవ్వరి నిఁబట్టియో వచ్చినవాడుక ప్రమాదమున జనశ్రుతిలోఁ బోతన్నకుఁ దగిల్చిరి. భక్తుఁడును, పై విచిత్రకథానాయకుఁడు నగు రామభద్రుని గుఱించి చెప్పుకొనుకథలే పామరులు పోతన్నకు ముడిపెట్టుటయు నది క్రమముగాఁ జరిత్రవఱకెక్క బలసినది కాఁబోలు. మొత్తముమీఁదఁ నొంటిమిట్టకూడ మంచికవులు పుట్టినచోటు!

పోతన్న యోరుగంటికిఁ బోయినను దక్కవికి సమకాలికుఁడు, భక్తుఁడు, మహాకవియు నగు త్రిపురాంతకుఁ డను శతకకర్తతో సమానుఁ డనఁదగిన కవినిఁ గడపమండలము చూచుకొని యానందింపవచ్చును.

ఈతఁ డార్వేలనియోగి. అయ్యలరాజు పుత్రుఁడు. ఆపస్తంబసూత్ర కాశ్యపగోత్రజుఁడు. కవులచరిత్రమునందు రామభద్రకవి తిప్పయార్యుని ప్రపౌత్రుఁడు, అక్కయార్యుని పుత్రుఁడు నని వ్రాసియున్నారు. కాని తిప్పరాజును, పర్వతరాజును సోదరు లని వావిళ్ళవారి యీ శతకపీఠికచేఁ దెలి

యుటచేఁ దిప్పయ రామభద్రుని తాతయే యనవచ్చును. వంశవృక్ష మిట్లేర్పడును.




కవుల చరిత్రమునందు హంసవింశతి రచియించిన నారాయణకవి పూర్వులు త్రిపురాంతక రామభద్రాది కవివర్యు లని చెప్పుకొనినాఁ డనిరి. కాని యాతని గోత్రము కౌండిన్యసయని "కౌండిన్యసగోత్రపవిత్రుండును" 1-16 అని నారాయణకవి హంసవింశతిలో వ్రాసినాఁడు. కారణము పరిశీలనార్హము. *

అయ్యలరాజు తిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగు కొండధీరునిన్.

* రామభద్రకవి కథాసారసంగ్రహగద్యలో కాశ్యపగోత్రపవిత్రుడనియే యున్నది కాని, ప్రభుత్వమువారు వ్రాయించి యుంచిన వ్రాఁతవివరణపట్టికలో "కౌండిన్య" గోత్రమువాఁడని వ్రాసియున్నారు. కావున నీ కథాసారప్రాచీనప్రతులు పరిశీలింపవలసియున్నది.

జయ్యనఁ దిమ్మయ ప్రభుని సత్కవితాగచనాఢ్యు లైన మా
యయ్యలరాజువంశజుల నాదిక వింద్రుల సన్నుతించెదన్.

ఇట్టి పూర్వులలో నొకఁడయిన రామభద్రకవి తన సకలకథాసారసంగ్రహములో,

"ఇది శ్రీరామభద్ర భద్రప్రసాద లబ్ధకవిత్వ మహత్వ విశారద శారద సత్కవిమిత్రాపస్తంబసూత్రపాత్ర కాశ్యపగోత్రపవిత్ర రామభద్ర ధీముద్రాభద్ర రామభద్ర ప్రణీతంబైన"

హంసవింశతిగద్య చూడుఁడు.

"ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి పూర్ణిమాచంద్ర నిస్సహాయకవిత్వ నిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణామాత్యప్రణీతం బయిన హంసవింశతి యను మహా ప్రబంధమునందు"

అయ్యలరాజు రామభద్రుఁడు హంసవింశతికర్త పూర్వుఁడు కాఁగా, హంసవింశతికర్త కౌండిన్యగోత్రజుఁ డెట్లగును ? ఇది విచారణీయము.

అయ్యలరాజు రామభద్రకవి వ్రాఁతలవలన నీ వంశము వారు వైష్ణవమతప్రవిష్టు లైనట్లు గాన్పించుచున్నది. అది రామభద్రకవికిఁ బూర్వమే యైయుండవచ్చు నని తిప్పన్నశతక మవకాశము నిచ్చుచున్నది. పరవస్తువారు పరమగురు లని చెప్పెను.

క. పరవస్తు వంశ రత్నాకరకౌస్తుభమణిప్రభావభుని యయి నాకుం
బరమ గురువైన ముమ్మిడి వరదాచార్యాంఘ్రివనజ వందారుఁడనై.

"నాకుం బరమగురువై" యని చెప్పుటవలన రామభద్రుఁడే పూతనవైష్ణవము రాజాదరణముకొఱకుఁ బొందె నన వచ్చునేమో ? ఇతని పూర్వులయినను రామభక్తులు.

ఈ త్రిపురాంతకునిశతకశైలి తెలియుటకుఁ గొన్ని పద్యములఁ జూపెదను.

శా. కసుమాలంబగు దేహిపుట్టువును నే కష్టంబులన్ బాపి ది
వ్యశరీరం బొనరింతు వెప్పుడు నినున్ వాక్రుచ్చినన్ యోగిమా
నసగేహమ్ముల నుండి లోహము సువర్ణచ్ఛాయలం జేయఁగా
రసవాదంబున నేర్చికొంటి రఘువీరా! జానకీనాయకా!

ఈ కవి తన శతకములో నీ క్రిందిపద్యమును వ్రాసి యున్నాఁడు.

ఆ కర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబునన్
నా కావ్యంబులు మెచ్చఁజేసితివి నా నా రాజులున్ జూడఁగా
నీకున్ బద్యము లిచ్చుచో నపుడ వాణీదేవి నాజిహ్వకున్
రాకుం డెట్లు వసించుగాక రఘువీరా! జానకీనాయకా! 3.

ఈ కర్ణాటకమండలాధిపతి యెవ్వరో తెలియదు.

త్రిపురాంతకుఁడు పోతనామాత్యున కించుమించుగా సమకాలికుఁడు. ఈతని శతకమునందు నారాయణశతకమునందలి పద్యభావములును, భాగవతానుకరణమును గూడఁ గనఁబడుచున్నవి. మచ్చు చూపెదను.

(1) నారాయణశతకము నందలి "ధరసింహాసనమై" పద్యమున కనుకరణము.

మ. కొడుకుల్ బ్రహ్మలు కూతు రీశ్వరశిరఃకూటంబుపైఁ గాపురం
బుడురాజున్ గ్రిహరాజుఁ గన్న లహిగా జుయ్యాలమంచంబు నీ
పదతుల్ శ్రీయు, ధరిత్రియున్ సవతుచెప్పన్ వేఱె నీవన్న యా
రడిమర్త్యుల్ గనలేరుగాక రఘువీరా జానకీనాయకా! 15

(2) నరకృతి నీతఁడు పోతన్నవలెనే నిరసించెను.

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పిన కృతుల్ ఛీ ఛీ నిరర్థంబులౌ
నతికిం బాత్రము గావు మేఁక మెడ చన్నుల్ నేతిబీరానుఁబున్
వితతప్రౌఢిని నీకుఁ జెప్పినకృతుల్ వేదాలు శాస్త్రాలు భా
రతరామాయణముల్ దలంప రఘు॥ 62

(3) కవి 13 వ పద్యములో రఘువీరునే కర్ణాటాధీశ్వరుఁ డని చెప్పి యాతనినే తన కొక గ్రామ మిమ్మని యాచించుచున్నాఁడు.

"నీ సీమలో గ్రామం బొక్కటి చాలు నాకు రఘువీరా" 54.

(4) ఈతఁడు తనకాలమునందలి రాజును నీచుఁ డని నిందించెను.

మ. తమ గర్వంబున దారుపుం గుడగుచున్ దైవంబు మంత్రంబు తం
త్రములన్ వీఁపగ నాడుచున్ దిరుగు నిర్భాగ్యుల్ మహారాజులై
మము నూరింపఁగ నేము నిన్నెఱిఁగి నీ మంత్రం బెఱింగిన్ దరి
ద్రిమతిన్ వేసఁగఁబోవు టెట్లు రఘువీరా॥ 59

(5) తాను నూఱుపద్యములు వ్రాసెద నను చున్నాఁడు.

శా. తారుణ్యోదయ యొంటిమిట్టరఘునాథా నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పెద నూరు పేరు వెలయన్ సూత్నంబుగా నంత నా

సోరఁన్ బావనమూను నీకరుణఁ గాంతున్ భక్తి నన్నుందఁబున్
రా రమ్మందురు గారవించి రఘు॥ 65

(6) భాగవతము నందలి "ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై" నను పద్యమున కనుకరణము.

సు. పరనారీకుచకుంభపాళికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ పాఱెడు నా తలంపులు మిమున్ భావింపఁగాఁజేసి స
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీరా జానకీనాయకా॥ 69

(7) భజగోవిందము నందలి యీ క్రింది శ్లోకాభిప్రాయము సాధారణముగా శతకము లన్నిఁటఁ గానఁబడును. ఇందు నున్నది.

శ్లో. బాలాస్తావ త్క్రీడాసక్తా స్తరుణాస్తావ త్తరుణీసక్తః
వృద్ధస్తావ చ్చింతాసక్తః పరేబ్రహ్మణి కోపినసక్తః॥భజ॥
శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథాప్రాల్మాలి దుర్బుద్ధినై
జాలన్ యౌవనమందు గర్వమతినై సంసారినై దుష్క్రియా
జాలభ్రాంతి జరింతుఁ గాని నిను గాంతుం గొల్వలే దయ్యె హా
రాళం బైనది చింతవంత రఘువీరా॥ 72

(8) ఈతఁడు వైష్ణవమును స్వీకరించినట్లే యనుమానింప వీలగుచున్నది. చక్రాంకిత మని ముద్రలఁ గాల్చి శరీరమున నంటించు వైష్ణవాచారము నీతఁడు వర్ణించుచున్నాఁడు.

మ. చెలువంబొప్పు సువర్ణముద్ర లితరుల్ చెల్లించుచోఁ గ్రొత్త కా
కల నీ ముద్రలుచూడఁ జెల్లుబడి చక్రాలంచు వేయించు మం

దలనాథాగ్రణి క్రొత్త నీబలిమి నానావర్ణపుం దోలు ము
ద్రలు చెల్లించితి వింపు నందు రఘువీరా॥ 80

ఈ పద్య మాకాలమునందలి రాజులు నాణెములఁ జేయించు టంకశాలలు స్థాపించుటకూడఁ దెలుపుచున్నది.

(9) జానకీపతిశతకము నందలి పద్యము పోలిక.

చిలుకను బెంచి ముద్దులకుఁ జేడియ పల్కుచు రామరామ య
న్పలుకులు నేర్పుచున్ వలుక పైఁబడి మోక్ష మొసంగి తెంచు నే
పలుమరు నీకథ ల్వినియు భక్తిని నామము లుచ్చరింపుచున్
బలమగు పాపబంధమునఁ బాఱఁగఁగంటిని జానకీపతీ॥

జానకీపతిశతకము 7.

మ. చిలుకన్ ముద్దులు చిల్కఁ బల్కుతతి రాజీవాక్షి యొక్కర్తు ని
చ్చలు రామా రఘురామ రావె యనినన్ సాలోక్య సామీప్యముల్
కొలదుల్ మీఱఁగ నిచ్చినాఁడ వఁట నీపం బిడ్డ పే రిడ్డవా
రల పుణ్యంబున కేది మేర రఘువీరా జానకీనాయకా॥ 82

తాతయగు తిప్పన్న యీయభిప్రాయము చేతనే మనుమఁ డగు రామాభ్యుదయకర్తకు రామభద్రుఁ డని నామకరణము చేయించి యుండవచ్చును.

(10) రవిసూనునన్ బరిమార్చి యింద్రసుతునిన్ రక్షించినాఁ డందునో
రవిసూనునన్ గృపసేలి యింద్రసుతుఁ బోరం దుంచినాఁ డందునో
యివి నీయందును రెండునుం గలవు నీకెద్దిష్టమో చక్కఁగా
రవివంశాగ్రణి తెల్పవయ్య రఘువీరా॥ 92

ఈ పద్యము తిక్కన్న భారతకృత్యాదివివ్రాసిన "క్షిమ స్థిమాలాం" శ్లోకమును స్ఫురణకుఁ దెచ్చుచున్నది.

(11) ఈతఁడు పోతన్నవలెనే తన శతకమును దశకములుగా విభజించి యున్నాఁడు. (ఈగ్రంథపీఠికచూడుడు).

(1) అవతారదశకము, (2) ప్రత్యక్షదశకము, (3) చాతుర్దశకము మొదలగు నామములతో విభాగించెను. ఇదికూడ ముద్రాపకులు విడిచివేసిరి. నాకు దొరికిన నారాయణశతకములో మొదటిప్రతిలో నీ దశకవిభజనము లేనందున నేను ముద్రింపలేకపోయితిని. ఇది తిరిగి ప్రారంభించుట మంచిది.

అయ్యలకవి, భాస్కరకవియుఁ గలిసి వ్రాసిన రెట్టమతశాస్త్రమునం దీ క్రిందివిధముగ నున్నది.

"అయ్యలరాజు అయ్యన్న (రాయకవి) వంశజుఁడగు పిన్నకన్న కొడుకు అయ్యలాఖ్యుఁడు; నాగన్నకొడుకు భాస్కరుఁడు."

రెట్టమతశాస్త్రము. 1—10

"విశేషించి వీరలు శ్రీరఘునాయకదయాలబ్ధసారస్వతులును, రఘువీరశతక నిర్మాణకర్మఠ రాయకవితిప్పనార్యపాలకులును మదీయాశ్రితులు నగుటంజేసి"

రెట్టమతశాస్త్రము. 1—16

"ఇది శ్రీమదొంటిమిట్టరఘువీరకృపాలబ్ధసారసారస్వతధు ర్యాయ్యలరాజ వంశసంభ వాయ్యలాఖ్యభాస్కరాఖ్యకవిద్వయప్రణీతం బగు"

వీరు క్రీ॥శ॥1767 లో నున్నవా రని గ్రంథాంతమున నున్న పద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

హంసవింశతి, రెట్టమతశాస్త్రము, రామాభ్యుదయము, సకలకథాసారసంగ్రహము, దశావతారకథాసంగ్రహముల సాయమున నీ వంశవివరములు వలసినవారు చర్చింపనగును.



—:—

శ్రీ రస్తు

# శతక కవుల చరిత్రము

## ద్వితీయ భాగము

### ధూర్జటికవి

"ఈతఁడు పాకనాటి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాళహస్తిపురనిలయుఁడు; శివభక్తుఁడు" నని కవులచరిత్ర మాతని గ్రంథమునుబట్టి నిర్ణయించి యుండెను. ఈతఁడు కృష్ణదేవరాయని కాలములో నున్నట్లు కుమారధూర్జటి కృష్ణరాయవిజయమున వ్రాసియుండెను.

ఈతని గ్రంథములు రెండు. ఒకటి కాళహస్తిమాహాత్మ్యము, రెండు కాళహస్తీశ్వరశతకము. కాళహస్తీశ్వరశతక మీతనిది కాదని యందలి ప్రయోగములఁ జూచి కొందఱనెదరు. కాని దేశమునం దిది ధూర్జటిశతకమని వాడుకయుండుటయేగాక మనకంటెఁ బ్రాచీనుఁడగు వెచ్చ కస్తూరి రంగకవి తన యానందరంగరాట్ఛందమున నభేదయతి కుదాహరణముగ నీ క్రిందిపద్యమును జూపుచు నిది "ధూర్జటి నాఁటి కాళహస్తీశ్వర శతకమున" అని నిర్వచించెను.

శా॥ నీసంగాక కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబుఁ గంకణము ముంజేఁగట్టితిన్ బట్టితిన్
లోకు ల్మెచ్చ వ్రతంబు నాతలఁపుతీరున్ ధీరునింగాదు చీ
చీ కాలంబున రీతితప్పదుసుమీ శ్రీకాళహస్తీశ్వరా॥

ఆనందరంగరాట్ఛందము 3, 275

ఈ పద్యమును ముద్రాపకులు తమయిచ్చవచ్చినట్లు దిద్దివేసిరి. (చూడు 114 పద్యము శ్రీకాళహస్తీశ్వరశతకము)

కావున నీ శతకము ధూర్జటికవి దని చిరకాలమునుండి వాడుకయున్న దనుట నిస్సంశయము. ఈతని శతకమునందలి యుద్రిక్తభావములచేఁ బాకము సొంపుగానుండును. కావునఁ బండితులును బామరులును గూడ దీనినిఁ జక్కఁగఁ బఠియింపుచు వచ్చిరి. ఈ శతకము మిక్కిలి జనసమ్మతిఁ గన్నది చూచి యనేకు లిట్టిశతకములఁ జెప్పఁబూనిరి కాని దీని రుచి వేనికిని రాలే దనియే చెప్పవలెను. కాళహస్తిదేవునిమీఁదనే నాలుగైదుశతకములు బయలుదేరినవి.

ధూర్జటి గొప్ప పండితుఁడు; మహాకవి. కాళహస్తీ మాహాత్మ్యమును వ్రాసి నరకృతినొసంగక దేవునికి "మూఁడు గట్టి" తనకృతుల నిష్టదైవమునకే యిచ్చిన నిరంకుశుఁడు. ఈ వైరాగ్యము "అభావేవిరక్తిః" అని రాజు నిరాకరింపఁ గలిగిన దనుటకు వాడుకకథలు, గ్రంథస్థ విషయములు దానికిబలమునిచ్చు సంగతులును గనఁబడును. ఎట్లయినను ధూర్జటికవిత మనోహరమైన దని మొదటినుండియు వాడుక

యున్నది. "స్తుతిమతి యైన యాంధ్రకవి ధూర్జటిపలుకుల కేలగల్గెనో యతులితమాధురీమహిమ"? యనువాక్యము నేఁటిదికాదు. పద్యోత్తరభాగము తెనాలి రాముని కొంటెతనమో? తరువాతవారిప్రావీణ్యమో చెప్పఁజాలము. కుమార ధూర్జటి కృష్ణరాయవిజయమున నీపద్యము మాఱి కనఁబడుచున్నది. ధూర్జటి మహాభక్తుఁడు. పూర్వవయస్సున రాజాశ్రితుఁడు. కాని జారుఁ డనుటకు నిదర్శనములు లేవు. వాఁడుక కథ లున్నవి. కాళిదాసాదులకు నిట్టి యభూతకల్పనముల నంటఁగట్టిరి. వీని సత్యముతో మన కంతగా నిమిత్తము లేకున్నను గవిచరిత్రకర్త యాక్రిందివిధముగ నీవార్తను బరామర్శించెను.

"పై పద్యమునుబట్టి చూడఁగా ధూర్జటికవి సంతతవేశ్యాప్రియుఁ డైన రసిక పురుషుఁ డయినట్లు కనుపట్టుచున్నాఁడు. అట్టి యఖండశివపూజాధురంధరుఁ డైన భక్తాగ్రేసరుని నిట్టి జారత్వదోష మేల విడువకుండెనో యూహింపఁజాలకున్నాము. మనదేశము యొక్క దౌర్భాగ్యముచేతఁ జిరకాలమునుండి యిచ్చట విశుద్ధచరిత్రము మతమునుండి విడిపోయినది. ఎట్టి దుశ్చరిత్రగలవాఁడైనను విభూతిరుద్రాక్షలు మొదలైన బాహ్యచిహ్నములను ధరించినంతమాత్రమున భక్తాగ్రేసరుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. అయినను క్రమముగా నిప్పు డిప్పుడు మతమునకు సత్ప్రవర్తన మావశ్యకమన్న సత్యము జనుల మనస్సులలో నాటుకొనుచున్నందున కెంతయు సంతసిల్లవలసి యున్నది."

ఈ మాటలు కవిచరిత్రకర్త కావార్త సత్యమైనప్పుడే యవసరము లేనివి. షేక్స్పియరుకాని, భట్టబాణుఁడుకాని యెందఱు జారిణులకుఁ గనుఁగొలిపిరో తెలిసికొనుట

మెంతయవసరమో యిది యంత యవసరము. ఒకవేళ వార్త సత్యమైనచో నీ వ్యభిచారజీవిత మాకవి నెట్లుమార్చి నదో—ఆ మార్పు కవికృత గ్రంథములలో నేమి మార్పులు కలిగించినదో—విమర్శించుకొనుట కనువగు ననుకొందము. అట్టి సత్యవార్త కాదే! పైఁగా నట్టి విమర్శన మైనఁ జేసి నారా? "లోకములో భక్తికి, మతమునకు, బాహ్యవేషము నకు సంబంధములేకుండఁ బోయినది. ఇది మనదౌర్భాగ్య" మని నిర్ణయించినారు. ఈ దౌర్భాగ్యము ప్రతిమతము నందును ప్రతిదేశమునందు నున్నది. క్రైస్తవమతమునం దాచార్యు లందఱు నీతిపరులా? బర్మాదేశమునందలి బౌద్ధ గురువులందఱు పవిత్రులా? బాహ్యవేషముచే లోకమును మోసగించి వ్యభిచరించు పీఠాధిపతులు కొందఱు దుర్మార్గు లున్నా రని, పీఠాధిపత్యములనే నాశనమొనరింపఁ గలిగిన శ్రీ వీరేశలింగముపంతులుగారు, మతతత్త్వము నెఱిఁగినవా రనఁగలమా? వారు మంచిదని నమ్మిన సంఘసంస్కరణమున కారంభించిరి. శ్రీముఖములు, వెలివేయుటలు, బహిష్కా రములు నారంభ మైనవి. మఠాధిపతులు పరమశత్రువు లని తలంచి వారిని బడిబాలుర సాయమున, పత్రికల వ్రాఁతల వలన, ఫార్సుల ప్రచారము వలన నడంపఁగలిగిరి. ఎవ్వరో యొకరిద్దఱు చెడ్డస్వాములు వారికంటికిఁ గనఁబడియుండును. వారిదోషము మఠాధిపతు లందఱకుఁ జెందలేదా? హిందూధ ర్మము:౯౯ గావాఁడు మతముల కిప్పు డుత్తరసర్కారులలోఁ

బూర్వపుఁ బలుకుబడి యేది? ధూర్జటిజీవితము మంచిదైనను, చెడ్డదైనను ధూర్జటిశతకమునం దది ప్రతిఫలించియున్న దనియే నాయూహ!

(1) ఇతఁడు మంత్రశాస్త్రము, సాంఖ్యాదియోగరహస్యములు నెఱిఁగినవాఁ డని యీక్రిందిపద్యమువలన నూహింపవచ్చును.

మ. పరిశీలించితి మంత్రతంత్రములు, చెప్పన్ వింటి సాంఖ్యాదియో
గరహస్యంబులు, వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంకపా
దరయం గుమ్మడికాయలోని యవగింజంతైన నమ్మించి సు
స్థిరవిజ్ఞానము త్రోవచెప్పఁగదవే శ్రీ కాళహస్తీశ్వరా॥77

(2) సంసారబంధము నీతఁ డెంతో ముచ్చటగాఁ వివరించెను.

శా. ఆలంచున్ మెడఁగట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధము గావించి
యా మాలార్కంబున బాంధవం బనెడి ప్రేమం గొందఱం ద్రిప్పఁగా
సీలన్ సీల యమర్చిన ట్లొసఁగితో శ్రీ॥

(3) భారతమునందలి పద్యమున కనుకరణము.

మ. మదమాతంగతురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పదఁ గోలిం గొని తెచ్చి యిచ్చి ముదమొప్పన్ గాంచి సేవించి ర
మ్యోదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్॥
(భారతము)

మ. మదమాతంగము లందలంబులు హయాల్మాణిక్యము ల్పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళంబు ల్మోక్షము వీఁజాలునే

మదిలో వీని నపేక్ష చేసి నృపధామద్వారదేశంబుఁ గా
చి దినంబుల్ వృథపుత్తు రజ్ఞు లకటా శ్రీకాళహస్తీశ్వరా॥
(కాళహస్తీశ్వరశతకము) 92

(4) ఈతఁడు పాలుకురికి సోమనాథుని గ్రంథముల శైవుఁడుగావునఁ దప్పక పఠించియుండును. పోలికలు లేక పోలేదు.

క. కలనాఁడె ధనము ప్రాయము
గలనాఁడె జవంబు బలము కలనాఁడె విని
శ్చలమతియు గతియుఁ దనకున్
గలనాఁడె భజింపవలయుఁ గరుణానిలయున్॥
(అనుభవసారము.)

శా. దంతంబుల్ పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్మేన జరించనప్పుడె కురుల్వెల్లంగఁ గానప్పుడే
చింతింపన్వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా॥
(శ్రీకాళహస్తీశ్వరశతకము - 34)

(5) ఈతఁడు శివానందలహరి ననుకరించిన భాగములు నున్నవి.

మ. తమకం బొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం
గ మహోద్యోగము సేయు నెమ్మనము దొంగన్ పట్టి వైరాగ్యపా
శములం జుట్టి బిగించి నీదుచరణస్తంభంబునన్ గట్టివై
చి ముదం బెప్పుడుఁ గల్గఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా॥ 82

(6) ఈతఁడు శైవుఁ డగుట నీతనికిఁ గృష్ణరాయఁడు సంపూర్ణ దయ చూపనందునఁ గాఁబో లీతఁడు ధ్వనిప్రధానముగఁ గొన్నిఁట- తెగఁబడి, కొన్నిఁట- పరోక్షముగను-

రాజుల నిందించెను. ఇదివఱకుఁ దానడిగినట్లు నింక నడుగ ననియు ననుచున్నాఁడు.

మ. అడుగంబో నిఁక నన్యమార్గరతులం బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినఁ బోదు నీదు పదపద్మారాధకశ్రేణియు
న్నెడకు న్నిన్ను భజింపఁగాఁ గనియు నాకేలా పరాపేక్ష కో
రెడి దింకేమి భవత్ప్రసాదమె తగున్ శ్రీ కా॥ 30.

ఈ నియమము శివభక్తుల కందఱకుఁ గూడ విధింపు చున్న శివతత్త్వసారనీతి యేమో?

మ. నిను నిందించిన దక్షుపైఁ దెగవొ వాణీనాథు శాశింపవో
చనునా నీ పదపద్మ సేవకులఁ దుచ్ఛంబాడు దుర్మార్గునిన్
వెనుప న్నీకును నీదు భక్తతతికిన్ భేదంబు గానంగ వ
చ్చెనొ లేకుండిన నూరకుండఁగలవా శ్రీ కా॥ 109

ఇదిగాక రాజుల నీతఁడు కఠినముగ "రాజు ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు 18"; "రాజకీటముల నే సేవింపఁగా నోప 25"; "రాజలోకాధమ శ్రేణీద్వారముదూరఁజేసె దెప్పుడో 2.?" "రాజర్థాతురుఁడైనచో నెచట ధర్మం బుండు 22"; "రా జన్నంత నె పోవునా కృపయు ధర్మంబు 39" "భవదుఃఖంబులు రాజకీటముల నేఁ బ్రార్థించినం బాయునే 44"; "భూపాలురకా సేవల సేయఁగాఁ బోదు రేలకో జనుల్ 47"; "నృపాలాధముకా భజింపఁ బోదురు భావ్యమె? 63"; "ఒకరిం జంపి పదస్థులై బ్రతుకుదురు 67"; "ధాత్రీశులఁ జేయనేటి కకటా! 83"; "రాజులకు నీ పరిజనులు సేవల్

జేయఁబోరు. 90''; ''ఏల చచ్చెదనో రాజుల మంచు 38''; ''నరనాథాశ్రయము ప్రాణహాని 111''; క్షితినాథులు తిట్టు కవి కాకున్నఁ జూడనే చూడరు 113''; ''బుధుండు భూభృచ్చండాలురఁ గొల్చినప్పుడు వారు కోపింపఁ దాఁ జెడుఁడు 115'' అనువాక్యములఁ దెగడెను.

(7) ఇట్లు రమారమి 15 పద్యములలో రాజాశ్రయమును నిందించి త్యాగరాయలువలెనే ''నిధి చాలాసుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా'' యను భావమును వెల్లడించినాఁడు. ఒకప్పు డీతనిఁ గూర్చి యిట్లు వ్రాసియుంటిని.

''ప్రకృత మీతని వ్రాఁతలను బట్టి యీతని వేశ్యాచరిత్రమే ''నిజమైనచో'' నా జీవన మీతనిశతకమున సంపూర్ణముగఁ బ్రదర్శితమై యున్నది. మఱియు నీతఁడు శైవుఁ డగుటనో, యౌవనుఁ డగుటనో, బహుశః కృష్ణరాయనివలనఁ గాని, మఱియొక ప్రభువువలనఁ గాని, యీతఁ డనాదరింపఁబడుట సునిశ్చిత మైనట్లు కన్పిటితో నతఁ డీ భూలోకప్రభువుల దురాగతముల నాత్రిలోకప్రభునికి విన్నవించిన శతకభాగముల యందుఁ గన్నులకుఁ గట్టిన ట్లగపడును * * ఈతని పైరెండుకావ్యము లవశ్యపఠనీయము లని మాత్రము చెప్పినఁ జాలును.''

(30—11—1915 సువర్ణలేఖ.)

శా॥ రాజశ్రేణికి దాసులై సిరులఁగోరం జేరఁగా సౌఖ్యమో
యీజన్మంబు తరింపఁజేయఁగల మీ మ్మేప్రాద్ధ సేవించు ని
ర్వ్యాజాచారము సౌఖ్యమో తెలియ తే రౌ మానవు ల్పాపరా
జీజాతాతి మదాంధబుద్ధు లగుచున్ శ్రీకాళ. 88

(8) ఆచార్యులవారిని గేలి

మ. అయవార్త్రై చరియింపవచ్చుఁ దనపాదాంభోజతీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని సర్వప్రాణదేహాదు ల
న్నియు నా సొమ్మనవచ్చుఁ గాని సిరుల న్నిందించి నిన్నాత్మని
ష్ఠ్రియతం గానఁగరాదు పండితులకున్ శ్రీకాళ॥ 73

(9). పాలుకురికి సోమన్న నాఁటికిని, ధూర్జటి నాఁటికిని గూడ "కాని" శబ్దము నీచనానార్థముగా వాడుకలో నున్నది. "నీచేత జీతంబు నేఁ గానిం బట్టక" 4 పద్యము, శ్రీకాళహస్తి శతకము.

క. సేయు నెడ భక్తి పరులకు
న్యాయార్జిత మైనయట్టి యఱకానికి న
న్యాయార్జిత మగు మాడలు
వేయును సరికావు భక్తవిధి త్రిపురారీ॥

అనుభవసారము.

(10). కొన్ని పద్యములు భాస్కరశతకమువలెఁ బూర్వార్థ ముపమేయము, ఉత్తరార్థ ముపమానముతోడను వ్రాసెను.

మ. భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న
న్నువివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశి పాలైనఁ బ
ట్టవు; బాలుం డొకచోట నాఁటతమితోడ న్నూతఁగూలంగఁ దం
డ్రి విచారింపక యుండునా కటకటా శ్రీకా॥ 5.

(11) ఈతఁడు జారుఁడే యైనయెడల నాదోషమునకుఁ బశ్చాత్తాపము నీతఁడు వెల్లడించెనేకాని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసినట్లు నీతికి, భక్తికి, బాహ్యావేషమునకు

వైరుధ్యముగఁ బ్రవర్తించి లోకమును మోసగింపలేదు. 32, 62, పద్యములేగాక యీక్రింది పద్యముల వినుఁడు.

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్రాపడె ఱొమ్ము మన్మథవిహారక్లేశ విభ్రాంతిచేఁ
బాయంబాయెను బట్టఁగట్టెఁ దల చెప్పన్ రోత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీకాళ॥ 14

మ. చెడుగుల్ కొందఱుకూడి చేయఁగఁ బనుల్ చీఁకట్లుదూఱంగఁ బా
ల్పడితిం గాని చరింపరాని నిను నొల్లంజాలుఁ బొమ్మంచు ని
ల్వెడలం ద్రోచినఁ జూరుపట్టుకొని నే వ్రేలాడుదుం గోర్కెఁ గో
రెడి యర్థంబులు నాకు వేఁగలుగవో శ్రీకాళ. 101.

ఇదివఱకే చాలపద్యములు చూపియుంటిని. ఈ శతకమునందలి 28, 34, 35, 37, 43, 46, 51, 53, 62, 65, 69, మొదలగు పద్యములు తేనెల తెటలు. భక్తిభరితములు. ప్రతివారు ననుదినము పఠింప వలసిన వని చెప్పినఁ జాలును.

రెండుపద్యములు మాత్రము చూపెదను.

శా॥ లేవో కానలఁ గందమూలఫలముల్ లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవాస్తరణముల్ లేవో సదాయాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుపఁ జాలిం బొంది భూపాలురన్
సేవల్సేయఁగఁ బోదు రేలొకో జనుల్ శ్రీకాళ॥ 46

మ. కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళ॥ 28

ధూర్జటి కృష్ణరాయనికి సమకాలికుఁ డగుట 1530 ప్రాంతమువాఁడు. ఈతని వంశములోని [I] కుమారధూర్జటి (1) కృష్ణరాయవిజయము (2) సావిత్రిచరిత్రము (3) ఇందుమతీపరిణయమును రచియించెను. ఇతఁ డోరుగంటి కాశీపతి సద్గురురాజేంద్రయోగీంద్రుని శిష్యుఁడు. (II) కుమారధూర్జటిపుత్రుఁడు లింగకవి. ఇతఁడు పెద్దకాళహస్తీమాహాత్మ్యమును వ్రాసెను. (III) వేంకటరాయకవి ఇతఁడు రత్నావళీ పరిణయము, అమరమునకుఁ దెలుగును వ్రాసెను. అందు ధూర్జటి నిట్లు పొగడెను.

> మ. పటుగంగాలహరీ తరంగ సమశుంభత్ప్రౌఢతాంచత్కళా
> ఘటనున్ బాదవినమ్రకృష్ణనరరాడ్గంభీరకోటీర వి
> స్ఫుట రత్నద్యుతిపాటలీకృత పదాంభోజాతు సర్వజ్ఞు ధూ
> ర్జటినిం గొల్చెద నస్మదీయ కులకర్తన్ భక్తి రంజిల్లఁగన్॥"

## వ ం శ వృ క్ష ము.

క్రీ॥ శ॥ 1530 (1) ధూర్జటి (కాళహస్తిమాహాత్మ్యకర్త)

|

,, 1580 (2) కాళియామాత్యుఁడు

|

,, 1600 (3) కుమారధూర్జటి (కృష్ణరాయవిజయము కర్త)

|

,, 1650 (4) లింగరాజు (పెద్దకాళీ. మాహా. కర్త)

|

,, 1700 (5) ధూర్జటి వేంకటరాయకవి (రత్నావళీ పరిణయకర్త)

అయితే యీ వంశవృక్షము సరియైనది కాదు. ధూర్జటికిని గుమారధూర్జటికిని గలసంబంధము చింత్యము. (కవులచరిత్రము పుట 456 చూడుడు 1899) ఇతఁడు కాళహస్తి రాజులవలనఁ గూడ గౌరవమునందుచుండువాఁ డనియు, నిప్పటికి నాయాస్థానమున నీతనిగౌరవార్థము ధూర్జటివారి పీఠమని యుంచి యాతనివంశమువారిని గౌరవించెద రనియు వినుచున్నాము. ధూర్జటిపౌత్రులేగాక దౌహిత్రులుగూడఁ గవులై యుండిరి. చెఱుకుమూడి కృష్ణకవి తన శృంగారరాఘవ మను కావ్యమునందు తాను ధూర్జటిదౌహిత్రుఁడ నని చెప్పుకొని నాఁడు. "ధూర్జటి దౌహిత్రి దురితదూరు" నని కవి చెప్పుకొనెను. ఈ గ్రంథము ముద్రిణ మందలేదు. ఇతఁడే వామదేవచరిత్రము మొదలగు గ్రంథములగూడ వ్రాసెను. వివరములు "ఓరియంటలులైబ్రరీ"లో నున్నవి.

---

## తాళ్లపాక చిన్నన్న.

ఈతఁ డష్టమహిషీకళ్యాణము, పరమయోగివిలాసము నను ద్విపదకావ్యములను వ్రాసియుండెను. ఇందలి పరమయోగివిలాసము కవులచరిత్రకాలమునాఁటికే చిక్కియుండెనుగాని యష్టమహిషీకళ్యాణ మిటీవల దొరికినది. అంతకుఁ బూర్వ మష్టమహిషీకళ్యాణమునుండి లాక్షణికు లొకటి

రెండు ద్విపదలు మాత్రి ముదాహరించుచుండిరి. ఈతఁడు సంకీర్తనాచార్యుఁ డగు మహాభక్తుఁడు. తిరుపతి వేంకటేశ్వరున కీతని సంకీర్తనము లెక్కువ ప్రీతికరము లని జనులు నమ్ముచుండిరి. కావుననే యందఱనుదిట్టు స్వభావముగల వేణుగోపాలశతకకర్త యిట్లు వ్రాసెను.

(1) "అల తాళ్ళపాక చిన్నన్న రోమము లైనఁ
దంబుఱదండెకుఁ దంతులౌనె?" 54

"తాళ్ళపాక చిన్నన్న గొప్పవిద్వాంసుఁడు, గాయకుఁడు, కావచ్చును. అంతమాత్రమున నాతని రోమములు తంబురకుఁ దీగెలుగాఁ బనికి వచ్చునా? ఒకవిషయములో గొప్పవాఁ డైనంత మాత్రమున నిఁక నాతని వన్నియు గొప్పవే యనుకొనుట త"ప్పని తాత్పర్యము.

ఇదేవిధముగా శత్రుసంహారశతకకర్త 18 వ శతాబ్దమువాఁడు కూడ నిట్లువ్రాసియున్నాఁడు. తురకలదండు వచ్చి తిరుపతి ముట్టడించి నప్పుడు కవి చెప్పిన ట్లున్నది.

సీ॥ "తాళ్ళపాక చిన్నన్న దండెమీటులు గావు
గోహాంసభుగ్ధను ర్గుణరవములు
బంటొసంగిన బంకమంటి పువ్వులు గావు
యవనాథములు చిలు కంపగములు
సాముడ్డిగియు నీటి చల్లులాటలు గావు
పాశ్చాత్యభటుల తుపాకిగుండ్లు
సంపెంగమాకులుఁ జరిగింపుటలు గావు
రిపులు ప్రాశెములు దర్శించు పగలు

గీ॥ బంటుపంతము దగదంచుఁ బంటకాఁపు
దనము గైకొంటి విది మంచిగుణము, దినము
జనము దెచ్చిన ధనము లప్పనము లిచ్చి
శత్రుసంహార వేంకటాచలవిహార"

౧౧, శత్రుసంహారశతకము.

ఇందుఁగూడ "తాళ్ళపాక చిన్నన్న తంబుర రవము వలెఁ దురకల ధనుష్టంకారములు ప్రీతికరములు కా"వని చెప్పియున్నాఁడు. కావునఁ జిన్నన్నసంకీర్తనములు వేంకటేశ్వరునకుఁ బ్రీతికరము లని ప్రజలు చిన్నన్న తరువాతఁ గూడఁ బ్రఖ్యాతిగాఁ జెప్పుకొనువా రని నిశ్చయమగుచున్నది. ఇతఁడు తన శక్తులనుగూర్చి తన గ్రంథములయందిట్లు చెప్పుకొనినాఁడు. వేంకటేశ్వరుఁడే తనకావ్యములు మెచ్చి మకరకుండలముల నిచ్చె ననుచున్నాఁడు.

"* * వారలలోనఁ గావ్యంబుఁ జెప్పి
యెన లేని శ్రీ వెంకటేశు మెప్పించి
సకలంబు నెఱుఁగ నసాధారణాంక
మకరకుండలము లిమ్మహిఁ గొన్న వాఁడ"

దినమునకు వేయిద్విపదలు వ్రాయఁగలవాఁడట!

"దినములోననె వేయిద్విపద లింపొంద
వినుత వర్ణనలతో విరచించువాఁడఁ
గవిశిరఃకంపయోగ్యప్రతిద్విపద
నవబిరుదాంకుండ"

నని చెప్పుకొనినాఁడు. ఈ "ప్రతిద్విపదశిరఃకంపన" బిరుదము ననుసరించియే కాఁబోలు కొందఱు పండితులు

"ప్రతిపద్యశిరఃకంపము" అను గ్రంథ మొండు కల దందురు. ఈచిన్నన్న ద్విపద లట్టి వనుట కావంతయు సందియము లేదు.

కవిత్వరీతి యిట్లుండవలె నని చెప్పుచున్నాఁడు.

" * * అలఘుశబ్దార్థ సారసరీతి రసప్రభావముగఁ
గులికికస్తురిపీఁటెఁ గోసినకరణి, దెలికప్పురపుఁ గోవిఁ దెఱచినసరణి
విరజాజిపొట్లలు విచ్చినమాడ్కి, బరిమళించుచుఁ గవుల్ బళిబళి యనఁగ
గవిత చెప్పిన యట్టి కవినిఁ గవీంద్రుఁ, డవు నందు రే నేర్చినట్లు చెప్పెదను"

ఈతని యష్టమహిషీకళ్యాణ మిప్పుడు సంపూర్ణముగఁ జిక్కుచున్నది. ఇందు మూఁడాశ్వాసములఁ గంసవధవఱకుఁ గృష్ణ బాలచర్యలును, నాల్గవయాశ్వాసమున రుక్మిణీకళ్యాణమును, వ్రాసి తక్కిన యైదాశ్వాసములలో శ్రీకృష్ణుఁడు తక్కిన యేడ్గురుభార్యలఁ బెండ్లియాడుటను వర్ణించెను. రెండవగ్రంథ మగు పరమయోగివిలాసమున నళ్వారులచరిత్ర ముండును. అది యెనిమి దాశ్వాసముల గ్రంథము.

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. అశ్వలాయనసూత్రుఁడు (ఋగ్వేది) భారద్వాజగోత్రుఁడు. ఈతని మూలపురుషుఁడు "అన్నయాచార్యుఁడు" ఇతఁడు పంచాగమసార్వభౌముఁడఁట! ఆ పంచాగమము భారతమో, సంగీతశాస్త్రమో, లేదా ద్రావిడాగమసార్వభౌమబిరుదముగల పరమవిద్యాసింధుపారఁగతుఁడు తనతాత యని కవి వ్రాసెను. ఆ ద్రావిడాగమమో! తెలియదు. తాళ్లపాకవారిలో గవు

లనేకు లున్నారు. కావున వివరముగఁ దెలియుటకు వంశ వృక్ష మీ క్రిందఁ జూపుచున్నాను.




వంశవృక్షము ననుసరించి మూలపురుషుఁ డన్నయ., అతని కొడుకు తిరుమలయ్య, యీ తిరుమలయ్యయే మన చిన్నన్న తండ్రి. ఈతనిఁ గూర్చి యిట్లువ్రాసియుండెను.

“ × × ఆ తిరుమలాచార్యవర్యుండు, వేదాంతవిద్యాప్రవీణుఁడై యాంధ్ర వేదాంత మొనరించె ద్విపదరూపమున, హరివంశ కావ్య మాయత రసస్ఫూర్తి హరివంశ మిగురొత్త నమరొందఁ జేసి, చక్రవాళములోన సరిలేదనంగఁ జక్రవాళముగ మంజరి రచియించి, శ్రుతులు చిక్కులు దీర్చు శుకతాతవోలె సతతరేఫ ఱకార సరణు లేర్పఱచి, సంగీత సాహిత్య సార్వజ్ఞికత్వ మంగళసామ్రాజ్య మహితుఁడై యలరె॥”

ఇందువలనఁ జిన్నన్నతండ్రి యగు తిరుమలాచార్యుఁడుకూడ ద్విపదలలో నాంధ్రవేదాంతము, హరివంశము, రేఫఱకారనిర్ణయము చక్రవాళమంజరియు రచియించినట్లు తెలియుచున్నది. (*) ఈ తిరుమలాచార్యుని యైదుగురు కుమాళ్ళలో మన చిన్నన్న నాల్గవవాఁ డని తెలియుచున్నది. చిన్నన్నతండ్రియే గాక, సోదరులు, పుత్రులు, పౌత్రులు, తాళ్ళపాకవారి దౌహిత్రులుకూడఁ గవనము చెప్పిన ట్లనేక గ్రంథములు సాక్ష్య మిచ్చుచున్నవి.

ఈ చిన్నన్న సదాశివరాయలుకాలమువాఁడు. సదాశివదేవరాయఁ డీకవికి శా॥ శ॥ 1467 విశ్వావసుసంవత్సర ఆషాఢశు౧౨ (21 జూన్ 1545) నాఁడు కొండవీటిరాజ్యమందు అద్దంకిసీమలోని మల్లవరముగ్రామము నగ్రహారముగా నిచ్చినట్లు శాసన మొకటియున్నది (1) ఇందు "తాళ్ళపాక తిరుమలయ్యగారి కుమారుఁడు చినన్న తిరువెంగళనాథునికి" అని యున్నది. దీనివలనఁ దిరువెంకటనాథునికిఁ జినన్న యని మారుపేరున్న దని నిర్ధారణ మగుచున్నది. ఈతని తమ్ముఁడైన "కోనేటి తిరువెంగళనాథయ్యంగారికి" అద్దంకిసీమలోని వలపర్లిగ్రామము శా॥ శ॥ 1466 లోను, బొల్లాపల్లిగ్రామము శా॥ శ॥ 1467 లో నిచ్చినట్లును శాసనములు కలవు (2) ఈతని పే రష్టమహిషీకళ్యాణములో

(*) ఇవి సాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటనమైనవి.

(1) Butterworth's Nellore inscriptions, Ongole 21.

(2) Butterworth's Nellore inscriptions, Ongole 14 & 15.

"కోనేటి వెంకటనాథుఁ" డని యున్నది. శాసనములో "కోనేటి తిరువెంకటనాథు" డని యున్నది.

తెనాలి రామలింగనిచాటువని "అప్పకవీయము"లో నీ క్రింది పద్య మున్నది.

క. చిన్నన్న ద్విపద కెఱఁగును
పన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మెఱసె (1) నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్."

పైనఁ జూపిన వంశవృక్షమును, శాసనములును బరిశీలించినప్పు డిందలి చిన్నన్న తిరువెంగళనాథుఁ డనియు, పెదతిరుమలయ్య చిన్నన్న తండ్రి యనియు, సింగన్న మన కవికిఁ బెదతండ్రియనియుఁ దెలియఁగలము. (2) ఈతాళ్ళపాకవారు చిరకాలమునుండి తిరుపతిదేవస్థానమున సంకీర్తనాచార్యులై విజయనగరముారాజులచే ననేక భూములు, గ్రామములును బొందియుండిరి.వీరు ప్రతిదినమును దేవునిసన్నిధానమున సంకీర్తనలు రాగతాళములతోఁ జేయుచుండు కవులు. వీరి గ్రంథము లనేకము రాగిరేకులపైఁ జెక్కించి తిరుపతిదేవస్థానమునం దొకగదిలో నుంచిరి. ఆ గ్రంథములు వ్రాసిన రాగిరేకుల ప్రస్తుతపుధర తూచియమ్మిన రెండులక్ష లుండునని శ్రీ లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు. అవి స్వయముగఁ జూచి, కొన్ని గ్రంథముల వ్రాసికొనివచ్చి, పరిషత్ప

(1) నరసింగన్న "పాడఁ జెప్పఁగ వర్ణపద్ధతి నీడు జోడు లేరని సభఁ జొచ్చి చాటించి పరగిన ధీశాలి" యని చిన్నన్న వ్రాసెను.

(2) విజ్ఞానసర్వస్వము సం 3. పుట 1688

త్రికలో ముద్రించిన శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు కూడ నీ రాగి రేకు గ్రంథము లసంఖ్యాకము లున్న వని చెప్పియు న్నారు. భాషాభిమాను లిందలి సంకీర్తనాచార్యుల వాఙ్మయము నంతయు సేకరించి, విమర్శించి చదివి, త్యాగరాజు, క్షేత్రయ, రామదాసు, మొదలగు సంకీర్తనకవుల వాఙ్మయ స్వరూపము నొక గ్రంథరూపమునఁ బ్రకటించిన లోకోపకార మగును.

చిన్నన్న తనపరమయోగివిలాసము శ్రీవేంకటేశ్వరునకు నలిమేల్మంగకును, అష్టమహిషీకళ్యాణ మొక్క యలిమేల్మంగకును గృతియిచ్చెను. భక్తుల కథ భగవద్భంతు లకును, మహిషులపరిణియకథ యలిమేలమ్మకును గృతి యిచ్చుటలోఁ గూడఁ గవి యౌచిత్యమును జూపెను. వారి కవుల చరిత్రమునాఁటి కష్టమహిషీకళ్యాణము దొరక నందున నీ రెండు గ్రంథములు వేర్వేరు కవులు వ్రాసి రని శ్రీవీరే శలింగముపంతులుగారు వ్రాసియుండిరి. ఇది తప్పని పై రెండుగ్రంథము లొక్కరే వ్రాసిరని యిప్పుడు తెలియఁ గలదు.

ఈతఁడు తన పరమాచార్యుఁ డనఁగాఁ దండ్రిగురువు "కందళాయప్పగా" రని వ్రాసికొనియుండెను. తాను లక్ష్మీదేవి యనుగ్రహము కలవాఁడ ననెను. ఈ కందాళయప్ప చిత్రభారతకృతిభర్త యగు నిమ్మలపల్లి పెదనామాత్య

నకును, పాండురంగమాహాత్మ్యకృతిపతి యగు విరూరి వేదా
ద్రికిని గూడ గురువుగా నుండినట్లు పై రెండుగ్రంథములవల
నను దెలియఁగలదు.

పై నిదర్శనములనుబట్టి తెనాలి రామలింగఁడును,
తాళ్ళపాక చిన్నన్నయుఁ గృష్ణరాయనికాలములో నుండి
యుండు రనుటకు వీలు కనఁబడుచున్నను వారిరువురు నష్ట
దిగ్గజములలోనివారే యనుట కాధారములు మాత్రము కనఁ
బడవు. ఈతని తండ్రి మండెముకోటకుఁ బోయినట్లు
వ్రాసెను.

"మండెముకోటలో మండలం బెఱుఁగ
మండలాగ్రహతి మండితపుష్ప
ధామమై ధర్మాంగదస్థితిఁ బొలిచె
నే మహామహుని యహీనగాత్రమున"

ఈ మండెము శ్రీకృష్ణరాయనిచే గోవిందరాజు లను
భారద్వాజసగోత్రునకు దాన మీయఁబడె ననియు, నది
మైసూరునకు సమీపమున నున్నదనియు శ్రీ రాళ్ళపల్లి అనం
తకృష్ణశర్మగా రాంధ్రపత్రిక (14-3-1916) లో వ్రాసియు
న్నారు. ఈకవి తాతయైన యన్నయార్యుఁడు శ్రీ కృష్ణదేవ
రాయని కాలములో నుండి కొన్ని యగ్రహారము లందె నని
కవులచరిత్రమున నున్నది. ఈ కవి క్రీ॥ శ॥ 1545 లో
నున్నట్లు పైనఁజూపియుంటిని గావున నీతఁడు కృష్ణరాయనికి
సమీపమువాఁడే యగుచున్నాఁడు. కొండవీఁటి చరిత్ర

ములోఁ గూడఁ గృష్ణరాయఁడు చిన్నన్నకుఁ గొన్ని దానము లిచ్చినట్లున్న దని చెప్పుచున్నారు. ఇది విచార్యము.

ఈ తాళ్ళపాకకవులు వ్రాసిన గ్రంథములు నూర్ల కొలఁది యున్నవి. నాకుఁ దెలిసినంతవఱ కీ తాళ్ళపాకకవులు వ్రాసిన గ్రంథముల — ముఖ్యముగ — శతకములవివరము లీ క్రిందఁ జూపుచున్నాను. గ్రంథ వివరములను దెలిసినంత వఱకుఁ జూపెదను.

---

## తిరు వేంగళప్ప

ఈతనినే తాళ్ళపాక తిరువేంగళదీక్షితుఁ డని కూడ నందురు. ఇతఁడు తాళ్ళపాక వేంకటేశదీక్షితుని పుత్రుఁడు. సంస్కృతము నందలి "అమరుశతకము" నీతఁడు తెలిగించెను. ప్రతిపద్యమునకు మొదట వచనములో వివరణ మున్నది. శృంగారామరుశతక భాషాంతరీకరణము లింకను గలవు.

గ్రంథభాగము లివి :—

ఉ. "శ్రీరుచిరాంగనాశ్రిమవిచిత్రవిభూషణనూనచందనో
దార విలాసదీపితము నై యసితోత్పలకాంతి మించి శృం
గారరసంబు దోఁచె ననఁ గన్నులపండువు నైన మేని యొ
య్యారముఁ జూపు వేంకటనగాధిపుఁ డీవుత మాకుఁ గోరికల్."

"వ. శృంగారరసప్రధాన మమరుక కావ్యము. శృంగారము సంభోగము, విప్రలంభము నని రెండువిధములు. అందులో సంభోగ శృంగారము మొదలుగా నుద్యోగించి శృంగారరసానకు ఆలంబనవిభావమైన నాయకాస్వరూపమునే దేవతగా భావించి తృతీయపురుషార్థమునుగూర్చి ఆశీర్వాదిస్తున్నాడు."

చ. చెదరి చలించు ముంగురులు స్వేదకణంబుల నింతజాఱు బొ
ట్టొాదవు రతాంతకాంతి మెయి నొయ్యన సోలెడు కన్నుదామరల్
కదలెడు కుండలంబులును గల్గిన పౌరుషభాసమానయా
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుఁగావుతన్॥

ఉ. యావరసార్ద్రిముస్ గిసలయారుణకోమలమున్ వినూత్న ర
త్నావళినూపురంబును మదాలసభావము నొపదర్పించుచే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగనచేతఁ దాడితుం
డై విలసిల్లు వాఁడు కుసుమాయుధదేవునకుం బ్రియుండగున్॥

క. ఇలఁదాళ్ళపాక సత్కులతిలక శ్రీవేంకటేశదీక్షితసుతుఁడు
జ్వాలకవితానిధి తిరువేంకళయ్యప్ప యమరుకము దెనుఁగుగావిరచించెన్॥

ఇతఁడు చిన్నన్నయో, చిన్నన్న కేమగునో తెలియదు. పైఁగా నందఱకు వైష్ణవసంప్రదాయానుసారము "తిరు"శబ్దమును, వేంకటేశ భక్తులగుట "వేంకళ, వేంగళ, వేంకట," మొదలగుపేరు లుండుటను, ఆచార్యపదము చివర నుండుటను సరిగ నీకవుల విభాగించుట కష్టమయినది. అందువలనఁ దాళ్లపాకకవుల నందఱి నిచ్చటనే వర్ణించి తెలసిన చోట్ల చిన్నన్నతో సంబంధము వివరించెదను.

# తాళ్ళపాక అన్నమయ్య

ఇతఁడు బహుశః చిన్నన్న తాత యైయుండవచ్చును. కృష్ణరాయని కాలమున కించుక పూర్వుఁడో సమకాలికుఁడో యైయుండును. ఇతఁడు తిరుపతి వేంకటేశ్వరశతక మను వృత్త శతకమును రచియించెను. గ్రంథము దొరకదు. ఒక పద్యము పెదపాటి జగన్నాథకవి తన ప్రబంధరత్నావళిలో నుదాహరించియున్నాఁడు. ఈ కవినిగూర్చి చిన్నన్న యిట్లు వ్రాసియుండెను.

"నా తాత ద్రావిడాగమ సార్వభౌమ బిరుదము గల పరమవిద్యాసింధుపారంగతుఁ డగు తాళ్లపాక అన్నయాచార్యుఁడు. ఈ కవి కిరువురు భార్యలు. తిమ్మమ్మ, అక్కలమ్మ." అష్టమహిషీకళ్యాణ, పరమయోగి విలాసములఁ జూడుఁడు.

"ఈ కవి (చిన్నన్న) తాత యైన యన్నయార్యుఁడు కృష్ణరాయని కాలములో నుండి కొన్ని యగ్రహారముల నొందెను." పుట 304 ఆంధ్ర కవుల చరిత్రము (1899.)

శైలి కీతని పద్య మొక్కటే దొరికినది.

చ. అరిసెలు నూనె బూరెలును నౌఁగులుఁ జక్కెర మండెగల్ వడల్
బురుడలు వాలమండెఁ గల పూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా॥

అన్నయ్య కొడుకు ఇమ్మయ్య వ్రాసిన వేంకటేశ్వర శతక మింకొకటి కాఁబోలును (చూడుఁడు. k-1—5

(2) వేంకటేశశతకము-ఓ. లె). ఈ పై యన్నమయ్య యీ క్రిందఁ జూపఁబోవు అన్నమాచార్యుఁడే కావచ్చును.

—— : o : ——

# తాళ్ళపాక అన్నమాచార్యుఁడు

ఈ పేరుతో నొక వేంకటేశ్వరశతకము శృంగారవృత్త పద్యశతకమను పేరఁ బరిషత్తులో నున్నది. (సంఖ్య 1996 చూడుడు) బహుశః ఇదియే పైనఁ జూపిన జగన్నాధకవి యుదాహరించినది కావచ్చును. పరిషత్తులో నున్న శతకవివరము లీక్రిందఁ జూపుచున్నాను.

ఈ శతకము తిరుపతిలో నున్న రాగిరేకులనుండి పరిషత్తువారు వ్రాయించి తెప్పించిరి. ఈ శతకాంతమున నీక్రింది పద్యములోఁ గవి తన పేరు చెప్పుకొనెను.

అమ్మకుఁ దాళ్ళపాకఘనుఁ డన్నఁడు పద్యశతంబుఁ జెప్పెఁ గో
కొమ్మని వాక్ప్రసూనములఁ గూరిమితో నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేక యుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మద మంది వర్ధిలను జవ్వనలీలల వేంకటేశ్వరా॥ 105

శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

*శ్రీసతి నీల, జాంబవతి, శ్రీయమునాసతి, సత్యభామ, ధా
త్రీసతి, రుక్మిణీరమణి, దేవియిలాసతి వీర లందఱున్
జేసిన సేవ చేసెదను జేకొను శ్రీయలమేలుమంగ నీ

మూసినముత్యమై యురముముంగటఁ జెంగట వేంకటేశ్వరా!
కిలకిల నవ్వు నవ్వి తిలకించితి మంచి సుధారసంబు నీ
పలుకుల తేనెల న్విభునిఁ బట్టముఁగట్టితి నీదుకౌఁగిటన్
వలదని చెప్పిన న్వినవు వద్దుసుమీ యలమేలుమంగ నీ
కెలవు లటంచు నెచ్చెలులు కీర్తన సేతురు వేంకటేశ్వరా॥ 34

వెలది మహాపరాధములు వేయును జేసితిఁ గావుమన్న నీ
పలుకులు మేనిఘాతతులు బూఁతలు జూ చలమేలుమంగ నీ
యలుకలు దీర్చి చెక్కుచెమ టల్లన గోళ్లను జిమ్మి పయ్యెదన్
బలుచనినవ్వుతో విసరుఁ బైచమ టారఁగ వేంకటేశ్వరా॥ 27

ఎక్కడి కేగి వచ్చితి రమేశ్వర నీతను దివ్యగంధ మే
చక్కనియింతి మేని దని సారెకు నీ యలమేలుమంగ నీ
చెక్కుగళంబు గోళ్ళ వడిఁ జేర్చుచు నీ యలపార్చి వేడుటల్
మక్కువ గల్గుకాంతలకు మర్మ రహస్యము వేం॥ 43

ఒరపగు మీ విహారతతు లుప్పనబట్టలు బిల్లటీపు ల
చ్చెరువుగఁ బల్లకోటులు ప్రసిద్ధిగ నయ్యలమేలుమంగకున్
మెఱపులు ముచ్చట ప్రతుల మ్రొక్కులుఁ దక్కులు వచ్చి వచ్చి మీ
చిరునగవుం బ్రమోదములు చెక్కులు నొక్కులు వేం॥ 58

వడి నలమేలుమంగ నిడువాలికచూపునివాళి నీపయిన్
సుడిసిన తమ్మి రేకులఁ బ్రసూనశరంబులు గల్వరేకులన్
బడిబడి మీఁదమీఁద రసభావనగా దిగఁబోసినట్లు షో
షాడవగు పువ్వుజొంపముల పూజలు నీకును వేం॥ 66

ఈ శతకము చాలమనోహర మైనదియే కాని, పితృసము లగు దివ్యదంపతుల శృంగారవర్ణన మనువా రుందురు కాఁబోలు.

* తాతవ్రాసిన యీపద్యము చూచియే చిన్నన్న యష్టమహిషీకల్యాణము వ్రాయ బుద్ధిబుట్టియుండవచ్చు నని నే నూహించుచున్నాను.

# తాళ్ళపాక శ్రీనివాసుఁడు

ఈతఁడు "లక్ష్మీవేంకటేశ్వరసీసపద్యములశతకము" వ్రాసినవాఁడు. ఈ శతకము శిథిలప్రతి యొకటి పరిషత్తులో నున్నది. [చూడుడు 3998] ఈ శతకములసంపుటము వ్రాఁతప్రతి తాళ్ళపాకవారి కుటుంబమునుండి వచ్చినది. ఇది సంపాదించిన జయంతి రామయ్యపంతులుగారీ శతకముపై నిట్లాంగ్లేయభాషలో వ్రాసిరి. అది భాషాంతరీకరించి చూపెదను.

"తాళ్ళపాకకవులు వ్రాసిన యీశతకముల వ్రాఁతప్రతిసంపుటము నాకు 14 యేండ్లబాలుఁడైన తాళ్ళపాక శేషాచార్యు (తిరుపతి) లిచ్చెను. ఈ బాలుఁడు తాళ్ళపాకకవుల వారసుఁడు. బడిలో చదువుకొనుచున్నాఁడు. ఈ కుటుంబములోని పురుషు లాచార్యశబ్దము వాడుకొన్నను వీరు వేంకటేశ్వరాలయముతోఁ గల సన్నిహిత సంబంధముచే నట్లు వాడుకొనుచున్నను వీరు స్మార్తులైన నందవరీకులతోఁ గంచము మంచము పొత్తులు గలవారు. ఈ కుటుంబమునకు వంశ పారంపర్యముగ వేయిరూపాయిలు సంవత్సరమునకు రాఁబడి వచ్చు నీనాము భూములు గుడిలో సంకీర్తనాచార్యపదవికిఁగాను ఇప్పటికిని జరుగుచున్నవి. ఇవి తిరుపతిలో నున్నవి. ఈ సంకీర్తనాచార్య ధర్మ మిప్పుడు ప్రతినిధిచే జరుపుచున్నారు.

అలమేలుమంగమ్మ తాళ్ళపాకవారి కూతు రని (ఆడుఁపడుచు) యామెను వారు ప్రతిసంవత్సరము దేవుని కల్యాణసమయమునఁ గన్యాదానము చేయు తంతు నడుపుచుందురు."

ఈ పై వివరణపత్రిక పరిషత్తుప్రతిలో నున్నది. దాని భావమును బైనఁ దెలిఁగించితిని.

ఇందలి రెండుమూఁడు పద్యముల మాత్రము చూపి విడిచెదను.

సీ॥ శ్రీమహాలక్ష్మి వక్షస్థితను చేసి, (?)
కమలబంధువిరోధి కన్ను లమర
అమరులు రోమముల్ అంబుధుల్ తనుగోళ
మఖిలనగంబులు నస్థి సమితి
వాయువుల్ నిట్టూర్పు వనరంగ జగములు
ఉదరంబులోపల నున్నతముగ
మన్మథుండును మది బ్రహ్మయు నాభిని
పదమున నాపగ పరిఢవిల్ల
గీ॥ ఇట్టి నీ మూర్తి వినుతింతు సీసఫణితి
శతక మొనరింతు సంతతోత్సాహ మొదవ
కమలవసుధేశ సర్వయుగాధిపేశ
విమలశశికోటిసంకాశ వేంకటేశ॥ 1

సీ॥ అలరు తాళులపాక అన్నమాచార్యుల । గర్భాబ్ధిరాకసుధాకరుండు
తిరుమలయాజినా వరలు సత్పుత్రిల । వరుసతోఁ బంచాయుధాళివరుస
పుత్రపంచకమును బుణ్యాంగన యొకర్తు । గలిగి శ్రీహరికృప గాంతుఁగలిగి
మానిని యల మేలుమంగ నాంచారిని । వేంకటగిరిపతి విచ్చ రథిక
గీ॥ మోదమున బెండ్లిఁ గావించి, సమ్మోదలీల
వదలకను దాసజనసువాసుఁ డనఁగ ॥కమల॥ 107

సీ॥ వర శ్రీనివాసార్యవర్య వారధిచంద్రుఁ
డను వాఁడ శ్రీహరి యబ్జనాభ
పాదపంకజముల పలుమాఱు జేయించి? [సేవించి?]
ముదమునఁ గవిజెప్ప మునుకొనంగ
కలలోనఁ గనుపర్చి కవిత జెప్పుమటన్న
కావ్యచందంబుల కల్ప నెఱుఁగ

వనఁ దెల్పువాఁడను ననుమానపడ కని
పలుకుము పలుకుదు పద్మనాభుఁ
గీ॥ డంచు వచియింపఁ వినియు నారంభపడితి
శతక మాచంద్రరవితారశాశ్వతముగ ॥ కమల ॥ 108

సీ॥ ధర్మవర్తను లగు దాసుల చర్యలు
కర్మలోపము గాదు కడమలేదు
ఆదిమ వేంకట అద్రినాయకుదయ
కలవారికిని కోర్కె కడమలేదు
బాలుఁడవై జన్నుపాలు త్రాగిననాఁడు
నెరి ననుష్ఠానంబు నెందుఁగలదు
దిన దినంబును నిద్ర దివిరిబోయెడు వేళ
నిత్యధర్మపునిష్ఠ లెందుఁ బోయె
గీ॥ తెలివిగని లేచి సంసారి రీతి చరిత
ఫలములను వీడ సన్యాసి పాప మటుల ॥ కమల ॥ 93

సీ॥ కులగోత్రనామముల్ గూడనివానికి
దాసకోటులఁ బ్రోవ ధన్యమైన
కులగోత్రములు గల కులములఁ బుట్టియు
నాచారపరుఁడవై యమరినావు
కర్మముల్ మాని నిష్కర్ముఁడ వగు నీకు
కర్మములో ముని గాడ వలసె
బావ లన్నలు మేనబావగారని చాల
వరుసలు గల వని వావిదెచ్చి
గీ॥ మరులు గల్పించి జనులకు మంచి తెరువు
మరగనియ్యక ప్రకృతిని ఘాన్పనీక ॥ కమల ॥ 99

ఇందలి యతులు, ప్రాసలు, వ్యాకరణము, అన్వయ
మును గూడ మంచివికావని పాఠకు లిదివఱకే తెలిసికొని
యుందురు. చరిత్ర కేమయిన సాయపడు నని చూపుట కీ

గజము గుఱ్ఱము బంటు గాసి పొందకయుండ
అలిఁ బోరఁ బగరఁ గెల్వంగవలయు
గీ॥ బుద్ధిఁ బదరక యెప్పుడు భూవిభుండు
మెల్లనే బాహుశౌర్యంబు మెఱయు టొప్పు ॥ కలితలక్ష్మీశ ॥ 30

సీ॥ ఇల నేటిదరిమాఁని కెప్పుడు చలనంబు
నరనాథు పొరుగిల్లు నమ్మ రాదు
పాముతో నటుపొందు పాటింపఁగా రాదు
దుర్జన సంగతి దూఱుముట్టు
కడఁగి దయ్యాముతోడి కాఁపురం బది కీడు
మహిదొంగతోఁ గొల్వు మరణ మొదవు
బరికింప నోడపై బ్రతుకు సందేహంబు
ఘనునితో సరసంబు గాదు జరప
గీ॥ నరసి కాని వివర్జించి రైన పనుల
నరుఁడు వర్ధిల్లవలయు నున్నతి వహించి ॥ కలితలక్ష్మీశ ॥ 36

సీ॥ పే లెన్ని పుట్టినఁ బెద్దగా బ్రదుకవు
చీమలు పొడమి నశించిపోవు
జెదలు పుట్టలు వెట్టి శీఘ్రమే యడఁగును
మిడతలు వైళమె మించి మడియు
నీఁగలు వడి మూఁగు నీడేఱ వెంత్రైన
నల్లులు జనియించి నలిసిపోవు
దోమ లుద్భవమంది తోడనే పోలియును
గణుఁదుర్లు తుట్టులు గట్టి సమయుఁ
గీ॥ బరఁగ నీరీతి దుర్జను ల్ప్రబలులైనఁ
బరులఁ బీడించి చెడుదురు పాపములను ॥ కలితలక్ష్మీశ ॥ 82

సీ॥ పెంచంగఁ బెరిగెనా పృథ్విపైఁ గొండలు
విత్తిరా యడవుల వివిధగతులఁ

గాలువ ల్వెట్టిరా ఘనసముద్రములకు
నేతంబు లత్తిరా యేఱులకును
మేఁతలు వెట్టిరా మృగముల కెందైన
మఱి యీఁత నేర్పిరా మత్స్యములకు
బెండ్లిండ్లు సేసిరా బెరయంగఁ బక్షులఁ
బూసిరా వాసనఁ బుష్పములకు

గీ॥ నెవ్వ రెవ్వరిఁ బోషించి రెంచిచూడఁ
దలప నీదైన రక్షకత్వమునఁ గాక॥ ॥ కలితలక్ష్మీశ ॥ 60

రాజ్యతృష్ణ ధనాశల నీ విధముఁగ దెగడియున్నాఁడు!

సీ॥ ధరలోన నావులు తమ దూడలకు నెల్లఁ
బెట్టెనా వాములు ప్రియముతోడఁ
బొక్కలు త్రవ్వించి పోయెనా నక్కలు
తమ పిల్లలకు నిరంతరమునుండఁ
దలఁచి దప్పికి నీళ్ళు త్రావఁ గూనలకును
గట్టెనా చెఱువులు కప్పలెల్లఁ
బ్రియముతో రతి సల్పి బిడ్డలఁ గనుమని
చెప్పెనా సింహంబు శిశువులకును

గీ॥ పట్టి బ్రిమతలఁ దమ పుత్రవర్గమునకుఁ
దల్లిదండ్రులు దలఁతురు ధనముగూర్ప॥ ॥ కలితలక్ష్మీశ ॥ 89

ఈ క్రింది వాక్యములు వేమన్న కనుకరణములు.

(1) "గాడిద యెఱుఁగదు గంధంబు వాసన" 74

(2) "ఇలమీఁద మోడు సిగ్గోలఁ దలఁచు" 73

పోనిం డవి సాధారణ లోకోక్తులే వాడె ననుకొన్నను
క్రింది వాక్యములు సాంగముగఁ దీసికొనెను.

(3) "కరణంబుతోఁ బగ కాఁపువానికిఁ గాదు
కాఁపుతోఁ బగ గాదు కరణమునకు." 61

(4) "పదుగురాడినమాట పాటియై ధరఁజెల్లు
నొక్కఁ డాడినమాట యెక్కదెందు"
"నురకయుండినవాని కూరెల్ల నోపదు
నిజము ముందఱఁ గల్ల నిలువ దెపుడు" 63

ఈ క్రిందివాక్యము వేణుగోపాలశతకవాక్యమునకు మాతృకమై యుండును.

(1) "ఉర్విమీఁదట నుత్తము లొక్కరాశి
యధము లొకరాశి యాఁగాదె యరసి చూడ"
నీతిసీసపద్యశతకము 78

"వేదము ల్గోవులు విప్రోత్తములు దర్భ, లేర్పరింపగ నాలు గేకరాశి
మూఢాత్ముఁ డత్యంత మూఢుఁడు గాడిద కాకి వీరలు నాలు గేకరాశి"
వేణుగోపాలశతకము. 61

ఈతఁడు చిన్నన్న తండ్రి యగుటచేఁగృష్ణరాయుని కంటె వృద్ధుఁడై యాతనికాలమున నుండియుండును. ఆ కాలమునందు "నీచ బోవు 83." "జయపెట్టు 31" మొదలగు ప్రయోగములు సాధువులుగాఁ దలంచిరికావుననే పోతన్న నారాయణశతకమున నట్టివి ప్రయోగించెను.

ఈ కవి కృష్ణరాయనికాలమువాఁ డనుట కీ క్రిందికథ సాక్ష్యమిచ్చుచున్నది.

"పాతివ్రత్యప్రదర్శినీ తిరస్కారము:—ఒకానొకసమయంబున నొక కవి స్త్రీలకుఁ బాతివ్రత్యవిశేషములం దెల్ప

"పాతివ్రత్యప్రదర్శిని" అను నొక గ్రంథమును రచియించి తెచ్చి రాయలసభలో సమర్పించెను. ఇట్లు సమర్పించుటయే గాక తా ననేక గ్రంథములు శోధించి వానిలోని సారమునం తయు సంగ్రహించి నిర్దుష్టముగాఁ జేసి తా నాగ్రంథము రచి యించితి ననియు నది తేటతెన్గుమాటలలో నుండుననియు నాత్మస్తుతిగాఁగొన్నిమాటలు ప్రస్తావించెను. అట్టి ప్రస్తావ నకు రామకృష్ణుఁడు కొంచెము కోపించి లేచి నిలువంబడి "యోయీ! నీమనస్సునకు నిశ్చయముగ దోషరహితముగాఁ గానుపించు పద్యము నొకదానిం జదువు"మని యడిగెను. దానికి లెస్స యని కవి యీక్రిందిపద్యము చదువ నారంభిం చెను. ఎట్లన్నను

సీ॥ పతికి మాఱాడక పలుకులు నేర్వక, యలియక మిగుల గయ్యాళిగాక"

అనుఁడు రామకృష్ణుం డింకఁజాలును. పై చరణ ములు చదువ నక్కఱలేదు. గ్రంథమంతయు నీలాగున నే యుండును. అనుఁడు రాయలు అట్లైన నీయభిప్రాయానుసార ముగ నా చరణమున కేమి యర్థము చెప్పెదువో చెప్పు మనుఁడు, రామకృష్ణుం డిట్లనియె. అర్థమున కేమి? అందఱ కును స్పష్టమైన యర్థమే. ఇది విన్నంతమాత్రమున నీకనే యాఁడుదియును మగనికి నాజ్ఞావర్తిని గాకుండుటయేగాక వంటఁగూడ జేసిపెట్టు మని యాజ్ఞాపించును. ఇఁక మాబోం ట్లకు నా బాధకూడఁ దటస్థింపక మానదు. అయినను

పండితుఁడుకాని కవినిఁ జూపవలసి వచ్చినది. ఈతఁ డన్న మయ్య కొడుకగు తిరుమలయ్య వ్రాసిన సీసనీతి పద్యమకుట మును జూచి తనమకుట ముంచె నని తోఁచుచున్నది. ఒక్క మకుటమే కాదు, రెండు శతకముల మొదటిపద్య భావములు నొక్కటియె!

(1) "కమలవసుధేశ! సర్వయుగాధిపేశ!
విమలశశికోటిసంకాశ! వేంకటేశ!" (లక్ష్మీ వేంకటేశ్వరశతకము.)

(2) "కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ" (నీతిసీసపద్యశతకము.)

ఇట్టి మకుటముల నిటీవలకవు లనేకు లనుకరించిరి. కొన్ని పోలికలు చూపెదను.

(3) "భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!"
(కూచిమంచి తిమ్మకవి - కుక్కుటేశ్వరశతకము.)

(4) "భూతలాకేశ! ఆచంటపురనివాస!
భావభవనాశ! రామేశ! పార్వతీశ!" (ఆచంట రామేశ్వరశతకము)

(5) "భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!" (నరసింహశతకము)

(6) "చారుతరహాస! వేంకటాచలవిలాస!" (వేంకటాచలశతకము.)

(7) "స్ఫురితగౌరీసమేత! శంకరనివేశ!" (శ్రీసింహాద్రిసగరేశశతకము.)

(8) "యఘవినాశ! మార్కండేశ! యభ్రకేశ!"
(మార్కండేశశతకము.)

---

# తాళ్ళపాక తిమ్మనార్యుఁడు



తిరుమల శబ్దమునకుఁ దిమ్మ శబ్దము హ్రస్వరూప మని తజ్ఞులు తలంచుచున్నారు. అట్టియెడ నీతని పేరు తిరుమలార్యుఁడు. బహుశః చిన్నన్న తండ్రి కావచ్చు నని తోఁచుచున్నది. ఈతఁడు వ్రాసిన శృంగారదండక మొకటి యుత్తమమైనది పరిషత్తులో నున్నది. (1996 చూడుడు). ఈతని ఇతరకృతు లింకను గలవేమో! ఆ దండకము చివర నీ క్రిందిపద్యమున్నది.

ఉ॥ సన్నుతిఁ దాళ్ళపాకపురశాసనుఁ డన్నయతిమ్మనార్యుఁ డ
త్యున్నతిఁ జెప్పె దండకము దుగ్ధపయోనిధికన్యకారతి
స్విన్నమృగీమదాంకునకు వేంకటభర్తకు నిత్యభోగసం
పన్నన కాగమిందుకులపర్వతతారకమై చెలంగఁగాన్॥

ఈతఁ డన్నయకుమారుఁ డగుటఁ జిన్నన్న తండ్రి కానోపు నని యనుమానించితిని. ఈతఁడు పెదతిరుమలార్యుఁ డనియు, చిన్నన్న చినతిరువేంగళనాథుఁ డనియుఁ జరిత్రజ్ఞులు తలంచిరి. ఈతఁడే యనఁగా, అన్నయ కుమారుఁడగు తిరుమలార్యుఁడే వ్రాసిన నీతిసీసపద్యశతక మొకటి కనఁబడుచున్నది. ఇది తాళ్ళపాక చిన్నన్న కృతమగు వేంకటేశ్వర శతక మని చిరకాలమునుండి ముద్రితస్థితిలో నున్నది. కాని, యిటీవల సాహిత్య పరిషత్తువారిది మంచిగాగితములపైఁ బ్రకటించియున్నారు. ఈ శతకాంతమున నీ క్రింది పద్య

ముంట నిది చిన్నన్నకృతము కానేరదు. అట్లు ప్రకటించిన గుజలీప్రతులకృత్యము సరి కా దని తోఁచుచున్నది.

సీ॥ మాధవ గోవింద మధుసూద నాచ్యుత వామన ప్రద్యుమ్న వాసుదేవ
కృష్ణ దామోదర కేశవ శ్రీధర హరి విష్ణు పురుషోత్త మానిరుద్ధ
సంకర్ష ణాధోక్షజ త్రివిక్రమ పద్మనాభ జనార్దన నారసింహ
శౌరి హృషీకేశ నారాయ ణోపేంద్ర తాలాంకముఖనామ తాళ్ళపాక

గీ॥ యన్నయాచార్య సుత తిమ్మయాహ్వయుండఁ
బ్రణుతిఁ జేసితి రహిఁ గొమ్ము పద్యశతము
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ! 100.

ఈ శతకము చాల యుత్కృష్టమైనది. కొన్నిపద్యములు పరిశీలించుకొందము. ఇందు రాజనీతి చెప్పుటచేతనే దీనికి నీతిసీసపద్యశతకమని గ్రంథకర్త నామ ముంచెను. ఈ శతకమే వేణుగోపాలశతకము, కుక్కుటేశ్వరశతకము, రామలింగేశశతకము మొదలగు శతకములకు మాతృక యని చెప్పవచ్చును.

సీ॥ ఆచారవంతుఁడౌ నతఁడె విప్రోత్తముఁ
డఖిలంబు రక్షించు నతఁడు రాజు
వసుసతోఁ గార్యనిర్వాహకుఁడే మంత్రి
రుచిరవర్తనుఁడె పురోహితుండు
కడుఁ దిట్ట దీవింపఁ గలవాఁడె సత్కవి
యమృతహస్తుఁడు వైద్యుఁ డఖిల దిశలఁ
బోటజ్జ యొత్తిఁగిన పురుషుండె దళవాయి
గణితజ్ఞుఁ డగువాఁడు కరణ మరయఁ

గీ॥ బురుషరత్నంబు లని యంద్రు బుధులు వీరి
నితరు లెల్లను సామాన్యు లెంచి చూడఁ
గలితలక్ష్మీశ సర్వజగన్నివేశ
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!॥ 15

తిట్టి దీవింపఁ గలవాఁడే కవి యని యాకాలమునందలి "శాపానుగ్రహశక్తియుక్తుఁడు" వాక్యమునందలి మార్పు పరిశీలింపఁదగినది.

ఈతఁడు సప్తవ్యసనముల నిట్లు గర్హించెను.

సీ॥ పరకాంతకై సింహబలుఁ డట్లు మృతుఁ డయ్యె
రాజ్యలోభమునఁ గౌరవుఁడు వొలిసెఁ
బరుషోక్తులను శిశుపాలుఁడు హతుఁ డయ్యె
మహిని జూదమున ధర్మజుఁడు నొగిలె
నలపాండురాజు వేఁటాడి శాపము నొందె
మును రావణుఁడు చలమునను సమసె
గూ్రరదండంబునఁ గూలెను వేనుండు
చదిసెఁ బానమున రాక్షసగురుండు।

గీ॥ ఘనవివేకులు వీరల గతులు దెలిసి
వ్యసనములు మాని నడువంగ వలయు నిలను ॥ కలితలక్ష్మీశ ॥ 17

రాజనీతి నియనేక పద్యములలోఁ జెప్పెను:

సీ॥ చెఱియుఁ గొల్లయు లరాటి సీమలో లేకుండ
దండెత్తవలయు శాత్రవుల మీఁద
గడ్డియు దవనంబుఁ గడు నీరు గల్గుచోఁ
టరసి పొందుగ విడియంగవలయుఁ
గైకొన్నభూములఁ గాఁపుగాఁ దాణెంబు
లొనరించి మఱి యవ్వ లొత్తవలయు

పద్యము వినిన యంతనే నాకుందోఁచిన యర్థము విశదీకరించెదను; చిత్తగింపుఁ డని యిట్లనియె.

ఆఁడుదానికిఁ జెప్పవలసిన బుద్ధులలో మొదటిది భర్త పిలిచినప్పుడు మాటాడక యుండుట. రెండవది పలుమాఱు నేడ్వఁగూడ దనుట. అనఁగా నింటిలోఁ బనిపాటలు చక్కఁగా జేసికొనిన పిమ్మట నాల్గుసారులో యయిదుసారులో నియతముగా నిత్యమును నేడువవలసిన దనుట. మూఁడవది ఎట్టి యవసరమైనపని యున్నను శరీర మలియక యుండునంత వఱకే పని చేయవలెనుగాని ప్రాణావసరము వచ్చినను శరీరము నలియఁబెట్టకుండుట. ఇఁక నాల్గవనీతి యెట్లనగా - మిగుల గయ్యాళి గాకయుండుట. అనగాఁ గొంతవఱకైనను గయ్యాళిగానిచో నాఁడుది కాపురము చేయఁజాలదు గనుక నామట్టుకు గయ్యాళిగాఁ నుండవలయుననియు నంతకధికముగా గయ్యాళికా గూడ దనియు దీని యర్థము. అను రామకృష్ణునిపలుకులకు సభ్యులు, రాజును విశేష ధ్వనితో నవ్వందొడంగిరి. గ్రంథకర్త డగ్గుత్తికదోఁప ముందర చరణముం జదువలేకయుఁ జదివిన నిఁక నదియెట్లుగా నుపన్యసింపఁబడునో? అను భీతిచేత నోరు మెదపక యూరకుండెను. రాయఁడును గ్రంథకర్త యొక్క యట్టి నిశ్చేష్టితవ్యాపారములఁ జూచి సదయుఁడై "రామకృష్ణుని పూర్వపక్షము లట్లేయుండును గావున సందియంబు వలదు, గ్రంథము మాకందఱకు

గీ॥ బురుషరత్నంబు లని యంద్రు బుధులు వీరి
నితరు లెల్లను సామాన్యు లెంచి చూడఁ
గలితలక్ష్మీశ సర్వజగన్నివేశ
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!॥ 15

తిట్టి దీవింపఁ గలవాఁడే కవి యని యాకాలమునందలి "శాపానుగ్రహశక్తియుక్తుఁడు" వాక్యమునందలి మార్పు పరిశీలింపఁదగినది.

ఈతఁడు సప్తవ్యసనముల నిట్లు గర్హించెను.

సీ॥ పరకాంతకై సింహబలుఁ డట్లు మృతుఁ డయ్యె
రాజ్యలోభమునఁ గౌరవుఁడు పొలిసెఁ
బరుషోక్తులను శిశుపాలుఁడు హతుఁ డయ్యె
మహిని జూదమున ధర్మజుఁడు నొగిలె
నలపాండురాజు నేఁటాడి శాపము నొందె
మును రావణుఁడు చలమునను సమసె
గూ్రిరదండంబునఁ గూలెను వేనుండు
చదిసెఁ బానమున రాక్షసగురుండు ।

గీ॥ ఘనవివేకులు వీరల గతులు దెలిసి
వ్యసనములు మాని నడువంగ వలయు నిలను ॥ కలితలక్ష్మీశ ॥ 17

రాజనీతి యనేక పద్యములలోఁ జెప్పెను:

సీ॥ చెఱయుఁ గొల్లయు లూటి సీమలో లేకుండ
దండెత్తవలయు శాత్రవుల మీఁద
గడ్డియు దవనంబుఁ గడు నీరు గల్గుచోఁ
టరసి పొందుగ విడియంగవలయుఁ
గైకొన్నభూములఁ గాఁపుగాఁ దాణెంబు
లొనరించి మఱి యవ్వ లొత్తవలయు

పద్యము వినిన యంతనే నాకుందోఁచిన యర్థము విశదీకరిం చెదను; చిత్తగింపుఁ డని యిట్లనియె.

ఆఁడుదానికిఁ జెప్పవలసిన బుద్ధులలో మొదటిది భర్త పిలిచినప్పుడు మాటాడ కుండుట. రెండవది పలుమాఱు నేడ్వఁగూడ దనుట. అనఁగా నింటిలోఁ బనిపాటలు చక్కఁగా జేసికొనిన పిమ్మట నాల్గుసారులో యయిదుసారులో నియత ముగా నిత్యమును నేడువవలసిన దనుట. మూఁడవది ఎట్టి యవసరమైనపని యున్నను శరీర మలియక యుండునంత వఱకే పని చేయవలెనుగాని ప్రాణావసరము వచ్చినను శరీ రము నలియఁబెట్టకుండుట. ఇఁక నాల్గవనీతి యెట్లనగా - మిగుల గయ్యాళి గాకయుండుట. అనగాఁ గొంతవఱకైనను గయ్యాళిగానిచో నాఁడుది కాపురము చేయఁజాలదు గనుక నామట్టుకు గయ్యాళిగాఁ నుండవలయుననియు నంతకధిక ముగా గయ్యాళికాఁ గూడ దనియు దీని యర్థము. అను రామకృష్ణునిపలుకులకు సభ్యులు, రాజును విశేష ధ్వనితో నవ్వం దొడంగిరి. గ్రంథకర్త డగ్గుత్తికదోఁప ముందర చరణ ముం జదువలేకయుఁ జదివిన నీఁక నదియెట్లుగా నుపన్యసింపఁ బడునో? అను భీతిచేత నోరు మెదపక యూరకుండెను. రాయఁ డును గ్రంథకర్త యొక్క యట్టి నిశ్చేష్టితవ్యాపారములఁ జూచి సదయుఁడై "రామకృష్ణుని పూర్వపక్షము లట్లేయుం డును గావున సందియంబు వలదు, గ్రంథము మాకందఱకు

నాదరణపాత్రము కాకపోదు.'' అని పల్కి తద్గ్రంథకర్తకుఁ దగు బహుమానంబు లొసర్చి సాగంబనిచెను.''

పుట 236, కవిజీవితములు.

పై కథ శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి కాలమునాఁటికి "పాత్రిసత్యప్రదర్శని" యను గ్రంథమును దిరస్కరించుటగా మారిపోయినను, నీతిసీసపద్యశతకమును జదివినపిమ్మట నిది గ్రంథకర్త రాజనీతి నెక్కువగను, లోక నీతి స్వల్పముగను జెప్పియుండుటచే నీ శతకమే వ్రాసి కృష్ణ రాయనికడకుఁ దీసికొనిపోయియుండునని తోఁచుచున్నది. అది రాజు విని మిక్కిలి యాదరణపాత్రము లగు నీతులనిధు లున్న శతక మగుట యుక్తిచే రామకృష్ణుఁడు విమర్శించిన పద్యపాదమునకు రాయలు నవ్వినను గవిని బహూకరించె ననుటవలననే యీ శతకము ప్రశస్తమైనదిగా నప్పుడే రసికా వతంసుఁడగు కృష్ణరాయ లెంచియుండు నని మనము తలంప వచ్చును. ఈ యూహ కీ శతకమునం దా రామకృష్ణుఁ డాక్షేపించెనన్న పై పద్యముండుటయే కారణము.

" సీ॥ పతికి మాటాడక పలుమాఱు నేడ్వక
యలుగక మిగుల గయ్యాళి గాక
తనుఁ దిట్టుకొనక కాతాళించి గొణగక
మురిచ్చలింపక పాపమునకుఁ జొరక
పొరుగింటి కేఁగక పరు నాత్మఁ దలఁపక
కుపిత గాక పరానుకూల గాక

ఉడుప దాఁచక మర్మ మవ్వలఁ జెప్పక
బొంకక నిద్దురపోతు గాక

గీ॥ కాఁపురము సేయు కామిని గలిగెనేని
పలుకవేటికిఁ బురుషుని భాగ్యమహిమ ॥కలితలక్ష్మీశ.॥" 32

ఈ శతకాంతమున నున్న భక్తిపద్య మొక్కటి చూపి యీతని చరిత్ర మింతతో ముగించెదను.

సీ॥ కాంచిన పాదము ల్గజ్జెలు నందియ
ల్గడుమించు మొలఁ జంద్రకావిదట్టి
పీతాంబరముమీఁదఁ బిల్లల మొలనూలు
బిగియించి కట్టిన పెనుకటారి
వరదానకరము నుజ్జ్వలకటిహస్తంబు
పటు శంఖచక్రోరు బాహుయుగము
నొఱ పైన నాభియు నుదరబంధ మురంబు
నలు మేలుమంగతో హారములును

గీ॥ శిరసు మకుటంబు తిరుమణి చిత్రమకర
కుండలమ్ములు గలమిమ్ముఁ గోరితలఁతు. 99

వేణుగోపాలశతకపద్యముల పోలిక 17, 18, 19, 20, పద్యములఁ జూడనగును.

తాళ్ళపాక కవులను గూర్చి నాకు దొరికినంతవఱకు [శతకముల వ్రాసినవారినిఁ గూర్చియే] బహుస్వల్పముగఁ జరిత్ర మిందుఁ బ్రకటించితిని. తిరుపతిరాగిరేకుల గ్రంథము లన్నియు బ్రకటనమొందినచో నూర్లకొలఁది కవులు, గ్రంథములు, వాని చరిత్రమును ప్రబంధకవిచరిత్రము నందుఁ

జర్చితము కావలసియుండును. ఈ కవికుటుంబచరిత్రమే సంగ్రహముగ వ్రాసిన నొకసంపుటము కావచ్చును. సంకీర్తన కవులు నుందురు. తాళ్ళపాక చిన్నన్న తాత, తండ్రులు, పుత్ర పౌత్రులేగాక దౌహిత్రులు గూడఁ గవులే యని యీ క్రిందిసంగతులవలనఁ దెలియుచున్నది.

తాళ్లపాక చిన్నన్న వంశము తనకు మాతామహ స్థాన మని రామచంద్రోపాఖ్యానప్రబంధకర్త తిరుమలకొండార్యునిపుత్రుఁడగు రేవుణూరి వేంకటార్యుఁడు తన శకుంతలాపరిణయమునం దీ క్రిందివిధముగఁ జెప్పుకొనెను.

శా॥ శ్రీవత్సాన్వయు రేవుణూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణస్ఫుటకావ్యకల్పకకవిన్ సంకీర్తనాచార్య పు
త్రీవంశోత్తము నందవైదికబుధాదిప్రోక్తవృత్తిస్వయం
భావున్ దిర్మలకొండయార్యసుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్.

" * * సంకీర్తనాచార్యదౌహిత్రసంప్రదాయంబు నగు మత్సంప్రదాయంబునకు సకల ఖలనరాధిపాధమగణ గుణస్తోత్రం బపవిత్రం బగుట యథార్థం బని తలంచి * * శ్రీవేంకటరమణునకు * * సమర్పణంబుగా సమర్పించెద * * యమ్మహాదేవుండు మదీయమాతామహవంశశిఖారత్నం బగు నన్నయాచార్యునకు జామాతురుం డని (అలమేలుమంగ తాళ్ళపాకవారియాఁడుపడు చని శ్రీవేంకటేశుని కళ్యాణమొనర్తురుగావున) పంచుకొని భవదీయసంకీర్తనంబు లాలించిన కర్ణంబుల నితర సంకీర్తనంబు లాలించనని ప్రతిజ్ఞఁ

గావించెఁ దత్తనూజుం డగు పెద్ద తిరుమలాచార్యబిడౌజున కుఁ దిప్పురుషపర్యంతంబుగాఁ బ్రత్యక్షంబును, సప్తపురుష పర్యంతంబుగా మోక్షంబు నొసంగెద నని వరమిచ్చె. సచ్ఛ రిత్రు లగు తదీయ పౌత్రులకుఁ జినతిరుమలదీక్షి తాన్నయా చార్య, తిరువేంగళనాథ, కోనేటి తిరువెంగళనాథ వెంగ ళార్యులకు విచిత్రముక్తాతపత్రరత్నకరాటముద్రికాప్రచండ మణిమండితమకరకుండలోత్కరాహాటకరదీపికాప్రిపాదుకాది బహూకరణంబులఁ గరుణించె, విశేషించియు నత్తిరువెంగళ నాథుండు సంకీర్తనంబుఁ బాడిన నాడందొడంగె; నేతత్ప్ర కారంబున నమ్మహామహులకుఁ బాండవసహాయుండైన శ్రీకృష్ణదేవునింబలె సహాయుండై * * ”

పై వాక్యములవలనఁ దాళ్ళపాక వారిభక్తి, భోగ ములు, దైవము వారికిఁ బ్రత్యక్షమగుచుండె నను నమ్మకము నెట్లుండెనో తెలిసికొనవీలగుచున్నది. భావిపరిశోధకులచే నీ తాళ్ళపాకకవులచరిత్ర మింకను బెంపొందునుగాక. తాళ్ళపాక వారు కావ్యప్రకాశికకుఁ గూడ వ్యాఖ్య వ్రాసినట్లు తెలియు చున్నది.

చ. అకలుష వేదశాస్త్రనిభమై శుభమై సభమైతిర్రి నెంచ భ
వ్యకలితరీతి వృద్ధికరమై పరమై చిరమై తలిర్ప బా
యక కరశంఖచక్రకరణాభరణానెర నా రవీందు తా
రకముగ నిమ్మహాకృతితతుల్ బ్రతులన్ క్షితులన్ బ్రకాశిలున్॥

# వెలగపూడి వేంగనార్యుఁడు



ఇతఁడు మూఁడాశ్వాసముల గ్రంథముగా లీలాశుక యోగి యని నామాంతరము గల బిల్వమంగళుని కృష్ణకర్ణామృతమును దెలిఁగించెను. ఈ కవి యార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. పెద్దనామాత్యునిపుత్రుఁడు. ఈతఁడు తనగ్రంథము నందలి యాశ్వాసాంతములఁ బద్యములలో నాముక్తమాల్యదవలె గద్య వ్రాసికొనెను.

"మ॥ ఇది కృష్ణాశ్రమయోగిపుంగవ కృపావీక్షాత్తసారస్వతా
భ్యుదయ శ్రీవిభవ ప్రభావ చిదచిద్బోధక్షమాశాంతి స
త్యదయాభూషణ వెల్లపూడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాశ మగున్ దృతీయ మగుచున్ గర్ణామృత శ్రీకృతిన్"

ఈతని గ్రంథము వ్రాసికొనిన యొక విలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లువ్రాసెను.

"కఁ శ్రీమత్కర్ణామృతకృతి
ప్రేమంబున వెలఁగపూడి వెంగన తెనుఁగున్
గామాల్యగూర్చె దీనిన్
రామబ్రహ్మందబ్రమానిగాట్టు లిఖించెన్॥"

"గీ. శాలివాహనాఖ్య శకవరుషములు
వెయ్యిన్ని ఆఱునూరు నిరువదేడు (1627)
పరఁగ చనినపిదపఁ పార్థివవత్సర
మార్గశీర్షమందు వ్రాసినాము."

పై పద్యములనుబట్టి వేంగనార్యుఁడు శాలివాహన శకము 1627 కుఁ బూర్వుఁ డని మాత్రము తెలియుచున్నది.

ఈతని పద్య మొకటి సులక్షణసారమునం దుదాహరింపఁబడి యుండుటచేతను, సులక్షణసారకర్త తెనాలి రామకృష్ణకవికి సమకాలికుఁ డగుటను వేంగనార్యుఁడు క్రీ॥ శ॥ 1530 కిఁ బూర్వుఁడు కావలెను. ఈతని గ్రంథమునకు వచనము మహిమలూరి రంగయామాత్యుని కొడుకగు వేంకటకృష్ణుఁడు వ్రాసియుండెను. వేంకటకృష్ణకవి యాపస్తంబసూత్రుఁడు, శాండిల్యగోత్రుఁడు, పరమహంసపరివ్రాజకాచార్య దక్షిణ ద్వారకానివాస శ్రీ సదాశివతీర్థపాదుఁ డను గురువు శిష్యుఁడు, వేణుగోపాల భక్తుఁడు. ఈతని వంశమువారిలో, కృష్ణకవి యొకఁడు కొన్ని గ్రంథములు వ్రాసియున్నాఁడు. కృష్ణకర్ణామృతమునుండి కొన్ని పద్యములు చూపెదను.

మ.. మురళీనాదమరందబిందులహరిన్ మోదంబుచే లోచనాం
బురుహంబుల్ ముకుళింప నోష్ఠమణి సొంపుల్ మీఱ నాదర్శభా
సురగండస్థలి యొప్ప స్రస్తచికురస్తోమంబు ఫాలంబుపై
మురువుల్ చూపఁ జెలంగు కృష్ణవదనాంభోజంబు భావించెదన్.

మ. ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవయున్
కలలీలాశుకవాక్యముల్ తెనుఁగునన్ గర్ణామృతఖ్యాతిగా
నలరం జేసితి వెల్లపూడిమణి పెద్దామాత్యవేంగన్న నే
నలరుం దోయిటి మాడ్కిఁ గర్ణొనుము కృష్ణా కల్పసంస్థాయిగన్॥

శా. బాలున్ మంజులతాలవాలచపలాపాంగోల్లసల్లీలునిం
గాళిందీపులినాంగణప్రణయిశృంగారైకఖేలున్ శుభ
శ్రీలోలుం గరుణావలోకనసుధాశీలున్ వినీలప్రభా
జాలుం గొల్చెద రామణీయకరసస్వారాజ్యపాలున్ మదిన్॥ ఆ. ౧.

చ॥ ఉదరము నింపఁగోరి ఖలు లుండెడిఠావులు చేరి వారి క
ట్టెదుట నశంక నిన్ను నటియింపఁగఁజేసిన పాతకంబులన్
సదయత నోర్వఁగావలెఁ బ్రిసన్నమతిన్ ననుఁ గన్నతల్లి శా
రద యదువంశనాయకుని ప్రిస్తుతి నిష్కృతి సేనొర్చెదన్॥ ఆ. ౨

ఉ॥ చల్లనివాని నవ్వువెదజల్లెడువాని దయారసంబు జొ
బ్బిల్లెడువానిఁ గెంపు జిగి పెంపు చెలంగెడుమోవివాని సం
ఫుల్లసరోజనేత్రములఁ బొల్చినవానిఁ బయోధవీచికా
వేల్లితనీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్॥ ఆ. 3

—:O:—

# కంసాలి రుద్రకవి

ఈతఁడు కృష్ణదేవరాయని యష్టదిగ్గజములలో నొకఁ
డని వ్రాసిన వ్రాఁత నిరాకరించి కవులచరిత్రమునందు
రుద్రియ, భద్రయల చరిత్ర మించుక వ్రాసియున్నారు.
కంసాలురు, కమ్మరులు, కంచరులు, వడ్రంగులు మొదలగు
పంచాణమువారే యిప్పుడు విశ్వబ్రాహ్మణుల మని చెప్పుకొ
నుచున్నారు. ప్రతిజాతివారును దమ కిదివఱ కున్న పేరులు
మార్చుకొని క్రొత్తపేరులఁ బెట్టుకొనుట వా రభివృద్ధినిఁ
గోరుచున్నట్లే సంతసింపవలసిన విషయముకాని, ఖండింపఁ
దగిన పరిహాసాస్పదమగు విషయము కానేరదు. అట్లే కంసాలు
రును దమకిష్టమైన నామము మార్చుకొనుటలోఁ దప్పులేదు.
ఈ జాతివారు బ్రహ్మసృష్టిలోవారు కారు కావున, విశ్వ

బ్రహ్మసృష్టిలోనివా రగుట, శివసృష్టిలోనివార మనుకొను ముచ్చిలవలెనే, బ్రహ్మసృష్టిలోనివా రగు చాతుర్వర్ణముల వారును వీరిని బహిష్కరించిరి. కంసాలురు, ముచ్చిలును జేయువృత్తులు ప్రపంచమున కావశ్యకమైనను వేదాంతభావము గల భారతీయు లీ భౌతికవృత్తులఁ జేయువారి నొకప్పుడు నీచముగా నేకారణముననో చూచియుందురు. అప్పుడు వారు పుట్టుకచేతనే బుద్ధికుశలురు, లోకజ్ఞులు, స్వతంత్రులునగుటచే, విప్రాదిసంఘములు విశ్వదృష్టిలో వారు తలంచిన ప్రయోజనములకు వీరిని గర్హింప, వీ రెదురుతిరిగి తా మీసృష్టిలోని వారమె కామనియుందురు. అప్పటికున్న పీఠాధిపతులు, మంత్రిమహానాటివారును వీరిని బహిష్కరించి బ్రహ్మసృష్టిలోని చండాలుఁడు గూడ వీరి యిండ్లఁ బచ్చిమంచినీళ్ళు గూడఁ దాగరా దని కఠిన నియమముల శాసించిరి. ఇంత కఠిన సాంఘికబహిష్కారము న్యాయమా? అన్యాయమా? అని మనము విచారించుట కందులకుఁ గలకారణములు ముందు తెలిసికొనవలెను. కాని ఘోరమైన యీసాంఘికబహిష్కారమునందుఁ గూడఁ జాకలి, మంగలి, కుమ్మరి మొదలగువా రీజాతివారికిఁ బరిచర్యలు మానలేదు. బహుశః ఈ జాతులవారు తిరిగి చేయవలసియున్న పను లుండుటచే 'రాజీ' కుదిరియుండును.

ఏ మైన నేమి? వీరుకూడ వేదోక్తకర్మ లొనరించుకొనుచున్నారు. ఐతే బ్రాహ్మణులు వీరికి సాయపడరు.

వీరిలో జాతిభేదము లనంతము. ఉత్తమతరగతులవారి కుటుంబజీవితము పవిత్రమైనది. వీరియం దనేకులు బుద్ధిశాలురు గలరు. అం దీకవి యగ్రగణ్యుఁడు. ఈ విశ్వబ్రాహ్మణుల మను కంసాలి కవులు వ్రాసినశతకములు పదిపండ్రెండు కనఁబడుచున్నవి. వాని వివరములుకూడఁ గొంతవఱకుఁ జూపెదను.

నూతనముగఁ గవివంశీకులవలనఁ గొన్నిసంగతులు తెలియుచున్నవి. *

ఈ పై కవులచరిత్రము నందలి భద్రయ, రుద్రియల కథలును, చాటుపద్యమణిమంజరివిషయములను, వాడుకలో నున్నవిషయముల నాధారపఱచుకొని వ్రాసినవి. మన కవసరమైన "బలవదరీ శతకము" సంపూర్ణముగఁ జిక్కుటలేదు. ఇతఁడు నిరంకుశోపాఖ్యానము, సుగ్రీవవిజయ మను యక్షగానము, బలవదరీశతకము, కొన్ని యష్టకములు మొదలగునవి వ్రాసియుండెను. ఇతని నిరంకుశోపాఖ్యానము తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము నందలి నిగమశర్మోపాఖ్యానమును బోలియుండును. యక్షగానమును ముద్రితము. ఇతఁడు సరసమనోరంజనము వ్రాసియుండెనని చెప్పుదు రని కవులచరిత్ర మనుచున్నది గాని యది కనఁబడదు. మఱియొక

---

* చూడుఁడు. చాటుపద్యమణిమంజరి - రెండవభాగము. (శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి) పుట 25-37. (1922).

కంసాలి యగు తెనాలి రామలింగఁడు ధీరమనోరంజనము
వ్రాసి యక్కన్న మాదన్నలకుఁ గృతియిచ్చిన గ్రంథమొ
కటి ముద్రితప్రతి చిక్కుచున్నది. పొరపాటున నది రుద్రకవి
కంటఁగట్టియుందురా?

నిరంకుశోపాఖ్యానపీఠికలో సుగ్రీవవిజయము వచన
కావ్య మని రది తప్పు. సుగ్రీవవిజయము యక్షగానమే
ముద్రితమై యున్నది. ఈతని జనార్దనాష్టకముకూడ ముద్రి
తమై యున్నది. కందుకూరి జనార్దనుఁ డీతని యిష్టదైవ
మైనను; నిరంకుశోపాఖ్యానము హిమనంతుని యల్లునికే కృతి
యిచ్చి తనయల్లునిఁ జేసికొనుట చూడ నితఁడు శివకేశవ
భేదములేని భక్తుఁ డని గ్రహింపవచ్చును. రుద్రకవి తల్లి
చిన్నమాంబ. "ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధవర్ణవర్ణనీయ
కవిత్వతత్త్వధారేయ పెదలింగనార్య గర్భార్ణవపూర్ణి మా
త్రేయ గురువరాచార్య పదారవింద మిళిందాయ * * రుద్రి
యనామధేయ."

అని గద్యమునందును

"ద్వి॥ అని కందుకూరి జనార్దను పేర
* * * *
నంకితంబుగఁ గాళికాంబాప్రసాద
సంకల్పితకవిత్వచాతుర్య ధుర్య
యాశీర పెదలింగనార్య తనూజ
కోవిదస్తవనీయగుణ రుద్రధీర
విరచిత సుగ్రీవవిజయాభిధాన"

యనియు రచియించినది చూడ నీతఁడు కాళికాంబా భక్తుఁ డనియు; జనార్దనభక్తుఁడనియుఁ గూడ దెలియుచున్నది. ఈతని తండ్రిపేరు పెదలింగనార్యుఁడు, తల్లి చిన్నాంబ (నిరంకుశ 4 ఆశ్వాసాంతము) యనియుఁ దెలియుచున్నది. ఈతని గురు వాత్రేయ గురువరాచార్యుఁడు. ఈతని వంశీకు లిప్పటికిని నెల్లూరుజిల్లా కందుకూరులో "కవి వార" ని ప్రసిద్ధులైయున్నట్లును, కృష్ణరాయని యాస్థానమున నష్టదిగ్గజములకు నెనిమిది దిక్కులయందు నున్న యెనిమిది సింహాసనములలో నీశాన్యసింహాసనము నీ రుద్రకవి కిచ్చినట్లును,* మనోహరవిషయములు తెలియుచున్నవి. ఈతని వంశమున ననేక రుద్రకవులు పుట్టినట్లును, ఒక రుద్రకవి మల్కిభరామ్‌చే శకాబ్దములు 1480 లో రెంటచింతలపాలెము నగ్రహారముగా నొందినట్లును తెలియుచున్నది.

బలవదరీశతకమునుండి దొరకిన కొన్నిపద్యము లుదాహరించు చున్నాను. [పేజీ 32 చా-ప-మ.]

చ॥ కలశపయోధిమీఁద దరఁగల్ మరి హోయని మ్రోయ వేయుభం
గుల తలపాన్పుపాము బుసకొట్టఁగ నేగతి నిద్రచెందెదో

"*రుద్రకవి రాయలయాస్థానమునఁ బండ్రెండేండ్లు వసియించెను. సప్తకవు లనఁబరగు పెద్దన, తిమ్మన, పుత్తేటి రామభద్రుఁడు, పింగళి సూరన్న, కవిరాట్టు తెనాలి రామలింగయ, భట్టుమూర్తి యనువారితోఁ దాతాచార్యులతో ననేకవాదముల వాగ్వాదములు సలిపెను. కవిరాట్టు ఎవ్వరో?" చాటుపద్యమణిమంజరి 2 భా. 29 పు.

యలసతేఁ దండ్రి చీమచిటు కన్నను నిద్దురరాదు మాకు నో
బలవదరీ దరీ కుహరభాస్వదరీ యదరీ దరీ హరీ.

చ॥ కలుష సరిత్తరీ పుషితగంధకరీ మహీభృత్కిరీ భవా
చలభిదరీ దయారసవిశాలఝరీ నిగమార్థమాధురీ
ఖలగజకేసరీ విభవకంపితమేరుగిరీ లతాదరీ
బలవదరీ దరీ కుహరభాస్వదరీ యదరీ దరీ హరీ.

చ॥ అల పగవానితమ్ముఁడు భయాతురుఁడై చనుదెంచినంతనే
బళిబళివచ్చి తీవనుచుఁ బట్టముఁ గట్టవె లంక కప్పుడే
కొలిచిన నిన్నెకోల్వవలెఁ గోరిక లిచ్చిన నీవ యీవలెన్
బలవదరీ దరీ కుహరభాస్వదరీ యదరీ దరీ హరీ.

బ్రాహ్మణు లెవ్వరో యీ రుద్రకవి నాక్షేపింప రుద్రకవి చెప్పినపద్యము.

సీ॥ పరనిజకర్మధూర్వహాత బ్రాహ్మణులు మీరు
పరికింప నిలఁ బరబ్రహ్మ నేను
ఇనుము చేతను నొనర్చిన శంఖచక్రాంక
గురువులు మీ ర్జగద్గురుఁడ నేను
దానప్రతిగ్రహాధీన బిరుదు మీఁది
పేమణీహనుమంత బిరుదు నాది
ఋషివంశభూషణ శ్రేష్ఠులు మీరలు
కనకకుంతేల పరిష్కారి నేను

గీ॥ అనుచుఁ దెల్పితి మామకఘనకులంబు
రాయలు వినంగ నంద రౌరా యనంగ
సత్కవులలోనఁ దాతయాచార్య యేన
రూఢికెక్కిన కందుకూర్ రుద్రకవిని.

(పుట 26-చా-ప-మ.)

# కవి చౌడప్ప

ఈతని సరియైనపేరు కుందవరపు చౌడప్ప యని తోఁచుచున్నది. ఈతఁడు చౌడప్ప శతకమును వేమనవలెఁ దనకుఁ దానే సంబోధించుకొనుచు "కుందవరపు కవిచౌడప్పా!" యను మకుటముతో రచియించెను.

కవిచౌడప్పపద్యము లాంధ్రలోకమున నూతనములు కావు. చిరకాలమునుండి పండితపామరజనరంజకములై యున్నవి. హాసజనకములై యున్నవి.

హిందువు లాముష్మికవిద్యాప్రీతి కలవారు. వారివాఙ్మయమంతయు నాలోచనాగర్భితమై (Serious) యుండును. హాస్యరసము క్షణికమైనది. నవ్వుతో నెగిరిపోవునది. సులభముగ నశించునది. అనఁగా రసోదయమైన స్వల్పకాలములో నెగసిపోవు (Volatile) స్వభావము కలదని పెద్దలు చెప్పుదురు. మన యనుభవము నంతియ. దురాత్ములకును లోపములుగలవారికిని హాస్యకావ్య మనుఁడు—లేదా దూషణకావ్య మనుఁడు (Satire)—దానియందలి తేలుకొండిపోటు వంటి విషపూరిత మగు నధిక్షేపణము గూఢమయ్యు, వారి యెడ వలసిన పని చేసి వారిని సాలోచనులుగఁ జేయును గాక! హాస్యరసము శ్రోతలకడ స్వల్పకాలమే నిలువఁబడు ననక తప్పదు. అందువలన మనవా రీ జాతికావ్యముల సృష్టిం

పక యుండి యుండవచ్చును. ఇట్టి హాస్యదూషణకావ్యములు తెలుఁగువాఙ్మయములో మృగ్యము. పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము రెండర్థముల తిట్టుకావ్యము. కూచిమంచి జగ్గకవి చంద్రరేఖావిలాపము బండబూతుల సమూహము. ఇవియే మనము హాస్యకావ్యము లనుకొనుచున్నాము. ఇంత దూష్యములు కాని – బూతులబుంగ లనుటకు వీలులేని, సత్యమైనతిట్లుండు కావ్యము లీ చౌడప్పశతకము, వేమనశతకము, మొదలగునవి. హాస్యరసోత్పాదనమునకుఁ గవిచెప్పు సంగతియందు యథార్థ ముండవలెను. వీరి మాటలయం దట్టిగుణ మున్నది. అందువలన మన మాంగ్లేయ కావ్యములయందుఁ గనుఁగొను హాస్యము (Wit & Humour) యీ శతకములయందుఁ గొంతవైనఁ జూడ వీలున్నది. మన వాఙ్మయమున నిట్టివి లేవనుకొనుటకంటె నున్న వని చూపఁ గోరు భాషాభిమానులు సంతసపడుటకుఁ జాలినంతమాత్రమ్ము హాస్యరస మీ కావ్యములయందు లేకపోలేదు.

ఇఁకఁ గవిచరిత్రము శతకమునందలి యాధారములవలన నేమి తెలియుచున్నదో చూతము.

క. శ్రీపతి పుల్లూరిపట్టణ* । గోపాలుఁడు సదయుఁ డగుచు కుంతీసుతులం
గాపాడినటుల మమ్మును । గాపాడును కుందవరపు కవిచౌడప్పా!

* కడపమండలములో నీ పుల్లూ రున్నది.

అనుటవలన నితఁడు "పుల్లూర"ను గ్రామవాసి కావచ్చునని తోఁచుచున్నది. చౌడప్ప యను నామము "చవుడేశ్వరి" యను దేవత వలన వచ్చియుండవచ్చును. అట్టి పేరు గల యమ్మవారు కర్నూలు మండలమునందలి నందవరమునఁ గలదు.

క. విను భారవి భట్టును నా। చనసోముని మాఘుకవిని చతురత శ్రీనా
థు నుతింతును కవితకుఁ ది। క్కనఁదలఁతును కుందవరపు
కవిచౌడప్పా!

అను పద్యమున శ్రీనాథునివఱకుఁ గల తెలుఁగుకవుల నుతించుటచే నీతఁ డాతని పిమ్మటివాఁ డనుట స్పష్టము.

క. లేరా రాజులు భూమిని। వారల నెవఁ డెఱుఁగు సకల। వైభవముల నీ
వే రాజవు నీతికి విను। మారాజును నేనె కవిని। మట్లయనంతా.

అని ప్రసిద్ధుఁ డైన "మట్ల అనంతభూపాలుని" గుఱించి యీతఁడు చెప్పిన పద్యమువలన నీతఁ డాతనికి సమకాలికుఁడుగఁ గన్పట్టు చున్నాఁడు.

క. నేరుతు నని మాట్లాడఁగ। వారిజభవు నంతవాని। వశమా తంజా
వూరి రఘునాథరాయని। గా తెఱుఁగఁగఁ గుందవరపు। కవిచౌడప్పా.

అను పద్యమువలన నీతఁడు తంజావూరి రఘునాథరాయనిగారినిఁ గూడ నెఱుఁగుననియుఁ బై ప్రభువులును, గవిరాజులు నగువారిరువురు సమకాలికు లనియుఁ దెలియుచున్నది. కకుస్థవిజయము వ్రాసిన మట్లయనంతకవియు, విజయవిలాసాది ప్రబంధకృతిభర్తయు, వాల్మీకచరిత్రము, ద్విపద

నలచరిత్రము మొదలగు పలు కావ్యములు రచియించిన విద్యాభోజుఁ డగు రఘునాథభూపాలుని కీర్తియు నిట వివరింప నవసరము లేదు. రఘునాథభూపాలుఁడు వ్రాసిన వేమి, కృతినందిన వేమి, శతాధిక గ్రంథము లున్నట్లు తెలియుచున్నది.

సీ.గీ. ననుచు బుధు లెంచు నీతివాక్యములు వినవె
రాజితోపాయకుందవరంపురాయ
హాస్యకవిజాణ గానవిద్యాప్రవీణ
నాగధీమణిసత్పుత్త్ర నయచరిత్ర.

అను పద్యమువలన నీతఁడు "కుందవరంపురాయఁడు" అనఁగా బహుశః కుందవరపుఁబ్రభుఁడనియు, "హాస్యకవిజాణ" యనియు, "గానవిద్యాప్రవీణుఁ డ" నియు, "నాగధీమణి పుత్త్రుఁ" డనియు స్పష్టముగఁ దెలియుచున్నది. కుందవరపురాయఁడనఁగఁ గుందవరపు కరణము నని కవి యభిప్రాయము కావచ్చును.

ఇతఁ డిరువురు ప్రభువుల నుతించుటచే వారిరువురు నప్పటికిఁ బ్రసిద్ధు లగు వదాన్యము గల కవిరాజులై యుండవలెను. లేదా యితఁడు రాజుల నాశ్రయించియో, యాహ్వానములఁ బడసియో, రాజుల దర్శించుటకుఁ బోవువాఁ డనియు నూహింపవచ్చునని తోఁచుచున్నది.

క. పెద్దనవలెఁ గృతిఁ జెప్పినఁ । బెద్దనవలె నల్పకవిని బెద్దనవలెనా!
యెద్దనవలె మొద్దనవలె । గ్రిద్దనవలె కుందవరపు కవిచౌడప్పా.

అను పద్యమువలన నీతఁడు మనుచరిత్రము రచియించిన పెద్దననే స్తుతియించియుండును. అది నిజము కావచ్చును.

మట్ల యనంతుఁడును, రఘునాథభూపాలుఁడును, విజయనగరరాజ్య మస్తమించిన పిమ్మట 16వ శతాబ్దాంతమున నున్నవారు * కావున "చౌడప్ప" కూడ 16వ శతాబ్దములో నుండినవాఁడే కావలెను. అప్పు డాతఁడు పెద్దనను స్తుతియించుట కభ్యంతర మేమున్నది?

తన కవిత్వమును గురించి తానే యిట్లు చెప్పుకొనినాఁడు.

క. ముందుగ చనుదినములలో । కందమునకు సోమయాజి ఘనుఁ డందురు నేఁ
డందఱు నను ఘనుఁ డందురు । కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా.

ఇంక ననేకవిధముల వర్ణించుకొనినాఁడు. తన్నుఁ దాను సంబోధించుకొని శతకము వ్రాసినకవి నాత్మస్తుతి యని నిందింపఁదగునా? ఇంకను జూడుఁడు, రెండుమాత్రము చూపెదను.

క. కందము లితరులవి జనా । నందంబులు గావు వినఁగ నవరసఘటనా
కందంబులు నీకవితా । కందంబులు కుందవరపు కవిచౌడప్పా.

క. మును పద్యమ్ములు నీతులు । జనులకు మఱి కుందవరపు చవుడిని నీతుల్
వినుటకును దేట తెనుఁగై । కనుపడుఁ గద కుందవరపు కవిచౌడప్పా.

ఈతఁడు చెప్పుకొనిన ట్లీతని పద్యములు మాత్రము తేట తెలుఁగు లూటలూరుచుండును. కావునఁ గవి కేవల

* వీ రిరువురకాలనిర్ణయమును గవులచరిత్రమున వర్ణితము. మట్లయనంతునిశాసనములుకూడఁ జిక్కినవి. క్రీ॥ శ॥ 1565 లో మట్ల యనంతుని శాసనము లున్నవి. (చూడుడు. 653 పుట.) (Madras Precy. Inscriptions) కావున వారి కాలనిర్ణయ చర్చ యిట విడువఁబడినది.

మాత్మస్తుతి చేసికొనలేదనియు, సత్యమునే చెప్పుకొనెననియుఁ గన్పట్టుచున్నది. ఇతఁడు బూతులు వ్రాయువాఁ డను నపవాదము నీతఁడే యంగీకరించుచున్నాఁడు.

క. నీతుల కేమి యొకించుక । బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో
నీతులు బూతులు లోక । ఖ్యాతులురా కుందవరపు కవిచౌడప్పా.

దొరకు నవ్వుపుట్టించుటయే కవిత్వమునకుఁ బరమావధి యనుకొను నీతఁడు, పైన మనము తలంచినట్లు రాజాశ్రితుఁ డనుటకు సందియ ముండబోదనుకొందును. బూతుల పద్యములు చెప్పి "లోకఖ్యాతి" కొఱకు గవిత్వము చెప్పిన యీతఁడు, పాప మతఁ డనుకొనినట్లు ఖ్యాతితోఁబా టపఖ్యాతియు సంపాదించుకొనె నని గొందఱు రీతని నిందింతురు.

ఇతని శతకమునం దున్న పదిపండ్రెండు పద్యములు శ్రవణకఠోరముగ లేకపోయినను ధ్వనిప్రధానముగఁ బండితజనైకవేద్యములై, గుహ్యాంగవర్ణనాదు లుండి, సరసమైన కవిత్వమునందును భావముల యందుఁ గొంచ మేవ కలిగించునవియై యున్నవి. నవ్వునకు బదు లాగ్రహము కూడఁ గొందఱు వెలిబుచ్చెదరు. మామిడిపండులో జీడివలె నీ శతక రాజమునం దా పదిపండ్రెండుపద్యములును పఠనయోగ్యముగ లేవు. దొరలనవ్వు కొఱకైననేమి, లోకమునందలి ఖ్యాతికొఱకైననేమి, గుఱియుంచి వ్రాసిన యీ పదిపద్యములు గర్హ్యములై పాప మీసత్కవి కీర్తికి హానికరములై

పోయిన వని నవనాగరకులు నిందించి జాలిపడువారున్నారు. సమకాలికులగు - స్వల్పకాలములోఁ దనతోనే మరణము నొందు సమకాలికులగు - రాజులకొఱకుఁ గాని, ప్రజలప్రీతి కొఱకుఁ గాని, శాశ్వత మగు గవిత్వమున నిట్టివి చెప్పు కవి యెంతఘనుఁడయ్యు నిట్లు శాశ్వతముగఁ గొందఱకడనైన నపకీర్తి నొందును. ఈ సిద్ధాంతమున కింతకంటె నేమి నిదర్శనము కావలెను? ఈతని శతకమునందొక సీసపద్యమును, ఒకవృత్తమును గూడఁ గాన్పించుచున్నవి. సీసపద్యమునఁ గవిచరిత్ర మున్నది. అందలి యెత్తుగీతము పై నుదాహరించి యున్నాను.

(1) శా. ఒడ్డారంబు ఘటించె బ్రహ్మ

(2) క. పడతుకయును వంకాయయు

వంటి పద్యములు పఠనార్హముగ లేవనవచ్చు నను కొందును. ఇవి సంస్కృతచమత్కారశ్లోకములకుఁ బరివర్తనములు! అందలి బూతు లిందును వచ్చినవి. ఇట్టివ్రాఁతలఁ జూచియే మన కవిచరిత్రకారు లాకాలమునందు, దేశ మట్టి దుర్దశయం దుండె నని నిందించుటకు సాహసించెదరు. ఆ కాలమునందే పుట్టిన యితర కావ్యములయం దిట్టి వున్నవా? హాస్యరసోత్పాదనమునకు బూతులు సాధన మనుకొనుట యీ కవితప్పు. ఆతని యభిలాష మంతవఱకే పోయినది. అని విమర్శకు లనుకొనవలెను. కాని యీకాలమునందు

బూతాడుట తప్పుగా నెంచువారుకారని చరిత్రల కెక్కిం చుట ప్రమాదము కాదా? ఏకాలమునందును దప్పు తప్పు గానే పరిగణింపఁబడవలెనే? తనకాలమునందుఁ దన్నె ప్రజలు బూతని నిందించి రని చెప్పుచుఁ గవి తాను చేసిన తప్పును సమర్థింపఁజూచుచున్నాఁడు. చూడుఁడు.

క. బూతని నగుదురు తమ తమ । తాతలు ముత్తాత మొదలు తర తరములవా
రేతీరున బూ తెరిగిరి । ఖ్యాతిగ మతి కుందవరపు కవిచౌడప్పా!

పై పోరపా టభిప్రాయమును, చౌడప్పశతకమునందలి నాలుగైదు పద్యములను విడిచినప్పు డాతని తక్కినశతకము మనోహరమై భక్తుల బరణియై, నీతులనిధియై, పఠనయో గ్యమై చెన్నొందుచున్నది. కొన్ని మాణిక్యములఁ జూపెదను.

క. విద్దెల మే లెఱుఁగని నరుఁ । డెద్దే సరి గడ్డి తినెడి దెద్దా పసులం
దెద్దునఁ గొంత వివేకము । కద్దప్పా కుందవరపు కవిచౌడప్పా.

క. తా రాజసభల మెలఁగుట । తా రసికతఁ జెలఁగుటెల్ల దన బ్రదుకునకా
పూరే దేరుకు తినదా । కారడవులఁ గుందవరపు కవిచౌడప్పా!

క. దేవుఁడు దేవుం డనగా । దేవుం డా దివినుండి దిగివచ్చేనా
ఈవిగల దొరయె దేవుడు । కావంగను గుందవరపు కవిచౌడప్పా!

క. ఇయ్యఁగ నిప్పింపంగల । యయ్యలకే కాని మీస మందఱికేలా?
రొయ్యకు లేదా బారెఁడు । కయ్యమునకుఁ గుందవరపు కవిచౌడప్పా!

క. తగుపాటి కవుల కియ్యని । మగముండలమూతిమీఁద మంగలియేలా
దిగగొఱుగఁడయ్యె మీసము । ఖగరాడ్భల కుందవరపు కవిచౌడప్పా!

ఇట్లే రాజులను, మంత్రులను కవుల కిమ్మని, యిప్పింపు మని, యాదర్శముగ నుంచుకొనిన యీ కవిజీవిత

మీపద్యములయందుఁ బ్రదర్శితమగుచున్న దని తోఁచుచు న్నది. ఇది సత్యము కాకపోవచ్చును. ఇఁక నీతులఁ జూడుఁడు.

క. తన సతి యిడఁగా మనుమలు । తనయులు తలిదండ్రు లన్నదమ్ములు బంధుల్
దిన దినమును భుజియించుట । ఘనవిభవము కుందవరపు కవిచౌడప్పా!

ఈ పద్యము బద్దినీతులలో

క. చేరి తనచెలులుఁ జుట్టలు । గోరి యభీష్టములు పంచి కుడువనిసిరి ని
స్సారము నిరర్థకంబు వి । చారింపఁగ నెపుడు దశదిశాభరణాంకా.

సేవకనీతి 17 పద్యము.

అను పద్యభావముతో సరిపోవుచున్నది. ఇట్లే కొన్ని ప్రకటితాభిప్రాయములే ప్రసిద్ధములైనవి యందమగు కంద ములఁ జేసియున్నాఁడు.

క. ఆడిన మాటలు తప్పిన । గాడిదకొడుకంచుఁ దిట్టగా విని మదిలో
వీఁడా కొడుకని యేడ్చును । గాడిదయును గుందవరపు కవిచౌడప్పా!

ఇది సంపగిమన్నశతకములోని దని కొందఱందురు.

క. పరవిత్తము గోమాంసము । పరసతి తనతల్లియనుచు భావించిన యా
నరుఁడు నరుండా రెండవ । కరివరదుఁడె కుందవరపు కవిచౌడప్పా!

పద్యము నాల్గవపాదమునందలి "ఖగరాడ్బల కుందవ రపు కవిచౌడప్పా!" ఇత్యాది విశేషణము లీతఁడు కేవలము యతికొఱకు సంఘటించినట్లు ద్యోతకమై యీతనిపాండిత్య ముపై సందియ మొదవించుచున్నవి. మన మెఱుఁగని యాతఁ డొకవేళ గరుత్మంతునంతటి బలవంతుఁడే యనుకొ న్నను కొన్ని వ్యాకరణవిరుద్ధ ప్రయోగములు 17 వ శతాబ్ద

మునందలి దాక్షిణాత్యకవులలోఁ గొందఱకువలెనే యీతనికిఁ గూడఁ బాండిత్యలోపము నారోపించుచున్నవని సందేహించుచున్నాను. నే నీమాటవలన దాక్షిణాత్యకవు లందఱు నపండితులని కాని, చౌడప్ప దాక్షిణాత్యుఁ డని గాని సిద్ధాంతముగఁ జెప్పుటకు వ్రాయలేదు.

కొన్ని నవ్వుపుట్టించు పద్యములఁ జూడుఁడు.

క. పప్పే పస బాపలకును । ఉప్పే పస రుచుల కెల్ల నువిదల కెల్లన్
కొప్పే పస దంతములకుఁ । గప్పే పస కుందవరపు కవిచౌడప్పా!

క. బట్టలు పస తురకలకును । గిట్టలు పస గుఱ్ఱములకు క్షితినాథులకున్*
బొట్టలు పస చెరువులకును । గట్టలు పస కుందవరపు కవిచౌడప్పా!

భక్తిప్రతిపాదకములగు పద్యములు మఱికొన్ని చిట్ట చివర కలవు.

క. చిత్తము శ్రీహరిపైఁ గిం । చిత్తును నిలుపంగలేని చెడుగుల మడియన్
మొత్తి, యమభటులు పోడుతురు । కత్తులతోఁ గుందవరపు కవిచౌడప్పా.

క. అలసట వేసట నైనన్ । గలనైనన్ గనుచునైన గరుడధ్వజునిన్
దలఁచినవారలఁ జేరవు । కలుషంబులు కుందవరపు కవిచౌడప్పా!

మట్లనంతుని కొలువులో నీ యిర్వురును హాస్యకాండ్రఁట!

ఉ॥ "అన్నిఁటమంచివారు విమలాత్ములు హాస్యకళాధురంధరుల్
సన్నుతనీతిపాలకులు జాణలు నైపుణు లెవ్వరంటిరా?

* ఈ పద్యము ముద్రాపకులు సవరించిరి.

పన్నుగ మట్లసంత నరపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కినట్టి గుణవంతులు ఘంటన, చౌడగాంట్లురా॥

ఈ ఘంటన యేమైన వ్రాఁతకాఁడో తెలియదు. చౌడప్ప తనకుఁ దానే మెచ్చుకొన్న బిరుదుగుణములు.

సీ॥ గీ॥ వానిఁ గొనియాడ శేషుని కైనదరమె?
విడని వ్యభిచారిముండల వేలువిత్తు
యాచకపరుండు కుందవ రాన్యయుండు
సరసవచనుండు నాగయ చౌడఘనుఁడు॥

తన్నుఁ దానుఁ దిట్టుకొనుటవలన హాస్యము వచ్చును గాని యది గర్వ్యముకాదా? ఇట్లే యనేక పద్యములఁ జూపుచు శతకమునే పూర్తి చేయవలె ననునంత మధురముగ నుండు లోకోత్తరమైన నీతులఁ జిన్నచిన్న పద్దెములను గోరు ముద్దలుగఁ బెట్టి నవ్వించుచు మ్రింగఁజేయు కవిశక్తి వర్ణనాతీతము. ఇంత గుణముకలచోట నించుక దోషమున్నది క్షంతవ్యము. దోషములు విడిచి గుణమునే తీసికొనుట బుద్ధిమంతుల లక్షణము. దోషముకొఱకు మంచిని విడుచుట మనకే నష్టము. కీర్తిశేషులైన రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారు దోషరహితముగ నీ శతకము ముద్రించియుండిరి. వారి ముద్రణము కూడ నా కీ వ్యాసరచన యందు సాయపడినది.

ఈతనిచరిత్ర మిట్లు వ్రాసి ముగించినపిమ్మట మఱి యొకప్రతి కవిచౌడప్పశతకము దొరికినది. అం దీతఁడు

బ్రాహ్మణుఁ డని, కుందవరముకరణ మని మనము పడిన సందియము వీడుచున్నది.

ఉ. ఆసలఁ జేరి దుర్గుణగుణాఢ్యుని దాత యటంచు వేఁడినన్
మీసము దువ్వుచున్ దిశల మీఁదులఁ జూచుచు దుర్మదాంధుఁడై
వీసము నియ్యలేని పలువిత్తుగులామును గీర్తి జేరునా?
భూసురవర్య! కుందవరభూషణ చౌడకవీశ్వరోత్తమా!

కావున నీతఁడు భూసురవర్యుఁ డని స్పష్టమైనదికదా!

మ. కరుణాసాగర హాస్యనాయక తపోగాంగేయ గోపాల త్వ
చ్చరణాంభోరుహభృంగ కుందవరవంశగ్రామణీ! ధీమణీ!
ధరణీనాయకకోటి నెప్పుడు కవిత్వప్రౌఢి మెప్పించఁగా
సరసాగ్రేసరచక్రవర్తివి గదా చౌడా జగన్మోహనా!

అని తాను కుందవరము కరణము ననియే చెప్పుకొనుటచే నీతఁడు శాక్తశాఖకుఁ జెందినవాఁడని తోఁచుచున్నది. బహుశః నందవరీకుఁడై యుండవచ్చును. ఏమనఁగా! చౌడేశ్వరి నందవరీకులయిష్టదైవము. చాముండికావిలాసము నందలి కథ ప్రసిద్ధ మగుట నిట వివరింపలేదు. ఈతఁడు మహాదాతయైన ట్లీక్రింద పద్యములవలనఁ దెలియుచున్నది.

ఉ. కుందవరంబురాయ భళి కుంజరవైరిసమానశౌర్య నీ
కెందును సాటి లేరు ధర నించుక మించుగఁ గుల్కు నీ సుధా
స్యందవచోవిలాసములు హా కడు వీనులవిందుగా మహా
నందము జేయఁగా ధరణినాయకకోటికి మాటిమాటికిన్.

ఉ. కుందవరంబురాయ నినుబోటి వదాన్యులమిండ భోగసం
క్రందనరూపమన్మథ సురద్రుమదానవినోద సజ్జనా

నందచరిత్ర హాస్యరసనాయక నీకు సమాను లెవ్వ రా
వందితకీర్తిలోల విను నాగయచోడవదాన్యశేఖరా!

మ. కరుణానందరసప్రపూర్ణశశితో గాంభీర్యవారాశితో
సరసోల్లాసవిలాసమన్మథునితో సౌభాగ్యదేవేంద్రుతో
దరహా కుందవరంబుచోడకవితో దానక్రియాకర్ణుతో
సరిలే రెవ్వరు లేరు లేరు కడుహాస్యప్రక్రియాచాతురిన్.

ఇతఁడు వదాన్యశేఖరుఁ డని, కుంజరధీరుఁ డని యనేకవిధముల వర్ణింపఁబడెను. ఇతఁ డిందువలననే

క. ఇయ్యంగ నిప్పింపంగల । యయ్యలకే గాని మీస మందఱ కేలా?
రొయ్యకు లేదా మీసము । కయ్యమునకుఁ గుందవరపు కవిచోడప్పా!

అని వ్రాసికొనినది సత్య మగుచున్నది. ఇదివఱ కను కొనిన ట్లీతఁడు రాజాశ్రితుఁడే కాక, రాజసముఁడై రాయబిరు దాంకితుఁడై ప్రబలెను. ఇతఁడు గౌడడిండిమభట్టువలె ఢక్కా వేయించుకొనువాఁడని యీ క్రిందిపద్యమువలనఁ దెలియు చున్నది.

శా. చొక్కంబైన సుధారసంపుఘుటిక లోచ్ఛేద్యంబు నీవాక్యముల్
స్రుక్కన్ బోవని గోస్తనీఫలతతుల్ శుంభన్నవత్కావ్యముల్
నిక్కం బన్నిట జాణఁడౌదువు భళీ నీ కెప్పుడుం జెల్లు నీ
ఢక్కావాద్యపుపద్దు కుందవరచోడా శ్రీకవీంద్రోత్తమా.

ఈ ఢక్కావాద్యపుఁబ ద్దెవ్వరిచ్చిరో తెలియదు. కాని యీతఁడాకాలమున మంచికవిగా, హాస్యజాణగా, వందితరాజమండలుఁడుగా నుండి ప్రసిద్ధజీవితమును గడిపినట్లు మన మెంచవచ్చును. తనముద్రఁదెప్పుడు బిరుదునిశానీలతో

రాజుల దర్శించుచుండువాఁ డనుటయే మనకు మహాసంతోష కారణముగ నున్నది. "కవిధూర్త ప్రకారాగ్రణీ" అని యొక చోట సంబోధించుకొనుచున్నాఁడు. ఈ ప్రతియందు బూతులు మితిమీరిపోయినవి. ఇదివఱ కనుకొనినట్లు పండితజనవేద్య ములే కావు. పచ్చిబూతులే యున్నవి. "చవుఁడకుందవరపు సార్వభౌమ!" యని యొకసంబోధనము కనఁబడుచున్నది. ఇతఁ డంతమాత్రమున సార్వభౌముఁడు కాక కూచిమంచితిమ్మ కవి కందాడవిభుత్వము హరిశ్చంద్రకృతిపతి యీడూరిశాస నత్వమువంటి వని నే ననుకొనుచున్నాను. ఇతఁడు బహుశః కుందవరపుచౌడఁ డని నేను భ్రమనొందుచున్నాను. కాని వాడుక "కుందవరపు" అనియే యున్నది. ఇతఁడు బూతుల నిట్లు సమర్థించుకొనుచున్నాఁడు.

క. బూతులు నీతులు చెప్పితి । నీతులు విని మెచ్చబుధులు నీతి విదూరుల్
బూతులు మెచ్చందగునని । కౌతుకమతి కుందవరపు కవిచౌడప్పా!

చ. శరనిధి మేర దప్పినను శంకరుఁ డిచ్చు వరంబు దప్పినన్
సురగురు నీతి దప్పినను సూర్యుఁడు చంద్రుఁడు త్రోవ దప్పినన్
పరసతినాన రాఘవుని బాణము దప్పిన హాస్యకాంద్రలో
సరసుఁడ జాణ గుందవరచవుఁడని పద్యము నీతి దప్పునే.

అని నీతికి నిలువఁబడుచునే యున్నాఁడు. ఇంకొక విశేషము! బూతు చెప్పినను నీతి తప్పనిమాట సత్యము. బూతుతోఁ జెప్పిన యుపమయందును లోకోత్తరమైన సత్య మొకటి కాన్పించుచున్నది. కాని యశ్లీలదోషమును నసభ్య

దోషమును దప్పుటలేదు. ఇతఁడొక పెద్దకవిగా, దాతగా, హాస్యజాణగా 16వ శతాబ్దమధ్యభాగమునఁ బ్రసిద్ధినొందెను.

క. *నానీతి వినని వాఁడును। భానుని కిరణములు మీఁదఁ బాఱనివాఁడున్
వానను దడియని వాఁడును। గానరురా కుందవరపు కవిచౌడప్పా.

అని కవి వ్రాసికొనిన శ్లీతనిపద్యములు జనవ్యాప్తి నొందియున్నది సత్యము. చౌడప్పశతకమునుండి పద్యములు పామరులుకూడఁ జదువుదురు. ఈ చరిత్రమిట్లు పత్రికలలోఁ గొంతవఱకుఁ బ్రకటించినది చూచి కడపమండలవాసులైన శ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యముగారు నా సాధనములు, వివరములు, ఊహలు సరిగ నున్నవని జాబునువ్రాసి పత్రికలలోఁ బ్రకటించిరి.

ఇతఁడు గౌరవనీయుఁడయిన సుకవి. ఈతనికి గరుడ్వవిజయ గ్రంథకర్త యయిన "మట్ల యనంతరాయ నిర్మితంబునగు" అనంతరాజపురప్రాంతంబు నందలి తటాకంబు క్రింద గొన్ని యినాములున్నట్లు తెలియుచున్నది. ఇవి యిపుడీతని వంశీకు లనుభవించుచున్నారు. ఈ యనంతరాజపుర మీ కడప మండలమందలి బద్వేలు తాలూకాయందు బద్వేలుపుర పరిసరమునగలదు. ఈ బద్వేలుతాలూకాయం దీ వంశము పేర గౌరవమగు తాంబూలాదుల వివాహాది శుభకార్యముల నిచ్చుచున్నారు. ఇద్దాన నీ మహాకవి పూజ నీయుఁడయినట్లు తెలియుచున్నది. ఇప్పటికిని వాడుకగానేయున్నది. మట్లయ నంత రాయలకాలమున నీ కవియుండినట్లు శ్రీ సుబ్బారావుగారి వ్యాసము వలన విశదము. మట్ల యనంతరాయలు "బద్వేలు, సిద్ధవట్టము, పుల్లంపేట, యను మూడు తాలూకాలకు నాయకుండయనట్లును, వారివృత్తాంతబోధిని (Cuddapah District Gazette) యందు విదితము. శతకమును పేరేకాని నీతులు, బూతులు గలసి రెండువందల కెక్కువగా గాన్పించు

* ఈ పద్యమే వేమన్నది యని కూడ నందురు. (2. 215 Brown)

మున్నవి. ఆంధ్రలోక మీ యితివృత్త మెఱుంగుగాక. మున్ముందు విశేషముల దెలియబరతు."

(కృష్ణాపత్రిక 8-3-1919)

పరిషత్పత్రిక సంపుటి 7 సంచిక - 2, పుట 7 లో నిట్లున్నది.

"చౌడప్పకబ్బ మను సీసపద్యాంధ్ర నిఘంటువును రచియించినకవి యీచౌడప్పయే కావచ్చును."

ఈ గ్రంథమునకై ప్రయత్నింపఁగా దొరికినది. దాని వివరము లాంధ్రపత్రికలో నిట్లొకసారి ప్రకటించితిని.

"కవిచౌడప్ప జీవితమును నేను గ్రంథరూపమునఁ బ్రకటించిన పిమ్మటఁ గొన్ని నూతనవిషయములు కూడఁ జేకురినవి. అవి నే నిపుడు ముద్రింపఁబోవు శతకకవులచరిత్రములోఁ జేర్చుచున్నాను.

కవిచౌడప్పయే వ్రాసెనని శ్రీ హ. సేతురామయ్యగారు పరిషత్పత్రికలో వ్రాసిన "చౌడప్పసీసము" లను గ్రంథముప్రతి నాకుఁ జిక్కినది. అందలి విశేషము లీ క్రిందఁ జూపుచున్నాను. ఇది 30 సీసములుగల శుద్ధాంధ్రనిఘంటువు.

## గ్రంథారంభము.

క. కప్పు మెయి రేని పేరట । ముప్పది సీసంబు లాంధ్రముగఁ జెప్పును చౌడప్పయు నీ కబ్బంబునఁ । దప్పెంచకుఁ డార్యులారఁ దగ నుతిసేతున్.

పద్యముల మకుటము బళిరకరివేల్పు శతకమును బోలి యున్నది. ఎవ్వ రెవ్వరి ననుకరించిరో తెల్పుకొనవలసి యున్నది.

సీ॥ గోలన ముగుదారి గోలనగంను ముల్లు
గోల యౌాడయుఁ బరిగోల యనఁగ
డిండు లీనంబు కడిండు తోరంబును
డిందు సుంటకును చేరిందు క్రీడ
తిండ్రింబు చికిలి మెట్టండ్రు మట్టాటవాఁ
డంద్రు వాఁ డంట వే గండ్రుబరువు
షెల్ల నిండుటి పాలవెల్లి పాల్కడలి
రేపల్లి నాఁగను గొడు గెల్లి నాఁగ

గీ॥ తట్టి యన యెడ్డె పెనుచోర । పట్టెమీరు
తోట్టు పట్టాలదొడ్డి కోరి । ల్లుట్టైనాఁగ
మట్టి చిట్టప నున్న రాకుట్టమిన్న
కట్టిచెలివేల్పు ముజ్జగాల్ బొట్టిదాల్పు.

సీ॥ 'విరియ నా పువ్వు సీవిరియ నా కల్లు వా
విరియ నాచెట్టు కావిరియు పొగయు
పరియ నా డాలు రూపరియ నా సొగసు మే
పరియ నా తిండి తేపరన తెగువ
తరు లనా వళులు బిత్తరులు నా చెలులు చి
త్తరులు నా బొమ్మ లత్తరులు వలపు
కటియ నా కప్పు చాకరియ నా సాక్షి బూ
కరియ నా నదుల్చు టక్కరి న దొంగ
వరియ నా చేను లావరియ నా బంటును
సరియ నా దండ కేసరులు వడ్లు
సూరిజనకల్ప పరదండసూకతల్ప
డంబుకరివేల్ప పిట్టసిడంబు దాల్ప॥

తుది పద్యము

క. వనదేవత కాఁటే దన
దనరును గువ్వ కరి యేకతమునకు పేరై
చను వంకకఁర లాతా
మనకూకటి యనఁగ జుట్టు నంబుజనేత్రా.

"చౌడప్పనీసములు సంపూర్ణముగా క్రొత్తపల్లి లక్ష్మయ్య వ్రాసెను. శ్రీరామచంద్రా! నీవేగతి. వికృతి నామ సం॥ర చైత్రి బ॥ విదియ సోమవారం"

ఈ ప్రతి చూపిన శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారికిఁ గృతజ్ఞుఁడను. ఈ గ్రంథము శతకము వ్రాసిన చౌడప్పయే వ్రాసినట్లు నామసామ్యమునుబట్టియు, వాడుకనుబట్టియు శ్రీ సేతు రామయ్యగా రూహించి యుందురు. ఇది చౌడప్పదే యనుటకు మొదటి పద్యమునందలి పేరు తక్క వేఱాధారములు లేవు. వ్యతిరేకనిదర్శనములు చేకురువఱ కిది కవిచౌడప్ప దనియే నమ్ముచుందుము గాక!" (ఆంధ్ర పత్రిక–దుందుభి–భాద్రపద శు ౧౧ శనివారము)

"పాము"శబ్దమునకుఁ బర్యాయపద మగు "కాకో దర" శబ్దము నీతఁ డిట్లు ధరించెను. "కాకోదర ! కుంద వరపు కవిచౌడప్పా !" అని కొన్ని పద్యముల మకుటముగాఁ గనఁబడును. ఈ కాకోదరశబ్దమున కర్థ మూహ్యము.

(1) నన్నెచోడుని కుమారసంభవములో

మహాస్రగ్ధర.

"హరహాసాకాశ గంగాత్యమలజల మరశాబ్జనీహారధాత్రీ
ధరకర్పూరేందు కాకోదరవరపతి దిగ్దంతి పక్షీరనీరా
కరముక్తాహారకుందోత్కర రజతశరత్కౌముదీద్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీవరు వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్.

(2) నారాయణశతకమునందు.

"కడకుంబాయక వేయినోళ్లుగల యాకాకోదరాధీశుఁడున్
కడముట్ట న్వినుతింపలేక" (2వ పద్యము.)

(3) భారతమున.

"సర్పయాగమున భస్మముసేయుము తక్షకాది కాకోదరసంహతిన్"
(ఆదిపర్వము)

కవిచౌడప్ప పలువురఁ దిట్టి "కాకోదరుఁ" డయ్యెనా! వేఱర్థమున్నదా? "ఖగరాడ్వైరుఁడు" కావునఁ గాకోదరోదరుఁడా? పండితులు చర్చించెదరుగాక!

---

## పరమానందయతి

ఈతఁడు (1) సంపగిమన్న శతకము (2) పరమానంద శతకము (3) దత్తాత్రేయశతకము (4) శివజ్ఞానమంజరి యను ద్విపదకావ్యమును (5) ఉత్తరగీతావ్యాఖ్యయును వ్రాసినాఁడు. ఇతఁడు శైవాద్వైతి. దత్తాత్రేయగురువు శిష్యుఁడు. ఈతని శతకములయందు నీతి, అద్వైతము, యోగము మొద

లగు విషయములనుగూర్చి వ్రాసియుండెను. క్రీ॥ శ॥ 1590 ప్రాంతములయం దున్న దత్తాత్రేయయోగీంద్రుఁ డొకఁడు తరిగొపల్లు మల్లన్నగురువు కనఁబడుచున్నాఁడు. ఈ దత్తాత్రేయుఁడే మన పరమానందయతికి గురువైనయెడల నీకవి 16 వ శతాబ్దాంతమున నుండి యుండును. శివజ్ఞానమంజరిలోఁ గవి తాను దత్తాత్రేయుని ప్రియశిష్యుఁడ నని చెప్పుకొని యున్నాఁడు.

"అనువు మీఱఁగ దత్తాత్రేయగురువుని
అనుఁగుశిష్యుడు పరమానందతీర్థు
లొనరించె నీ కృతి నుత్సాహలీల "
*　　　*　　　*
నాపాలిదేవుని నాగురునాథు
నాపాలిపెన్నిధి నన్నేలు వేల్పు
నొనర దత్తాత్రేయయోగిపుంగవుని
మనసున వాక్కున మఱికాయమునను
భావించి నుతియించి భక్తిని మించి
సేవించి పూజించి చెన్ను వహించి
అతి ముదంబునను పరమానందతీర్థ
యతి నామధేయుఁడ నింపుదలిర్ప"

ఈ దత్తాత్రేయగురుని వేదాంతులగు ధేనువుకొండ తిమ్మయ, చింతల లింగావధాని, యోగానందుఁడు, కంభంపాటి నారప్ప మొదలగువారును, చాముండికాపురాణమును వ్రాసిన రామకృష్ణకవియుఁగూడఁ బొగడియున్నారు. బహుశః యీతఁడు క్రీ॥ శ॥ 1590 కి పూర్వుఁడై యుండును.

ఈ కవి ఉత్తరగీతావ్యాఖ్యలో నిట్లు పలికినాఁడు.

శ్లో॥ ఓం జగదఙ్కురకన్దాయ సచ్చిదానందమూర్తయే
గళితాఖిలభేదాయ నమశ్శాన్తాయ తేజసే
నమః పరమశాంతయ సచ్చిదానందమూర్తయే
శ్రీ దత్తాత్రేయయోగీంద్ర చంద్రాయ పరమాత్మనే॥

"శ్రీమద్దత్తాత్రేయగురుచరణసరోజనుతమధుకరాయమానమానసుఁడగు పరమానందతీర్థనామధేయుండు మహాభారతమందు ధర్మక్షేత్రమయిన కురుక్షేత్రమందు అర్జునుండు శ్రీకృష్ణునిచాత గీతలు పద్దెనిమిది అధ్యాయాలచేత నున్నా ఉపదేశింపబడిన తత్త్వస్వరూపమును విషయభోగప్రాబల్యము చాతను మరచినవాడై తిరుగాను అశ్వమేధపర్వమందు ఆత్మతత్త్వము లెస్సగా తెలిసేటందుకు యిచ్చయించినవాఁడై భగవానులగూర్చి అడుగగాను ఉత్తర గీతలు మూఁడు అధ్యాయాల చాతలున్నా పూర్వవ్యాఖ్యాతలు అర్థం వ్రాశే టప్పుడు అనేక శ్లోకముల తాత్పర్యము లెస్సగా విచారించక అనుభవ విరోధముగా వ్రాసినారు గనక ఆఅర్థాలు పరిహరించి అవ్యుత్పన్నులైన ప్రాకృత ముముక్షువుల విషయీకరించి ఆంధ్రభాషాపద్ధతిని ఉత్తరగీతార్థము విని తెలిసి కృతార్థులౌదురు గాక యని తెనుగు వ్యాఖ్యానము చేశేను. తత్ప్రకారం బెట్టిదనిన అర్జునుం డడిగే ప్రకారము."

ఈ పై వాక్యములును, శ్లోకములును, మనకవిగురువు వివరములును, అతఁడు వ్రాసిన గ్రంథవిషయమును, 16 శతాబ్దాంతము నందలి టీకా గ్రంథముల యందలి భాషావిశేషములను స్పష్టముగాఁ దెలుపుచున్నవి. ఈతని 3 శతకములును, శివజ్ఞానమంజరియుఁ గూడ నీతఁ డద్వైతమతప్రతిపాదనమునకై వీనిని రచియించె నని తెలియఁజేయును. ఈతనిధోరణి – మతము – భావప్రకటనమును గూడ వేమన కవీంద్రుని బోలికనున్నది. పద్యము జూడుఁడు.

(1) పరమానంద శతకము 111 పద్యములుకలది.

క. శ్రీవరగిరిజా దాయక
గోవిందలలాటనేత్ర గోకులతిలకా
భావజసంహార హరిహర
భావాత్మక శివ ముకుంద! పరమానందా!

క. దైవము లిద్దఱు నేకో
దేవాదిస్మృతుల వలనఁ దెలియగ నొకటే
భావింతెద మిము నేకీ
భావంబున శివముకుంద ! పరమానందా !

(2) దత్తాత్రేయ శతకము 112 పద్యములు కలది.

క. శ్రీవిలసిత వరసంయమి
సేవిత పాదారవింద చింతితఫలదా
కావుము మము నెల్లప్పుడు
తావరముగ గుణవిధేయ! దత్తాత్రేయా!

శా. శ్రీవిఖ్యాతిగ నాత్మతత్త్వరచనా సిద్ధాంతవాక్యార్థముల్
శీవిన్ మీరగ గద్యపద్యములఁ బ్రొఢిం జెప్పి యర్పించితిన్
దేవా! గైకొను భక్తవత్సలతఁ బ్రీతి న్నన్ను రక్షింపు ప్రి
జ్ఞావిర్భూత ప్రమోదచిత్తమున దత్తాత్రేయ యోగీశ్వరా!

(3) సంపగిమన్న శతకము.

ఈ క్రింది పద్యమువలన నీతఁడు వేమన ననుకరించె నని యనవచ్చును.

క. వేసాలెల్లయు భువిలో । గ్రాసాలకె కాక, ముక్తికాంక్షకు నేలా
వాసిగలుగు యోగి య । థేచ్ఛాసంచారుఁడు గదన్న ఘనసంపన్నా.

(అ) ఈ సంపగిమన్నఁ డెవరో యని చూచిన నీ క్రింది సంబోధనలవలన విష్ణు వని తోఁచుచున్నది.

(1) "నీలామణిశ్యామా" (1)
(2) "సనకాదిముని ప్రసన్న!" (3), (32), (78)
(3) "శరణాగత సుప్రసన్న!" (2)
(4) "సలలిత కాంతిప్రసన్న!" (4)

(ఆ) ఈతనిఁ గవిచౌడప్ప యనుకరించిన పోలిక యొకటి.

క. వానలు పస పైరుల కభి
మానము పస వనితలకును మఱియోగులకున్
ధ్యానము పస యామీఁదట
జ్ఞానముపస సుప్రసన్న! సంపగిమన్నా!

ఈ సంపగిమన్నఁడు దక్షిణ హిందూస్థానమున నెక్కడనైన నుండెనేమో యాగ్రామనామము విజ్ఞులు తెలియఁబరచెదరుగాక!

(ఇ) కొన్ని భాషాదోషము లని చిన్నయసూరివ్యాకరణము ననుసరించువారు చూపఁదగినవి.

(1) "సాటౌనా."
(2) "గర్భుకైన"
(3) "ముక్త్యట" (ముక్తి+అట)
(4) "సంసారైతే"
(5) "తెలుసుట"

(ఈ) ఈతఁడు కావేరీతీరమువాఁ డని యీక్రిందిపద్యమువలన నూహింప వీలగుచున్నది.

"గాడిదవాలంబుఁ బట్టి కావే రీఁదన్" (33)

(ఉ) "కూనలమ్మ సంకీర్తనలు" అని యొకచో వాడెను.

(చూడుడు 34.)

ఈతని కులగోత్రములు కాపురస్థలము మొదలగు విశేషములు తెలియవు. ఈతని గ్రంథములన్నియుఁ జిక్కుచున్నవి. ఈతఁడే గురుశిష్యసంవాదరూపమున నొక స్వతంత్ర వేదాంతగ్రంథమును జక్కని గ్రాంథిక వచనములో "ఉపదేశక్రమము" అను పేరుతో వ్రాసెనని తెలియుచున్నది. ఈ గురుపరంపరావిశేషములను, ఇట్టి వేదాంత గ్రంథవివరములను దెలియఁగోరువారు (1) పరిషత్పత్రిక సం॥6; ఆంధ్రకవుల చరిత్రము పుట 307. (1899); ప్రాచ్యలిఖితాగార గ్రంథవివరణములును చూడుఁడు.

శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

(1) దత్తాత్రేయశతకము.

క. పరుసము సోకిన లోహము, పరుసముగా నేరదెందు బంగారౌటే
గురునకు సమమే పరుసము । తరమదిగా కెక్కుడాయె దత్తాత్రేయా. 43

క. అనుదినము తత్త్వశాస్త్రము । లనువుగ తాఁజదివి యందుల యర్థం
బనుభవముగాక యుండిన । తనచదువులు వ్యర్థమాయె దత్తాత్రేయా. 57

క. దారమున ముక్కుచీమిడి । యూరిన నది నోరఁడియ్య నోహో కాయం
బేకీతి నిలుచు నకటా । తా రోయడు జనుఁడు జాయ దత్తాత్రేయా. 74

క. తను దా నెటెఁగిన పిమ్మట । తనకెవ్వరు లేమి తెలియ తానుం దానే
తనకోడుకు గలిగెనేనియు । తనకే తా భేదమాయె దత్తాత్రేయా. 81

క. తానైతే పురుషుండఁట । మేనైతే ప్రకృతి యనుచు మిక్కిలిఫలుకున్
దానును మేనును వేఱను । దానికిఁ దామూల మాయె దత్తాత్రేయా. 83

## (2) సంపఁగిమన్న శతకము.

క. వినవలె సద్గురువులచే । గనవలె నఱచేతి యుసిరికాయయొఁ బలెఁ దా
మనవలె బ్రహ్మము దానై । సనకాదిమునిప్రసన్న! సంపఁగిమన్నా! 7

క. తాటాకులలో వ్రాసిన । మాటల నా? ముక్తిపాడిమర్మముఁ దెలియున్ ?
నూటియగు రాజమార్గము । సాటి యగునె యచటనున్న సంపఁగిమన్నా! 8

క. ఎక్కడి చదువులు బోధలు । మక్కువ ననుభవము లేని మాటలు వినఁగాఁ
బుక్కిటి పురాణములకై । జక్కుల సంతోష మెన్న సంపఁగిమన్నా! 12

క. వానలుపస పైరుల కభి । మానము పస వనితలకును మఱి యోగులకున్
ధ్యానము పస యామీఁదట । జ్ఞానము పస సుప్రసన్న సంపఁగిమన్నా!17

క. తనవారి నెదుటివారిని । దనవారిఁగఁ జూడనేర్చు ధన్యులు చాలన్
ఘనకీర్తుల చేమింతురు । సనకాది మునిప్రసన్న సంపఁగిమన్నా! 112

క. కూడదు గతి సంసారికి । బూడిదలో గచ్చకాయ పొరలినభంగిన్
వాఁడును వీఁడును దానై । జాడ యెఱిఁగి నడువరన్న! సంపఁగిమన్నా!114

## (3) పరమానందశతకము.

### (శివముకుంద శతకము)

క. సుజ్ఞాని మహిమయెప్పుడు । సుజ్ఞానియె యెఱుఁగ నేర్చు సుస్థిరమతియై
యజ్ఞాని తెలియనేర్చునె । ప్రాజ్ఞునిగతి శివముకుంద పరమానందా!

### శివ కేశవుల కభేదము చెప్పెను.

క. హరిహర గిరిధర పురహర । గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర గౌరీధవ మాధవ పరమాత్మా! శివముకుంద పరమానందా!

---

# మా ర వి క వి

"నేర మొనరించినవాఁడు తప్పించుకొనిపోయినను నేరస్థుని జాడలు తెలిసికొనుట కనువగు గుర్తులు నేరము జరిగినచోట నెవ్వియయిన నుండక మాన"వని యపరాధపరిశోధకుల సిద్ధాంతము. అట్లే కవులు తాము కావ్య మొనర్చిన కాలము తెలియఁజేయపోయినను, బరిశోధకులు, శ్రద్ధతో గమనించినఁ గవి వివరములం గనుగొనుట కనువగు సాధనములు కావ్యమునం దుండకపోవని చెప్పుట సత్యేతరము కాదు. సరిగ కవినామము, కులము, గోత్రము, కాలమును సునిశ్చితముగ నిర్ణయింపలేకపోయినను శ్రద్ధతోఁ బరీక్షించినచోఁ గావ్యచరిత్ర మించుక స్థూలముగనైనఁ జెప్పవీలుండకపోదు. శతకములలోఁ గొన్నిఁట వివరము లెవ్వియు నుండకపోవుటచే నూతన మార్గముల నన్వేషణ మగత్య మగుచున్నది. ఈ నూతన పద్ధతులలో నే జేయు సిద్ధాంతములు, వెల్లడించు సందేహములు, నెల్లప్పుడు సత్యములు కాకపోయినను — పూర్వపక్షముండినను — సత్యమును సమీపించుట కనువగు మార్గములుండకపో వనుధైర్యముచే నిట్టిపనికిఁ బూనితిని. ఈ యవినయము గర్వముగాఁ దలపోయక నా ప్రయత్నములకు విజ్ఞులు చర్చచే సాయపడు సహృదయులగుదు రని యాశ నొందుచున్నాను.

భాస్కరశతక మకారాది నియమసమన్వితముగఁ గన్పట్టుచున్నది. "అంగననమ్మరాదు" "అక్కరపాటు వచ్చు" "అడిగినయట్టి" ఈ విధముగ నున్నపద్యములు వరుసగ నక్షరక్రమముగఁ గన్పట్టుచున్నవి. శతకమునందుఁ గవిపేరుగాని, కాలముకాని యితరవివరములు కాని కనఁబడవు. ఐన నీశతక మీావఱకు బ్రకటించినవా రిందునుగూర్చి కొన్నివివరములు వ్రాసియున్నారు. అవి ముందుఁ జదువుదము.

## కర్తృత్వము.

ఈ శతకము మారన వెంకయ్య కృత మని కొన్ని తాళపత్రప్రతులపై నుండుటఁ జూచి శ్రీబ్రౌనుదొరగా రిది తత్కృతమని నిర్ణయించినట్లు వినుదుము కాని యది యెంతవఱకు విశ్వాసార్హమో తెలియదు. మారన యనున దింటిపేరో తండ్రిపేరో తెలియదు. ఏకాలమువాఁడో ముందే తెలియదు. వాఙ్మయప్రపంచమున మార్కండేయపురాణకర్తయగు నొకమారనను మాత్రము మన మెఱుఁగుదుము.

ఇది యిట్లుండగా నీ శతకమును గూర్చి కొన్నికథలు వ్యాప్తిలో నున్నట్లు శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు వ్రాయుచున్నారు. అవి మిక్కిలి వినోదజనకములుగా నున్నవి.

(1) ఒకబ్రాహ్మణునకిరువురు కుమారు లుండిరి. వారితండ్రి చాల ధనము సంపాదించి మరణించెను. తరువాత నాకుమారు లిరువురును బెద్దవారై విభాగము నొందఁ దలఁచిరి. కాని వారిలో వారికిఁ బాళ్ళు తెగలేదు. ఉభయులును దగవులాడుకొని మఱికొన్నినాళ్ళకు రాజుకడకుఁ బోయిరి. ఆ రాజు పేరు భాస్కరుఁడు. అతఁడు కవితా ప్రియుఁడు. వచ్చిన సోదరులఁ జూచి "మీదేయూరు? మీరేమిచదివినా రని ప్రశ్నింప వా రుచితోత్తరముల నిచ్చి మేము శాస్త్రములు చదివితిమి. తెనుఁగున బాగుగఁ గవిత్వము చెప్పఁగలము" అని సోదరు లిరువురు బదులుచెప్పిరి. అంతట రాజువారినిఁ జూచి మీరు చెరియొక గ్రంథమును వ్రాసితెచ్చిన మీ తగవు పరిష్కరించెదనని నుడివెను. మేమట్లు చేయువఱ కీ తగవు పరిష్కరింపకుండిన మాకవకాశములేదని వారు బ్రతిమాలఁ బోనిం డొక్కొక్క శతకమునైన వ్రాసికొని రండని రాజు ముదల యిచ్చెను. మేమిరువురము నొక్కశతకము నిప్పుడే మీరు కృతిపతిగా నిచ్చుటనే చెప్పెదము అని యా సభలోనే శతకము నారంభించిరి. పెద్దవాఁడు పద్యము పూర్వార్ధమును, చిన్నవాడు త్తరార్ధమును, జెప్పుచు నా శతకమును ముగించిరి. అంత రాజు బుద్ధిమంతులగు సోదరుల సమాధానపఱచి కొంతద్రవ్య మిచ్చి పంపివేసెను. శతకరచనమును బట్టి యోజించిన నీకథ నమ్ముటకు స్థూలదృష్టికి వీలుగనున్నది. వినోదజనకముగ నున్నది. కాని విరోధమునున్న సోదరులు పూర్వోత్తరార్ధముల గుదిగూర్చుటలో నైకమత్యమేల కలిగియుండవలె నని నవ్వువచ్చుచున్నది. ఈ కథయే సత్యమైనచోఁ బెద్దవానికంటె నుత్తరార్ధము నుడివిన చిన్నవాఁడు ప్రతిభాశాలి యని చెప్పనగును. కాని యా శాస్త్రులవారే యీ శతకమునుగూర్చి చాడుకలో నున్న మఱియొక కథను జెప్పుచున్నారు.

(2) ఒక బ్రాహ్మణున కిరువురుపుత్రులు. వారితండ్రి వారి చిన్నతనముననే మరణించెను. చిన్నవాఁడు చదువక మూర్ఖుఁడై చరించుచుండెను. అంతటఁ బెద్దవా డొకనాఁడు చిన్నవానినిఁ జూచి కోపించి "నీవు విద్వాంసుఁడ వైనఁగాని యింటికి రావల దని యిల్లువెడల నడఁచెను. అతఁడు కొందఱు యాత్రికులతోఁ గలసి, కాశికి బోయి, శ్రద్ధతో విద్యల నేర్చి కొన్నియేండ్ల కింటికి వచ్చెను. వీధిగుమ్మముకడ నిలువఁబడి తలుపుఁగొట్టి యన్నను

తమ్ముఁడు పిలిచి తలుపుతీయు మనఁగాఁ దమ్ముఁడు విద్యలనేర్చి వచ్చి నాఁడో లేదోయని యన్న సందేహించి తలుపుతీయలేదు. నే నడిగిన ప్రశ్న లకుఁ బ్రత్యుత్తరము సరిగఁజెప్పిన దలుపుతీయుదునని యన్నచెప్పి పద్యము పూర్వభాగము నన్న చదివి పూరింపు మని తమ్ము నడిగెను. తమ్ముఁ డుత్తర భాగమును జెప్పచువచ్చెను. తమ్ముఁడు సూర్యోపాసకుఁడగుటచే 'భాస్కరా' యని పద్యములు సూర్యభగవత్పరముగఁ బూరించుచు వచ్చెను. నూఱు పద్యము లైనతరువాత నన్న తమ్మునికి దలుపు తెఱచి యాతని గౌరవించెను.

ఈ కథ కూడఁ జమత్కారముగ నున్నది. కాని యొకటి రెండు పద్యములతోఁ దమ్ముని కవితాపటిమ తెలి యవలసిన యన్న యట్లు గాక నూఱుపద్యములవఱకుఁ దమ్ము నిశక్తి నెఱుంగలేకపోయె ననుట స్వభావవిరుద్ధముగ నుండి మందహాస మొదవుచున్నది.

ఈ కథలు రెండును భాస్కరశతకమునందలి నూతన మార్గమగునట్టి పూర్వోత్తరార్ధసంఘటితములగు పద్యముల వలనఁ బుట్టినవే కాని సత్యము లనుకొనుటకు వీలులేదు. పై రెండుకథలవలనను శతకకర్త లిర్వురై నట్లు కనఁబడుచున్నది. కాని యీక్రిందిపద్యమువలన శతక మేకకవికృత మని తెలి యుచున్నది. చూడుఁడు :—

"ఇంచుక నేర్పుచాలక విహీనతఁజెందిన నా కవిత్వమున్
మించుచవహించె నీ కతన మిక్కిలి యొట్లనఁ దోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెరమాటున నుండి ప్రశస్తకీతి నా
డించిన నాడవే జనుల డెందము నింపవె ప్రీతి భాస్కరా."

ఇందలి "నాకవిత్వముఁ"అనిన యుత్తమపురుషైకవచ
నము కవి యొక్కఁడని తెల్పుచున్నది. పోనిండది "మాకవి
త్వముఁ" అనుకొందము. యతిస్థానమున "నా" యున్నదా?
యని ప్రశ్నించుకొంటిమా తరువాతనున్న భగవత్పర మగు
"నీకతన" యడ్డమురావచ్చు నన వీలగుచున్నది. ఏమనఁగా?
పై కథయందే తమ్మని యిష్టదైవము వేఱనియున్నది
కదా! ఇరువురదైవములు వేఱగుట "మీకతన" యని బహు
వచన ముండవలదా? అదియు "మీకతన" యని మార్చు
కొంద మని రమారమి యిరువది ప్రతులఁ జూచితిని. అన్నిట
నిట్లే యున్నది. ఉన్నదానిని మార్చుట, పంచాంగముకొఱకు
నక్షత్రముల మార్చుటవంటి దని గ్రంథస్థనిదర్శనమును ఘన
ముగ నెంచి పై నాడుక కథలను విడనాడితిని. పెద్దలు విమ
ర్శించి చూడవచ్చును.

ఇఁక భాస్కరుఁడను రాజున కీ కృతియా? యనునది
తేలవలెను. ఇరువురు శతకమును వ్రాయ నందున పై కథలు
రెండును కల్పితములని కాని, ఆకథలోని భాస్కరశతక మిం
కొకటి యుండవలె నని కాని మనము నిశ్చయించుకొనవలసి
యున్నది. శతకమునందలి కొన్నిమాటల చేత నిందు మొదటి
కథలో జెప్పిన భాస్కరుఁ డను రాజున కీ కృతి యన్నది
మొదలే నిలుచుటలేదు. ఎట్లనఁగా?

"శ్రీగల భాగ్యశాలికడఁ జేరఁగవత్తురు తారుఁదారె దూ
రాగమనప్రయాసము కాదట నోర్చియు నైన నిల్వ ను

దోృగము చేసి రత్ననిలయుండని కాదె సమస్త వాహినుల్
సాగరుఁ జేరుటెల్ల మునిసన్నుత సద్గురుమూర్తి భాస్కరా. 1

"రాకొమరుల్ రసజ్ఞునిఁ దిరంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూఢు దమలోపల నుంపరు నిక్క మేకదా
చేకొని ముద్దుగాఁ జదువు చిల్కను బెంతురుగాక పెంతురే
కాకము నెవ్వరైన శుభకారణ సన్మునిసేవ్య భాస్కరా." 87

పై రెండు పద్యములయందును (1) "మునిసన్నుత సద్గురుమూర్తి భాస్కరా (2) శుభకారణ సన్ముని సేవ్య భాస్కరా" యని భాస్కరునకు విశేషణములు కనఁబడుచున్నవి. ఈ శతకమును ప్రతిపదార్థటీకాతాత్పర్యములతో వ్రాసిన శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారీ పద్యములఁ జూచియే యుందురు. శతకారంభ పద్యమునందే భాస్కరుఁడు మునిసేవ్యుఁడని, సద్గురుమూర్తి యని యభివర్ణించినకవి రాజునై యుండ దని తెలియుచున్నది. రాజు మునిసన్నుతుఁడు కావచ్చును. కవికి గురుమూర్తి యగునా? సన్మునిసేవ్యుఁ డగునా? శుభకారణుఁడు కూడఁ గావచ్చునందము. కావున భాస్కరశబ్ద మిచ్చట సూర్యపరమైనచో నాల్గు విశేషణములకు గతి కనఁబడుచున్నది. రాజుపరమన్న రెంటికి గతి ప్రాజ్యము, రెంటికి సందేహము. కావున శ్రీశాస్త్రిగారును, విజ్ఞులునుగూడ 1, 87, 110 పద్యముల ననుసరించి యీశతక మేకకవిఁకృత మనియు, సూర్యదేవు నుద్దేశించి వ్రాసిన దనియుఁ బూర్వపక్ష మంగీకరించెద రని తలంచుచున్నాను.

పైఁగా నీ కథలు గంజాము విశాఖపురి మండలములఁ జెప్పుకొందురేమో కాని మా గోదావరి కృష్ణామండలముల నేను వినియుండ లేదు. ఈ కథల కాధారము లెచ్చట నైన నున్న విజ్ఞులు ప్రకటించెదరుగాక. శుభ కారణుఁడు, సన్మునిసేవ్యుఁడు, మునిసన్నుతుఁడు నగు భాస్కరుని "మద్గురు మూర్తి" యని కవి చెప్పికొనుటచేఁ గవిపేరు నిశ్చితముగ నిర్ణయము కాకపోయినను, అతఁడు సూర్యోపాసకుఁ డని దేలుచున్నది.

## కవిస్థలము.

ఇదికూడ స్పష్టముగఁ దెలియు నాధారములు కనఁబడవు కాని యీక్రింది రెండు పద్యముల వినుఁడు:—

"క్రూరమనస్కులౌ పతులఁగొల్చి వసించిన మంచివారికిన్.
వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు మాధురీజలో
దారలు గౌతమీముఖమహానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁజెందవే మొదలికట్టడ లన్నియుఁ దప్పి భాస్కరా. 35

ఘనబలసత్త్వ మచ్చుపడఁ గల్గినవానికి హానిలేనిచోఁ
దనదగు సత్త్వమే చెఱుచుఁ దన్ను నదెట్లన నీరు లావుగాఁ
గను వయిసించినన్ జెరువుకట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుమలు పెట్టి నట్టనడిగండి తెగంబడకున్నె? భాస్కరా. 37.

ఒకచోట "గౌతమీముఖ మహానదు లని" యింకొక చోట నధికార్థమున "లావుగా" నని కవి వాఁడుటచేతను, భాస్కరశతకముచు. గూర్చి వాడుకలో నున్నవని చెప్పిన

కథలు శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారిచేఁ బ్రకటితము లగుటను, సదరు శాస్త్రిగారు విశాఖపురప్రాంతముల నున్నవారగుటను గవి బహుశః గోదావరి కుత్తరభాగమున నున్న విశాఖపురిమండలి వాఁ డన వీలుండునా యని సందేహాము దవుచున్నది. శ్రీ శాస్త్రిగారు కూడ యోజించెదరుగాక!

కవి కాల నిర్ణయము.

కవి వివరములు శూన్యమైనప్పు డాతని కాలనిర్ణయ మొనర్చుట మాత్రము సులభమా? ఐనను శతకమునందలి భాషమునుబట్టి, ఇతర విశ్వాసార్హ నిదర్శనములనుబట్టి కొంచెము ప్రయత్నించి చూతము.

తెలుఁగులో ముద్రణ మారంభమైనప్పటినుండియు నీ శతక మచ్చుపడుచున్నది. అతిప్రాచీనములగు తాటియాకు లప్రతులపైఁ గూడ నీ శతకము దొరుకుచుండుటచే నిది చాల ప్రాచీనమైన దనియే నిర్ణయ మగుచున్నది. ఈ శతకము నందలి,

"దక్షుఁడులేని యింటికిఁ బదార్థము వేఱొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁ గల్ల కాదు ప్ర
త్యక్షము వాగులున్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా. 35

అను పద్యము "అప్పకవీయము" లో నుదాహరణముగఁ బ్రయోగ వింపఁబడినది. అప్పకవికాలము క్రీ. శ.

1660 యని మనకు స్పష్టముగఁ దెలియుచున్నది. కావున నీ శతక మప్పకవి నాఁటికే ప్రౌఢ శతకముగా వాడుకలో నుండి యున్నట్లు నిర్ణయ మగుటచే నిది చాల ప్రాచీన శతక రాజ మని తెలియుచున్నది. ఎంతప్రాచీన మైనను నన్నయకుఁ బూర్వపుది కాదని శతకమునందలి రెండవ పద్యమునందలి సారంగధరచరిత్రాంగుల ప్రసంగము నిర్ణయించుచున్నది. అనఁగా భాస్కరశతకము 11, 17 శతాబ్దముల నడుమ పుట్టి యున్నదని స్పష్టము. గురికి బారె డెచ్చు తగ్గుగా 600 సం॥ రముల యంగలోఁ గవి కాలనిర్ణయ మొనర్చుట యొక యజ్ఞ మొనర్చుట యైనది. ఇది 15వ శతాబ్దములో నుండి యుండ వచ్చు నని చెప్పవచ్చును. కాని సత్యాన్వేషణతత్పరుఁడుగ నుండవలసినచరిత్రకారుని కట్టిదానివలనఁ బ్రయోజనము సున్న. అదియుఁగాక తనసోదరులఁ గొన్నివందల సం॥ల వఱకు సత్యము సమీపింపకుండ నాటంకపఱచిన దేశద్రోహి యగును. కావునఁ దన యశక్తికిఁ జదువరులు నిందించిన నిందింతురుగాక ! ఇతరులు నోరెత్తుటకు వీలులేని ప్రబలనిద ర్శనము లున్నప్పుడుతక్క చరిత్ర వ్రాయఁగోరువాఁడు సాహ సించి యుజ్జాయింపు సిద్ధాంతములను జేయరాదు. తనకే సం దేహములుగ నుండు విషయముల నిర్ణయించి చెప్పరాదు. ఈ విశాలాభిప్రాయములకు లోనై తెలిసినంతవఱకే స్వల్ప ముకఁ గవికావ్యచరిత్రములకుఁ బ్రయత్నించుచున్న నా కించిత్ జ్ఞతను విజ్ఞులు గేలి సేయకుందురుగాక.

(19) వెట్టి (=ఉచితము) (64) నిబద్ధి (= సత్యము)

(29) చేకురెనోటు (=చేకురినదా?) (65) శిల లగు నోటు (=శిలలగునా?) (95) వహింపఁడోటు (=వహింపఁడా?) 101 పడడోటు (=పడదా?)

(98) చిల్లవిత్తు (= ఇండుపగింజ) (14) కాకు చేసి= అగౌరవించి, చీకాకొనర్చి.

(103) నక్క-బొక్క = నక్క-బొటియ.

(105) జతకాదు = జతపడదు = జరుగదు. (ఏకార్యమును జతపడదు.)

ఈ పై సంఖ్యలయందలి పద్యములలోఁగల ప్రయోగములఁబట్టి కవిమండల మూహింపవచ్చు నని తోఁచుచున్నది. ఇండుపగింజ యని గోదావరిమండలమున వాడుదానిని "జిల్లగింజ" యనియు, "జతపడదు" అనఁగా జరుగదనియు, గోదావరి కుత్తరముననే వాడెదరు. (1) లావుగా (2) జతకాదు (3) చిల్లగింజ మొదలగు మాటలవలన నీ శతకకర్త గోదావరి కుత్తరమువాఁడని నిర్ణయింప వీలుండు నేమో విజ్ఞులు పరిశీలించెదరు గాక!

(57) "నిజదారపోషణార్థమై" పోతన్నగారి దను పద్యము నందలి సమాసము పోలికకలదు.

(89) "ఓట్టిప్పుట్టి" "బుద్ధుంగున ముంపకుండు నే". కొన్ని

ప్రితులు "పుటుక్కున ముంపకుండునే?" ఇందలి పుట్టి తుంగ భద్రివైపున నాడు గుండ్రినితోలుమూసిన పేఁపపుటిక, నదు లుదాటు పడవగా వాడుదురు. కాని గోదావరీ మండలమునఁ గూడ "నీ పుట్టేమి మునిగిందా?" అని వాడుదురు. ఈ శబ్దము కూడఁ బరిశోధనార్హము.

ఇంక నిట్టివి కొన్నిక్రియలు, శబ్దములు, సందేహములు నున్నవి కాని యిఁక మానుచున్నాను.

కవిత్వాపశనము

(1) 91 వ పద్యము వేమన్నగారి "చిత్తశుద్ధి గల్గి" పద్యమున కనుసరణము.

(2) 76 వ పద్య మైరావతచరిత్రిము.

(3) 92 వ పద్యముసంస్కృతచాటువు భాషాంతరము.

(4) 102 వ పద్యమున శకటరేఫ నియమము లేదు. పోతన్నభాగవతము పనికిరాని అప్పకవిగారి కీ శతక మేల లాంక్షణిక మైనదో! వింత!

శైలికిఁ బద్యములు.

చ. ఉరుకరుణాయుతుండు సమయోచిత మాత్మఁ దలంచి యుగ్రివా
క్పరుషతఁ జూపినన్ ఫలము గల్గుట తథ్యముగాదె యంబుదం
బురిమిన యంతనే కురియకుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున నశేషజనంబు లెఱుంగ భాస్కరా.

ఉ. తాలిమితోడుతం దగవుఁ దప్పక నేర్పరి యొప్పుతప్పులం
బాలనసేయుఁ గాకటు నుపాయవిహీనుఁడు సేయనేర్చునే

పాలును నీరు నేరుపరుపంగ మరాళ మెఱుంగుఁ గాక మా
ర్జాల మెఱుంగునే తదురుచాతురసజ్జతఁ బూన భాస్కరా.

చ. నొగిలినవేళ నెంతటి ఘనుండును దన్నొక రొక్క నేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁ గడు సన్నగిలంబడి యున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదక మరెట్లు రవుల్కొనఁ జేయు భాస్కరా.

భాస్కరశతకము క్రొత్తమార్గముననున్న యుత్కృష్ట శతకము. నీతులు చక్కగ మనస్సులకుఁ బట్టున ట్లుపమలు, లోకోక్తులు, గలిగి మృదుమధురముగ నుండును గాని యన్వయ మంతప్రౌఢముగ నుండదు. అనఁగా సరసముగ నుండదు. కాని శతక మెన్నిసార్లు చదివినను బాలురకంటె, బండితులకు మనోహరముగ నుండును. దీనిప్రాశస్త్య మాంధ్రలోకమునకు నూతనము కాదు. సులభశతకములు నాలుగైదయినపిమ్మట బాలురు చదువఁదగినది."

(ఆంధ్రపత్రిక, సారస్వతానుబంధము దుర్మతి, మార్గ. ౮ ౧౦ మి.)

ఇట్లు నేను ప్రకటించినది చూచి కడపమండలమువా రొకరు నన్నెగతాళిచేయుచు నొకవ్యాసము వ్రాసి ప్రకటించిరి. మూఁడు కాలముల పొడవుగల వారివ్యాసమునందు నా సిద్ధాంతములనుఁ గావని చెప్పఁగలిగిన స్థిరమైన పూర్వపక్షము లెవ్వియును లేకపోయినను రెండు మూఁడు విషయములు నాకుఁ దెలియని వుంట వారికి కృతజ్ఞుఁడను. దత్తమండలములు తెలుఁగు భాషామాత కత్తవారి యిల్లనియు,

గోదావరీమండలము పుట్టినిల్లనియు భాషాయోష పుట్టినింటనే చిరనివాస మేర్పరచుకొనుచున్నదనియుఁ జింతించిన వారి మండలాభిమానమునకు సంతసించితిని. సత్యమే! భాషాయోష సనాథగా నున్నంతకాలము దత్తమండలముల నున్నది. ఇప్పు డనాథ యగుటచేఁ బుట్టినింటికిఁ జేరినది. స్త్రీధర్మము నిర్వర్తించినది. దత్తమండలమువారి కిది నిశ్చయముగ దుఃఖకారణమే యైయుండవచ్చును.

ముప్పదియేడవపద్యములోని "నీరు మిక్కిలిగ గనుక వసించినన్" యనుపాఠము "నీరు లావుగాఁగను వసియించినన్" అని పాఠముగ మార్చినవారు శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు. కవి "మిక్కిలి" శబ్దము దృతాంతముగ వాడినది సంస్కరించుటకు మఱియొకని కధికారము లేదు. కాని యామార్చినవారు వేంకటశాస్త్రిగారే యని కడపవారు చెప్పువఱకు నాకుఁ దెలియదు. "లావు" శబ్దమున కధికార్థము విశాఖపురిప్రాంతముల నున్నది. అది సంస్కరించిన శాస్త్రిగారు విశాఖపురివారగుట నా పరిశోధనమునందుఁ దప్పేమియుఁ గలుగలేదు. నే నా పండితునిఁ బట్టుకొనినందులకు సంతస మొదవినది. నేను పైనఁ జూపినపదములలోఁ గొన్ని దత్తమండలములలో వాడుకలో నున్నవని విని నా యభిప్రాయము మార్చుకొంటిని గాని భాస్కర శతకకర్త దత్తమండలములవాఁడే యని నిర్ణయముకాలేదు.

నా వ్యాసమునకు శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు కూడఁ బ్రత్యుత్తర మిచ్చి కొన్నివిషయములలో నాతోఁ గూడ నేకీభవించిరి. కాని వారు వ్రాసిన కథలపై విమర్శనము వారి కింపు జనింపలేదు. కథల సమర్థింపఁ జూచిరిగాని యందలి స్వభావవిరుద్ధములగు విషయములకు సమాధానము రాలేదు. వీరు తమ సమాధానమునందు "మిక్కిలి" శబ్దము తాము మార్చినసంగతి వ్రాసి, నా భ్రాంతిని ఖండింపవలసి యుండిరి. వా రాసంగతియే యెత్తకపోవుట నా కాశ్చర్యము కలిగించినది.

శ్రీ గర్భాం అప్పారావుగారును నా వ్యాసమునకు బదులు వ్రాసిరి. వారి వ్యాసమునందుఁ గల ముఖ్యవిషయము లిం దుదాహృతము:—

"కేతవరపు వేంకటశాస్త్రిగారు భాస్కరశతకమును గూర్చి ప్రకటించిన పుక్కిటి పురాణములు గాక యింకొకటికలదు. అయ్యది సూర్యోపాసకుఁ డగు నొకకవి యొక నిర్జనాటవికిఁబోయి రెండుచెట్లకు నడ్డముగా నొక దూలము గట్టె ననియు, దానికి నూటయెనిమిదిచేర్లు గలయొక యుట్టిగట్టి తానందుఁ గూర్చుండి సూర్యునిఁ జూచుచుఁ బ్రార్థించుచుం డె ననియు సూర్యుఁడతనిఁ బరీక్షింప నెంచి వాని కంధత్వముగలుగఁజేసె ననియు, నాతఁ డప్పటికిని దనపట్టు విడువక నూటయెనిమిదిపద్యములఁ జెప్పుచు · నొక్కొకపద్యమునకుఁ నొక్కొక చేరుచొప్పున నా నూటయెనిమిది చేరులం గోసి యంతరాళంబున నిరాధారుండై యుండె ననియు సూర్యుఁడు వాని భక్తికి మెచ్చి కోరిన వరంబు లిచ్చెననియుఁ జెప్పుదురు.

పై కథ విశ్వాసార్హమైనను కాకపోయినను శతకమును రచించినకవి యొక్కఁడే యనియును గృతిపతి సూర్యుఁ డనియును దెల్పుచున్నది.

ఇఁక గ్రంథాంతర విషయములఁ బరిశీలింతము.

మొదటిపద్యమున 'మునిసన్నుతమద్గురుమూర్తి-భాస్కరా' యనియు 87 వ పద్యమున "శుభకారణ సన్ముని సేవ్యభాస్కరా" యనియు, 40 వ పద్యమున "యోగీంద్రనుతాంఘ్రిపద్మ!" యనియు, కవి కృతిపతిని సంబోధించినాఁడు. యోగీంద్రులచే నుతింపఁబడువాఁడు త్రిమూర్త్యాత్మకుండును, లోకబాంధవుండును నగు సూర్యభగవానుఁడు తప్ప నింకెవ్వరు?

కనుక శాస్త్రిగారి పురాణగాథల కాధార మేమియుఁ గానరాదు. మఱియుఁ జివరపద్యము.

"ఇంచుక నేర్పు చాలక వి । హీనతఁ జెందిన నాకవిత్వమున్
మించువహించె నీకతన । మిక్కిలి యెట్లనఁ దోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెర । మాటున నుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల । డెందము నింపవె ప్రీతి భాస్కరా.

కృతిపతి భాస్కరుఁడు (సూర్యుఁడు) అని స్ఫురింపఁజేయుచున్నది. భాస్కరుఁడే తనకుఁ గవితామహిమ కలుగఁజేసె నని భావము."

ఇంకను గవి యొకఁడా? ఇరువురా? యను విషయము నరయుదము.

కవు లిరువు రని పలువురు భావించుటకుఁ గారణ మొండై యుండ వచ్చును.

గ్రంథమునందలి కొన్ని పద్యములలో దృష్టాంతములకు ముందు ప్రశ్న రూపకములగు "అదెట్లని" "ఎట్లు" "అదెట్లనో" అను శబ్దములున్నవి. వీనిని బట్టి దార్ష్టాంతిక దృష్టాంత మెట్లని యింకొకనిఁ బ్రశ్నించి నట్లున్నది. కాని కొన్ని పద్యములలో "అదెట్లనో యనన్" "ఎట్టని పల్కనన్" అను శబ్దములు దార్ష్టాంతికమును స్థిరపరచుటకు నాకవియే దృష్టాంతమును జూపుటకు ముందుఁ బ్రయోగించిన శబ్దములైయున్నవి. మఱియు 92 వ పద్యమును జూడుఁడు.

చ. వలనుగఁ గానలందుఁ బ్రితివర్గమునం బులి నాలుగైదు పి
ల్లలగను, దూడ నొక్కటి నిలం గను ధేనువు, రెండుమూఁడు నేఁ
డుల కటులైన బెబ్బులికుటుంబము లల్పములాయె; నాలమం
దలు గడువృద్ధిచెందవె; యధర్మము ధర్మముఁ దెల్ప భాస్కరా॥

ఇందుఁ దక్కిన పద్యములవలెఁగాక దృష్టాంతము మొదటనే చెప్పఁబడి పద్య మేక కవి కృతమైనట్లున్నది, ఇట్లే 103 వ పద్యమున్నది. కవు లిరువురే యైనయెడఁ దక్కిన పద్యము లందువలెనే పూర్వభాగము చెప్పెంకవి యుత్తరభాగము చెప్పఁబోవుకవికి నీపద్యములందుఁగూడఁ దావొసఁగియుండును. కావునఁ గవి యొక్కఁడే యని నిశ్చయింపవచ్చును.

మఱియును మొదటిపద్యమునఁ గవి "మద్గురుమూర్తి భాస్కరా" యని చెప్పినపుడు "మత్" శబ్దము ఏకవచనమును దెలుపుచున్నది. ఇందుకు భారతప్రయోగము:—

గీ॥ చేతనుఁడ నయి యేను మత్పూతుఁ గినిసి
రాముఁ డున్నెడ కప్పడు గ్రిమ్మఱంగ
రథముఁ దోలించి బాణపరంపరా ని
మగ్నుఁ జేసితి నంబ నెమ్మనముదలఁక.

బహువచనమున 'అస్మత్' శబ్దమును, ఏకవచనమున 'మత్' శబ్దమును సంస్కృత సమాసములఁ గన్పట్టుచున్నవి.

* * * *

"అని తప్పక చెప్పవచ్చును. శైలియు దీనిని నిశ్చయించుచున్నది."

ఇట్లనేక విద్యాధికులచేఁ జర్చితమైన యీ విషయమింది వలకే గ్రంథవిస్తరమగుటచే నింతతో ముగించి యిటీవల దొఱకిన మఱికొన్ని యాధారములఁ దెలుపుచున్నాను.

ప్రాచ్యలిఖితాగారము 13-7-22 సంఖ్య భాస్కరశతకాంతమున నిట్లున్నది.

సీ॥ భాగ్యచారిత్ర ఒడహైదరపాచ్ఛా—
పుత్రిసరసగుణసాంద్రి—
అవరంగ తగతు—
*హా సులతానుపాచ్ఛా॥

ఈ పై పద్యశకలమున హైదరు, అవురంగజీబుల పేరులు కనఁబడుచున్నవి. ఆ పద్య మెందలిదో, దానియర్థ మేమో తెలియదు.

11-2-9 సంఖ్యలో నిట్లున్నది.

"ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాద లబ్ధకవితామాహాత్మ్యంబున మారవికవిత్వంబును (కృతంబగు?) భాస్కరశతకము అష్టోత్తర (అష్టోత్తరశత?) వృత్తములు సంపూర్ణం" శ్రీసూర్యనారాయణార్పణమస్తు. 106 పద్యము లున్నవి.

తాటియాకుప్రతియందలి యీ పై గద్యమువలన భాస్కరశతక కర్త సూర్యోపాసకుఁ డనియు, తత్ప్రసాదలబ్ధ కవితా మాహాత్మ్యంబు కలవాఁ డనియు, తెలిసి పై మన యూహలకు బలము కలుగుచున్నవి. కవినామము మారనగాక భారవివలె "మారవికవి" యని స్పష్టమగుచున్నది. "మా= లక్ష్మి, రవి=సూర్యనారాయణుఁడు" యని పదవిభాగము చేసి, బహుశః కవి లక్ష్మీనారాయణ నైయుండుననియో, మఱియొకవిధముగ నైయుండు ననియో, లేక మారవియే యాతనిపేరో పరిశోధకులు చర్చించెదరుగాక! "మారవి"

యని స్పష్టముగ మూలమునం దున్నది. ఈతఁ డప్పకవికంటెఁ (క్రీ॥ శ॥ 1660) బూర్వుఁడు. ఎంతపూర్వుఁడో నిర్ణయింప రాదు. ప్రసిద్ధమైన యీ శతకము కర్త పేరు లేకుండఁ బ్రచురించుటకంటె సందేహాస్పదమైనను, తెలిసిన యీ నామమే శీర్షికఁగా నుంచితిని.

---

# బొడ్డపాటి పేరయ

ఈ బొడ్డపాటివారు కృష్ణామండలమునందలి బెజవాడ ప్రాంతముల నున్న బొడ్డపాడున నిప్పు డున్నారు. ఈతఁ డీ బొడ్డపాటివారికి బందుగైన ప్రాచీనుఁడైనచో నీతఁడు భారద్వాజగోత్రుఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. ఈతఁడు "అనంతమహాత్మ్యము, పద్మినీవల్లభము, మంగళగిరివిలాసము శంకరవిజయము, సూర్యశతకము, ఉమాప్రసంగశతక మను మల్లిఖార్జునలింగశతకములను వ్రాసెను. ఈతని గ్రంథము లేమియు దొరకవు గాని యీతఁడు వ్రాసిన మంగళగిరివిలాసము, మల్లిఖార్జునలింగశతకము లీతఁడు కృష్ణామండలమువాఁడను తలఁపునకు బల మిచ్చుచున్నవి. ఈతని గ్రంధము లన్నిఁటినుండియు క్రీస్తుశకము 1660 ప్రాంతముల నేలూరుకడ నున్న పెదపాడు వాస్తవ్యుఁడగు పెదపాటి జగన్నాథకవి తన ప్రబంధరత్నాకరమునం దనేకపద్యము లుదాహరించి

యుండుటచే నీపేరయకవి యంతకంటెఁ బూర్వుఁడు. ఎంత పూర్వుఁడో తెలియదు. ఈతని శతకములనుండి దొరకిన పద్యముల నీ క్రింద నుదాహరించుచున్నాను:—

సీ॥ కాంతులఁ జూపట్టు కం డ్లమరించిన
తిరమైన విపులపుఁ దేరునందు
విద్యలప్రోకయగా వృద్ధసారథి నిల్పి
యతఁడు శిక్షించు హయములఁ బన్ని
తన్నివాసుల మించు తిన్ననిప్రావిల్లు
చొక్కఁ బై నారి సెక్కవెట్టి(?)
గరితోడఁ గూడ నాకసపుసూటిని బాగు
నెమ్మెనుఁ బసనిచ్చు నమ్మఁదొడిగి

గీ॥ యమరభటు లార్య దైత్యపురములు గెడపి
విజయమొందినజోద వీ విశ్వమునను
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! (275. ప్ర. ర.)

సీ॥ ఖండఖండంబుగఁ గదిసిన తేరును
భంగంపుటిరుసుఁ బొసంగఁ గూర్చి
విజ్జోడుపడి నిచ్చ వినువీధిఁ దిరిగెడు
చక్రంబు లొనఁగూడ సంఘటించి
తలకొన్నభీతిఁ గొందలపడ బహుముఖ
భ్రాంతసారథి నేరుపరిగ నిలిపి
పలుకఁ బదక్రమంబుల నలుజాడలఁ
బోరెడి గుఱ్ఱముల్ పూనుకొలిపి
కుంటివింటను బలువంక కోలఁదొడిగి
విషమలక్ష్యంబు లేగడి వ్రేసితయ్య
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! (276 ప్ర. ర.)

సీ॥ బంట్లున్న పాలెంబు బలువిల్లుగాఁ జేసి
నవమణివలయంబు నారిఁజేసి
నుదుటి వెన్నడిమికన్నను ముల్కిగాఁ జేసి
దక్షిణాంగంబ యస్త్రంబుఁ జేసి
చేకోరతలవాని జోకసారథిఁ జేసి
తనమూర్తియొకటి రథంబు సేసి
కనుదోయిఁ జక్రయుగ్మముగ యోజనచేసి
సమత నూరుపుల నశ్వములఁ జేసి
యన్నియును నీయధీనంబు లగుటఁజేసి
పురము లేసితిగాక నీకొమరులు తోడె?
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ! 277

(ప్రబంధరత్నావళి.)

సూర్యశతకము. (పద్మినీవల్లభశతకము.)

శా. ఈఁగల్వోలె వ్రణంబులే వెదకుచు న్నిర్ఘృన్ బరున్ మెచ్చకే
మూఁగల్వోలె నిరంతరాసూ్య లగుచున్ మూర్ఛించి తర్కించినన్
వీఁగ న్నేరనిదుష్కవుల్ బ్రదుకనీ వికాసింతులై వారి నో
రాఁగం బోవఁగనేల సత్కవుల్ సూర్యా! పద్మినీవల్లభా! 292

# బొడ్డపాటి కొండయ



ఈ బొడ్డపాటివారు కృష్ణామండలమునందలి బెజవాడ ప్రాంతమున నున్న బొడ్డపాడులో నివసించుచున్నారు. ఈతఁడీ బొడ్డపాటివారికి బంధుగైన ప్రాచీనుఁడైనచో నీతఁడు బొడ్డపాటి పేరయవలె భారద్వాజగోత్రుఁడై యుండవలెను. ఆర్వే

లనియోగిబ్రాహ్మణుఁడు. ఈతఁడు వ్రాసినపద్యములు ప్రబంధరత్నావళియం దుండుటచే నీతఁడు క్రీ॥ శ॥ 1660 కిఁ బూర్వుఁడని యూహింపవలసియున్నది. శైలికీతఁడు వ్రాసిన తిరుకాళహస్తిలింగశతకము నందుఁ గొన్నిపద్యముల నుదాహరించుచున్నాను:—

సీ॥ కడఁగి యెక్కుడనైనఁ గదలని యరదంబు
నరదంబుపై నిల్చినట్టి విల్లు
వింటికిఁ గాఁపుగా విహరించు చక్రియుల్
చక్రియులను బొద్దు జరపు శరము
శరమునఁ బోడమిన చక్కని సారథి
సారథి మొగమునఁ జాఁగు హరులు
హరుల సామర్థ్యంబు నరసిన శింజిని
శింజినిఁ దరిత్రాడు సేయు బలముఁ
బొందుపడఁజేసి, దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించు నట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ! 99

సీ॥ తొమ్మిదితునుకల నెమ్మిఁ గూర్చిన తేరు
సరిజోకఁ గూడని చక్రయుగము
నొకముఖంబున గడ్వనోపనిసారథి
రూపింప రాని వారువపు సమితి
బెడిదంపుదెగలకుఁ బెలుచైన విలుకమ్మి
గాలిచేఁ బొద్దులు గడపు నారి
పదివంకలై చాయఁ బాఱనిబాణంబు
పడిబత్తెములు లేని భటగణంబుఁ
బొందుపడఁజేసి దైత్యుల పురము లేసి
యఖిలజగములు రక్షించు నట్టిజోద

వనుచుఁగొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ! 100

సీ॥ దేహంబు మిక్కిలి తిరమైన రథముగా
ఘననేత్రయుగము చక్రములుగాఁగ
నూర్పు లశ్వంబులై యొప్పారుచుండఁగ(?)
దొరయు బల్లెరము సూతుండు గాఁగ
సర్వాంగమతి ఘోరసాయకం బదిగాఁగ
సొరిదిఁ గుంతలములు జోడుగాఁగ
దలమైన విహారణస్థలము కార్ముకముగా
నలువైన హారంబు నారిగాఁగ
నన్నియును నీమహత్వంబ యగుటఁజేసి
లీలఁద్రిపురంబు లేసి గెల్చితివిగాక
నీకు నొరులు సహాయులై నిలువఁగలరె॥ యంగ॥

---

## ఎలుకుర్తి రామరాజు

ఈతఁడు రామలింగశతకమును వ్రాసెను. "రాజహంసరథాంగ! శ్రీరామలింగ" యని మకుటము. ప్రబంధరత్నాకరమునం దీతని పద్యము లుండుటచే నీతఁడు క్రీ॥ శ॥ 1660 కిఁ బూర్వుఁడు. ఈతని వివరము లింతకంటె నేమియుఁ దెలియవు. శైలి కొక పద్యమును జూపుదును.

సీ. గంగాప్రవాహంబు కన్నెగేడఁగి జేసు
నమృతాంశురేఖ ముత్యాలసేస

యురగేంద్రహారంబు సురువిందముల పేరు
విసము కప్పురముతో వీడియంబు
పారిజాతకంకటికాలు పంకసంజాతంబు
జింకపిల్లయు రాచచిలుక బోద
యిభచర్మ చేలంబు నింద్రగోపపుఁబట్టు
భూతిపుంజము నవ్యపుష్పరజము
హేమగోత్రకోదండంబు నిక్షుధనువు
గలుగు నర్ధనారీశ్వరాకారమునను
భువనజాలంబు భక్తులఁ బ్రోవుమయ్య!
రాజహంసరథాంగ! శ్రీరామలింగ! 424

---

# తెల్లపూడి కసవరాజు

---

ఇతఁడు కళావతీశతకమును వ్రాసెను. ప్రబంధరత్నాకరమునం దీతని పద్యము లుండుటచే నీతఁడు క్రీ॥శ॥ 1660 కిఁ బూర్వుఁ డనుట స్పష్టము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము నందు (11-9-16) సంఖ్యగల గ్రంథమునందుఁ గళావతీశతకములోనివే యైయుండవచ్చును, కొన్నిపద్యము లీ క్రింద నుదహరించుచున్నాను. చాటుపద్యమణిమంజరులయందును, ప్రబంధరత్నాకరమునందును, తాటియాకుల ప్రతుల యందును, మకుటముగల యనేకపద్యములు కనఁబడుచున్నవి. అవి యష్టకములో, తారావళులో, శతకములో, కర్తలెవరో తెలియదు. ప్రబంధరత్నావళియందుఁ గర్తలు లేని రంగనాథశతకాదులు కనఁబడుచున్నవి.

(1) ప్రబంధరత్నావళిలో నున్నవి.

చ. గురుకుచకుంభము ల్గదలఁ గ్రొమ్ముడివీడఁగ రాలఁ గ్రొవ్విరుల్
కరమణికంకణక్వణన కాచనగధ్వను(?) లుల్లసిల్లఁగా
భరతపుఁబిట్టకైవడిని బాదికిఁ జేరెడి వెల్చెలాగునన్(?)
బరిపరిరీతులన్ జెలఁగుభంగులు మెత్తుఁగదే కళావతీ! 93

చ. పరికటితలీలఁ గీలెడలి పాపట ముత్తెపుఁజేరు మోముపైఁ
దకపికలాడఁ గ్రిక్కదలు దంతపుఁ గమ్మలకాంతి మొత్తమై
వికచకపోలభాగముల వెన్నెలగాయుచునుండ నీవు నన్
.... .... .... .... .... లాగులు మెత్తుఁగదే కళావతీ! 94

(2) చాటుపద్యమణిమంజరి రెండవభాగములోనివి.

శా. ఏమే! పూర్ణశశాంకబింబవదనా! యేమే! జగన్మోహినీ!
నీమీఁదాన మఱెక్కడన్ నినువినా నే నెక్కడన్ జొక్కనే
నామీఁదం గరుణించి యేలఁగదవే నన్నుం గటాక్షింపవే
శ్రీమించన్ భ్రమరాంబికాగుణమణీ స్త్రీలోకచూడామణీ!

ఉ. నాఁడు శోకనాఁడు నిన్ను నెలనాఁగరో పొందిననాఁటనుండియున్
వేడుకఁ బుట్టి మన్మథుఁడు వేదనసేయఁగ నోర్వలేక నీ
వాడకు వచ్చి చూడఁ దలవాకిట రావెటు దొంగిచూచినన్.

(3) ప్రాచ్యలిఖితాగారము 11-9-16 తాటియాకుల ప్రతిలోనివి.

ఉ. వీడెము తెత్తునో పసిడివీణియ మీటుచుఁ బొద్దుపుత్తునో
కూడిన కుంకుమంబు చనుగుబ్బల నొత్తుక కౌఁగిలింతునో
వేడుక చంద్రకాంతమయవేదికమీఁదికి పండవత్తునో
వూడిగ మేమిరా యనుచు నూరటపుత్తుఁగదే కళావతీ! 10

చ. తకతికతాళమానమున తావిలసిల్లుచుఁ బువ్వుపాన్పుపై
కకపిక కక్కపెక్క యని గౌఁగిటిలోపల ధిక్కరింపుచున్

చికితిని చిక్కితిన్ (?) మిగులఁ జిక్కితిరా యని మాటలాడుచున్
ప్రకటితలీలఁ దెల్పుచును బాగులు మెత్తుఁగదే కళావతీ! 15

చ. మలయజగంధి నీచెలఁగు మాసిన మూఁడుదినాలనుండియున్
వలఁపులరాయఁ డేచె వుపవాసము నాలవనాఁట ప్రొద్దునన్
మలినము వాపి నీవుకుతిమజ్జనమాడఁగ తాణవచ్చునో
పలుచనిమోవి తేనె సుకపారణఁజేయఁగదే కళావతీ! 13

ఈ మూఁడు నేక కర్తృకములు, నేక గ్రంథభాగములు నై యుండవచ్చును.

---

## పట్టాభిరామకవి

---

ఈ కవి వ్రాసిన వజ్రపంజర, మరున్నందన, గువ్వల చెన్న శతకములఁగూర్చి యాంధ్రపత్రిక సారస్వతానుబంధమున నిట్లు ప్రకటించియుంటిని.

"వజ్రపంజరశతకము నందలి యొకటి రెండుపద్యము లప్పకవి యనుగ్రహమున నప్పకవీయమునం దుంటచే నాంధ్రలోక మీ శతకముపేరు వినియుండెను, అందలి పద్యము లొకటి రెండు చూచియుండెను. కాని లాక్షణికాగ్రేసరుఁ డని మనవారు తలంచుచున్న యప్పకవి యంగీకరించిన యీ శతక మేమాత్రిపుడో యెవ్వరును ప్రకటించినట్లు తెలియదు. ఇది యొక భట్రాజు రచియించె నని యీ క్రింది మాటల వలనఁ దెలియవచ్చుచున్నది.

"* * మలరాజు గుండారాయణోపాఖ్యానము, గువ్వల చెన్నశతకము, వజ్రపంజరశతకము, మరున్నందనశతకము, శమంతకోపాఖ్యానము, కవిసర్పగారుడము, కవిమూషక మార్జాలము, మొదలగు ననేక గ్రంథములు రచించి ప్రసిద్ధి కెక్కిన పట్టాభిరామకవి ...... మున్నగు కవిపుంగవులు తెలుఁగునాడున నుండిరి."—125 పుట, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక (పదియవది).

దీనినిఁబట్టి యీకవి "దాసోహమ్మరున్నందనా!" యను మకుటము గల మరున్నందనశతకమును వ్రాసెను. ఇదికూడ నప్పకవీయమునం దుదాహరించియున్నాఁడు.

(2) "గువ్వలచెన్నా!" అను మకుట ముండు నీతి వాక్యముల శతకమును గూడ నీతఁడే వ్రాసెనఁట.

శమంతకోపాఖ్యానము వంటి ప్రబంధములు, కవి మూషకమార్జాలము వంటి లక్షణగ్రంథముల నీ కవి వ్రాసి యుండెనఁట! కవిసర్పగారుడ మొకటి బసవయ వ్రాసినట్లు కొందఱు చెప్పుదురు. ఇది మఱియొకటియా?

లక్షణగ్రంథములు కూడ వ్రాసిన ప్రౌఢుఁడగు పండితుఁ డనియే యీతని లక్ష్యలక్షణగ్రంథముల నప్పకవి యంగీక రించె నని చెప్పవచ్చును.

ఈతనిఁగూర్చి పై కొలఁదిసంగతులు సంవత్సరాది సంచికలో వ్రాసిన శ్రీ వైయాకరణము గోపాలజయదేవ

రాజుగా రెచ్చటివారో వారి కాసంగతు లెట్లు తెలిసినవో, ఈ కవి తక్కిన గ్రంథములు భట్టరాజుపల్లెలోఁ జిక్కునో చిక్కవో తెలియఁబఱచిన బాగుగ నుండెడిది.

తంజావూరు సరస్వతీభాండాగారమున వజ్రపంజరశతక మున్నట్లు శ్రీవీరేశలింగము పంతులుగారికడ నుండిన జాబితా వలనఁ దెలియుచున్నది.

ఇట్లుండఁగా నీనడుమ నొక ప్రాచీనసంపుటములో ప్రాచ్యలిఖితపుస్తకాగారమున నీ శతకమునందలి కొన్ని పద్యములు కనఁబడినవి. (నెం. 13-4-29)

సాహిత్యప్రియులకు ముదావహముగ నుండు నని యందలి పద్యము లీ క్రిందఁ జూపుచున్నాను. కొన్ని వ్యాకరణదోషములు చూపట్టును. ఇవి లేఖకునివా? శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను. కొన్ని పద్యములు కేవల స్తుతిమాత్రములయ్యు, కొన్ని మనోహరభావసంకలితములు లేకపోలేదు. సంపూర్ణగ్రంథము చిక్కినచో నింతకంటె వివరములు వ్రాయుటకు వీలుండును.'' (ఆంధ్రపత్రిక.)

కాని దాని కెవ్వరును బ్రత్యుత్తరము వ్రాయలేదు. కాకినాడ యందున్న పుస్తకాలయమువారు వారికి గువ్వల చెన్నశతకము సంపూర్ణముగ దొరికిన దనియు తామే ప్రకటించుచున్నామనియుఁ బత్రికలోఁ బ్రకటించిరికాని యీ గ్రంథ మింతవఱకు బయటికి రాలేదు.

## (1) వజ్రపంజరశతకము.

ఉ. తల్లివి తండ్రివిం బతివి దైవమ వాప్తుఁడ వీప్సితంబు సం
ధిల్లఁగఁ జేయుదాతవును నీవని నిన్నె తలంతుఁగాక నా
యుల్లము దైవతాంతరము నొందని యాంచకొలంపు వాని వ
రిల్లునె యొండుచో రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

చ. కరిమొఱ యాలకించి కృపఁగావవొ, ద్రౌపది యార్తి మాన్పవో,
కరుణఁదలిర్ప పిన్నపుడె గౌతమిసంయమి యిల్లు నిల్పవో,
యురక యుపేక్ష చేసికొని యుండెదు నాయెడ నేను లాఁతినో
స్థిరతరపౌరుషా! రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

ఉ. చోరుఁడ కావవే మఱుఁగుచొచ్చితి నో నవనీతచోర, నే
జారుఁడ తప్పుసైచి కృపనోపఁగదే రమణీయగోపికా
జార! భుజంగతల్పమా విశారదశారద చంద్రకీర్తి సం
హారమణాధిపా! రఘుపతీ! శరణాగత వజ్రపరంపరా!

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిగా త్రిలో
కీగృహమేధిగా గరుడకేతనుగా భవరోగవైద్యుగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేఱొకవేల్పుఁగొల్వ నీ
వేగతి కావవే రఘుపతీ! శరణాగత వజ్రపంజరా.

చ. అరులకు నొడ్డుకొందునో, జరామయబాధల కొడ్డుకొందునో
యురగభయోగ్రవృశ్చికమహోద్ధృతచోరమహాభయో
త్కరముల కొడ్డుకొందునో, సదా యిఁక నెన్నిఁటి కొడ్డుకొందు సు
స్థిరకృపఁగావవే రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!.

ఉ. పాపముఁ బాపవే కృపసుపర్వనదీ జనకాంఘ్రిపద్మ! నా
తాపము మాన్పవే జగదుదారకళానిధి రామచంద్ర! నీ
రూపముఁ జూపవే సకలరోగతముం బెడలన్ కటాక్ష దృ
గ్దీపముఁ జూపవే రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

ఉ. ఆర్తులపాల నెల్లఁ గలపంచు సదా కృతు లెల్లఁ జాటు నా
నార్త వినంగ మిమ్ముఁ గొలువన్ చవిఁ బుట్టిన మీకు జానకీ
భర్తకు మీకుఁ జేరువిడఁబాల్పడితిన్ మొఱయాలకింపు స
త్కీర్తిధురంధరా రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

ఉ. మానము గోలు యిచ్చినను మాటికి గీల్లకుఁ గీడుచేసినన్
మేనికి హానిదెచ్చినను మీ తిరువశ్యము మీపదాంబుజ
ధ్యానము సేయఁగా నెటులనైనను మంచిదె యన్యదేవతా
ధీనుఁడఁగాఁజుమీ రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

చ. గ్రిహగతు లేమిసేయు మఱిగండపుదోషము లేద నుండు దు
స్సహదురితారివర్గములు సంధిల నేర్చునె లేమిచెందునే
తహతహ లేటికిన్ బొదలు తావకదాస్యముఁ గాంచువారికిన్
ఇహపరసాధకా! రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

మ. పరనారీహరణం బొనర్చిన మహాపాపాత్ముఁ డారావణుం
డరియై నాతనితమ్ము నిన్ శరణుఁబొందన్ దివ్యులున్ మెచ్చఁగా
పరిరక్షించిన నీకృపామహిమ మెప్పాటన్ మహాన్నత్యమే
స్థిరగాంభీర్యగుణోదధీ! రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!

(శ్రీరామభూమీపతీ?)

అప్పకవీయమునందు, ప్లుతయుగవిశ్రామమున కుదా హరణముగ నుదాహరించిన పద్యము నీ క్రింద నుదాహరిం చెదను.

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిగాఁ దిరిలో
కీగృహమేసిగా గరుడకేతనుఁగా భవరోగవైద్యుఁగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేఱొక వేల్పుఁ గొల్వ నీ
వేగతి కావవే రఘుపతీ! శరణాగతవజ్రపంజరా!

## (2) మరున్నందనశతకము.

అప్పకవీయమునందు లుప్తవిసర్గవళి కుదాహరణగము నుదాహరించిన పద్య మిాక్రిందఁ జూపుచున్నాను.

శా. కోపాటోపము గుప్పిగంతులు నిజాకుంఠీభవచ్ఛౌర్యశే
ఖాపాండిత్యమయారె! నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీపైతోపతద్బాహ్వహ బా
హాపాటచ్చర! రామదాస! తవదాసోహ మ్మరున్నందనా!

ఈ రెండుగ్రంథములును తంజాపూరురాజులపుస్తకాగారమున నున్న వని తెలియుచున్నది. కొందఱు రాజులు కూడ శ్రీరామచంద్రునివలెనే "శరణాగతవజ్రపంజరుల" మని బిరుదములఁ దాల్చువా రని యద్దంకిప్రభువగు మాధవనాయకుని చరిత్రమువలనఁ దెలియుచున్నది. (ఆంధ్రులచరిత్రము, మధ్యయుగము, పుట 267 చూడుఁడు).

## (3) గువ్వలచెన్నశతకము

క. కలిమిఁ గలనాఁడె మనుజుఁడు । విలసితసత్కీర్తిచేత వెలయఁగవలదా?
కలి మేమి యెల్లకాలము । కులగిరులా కదలకుండ? గువ్వలచెన్నా!

క. నిలువరస దానగుణములుఁ । గలవారికిఁ గాక లోభిగాడ్దెల కేలా?
తలఁ పేల చాఁపగుడి సెకుఁ? । గులపావనకీర్తివన్న! గువ్వలచెన్నా!

క. ఎన్నఁగల జీవరాసుల । నన్నిఁటి గర్భమునఁ బుట్టి యటమనుజుండై
తన్నెఱిఁగి బ్రతుకవలెరా । కొన్నాళ్లిఁక నెచట నున్న గువ్వలచెన్నా!

క. గుడి కూలును నుయి పూడును । వడినీళ్ళ న్జెరువు తెగును వనమును ఖిలమౌ
చెడనిది పద్యం బొకటియె । కుడియెడమలఁ గీర్తిఁగన్న గువ్వలచెన్నా!

క. వెలయాలు సుతుఁడు నల్లుఁడు। నిలపతియును యాచకుండు నేవురు ధరలోఁ
గలిమియు లేమియు నెఱుఁగరు। కులపావనమూర్తి వన్న గువ్వలచెన్నా!

క. ఎఱుఁగుదువు సకలవిద్యల। నెఱుఁగని విఁక రెండుకలవు నవి యేవన్నన్
బిఱికితనంబును లోభము। గుఱుతెఱుఁగవు జగతి నెన్న గువ్వలచెన్నా!

క. ఈ వీయని పద పద్యము। గోవేసభఁ జదివె నేని కుంభినిలోనన్
ఈ విచ్చినపదపద్యము। గోవే సభఁ జదువకున్న గువ్వలచెన్నా!

క. అడుగఁదగువారి నడుగక। బడుగుల నడుగంగ లేమిఁ బాపంగలరా?
వడగళ్ళఁ గట్టువడునా। గుడి ఱాళ్ళను గట్టకున్న గువ్వలచెన్నా!

క. సారాసారము లెఱుఁగని। భేరజముకు బుద్ధి సెప్ప పెద్దలవశమా?
నీ రెంతపోసి పెంచినఁ। గూరౌనా నేలవేము గువ్వలచెన్నా!

క. కలిమి గల లోభికన్నను। విలసితముగఁ బేద మేలు వితరణి యైనన్
జలిచలమ మేలుగాదా? । కులనిధి యంభోధికన్న గువ్వలచెన్నా!

క. వెలవిద్య లెన్నియైనను। కులవిద్యకు సాటిరావు కుంభినిలోనన్
వెలకాంత లెందఱున్నను। కులకాంతకు సాటిరారు గువ్వలచెన్నా!

క. తల లెంత పెంచుకున్నను। కులధర్మము విడచి కన్నకూళ్ళుం దిన్నన్
గలుగదు మోక్షము చిత్తము। విలయము గాకున్న బిజనవేములచెన్నా!

క. అంగీలు పచ్చడంబులు। చెంగావి మెఱుంగు సేలు సరిగంచుల మేల్
రంగులదుప్పట్లును నీ। గొంగడి సరిఁబోల వన్న గువ్వలచెన్నా!

క. పరిగేరు కన్నగింజలు। కరువున కడ్డంబురావు కష్టం బిడునా
తిరిపెమున లేమి తీరదు। గురుతరసత్కీర్తిఁ గన్న గువ్వలచెన్నా!

పైనఁ జూపిన 12వ పద్యమునందలి "బిజనవేముల చెన్నా!" యనునది గువ్వల చెన్నుఁ డింటిపేరునకుఁ బ్రతిరూపమే యైనచో నాతఁడు బ్రాహ్మణుఁ డని యనుమానింప వీలున్నది, "బిజనవేముల భైరవభ" ట్టని తాళ్ళపాక అన్న

మయ్యగారికి సమకాలికుఁ డొకఁ డున్నట్లు నందవరము గ్రామోపకార్లజాపితాలో నున్నది, (పరిషత్సంఖ్య 2167 చూడుఁడు) బిజనవేములవారు బ్రాహ్మణు లున్నట్లు తెలియుచున్నది గాన మరియొకజాతివా రట్టి యింటిపే రున్నవారు కనఁబడువఱకు గువ్వల చెన్నఁడు బ్రాహ్మణుఁ డని తలంపవచ్చును. కాని యీపద్యము చాటుపద్యరత్నాకరము (183 పుటలో) వేముల చినన్నారాయనిదని శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగా రుదాహరించి యున్నారు. కావున నీపై యూహ యనుమానాస్పదమైనది యగుచున్నది.

ఆంధ్రదేశమునం దీ పద్యములు భటాగ్రజులమూలమున నెక్కుడు వ్యాప్తిలో నున్నవి. బిజనవేములచెన్నఁ డెవరో? గువ్వల చెన్నఁడెవ్వరో, యెప్పటివాఁడో, మనకుఁ దెలియదు. కాని పదియవసంవత్సరాది సంచిక 125 పుట లోని వివరములప్రకారము వజ్రపంజరశతకము వ్రాసిన పట్టాభిరామకవియే దీనికర్త యైనచో కృతిభర్త, కృతికర్త లిరువురును "అప్పకవి" కిఁ బూర్వు లగుచున్నారు. కావున వీరు క్రీ॥శ॥ 1600 ప్రాంతములవారై యుండవచ్చును. పల్లెటూళ్ళలో జాలమం దీపద్యములు చదువుచుందురు. గువ్వల చెన్నని పద్యములుఁ మూఁడు వచ్చినవారు - పది పఠింపఁగలవారు నిక్లే యున్నారు. ఒక మిత్రుఁడు పదమూఁడుపద్యములఁ జదివిన వ్వారి నెఱుఁగుదు ననినాఁడు. చాటుపద్యమణిమంజరి, చాటుపద్యరత్నాకరములవలన మనకిప్పుడు 14 పద్యములు చిక్కె

నవి. ఇందలి "బిజనవేముల చెన్నా!" యను పై 12 వ పద్యమునందలి విశేషణ మాతని గ్రామనామమా? యని నేను సందేహించితిని గాని చాటుపద్యరత్నాకరములో నిది "వేముల చిన్నారాయఁడు" అను శీర్షకక్రిందఁ బ్రకటించిరి. కారణము చింత్యము. గువ్వల చెన్నఁడు మహోదాతగాఁ గీర్తి నొంది మృతజీవుఁడై యున్నాఁడు. సంపఁగిమన్న, చౌడప్ప, వేమన్న, సుమతి, గువ్వల చెన్న శతకములలోని పద్యములు కొందఱు జ్ఞప్తి లేక యొకరిమకుట మింకొకరిదిగాఁ జేర్చి చదువుదురు. కాకినాడ గ్రంథాలయమువా రీ శతకము శీఘ్రముగఁ బ్రకటించుట ధర్మము. ఈ పట్టాభిరామకవి భట్రాజని మాత్రము తెలియును. వివరములు తెలియవు. ఇతని యితరగ్రంథములును జిక్కుట లేదు.

---

# గణపవరపు వేంకటకవి



ఈతని చరిత్రము కవులచరిత్రమున వర్ణితము. ఈతని గ్రంథములు కొన్ని పరిషత్తువారికి నూతనముగ దొరికినవి. ఈతఁడు గుంటూరుమండలమునందలి కామెపల్లెసీమవాసుఁడు. అప్పకవికిఁ బొరుగువాఁడు. బాలసరస్వతి, అప్పకవి,-ఈ వేంకటకవి అహోబలపండితుఁడు మొదలగు లాక్షణికు లందఱును గుం

టూరుమండలము నందలి కామెపలిసీమ లోనివా రగుటయే గాక కొంచె మించుమించుగా సమకాలికులు. ఈ శతాబ్దము లాక్షణికశతాబ్దము. కవిత్వము తగ్గి, పాండిత్యము హెచ్చి, తెలుఁగుకావ్యయుగము క్షీణించుటకు వీలైన లక్షణవాఙ్మయ ముద్భవించినకాలము. ఈ శతాబ్దపులక్షణము పూర్వప్రసిద్ధ కావ్యములఁ జదివి, వానినుండి లక్ష్యములు సేకరించుట, వ్యాఖ్యానములు వ్రాయుట, వర్ణనముల సంపుటీకరణ మొన ర్చుట, ప్రయోగములఁ బ్రోగుచేయుట, ప్రబంధము వ్రాయ వలసిన మార్గములను గజముబద్దలతోఁ గొలిచి నియమము లచేఁ గావ్యకర్తల బంధించుటయు ననవచ్చును. అట్టి లాక్ష ణికులలో నీతఁ డగ్రగణ్యుఁడు. మంచిపండితుఁడు. ధారా శుద్ధి కలవాఁడు. ఈతఁడు శతాధికగ్రంథములు వ్రాసియుం డెను. ఈ కవి నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు; అశ్వలాయన సూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; అప్పయామాత్యపుత్రుఁడు. గణపవరగ్రామ (గుంటూరు మండలము) వాస్తవ్యుఁడు. ఈతఁడు పింగళి సూరన, రామరాజభూషణునివలెకు గల కవు లను జేర్కొనెను. ఇతఁడు 16వ శతాబ్దాంతమున నుండియుం డును. క్రీ॥శ॥ 1550–1650 నడుమవాఁడు కానోపును.

ఇతఁడు యమకశతకము, కఠినప్రాసశతకము మొదలగు చాటుకృతులఁ గూడ వ్రాసెను. అవియైన నిప్పుడు దొరకవు. ఈతని తక్కిన గ్రంథములచరిత్రము కవులచరిత్రమున నున్నది.

ఇతని "యమకశతక"ము నిదివఱకుఁ గవులచరిత్ర మున "యమశతక" మని రది పొరబాటు.

క. సకలకవు ల్పొగడఁగ మా, త్ృక లన్నియు వరుస నెసఁగ నే తొలుదొల్తన్
జికిరిగఁ గఠినప్రాస శ,తకరాజము చెప్పినట్టి ధన్యుఁడఁ బుడమిన్॥

ఈతని శతకముల పద్యములు నాకుఁ జిక్కనందునఁ దెలియని సంగతులు పెంచి వ్రాయుటమాని యింతతో నీతని చరిత్రమును ముగించుచున్నాను.

---

## ఎలకూచి బాలసరస్వతి

(క్రీ॥ శ॥ 1600–1700)

---

ఈ కవి 17 వ శతాబ్దారంభమునం దుండినవాఁడు, మహామహోపాధ్యాయ బిరుదాంకితుఁడు. గొప్పపండితుఁడు. ఈతఁ డనేక గ్రంథముల రచియించియున్నవాఁడు. రంగకౌముదీనాటకము, చంద్రికాపరిణయము, ఆంధ్రచింతామణి వ్యాఖ్యానము, భాషావివరణము, రాఘవయాదవపాండవీయము, మల్లభూపాలీయము మొదలగున వీతని కృతులు. కౌండిన్యగోత్రజుఁడు. విష్ణుభక్తుఁడు. శతాగ్రప్రబంధకర్త. వేదశాస్త్రపురాణ వివిధ సంగీతసాహిత్యాది విద్యోపబృంహణుఁడు. బహుతంత్రకర్మచణుఁడు. ఈతని తాత భైరవార్యుఁడు. తండ్రి కృష్ణదేవుఁడు. ఈతని యాంధ్రశబ్దచింతా

మణివ్యాఖ్య ముద్రితప్రతి చూచి, కవిచరిత్రకారుఁడు రమా రమి ముప్పదికారణంబులఁ జూపి, యది నన్నయకృతము కాదని సారంగధరునిప్రసంగ ముండుటనో, మరియే కారణము ననో నిర్ణయించియున్నాఁడు. పలువు రట్లు నమ్ముచున్నారు. ఆంధ్రశబ్దచింతామణియందుఁ జూపిన సూత్రములకు వైరుధ్య ములగు ప్రయోగములు నన్నయభారతభాగమున నుంట, నన్నయభట్టీయమునే నన్నయకృతము కాదనుచున్నారు. నియమములు విధించినవానికైనఁ దన్నియమానుసారము నడ చుకొనుట దుస్తరము. అదిగాక బాలసరస్వతి వ్రాసిన వ్యాఖ్యా ప్రతులు కృత్యాదిలో నిప్పుడు దొరకుచున్నవి. అందు ముద్రితప్రతియం దున్నన్ని వ్యతిరేక సూత్రములు లేవని కొందఱు భాషావేత్తలనుచున్నారు. మఱియు నన్నయసూ త్రము లెనుబదియాఱార్యావృత్తములు నెవ్వియో పరిశీ లించి నిర్ణయింపవలసియున్నది. అందుఁ గొన్ని ప్రక్షిప్తము లుండవచ్చును. ఉద్భటారాధ్యచరిత్ర మిప్పుడు దొరకుచు న్నందునఁ దత్కర్త యగు తెనాలిరామకృష్ణుఁడు కృష్ణరా యనికాలమువాఁ డనుట స్పష్ట మగుటచే నాతనికి సమకాలి కుఁడగు లింగముగుంట తిమ్మన్న బాలసరస్వతికిఁ బూర్వుఁడు కదా! బాలసరస్వతికిఁ బూర్వమే యాంధ్రశబ్దచింతామణి లింగముగుంట తిమ్మన్న యెఱిఁగియుండిన యెడల నన్నయ భట్టీయము మూలసూత్రములు బాలసరస్వతి కల్పింపలేఁడు కదా! తిమ్మన యాంధ్రశబ్దచింతామణి నెఱిఁగియున్నట్లు

శ్రీ వీరేశలింగముపంతులుగారే వ్రాసియున్నారు. "* * వాదాంగదచూడామణి, ఆంధ్రశబ్దచింతామణి, సర్వలక్షణ శిరోమణి * * అను తెనుఁగు లక్షణగ్రంథములనుండి యీ సులక్షణసారమునం దనేకలక్షణములు చేకొనఁబడినవి." (చూడుఁడు - పుట 341. ఆంధ్రకవులచరిత్రము. 1899.)

దీనినిఁబట్టి బాలసరస్వతికిఁ బూర్వమే యాంధ్రశబ్ద చింతామణి లాక్షణికు లెఱింగియున్నను, 17 వ శతాబ్దిని లాక్షణికులగు బాలసరస్వతి, అప్పకవి, గణపవరపు వేంకట కవి, అహోబలపండితుఁడు మొదలగు గుంటూరుమండలకవు లకు దానిప్రతులు కష్టముమీఁద లభ్యమైయుండు ననియు, వాగనుశాసనుని యీ యపరూప గ్రంథ మింతవఱకు వ్యాప్తి నొందక మారుమూలల దాఁగియుండుటకుఁ గారణములుగా సారంగధరాదికథలు వాడుకలోనికి వచ్చియుండు ననియు నూహింప వీలగుచున్నది. గ్రంథము కావ్యముగాక శాస్త్ర మగుటచేతను, లాక్షణికులు మాత్రమే దాని నపరూపముగ నెంచి యొరుల కీయకపోవుట చేతను కేతనాదులు దీని నెఱుఁ గకయుండియుందురు. దీని కందువలన వ్యాప్తి లేకపోయినది. పండితులు చర్చించెదరుగాక!

బాలసరస్వతి వ్యాఖ్యానమునకే మహాకార్యము చేసి నట్లు రాఘవయాదవపాండవీయకృత్యాదిని తనకుఁ దానే వర్ణించుకొనినాఁడు. తానే మూలగ్రంథమువ్రాసి తెలుఁగు

భాషకు లేని స్వతంత్రవ్యాకరణ శాస్త్రమును సృష్టించినవాఁడై నచో నాకీర్తి నన్నయ కిచ్చుటకు బాలసరస్వతి దద్దమ్మవలె మహామహోపాధ్యాయుఁడై యుండి యంగీకరించునా? బాలసరస్వతియే నన్నయభట్టీయమును గల్పించినవాఁడైనచో నాతని చంద్రికాపరిణయమున నాతఁడే కల్పించిన సూత్రములకు వైరుధ్యములగు ప్రయోగము లేలవ్రాసెను? ఇట్టి ప్రబలసందేహములు పెక్కులు కలుగుచున్నవి. ఇంతకంటె నీ శతకకవిచరిత్రమున నీ విషయచర్చ యప్రస్తుతమగుట నీవాద మింతతో ముగించు చున్నాను.

ఈతఁడు భర్తృహరిసుభాషితరత్నావళి యను సంస్కృతశతకత్రయమును సురభిమల్లభూపాలుని కంకితముగఁ దెలిఁగించెను. ఇం దన్నియు శార్దూలమత్తేభాదివృత్తములు. మూఁడు శతకములకు మకుటము శతకమునందలి శృంగారనీతి వైరాగ్యాది విషయములనుబట్టి "సురభిమల్లా! నీతి వాచస్పతీ!" "సురభిమల్లా! మానినీమన్మథా!" యనియు మార్చుచు వ్రాసెను.

ఇతని సోదరుడగు యెలకూచి పినయాదిత్యుఁ డాదిత్యపురాణమును దెలిఁగించెను. దాని కృత్యాదియం దాతఁడు తాను బాలసరస్వతికి నవరజుండ నని వ్రాసికొనెను. బాలసరస్వతి తన నన్నయభట్టీయవ్యాఖ్య పీఠికలోఁగూడ నీతఁడు తనసోదరుఁడని చెప్పెను. ఆదిత్యపురాణ మెనిమిది యాశ్వా

సములగ్రంథము. పినయాదిత్యుఁడు చతుర్విధకవిత్వ రచనా ధౌరేయుఁడు. ఆదిత్యపురాణము దాత యగు పోంపూరి గురవమంత్రీంద్రునకుఁ గృతియిచ్చెను. ఈతని తాతయగు భైరవుఁడు రామరాజాస్థానకవియఁట! ఈతని గుఱించి సంపూర్ణవ్యాసము కావలసినవారు నేను ఆంధ్రపత్రికసారస్వతానుబంధంబున వ్రాసిన వ్యాసమును జూచుకొనుఁడు.

బాలసరస్వతి 1630–40 ప్రాంతములవాఁ డని కవుల చరిత్ర మనుచున్నది. కావచ్చును.

---

# పైడిపాటి వేంకటనృసింహకవి

ఈ కవి వ్రాసినవి రెండుశతకములు కనఁబడినవి. ఒకటి రామచంద్రశతకము రెండు మన్నారుకృష్ణశతకము. ఈతఁడు నృసింహావిలాస మను ప్రబంధము వ్రాసియుంట నిదివఱకే కవులచరిత్రమున కెక్కియున్నాఁడు. ఇతఁ డాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, శఠమర్షణగోత్రము వాఁడు. లక్ష్మీపతికి వేంకాంబకును బుత్రుఁడు. ఇతఁడు నెల్లూరు మండలమునందలి పైడిపాడు కరణముల వంశములోనివాఁడని తెలుపుటయేగాక, కరిణీకములు గోపరాజు రామప్రధాని యిప్పించెనను కథను గ్రంథస్థమొనరించుచున్నాఁడు.

సీ॥ "క్షితితలంబున నొప్పు కృష్ణాపినాకినీ
దివ్యనదీమధ్యదేశభూమిఁ

గడుఁబూర్వవార్ధికిఁ బడమట యోజన
దూరమై తగుఁ గందుకూరు మఱియు
నదియె సీమానామమై యొప్పు కందు
కూరికిఁ దనరు వాయువ్యదిశను
బాలేరు దానికిఁ బౌలస్త్యదిశఁ బైడి
పాడొప్పు దానికిఁ బశ్చిమమున

గీ॥ నెగడుఁ జతకుపాడు నిబుతి వేంపాడుఁ
జెలఁగు గాడ్పుమూల నిలవర యన
నమరు పురచతుష్టయం బివి తృణకాష్ఠ
జలసమృద్ధి సిరుల నలరుచుండు.

గీ॥ గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండప్రభువు(?)చేతఁ గొనినదాన
మహిమ దుష్టమతుల మడియించి స్థానర
జీవనములు ద్విజులఁ జేర్చె మున్ను॥

తదీయానుగ్రహాలబ్ధంబైన యేతద్గ్రామచతుష్టయస్థానగజీవను లయిన మదీయవంశజులు".

ఇతనిమేనల్లుఁ డగు అయ్యలరాజు నారాయణకవి హంసవింశతి వ్రాసెను. ఈ నారాయణకవి క్రీ॥ శ॥ 1800 ప్రాంతములవాఁడని కవులచరిత్ర మనుచున్నది. 1660 క్రీ॥ శ॥ వాఁడు కావచ్చును. కావున మేనమామ యగు నరసింహకవి 1650 ప్రాంతములవాఁ డనవచ్చునని తోఁచుచున్నవి. ఇది సిద్ధాంతము కాదు.

(?) "గజపతులచేత" నని వాడుక. కంసాలికరణీకములఁ జెయించి ద్విజుల కిచ్చె నని కథ.

ఈ నరసింహాకవి వ్రాసిన రెండుశతకములును దశకవిభాగము నొందియున్నవి. ఆ వివరము లున్నపద్యములు కొన్ని యుదాహరించెదను.

మన్నారుకృష్ణశతకము.

సీ|| వరదేవకీగర్భ వారిధిద్విజరాజ ద్విజరాజ గమనావతీర్ణభువన
వసుదేవకంస సేవాతమః పద్మాప్త, పద్మాప్త చేటీతపస్సపర్య
కృతయశోదాకుచక్షీర పానాదర నాదరహాస్యానుమోదచిత్త
వర్ధితనంద గోపత్సనాభీర నాభీరణద్ధ్రిహిణప్రసంగ
యాపదుద్ధార నను బ్రోవు సాపరాధి, రాధికా గోపనృపవధూరత్నజార
చారుతర మందహాస పోలూరివాస, వారి తామితకృష్ణ మన్నారుకృష్ణ!
(దాససంగదశకము.)

సీ|| సతత భక్షిత మఘాహుతి సరసాన్నంబు
సన్నంబు గాఁ దినసరణి మెసవ
సర్వవేదాకృతి శర్కరపలుకులు
పలుకులు గడుముద్దు గులుకు బలుక
ప్రాణ్యంతరనుగత పాదపల్లవముల
అవముల గతివీధి. లఘువులెత్త
శ్రుతిరవాకర్ణనశ్రీతివల్ల వార్తల
వార్తల సార్థకవ్యక్తి వినఁగ
నేర్చుకొను టద్భుతము గాదె నీవు మంద
మందచర్యల ప్రాకృతు మాటిక మెలఁగి
చారుతర మందహాస పోలూరివాస!
వారి తామితకృష్ణ మన్నారుకృష్ణ! 36.

సీ|| శ్రీ రుక్మిణీరహః క్రీడాకళాసత్య। సత్యభామా మనోజలజమిత్ర!
మిత్రవిందాధరామృత పానచాతుర్య। తుర్య కాళిందీనదీ ప్రసంగ!
సంగమనిపుణ లక్షణ లక్షణాధీన। ధీనయనాగ్నజితీప్రసాద!

సాదరసల్లాప జాంబవతీలోల। లోల! దృగ్ఛదాబ్రముదాలవాల!
వాల ఖిల్యాది మునిసంస్తవ ప్రభావ। భావమున నెంతు నిను విష్టపప్రచారు
చారుతర మందహాస! పోలూరివాస! వారితామితకృష్ణ మన్నారుకృష్ణా! 1

(స్తుతిదశకము.)

సీ॥ పక్కలో నిడుకొని పలుమారు జోకొట్టి
జోకొట్టి ప్రణుతించు జోలపాడు
పోరుఁబెట్టిన భుజంబునఁ జేర్చి చిచ్చోసి
చిచ్చోసి యని వ్రేళ్ళు చిచ్చిగొట్టు
హాయిరే యనుచు నుయ్యాలనుంచి లాలించి
లాలించి మెల్ల మెల్లనఁ గదల్చు
బూచి వచ్చెనటంచు బుసపెట్టి బెదరించి
బెదరించి మీఁగాళ్లఁ బెట్టియూఁచు
నిన్ను నిన్ని విధంబుల నిద్రఁబుచ్చి
బుచ్చి శిశువంచు తల్లి పాలిచ్చు లేపి
చారుతర మందహాస! పోలూరివాస!
వారితామిత కృష్ణ! మన్నారుకృష్ణ! 25.

(పితృమాతృదశకము.)

సీ. అన్నరామను మాటలాడఁగఁ బోవలెఁ
బోవలె వాటింక పోసగదోయి
తల్లులఁ గని కొట్టఁదలఁతురు మనముల
మనముల కోపంబు మానరెపుడు
వెన్నదొంగిలితెత్తు విను మనకిరువుర
కిరువురకధోదరం బెదిరించు
నాటల కధికుల మయ్య యీమందలో
మందలోలాత్మ డింభకులకన్న
ననుచు నమ్మించి సకల గుణాభిరాము
రాముఁ దోడ్కొని రాజమార్గంబుఁ జేరవె ॥చా॥ 138

(బాలదశకము)

సీ. దొరకొడుకై యుండి దొంగిలనేటికే
నేటికే వలులమే నీకు మేలు
పూనియే మెడలేము వానికోర్కులమేలు
కలమేలు వానికీ గుణముఁ గలదె
రట్టుఁజేయఁగ నందఱము కానివారమా
వారమారడిఁ జేయవలెనె యెపుడు
కలచిహావ్యముల నెంగిలిఁజేయఁ బాడియె
పాడియే మర్యాద ప్రబలు నింక
ననుచు వ్రేతలుఁదెలుప నీయంబవారి
వారివారించు నేరని వాఁడవంచు
చారుతర మంతహాస! పోలూరువాస!
వారితామితకృష్ణ! మన్నారు కృష్ణ! 48
(చోరదశకము.)

జారదశకము, గోపాలదశకము, దుష్టనిగ్రహదశకము, శిష్టప్రతిపాలనదశకము, అవతారదశకము నని విభాగము లున్నవి.

సీ. దాతృత్వమునకు శాంతము సంక్రమించిన
మించిన పైడిపాసించినట్లు
చదివించు గురుపుత్రాశనమివ్వఁ గలిగినఁ
గలిగిన నేయిపా ల్గలిసినట్లు
పతిభక్తి సౌందర్యవతికిచేకూరిన
కూరిన మణి సానదీరినట్లు
సుగుణంబు వ్యవహారశూరునింపొందిన,
పొందిన పవిజోడు బూనినట్లు
నీదుభజనంబునకు మనోనియతి యమర
యమరతతులకు సంతానమబ్బినట్లు

చారుతరమందహాస! పోలూరివాస!
వారితామిత కృష్ణ! మన్నారుకృష్ణ! 109

(నీతిదశకము)

సీ. సురిచిరాపస్తంబసూత్ర విప్రాజ్ఞుఁడై । ప్రాజ్ఞుఁడై శ్రీపైడిపాటి కులజుఁ
డై శఠమర్షణ యతిగోత్రధర్మ్ముఁడై । ధర్మ్ముఁడై సూనృత తపము పెంపు
గనిన లక్ష్మీపతి కలఘునాఘుసుతుడు । ఘనుడు సూనుఁడ వేంకటనృసింహ
నామధేయుఁడ భవన్మర్త్యనాచరితంబు । చరితంబు నొకసీస శతకకృతినిఁ
జెప్పి యర్పించితి సుధీ విశేష దాని । దానివిని నన్నుఁగైకొను దైవరాయ
చారుతరమందహాస! పోలూరివాస! వారితామితకృష్ణ! మన్నారుకృష్ణ!

## రామచంద్రశతకము.

శా. శ్రీసీతాహృదయాబ్జభాస్కరగదరారిప్రస్ఫురద్బాణ బా
ణాసోపేత లసచ్చతుష్కరశరీరాశ్లిష్ట గోదార్ఝుగో
చ్ఛ్వాసప్రోల్లలదంబు శీకర నిజస్థానైక భద్రాద్రిప్రియు
ద్గాసశ్రీకర నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ! I

ఇందు స్తుతిదశకము మొదలగు విషయములు విభాగించి వ్రాసెను.

మ. క్షితి నేకాదశసంఖ్యచే దశకముల్ జెన్నొందఁ మాణిక్యవ
జ్రితతింగూర్చినహారపంక్తి గతిఁ గ్రాణాంఘ్రి శబ్దంబులన్
శతకగ్రంథమొనర్చి నీకొసఁగెదన్ సర్వేశ యస్మత్కవి
త్వతపస్సిద్ధికి నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ! 15

మ. సుగుణాత్ముండయి పైడిపాటికుల దక్షుండై మనుప్రోక్తి నా
దుగురుండై శఠమర్షణాఖ్యముని గోత్రుండై యజుర్వేది నాఁ
దగు లక్ష్మీపతిసత్కవీంద్రునకుఁ బుత్రజ్యేష్ఠుఁడన్ నావశం
బగు నర్లెంచితి నిన్ను వేంకటనృసింహాఖ్యుండ నీవాఁడ భ
ద్రగిరీంద్రస్థిత నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ! 111.

మ. స్తుతికావ్యోన్నతి, దాససంగతి, మనోదుర్వృత్తి సంసారప
ద్ధతి, మాయాకృతి, తత్త్వసంతతి, యభేదఖ్యాతి దీనావన
స్థితి సర్వేశ, దశావతారనుతి, కించిన్నీతి నానొప్ప న
ద్భుతరీతిం గృతిరుద్ర సంఖ్యదశకంబుల్ సమ్మతిం దానిసా
యతకారుణ్యత నన్ను గైకొను ముపేంద్రా! రామచంద్రా హరీ! 112

(స్తుతిదశకము, వాక్యోన్నతిదశకము, దాససంగతి, మనోవృత్తి, సంసారదశకములు, అభేద, దీనత్రాణ, అవతార, నీతి, దశకములని పేళ్ళు.)

మ. కృపణుంగొల్చెడువాఁడె కష్టి, శరణార్థింబ్రోచుధర్మిష్టి, కా
నిపనుల్ గోరమి తుష్టి, యేలినవిభున్ నిందించు పాపిష్టి, తు
చ్ఛపు చాపల్యములందె నష్టి, వెసనేచ్ఛల్ బాయు సద్గోష్టి, నో
తపనీయాంశుక నన్నుఁగైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ!

మ. భవదుద్యద్వ్రతమూర్తులఁ జొరని యప్రత్యక్షతా కార్యముల్
భువి గావింపనొ రాక్షసీపరితఫలంబుందత్పుణ్యోన్మత్త దా
నవులంగాల్పనొ బుద్ధరూపమును బాణత్వంబుసాధించి యి
య్యవనింబోల్చుట నన్నుఁగైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ! 98.

# అయ్యలరాజు నారాయణకవి



ఇతఁడు హంసవింశతి వ్రాయుటవలనఁ గవులచరిత్రమునందున్నాఁడు. ఈతఁడు తన గ్రంథములలోఁ దనవంశవర్ణనము నొనర్చుకొనియున్నాఁడు. ఈతఁడు వ్రాసిన గ్రంథములు హంసవింశతికథలు, గల యైదాశ్వాసములపద్యకావ్యము, దశావతారకథాసంగ్రహ మను మూఁడాశ్వాసములగ్రంథము, ఆంజనేయకందపద్యశతకము ననునవి మూఁడని తెలియుచున్నది. ఈతఁడు నెల్లూరిమండలము నందలి కొచ్చర్లకోటతాలూకా గోరుగుంతలపాడుగ్రామవాసి యని తెలియుచున్నది. కావుననే గోరుగుంతలపాడును "నఖగర్తపుర" మని గీర్వాణీకరించి చెళ్ళపిళ్ళ నరసకవి కడియము గ్రామమును గంకణపుర మొనరించిన సంగతి స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. "నఖగర్తపురాంజనేయ నతజన గేయా" అని శతకమకుటము. "గోరుగుంతలపాటియాంజనేయా" యనుటకు బదులుగ వ్రాసినదే కాని మఱియొకటిగాదు.

దశావతారకథాసంగ్రహమునందుఁ దనతండ్రినిఁ గూర్చి యిట్లు వర్ణించెను.

సీ|| కౌండిన్యసద్గోత్ర కల్పకంబగుపర్వ

తప్రెగ్గడేవ్వాని తాత తాత

కవిచకోరనిశాకర యశస్స్ఫురదయ్య
లామాత్యుఁడెవ్వాని యబ్బకబ్బ
కుకవితాత్ముదరిద్రకుద్దాలసముఁడు
భాస్కరమంత్రి యెవ్వానిఁ గన్నతండ్రి
హంసవింశతి ప్రబంధాకల్పునారాయ
ణాఖ్యుఁడా నే నే మహాత్ముసుతుఁడ

గీ॥ నట్టి యయ్యలరాజాన్వయాంబురాశి
భగణహృన్నాథుఁగొండమాంబాసనాథు
నిఖిల కకుబంతరాళనిర్ణిద్రకీర్తి
మజ్జనకు సూరపామాత్యు మదిఁ దలంతు.

హంసవింశతిలో నిట్లు వ్రాసెను:—

ఉ॥ అయ్యలరాజు తిప్పసచివాగ్రణి బర్వతరాజు రామభ
ద్రయ్యను, భాస్కరాగ్రణి ప్రధానవరుండగుకొండధీరువిన్
జయ్యనఁదిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజవంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్.

అయ్యలరాజు త్రిపురాంతకుని విషయమై వెనుక వ్రాయుచు కాశ్యపగోత్రజులైన రామభద్రకవికిని, కౌండిన్య గోత్రజుఁడైన నారాయణకవికిని సంబంధమెట్లని సందేహించితిమి. పై గ్రంథము లన్నియుఁ జదివి వంశవృక్షము వ్రాయ నీ విధముగ సరిపెట్టుకొనుట కించుక వీలు కనఁబడుచున్నది. పండితులు చర్చించెదరుగాక!

(1) అయ్యలరాజు అయ్యలయ్య (క్రీ॥ శ॥ 1470.)

(2) త్రిపురాంతకుఁడు
(క్రీ॥ శ॥ 1500)
ఒంటిమెట్ట రఘువీరశతకకర్త.

(3) అక్కయ్య (1530)

(4) రామభద్రుఁడు (1550)
(రామాభ్యుదయ గ్రంథకర్త.)

(9) పర్వతన్న (1500 క్రీ॥ శ॥)
కౌండిన్యగోత్రజుఁడు.

తెలియదు (1530 క్రీ॥ శ॥)

అయ్యలయ్య (క్రీ॥ శ॥ 1560)

భాస్కర (క్రీ॥ శ॥ 1600)

సూరప (కొండమ) (క్రీ॥ శ॥ 1630)

నారాయణామాత్య (క్రీ॥ శ॥ 1600)
(హంసవింశతి.)

(5) పిన యక్కయ్య
(ఇతఁడు రామభద్రుని కెన్నవతరమువాఁడో తెలియదు.)
(క్రీ॥ శ॥ 1769.)

(7) అయ్యలయ్య

(6) నాగయ్య

(8) భాస్కర

(7-8 రెట్టమతశాస్త్రకర్తలు)

పై లెక్కప్రకారము క్రీ॥శ॥ 1660 సంవత్సరము నారాయణామాత్యుని కాలము కావలసియున్నను, 1769 లో నున్న రెట్టమతకవులఁ బొగడె నను కవిచరిత్రవాక్యము బాధించుచున్నది. తన తాత భాస్కరుఁడని వర్ణించెను. మనమెఱుఁగని కొండ తిమ్మక్ష్మాధీవరులఁ జేర్కొనెను. కావున నా పైకవులు రెట్టమతకవులు కాఁజాలరు. ఈయూహ సత్యమైనచో నీ

నారాయణామాత్యుఁడు క్రీ॥ శ॥ 1660 ప్రాంతములవాఁడు కావలసియుండును. నా యూహచే సకలనీతికథాసంగ్రహము నందలి గద్యయందలి "కాశ్యప" యనునది పొరబాటై యుండును. ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితాగారమున రామభద్రుఁడుకూడఁ గౌండిన్యగోత్రమువాఁ డని యొకచోట వ్రాసియుండిరి. కాని యందే "కాశ్యప" కూడనున్నది. ఈ పొరపాటుగద్యగోత్రము (నాయూహప్రకారము) కాక, రామభద్రునిది కాశ్యపగోత్రమే యైనచో బర్వతన్న కాని, తరువాతవారుకాని కౌండిన్యగోత్రజులకు దత్తు వెడలియుండిరేమో? అయ్యలరాజువారను నింటిపేరు రామభద్రునికిఁగాని, త్రిపురాంతకునికిఁగాని యున్నట్లు ప్రాచీననిదర్శనములు లేవు. లక్షణగ్రంథములలో "పుత్తేటి వా" రని యున్నది. కావునఁ బుత్తేటివారిది కౌండిన్యగోత్రమునై యుండునేమో? ఇవి యూహలు. ఇతని శతకము దొరకలేదు.

—:o:—

# కంచర్ల గోపన్న

భద్రాచలరామదాసనియు, బందిఖానా రామదాసనియుఁ బిలువఁబడుచుండుభగవద్భక్తుఁ డీతఁడే! ఈతని చరిత్రము రామదాసుచరిత్ర మనుపేర నాంధ్రలోకమునం దంతటను బ్రచారములో నున్నది. ఈతఁడు వ్రాసినకీర్తనలు పాడునట్టి

వట్టివర్ధనములదాసరులు నెమలికుంచెలతోడను, ఇత్తడిచిలు కల సెమ్మెలతోడను, నడుమునబిగించిన పట్టుబట్టలతోడను నృత్యముచేయుచుఁ బాటలుపాడుచుఁ దీర్థములలోను, పల్లె టూళ్ళలోను బ్రత్యక్ష మగుచుందురు.

ఈతఁడు బ్రాహ్మణుఁడు, ఆత్రేయసగోత్రమువాఁడు. కంచెర్ల లింగన్నమంత్రికిని, కామమాంబకును బుత్రుఁ డని రామదాసుచరిత్రమువలనఁ దెలియుచున్నది. ఈతఁడు వ్రాసిన దాశరథీశత కాంతమునఁ దనగోత్రనామము లీక్రిందివిధముగ వివరించియున్నాఁడు.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్లకులోద్భవుం దనఁబ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను దాశరథీ! కరుణాపయోనిధీ॥ 103

ఈతఁ డాదిశాఖకుఁ జెందినవాఁడ నని చెప్పుకొని నాఁడు. ఆది శాఖ యనఁగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో బ్రాహ్మణుఁడ నని చెప్పుకొనెనా? ఆదివేద మగు ఋగ్వేది నని చెప్పుకొని యుండునా? కంచెర్లవారిలో జ్యేష్ఠ శాఖకు జెందితి నని చెప్పుకొనెనా? అనునవి సందేహములు. ఆదిశాఖ యనఁగాఁ బ్రథమశాఖ యని మరికొంద అను చున్నారు.*

---

* (1) R.H.D. Prasadarow garu. (2) మ. గురుబ్రహ్మ శర్మ గారు, నరసారావుపేట (3) నల్లజర్ల సాంబశివరావుగారు, పెదబ్రహ్మ దేవము, చామర్లకోట పోష్టు. వీరు మువ్వురును గోపన్న యాదిశాఖవాఁ డని నాపేర జాబులు వ్రాసిరి.

సంగతిసందర్భములనుబట్టి యీతఁడు ప్రథమశాఖవాఁడనుటయే సమంజసముగాఁ గన్పట్టునుగాని యీ యూహకుఁ బ్రతిబంధకములు కొన్ని క్రిందఁ జూపుచున్నాను.

(1) "ఆదిశాఖ" శబ్దము కులపరముగాఁ గవి వాఁడిన యెడలనది "శాఖ" యనికాని, "శాఖీయుఁడ" ననికాని కవి వ్రాయవలసియుండె నని కొందఱు వ్రాసిరి. వ్యాకరణముచే నీరూపము సాధితము గానియెడలఁ గవి "ఆదిశాఖ" యనియే వ్రాసియుండె ననుకొందము. కావున నిది యంత బలమైన ప్రతిబంధకము కానేరదు.

(2) ఈతఁడు తన మతమును గుఱించి యీవిధముగ వ్రాసియుండెను.

ఉ. పట్టితి భట్టరార్యగురుపాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్
బెట్టితి మంత్రరాజ మొడిఁబెట్టితి నయ్యమకింకరాళికిన్
గట్టితి బొమ్మ మీచరణకంజములందుఁ దలంపు వెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల దాశరథీ! 102

ఉ. ఆర్యుల కెల్లమ్రొక్కి వినతాంగుడనై రఘునాథభట్టరా
చార్యుల కంజ లెత్తి కవిసత్తముల న్వినుతించి కార్యసా
కర్యమెలర్ప నొక్కశతకంబొనగూర్చి రచింతు నేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపు మిది దాశరథీ! 6

ఈ పై రెండుపద్యములవలనను గోపనకవి రఘునాథభట్టరాచార్యులశిష్యుఁడై వైష్ణవమతము స్వీకరించి "ఊర్ధ్వపుండ్రాదులు" ధరించువాఁడని తెలియుచున్నది. ప్రథమశాఖా

బ్రాహ్మణులలో నియోగు లున్నారుకాని వైష్ణవమతప్రవిష్టు లున్నారా? ఉండినయెడల వా రూర్ధ్వపుండ్రములు ధరించెదరా? అట్టివా రెచ్చట నున్నారు? అను విషయములు తేలవలసియుండెను. ప్రథమశాఖలో వైష్ణవు లున్నా రని తెలియుచున్నందున నెచ్చటనైన నున్నా రనియే స్థిరపరచి చూతము.

(3) ఈతఁ డక్కన్న మాదన్నల మేనల్లుఁ డని రామదాసుచరిత్రము చెప్పుచున్నది. అక్కన్న మాదన్నలార్వేలనియోగు లనియు, ఋగ్వేదు లనియు, వారియింటి పేరు పింగళి వారనియు, వారి వంశీకులగు పింగళివారును, *సిద్దలూరివారును నిప్పటికి నున్నా రనియు, వారికి గోలకొండ వేపారులతో సంబంధ బాంధవ్యము లున్న వనియు సనాక్ష్యముగఁ దెలియుచున్నది. అట్టియెడ గోపన్న వారి మేనల్లుఁ డెట్లగును? గోలకొండ వేపారులకును, ఋగ్వేదులకును సంబంధము లున్నను, ప్రథమశాఖవారితోఁ గలవా? గోపన్న ప్రథమశాఖవాఁ డైనప్పు డాతనిమేనమామలు ఋగ్వేదులు కావచ్చునా? ఉత్తరసర్కారుల లోని బ్రాహ్మణసంఘము నందలికట్టుబాట్లకు, నైజాము లోని కట్టుబాట్లకును, చాలభేదము లుండుటవలన నక్కడసంగతు లెట్లేఁగియున్నవారిది చర్చింపవలసియున్నది. ఈ విషయమై పత్రికలలో వ్రాసినప్పు డనేక ప్రత్యుత్తరములు వచ్చినవి.

*See Local Records. (Mackenji)

(4) కంచెర్ల శరభనకవి తన యధ్యాత్మరామాయణ కృత్యాదిని తాను శైవగురుశిష్యుఁడ ననియు, ఆపస్తంబ సూత్రుఁడ ననియు, మంత్రికులమువాఁడ ననియు వివరించుచుఁ దనశాఖవారి కిందితావుల నున్నట్లు చెప్పినాఁడు. (ఓ. లై. వ్రాఁతప్రతి. ఆంధ్రపత్రిక - దుందుభి, ఆషా బ౬ చూడుఁడు.)

గీ. కొండపల్లినిఁ గొందఱు గొల్లపూడిఁ గొంద
ఱుండిరి తంజాపురందు* గొంద ఱెలమి
వసియించి ప్రబలిరి చెలువు మిగుల
మీఱి కంచెర్ల వంశంబువారు ధరణి॥

కొండపల్లి యందలి కంచెర్లవారు మూ శాఖవారని మనకంటె బూర్వుఁడు వ్రాసిన యీ పైపద్యము కాదనుటకుఁ దగిన లిఖితాధారమును దాము రామదాసువంశమునకే చెందుదు మని వాదించు ప్రథమశాఖకంచెర్లవారు కనఁబఱపవలసి యుందురు. అంతవఱకు మనము ప్రథమశాఖవారికిని, గోలకొండవేపార్లకును సంబంధ మున్నమాట నిశ్చయమైనచో రామదాసు వ్రాసినప్రకార మతఁ డాదిశాఖవాఁ డనియు, పింగళివారిదౌహిత్రుఁడు కావచ్చు ననియు నమ్మవచ్చును. లేదా యక్కన్న మాదన్నలు సోదరులు కారనియు, నెవ్వగో వచ్చి యింట భుజించుచుండువాఁ డనియు, వానిని సోదరా యని యక్కన్నయు, బావగా రని యక్కన్నభార్యయుఁ

* తంజాపూరులో గ్రంథాక్షరముల రామదాసు కీర్తనలున్న ప్రతులు దొరకుట కిదియే కారణమా?

బిలుచుచుండు వా రనియు, భార్యబందుగుఁ డని భర్త, భర్త బందుగుఁ డని భార్యయు నమ్ముచుండి రనియుఁ గలవార్త నిశ్చయ మైనచో, నక్కన్నగా రాశ్వేలని యోగియు, మాదన్నగారు ప్రథమశాఖవాఁ డనియు, మాదన్నయక్క కామమ్మను లింగనమంత్రి కిచ్చి రనియు, రామదాసు మాదన్న మేనల్లుఁడై యుండఁబోలు ననియుఁగూడ మన మనుమానింపవచ్చును. రామదా సేశాఖాబ్రాహ్మణుఁ డనునది యిప్పటికింకను సునిశ్చితము కాలేదు. పై వివరములు చదివినపాఠకులే యూహించి చర్చించెదరుగాక! కొందఱక్కన్నమాదన్నలు మహారాష్ట్రు లందురు కాని యది సత్యము కాదు. ఆంధ్రు లనేకులు మహారాష్ట్రమునకు వలసపోయి "కాశీనాథత్రయంబక తిలంగు" (Telang) అనఁగా తెలుఁగువాఁడ నని తెలియుటకు వ్రాసికొనునట్లే, శివాజీ సేనానాయకుఁ డగు "మోరోపంతుపింగళే" కూడ "పింగళిమూరయ్యపంతు" లై యుండవలెను. ఇది యత్యూహ మైనఁ గావచ్చును కాని, యక్కన్న మాదన్నలుమాత్రము మహారాష్ట్రులు కారు. ఏమనఁగా? ఇంటిపేరునుబట్టి తెలుఁగువారిని స్పష్టముగ నిరూపింపవచ్చును.

(1) ద్రావిడులు:—వీరి కింటిపేరు లేదు. పుట్టినయూరు తంజావూరు. తండ్రిపేరు కృష్ణయ్య రు. రెండునుగలిపి "తం. కృ. ఆరుముగమయ్యరు" అని పేరు పెట్టుకొందురు. గ్రామ పితృనామములు పొడియక్షరములు. ప్రతివ్యక్తికి నీ పొడి యక్షరములు మారుచుండును.

(2) మహారాష్ట్రులు:—వీరి కింటిపేరు చివరవచ్చును. "బాల-గంగాధర-తిలకు." మనము "తిలకు, తిలకు" అనుచుం దుముకాని యది కుటుంబనామము. తిలకుతండ్రి తిలకు; తిలకుకొడుకు తిలకు. కావున తిలకును దలిదండ్రులు స్నేహితులు పిలుచుపేరు "బాల"; "గంగాధర" యనునది తండ్రిపేరు 'తిలకు' యింటిపేరువంటిది చివర వచ్చును.

(3) వంగీయులు:—సురేంద్రనాథ్ బెనర్జీ. ఇచ్చట "బెనర్జీ" యింటిపేరువంటిది.

(4) ఆంగ్లేయులు :— Thomas Munro ఇచ్చట "మనో్రి" యింటిపేరు వంటిది.

ఇట్లే తక్కినవారికిఁగలవు. ఇంటిపేరునకుఁ బ్రాముఖ్య మిచ్చి మొదట వ్రాసికొనువా రొక్కయాంధ్రులే! కావున నింటిపే రున్న తావునుబట్టికూడ మనము "ఆంధ్రేతరు"లైనది కానిది నిర్ణయించుకొనఁగలము. నేఁటివ్రాతలు కావు. ఏనుఁగు వెదలక్ష్మణకవి తన తుల్యామహాత్మ్యము కృత్యాదిని కృతిపతివంశవర్ణనమునం దీ క్రిందిపద్యమును వ్రాసినాఁడు. ఇందు పింగళిమాదన్న యని యింటిపేరు ముందున్నది.

సీ. సుల్తనబ్దులుహసన్ । క్షోణీశ్వరునిచేత
మాటిమాటికి బహుమానమందె
మఱియును పింగళి । మాదన్న భానుజీ
మంత్రిజ్ఞు వలన సమ్మాన మొందె

అక్కన్న మొదలైన । యట్టి పెద్దలచేత
మేలు భూషణములు మెప్పులందె
పరులప్కారులకు దు । ష్కారముకా గడిదుర్గ
ములఁ గొట్టి వారిచేఁ బూజ లందె

గీ. పీఠికాపురి కిమ్మ్మారు । బిక్కవోలు
తునియుఁ గొట్టాము మొల్లేరు । ఘనత నేలె
వత్సవయ తిమ్మభూపాల । వరునిసుతుఁడు
రాజమాత్రుఁడె రాయప । రాజశౌరి ||

వత్సవాయి తిమ్మరాజుగారిపుత్రుఁడైన రాయజగపతి రాజుగారినిగూర్చి క్రీ. శ. (1607—1649) కవి వ్రాసినది పై పద్యము.* (63 పుట పెద్దాపురసంస్థానచరిత్రవిమర్శనము.)

ఇప్పుడైన అక్కన్న మాదన్నలాంధ్రు లని యంగీకరించెదరని నైజాము పింగళివారినిఁ గూడ జూపెదను.

రామదాసుచరిత్రమునం దీతనికథ యున్నది. అది సంగ్రహముగ నిట వివరించెదను.

"గోల్కొండరాజ్యమును దానీసా పాలించుచుండెను. అతనికి

క. ఎన్నఁగ దానీషాకు న।కన్నయు మాదన్న యనఁగ నవనిసురవరుల్
అన్నయుఁ దమ్ముడు గడు సం। పన్నులు మంత్రులును నీతిపాలితు లరయన్ ||

వ. వారికి మేనల్లుఁడు.

తోహరా. శ్రీమించిన నెలకొండపల్లెలో శిష్టజనులు పొగడఁగనూ
కామాంబకు గోపన్న జనించెను గమలాక్షుని వరముననూ

* ఈ పై పద్యము నెలేఁగియు శ్రీబ్రహ్మయ్యపంతులుగారు వ్రాసినది సరిగాలేదు. వారికి రామదాసు వేఱని, గోపరాజు రామప్రధాని వేఱని తెలియును.

ఆత్రేయసగోత్రంబున కంచె ర్లాంధ్రార్యుల వంశమునన్
పుత్రుఁ డగుచు లింగనమంత్రికిఁ దాఁ బుట్టెను గోపన్ననమా॥

క. భూసురవరుఁడు నియోగియు । భాసుర కంచెర్లకులజ భవ్యయశుండున్ ॥
వాసవపతి వంశజచర । దాసస్తుఁడు గోపన యన వర్ణన కెక్కెన్ ॥

ఇతఁడు చిన్నతనములో బాలరామాయణము చదివి నప్పటి నుండియు రామభక్తుఁడై చరించుచుండెను. ఎల్ల ప్పుడు నింట భజన చేయుచుండెను. కొన్నిదినములకు వివా హితుఁడై కాపురము చేయుచుండ కబీరుదాసను భగవద్భ క్తుఁడు వచ్చి గోపన్నను జూచి యాతని భక్తికి సంతసించి యాతనికిఁ దారకమంత్ర ముపదేశించి చనియెను. అదిమొ దలు గోపన్న తారకమంత్రము దొరికినదని మఱింతభక్తితో దినములఁ బుచ్చుచుండెను. కొంతకాలమునకు విజ్ఞానము గలిగి యరిషడ్వర్గముల విడనాడి, సద్గతికై యొకపుత్రునిఁ బడసి, తన కున్న దంతయు దాసుల కిచ్చివేసి కట్టుబట్టతో కమలాపతిని భజించుచుండ బంధుగులు గోపన్న యాస్తినం తయుఁ గోల్పోయె నని దుఃఖించుచుండిరి. అంతట నాతఁడు బంధుగుల పోరు బడలేక మేనమామల కడకు హైదరాబాదు పోఁగా వా రాతనికి భద్రాచలం తాలూకా తహశీల్దారుపని వేయించిరి. గోపన్న భద్రాచలము చేరి రైతులఁ గన్నబిడ్డ లవలెఁ జూచుచుఁ బన్నులు వసూలుచేసి వచ్చిన ధన మెల్ల రామకైంకర్యము చేయుచుండెను. ఒకనాఁ డొక గొప్ప సం తర్పణము చేయుచుండ రామదాసు పుత్రుఁడు గంజిగుం

టలోఁ బడిపోయెను. రామదాసుభార్య బిడ్డను దీసి, మరణిం చెనని చెప్పిన విప్రసంతర్పణ మాగిపోవు నని యొక మూలఁ గూర్చుండి, భోజనములు ముగిసిన పిమ్మట భర్తతోఁ జెప్పెను. అప్పుడు రామదాసు "రామా! తండ్రీ! నేను రామకార్యత త్పరుఁడనై యుండ నా కీ కష్టము తెచ్చుట న్యాయమా?" యని విలపింప భగవంతున కనుగ్రహము కలిగి బిడ్డఁడు జీవిం చెను. అప్పటినుండి రామదాసు మహిమలు దేశ మెల్లడలఁ బ్రాకిపోవుచుండెను. గోలకొండకు ధనము పోవుట లేమి, రామదాసుచర్య తానీషాకుఁ దెలిసి యాతనిఁ జెఱసాలలోఁ బెట్టించి పండ్రెండుసంవత్సరములు బాధించెను. రామదాసు తా నా ధనము దుర్వినియోగము చేయలే దనియు, భగవం తుని కర్పించితి ననియు, నాతఁడే వచ్చి రక్షించు ననియుఁ దన్నెన్ని భటు లెన్నికష్టములు పెట్టినను విశ్వాసముతో నుం డెను. తుదకు విసిగి విషముఁ ద్రావఁబోవ శ్రీరామచంద్రుఁడు తానీషాకుఁ బ్రత్యక్షమై, రామదాసు వ్యయపెట్టిన సొమ్ము చెల్లించి, బందిఖానానుండి రామదాసును విడిపించెను. గోపన్న తిరిగి భద్రాచలము వచ్చి రాముని సేవించి సాయు జ్యము నందెను."

ఈతఁడు పూర్వజన్మమున రామచిలుక నొకదానినిఁ బెంచి పంజరములో 12 యేండ్లు బంధించినందున నీ జన్మలో నీ ప్రతిఫలము కలిగె నని వ్రాసిరి.

ఈతఁడీపవిత్రజీవితమునందే — ముఖ్యముగఁ జెఱసాలయందే యనేకభక్తికీర్తనలు పాడుచుండెను. అవియే యిప్పటికిని నిలిచియున్నవి.

రామదాసు కీర్తనలును, దాశరథీశతకమునే గాక యింకఁ గొన్ని గ్రంథము లంతకుఁ బూర్వము వ్రాసి నరకృతు లిచ్చి విసిగిన ట్లీ క్రింది పద్యమువలన నూహింప వీలగుచున్నది.

ఉ. మసగొని రేఁగుబండ్లకును మాక్తికముల్ వెలపోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోస మయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగఁ జేసురునట్లు వాక్సుధారసములు చిల్కఁ
బద్యముఖరంగమునందు నటింపవయ్య సంతసమును జెంది భద్రగిరి
దాశరథీ॥ 7

ఇతఁడు రామదాసుచరిత్రములోఁ జెప్పిన ట్లక్కన్న మాదన్నల మేనల్లుఁడే యైనచో నీతఁడు తానీషాకాలమువాఁడగుచున్నాఁడు. (క్రీ॥ శ॥ 1674–1687) ఈతని చరిత్రము సుప్రసిద్ధమైనదగుటఁ గొన్ని పద్యములు కీర్తనలును శైలికిఁ జూపి విడిచెదను. రామదాసుచరిత్రమునందు (1) మానసబోధశతకము (2) భావనారాయణశతకము (3) జానకీపతిశతకము (4) దాశరథీశతకము (5) ఆర్తరక్షామణిశతకము మొదలగు శతకములలోని పద్యము లుదాహరించియున్నారు. భావనారాయణశతకము, ఆర్తరక్షామణిశతకము లెప్పటివో, యెవరివో తెలియదు. ఇందు భావనారాయణశతకములోని దని

యుదాహరించిన "కరినేలిందిహుళక్కి" యను పద్యము దేవకీనందనశతకమునందు మకుటము మారి కనఁబడుచున్నది.

మ. కరి నేలింది హుళక్కి ద్రౌపదికిఁ గోక ల్మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యం బిచ్చుటల్ గల్ల యి
త్తరి నన్నేలిన నిక్క మీకథ లనంతా భావనారాయణా॥

రామదాసు చరిత్రము 63 పుట

దేవకీనందనశతకమునఁ దుదిపాదము

"త్తరి నన్నేలిన నిక్క మీకథలం కృష్ణా దేవకీనందనా"

దేవకీనందన శతకము 100.

ఎవ్వరుదొంగలో తెలియదు. భావనారాయణశతకము దొరికి నప్పుడు సత్యము తేలవచ్చును.

రామదాసు కీర్తనలు.

బిలహరి - ఆది.

ఎవరు దూషించిన నేమి - మెచ్చి - ఎవరు భూషించిన నేమి
అవగుణంబులు మాన్పి యార్చెరా తీర్చెరా ॥
నవనీతచోరుఁడు నారాయణుఁ డుండ ॥ఎ॥

(1) పిమ్మట లాడిన నేమి । మంచి। ప్రియములు బల్కిన నేమి
కొమ్మరో రమ్మని కోరికె లొసఁగెడి
సమ్మతి నాపాలి సర్వేశ్వరుఁ డుండ ॥ఎ॥

(2) వాసి పంతము మాకేల । వట్టి। వాదులతోడ పోరేల
దూషించేవారితో పలు మారు పొందేల
కాచి రక్షించేటిఘనుఁడు । రాముఁ డుండ ॥ఎ॥

(3) అపరాధము లెంచేవారు ।మాకు। ఉపకారులై యున్నారు
విపరీతచరితలు వినుచు నెల్లప్పుడు
కపటనాటకధారి కను పెట్టియుండఁగ ॥నెవ॥

(4) వాసివన్నెలు సల్పఁగలము ।మా। వాసనలను భ్రమయఁగలము
వాసిగ భద్రాద్రి వాసుఁడై నిరతము
భాసురముగ రామ దాసుఁడై యుండఁగ ॥వా॥

## ఆనందభైరవి—రూపకము

పలుకే బంగార మాయెనా । కోదండపాణి ।ప।
పలుకే బంగారమాయె । పిలిచిన పలుక వేమి
కలలో నీ నామస్మరణ । మరువా చక్కని తండ్రి ।ప।
ఇరువుగ నిసుకలోనఁ । బొరలిన వుడుతభక్తికి
కరుణించి బ్రోచితివని । నెరనమ్మితి నిన్నే తండ్రి ।ప।
ఎంత వేడిన నీకు । సుంతైన దయరాదు
పంతము సేయఁగ నే । నెంతవాఁడను తండ్రి ।ప।
శరణాగతత్రాణ । బిరుదాంకుఁడవు గా వా
కరుణించు భద్రాచల । వరరామదాసపోషక ।ప।

దాశరథీశతకముకూడ దశకవిభాగము నొందినట్లే తోఁచును. చూడుఁడు. మొదటిపదిపద్యములును కేవల నామములు. ఇది కవి "నామదశక" మని వ్రాసియుండఁ బోలును.

చ. కనకవిశాలచేల! భవకాననిశాతకుఠార! ధార! స
జ్జన పరిపాలశీల! దివిజస్తుత సద్గుణకాండ! కాండ సం
జనిత పరాక్రమక్రమ విశారద శారదకంద కుంద చం
దన ఘనసార! సారయశ దాశరథీ కరుణాపయోనిధీ!. 10

ఈ క్రింది పద్యము ముకుందమాల లోని శ్లోకమును స్మృతికిఁ దెచ్చుచున్నది.

శ్లో. కృష్ణ త్వదీయపదపఙ్కజపఞ్జరాన్త
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే. 7

ఉ. ముప్పున కాలకింకరులు ముంగిట వచ్చినవేళ రోగముల్
దెప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ బాంధవు
ల్దప్పినవేళ మీస్మరణ గల్గునొ గల్గదొ నాఁటి కిప్పుడే
తప్పక జేతు మీభజన దాశరథీ కరుణాపయోనిధీ! 16

ఉ. చక్కెర మాని వేముఁ దినఁజాలినికైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమరుగొల్చెద రట్లుగాదయా
మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షము నొసంగిన నీవ యీవలెం
దక్కినమాట లేమిటికి దాశరథీ! కరుణాపయోనిధీ! 21

ఉ. ఖండనభీము డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణ కో
దండ కళాప్రచండ భుజతాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటి దైవమిఁక లేడనుచున్ గడగట్టి భేరికా
డాండ డడాండ డాండ నినదంబు లజాండము నిండ మత్త వే
దండము నెక్కి చాటెదను దాశరథీ! కరుణాపయోనిధీ! 34

ఉ॥ పండితరక్షకుం డఖిలపాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశకంఠవిలుంఠన చండకాండ కో
దండకలాప్రవీణుఁ డనుతావకకీర్తివధూటి కిత్తుఁ బూ
దండలు గాఁగ నాకవిత దాశరథీ! కరుణాపయోనిధీ! 15

ఇందలి 50 వ పద్యము ధూర్జటిశతకము 82 వ పద్యమును; 89 వ పద్యము నారాయణశతకమునందలి 10 వ పద్యమును;

45 వ పద్యము ఒంటిమెట్ట రఘువీరశతకమునందలి 88 వ పద్యమును; 27 వ పద్యము శివతత్త్వసారమునందలి 118 వ పద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి.

ఇటీవల నాకుఁ జేరిన జాబులవలన నీతనిబంధుగుల మని చెప్పుకొనువారు ప్రథమశాఖలు పెదకంచెర్ల గ్రామములో నున్నందునను, ప్రథమశాఖ కవు లగు రావూరి సంజీవకవి మొదలగువారు తమకులము చెప్పవలసినచోట్ల "ఆదిశాఖ" వారమని వ్రాసికొనినందునను, భావిపరిశోధకు లింతకంటెఁ బ్రబలాధారములఁ జూపువఱకు, నీతఁడు స్పష్టముగఁ దనశతకమునందు వ్రాసికొన్న "ఆదిశాఖ" పదమువలనను, రామదాసుచరిత్రము నందలి "ఆంధ్రార్యులశాఖ" వాఁ డనుమాటవలనను మన మీతఁడు ప్రథమశాఖవాఁ డనియే నమ్ముట మంచిదని తోఁచుచున్నది. ఆర్యులు ప్రథమశాఖలలో నొక విభాగమువారు రామదాసుచరిత్రమువలన నీతఁడు ప్రథమశాఖ, ఆర్య, విభాగము నొందిన నియోగి యని తెలియుచున్నది. ఇతఁ డప్పు డక్కన్నమాదన్నల మేనల్లుఁ డెట్లగు నని ప్రశ్నవచ్చును. ప్రథమశాఖలకు, ఋగ్వేదులకు సంబంధబాంధవ్యము లున్నవనికాని, ఆ సంబంధము రామదాసు చరిత్రకారునికల్పన మనికాని యనుకొనవలయును. మేనల్లుఁడు బందిఖానాలో నున్నప్పుడు, సర్వస్వతంత్రులగు మేనమామలయిన అక్కన్న మాదన్నలు (సంబంధమే సత్యమైనచో)

భగవత్ కైంకర్య మొనర్చిన రామదాసును పంద్రెండేండ్లు బంధిఖానాలో నుండ నిచ్చెదరా? తా మాధన మిచ్చికాని, తానీషాను "క్షమించి తమ మేనల్లుని విడువుఁ" డని కోరికాని సహాయము చేసియుండరా? కావున నిది విచారణ మొందవ లసియున్నది.

రామదాసు, అక్కన్నమాదన్నల మేనల్లుఁ డనుటకు రామదాసు చరిత్రమున నిట్లున్నది.

ఒక రామదాసుచరిత్రమునం దీతఁడు నైజాముప్రాంత ముల నేలకొండపల్లివాసుఁ డని వ్రాసినారు.

"తోహరా. నవాబుతానిషాతస్తు జేరి యానగర మేలుచుండ
మక్కువగు దివాను లాతనికి మాన్యులు బహుసజ్జనులు
అక్కన మాదన్నయు నని యిద్దఱు నన్నదమ్ము లతిప్రియులు"

క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల । ననురక్తుల బిత్రుపితామహాక్రమమున వ
చ్చినవిప్రుల మంత్రులగా । నొనరించెను గార్యసంప్రయోగముకొఱకున్.

తానీషా గోల్కొండపట్టణము రాజధానిగా నేలు చుండెను. అందనేక గ్రామములు కలవు. కొన్ని గ్రామ ముల కొక తుక్డి లేక తాలూకా యని పేరు. అందు భద్రా చలముతుక్డి యొకటి.

"త్రోహరా. ఈతుక్డిలోఁ జేరిన గ్రామము నేలకొండపలి యందు
ఖ్యాతిగ లింగనమంత్రివసించెను గాపురముగ నందు
లింగనమంత్రి వివాహం బయ్యెను మంగళవతి కామాంబన్"

ఇందువలన గోపన్నకవి తల్లి కామాంబ యనియుఁ దండ్రి లింగన్న యనియు స్పష్టముగఁ దెలియుచున్నది. ఇతఁ డక్కన మాదన్న గార్ల మేనల్లుఁడైన ట్లీ క్రిందివాక్యములు చెప్పుచున్నవి.

"తో. హరా. చని చూచిరి గోల్కొండలక్కనున చయ్యన మంత్రులు గృహము
కనుగొని యిట్లని పల్కెను గోపన కావలివారలతోను.

గీ. నేలకొండపల్లె నివసించియుండుట। కరుణగలుగు తల్లి కామమ యగు
నమరఁ దండ్రి లింగనార్యుఁ డటందురు। నాదు పేరు గోపన యని యంద్రు

క. మామలు మంత్రులు నాకు। న్నేమచ్చిక జూడఁగోరి యిటువచ్చితి మా
మామల కెఱిగింపుండ। వేమరు నను వేడనిటకు వెసవచ్చి తనన్."

అని కావలివాఁడు మంత్రులతోఁ జెప్పఁగా "రాజ్యాంగ విషయ మంతనములనున్న" మంత్రు లీ మాటలు విని

"తో. హరా. తెప్పున లేచియు నెదురుగవచ్చిరి యప్పసుతుని జూడ
అప్పుడపరిమిత సంతోషంబునఁ గప్పినమోహముతోడ
వందనముల చేసిన తమ యల్లు నవార్యమైన కృపతోడన్
సుందరాంగరమ్యుని యక్కువ నరుదందఁ జేర్చి వగతోడన్."

పిమ్మట నామంత్రు లంతవఱకే చనిపోయిన తమ తోఁబుట్టువు మరణమున కీ విధముగా విచారించిరఁట!

"మ. ధనధాన్యంబులు సర్వసంపదలు నిత్యంబై రమాలోలుఁ డి
చ్చిన భోగింపక సర్వము న్విడిచి సంశీలాత్మ వయ్యె న్నము
న్ఘనదుఃఖంబున ముంచి నీవరగితే కామమ్మ యేమమ్మ నీ
తనయుం జూడవు మమ్ము బ్రోవ విది యేధర్మంబుగా నెంచితో
జనయిత్రీ సమతోడు బాసితిగదే సంపూర్ణచందానినా!"

గోపన్న చెరనుండి బయటికిరాక మరణించినట్లు జిల్లామాన్యులులో నున్నట్లు శ్రీ బ్రహ్మయ్యపంతులువారు సెలవిచ్చిరి. అట్టివారి కీ క్రింది శాసనమును దానిపై నభిప్రాయము వ్రాసిన శ్రీ గురుబ్రహ్మశర్మగారివాక్యములును సందేహనివృత్తి నీయఁగల వని యీభాగము లుదాహరించు చున్నాను.

## (1) శాసనము.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవషన్ంబులు ౧౫౭౪ అగు నేటి వర్త్తమాన వ్యవహారిక చాంద్రమాన నందన నామసంవత్సర చైత్ర శు ౯ లు భానువారం శ్రీభద్రాచల సీతారామచంద్ర మహాప్రభువువారి సన్నిధిని — శ్రీరామదాసుగారు శ్రీతానీషాగారి యనుమతి వెంబడిని జరిగించిన దేవబ్రాహ్మణ వృత్తులు, శ్రీవారి సన్నిధని జరగే వుత్సవ ప్రకరణములు వ్రాసియున్న శాసనం—ధంసా ప్రపంచములో శ్రీవారు పోల వరం వలస వేంచేసినప్పుడు ఒక దుర్మార్గుడు శాసనం చెక్కి వేసినందున సర్వ జనులకు తెలిసి సంతోషించేటందుకు లేకపోగా, ఆ దుర్మార్గుడు పుత్రమిత్ర కళత్రాదులతోటి నశించిపోయినాడు. తదనంతరము శాలివాహన శకవ షన్ంబులు అగునేటి ౧౭౫౪ నందననామసంవత్సర చైత్ర శు ౯ ఇందు వారము భద్రగిరివరద రామదాసు అనే రామదాసుహంశమున జన్మించిన భక్తుడు కాంచీనగరమునుండి శ్రీభద్రాద్రికి వచ్చి తనకు తన భార్యకు గల సకల ఆభరణములు, ధనము శ్రీవారికి అర్పణజేసి, ఆయన తల్లియైన గంగమ్మ యనే మహాభాగ్యవతి యనుమతివెంబడి ఆత్మకుటుంబముతోడ హాదాసులై స్త్రీలు సమ్మార్జన కైంకర్యమున్నూ, పురుషులు భోజనము మొదలైన సేవాదులున్నూ, జరిగిస్తూయుండగా శ్రీవారు నాసరుద్దౌలానారి నవాబుగిరిలో చందులాలా అనే భగవదంశ సంభూతుడికి స్వప్నమందున దర్శనం కృపజేసి వరద రామదాసు రామదాసు గారి హంశయనిన్ని, హస సాబాదు పరగణా శ్రీవారి మోహరుతోటి వరద రామదాసు దస్కతు

త్రోటి అమలు జరిగించవలసినదనిన్ని, అదివఱకు దుర్మార్గులు పరిపంచ పరిపాలన చేయుటచేతను దేవబ్రాహ్మణవృత్తులు నిరాటంకముగ జరుగుట లేనందున అవి విమర్శముగా జరిగించవలసినదనిన్ని ఆజ్ఞ యిచ్చినందున చందులాలా అనే భగవదంశ సంభూతుండు అతిభక్తియుక్తుడై భగవదాజ్ఞప్రికారము దేవ బ్రాహ్మణ అగ్రహారాలు, వృత్తులు, రుసుములు, నజర్లు మొదలయినవిగాక అమానిగ్రామాదులు ౫౫, దవబస్తాలు ౯౧ నాయరున్ను శివాయబాపతుల తోకూడ ౮౧ డెబ్బదియొక్కవెయ్యి చెలామణిరూపాయలు హసనాబాదు పరగణారకం యేర్పఱచి అందులకుగా ౩౨ వేలు సర్కారుకు నగదు చెల్లించేలాగునన్ను, ౧౦౦ జనం సిబ్బందితోపు శ్రీవారి సన్నిధిలో పయివారికుండేలాగునన్ను, శ్రీవారికి ౫౦౦౦ వేల రూపాయలు ప్రితిసంవత్సరం జీతాలు యిచ్చేలాగునన్ను ౧౦౫౦౦ శ్రీవారి కైంకర్యముక్రింద జరిగేటట్టుగాను ౧౨౫౦౦ సాదరుసిబ్బంది దరబారు వ్రియం నిమిత్తంగాను నిర్ణయముచేసి అమలు వరద రామదాసు పరంచేసినారు. గనుక భగవదనుగ్రిహపాత్రుడైన రాజా తూము లక్ష్మి నరసింహదాసున్ను, వరదరామదాసున్ను, శ్రీవారి ప్రేరణ వెంబడి హసనాబాదుపరగణాలో నుండే దేవ బ్రాహ్మణవృత్తులు, అగ్రహారములు విమర్శించి సర్వదుంబాలా జరుగగలందులకు యేర్పాటుచేసిన వివరము.—

## (2) లేఖ

"ఆర్యవర్యా! నమస్కారములు. నర్సారావుపేట.
2—8—22.

ఈ శాసనము భద్రాద్రిలో రాముల కోవెలకు దక్షిణదిశను నిలువు రాళ్ళమీద చెక్కబడియున్నది. దీనిని 80—90 యేండ్లక్రిందట చెక్కించినట్టు కనుపడుచున్నది. ఇందు వదలినభాగమంతయు అగ్రహారములు, వృత్తులు వుత్సవాదులు మొదలైనవి కలది. అనవసరమని వ్రాయలేదు. రామదాసుగారు ప్రథమమున వేయించిన శాసనము నెవరో చెక్కివేయగా ఆసంగతులు తెలియుటకై తిరిగి వేయించినట్టు వ్రాయబడినది. ఇందువలన రామదాసుగారు ఖైదులోనే మృతినొందక తిరిగి వచ్చి స్వామిని సేవించినట్లు చరిత్రలో వ్రాయబడినరీతినే కనుపట్టును. అక్కన్న మాదన్నలను ఔరంగజేబు

A. D. 1685—29 అక్టోబరున చంపించెనని ఎపిగ్రఫీ జీ. ఓ. లను పగయి రాలను బట్టి కనుపడును. ఈ శాసనకాలము 1574 or A. D. 1652 దీని దాని మధ్య 33 యేండ్ల వ్యత్యయముగలదు. పూర్వము రామదాసుగారు వేయించిన శిలాశాసనము కూడా ఆలయమందు పడియున్నది. కాని అది దృగ్గోచరము. ఈ శాసనములో ౧౫౫౪ నందన అని కనుపట్టుచున్నది. దీనిని అచ్చువేయించి అమ్ముచున్నవారు ౧౫౭౪ అని వ్రాసిరి. రెండవది నందనకు సరిపోవుచున్నది. చెక్కడములో "౭ బదులు ౫" వలె చెక్కియుందురు. అచ్చువేసినవారు రామావఝుల రామశాస్త్రి, పాడిచేటి సీతారామానుజాచార్యులుగారు. భద్రాచలం. కిమ్మతు 0—1—0. వారు వేయించిన అచ్చుకాపీలో చాలా తప్పులు కలవు. నేను రాతితో సరిచూచి నా కాపీ సవరించుకున్నాను.

(Sd) మద్దాల గురుబ్రహ్మశర్మ."

ఇట్లీతని చరిత్రము ముగించినపిమ్మట గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా పెదకంచర్ల, పిచ్చికలపాలెం, యేనుగుపాలెం వగైరా గ్రామములనుండి రామదాసు తమపూర్వుఁడని కాణ్వశాఖీయు లగు 18గురు కంచెర్లవారు వ్రాలు చేసి ప్రమాణపత్రిక నొకదానినిఁ బంపిరి. అందు రామదాసు ప్రథమశాఖవాఁడని వారి యభిప్రాయముగా వ్రాసిరి.

ఇదినటుకే యీతని చరిత్ర మధిక మగుట నింతతో ముగించుచున్నాను. రామభక్తిలో నీతఁ డాంధ్రులకుఁ జైతన్యునివంటివాఁడు.

---

# గద్దె రామలింగకవి

ఇతఁడు భీమవరముతాలూకాలోని బొండాడ గ్రామవాసిగాఁ గనఁబడుచున్నాడు. పరమేశ్వరభక్తులైన గద్దె పంచాక్షరి యను సాధ్వికిని, ఆగమవేత్త యగు నాగయ్యకును బుత్రుఁడు. తండ్రి మరణానంతరమే కవి యీ చోడలింగశతకము వ్రాసెను. ఈ శతకమునకుఁ బరవాదిగజాంకుశ మని నామాంతర ముంచెను. ఇందు సమస్త దేవతలు, దశావతారములు, మొదలగువా రందఱు శివునిఁ బూజించినట్లు నిదర్శనములు వృత్తములుగా వ్రాసి చోడలింగని కంకితము చేసి యున్నాఁడు. కృష్ణామండలము నందలి ఎర్నగూడెము తాలూకా ముఖ్యనగరమగు కోపూరు (గోపాదక్షేత్రము) నందొక చోడలింగము కలదు. చోళుఁడు స్థాపించిన లింగము చోడలింగమయి యుండును. కణ్వుఁడు, అగస్త్యుఁడు, సీత, బౌద్ధావతారము, స్థాపించిన లింగములు క్రమముగా కణ్వలింగము, అగస్త్యలింగము, సీతలింగము, బౌద్ధలింగము నైనవి. కణ్వాగస్త్యలింగములపై వేర్వేఱుకవులు వ్రాసిన శతకములుకూడఁ గలవు.

ఈతఁడు తనశతకములో 14 వ పద్యమున బొండాడ వాసుఁడ ననియు, 15వ పద్యమునఁ దలితండ్రులనామములను వివరించెను.

ఉ. దక్షతజంగమార్చన విధానము నాది పురాతనక్రియల్
యీక్షితిలోనఁ జేసి పరమేశ్వరసేవకులైన గద్దె పం
చాక్షరి పుణ్యసాధ్వి ప్రియుఁ డాగమవేత్తగు నాగభర్తుఁ డ
మ్మోక్షనివాసి నిత్యునకుఁ బుత్రుఁడు రామయలింగ మైనవాఁ
డక్షయకావ్యపుష్ప మహిమార్పణ చేసెను (?)చోడలింగమా. 15

ఇతఁడు (2)వ పద్యమునందు "నా గురుఁడగు సిద్ధరామ శివుఁ గొల్చి రచించెద" ననియు (3)వ పద్యమున "ముమ్మిడి సిద్ధరామగురుమూర్తివి నీవని శంభులింగ నే నమ్మికతోడ నీదుచరణంబులపై నుతిసేయఁబూనితిన్" అనియు గురువర్ణన మొనరించెను. ఈ సిద్ధరాముఁడు ప్రాచీనశివభక్తుఁడో మఱియొకఁడో తెలియదు. గురువును శివరూపముగాఁ జెప్పుటచే నీతఁడు సరిగ సిద్ధరాముని కాలమువాఁడు కానక్కఱలేదు. శైవులు గురువులు మరణించిన నాలుగైదువందల యేండ్లకుఁ బూర్వులైనవారినిఁ గూడ గురువు లని భావించి వర్ణించుట కలదు. కొన్నిపద్యములఁ జూపెదను. ఇతఁడు "పదుగు రాడుమాట పాటియగు" మొదలగు ప్రసిద్ధవాక్యముల రచించియున్నాఁడు. కొన్నిశ్రుతివాక్యము లున్నవి. శ్రీపతి, పండితమల్లికార్జున, కరికాలుఁడు, మొదలగు ప్రసిద్ధశైవుల వర్ణించియున్నాఁడు. ఇతఁడు నా జన్మస్థానమగు తణుకుతాలూకా "సిద్ధాంతము గ్రామము"నం దున్న సీతలింగేశ్వరుని, తణుకు తాలూకాలోఁ బారుచున్న "గోస్తనది"ని గూడఁ బ్రశంసించుటచే నీతఁడు భీమవరము తాలూకా "బొండాడ"వాసి

యగుట సత్యమే కావచ్చును. ఈ సీతలింగము మా గ్రామములో నున్నది.*

(ఓరియింటల్ లైబ్రరీ చూడుడు.)

ఉ. కంతుహరుండు సేతువునఁ గల్గను గౌతమితీరమందు సి
ద్ధాంతపురంబులోన నిను దైవమటంచును సీత దామనో
భ్యంతరవీధిఁ గొల్చె మనసారను మీఘనపాదపద్మముల్
వింతఁగ సీతలింగ మన విశ్వములోపల చోడలింగమా. 115

చ. ఎడపక మిమ్ముఁ గొల్చినను నీప్సితవస్తువు లెల్ల నిచ్చు పు
ణ్యుఁ డవని సప్తకోటిమును లొప్పుగ గోస్తనితీరమున్ నదీ
బుడమిని దక్షవాటికను పొల్పుగఁ గొల్చిరి మీపదాం(బుజా)
ల్విడువక సప్తకోటి శివలింగ మటంచును చోడ|| 138

ఉ. శ్రీకరకంఠ దేవ సరసీరుహసంభవ పూజితాంఘ్రి నే
లోకహితంబుగాను మదిలోపల నీపదపద్మయుగ్మముల్
శ్రీకరమైన కార్యఘనశీతల మీన భజింతు నెప్పుడున్
జేకొని సిద్ధరామ గురుశేఖరుఁ డంచును చోడలింగమా. 1

"నాగురుఁడగు సిద్ధరామ శివుఁ గొల్చి రచించెద" 2

"ముమ్మడి సిద్ధరామగురుమూర్తివి నీవని శంభులింగ నే
నమ్మికతోడ నీదుచరణంబులపై నుతిసేయఁబూనితిన్." 3

ఉ. జంగమపాదతీర్థ ఘనసాగరమగ్నుఁడు లింగమూర్తి త
జ్జంగమ మంచు గొల్చుచును సంగయదేవుని శిష్యరత్నమై
జంగమకోరికల్ నొసఁగు సమ్మతితో బసవేశమూర్తి నా
లింగమటంచు గొల్చి కృతి లీలరచించెద చోడలింగమా. 4

---

* తణుకు తాలూకా సిద్ధాంతము గ్రామము వసిష్ఠ (గోదావరీశాఖ) యొడ్డున నున్నది. అచ్చటి సీతలింగము చాలప్రాచీనమైనది. సిద్ధాంతము శైక్షియతు. (13-2-26)

చ. వరుస పురాతనయ్యలను వర్ణనఁజేసి కవిత్వసిద్ధికిన్
దురితవిదూరుఁడైన కవి దుష్టవిరోధి యనుంగమించి నా
శరణుఁడు వీర శైవుఁడగు జంగమతీర్థప్రసాదభోగి పా
ల్కురికి ఘనుండు సోమగురు గొల్చి రచించెద చోడలింగమా. 5

ఉ. పంచముఖుండు దైవ మని పాటిగ నందుకుఁ బ్రత్యయంబు చూ
పించెద నంచు వైష్ణవులుఁ బేర్కొని చూడ మహాద్భుతంబుగా
సంచితమైన కాశిపురి శంభుపదాబ్జము విష్ణుఫాలమం
దుంచిన పండితేశ్వరుని యొప్పుగ మెచ్చిన చోడలింగమా. 10

ఉ. వరుసను విన్నవింతు పరవాదిగజాంకుశ మంచు కావ్య మి
ద్ధరను బ్రసిద్ధిగాను నిరంతంబును ముక్తికి మూలమైన సు
స్థిరముగ వేదశాస్త్రములు చెప్పినపద్ధతి నాంధ్రభాష నే
వరకృతిగాను సత్కవుల వర్ణనఁజేసెద చోడలింగమా. 18

"పదుగురిమాటపాటియు" అని సామెత నడుమ శ్రుతివాక్యములు కలవు. 19

ఉ. శ్రీపతి బౌద్ధవేషమును జేకొని పుట్టు నిరంతరంబు వా
ణీపతి సేవితుండ నిను నెమ్మది భక్తిమహత్వరూఢిచే
ప్రాపుగ బౌద్ధలింగ మని పర్వతమందుననిల్చి కొల్చి దే
వా పరిశుద్ధయోగ మునివంద్య శరణ్యము చోడలింగమా. 111

ఉ. కోరిక లేమి నొల్ల నినుఁగొల్చిన భక్తుల బంటు బంటుగాఁ
జేరి నిరంతరంబు నిజసేవ యొనర్పఁగఁ జేసినాతలన్
శ్రీరమణీయహస్త సరసీరుహ మేర్పడ నుంచి ప్రోవు మా
కోరిక లింతె చాలు ఘనగోపతివాహన చోడలింగమా! 150

బొండాడదాసుఁడగు "బంధుర రామలింగపుత్ర విరచిత నగరేశశతకము" మఱియొకటి కూడఁ గనఁబడుచున్నది. సిద్ధరామలింగున కంకితము. ఇది బహుశః పై రామలింగకవి పుత్రునిశతక మై యుండును.

క. ప్రియభక్తులనుచు వైశ్యులు । ప్రియమునఁ బూజింప మీరు ప్రత్యక్షంబై
జయమైన వరములిచ్చితి । నయమున బొండాడనున్న నగరేశశివా! 112
(11-3-14 ఓ. లై.)

---

# శ్రీగిరి విరూపాక్షుఁడు

ఈతఁడు కాళహస్తిలింగశతక మను సీసపద్యశతకమును వ్రాసియుండెను. ఇది బ్రౌనుదొరగారికాలమునందే ముద్రింపఁబడుటయేగాక రమారమి 200 సంవత్సరముల క్రితమే వ్రాసిన తాళపత్రప్రతులు దొరకుచున్నవి. ఇతఁ డెప్పటివాఁడో సరిగఁ దెలియదు. కాని చాలప్రాచీనుఁడై యుండవచ్చును. కాళహస్తీశ్వరునిపై (1) ధూర్జటి "శ్రీకాళహస్తీశ్వరా!" అను మకుటము గల శతకము, (2) బాణాల వీరశరభేంద్రుని "సాంబశివా! మహాప్రభో" యను మకుటము గల శతకము (3) "శ్రీకాళహస్తిలింగ" యను మకుటము గల యీ శతకమును (4) బొడ్డపాటి కొండయ తిరుకాళహస్తిలింగశతకమును ప్రాచీనములు కనఁబడుచున్నవి. ఈతని శతకమునందు వేమన్న పోలిక లున్నవి. కొన్నిపద్యములు వేణుగోపాల, నరసింహ, కుక్కుటేశ్వరశతకములఁ బోలి యున్నవి. ఉత్తమాధమక్షత్రియులగుణముల వివరించెను. ఈతఁడు వీరశైవాచారము నుగ్గడించెను. శివభక్తి మంచి

దనెను. విష్ణువుపేరు తలపెట్టక పోలేదు. బమ్మెర పోతన్న పోలిక లున్న పద్యము లున్నవి. శైలి చాలమంచిది. ప్రతి పద్యమును రసవంతముగ నున్నది. కవిత హృద్యమైనది. "కులము గోదావరి కూలఁచేయు" నను సామెత వాడినందున నీతఁడు గోదావరి కృష్ణ మండలములవాఁడు కావచ్చును. ఇది సిద్ధాంతము కాదు, సందేహము. ఈతనికాలము సరిగఁ దెలియదు. వ్రాఁతప్రతులనుబట్టి క్రీ॥ శ॥ 1700 కుఁ బూర్వుఁడు కావచ్చును. ముద్రితశతకములలో నీతని పేరున్న కడపటిపద్యము లేదు. *ఇటీవలఁ గనఁబడినందున నీశతకకర్త పేరు మనకుఁ దెలియుచున్నది. ఆపద్య మిది:—

సీ. శంకర త్రైలోక్యశంకర యోంకార కేశవప్రియ వియత్కేశవేశ 1
భూతేశ నిఖిల వి 2 భూతేశ గౌరీశ యఖిలసమగ్రాగ్ర యనుపమాగ్ర 3
పురవైరిసన్నుత గిరివైరి మదనారి శూలి దయాశాలి సుప్రశీల
దేవపల్లవ 4 వామదేవ మహాదేవ పావన శ్రీగిరి పాపవిభుని.

గీ. యాత్మజాతుండ విరూపాక్షాహ్వయుండ
చెలఁగి చెప్పితి గైకొమ్ము సీసశతము
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ శ్రీకాళహస్తిలింగ!

---

* శ్రీనుదొరగారు ముద్రించిన ప్రతిలో 100 వ దగు నీపద్యము సంపూర్ణముగ లేదు. కొన్ని మార్పులున్నవి. వారి పండితు లది దిద్దియుందురు.— వ్రాఁతయచ్చుప్రతి చూడుఁడు. "ఖండనారాతిరామ కోదండరామ" పద్యములతో ముద్రించిరి.

(1) నేయభువనగేయ; (2) సంభూతేశ; (3) యఖిలసమదోగ్ర మూర్ధ్యనుపమూర్ధ; (4) వల్లభ; 13-7-7 ప్రకారము పాఠభేదములు వ్రాసితిని.

ఈ పద్యము (అడయారు 32థ్ 8-9) ప్రతిలోను; (2) ప్రాచ్యలిఖితాగారము (15-7-7) లోను; (3) ప్రాచ్యలిఖితాగారము (11-2-26) లోను; మూఁడు ప్రతులలోఁ గనఁబడుచున్నందున నీ శతకకర్త శ్రీగిరి పాపరాజుకొడుకగు విరూపాక్షుఁ డగుట సుస్పష్ట మగుచున్నది.

శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## కాళహస్తిలింగ శతకము.

సీ. ధనవంతుఁడై యుక్తదానహీనుండైన
నరునివర్తనఁజూచి నగును ధనము
తనయునిఁ బ్రేమతోఁ దండ్రిముద్దాడంగఁ
జూచినవ్వును జారసుదతి మదిని
అవని నాయదియని యనిశంబు గర్వించు
ధారుణీపతిఁజూచి ధరణి నగును
వెన్నిచ్చి రణరంగ విముఖుఁడై చనువాని
నలి మృత్యు వెంతయు నవ్వుఁగాన
లోభితనమున నిందకు లోనుగాక
మెలఁగ నేర్చిన నరునకుఁ గలుగుశుభము
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ!. 6

సీ. తనయుపైఁగలభక్తి తల్లిదండ్రులమీఁదఁ
గలుగ నేర దదేమి కారణంబొ?.
ఇంతిపైఁ గల ప్రేమ యిష్టదైవముమీఁద
లేదు నరుల కెట్టి లిఖితఫలమొ?
ధనముపైఁగల బాళి ధర్మమార్గములందుఁ
దలఁపఁగూడ దదెట్టి దైవఫలమొ?

తనప్రాణములమాడ్కి ధరణిజీవుల నెల్లఁ
గలయఁజూడ రదేమి కర్మఫలమొ?
సరసిజాసనుఁ డీ రీతి సర్వజనుల
మోహజలరాశిలో సదా మునుఁగఁజేయు
ప్రణుత ధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ! 8

సీ. కొంతకాలము తల్లి కుక్షిలోఁబిండమై
మలమూత్రముల యందు మ్రగ్గియుండు
జనియించి యొకకొన్ని సంవత్సరంబులు
బాలుఁడై యవివేక లీలనుండు
మదనభూతముసోకి మఱికొన్నిదినములు
సతులతో రతికేళి సల్పుచుండు
పుత్రీమణంబునఁ బొరి పొరి కొన్నాళ్ళు
కడలేనిభ్రాంతిచేఁ గడుమునింగి
వార్థకంబునఁ గడుడస్సి వడఁకుచుండు
నిట్లు విహరించునరుఁడు మిమ్మెట్లు తెలియు
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ! 14

సీ॥ సర్వసర్వం సహాచక్ర మేలిన హరి
శ్చంద్ర భూవిభుఁగూడి చనదు వసుధ
చోరవిగ్రహ దురాచారవారితుఁడైన
పురుకుత్సుతోఁగూడి పోదు నేన
శత్రుదానవలోక సంహారుఁడైనట్టి
రామునితోఁబోదు దోక రత్నమైన
నీతిధర్మజ్ఞాన నిపుణుఁడై యిలనేలు
ధర్మజుతోఁ గొంత ధనముపోదు
తానుఁజేసిన ధర్మంబు తగిలివెంట
పయనమైవచ్చుఁ దక్కువి పనికిరావు

ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ! 15

సీ॥ వెన్నిచ్చి రణరంగవిముఖుఁడై చనువాని
నిర్విణ్ణుఁడై మ్రోల నిలుచువాని
భ్రమసి కైదువుచేతఁ బట్టకుండెడివానిఁ
జెట్టెక్కి భయమునఁ జిక్కువాని
పొదలిన భీతిమై పుట్ట యెక్కినవాని
నురిక్కుజలంబులోఁ జిక్కువాని,
క్రిందుగా శవములక్రింద దాఁగినవాని
నుర్విపైఁ బ్రణమిల్లి యున్నవాని
భయమువారించి రక్షింపఁ బాడిగాక
చంపఁజెల్లదు శూరులు సమరమునను
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ! 26

సీ॥ బలవంతుఁడై వైరి బలముల సాధించి
గడిదుర్గములనెల్ల ఘనుల నునిచి
జారతస్కర దురాచారుల శిక్షించి
మహి గుట్రమన్నీల మట్టుపఱచి
ఘోటక భటవీర కుంజరంబులఁ గూర్చి
బలిమి నానాఁటికి ప్రబలఁజేసి
మున్ను చేసిన ధర్మముల వృద్ధిఁబొందించి
పేదసాదల నెల్ల నాదరించి
జగతిఁ బాలించు నుత్తమక్షత్రియుండు
విపులవిఖ్యాతకీర్తిచే వెలయుదిశల
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ! 28

# కాకునూరి అప్పకవి



ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. క్రీ॥ శ॥ 1660 ప్రాంతమున నున్నవాఁడు. ఈతని గ్రంథ మొక రాజకవి వ్రాసిన లాక్షణికగ్రంథమునకుఁ బ్రతి యని శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు ప్రథమసంవత్సరాదిసంచిక యందు వ్రాసియున్నారు. శా॥ శ॥ 1578 మన్మథనామసంవత్సరమునఁ గృష్ణాష్టమినాఁడు ప్రక్రియాకౌముది యను నన్నయభట్టీయమును కామెపల్లెదేవాలయములో భగవదాజ్ఞనుఁ బురస్కరించుకొని వ్యాఖ్యాన మొనరింప సంకల్పించెను. ఇతఁ డాపస్తంబసూత్రుఁడు. ఇతఁడు రచియించిన గ్రంథములు ఆపస్తంబశాఖోక్తషట్కర్మపద్ధతిఖండనిబంధనము, కాలశాలార్ణవ మను జ్యోతిషగ్రంథము, అనంతవ్రతకల్పము, కవికల్పక మను లక్షణగ్రంథము, సాధ్వీజనధర్మ మను ద్విపదకావ్యము, అంబికావాద మను యక్షగానము మొదలగునవి. ఇవిగాక "శ్రీనగాధీశ శతకము"నుఁగూడ వ్రాసెను. ఇవి సీసపద్యములు, శ్లేషాలంకారయుతములు, నిందాస్తుతి భావగర్భితములు. ఈతని లక్షణము తరువాత కవులకుఁ బఠనీయగ్రంథమై ప్రబంధకర్తలస్వాతంత్ర్యమునకు సువర్ణ శృంఖలమైపోయినది. ఇతని శతక మిప్పుడు దొరకుటలేదు. కావున శైలికిఁ బద్యము లీయలేకపోయితిని. అప్పకవీయము తప్ప యితని యితరగ్రంథము లేవియుఁ జిక్కుటలేదు.

---

శ్రీరస్తు

# శతక కవుల చరిత్రము

## తృతీయ భాగము

(క్రీ॥ శ॥ 1700—1800)

---

## కూచిమంచి తిమ్మకవి

ఈతఁడు రసికజనమనోభిరామము, నీలాసుందరీపరిణయము, సర్వవరమాహాత్మ్యము, భిల్హాణరాజచరిత్రము, రుక్మిణీపరిణయము, శివలీలావిలాసము మున్నగు ప్రబంధములును, సర్వలక్షణసారసంగ్రహమును, అనేక చాటుకృతులును, వ్రాసి కవులచరిత్రకెక్కియున్నాఁడు. ఈతని సారంగధర చరిత్ర మిటీవల దొరికినది. దానినిఁగూర్చి సుదర్శనీ పత్రిక 15-5-1918; 1-6-1918 లో నీక్రింది విధముగ వ్రాసియున్నాను:—

"ఈతఁడు పిఠాపురపరిసరముల నున్న కందరాడ గ్రామకరణము. ఈతఁడు రసికజనమనోభిరామాది పెక్కు గ్రంథములు రచియించి యుండెను. సర్వలక్షణసారసంగ్రహమను లక్షణగ్రంథ మొండు రచించెను. ఈతఁ డాకాలమునం

దున్న గొప్ప పండితకవులలో నొకఁడు. ఈ విషయము లన్నియుఁ గవి చరిత్రాదులవలనఁ బాఠకు లెఱిఁగియున్న విషయమే!

ఈతని రసికజనమనోభిరామము, నీలాసుందరీపరిణయము, సర్వవరమాహాత్మ్యము, కుక్కుటేశ్వరశతకము, శివలీలావిలాసము, రుక్మిణీపరిణయము మున్నగు గ్రంథము లన్నియు ముద్రింపఁబడినవి. ఈతని గ్రంథపీఠికలవలన నీతఁడింకఁ గొన్నిగ్రంథములు వ్రాసియున్నట్లు తెలియుచున్నది. కాని యవి యేరికినిఁ జిక్కినట్లు తెలియదు. ఈ నడుమ నాంధ్రపరిశోధక మహామండలికి శ్రీ చాగంటి సుబ్బారాయుఁడు (కరపకరణము) గా రీతని సారంగధరచారిత్రమును దీసికొని వచ్చిరి. అది నూతనగ్రంథమని పరిశీలించి చూచితిని. ఇది రెండాశ్వాసముల ద్విపద కావ్యము. ఇందు నూతనచరిత్రాంశములును గలవు. గ్రంథము శివునకుఁ గృతియీయఁబడినది. ఇవిగో! గ్రంథభాగములఁ జదువుఁడు. దీనిని జిన్న గ్రంథమని కవులచరిత్రము చెప్పుచునేయున్నది.

గ్రంథారంభము.

"ద్వి॥ శ్రీకరగుణసార చిరశుభాకార, నాకధునీజార నవసుకుమార
యలఘుతేజోనిధియగు చెందులూరి, కులు లింగనారాధ్యగురుని నుతించి
తలఁపున సారంగధరచరితంబు తెలుఁగున ద్విపదగాఁ దివిరియొనర్చు."

అని యున్నది. సారంగధర చరిత్రము వ్రాసిన ట్లీతని యితర గ్రంథములవలనఁ దెలియుచున్నను, గ్రంథ మీావఱకుఁ జిక్కియుండ లేదు. తిమ్మకవి ద్విపద కావ్యములఁ గూడ రచించినందుల కిది నిదర్శనము. ద్విరేఫదర్పణమునం దుదాహరింపఁబడిన యొక ద్విపదమాత్ర మీావఱకుఁ గాన్పించు చున్నది.

గ్రంథము నందలి యీా క్రిందిభాగమువలన నీతని విషయ మగు క్రొత్తవిషయములు కొన్ని తెలియుచున్నవి. ఈతఁ డిదివఱకుఁ దన రసికజనమనోభిరామములోఁ గవిసార్వభౌమబిరుదము మాధవరావుగారివలన నందినట్లు చెప్పి కొనియున్నాఁడు. దాని ననుసరించి శ్రీవీరేశలింగముపంతులువారు కవులచరిత్రమున నావిషయము వ్రాసి యున్నారు.

క్రీ॥ శ॥ 1704లోఁ బెద్దమాధవరావుగారును, క్రీ॥ శ॥ 1759 లో చిన్న మాధవరావుగారు నున్నారు. ఈ నడుమ నార్గురు ప్రభువులు పిఠాపురమును బరిపాలించిరి. పెద్ద మాధవరావుగారి కాలమున యువకుఁడుగను, చిన్న మాధవరావుగారి కాలమునకు వృద్ధుఁడుగను మనకవి యున్నట్లు తలంప వలసియున్నది.

కవి వ్రాసిన గ్రంథములును, వానిలోఁ గవి వేసిన కాలములను బరిశీలింపుఁడు.

| | శా॥ శ॥ | క్రీ॥ శ॥ |
|---|---|---|
| (1) రుక్మిణీపరిణయము 'అచ్చిగుణాంగ చంద్రులఁ' | 1637 | 1715 |

(2) సారంగధరచరిత్రము,

శా॥ శ॥ వెయ్యార్నూట ఏఁబదియొకటి. 1651 1729

(3) సర్వలక్షణసారసంగ్రహము. 'కరరసాంగశశి'1662 1740

(4) రసికజన మనోభిరామము, 'కరగిరిరసభూ' 1672 1750

(5) సర్వపురమాహాత్మ్యము } 1753
(6) శివలీలావిలాసము }

కావున నీ కవి కవిసార్వభౌమబిరుదము వృద్ధత్వమున నీలాద్రిరాయణింగారి మనుమఁ డగు చినమాధవరాయణింగారివలననే పొందియుండె నని నిర్ణయింపవలసి యున్నది. అంతేకాని శ్రీ వీరేశలింగముపంతులుగారు తలంచినట్లు రుక్మిణీపరిణయరచనాకాలమునాఁటి కున్న మాధవరాయణింగారిచే తనే తిమ్మకవి బిరుద మందలేదు. ఏమనఁగా రసికజనోభిరామము వ్రాయునప్పటికి మాధవరాయణింగారు మరణించుటయేగాక తరువాత నల్వురు ప్రభువులుకూడ గతించిరని తెలియుచున్నది. ఇదివఱకుఁ బిఠాపురసంస్థానచరిత్రమునందలి రాజపరిపాలన కాలమునకు, నీ కవి వ్రాసినకాలమునకు నించుక భేద మగుపడుచున్నది. కాని యది మిక్కిలి స్వల్పము. పరిశీలింపవచ్చును.

ఇక్కడ నొక్కవిషయము చెప్పవలసియున్నది. రసికజనమనోభిరామమునందుఁ జెప్పిన,

"సీ॥ గీ॥ రావు నీలాద్రి మాధవరాయనృపతి చేతఁగవిసార్వభౌమ విఖ్యాతి
బిరుద మందిన ఘనుండ."

అని చెప్పినచోట నీ బిరుద మిచ్చినవారు రుక్మిణీపరి ణయమునందున్న

"సీ.గీ. రాజమహేంద్రవర దుర్గరాజ్యభూరి। భారసంభరణాక్రాంత భాసమాన
రావు మాధవనృప పరిరక్షితంబు। భోగనికరంబు పీఠికాపురవరంబు."

అను పద్యమునందలి మాధవరావుగారు కారు. సంస్థానచరిత్రము ననుసరించి క్రీ॥ శ॥ 1750 నాఁటికి వేంకట కృష్ణారాయణింగారు ప్రభువులు. వీరు 1728 ల॥ 1759 వఱకుఁ బాలించిరి. వీరికిఁ బిమ్మట నీలాద్రిరాయణింగారి మనుమలగు చినమాధవరాయణింగారు 1759 లోఁ బరిపాలనమునకువచ్చిరి. 1759 లోఁ బరిపాలనమునకు వచ్చిన వీరు 1750 లో నున్న తిమ్మకవికి, అనఁగా రసికజనమనోభిరామమునాఁటికి బిరుద మిచ్చుట యెట్లు? దీనినిబట్టి రసికజనమనోభిరామము నాటికి నీలాద్రి మాధవరాయణింగారుకాని, చినమాధవరాయణింగారుకాని తిమ్మకవికి బిరుద మిచ్చియున్నను వారు పిఠాపురము పరిపాలించుటలేదనవలసియున్నది. కాని కవియే పై సీసపద్యమున "పీఠపురప్రాజ్యరాజ్యాధిపత్య విరాజమాన భూరి వైభవుఁడు" అని నీలాద్రిమాధవరాయణింగారికి విశేషముగాఁ జెప్పియున్నాఁడు. దీనినిఁబట్టి పెద్దమాధవరాయణింగారే బిరుదమిచ్చియుండిరని తలంపవలసి వచ్చుచున్నది. ఆయన నీలాద్రిమాధవరాయణింగారగుదురా? పరిశీలింపవలసియున్న దనుట యిందులకే. నీలాద్రిరాయణింగారి తరువాత

మాధవరాయణిం గారైనచో చిన్నమాధవరాయణింగారే బిరుద మిచ్చి రనుట నిర్వివాదాంశము. ఇది చరిత్రజ్ఞులగు పెద్దల నిర్ణయమునకు విడిచిపూఁతము.

ఇదివఱకు సారంగధర చరిత్రము చేమకూర వేంకటకవి రచియించినట్లు ముద్రింపఁబడిన దొకటి కన్పట్టుచున్నది. చేమకూరి అప్పయ్య సారంగధరచరిత్రము ననుసరించి, బాణాల శంభుదాసుఁడు తాను ద్విపదకావ్యముగ వ్రాసితి నని చెప్పుచున్నాఁడు. కర్త పేరులేని సారంగధరద్విపదకావ్య మొండు కాన్పించుచున్నది.

మాళవాధిపతి యగు రాజరాజనరేంద్రుఁ డను తప్పు పాఠము ననుసరించి ప్రసిద్ధకవులు వ్రాసిన సారంగధరచరిత్రము లేదని యాకథయే కల్పిత మనుకొను కొందఱు విద్యాధికుల కీ గ్రంథము కొంత సత్యమును వెల్లడింపకపో దని తలంచుచు న్నాను.

అనేక వీరగీతములుగను (Ballads) ప్రబంధ ద్విపద కావ్య, యక్షగానరూపములను, పంచములయందుఁ గూడఁ జిరకాలమునుండి వ్యాపించి, సారంగధరునిమెట్ట మొదలగు స్థలచిహ్నములు గూడఁ గలిగియున్న యీ కథ సత్యమే యని స్థాపించుట కీ కావ్యము ప్రబల సాక్ష్యము కావలసిన యవసరము లేకపోయినను ప్రసిద్ధకవి యగు తిమ్మకవి యాధు నికుఁడైనను, ఆతని వ్రాఁతలయందు విమలాదిత్య వంశవర్ధను

డని చెప్పిన రాజరాజుగాథలు తిమ్మకవినాఁటి కెట్లు ప్రచారమునందున్నది తెలిసికొనుటకైన నిది యాధారము కాఁగలదని నమ్ముచున్నాను. *కవి రాజమహేంద్రవర్ణనము క్రొత్తమాదిరి నున్నది. కవి చూచి వర్ణించి యుండనోపును. భారతమునం దున్న రాజరాజవిషయములఁ బరిశీలించియే తిమ్మకవి వ్రాసెనో యేమొ! ఈ సారంగధరచరిత్రమునందు రాజరాజు విశేషములు నే చూచినంత వఱకు చరిత్రకు వ్యతిరేకముగ లేవు. కథ వేంకటకవికథ కనుసరణము. చిత్రాంగి వేశ్య. రాజు లందఱు శాసనములు వేయింపరు. వేయించిన వన్నియు మనకు దొరకవు. అందువలన శాసనాధారము లేని వృత్తాంతములు కావ్యరూపమున నుండినవియు, లేనివి జనశ్రుతిని బట్టియు నమ్మవలసియుండును. జనశ్రుతికి వ్యతిరేకమగు కావ్యములు, కావ్యములకు వ్యతిరేకమగు సత్యశాసనములును జిక్కువఱకు మన దేశచరిత్రమున నున్నది నమ్మనలెనే కాని కాదనుటకు వీలులేదు. అభూతకల్పనములు; అతిమానుషచర్యలుగల కథలయందాభాగములు విశ్వాసార్హములు కాకపోవచ్చును. కాని విషయమే యసత్యమనుట చరిత్ర సంప్రదాయశూన్య మగును. సారంగధరచరిత్ర మన

*గౌరనకవి నవనాథచరిత్రమునం దీకథ మాళవదేశమున జరిగినట్లును, రాజరాజు, చిత్రాంగి, సారంగధరు లక్కడ నున్నట్లును, కావున నీకథ రాజమహేంద్రవరమున జరుగ దనియు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారీ సంవత్సర మాంధ్రపత్రికలో వ్రాసిరి. కాని యనియే పైకథను ఖండింపలేము.

త్యమేమైనచో నింతకాలమునుండి వాడుకలో నుండదు. ఇన్ని గ్రంథములు పుట్టవు. మన పురాణములయందలి యద్భుత చర్యలు చరిత్రకాలమునఁగూడ నిజమైన కథలలోఁ గలియు చువచ్చినవి. అవి దేశమునందలి నమ్మకముమీఁద నాధారప డియున్నవి కావున మారినవి. సారంగధరచరిత్రమునందు మీననాథుని యోగబలముచే నొనర్చిన యవయవపునర్నిర్మా ణము తప్ప తక్కిన కథయంతయు స్వభావముగ నేకాలమునం దైన జరిగియుండవచ్చును. రాకొమరుఁడని యవిద్యావంతు లగు తలవరులకు లంచమిచ్చియో మఱియొక విధముననో మీననాథుఁడు సారంగధరుని నఱకకుండ రక్షించి, పిమ్మట నాతని యవయవము లతుకునట్లు చేసితి నని మీననాథుఁడు యుక్తిపన్నఁగూడదా? అదియుఁగాక యాకాలమునందు సిద్ధు లు కలరనియు, వారి కట్టి మంత్రబల ముండెడి దనియు జనుల యందు నమ్మకమున్నది. సారంగధరచరిత్రము చరిత్రమైనను దానియం దున్న మీననాథుని కథమాత్రము పురాణసంప్ర దాయము (Epic influence) కలిగియుంట, ప్రస్తుతము మన వా రాకథనే త్రోసివేయుచున్నారు. మన వేదపురాణముల నుండి కూడఁ జరిత్రమును సాధించి, యభూతకల్పనలను విడు వవలసిన దేశీయచరిత్రకారులు సారంగధరచరిత్ర మసత్యము నుట యన్యాయము. ఈ కథవలననే యాంధ్రశబ్దచింతామణి కూడ నన్నయది కాదనిరి. మహామహోపాధ్యాయుఁడై స్వయముగ ననేకాంధ్రగ్రంథములు రచించిన బాలసరస్వతిని

దొంగ యనిరి. 12 వ శతాబ్దమున సంపూర్ణమైన వ్యాకరణ మథర్వణకారిక లున్నవని వారే చెప్పుచు నంతకంటె ననేక విధముల హీనమగు చింతామణి బాలసరస్వతి కల్పించెననిరి. దీనికిఁ గారణ మప్పకవిమాటలు, సారంగధరునికిఁ గలసంబంధము. ఇందలి నిజము నిలుకడమీఁద లోకము గ్రహించును గాక!

ప్రస్తుత విషయము! సారంగధరచరిత్రము వ్రాయుసరికి శ్రీ వేంకటకృష్ణారావుగారు పీఠికాపురాధిపతు లని తెలియవచ్చుటవలన నీకవి బాల్యము శ్రీ పెద్దమాధవరావుగారి కాలమునను, ప్రౌఢవయస్సు శ్రీ వేంకటకృష్ణరాయణింగారి కాలమునను, వృద్ధత్వము చిన్నమాధవరావుగారి కాలమునను గడిపినట్లు తలంపవలసి యున్నది. ఏమనఁగా? ప్రభువుల పట్టికలో క్రీ॥ శ॥ 1704 మొదలు 1759 వఱకుఁ గలవారిలో (1) పెద్దమాధవరావుగారు (2) వేంకటకృష్ణారావుగారు (3) చిన్నమాధవరావుగారు నను ముగ్గురు ప్రభువు లున్నారు. కవి 1715 నాఁటికే రుక్మిణీపరిణయము వ్రాసియున్నాఁడు. కావున నీతఁడు జీవించియుండఁగా బీఠికాపురమున నాలుగురుప్రభువులు గతించినట్లు కన్పట్టుచున్నది. మొత్తముమీఁద నీతఁడు కందరాడ కరణమగుటచే ప్రభువులతో సంబంధము కలిగియుండె ననియే నమ్మవలసియున్నది. ఈతనికిఁ గవిసార్వభౌమ బిరుద మిచ్చినది చినమాధవరావుగారే యైయుండుదురు. ఈతఁడు శ్రీ వేంకటకృష్ణారావుగారి

కాలమున నీ సారంగధరచరిత్రము వ్రాసియుండెనను టకుఁ గల నిదర్శనమును దిలకింపుఁడు.

"ద్వి॥ కవితామహారాజ్య । ఘనధురంధరుని
సకలలక్షణలక్ష్య । సాహిత్యవిభుని
నకలంకగానవి । ద్యావిశారదుని
రావువేంకటకృష్ణ । రాయ విశ్వంభ
రావరపరిగుప్త । రాజన్య * * * (సభుని)
పరదేశభాగభా । స్వద్దివ్యపీన
ఘనమహారాజ్యవి । భూసాదుధూన
పావనకొండాద్రిడ । పట్టణాధిపుని॥"

అని వేంకటకృష్ణరాయప్రభువు పరిపాలనమునందలి కంద్రాడపట్టణమునకుఁ దా నధిపతి నని చెప్పుకొనియున్నాఁడు. ఆ కాలమున మంత్రికులము వారుగు కరణముల కట్టి ప్రభుత యుండెడిది. మఱియుఁ దన్నుఁగూర్చి చెప్పుకొనినభాగము.

"ద్వి॥ శైవకథారహ । స్యజ్ఞానవిధని
ఘనులు మెచ్చఁగ నసే । కప్రబంధంబు
లొనరించి విఖ్యాతి । నొందినఘనుని
తిమ్మసత్కవినాను । ధేయుని నన్ను"

ఇట్లు కవులు స్వవిషయము చెప్పుకొనుట ప్రాచీనాచారమే. కొందఱు కరణములు 'గ్రామవిభుఁడ' 'నగరశాసనుఁడ' నని చెప్పుకొనుటయు, నితరకవులు పిలుచుటయుఁ గూడఁ బ్రాచీనకావ్యములయందు సంప్రదాయసిద్ధమే. అది నేఁటి వారికిఁ గంటకముగ, సోత్కర్షగఁ గనబడకపోదు. కొందఱది డంబ మని గర్హించుచున్నారు. కాని కొంద ఱందు

సత్య మైన విభులున్నారు. వారు నిశ్చయముగ నాదినము లలోఁ బ్రభువులే! కృత్యాదికిఁ బిమ్మట గ్రంథమునఁ గ్రం థారంభ మిట్లొనర్చి యున్నాఁడు.

"ద్వి॥ వగపాంచనాన్వయ । వర్ధనుం డమల
తేజ మూర్తి విష్ణువ । ర్ధనసమాహ్వయుఁడు
రాజరాజనిలింప । రాజవైభవుఁడు
అతనిపట్టపురాణి । యలివల వేణి"

గ్రంథాంతమున గ్రంథరచనాకాల మిట్లు చెప్పుకొని యున్నాఁడు.

"ద్వి॥ అని యిట్లు శాలివా । హనశతాబ్దంబు
లెనయ వెయ్యార్నూట । యేఁబదియొక్క
టగు సౌమ్యనామమ । హావత్సరమునఁ
దగ మాఘబహుళ స । ప్తమియను దివిజ
గురువాసరమునకుఁ । గోదలేనిభక్తి
నిగవొందనఖిలలో । కేశ్వరు పేర
మహిఁతుఁ డుచితకూచి । మంచివంశాబ్ధి
తనయుండు తిమ్మ స । త్కవి రచియించి"

(నట్లు) సర్గము ద్వితీయాశ్వాసమయ్యె. ఏనుఁగు లక్ష్మణకవి సోదరుఁ డగు ననంతుని కొడుకైన తిమ్మన 170 సం॥రముల క్రితము వ్రాసికొన్న ప్రతి కావున నిందు దోషము లుకాని, లేఖకపూరణములుకాని, పాఠభేదములుకాని లేక యథామాతృకముగనుండు నని తలంపవచ్చును."

ఈతని సాగరసంగమమాహాత్మ్య మింకను జిక్కవలసి యున్నది. కవులచరిత్రమునందు లేసి విషయముగాన ప్రస్తుత కథకు సంబంధము లేకపోయినను పై చర్చ వివరించితిని.

మనకుఁ బ్రస్తుతము చర్చనీయాంశ మీతని కృతు లన్నిఁటికంటె మిన్న యనఁదగిన కుక్కుటేశ్వరశతకము. దానినిఁగూర్చి తెలిసికొందము.

ఈ కవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు, పిఠాపుర ముకడ నున్న కంద్రాడ కరణము. చేరువ నున్న చంద్రమ పాలెములోఁగూడ నుత్తరవయస్సున నుండెను. ఇతఁ డాప స్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; బయ్యన్న పౌత్రుఁడు: తిమ్మయ పౌత్రుఁడు; గంగన పుత్రుఁడు; ఈయన తల్లి లచ్చమ్మ; జగ్గన్న, సింగన్న, నరసన్నలు పితృవ్యులు; వీరమ్మ, పాపమ్మలు, మేనత్తలు; సింగన, జగ్గన. సూరన్నలు సోదరులు. ఈతని భార్య గొట్టిముక్కల రామయ్య కూతురు. ఈతఁడు కవిసార్వభౌముఁ డని బిరు దందెను.

ఈతని కుక్కుటేశ్వరశతకము సీసపద్యసంకలితమై "భూనుత విలాస! పీఠికాపురనివాస! కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!" అను మకుటముతో విరాజిల్లుచున్నది. ఇది వేణుగోపాలశతకమువంటి దూషణశతకము. లోకవృత్తమును, ప్రజలను, మూర్ఖులను గేలిసేయుటలో వేణుగోపాల, చంద్రశేఖర, నారసింహ, కుక్కుటేశ్వర, రామలింగేశ్వర

శతకములు ముఖ్యమైనవి. ఈ జాతి శతకము లింకను పెక్కు లున్నవి. కాని వీని కన్నిటికి వేణుగోపాలశతకమే మేలు బంతి యని నాయూహ! ఈ శతకములలో భక్తిజ్ఞానవైరాగ్య ములు హాస్యమును, గర్హణమును గూడ నుండును. శృంగా రమునకుఁ దావు లేదు. ఈ జాతిశతకములు మన సంఘ సంస్కరణమునకు, ప్రజల నీతివిధానమునకు, బహిరంగజీవిత మునకు మిక్కిలి మంచి మేలు నొనర్చుచున్నవి. ఒక చెడ్డ విషయమును మఱియొక సమానవిషయములతో గుది గుచ్చి రచియించిన యీపద్యముల యందలి గేలిమాటలు, ఎగతాళివాక్యములు, దోషులహృదయమున నాటుకొని, బుద్ధికిఁ బనిగల్పించి, వారిని సరియైనమార్గములకుఁ ద్రిప్పఁ గలిగి యున్నవి. ఈ కుక్కుటేశ్వరశతకములో వేణుగోపాలశత కమునందువలెనే కొన్ని గ్రామ్యపదసంకలితపద్యము లున్నవి. శైలి తెలియుటకుఁ గొన్ని రత్నము లుదాహ రించెదను.

సీ. వేదశాస్త్రపురాణ విద్య లక్కఱగావు । సరిహాసవిద్యలు పనికివచ్చు
గద్యపద్యవిచిత్ర కవితలు కొఱగావు । గొల్లసుద్దులకతల్ చెల్లుబాటు
దేవతాభాషల తీరులేమియుఁగావు । పారసీకోక్తులు ప్రబలె నెక్కు
శైవవైష్ణవ మతాచారంబు లొప్పవు । పాషండమతములు ప్రబలి నలరు

నౌర! యిక్కలికాల మహాత్త్వమెంతొ
వింతయై తోఁచుగద! ధరాభ్యంతరమున
భూసురవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. కాఁపుకవీశ్వరుల్ కంచజియోగులు । సాతానివైష్ణవుల్ సాలెభటులు
కోమటిదాతలు కొంటెభాగోతులు । మాలసెట్టులు బోయ మానశీలు
గొల్లపౌరాణికుల్ పల్లెదైవజ్ఞులు । బానిసవేశ్యలు జైనబాప
లాఁడుపీర్పరు లుగ్రయవన ధరా । ధీశ్వరులు వైదిక ప్రధానులును మిగుల
భూతలంబునఁ గలిదోష హేతుకముగఁ
బ్రబలులై రింక నేమి చెప్పంగవలయు
భూనుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. అబ్బబ్బ! కిందటేఁ డప్పయ్య తీర్థాన । జోలెజంగము కిస్తి నోలెఁ డుప్ప
సాతాని జియరయ్య సతికితే పోయిస్తి । కొల్లఁగా సుల్లెఁడు సల్లబొట్టు
లంకసత్తెలవాఁడు పాంకాన పోగిడితే । మాలదాసరి కిస్తి మానెఁడొడ్ల
లేదాలువాగితే యెల్లుబొట్టయ్యకు । కోలకుంప దోసెఁడు కొట్టలిస్తి
నౌర! తమకున్న కూసుగాఁ దవలనింకఁ
గలఁడె యను మూర్ఖుఁ డిద్దరఁ గామవైరి!
భూనుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. కడుపార ఘృతమాంస ఖండముల్ కడు మెక్కి
పుక్కిటఁ దములంబు తుక్కుఁ గ్రొక్కి
లావగు గడితంపుఠీవి గన్గొని నిక్కి
విడువక గేస్తుల నొసలు నొక్కి
కూర్చు రొక్కము చందుగులఁ గ్రిక్కిరియఁ జొక్కి
కసరుచు జనులపై విసమఁ గ్రక్కి
కవిబుధవరుల ధాకలకు మూలలఁ జిక్కి
తక్కుచుఁ బల్లకీమక్కు టెక్కి
నిక్కి మిక్కుటమైన యాదొక్కిబొక్కి
టక్కరి నృపాలకులకీర్తి దక్కనొక్కి
భూనుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. దానవైఖరిని రాధాతనూభవుఁ బోలి
చిరభోగమున శచీవరునిఁ బోలి
కారుణ్యమున రఘుక్ష్మావరేణ్యునిఁ బోలి
సత్యంబునను హరిశ్చంద్రుఁ బోలి
న్యాయమ్మునందు గాంతేయాగ్రజునిఁ బోలి
సాహసంబున సవ్యసాచిఁ బోలి
భూరివిద్యాప్రౌఢి భోజరాజును బోలి
హరిభక్తినియతిఁ బ్రహ్లాదుఁ బోలి
సర్వసర్వంసహా భుజాధూర్వహుండు, న
భంగుఁడగునాఁడె యీ నృపపుంగవుండు
భూనుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. మణిభూషణములు చామరములు ముత్యాల
గొడుగులు పడిగలు గుచ్చుపరపు
మిద్దెకీళ్ళు మెఱుంగుటద్దముల్ గద్దియల్
చందుగల్ చందువాల్ మందసములు
పూలపాన్పులు శరతాళవృంతములు మేల్
కలశముల్ తూఁగుటుయ్యేలలు పసిఁడి
పల్లకీలు గుఱ్ఱాలు బంట్లు బానిసలును
ధనధాన్యవసన గోదంతితతులు
కులుకుప్రాయంపు ముద్దుగుమ్మలును గలిగి
తేలుచువారలె మును నిన్నుఁ గొలుచువారు
భూనుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

ఈ పద్యము సర్వేశ్వరశతకము నందలి పద్యమును బోలియున్నది.

సీ. బావిలోపలఁ బడ్డపాముసు వెడలింపఁ
జనువానిఁ గఱవక చనఁగలదె
చిచ్చులోఁ బడెడు వృశ్చికమును వెడలింపఁ
జనువాని మీటక సడలఁగలదె
పెనువెల్లిఁ బడిపోవు బెబ్బులిఁ బరికింపఁ
జనువాని మ్రింగక మనసఁగలదె
బురదగోఁతనుబడ్డ పోట్లావు తెగనెత్తఁ
జనువాని పొడువక జనఁగలదె

అవనిలోపల ఖలుని నెయ్యంబు మీఱ
మనుపఁజనువానిఁ జెఱుపక మానఁగలఁడె
భూసుతవిలాస! పీఠికాపురవిలాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

---

# ఏనుఁగు లక్ష్మణకవి

ఈతఁడు చాల గ్రంథములను వ్రాసియున్నాఁడు. ఈతఁడాఱువేలనియోగి; యాపస్తంబసూత్రుఁడు; వాధూలసగోత్రుఁడు; తిమ్మకవి పుత్రుఁడు; పెదలక్ష్మణకవి పౌత్రుఁడు; మాచిరాజు నృసింహుని దౌహిత్రుఁడు. ఈతని తల్లి నరసమాంబ; అన్న యనంతకవి. తమ్ముఁడు వీరభద్రుఁడు. ఈ కవి వంశమునకు మూలపురుషుఁడు పైడిపాటి సింగన్న. ఈ కవి పూర్వులయింటిపేరు పైడిపాటివారైనను సింగన్న వంశజులలో నొకఁడగు జలపాలామాత్యుఁడు పెద్దాపురసంస్థానాధీ

శ్వరుఁ లైన జగపతులచే నేనుఁగును బహుమానమందుటచే నప్పటినుండియు నేనుఁగువారైరి.

ఈతఁడు రామేశ్వరమాహాత్మ్యము, జాహ్నవీమాహాత్మ్యము, గీర్వాణసూర్యశతకము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణము, నృసింహదండకాదిస్తుతులు, రామవిలాసము మొదలగు గ్రంథములు వ్రాసెను. విశ్వామిత్రచరిత్రము, కాళికాదండకము, ఆదిత్యహృదయము మొదలగు గ్రంథములు వ్రాసినట్లుకూడఁ దెలియుచున్నది.

ఈతని తాత యేనుఁగు పెదలక్ష్మణకవి. ఈతఁడు రాజశేఖర చరిత్రము, భీమసేనవిజయము, భళ్ళాణరాయ చరిత్రము, ద్రౌపదీపరిణయము, ధ్రువచరిత్రము, తులామాహాత్మ్యము మొదలగు మహాగ్రంథము లనేకము వ్రాసెను. ఈతఁడు సంగీతసాహిత్యములయం దసమాన ప్రజ్ఞకలవాఁడు. తన తులామాహాత్మ్యమును వత్సవాయ జగన్నాథరాజునకుఁ గృతియిచ్చుచు దానిలోఁ దాను "ఏనుఁగు గరకమంత్రి పౌత్రుఁడ ననియు, వెణుతురుబలి వెంకటాద్రి దౌహిత్రుఁడ ననియు, వెణుతురుబలి విశ్వనాథుని మేనల్లుఁడ ననియు, సేరమాంబ గుర్వమాత్రుల పుత్రుఁడ" ననియుఁ జెప్పుకొనినాఁడు. ఇతఁడు క్రీ॥ శ॥ 1640లోఁ బట్టాభిషిక్తుఁడైన సార్వభౌమ తిమ్మజగపతిమహారాజునకు ద్రౌపదీపరిణయము కృతియిచ్చినందున నీతని కాలము 17వ శతాబ్దమధ్యభాగ మని

సువిదితము. క్రీ॥ శ॥ 1555—1607 నడుమనుండి శేషధర్మములు వ్రాసి వత్సవాయి ముసలి తిమ్మరాజుగారికిఁ గృతి యిచ్చిన దిట్టకవి యీతని మేనమామకదా! తుల్యానది గోదావరి కొకశాఖ. ధవళేశ్వరమునఁ బుట్టి కాకినాడ చేరువను సముద్రమునఁ గలియును.

ఏనుఁగు చినలక్ష్మణకవిసోదరుఁడగు నరసింహకవి గౌరీపరిణయము వ్రాసెను. ఈ వంశమువారి దౌహిత్రులగు చాగంటివారి (కరప, కాకినాడ వాసుల) కడ నున్న గ్రంథములు వారి తాళదళసంపుటములు పరిశోధక మహామండలికిఁ జేరి యున్నవి.

చినలక్ష్మణకవి జాహ్నవీమాహాత్మ్యములో "సత్సమానకవీశ్వరు కూచిమంచి తిమ్మకవి" అని పొగడుటచే నీతఁడు తిమ్మకవికి సమకాలికుఁడు. క్రీ॥శ॥ 1730 ప్రాంతముల నున్న వాఁడు. తిమ్మకవి కంటె జిన్నవాఁడై యుండును. ఈదులపల్లి భవానీశంకరుఁడు కూడ నీకాలము వాఁడే!

ఏనుఁగువారు పెద్దాపురసంస్థాన కవులై ప్రసిద్ధినొందిరి. ఆ సంస్థాన ప్రభువులుకూడ సంస్కృతాంధ్రములయందు బాండిత్యకవిత్వసంపద కలిగి రామ శతకము, భద్రశైల రఘురామశతకము మున్నగు గ్రంథములుకూడ రచియించి నట్లు తెలియుచున్నది. (చూడుఁడు - కవుల చరిత్రము 1899 - పుటలు 424. 425.)

ఇతఁడు విశ్వేశ్వరోదాహరణాది చాటు కావ్యములు శేషాద్ర్యుదాహరణాదులవలె వ్రాసినవి యిప్పుడు దొరకవు. కాని ప్రస్తుతము మన మీతని భర్తృహరిభాషాంతరమునే యిచ్చుటఁ బ్రశంసింపవలసి వచ్చినది.

భర్తృహరిసుభాషితము నైదార్గురు భాషాంతరీకరించి యున్నారు (1) ఎలకూచి బాలసరస్వతి (2) పుష్పగిరి తిమ్మన (3) ఏనుఁగు లక్ష్మణకవి (4) పోచిరాజు వీరన్న (5) గురురాజకవి, ఇందుఁ గొన్ని మనకుఁ జిక్కవు. ఐనను జిక్కినవానిలో లక్ష్మణకవిదే మిన్న యని తజ్ఞులు తలంచుచున్నారు. లక్ష్మణకవి వంశవివరములు, విశేషములు, చాటుపద్యములు నిటీవలఁ జిక్కినవి. సుభాషితరత్నావళి కృత్యాది కూడఁ జిక్కినది.

ఈ కవి జాహ్నవీమాహాత్మ్యము దొరికినప్పుడు నే నిట్లు వ్రాసియుంటిని:—

ఇందు కవిత్రయమును, వేములవాడ భీమకవిని, శ్రీనాథుని, పింగళి సూరనను, రామభద్రుని, వీరభద్రుని, సోము, భాస్కర, మొదలగు తెలుగుకవులను నుతించిన పిమ్మట నిట్లు వ్రాయుచున్నాఁడు.

ఆకరపల్లి కోదండరాముఁ డను నాతఁడు కవికి గురు వైనట్లు రామేశ్వరమాహాత్మ్యమువలనను, ఈ గ్రంథమువలనను గూడఁ దెలియుచున్నది.

సీ॥ రాజశేఖరచరిత్రము రసోచితముగా, నిర్మించె నేర్పుతో నెల్ల మెచ్చ॥
—౧౫

అను పాదమువలన నితని తాత యిదివరకు వ్రాసియున్నట్లు మన మెఱిఁగియున్న (1) ధ్రువచరిత్రము (2) ద్రౌపదీపరిణయము (3) తుల్యామాహాత్మ్యము కాక రాజశేఖరచరిత్రముకూడ వ్రాసినట్లు కనఁబడుచున్నది. ఈతని తాత రచియించిన గ్రంథము లెవ్వియుఁ గానరావు. కాని యిటీవల గ్రంథాలయసర్వస్వమునం దీతని తుల్యామాహాత్మ్యములోఁ గొంతభాగము దొరికినట్లు ప్రకటించియున్నారు.

ఈతని తండ్రికూడఁ గవియైన ట్లీ క్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు.

క॥ రవికులజు పార్థివేశ్వరు । శివలింగ ప్రసాద సిద్ధనిరాజ
త్కవితానిధి మజ్జనకుం । గవితామహసాగ్ర్య తిమ్మకవిని భజింతున్॥

ఈతని తాత మేనమామ యగు వెణుతురుబల్లి విశ్వనాథకవిని, అతని కొమరుడగు వేంకటాద్రికవిని, ఆతని మేనల్లుఁడగు వక్కలంక వీరభద్రుని, ఆ వీరభద్రుని సహాధ్యాయి యగు ఈదులపల్లి భవానీశంకరుని వర్ణించుటచే నీతని కాలనిర్ణయమునకే కాక పై కవుల కాలనిర్ణయముకూడ సులభముగఁ దేటపడుచున్నది. ఇదివఱకు శ్రీ వీరేశలింగముపంతులవారు కూచిమంచి తిమ్మకవి యీకవికి సమకాలికుఁ డయి యుండవచ్చునని సందేహించి యుండిరి. అది సత్యమని యీ క్రిందిపద్యపాదము చెప్పుచున్నది.

గీ. వర్తమానక వీశ్వర వరుని జూచి। మంచి తిమ్మకవీంద్రుని మదిఁ దలంచు॥

ఈ కృతికి వెంటూరి సోమనాథుఁడు నాయకుఁడు. నందూరి కామమంత్రి ప్రేరేపకుఁడు. ఈ నందూరి కామమంత్రి జగనొబ్బగండ, రాయవేశ్యాభుజంగాది బిరుదములతో రాజమహేంద్రవరదుర్గాధిపతులగు వారి వంశమునఁ బుట్టి చిరకాలము కాకినాడ, శలపాక సీమల దండనాథుఁడై పరిపాలించెను. ఈతని తాత ముత్తాతల పౌరుషపరాక్రమములును, దానములును, వా రొనరించిన సప్తసంతానాదికములును, వివరముగ వర్ణింపఁబడినవి. కడచిన రెండు వందల సంవత్సరములకుఁ బూర్వము నందూరివా రెట్టి యుత్కృష్టదశ ననుభవించిరో, వారి కే యే వంశములతో సంబంధబాంధవ్యము లుండెడివో వివరముగ వర్ణింపఁబడియున్నవి. ఈ గ్రంథమువలనను, మిక్కిలిమల్లికార్జునకవి పుస్తకమువలనను, విఘ్నేశ్వరచరిత్రమువలనను, నందూరివారి వంశవృక్షము 300 సం॥ రముల నుండి చూపవచ్చును. విఘ్నేశ్వరచరిత్రము నందూరివారిలో నొకరు రచించినదే సంపూర్ణ ప్రతి మాకుఁ జిక్కినది. కొమరిపాలెం, వెంటూరు మున్నగు గ్రామములయందు నందూరివారు త్రవ్వించిన చెరువులు, నాటించిన తోఁటలు, యిచ్చిన దానములు తెలియుటయే గాక వారు గజపతిరాజుకడ, యవనాధీశ్వరులకడ నొందిన గజాందోళికాది బహుమానముల ప్రశంసకూడఁ జేయబడియున్నది. ఇందు దేశచరిత్రకు, కవుల చరిత్రకు, సాంఘికచరిత్రకును, ముఖ్యముగ నందూరివారి

చరిత్రమునకును సాహాయ్యపడు చరిత్రాంశములు పెక్కు-లున్నవి.

ఇది నాల్గాశ్వాసముల పద్యకావ్యము. ఇందు గంగా నదీమాహాత్మ్యము, స్నానఫలము, సంపూర్ణముగ వ్రాయఁ బడియుంట హిందువులకుఁ బవిత్రకావ్యముగ నెన్నవలసినది. ఈతఁడే వ్రాసిన రామేశ్వరమాహాత్మ్యము లోక మెఱిఁగి యున్నదే! నైమిశారణ్యమునం దీ కథ చెప్పఁబడినట్లున్నది. భీష్ముఁడు శరతల్పగతుఁడై ధర్మరాజునకు గంగామాహాత్మ్యము వినిపించినట్లు ప్రారంభము. ఉంఛవృత్తి నున్న యొక బ్రాహ్మణుని యింటికివచ్చిన సిద్ధుఁ డా బ్రాహ్మణుఁడుగఁ జెప్పిన ట్లీ కథ వ్రాయఁబడియున్నది. ఇదియే యితిహాస మని భీష్ముఁడు తొల్లి ధర్మజునకుఁ జెప్పె నని మునీంద్రులు నైమిశారణ్యమున విందురు.

శైలి తెలియుట కొకటి రెండుపద్యములు.

చ. జగము సృజింపఁగోరె దను । జప్రతతిం దునుమన్ వలంచె దే
వగణము నెల్ల బ్రోచుటకు । వాంఛయొనర్చె నిజప్రశాళి కిం
పుగ భవనాధిపత్య మిడఁ । బూనె వసూమణి గర్భసీమ సొం
పుగ నభివృద్ధి గాంచు శశి । భూషణు దేవి మహాసుభాగ్యవతిన్.

చ. అళిభటహుంకృతుల్ శుక । హయస్ఫుట హేష లందాప్తమత్తకో
కిలగజబృంహితంబులు నొ । గిన్ విరహప్రళయం బొనగప్పఁగా
మలయమరుత్సుధాంశు మధు । మంత్రులగూడి గతీశ్వరుండు రా
చిలుక హుమాయి నెక్కి నడ । చెన్ త్రిపురాంతకుమీఁద నుద్ధతిన్.

ఆశ్వాసాంతగద్య మిట్లున్నది.

"ఇది శ్రీమ దుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షా పాత్ర యేనుఁగు లక్ష్మణామాత్యపౌత్ర తిమ్మనామాత్య పుత్ర. వివిధవిద్వజ్జన విధేయ లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబైన జాహ్నవీమాహాత్మ్యం బను మహాప్రబంధంబునం........" అని రామేశ్వర మాహాత్మ్యమునందు వలెనే యున్నది. * * *

ఈతఁడే రామేశ్వరమాహాత్మ్యమును గృతి యిచ్చిన భద్రిరాజు మల్లమంత్రీంద్రుఁడు, నందూరి కామమంత్రి సభలోనుండి, కామమంత్రి యిష్టదైవమున కీకృతి యిమ్మని ప్రోత్సహించినట్లు గంగామాహాత్మ్యమునఁ గూడ వ్రాసియున్నాఁడు.

ఈ కవి తాతతండ్రులేకాక యన్నదమ్ములుకూడఁ గవులైనట్లు గంగామాహాత్మ్యమువలనఁ గూడఁ దెలియుచున్నది. కాని వారి గ్రంథము లింతవఱకుఁ జిక్కలేదు. రామేశ్వర గంగామాహాత్మ్యము లితని సుభాషితరత్నావళివలె జనరంజకములు కాలేదు. కారణము ప్రారంభకావ్యము లగుటనో? భావశూన్యము లగుటనో? చర్చించి వాఙ్మయచరిత్రకారులు నిర్ణయింపవలసియున్నది. రామేశ్వరమాహాత్మ్యము శ్రీగురుజానపల్లి చిన్నమల్లేశ్వరునికిఁ గృతియిమ్మని మల్లమంత్రి కోరుటయు, దానిని నందూరి కామమంత్రి బలపఱచుటయు రామేశ్వర మాహాత్మ్యమునఁ జెప్పఁబడియున్నది. (ఆ౧-౨౫)

పద్యమువలన, కామమంత్రి కాకినాడ, శలపాక, మహాక్ష్మకు స్థలపతియని చెప్పఁబడి యున్నది.

ఈ కావ్యమును, రామేశ్వరమాహాత్మ్యమును ముందు రచియించి పిమ్మట భర్తృహరి భాషాంతరీకరించినట్లు తెలియుచున్నది.

ఈతని తాత లచ్చన, తండ్రి తిమ్మన, తల్లి పేరమ యనియు సోదరులనామము లివి యనియుఁగూడ నీ కావ్యమునఁ జెప్పబడియున్నవి.'' (కృష్ణాపత్రిక 3-2-1917.)

శైలి తెలియుట కీతని సుభాషితరత్నావళినుండి కొన్నిపద్యములఁ జూపెదను.

గీ. పడఁతి యొక్క_ దాని విడిచి యించుక యమృ
తంబులేదు భువి విషంబులేదు
అమృతలతనుబోలు ననురాగవతియైనఁ
గాక మెలఁగనేని గరళవల్లి. 92

గీ. ఒకనితోఁ గూడి భాషింతు రొక్క_ నరుని
జూతురు విలాససంపద సొంపుఁగులుక
మఱియు నొక్క_నిఁ దలఁతురు మనసులోన
గూర్మి ప్రియు డెవ్వఁడో ముద్దుగుమ్మలకును. 93

చ. చెలువపుఁ దేట లేనగవు చేతను భావము చేత సిగ్గు చే
నలువగు లీలచేత సుగుణంబులచేఁ గడగంటి చూపుచేఁ
గలహముచేత విందులగు కందువమాటలచే నసూయచేఁ
జెలుచన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కు_భంగులన్. 94

ఉ. తమ్ములనేలు కన్నులు సుధానిధిఁబోలు మొగంబు మత్తభృం
గమ్ములఁ గెల్చు కొప్పు కనకద్యుతి మీఱు మెఱుంగు కుంభికుం

భమ్ముల నచ్చినక్షణము సెబాసని మెచ్చి కొనంగఁ దేనియల్
చిమ్మెడు ముద్దుఁబల్కులను జేయని సొమ్ములు సుందరాంగికిన్. 95

చ. అతివలఁ జూచి వీ రబలలంచు వచించు మహాకవీంద్రు లు
ద్ధత విపరీతవాదు లిదె దబ్బరగాదు విలాసినీసమం
చిత తగలాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులున్
ధృతి నటువంటి నా రబల లేగతి నైరి తలంచిచూడఁగన్ 96

గీ. పెన్నిధియులున్న జక్కవచెలియున్న రిక్కరాయఁడున్న జుక్కలున్నఁ
జన్నిలేఁడిచూపు చేడియ నెడఁబాయు నప్పుడంధకార మయ్యెజగము.99

---

# వైదర్భ అప్పయకవి.

ఈతని యింటిపేరును బట్టి చూడ మాధ్వుఁడని తోఁచుచున్నది, ఉపమాకవేంకటేశ్వరశతకము, బళిరకటిపేల్పుశతకము నీతని కృతులు. ఉపమాకవేంకటేశ్వరశతకమునందు "నాకవితకు నెంచి వీనిఁ గ్రోవు మనుచు కాకర్లపూడి పాయకరాయ నృపాలమౌళితోనైన సెలవీయరాదో మరేది విబుధలోకేశ ఉపమాకవేంకటేశ!" అని రెండుచోట్ల కాకర్లపూడి పాయకరాయ నృపాలుని పేరు గనఁబడుచున్నది. ఈ పాయకరాయఁడు విజయనగరప్రభువైన మొదటి యానందగజపతితో సమకాలికుఁ డని విశాఖపట్టణమండలచరిత్రము వలనఁ దెలియఁ గలదు. అనకాపల్లి ప్రాంతముల నీరాయఁడు పరిపాలించెను. క్రీ॥ శ॥ 1710 ప్రాంతముల నున్న గోగుల

పాటి కూర్మకవి, అడిదము సూరకవుల కించుక పూర్వుఁడో, సమకాలికుఁడో యీ కవి యైయుండును.

ఈ శతకకర్తను గుఱించి యొక కథ వాడుకలో నున్నది.

“ప్రథమమున నీతఁడు బళిరకటివేల్పుశతకములో రాధను పోషణనుగా వర్ణించుచు పచ్చిశృంగారములో జెప్పి రాధికగుట్టు నంతను బయటఁ బెట్టుటచే యెనుబది పద్యములు చెప్పునప్పటికిఁ బ్రతిపద్యమునకు రాధాకృష్ణులు ప్రత్యక్షమగుచు, పిమ్మట వారు కినిసి గ్రంథకర్త నంధుఁ డగునట్లు చేసిరనియు పిమ్మటఁ గవి యుపమాక వేంకటేశ్వరశతకములో నలమేలుమంగను ముక్తగాను వర్ణించి యేఁబదిపద్యములు చెప్పగానే తిరిగి నేత్రములు వచ్చిన వనియు నొకగాథ వాడుకలో నున్నది. దీని సత్యాసత్యము లెట్లున్నను గ్రంథకర్త శైలియు, భావప్రకటనమును మిక్కిలి బాగుగ నున్నవనుటను సందేహము లేదు.”

అని శ్రీవల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారు (30-7-1918) ఆంధ్రపత్రికలో వ్రాసియున్నారు.

ఉపమాక వేంకటేశ్వరశతకము 1881 సంవత్సరమున విశాఖపట్టణమునందలి ప్రబంధకల్పవల్లిలోఁ బ్రకటించిరఁట! ఈ శతకము పాయకరాజగోపాళి కంకితము. ఇం దలమేలుమంగ వివాహాదికముల శృంగారవర్ణనము కలదు. ప్రాచ్యలిఖితాగారము 12-1-27 (4) సంఖ్యగల గ్రంథములో “Vaidarsu Appaya is the author” అని యెవరో——బ్రాహ్మ శ్రీ బ్రౌన్ దొరగారై యుందురు — వ్రాసియున్నారు. అది వారి కెట్లు తెలిసెనో తెలియదు. గ్రంథములలో గర్త

పేరు కనఁబడదు. పై కథ ననుసరించియు, క్రింది పేరు నను సరించియు నీ కవినామము శీర్షికగా నుంచితిని. ఇంతకంటెఁ బ్రబలనిదర్శనము దొరకువఱకు నిదియే నమ్మచుందము. రెండుశతకములనుండియుఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## (1) బళిరకటివేల్పు శతకము.

సీ. పొంచి తల్లిని మఱపించి జాళ్వామొల
నూల్చిఱుగంటల నుడినడంచి
పసిఁడిగజ్జెలను జొప్పడెడు చప్పుడు కుంచి
కుందనంపుగూరిడి గొలుసును మును
గున గట్టిగ బిగించి గూనల చెయిముంచి
చిన్న బొజ్జపై పొల్చినుక గనక
హస్తపల్లవమున హస్తపల్లవము నొం
గొటనించి భుజంబు లుబ్బఁజెంచి
గీ. మోవ నొకంపగొని పంచియుంచి మేనువంచి
కనులు వీక్షించు నీవు విగారె సంభావించు
చక్కఁదన మెన్న వేనూళ్ళ నాలవన్న
బళిర కటివేల్ప పసిఁడి మువ్వాలవదాల్ప!

సీ. మొకరి ముమ్మొనవరాల నుట్టని కొంగిప్పిరి
కోయిల నాచవిఁగొనని చివుఁ
చిలుక ముక్కున నొక్కఁ బంపనిబింబంబు
మొగ్గిపోవక నిల్చు మొఱుఁగుదీవ
కసటివోఁ బన్నెరఁ గమిగిన బన్నాగె
చొక్కమౌ గోవ కస్తూరిబిడారు
కలికిగాయించ బ్రేగంటఁ జూపనితూఁడు
పైపొర నిపని కప్పింప్ర టనఁటి

గీ. చిత్తజు మిటారి శేదఁగి చిక్కటారి
కమ్మవిలుకాని జుల్మతీ కత్తులాని
కాయజోపనిషద్గాథకదరరాధ
బళిరకటివేల్పు పసిడి దువ్వాలువదాల్పు॥

సీ. మొలకనగవుముద్దు మొగముచిగురుమోవి
మెఱుఁగు జెక్కుల మిస మిస నెసఁగ నొ
సలపయి ముసరి పెంపెసలాడు కురుల క
న్నులదీర్చి, బుగ్గపై నిలిపినట్టి
చిన్ని కాటుకచుక్క చెలువంపు బొమల న
డుమనిడ్డ, యుక్కుబొట్టు చెలువపెంప
నడుగుదమ్మికి గంగ యలరు దేని గాసె
గడుతేంద్రిడివి యశోదపుడి సెగు జల
ములకు నడ్డుగుడిచి యల నలువగన్న
బొడ్డుదామర కొక గుడ్డ యడ్డమునుప
తగుదునని పవ్వళించితే తల్లియొద్ద
బళిరకటివేల్పు పసిడిదువ్వాలువదాల్పు.

## ఉపమాక వేంకటేశ్వరశతకము.

కాకర్లపూడి రామభద్రిపాయకరాయరాజమహాళి కంకితము.

ఇం దలమేలుమంగ వివాహాదికముల శృంగారవర్ణనము కలదు.

సీ. సిరివిరిబోడి చందురుతోడఁబుట్టువు
లేము లుడిపెడితల్లి వనయింట
నెలకొన్న చెలిమిన్న నలమేలుమంగ వె
క్కాని కేళిఁ గనుమూయఁ దనకనుఁగవ

గీ. మఱుఁ గనుగఁ దోఁచు చంద్రబింబంబు నావి
నాఁగ వెలుకమరు కన్నుకొన్ని మిన్నులఁదు నోఁగ
తెలుఁగునఁ జెలఁగె గదమంగ లేనతోలంగ
విబుధ లోకేశ ఉపమాక వేంకటేశ.

---

# గోగులపాటి కూర్మనాథకవి

ఈతఁడు వ్రాసినగ్రంథములు సింహాద్రినారసింహ శతకము, మృత్యుంజయవిలాస మను యక్షగానము, చోర సంవాదము ననునవి కనఁబడుచున్నవి. ఇతఁడు నాఱువేల నియోగి. ఆపస్తంబుఁడు, ముద్గలగోత్రుఁడు. బుచ్చన్న గౌరమాంబల పుత్రుఁడు. ఈతని తాత సూరనామాత్యుఁడు. ఈతని తమ్ములు వెంకన్న, కామన్నలు. శ్రీతిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యుఁ డను వైష్ణవుని శిష్యుఁడు. ఈ విషయము లీతని మృత్యుంజయవిలాసమునం దీ క్రింది విధముగ వ్రాసికొనెను.

ద్వి. శ్రీసింహభూధర శ్రీరామతీర్థ। భాసురస్థలముఖ్యబహుదేశికాగ్ర
నాచార్య యుభయవేదాంతరహస్య। శ్రీనాథుదాత్మములు కోవిదులసకల
కలశాంబురాశిరాకాచంద్రమూర్తి। సలలిత పెద్దింటి సంపత్కుమార
శ్రీవేంకటార్య దేశికుల శిష్యుఁడను। పావన గౌరమాంబా బుచ్చమంత్రి
వరపుత్రుఁడను సూర్యవరుని పౌత్రుఁడను। ఇరువొందు కాశికా మేశ్వర ముఖ్య
సరసదివ్యక్షేత్ర సంచారభవ్య। కరమైన వెంకన్న కామన్న యనెడు
ననుజన్ములనుగూడి యలరినవాఁడ * * శ్రీకూర్మదాసాఖ్యఁ జెందినవాఁడ।

ఈతని గురువులు శ్రీరామతీర్థవాస్తవ్యు లగుట నీకవి బాల్యమున శ్రీరామతీర్థవాసులై యుందు రని శ్రీరామారావుగా రూహించిరిగాని వేంకటాచార్య దేశికుఁడు మనకవికి మతగురువో, విద్యాగురువో తెలిసినఁ గాని యీసిద్ధాంతము నిలువదు. ఈతఁడు యౌవనమున విజయనగర సంస్థానమునం దలి శ్రీరామతీర్థము, పద్మనాభము, సింహాచలము మొదలగు క్షేత్రములయందు దేవస్థానాధికారిగా నుండె నని వాడుకయున్నది. ఈ కవి తనజీవితము నందలి చరమభాగమున గజపతినగరమునకు సమీపమునం దున్న దేవులపల్లి గ్రామములో నుండె నని శ్రీరామరావుగారు వ్రాసియున్నారు. అచ్చటనే మృత్యుంజయవిలాసము వ్రాసెనఁట!

గీ. సుమతి కీర్తిని గోగులపాటి కూర్మమంత్రి
మృత్యుంజయవిలాసము సరసకావ్య
మొనర రచియింప సన్నిధి నుండి వ్రాసె
ధరణి నాపర్తి హరిహరదాస ఘనుఁడు||

ఈ హరిహరదాసుని వంశజు లగునట్టి యాదుర్తివారిప్పటికిని దేవులపల్లిలో నివసించుటచేతను, దేవులపల్లిలో దేవాలయ మున్న స్థలము పూర్వము గోగులపాటివారిదై యుండె నని వాడుకగాఁ జెప్పుచుండుటచేతను బైయూహ సరియైనదే కావచ్చును. ఈతఁడు స్మార్తబ్రాహ్మణుఁడయ్యు వైష్ణవులశిష్యుఁ డయి వారికడ మతసిద్ధాంతములఁ దెలిసికొని తత్ప్రీతినిఁ గనఁబఱచెను.

ఈ కూర్మనాథుఁ డిప్పటికి 170 సంవత్సరముల క్రితము ముండెనని విశాఖపురిడిస్ట్రిక్టుమాన్యువలువలనఁ దెలియుచున్నది. (చూడుడు – 132, 133 పుట తెలుఁగుభాషాంతరీకరణము) విజయనగర ప్రభు వగు మొదటి యానందరాజుగారితని పోషకుఁడై యుండనోపును.

ఈ కవి మృత్యుంజయవిలాసము మూఁడాశ్వాసముల గ్రంథము. యక్షగానరూపమున శివభక్తిప్రతిపాదకమైన కథను వర్ణించును. దీనిని శృంగారనాటకగేయప్రబంధ మని కవి వివరించెను. ఇందు మొదటి యాశ్వాసమునఁ బార్వతి జననము, ఇంద్రునియానతి మన్మథుఁ డాతని కడకు వచ్చుట వఱకుఁ గలదు. రెండవయాశ్వాసమున మన్మథుఁడు శివునాశ్రమమునకుఁ జేరుట, పార్వతి తపస్సును గలవు. మూఁడవ యాశ్వాసమున సప్తఋషులు హిమవంతునికడ కేగుట, శివుఁడు తరలివచ్చుట, పార్వతీపరిణయము, కుమారోదయము తారకాసురవధ మున్నగునవి కలవు. ఈ యక్షగానము గాయకులు సొంపుగాఁ బాడుదురు. ఆంధ్రదేశ మంతట నిది వ్యాప్తిలో నుండెను. ఈ గ్రంథమువలనఁ గవి సంగీతసాహిత్యములయం దపారప్రజ్ఞ కలవాఁ డని తెలిసికొనఁగలము. కవి యుభయభాషలయందును మంచిపాండిత్యము కలవాఁడు. ఈతని పోకడలు మనోహర ప్రబంధచ్ఛాయ లనుటకు శ్రీ రామారావుపంతులుగారు కొన్ని పద్యములఁ జూపియుండిరి.

ఉ. నాయనుకూలభాగ్యసదనా యను నన్విడనాడ నాయమా
నాయను, నిన్నుఁ బాయఁగలనా యను; నీవెతకోర్చు దాన నే
నాయను, వేఱుసేయఁదగునా యను, సోమదసామజంపుగు
న్నా యను, బల్కవేమి పదనా యను, నేఁబగదానినా యనున్.

సీ. స్తనితారవార్భటీ జనితాతిభయవధూ జనతా స్వయంగ్రాహ వినుతజనము
కరికాంతధారా నికరకాంతమౌక్తికా కరకాయమాన భాకారఘనము
అవనీధరస్థల స్నవనీరబహుఝరీ జవనాపతద్దరీ భవనవనము
విపులావియన్మధ్య విపులాభపరిపూర్ణ చపలాభ్రభీతాహి చపలమనము

గీ. అఖిలసస్యావనము మయూరౌఘజీవ
ధనము పాంథమనోవిభేదనము జలప
దనము భూదేవతకుఁ జల్లదనము నగుచుఁ
బ్రకటగతిమించె నంతవార్షికపుదినము॥

మృత్యుంజయవిలాసము ముద్రితమై యీతని శతకము వలెనే ప్రచారములో నున్నది.

ఈతని చోరసంవాద మముద్రితము. దీని కే లక్ష్మీనారాయణవిలాస మని మాఱుపేరు. ఇది చిన్నగ్రంథము. విష్ణ్వాలయములలో జరుగు "దోఁపుడు" ఉత్సవమునం దర్చకులు చదువుదురఁట. గేయసంకలితమైన దీనిప్రతులు పరిశోధకమహామండలిలో నున్నవి.

మనకుఁ బ్రస్తుతాంశ మీతని శతకపరిశీలనము. "18వ శతాబ్దోత్తరభాగమున మరాటీలు, పిండారీలు, తురుష్కులు మొదలగు కొల్లగాండ్రు శ్రీసింహాచలము వచ్చి గుడిప్రవేశించి సర్వవిధముల నాదేవాలయము మొదలగు పవిత్రస్థలములను

బాడుచేయు సమయమునఁ గూర్మనాథకవి శత్రుసంహారము నపేక్షించి దీనిని వ్రాసె నఁట." అని యీ శతకరచనమునకుఁ గారణమును శ్రీరామారావుపంతులుగారు నుడివియుండిరి. కవి స్పష్టముగా మహమ్మదీయుల ముట్టడినే వర్ణించి "యవనరాట్సంతమసము బాసె" "తురుష్కుల నిర్జింపు" మొదలగు మాటల వాడియుండుటచే నిది మరాటీలదోపిడి కాని, పిండారీలదండు కాని కానేరదు.

కవి యావేశముచే రచియించిన మహాశతకము కాని యిది సామాన్యమైనది కాదు. ఇది వ్రాయునప్పుడు కవి భక్తిచే నుద్రిక్త హృదయుఁడై యుండెను. సంగతి సందర్భములఁ జూచి శతకపరిశీలన మొనరించినచో నిది కవి ముట్టడి సమయముననే కంపితగాత్రముతో - కన్నులనీటితో - భగవంతునిపై సంపూర్ణ విశ్వాసముతో - తనదేవునిపై పరిపూర్ణాగ్రహముతో — నీ పద్యము లాశుధార నుచ్చరించె నని తోఁచును.

ఈ శతకమునుగూర్చి చెప్పుకథ లోకవిదితము. సింహాచలమును, తత్ప్రాంతప్రదేశములను దుఱకలు ముట్టడించి కొల్లఁగొట్టుచుండిరి. "ఈయాంధ్రసృష్టి నిల్పు దేవా!" యని భక్తుఁడు ఘోర దుఃఖముచేతను — తుఱుష్కులదౌర్జన్యదర్శనముచేతను - గలిగిన మంటలో నీ శతకము నారంభించి, దేవు నుద్దేశించి ముఖాముఖి మాటలాడి, బ్రతిమాలి, నిం

దించి, హాస్యముచేసి పద్యములఁ జెప్పెను. కొన్నిపద్యములు చెప్పుసరికిఁ గొండపై నున్న పుష్పలతలనుండియో, ఫలవృక్షములనుండియో, లక్షలకొలఁది తుమ్మెదలు, తేనెటీఁగలును లేచి, మహమ్మదీయులరక్తములు స్రవించునట్లు కుట్ట నారంభించెను. వారి కత్తులు, తుపాకులు వృథయయ్యెను. ముట్టడి వీడి తురకలు పారిపోయిరి. ఇది వాడుకగా నిప్పటికిని జెప్పుకొనుటయేగాక యిది సత్యమని యనుమానించుటకు వీలైన నిదర్శనములు కొన్ని కనఁబడుచున్నవి.

(1) అట్లు వచ్చిన తుమ్మెదలు కొందఱు మహమ్మదీయుల విశాఖపురివఱకును దఱిమి యచ్చట నొక కొండబిలములో దూరి తుమ్మెద లదృశ్యమైనవఁట. ఈ సంగతి జరిగినప్పటి నుండియు నా కొండకుఁ దుమ్మెదలకొండ యని పేరు వచ్చినదఁట! ఈ కథ చిరకాలమునుండి వాడుకలో నున్న ట్లీ క్రింది పద్యములు సాక్ష్య మీయఁగలవు.

సీ. కారుణ్యదృష్టిచేఁ గని మమ్ము రక్షించి । నీరజేక్షణ నీవు నేఁడు పంపఁ
బారసీకులదండుపైఁ గొండలోనుండి । గండుతుమ్మెదలు నుద్దండలీలఁ
గల్పాంతమున మిన్నుఁ గప్పి భీకరమైన । కాఱుమేఘంబులు గవిసినట్లు
దాఁకి ఘోరున రక్తధారలు వొరగఁగాఁ । గఱచి నెత్తురుపీల్చి కండలెల్ల

గీ. నూడిపడ నుక్కుమూఁకల నాడిమెఱసి
చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నొక్కొకనిఁ జుట్టిముట్టి బల్మిక్కుటముగ
వైరిహరసింహ! సింహాద్రినారసింహ!

సీ. గీ. అరులఁ బరిమార్చి వైశాఖపురిసమీప
గిరిబిలంబునఁ డాఁగి బంధురముగ నెల్ల
నడమొదల్ సమ్మెడల మెట్లయందుఁ బ్రాని
వైరహారరంహ! సింహగిరినారసింహ!

ఈ పద్యములు శతకకర్త శతకము తనునాటి వ్రాసి యుండెనో - యితరులే వ్రాసిరో - చెప్పలేము కాని శతకమునకు సమీపకాలముననే పుట్టియుండవచ్చును. అప్పటికే మనపూర్వులు చల్లగాలికిఁ బ్రసిద్ధి చెందిన వాల్తేరునకు వైశాఖపురి పేరు నాడుటవలన నెండకాలము కొఱకే యీ వైశాఖపురి మనపూర్వులు కల్పించి స్థానాభిధాన మొసంగి యుండిరేమో?

(2) శతకములోఁ గవి వ్రాసిన పద్యముల నరసి చూచినప్పుడు కూడఁ బైకథ నమ్మినను నమ్మకపోయినను మనకొక ప్రబలమైన యనుమానము పొడమక తప్పదు. శతకారంభమునుండి 67 పద్యములవఱకుఁ గవి భగవంతుని ననేక కఠినోక్తు లాడుచు వ్రాయును; బ్రతిమాలును; ప్రార్థించును; నిందించును; భగవంతుని యుద్ధసన్నద్ధునిఁ జేసి కయ్యమునకుఁ బురికొల్పును. తనయెదుట భగవంతుఁడు ప్రత్యక్షమైయున్నట్లు భావించి మాటలాడును. ఆతని కపకీర్తి వచ్చునని భయపెట్టును. లెమ్ము లెమ్మని తొందరపెట్టును. కవి పడుపాట్లాం పెరుమాళ్ళకే యెఱుక! తుదకు 68 పద్యమున

సీ. కంసాది దుష్టవిధ్వంసనం బొనరించు । ధరణిఁ బాలించు నంబుజాక్ష కరుణ

గీ. వినుటయేకాని కన్నులఁ గనుటలేదు। కంటి నిప్పుడు యవనుల గర్వమణఁచి
ప్రజల రక్షించు నీదు ప్రభావమెల్ల। వైరిహరసింహ! సింహాద్రినారసింహ!

కవి కనుగొనిన దేది? ఆతఁ డెచ్చటను తుదమొదల మాట చెప్పలేదు. ముట్టడి ప్రారంభమైనప్పుడు కవి శతక మారంభించి తురకలు కొండ యెక్కుచుండఁగా నిది చెప్పుచుండవచ్చును. 67 పద్యము లగుసరి కేదో మార్పు గలిగి ముట్టడి భంగముకాఁగా యవనులు పారిపోయి యుందురు. అట్లుకానినాఁడు పై పద్యమునందు భగవంతునిమహిమ నేఁడు కన్నులారఁ జూచితి నని కవిచెప్పవలసిన యగత్యము లేదు. 68 పద్యమునుండి కవి తా నావఱకుఁ జేసిన భగవన్నింద కపరాధ మొనర్చితి నని మన్ననలు వేడును.

ఐతే కూర్మనాథకవికాలమున నిట్టి తురకలదండు డేది వచ్చెను? ఆతఁ డేరాజులకాలమువాఁడు? అప్పటి దేశస్థితి యేమి? అని మనము ప్రశ్నించుకొని చూచినచో విశాఖపురి మండల చరిత్ర మించుక సాయపడుచున్నది. అందలి సారాంశ మిచ్చుటఁ గొంచెము చూచెదను.

18 వ శతాబ్దాంతమునందు ఫక్కిరలీఖానుఁడో, (ఔరంగజేబు ప్రతినిధి) "ఆసోఫ్జా" యను "నిజాముల్ ముల్కు" సైన్యములో, ఉత్తరసర్కారులఁ బీడించుచుండెను. క్రీ॥ శ॥ 1724 వఱకు నుత్తరసర్కారులు హిందూప్రభువులే పాలించుచుండిరి. ఇంగ్లీషువారు విశాఖపురిలో వర్తకము చేయుచు

తే. గీ. అరులఁ బరిమార్చి వైశాఖపురసమీప
గిరిబిలంబున డాఁగి బంభరములెల్ల
నదె మొదల్ తుమ్మెదల మెట్టయండ్రు దాని
వైరిహరరంహ! సింహాద్రినారసింహ!

ఈ పద్యములు శతకకర్త శతకము తరువాత వ్రాసి యుండెనో - యితరులే వ్రాసిరో - చెప్పలేము కాని శతకమునకు సమీపకాలముననే పుట్టియుండవచ్చును. అప్పటికే మనపూర్వులు చల్లగాలికిఁ బ్రసిద్ధి చెందిన వాల్తేరునకు వైశాఖపురి పేరు నాడుటవలన నెండకాలము కొఱకే యీ వైశాఖపురి మనపూర్వులు కట్టించి సార్థకాభిధాన మొసంగి యుండిరేమో?

(2) శతకములోఁ గవి వ్రాసిన పద్యముల వరుస చూచిన ప్పుడు కూడఁ బైకథ నమ్మినను నమ్మకపోయినను మన కొక ప్రబలమైన యనుమానము పొడమక తప్పదు. శతకారంభమునుండి 67 పద్యములవఱకుఁ గవి భగవంతు ననేక కఠినోక్తులాడుచు వ్రాయును; బ్రతిమాలును; ప్రార్థించును; నిందించును; భగవంతుని యుద్ధసన్నద్ధునిఁ జేసి కయ్యమునకుఁ బురికొల్పును. తనయెదుట భగవంతుఁడు ప్రత్యక్షమైయున్నట్లు భావించి మాటలాడును. ఆతని కపకీర్తి వచ్చునని భయపెట్టును. లెమ్ము లెమ్మని తొందరపెట్టును. కవి పడుపాట్లా పెరుమాళ్ళకే యెఱుక! తుదకు 68 పద్యమున

సీ. కంసాది దుష్టవిధ్వంసనం బొనరించి। ధరణిఁ బాలించు నుదారకరుణ

గీ. వినుటయేకాని కన్నులం గనుటలేదుకంటి మిప్పుడు యవనుల గర్వమణఁచి
ప్రజల రక్షించు నీదు ప్రభావ మెల్ల। వైరిహరరంహ! సింహాద్రినారసింహ!

కవి కనుగొనిన దేది? ఆతఁ డెచ్చటను తుదిమొదల మాట చెప్పలేదు. ముట్టడి ప్రారంభమైనప్పుడు కవి శతక మారంభించి తురకలు కొండ యెక్కుచుండఁగా నిది చెప్పు చుండవచ్చును. 67 పద్యము లగుసరి కేదో మార్పు గలిగి ముట్టడి భంగముకాఁగా యవనులు పారిపోయి యుందురు. అట్లుకానినాఁడు పై పద్యమునందు భగవంతునిమహిమ నేఁడు కన్నులారఁ జూచితి మని కవిచెప్పవలసిన యగత్యము లేదు. 68 పద్యమునుండి కవి తా నావఱకుఁ జేసిన భగవన్నింద కపరాధ మొనర్చితి నని మన్ననలు వేడును.

ఐతే కూర్మనాథకవికాలమున నిట్టి తురుకలదండేది వచ్చెను? ఆతఁ డేరాజులకాలమునాఁడు? అప్పటి దేశస్థితి యేమి? అని మనము ప్రశ్నించుకొని చూచినచో విశాఖపురి మండల చరిత్ర మించుక సాయపడుచున్నది. అందలి సారాంశ మిచ్చుటఁ గొంచము చూపెదను.

18 వ శతాబ్దాంతమునందు ఫక్కిరలీఖానుఁడో, (ఔరంగజేబు ప్రతినిధి) "ఆసోఫుజా" యను "నిజాముల్ ముల్కు" సైన్యములో, ఉత్తరసర్కారులఁ బీడించుచుండెను. క్రీ॥ శ॥ 1724 వఱకు నుత్తరసర్కారులు హిందూప్రభువులే పాలించు చుండిరి. ఇంగ్లీషువారు విశాఖపురిలో వర్తకము చేయుచు

"ఆనందరాజు" (విజయనగరపుప్రభువు) పాయకరావు (ఉత్త ఘుడు. అనకాపల్లికడ ప్రభువు) గార్లిరువురకు నప్పు లిచ్చి యుండిరి. ఈ యప్పిచ్చినయాంగ్లేయుఁడు "హాలుకోలంబు దొర". ఈతఁడు ఫక్కీరలీఖానునికడ రమారమి యఱువదిలక్షవర హాలు బదులుచేసి యవి జగ్గప్ప యను బ్రాహ్మణుని ప్రోత్సాహ ముచే నీ హిందూ రాజులకు బదు లిచ్చియుండెను. హాలూకో లంబుదొరను ఫక్కీరలీఖానుఁడు తొందరపెట్టి తనసొమ్మీయ మనఁగా, హిందూరాజు లప్పులు తీర్పనందున నింగ్లీషువారు జగ్గప్పను బట్టి తెప్పించి, బ్రాహ్మణుఁడు లోకువ కావున నాతని నాగుపాములచేఁ గరపించి చంపించిరి. ఈ స్థితిలో బహుశః "ఆసోఫుజా" దండెత్తివచ్చి హిందువులరాజ్యము నాక్రమించుకొనెను. ఇప్పుడే యీ సింహాచలము కూడ ముట్ట డింపఁబడి యుండవలెను. క్రీ॥ శ॥ 1724 కుఁ బూర్వ ముత్త రసర్కారులలో మహమ్మదీయప్రచార మున్నను, హిందూ రాజులే బలవంతులై స్వతంత్రముగఁ బరిపాలించుకొనుచుం డుటచే దేవాలయముల ముట్టడించు వఱకుఁ బ్రభువు లూర కొనియుండరు. తుఱకలు రాజులఁ గొట్టకుండ దేవాలయముల ముట్టడింప సాహసించియుండరు. కూర్మనాథకవి వర్ణించిన దేశస్థితి, సింహాచలదేవాలయపు ముట్టడికిఁ బూర్వ మరాచ కముగఁ గన్పట్టును. అందువలన నీ శతకనిర్మాణము క్రీ॥ శ॥ 1724 నకుఁ బిమ్మట జరిగిన మహోకల్లోలదినములనే జరిగియుం

డవలె నని నే నూహించుచున్నాను. ఈ విషయ మింకను బరిశీలనార్హమైనది.

దారుణ మారణ కర్మ కొడిగట్టి, పల్లెల దోచుకొని, పట్టణముల నిర్మూలన మొనరించి, యగడ్తలఁ బూడ్చి, కోట గోడలఁ గూల్చి, జనుల నడవులపా లగునట్లు చేసి, స్త్రీల మానభంగ మొనర్చి, ప్రజల మతభ్రష్టుల నొనర్చి దేశ ముల్లోలకల్లోలిత మైనప్పుడై నఁ గవు లాసంగతి వ్రాయవలసినంత యుద్రేకము కలుగ లేదు. పై పనులఁ జేసి తుదకుఁ దమప్రాణముల కంటెఁ బ్రీతికరము లగు దేవాలయముల ముట్టడించి తమ యిష్టదైవముల యాభరణములఁ దెగింపినప్పుడే కవు లుద్రిక్తహృదయులై రి. మతము, దైవము వీనిని, బరిభవించిన మహామ్మదీయులు ప్రతిఫలము త్వరలోనే యనుభవించి యార్యావర్తమున రాజ్యపదభ్రష్టు లైరి. ఇప్పటికిని మిగిలియున్న సున్నీలలో నూటికిఁ దొంబదిమంది యొకప్పుడు హిందువులసంతతిగా నుండినవారే! వా రిండియనుక్రిస్టియనులవంటివారే — మనసోదరులే — కాని యన్యులు కారు. వీ అందఱు పూర్వులు నిష్టపడి మహామ్మదీయు లైరని యైనఁ జెప్పలేము. ఔరంగజీబుతో మహామ్మదీయప్రభుత్వ సమాధి త్రవ్వట పూర్తియైనది.

ఆ కాలమునం దొక్క సింహాచలమేగాక తిరుపతి, శ్రీరంగము, మొదలగు దివ్యక్షేత్రములుకూడఁ దుఱకలు

దండెత్తినట్లు కొన్ని శతకములు సాక్ష్యమిచ్చుచున్నవి. మహమ్మదీయులు తమ మతప్రచారమునకే గాక ధనాపేక్షచేఁ గూడ నీ దేవాలయముల ముట్టడించి యార్యావర్తమున పూఁతి విరుగని విగ్రహమును జూడ మని నియమ మేర్పఱచుకొని పరివర్తించి రనవచ్చును. దేవాలయముల యందు — ముఖ్యముగఁ దిరుపతి సింహాచలములయందుఁ గృష్ణరాయాది ప్రభువులు విలువగల హారములు, బంగరు గిన్నెలు, ఆభరణములు సమర్పించినట్లు శాసనము లనేకములు కనఁబడుచున్నవి. కాని యీ వజ్రాలపేరులు — యీ ముత్యాలహారములు — ఇప్పు డేవి? గజనీమహమ్మదు సోమనాథ దేవాలయము మొదలు దేవాలయపుధనరాసులు తుఱకలపాలైనట్లు చరిత్రపాఠకు లెఱుఁగనిది కాదు.

మహమ్మదీయులైనను దైవములేని నాస్తికులు కారు. జ్యోతిషము, పిశాచములు, యంత్రములు, తాయెత్తులు; పూనుటలు, మొదలగువానియందు నమ్మకము లున్నవారు. కారణము తెలియని వానికిఁ బరమేశ్వరమహిమను ముడి పెట్టినప్పుడు నమ్మువారే! భక్తుల మహిమచే నేమి, భగవంతునిలీలచే నేమి, తుఱకప్రభువులు భద్రాచలమునకు ధనమిచ్చుట, సింహాచలమునఁ దుమ్మెదలు తోలుటవలనఁ బారిపోవుట మొదలగుచర్యలచేఁ గొన్ని సమయముల భయకంపితులై హిందువుల బాధించువారు కారు. ఇంతయేల? బీజ

పూరుకోటలోఁ దురకనవాబులు పూజించెడివా రని చెప్పు నరసింహస్వామి దేవాలయము నవాబులగోరీబాళ్ళ నడుమ, తురకసామ్రాజ్యభగ్నచిహ్నములగు శిలలనడుమ నవ్వుచు, చెక్కుచెదరక, రాజ్యముల వినశ్వరత్వమునకుఁ బరిహాసించుచు నిప్పటికి ధూపదీపనైవేద్యములతో విరాజిల్లుచున్నది. నేను పోయినప్పుడు చూచియుంటిని. ఇప్పటికిని బురాణపఠనాదులు దివ్యముగ జరుగుచున్నవి. కావునఁ దురకలైన భక్తికొక్కప్పుడు వినమ్రము లగుచుండిరి.

తుమ్మెదలు తురకవాండ్రను దోలుచున్నందులకు సంతసము చూపుచున్న ట్లనుమానింప వీలున్న సంగతులను వినుఁడు.

శత్రువుల బలములు కొండనెక్కి ముట్టడింపవలెను గదా. ఆ సమయమునఁ గాకతాళన్యాయముగ ననేక తేనెటీఁగలు లేచి యవనులఁ బారద్రోలఁ బద్యములు చెప్పుచున్న భక్తుఁ డది భగవంతుని పంపని విశ్వాసముతోఁ దనభక్తికి దేవుఁడు మెచ్చి పంపె నని దేవుని నుతించుచుఁ దక్కినపద్యములు చెప్పె ననినైన విశ్వసింపవలసివచ్చును. కందిరీఁగలు వానియంతట నవియే లేచినచో, భగవదుద్దేశమో, కవిమాహాత్మ్యమో, యెవ్వరు నిర్ణయింపఁగలరు? ఇది కర్మపద్ధతి. ఎవ్వరికిఁ దోఁచినట్లుఁ యెవరి మతానుసారము వారికథ నమ్ముదురుగాక! దైవపౌరుషములలో నెద్ది ఘనతకలదో తేల్చినవా

రెవ్వరు? ఆ సందేహము సృష్టితోనే పుట్టినది. తన్వినాశ ము తోఁ దీరవలెఁ గాని యెన్నిమతములు బయలుదేరినను, ఖండించినను పూర్వపక్షసిద్ధాంతగ్రంథములే పుట్టును గాని సందేహము చావదు. అది భగవంతుని యినుపపెట్టెలోని పరమరహస్యము! మనుష్యబుద్ధికి సులభముగఁ జిక్కునని తోఁపదు. అది యట్లుండనిండు.

"సీ. జయమూరె యవనరాట్సంతమసము బాసె
భవదీయ భాస్వత్ప్రభాబలమున
భువనజాతంబులు పాలువుచేఁ జెనోంచె
దిక్చక్రములు చాల తెలివినొందె
కమలజాదుల నుతుల్గణనసేయని నీవు
లీల నామనవి చెల్లించినావు
బ్రహ్మాండభాండ సంభరణలీలాఘను
నిల నిన్ను మెచ్చి యేమియ్యఁగలను
గీ. తోఁచ దిఁక నెట్టులిదె నాకుఁ దోఁచినట్లు
తులసిదళ మొక్కటిత్తు సంతోషమొందు
మదియె యగణితపూజగా నవధరింపు
వైరిహరరంహ! సింహాద్రినారసింహ!

ఇట్లు తనకోర్కె నెరవేరినట్లు కవి చెప్పుటచే నిందు కొంతసత్య ముండియుండవలెను. కవికాలమునాఁటికి యవను లబాధ లతిక్రమించినట్లు చరిత్రలు సాక్ష్య మిచ్చుచున్నవి. తుమ్మెదలమెట్ట యిప్పటికిఁ గన్పట్టుచున్నది. ఆస్తికులైనవా రిది పరమసత్యమని నమ్ముచున్నారు. కొందఱు నవనాగరకు లిది యసత్య మనుకొన్నను, అనేకఫలపుష్పభరితమైన సింహా

చలముపై ననేక తేనెటీఁగల తేనెపట్టులు పెట్టుకొని యుండును. చెట్లను, పొదలను, కొట్టివేయుచు మహమ్మదీయుల సైన్యములు కొండ నెక్కుచుండగా నా తేనెటీఁగల శాంతికి భంగము కలిగి ఝమ్మని లేచి సైన్యమును దాఁక, కాకతాళన్యాయముగఁ గలిగిన యీ సంరంభమును జూచి యిట్లు తన భక్తికి మెచ్చి భగవంతునిపంపుచే నీయీఁగలు వచ్చిన వని కవి తలంచియుండె ననుకొనఁగూడదా? ఏది యెట్లున్నను కవి శతకము నందలి పై పద్యమే కథ సత్య మని తలంపఁ జేయుచున్నది.

శతకము నందలి కొన్ని పద్యములఁ జూపెదను.

సీ. సముదగ్రమగు సముద్రముఁ జొచ్చి యీఁదుటో
కొండ నెత్తినఁ బెట్టి కొంటయొక్కొ
ధారణీస్థలిద్రవ్వి తల నెత్తుకొంటయో
గొబ్బున సింగంపు బొబ్బయిడుటో
యడుగిడి త్రైలోక్య మాక్రమించుటయొక్కొ
వేయిచేతులవాని వేయుటొక్కొ
యొక శరాగ్రమ్మున నుదధి నింకించుటో
కరిపురం బెల్లఁ బెగల్చుటొక్కొ
కరుణ జగములఁ బ్రోచుటో తురగ మెక్కి
ఘనరిపులఁ గొట్టుటో తురష్క వధయెంత
కొండయెక్కెదు బ్రతిమాలుకొనిన కొలఁది
వైరి హరరంహా! సింహాద్రి నారసింహా! 17

సీ. పాలీయవచ్చిన భామినిప్రాణంబు
లపహరించి చెలంగినట్లుగాదు

యాగోత్సవంబున కతిమోదమున బిల్వ
నపుడు మామను ద్రుంచినట్లుగాదు
చేతగాకొక నరుచేతఁ జుట్టంబుల
నందఱఁ జంపించినట్లుగాదు
తుంగ గల్పించి యుత్తుంగవంశద్రోహ
మాచరించి చెలంగునట్లుగాదు
పరబలంబిది నీప్రజ్ఞ పనికిరాదు
లెమ్మికను మీనమేషములెక్క యిడక
చోరవతురకల గొట్టఁగాఁ జూక్కలెదురె
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! 23

సీ. తపనీయకశిపుండు దండించు తరువాత
గాని ప్రహ్లాదునిఁ గావలేదు
కురురాజు పాంచాలి కొప్పుపట్టీడిపిం
చిన వెన్కగాని రక్షింపలేదు
కరిరాజు మొసలిచేఁ గడుకష్టపడిన పి
మ్మటగానిఁ వేంచేసి మనుపలేదు
పాండవుల్బాధలఁ బడినయనంతరం
బునగాని సిరులిచ్చి బ్రోవలేదు
భక్తులెప్పుడు కొన్ని యాపదలపడక
ముందు పోషింప వట్లయా కొందరికిని
మును శిశువు నేడిపింపక ముద్దు రాదు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! 31

సీ. అలవిప్రభార్యయా నదితిపాల్ద్రావుట
బలియాచనావృత్తి పాదుకొనియె
క్షత్రియకన్యయా కౌసల్యబాల్ద్రావ
రావణాదులఁ ద్రుంచి ప్రబలినావు
గొల్లయానందుని కులసతిపాల్ద్రావ
పసులఁగాచెడు బుద్ధి పట్టువడిరె

నిసుమంత విసఁపురక్కసి పాలు చవిచూడఁ
గాబోలు మాపట్ల కఠినవృత్తి
పాలకాగ్రణివైన గోపాలబాల
పాలబుద్ధులు మాని మాపాలఁగలిగి
పాలన మొనర్పవయ్యా కృపాలవాల
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 35

సీ. చాటకపోఁజుమీ చాలబ్రోవక యున్న
నాఁటిబ్రేపల్లెలో ఱోటిమాట
ప్రకటింతుఁజుమి మమ్ము రక్షింపకుండిన
తగగొల్లచెలుల వస్త్రములమాట
దాఁచనుజుమి మమ్ము దరిజేర్పకుండిన
కొంకక మధురలో కుబ్జమాట
బైటఁబెట్టెదజుమీ పాలింపకుండిన
కాలయవనునాటి కానిమాట
మర్మ మెఱిఁగిన వారితో మానువాదు
బైసిబోఁగొట్టుకోకు మాపాలఁగలిగి
సాధురక్షణ దుష్టశిక్షణ మొనర్పు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 43

సీ. మా మొఖాసాకు గ్రామంబు లిమ్మనలేదు
కొంపలు గాల్పింప కూడదంటి
కరిహయాదుల మేము గాంక్షింపఁగా లేదు
గోవధమాన్పించి ప్రోవుమంటి
మాకు మిమ్ములను సామ్రాజ్యమిమ్మనలేదు
జనులను దోపింపఁ జనదటంటి
స్వామి మాకొఱకేమి కామింపఁగాలేదు
క్షితిలోనఁ బ్రజల రక్షింపుమంటి
చెలఁగి నీపదసేవలు జేయుమాకు
వేఱుకోరికలేటికి వెన్నగలుగ

నహాహా! నేఁటికి నేతికి నంగలార్చు
వైరి హారరంహా! సింహాద్రి నారసింహా!

సీ. మున్ను తాటకప్రాణముల్గొన్న బాణంబు
మెఱసి సుబాహుదున్మిన విశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహారణశరము
మాయలమారీచు మదమణంచిన తూపు
ఘోరకబంధునిఁ గూల్చు సిలుగు
వాలిని బలశాలిఁ గూలనేసిన కోల
జలధి నింకించిన సాయకంబు
రావణాది మహాసురరాజి నణఁచు
చండకాండంబు లేమాయె చటుల యవన
ఖండనము సేయ నయ్యంబకముల బఱపు
వైరిహారరంహా! సింహాద్రి నారసింహా!

## సజాతీయ శతకములు.

### (1) శత్రుసంహార శతకము.

సీ. అవిగో నిరంతరోద్యద్దాన ధారాళ
ధారాళగోద్దండ దంతిఘటలు
అవిగో యసంఖ్యాత పవమాన జవమాన
ధాటికాఘోటికోద్ధతరజంబు
లవిగో నిరాఘాట హాటకధ్వజపట్ట
పటపటత్కార ఝంపామరుత్తు
లవిగో భటోద్భటాద్యంత భీకరకరా
ళి కృపాణ కర్ష స్ఫులింగపంక్తు
లనుచు సురతానియబ్బుల గనసెమోవి
గుంటకావలి జలదంకి కొడవలూరు

గండవరములం మును మున్నె కలవరించె
శత్రుసంహార! వేంకటాచలవిహార! 4

సీ. వడిగుళ్ళు సొచ్చి దేవళ్ళ బద్దలుఁ జేసి
ఘట్టించి తేజీలఁ గట్టునపుడు
జిగురుపాలకటంచుఁ జిగిరించు రావిమ్రాఁ
కులు నజ్జునజ్జుగాఁ గొట్టునపుడు
గురుసార్వభౌముల గోడుపోసుక పట్టె
నామము న్మొదలంట నాకునపుడు
గద్దించి వెస వైదికపుబాపనయ్యల
పిల్లజుట్లూడంగఁ బెఱుకునపుడు
సెక్కమా నీకుఁ దురకలఁ జక్కఁజేయ
విన్నవించితి నా వెత్తివిన్నపంబు
పరఁగ మీచిత్తమిదె నాదుభాగ్యమౌర
శత్రుసంహార! వేంకటాచలవిహార! 5

సీ. తాళ్ళపాకచిన్నన్న దండెమీటులుఁ గావు
గోమాంస భుగ్దుర్గుణరవములు
బంటోసంగిన బంకమంటి పువ్వులుఁ గావు
యవనాధముల చిలుకంపగములు
సాముడ్డిగియు నీటిచల్లులాటలు గావు
పాశ్చాత్యభటుల తుపాకిగుండ్లు
సంపెంగబాకులుఁ జరిగింపుటలుఁ గావు
రిపులపాశములు దర్శించుపగలు
బంటుపంతము దగదంచుఁ బంటకాఁపు
దనము గైకొంటి విది మంచిగుణము దినము
జనము దెచ్చిన ధనము లప్పనము లిచ్చి
శత్రుసంహార! వేంకటాచలవిహార! 11

సీ. మొన్న గన్నడవారి ముద్దులాడీమిటూరి
కెమ్మోవిఁ జూచి గుఱ్ఱకెళ్ళు మిఱ్ఱింగి

నిన్న నంబిమిటూరి నెఱనీటు ముక్కుమొం
గఱఁ జూచి మది జాలుగాఁ గరంగి
నేడు కోమటివారి నెలఁత మేల్గబ్బిగు
బ్బల హొయలూచి పైఁబడఁ దలంచి
యిప్పుడు ద్రావిడభామ యొటమోము చక్కద
నముఁ జూచి చాలదిగ్భ్రమము బొంది

తత్తరించెద వితర సుందరులకొఱకు మాను
మాయమ్మ యలమేలు మంగ కంటెఁ
జక్కనివధూటిఁ గలదె ముజ్జగములందు
శత్రుసంహార! వేంకటాచలవిహార! 13

సీ. పాక్లైళ్ళగతిఁ బట్టి బోడిసన్యాసుల
ఢీయని తాఁకులాడిరచు నొకఁడు
సోమయాజుల బ్రహ్మసూత్రముల్ ద్రెంచి సిం
గాణి విండ్లకు నల్లెఁగట్టు నొకఁడు
ఖూబ్ ఘోడా యంచు గుడికీలు గుఱ్ఱము
నెక్కి ధేయని తర పెత్తు నొకఁడు
పైకాలు గొమ్మని బల్మిఁ గోమటివారి
చెలువపైఁబడి టూతు సేయు నొకఁడు

యవనసమ్మర్ద దుర్దినంబైన దిగువ
తిరుపతినిఁ జూడు మిటువంటి తఱిని నిదుర
పోవుచున్నాఁడు మీయన్న లేవలేక
శత్రుసంహార! వేంకటాచలవిహార! 15

సీ. సీకాయిపొదలు క్రొంజమట మాగుడు బొంద
శాలఁటి చేరిన వేరులుఁగాని
గరదంపుఁదరుల గల్గదుర నెత్తురుపచ్చి
తోళ్ళంటి తూలినఁ దూలుగాని
పావన తీర్థము ల్పలలఖండపు జిడ్డు
చమురంటి తామికిన దుముకుగాని

మణిశిలామార్గము ల్మస్తిష్క జంబాల
ఝరులంటి జాతిన జాలుఁగాని.
జీర్ణకర్ణాటలక్ష్మి రక్షింపలేవె
చెండిరాతుల దిర్మలకొండ నెత్తి
మెంత గాలైన మది నసహ్యించుకొనక
శత్రుసంహార! వేంకటాచలవిహార! 29

సీ. ఏకామ్రనాథుండు లోకభీకరమైన
హాలాహలముఁ గ్రోలి సోలినాఁడు
కాళహస్తీశుండు కప్పెరగొని బిచ్చ
మెత్తుకొని యింటింటి కేగినాఁడు
అల చిదంబరుఁడు దిగంబరవేషము
పూని యదృశ్యమై పోయినాఁడు
భ్రమరాంబికాభర్త భస్మాసురుని కల్కి
పంచబంగాళమై పాఱినాఁడు.
వీరు నీ కూర్మిసఖులు నీ వీరవరులు
కోపుదప్పిరి నీవును సూపలేవు
చివ్వకెవ్వార లిఁక మొనసేతువారు
శత్రుసంహార! వేంకటాచలవిహార!. 48

మామిడికింది సోమరిపోతు శ్రీభాష్య
కారుల కేల సంగరము గోడువ
అలమేలుమంగ సొమ్ములపెట్టియలు కాచు
కొనియుండుటే చాలు హానుమానికిని
శివిని బంకమంటి విడ లన్నమయ్యింటి
తెరుగాట్లు కరిగెను గురువనంబి
చెంచుమితారితో బంచబాణక్రీడ
లోలుఁడయ్యెను కప్పడాల నృహరి
నీకు మదికోప మింతయు లేకపోయెఁ
బోయెగాకేమి లొందమా న్యాయమిస్తాలుఁ

డున్న నింతకుఁ దురకల మన్నిగొనడె
శత్రుసంహార! వేంకటాచలవిహార! 49

సీ. కటకేందుపుత్రు నీ కౌఁగిటిలోఁ జిక్కి
జెళ్ళపిళ్ళస్వామి చేతఁగాదు
కృష్ణమాచార్య సంకీర్తనంబులఁజొక్కి
సింహాద్రి యప్పయ చేతఁగాదు
కవ్వంపుకొండ సంఘర్షణోద్ధతిఁ జిక్కి
శ్రీకూర్మనాథుని చేతఁగాదు
సాంఖ్యతొండనిరాశ జళికెంతయును గ్రుక్కఁ
జెన్నమల్లేశుని చేతఁగాదు
పవన జవన నిరాఘాట యవనఘోట
హరణ జయధాటి మీ చేతనౌనె మేటి
వాదువొక సన్న జూడు మేలాపరాకు
శత్రుసంహార! వేంకటాచలవిహార! 52

ఈ పై శత్రుసంహారశతకమను వేంకటాచలరమణ శతకమును వ్రాసిన కవి యెవ్వరో తెలియదు. నేను వివిధ ప్రదేశములయందలి 3 ప్రతులఁ జూచితిని. 99 పద్యములు మాత్ర మున్నవి. ప్రారంభ పద్యము, తుదిపద్యమును గనఁబడవు. ఈ శతకము తురక లౌరంగజేబు కాలమునందు క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమధ్యమున 1670 ప్రాంతముల చిత్తూరు, నెల్లూరుమండలముల దోపిడిచేసిన కాలమునందుఁ బుట్టినది. దీనిని గోగులపాటి కూర్మనాథుఁడో, ఆతని వరహానరసింహ శతకము నీ శత్రుసంహారశతకకర్తయో చౌర్యము చేసి యుండవలెను. సమాన పద్యములు, భావములు, వాక్యములును గూడఁ గనఁబడుచున్నవి.

ఇట్లే శత్రుసంహార వేంకటాచల విహారా యను మకుటముతో నొక శతకమును వ్రాసెను. ఈ కవి వ్రాసిన శతకములు కొన్ని కనఁబడుచున్నవి.

(2) పశ్చిమరంగశతకము.

శత్రుసంహార మొనర్పు మని, దానికిఁ బ్రయత్నించు దేవరాయనికిఁ దోడ్పడు మని పశ్చిమరంగని సంబోధము,

క. ఈ వేళ దేవరాయధ। రావరునకు జయ మొసంగరా సమరాహం
భావ భవవిభవ సుభగం। భావుక బాహా రథాంగ పశ్చిమరంగా!॥

ఎవ రెప్పుడు వ్రాసినదో తెలియదు. (14—8—8 (1) ఓ. లై.)

(3) "రాక్షసవిరామ కస్తూరిరంగధామ" యను మకుటము గల "గంగధామశతక" మొకటి తుంటకలదండు పైఁ జెప్పినది. (14-17-12 ఓ. లై.) 54, 55 పుటలు.

(4) "రాత్రిచరవైరి కస్తూరిరంగశౌరి!"అను శతకము.

(5) విశ్వనాథశతకము (అమలాపురపు సన్యాసికవి, పాలతేరు కుమ్మరిది.)

# వెలగపూడి కృష్ణయ



ఇతఁడు కృష్ణకర్ణామృతమును వ్రాసిన వేంగనార్యు వంశములోనివాఁడు. భానుమద్విజయమనెడి యైదాశ్వాసముల గ్రంథమును వ్రాసెను. ఇతఁడు మాలతీమాధవమను సంస్కృత నాటకమునకుఁ దెలుఁగుచేయుటయే గాక, గౌళికాశాస్త్ర మను బల్లిపలుకుశాస్త్రము, చతుర్విధకందశతకము, అను పద్యకావ్యములును, వేదాంతసారసంగ్రహ మను వచన కావ్యమును రచియించినట్లు భానుమద్విజయపీఠికలోఁ జెప్పుకొనినాఁడు.

(1) మాలతీమాధవము (శృంగారకావ్యము.)

(2) గౌళికాశాస్త్రము (ఏకాశ్వాసము)

(3) చతుర్విధకందశతకము (శతకము)

(4) వేదాంతసారసంగ్రహము (వచనము)

(5) చాటుకృతులు (మఱికొన్ని)

ఈతని వంశపువారి కృతు లివి యని చెప్పెను.

(1) గాంగేయోపాఖ్యానము

(2) సుమంతోదయము

(3) ఆంధ్రకర్ణామృతము

(4) వజ్రభుజోపాఖ్యానము
(5) సేతుమాహాత్మ్యము
(6) దత్తాత్రేయచరిత్రము
(7) మర్యాదరామసచివచరిత్రము

మర్యాద రామన్న క్రీ॥ శ॥ 1720 కిఁ బూర్వుఁడని తెలియుచున్నది. ఇతని చతుర్విధకందశతకము దొరకలేదు.

"ఈ కవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆప స్తంబసూత్రుఁడు; లోహితసగోత్రుఁడు, వెలగపూడి నార సింహ పౌత్రుఁడు; నరహరిమంత్రి పుత్రుఁడు," నని కవుల చరిత్రమున నాతనిగ్రంథమును బరిశీలించి వ్రాసియుండిరి.

ఈ కవి పాండ్యమండలాధీశ్వరుఁడైన సాంబయామా త్యుని పుత్రుఁడగు గోవిందామాత్యునకు మేనమఱఁది. ఈ గోవిందప్రధానుఁడు సంగీత సాహిత్య సంస్కృతాంధ్రకవిత్వ సరసజ్ఞుఁడు. విద్యాధికారి. ఈకవి కిష్టదైవము దక్షిణామూర్తి. భానుమద్విజయము కృత్యాదినిఁ గవియే పై సంగతి వ్రాసి యున్నాఁడు.

పాండ్యమండలాధీశ్వరుఁ డగు విజయరంగ చొక్క భూపాలుఁడు క్రీ॥శ॥ 1704—1731 వఱకుఁ బాలించెను. కావునఁ గృష్ణకవి యా కాలమువాఁ డనవచ్చును. తన మేన మామ యగు సాంబదండనాథుఁడు, ఆర్కాటు నవా బగు

సాదతల్లాఖాను నెదిరించి పోరినట్లును, తంజాపూరుపీష్వా (Peshwa = పేష్వవా) ఆనందరావు నడంచినట్లును, మైసూరు నంజరాజుతో సంధి కుదిర్చినట్లును, కవి వర్ణించెను. ఈ సాద తల్లాఖానుఁడు క్రీ శ॥ 1710—1732 వఱకు నార్కాటు నవాబుగాఁ బరిపాలించెను. కవి మధురాపురమువనుండి యుం డవచ్చును.

ఈతని చతుర్విధకందశతకము దొరకలేదు కావున శైలికిఁబద్యము లీయఁజాలకపోయితిని.

---

## అడిదము సూరకవి

ఈతనిచరిత్రమును విపులముగఁ బ్రత్యేకముగ శ్రీఅడి దము రామారావుపంతులుగా రీతనివంశీకులే వ్రాసియుండు టచేఁ గవిచరిత్రాదుల వివరములకంటె మన కెక్కుడు విష యము లిప్పుడు తెలియుచున్నవి. కావున నేనిం దీతనివివర ములు సంగ్రహముగానే వివరించెదను.

అడిదమువారు మొదట మోదుకూరివా రనియు, గ్రంథవారణము (గంథవారణము?) వా రనియు గృహనామ ముల విరాజిల్లి, తుదకు నీలాద్రికవి బ్రాహ్మణుఁ డయ్యు యుద్ధమునఁ జూపిన కరకౌశలముచే నీ బిరుదనామము గృహ నామముగా స్వీకరించిరి.

చ. ఇరువదిమూఁడు పూరుషము । లిప్పటి కయ్యెఁ గవిత్వ వృత్తిచే
నరపతు లెల్ల మెచ్చఁ బదు । నాల్గుతరంబులు మించుఁ బిమ్మటన్
వెఱవనుజీవనస్థితి లభించుట । తొమ్మిది యయ్యెఁ బూరుషాం
తరములు నిక్కఁ గళింగ వసు । ధాధవు చెంగట నాశ్రయించుటల్.

(సూరకవి చాటుధార)

పై పద్యమువలన నీ వంశమువారు ప్రాచీనులనుండియుఁ గవులయి, రాజులవలన నగ్రహారములఁ బొందుచుఁ సూరకవి నాఁటికే తొమ్మిదితరములనుండి కళింగరాజుల నాశ్రయించి యుండి రని తెలియుచున్నది. పై నీలాద్రికవికి మూఁడవ మనుమఁ డగు బాలభాస్కరకవి శుద్ధాంధ్రరామాయణ మొకటి రచియించినట్లు కవిసంశయవిచ్ఛేదాది గ్రంథముల వలనను, వాడుకవలనను దెలియునుగాని గ్రంథము దొరకదు. నీలాద్రికవి "రణరంగవిజయ" మను కావ్యము వ్రాసెనఁట! బాలభాస్కరకవిరామాయణము దొరికినచోఁ గూచిమంచి తిమ్మకవి యచ్చ తెలుఁగురామాయణమునకుఁ బూర్వపుది కావచ్చును.

సూరకవి బాల్యమున "భూపాలరాజు రేగ" యను గ్రామమునఁ దండ్రి యగు బాలభాస్కరుని కడ విద్యనభ్యసించుచు నుండి, తండ్రి మరణానంతరము తన మాన్యము లున్న గ్రామములకుఁ గేంద్రస్థాన మగు చీపురుపల్లె యను గ్రామమున నివాస మేర్పఱచుకొనెను. ఈతఁడు రామచంద్రపురమునందలి రామలింగేశ్వరస్వామికిఁ దన గ్రంథములఁ

గృతి యిచ్చెను. కోటిపల్లె యీతని యత్తిల్లు. వడ్డాదివారి యాడుపడుచును బెండ్లియాడెనఁట! పై కారణములచే నీతఁడు గోదావరిమండలమునఁ గూడఁ గొంతకాలము గడిపియుం డును. సూరకవి పెండ్లిసంభావనలు, వర్షాశనములను స్వీకరిం చుటకై పెద్దాపురము, పర్లాకిమిడి, పాలకొండ, బొబ్బిలి, చెముడు, శృంగవరపుకోట మొదలగు సంస్థానములకుఁ బోవుచు, కోమట్లవలన సంభావనలు స్వీకరించుచు సంవత్సర మున కాఱుమాసములు దేశసంచార మొనరించువాఁడు. ఈతఁడు శాపానుగ్రహ సమర్థుఁ డని జనులు నమ్ముచుండుట చేతను, సహజభీరువు లని యధిక్షేపణ లందు వైశ్యులను బెద రించి నాలుగైదురూపాయిలదగ్గఱనుండి సంభావన లందు చుండుటయేగాక. చింతకాయలకొఱకుఁగూడఁ బరులు నాశ్రయించి, యీయకున్నఁ దిట్టుపద్యములఁ జెప్పి, యానాఁటి కవుల కొందఱవలె నీతఁడుకూడఁ గవితను దుర్వినియోగ మొనర్చె నని కొందఱు నిందింతురు. ఆ కాలమునందుఁ గవు లన్న భయ ముండెడిది; ఈ జాతి కవులవలనఁ గవులపై, గ్రంథములపైఁ బ్రజలకు భక్తికంటె భయ మధికముగ నుండెడి దని నిర్ధరింపవచ్చును.

సూరకవి క్రీ. శ. 1720 ప్రాంతమునఁ బుట్టి యరువది మూఁడు వత్సరములు జీవించి రమారమి క్రీ. శ. 1785లో మరణించెను. ఈతని పిమ్మట నీతని పుత్త్రుఁడు బాలభాస్క

రుఁడు కూడ కవియయ్యెను.సూరకవి విజయనగరపు ప్రభువు లైన పూసపాటి పెద విజయరామరాజు, చినవిజయరామ రాజుగార్ల కాలమున నుండె నని యాతని చాటుపద్యముల వలనఁ దెలియుచున్నది.

ఈతనికాలమున సోమకవి యను నొక వైదికబ్రాహ్మణుఁడుండెను. సూరకవికి, నాతనికిఁ బడదు. ఒకరి నొకరు తిట్టుకొనుచు తుదకు జాతుల నిందలకు దిగిరి.

సూరకవి యిట్లు చెప్పెనఁట!

క. చెన్నగు నియోగికవనపు
మిన్నా వైదికుని కబ్బి మించునె జెపుడా
వెన్నమిసి జున్నుకబ్బునె
తన్నుకచచ్చినను గాని ధరలోన నృపా.

సోమకవి యిట్లనెనఁట!

గీ. తర్కకర్కశబుద్ధులై దగినవారి
కే మసాధ్య మటంచు నూహింపరాదె
తెలుఁగుమాటలు నాల్గయిదు తెలిసి తాము
కవుల మనుకొన్న వెఱిపాడఁగట్లు మదిని.

అట్లు వాదప్రతివాదములు జరిగినను సూరకవి రాజుల చేతను ప్రజలవలనను గౌరవ మధికముగ నంది, యాతనికవిత సుప్రసిద్ధం బగుచుండుటఁ జూచి సోమకవి యిట్లు విలపించె నందురు.

క. జిలిబిలిపలుకుల వెలఁదీ!
పలుగాకి నకారగుళ్ళ పాలై తిగదే
యిలలో వైదికవిద్వ
త్తిలకంబుల కేదిదిక్కు తెల్పితి నమ్మా!

ఇట్లే యాంధ్రకవిత చెప్పిన నియోగులే చెప్పవలె; వైదికులవలనఁ గాదను వృథావాగ్వ్యయ మిటీవలఁగూడఁ బెరిగియున్నట్లును, ప్రజలయందున్న యీ వాడుకపరిపాటిని నిరసింపవలె నని యీ వాడుకకుఁ బ్రత్యుత్తరముగ నిటీవల కవులు పద్యములు వ్రాసినట్లును, నిరూపించుటకుఁ గష్టపడి యనేక చాటుపద్యముల దేశమెల్లఁ దిరిగి సంగ్రహించుచున్న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ చాటుపద్యమణి మంజరి రెండవభాగమున నీ వివరము లున్న పద్యములను విడువకుండఁ బ్రకటించి మనప్రజలయందు వాడుకలో నుండిన యొక పరమసత్యమును వెల్లడించి భావిచరిత్రకారున కానాఁటి పరమసత్యము తెలియుటకు సాయపడినారు. ఆపద్య మిది:—

ఉ॥ చందనశాఖికన్న విరసం బగు బూరుగు మేల టన్న శీ
విం దగినట్లు వైదికకవిత్వసుధారసధార లెల్లఁ జె
ల్వొందఁగ భూతలంబున నియోగికవిత్వముతోడ సాటిరా
దందురు! బెట్టిదం బగునటందురు! కొందఱు మూఢమానవుల్॥.

ఈ పద్యము వ్రాసినవాఁ డల్లంరాజు సుబ్రహ్మణ్యకవి యఁట! "సాటిరాదందురు," "ఎవరు?" ఎవరయినను వారు మూఢమానవులఁట! తనకే యీ తిట్టనుకొని సుబ్రహ్మణ్య

కవి పుచ్చకాయలదొంగ యనఁగనే బుజములు తడుముకొని పాపమ ట్లనుకొనువారిని మూఢులని తిట్టుటలో వింతలేదు. కాణాదన పెద్దనసోమయాజి ముకుందవిలాసమును సంపూర్ణ ముగ దొంగిలించి, యవకతవకకృత్యాదినిఁ దగిలించి, ప్రభువును మోసగించిన సుబ్రహ్మణ్యకవి పైమాట లనఁగలడా? విచార్యము.

అడిదము సూరకవి చంద్రమతీపరిణయ మను నామాంతరము గల కవిజనరంజనము, (2) కవిసంశయవిచ్ఛేద మను చిన్నలక్షణ గ్రంథమును, (3) చంద్రాలోక మను భాషాంతరీకరణాలంకారగ్రంథమును, (4) ఆంధ్రనామశేష మను నిఘంటువును, (5) రామలింగేశ శతకమును, (6) పొణ్ణుపాటి వేంకటమంత్రి శతకమును, (7) రామదండకము మొదలగు గ్రంథము లనేకములు వ్రాసియున్నాఁడు. ఈతని చాటువు లనంతము లున్నవి. మనకుఁ బ్రస్తుత మీతని రామలింగేశ శతకమే పరిశీలించుకొనవలసినది.

విజయరామరాజుగారి సవతియన్న యగు సీతారామ రాజుగారు రాజ్యభారము వహించి తమ్మునిపక్షమున వ్యవహరించుచుండెను. ఆయనపాలనము వైరులకేగాక బ్రాహ్మణులకు, సజ్జనులకు, ప్రజలకుఁగూడ బాధాకరముగ నుండెను. ప్రజలు నిరంకుశప్రవర్తనమునకు లోంగి కుళ్ళుచుండిరి. అప్పుడే సూరకవి రామలింగేశ్వరశతక మను నిందాగర్భ

కావ్యము (Satire) వ్రాసెను. సీతారామరాజుగారు నూతన రాజ్యనిర్మాత లగుట నట్టి పరివర్తన మవసర మని యొకరు సమర్థింపఁజూచిరి కాని, యది సూరకవియెడ, లోకమునెడ వారుచేసిన మహాపరాధ మని వినయపూర్వకముగఁ జెప్పుచున్నాను. సీతారామరాజొనరించినది రాజద్రోహము, దేశద్రోహము! అది నిందించిన సూరకవి వంద్యుఁడు. తప్పు చేసిన సీతారామరాజును సమర్థింపఁజూచుట యాత్మవంచనము!

రామలింగేశ్వరశతకము, కాగుచున్న సూరకవి హృదయమును, మండుచున్న సూరకవి కోపాగ్నిని, కన్నీళ్లతో దేవదేవునికి విన్నవించిన ప్రజలబాధలను, మన కట్టెదుటఁ బెట్టును. ఇది పూర్వశతకముల కనుకరణమైనను గుణవంతమైనది. కొన్ని పద్యములఁ బట్టి చూచెదముగాక!

సీ. శక్తిచాలనివాఁడు సాధుత్వము వహించు
విత్తహీనుఁడు పాపవృత్తి దలఁచు
వ్యాధిపీడితుఁడు దైవతభక్తిఁ బొరలాడు
ముదిమి పాతివ్రత్యమునకుఁ జొచ్చు
నాపద బ్రాప్తింప నన్యార్తికిఁ గృశించు
భారంబు పైఁబడ్డ బరువెఱుంగు
రమణిలేకున్న విరక్తి మంచిద యను
తనివార మానివర్తనముఁ దాల్చు
నెంతవారలకైన మహీతలమున
నిట్టి భావవిరక్తుల కేమిఫలము

తినరుచియుఁ జోరలోతును దెలియఁబడదె
రామలింగేశ రామచంద్రపురవాస! 42

సీ. పసరంబు పాఁగైనఁ బసులకాపరి తప్పు
పరిజలు దుర్ణయులైనఁ బ్రభువు తప్పు
భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు
తనయుండు ధూర్తైనఁ దండ్రి తప్పు
అశ్వంబు పాఁగైన నాగోపికుని తప్పు
దంతి దుష్టైన మావంతు దప్పు
సైన్యంబుఁ బెదిరిన సైన్యనాథుని తప్పు
కూతురు చెడుగైన మాత తప్పు
ఇట్టి తప్పులెఱుంగక యిచ్చవచ్చి
నట్లు చరియించువానికి హానివచ్చు
నాడికలు గల్గు నది నిక్క మరసిచూడ
రామలింగేశ రామచంద్రపురవాస! 43

సీ. అర్థాతురునకుఁ గృత్యాకృత్యములు లేవు
కవిజనంబుల కెఱుంగనిది లేదు
కుక్షింభరుఁడుగాని కూటికి రోయఁడు
కామాతురుం డర్థకాంక్షఁ బడఁడు
వెలిచవుల్గాను కాంత వెఱవదు నిందకు
నీఁతకు మిక్కిలి లోఁతు లేదు
పాపశీలునకు దయాపరత్వము లేదు
వెఱ్ఱివానికి సాధు వృత్తిలేదు
మద్యపాయికి ననరాని మాటలేదు
గ్రామ్యునకు గల్గదెందు నాగరికముద్ర
తప్పెఱుంగక పోవఁ డుత్తమకులజుఁడు
రామలింగేశ రామచంద్రపురవాస! 47

సీ. పరునితో రమియించు భార్యఁ గూడుటకంటె
మలిన దాసీ షంగమంబు మేలు

అని కోపగించు సైన్యాధిపత్యముకంటె
గోపాలకత్వంబు కొంత మేలు
పరులఁ బీడించెడు ప్రాభవంబునకంటె
నందమై తోఁచుఁ భిక్షాటనంబు
మనవిఁ జెప్పఁగ లేని మంత్రిత్వమున కంటె
ఘనముగాదే సూపకారవృత్తి
తనదు చెల్లెలి దొడ్డ భూధవునకిచ్చి
యతనివలనను సిరిఁగాంచు నంతకంటె
సారమైతోఁచుఁ గొండ దాసరితనంబు
రామలింగేశ రామచంద్రపురవాస!

సీ. శ్రీవైష్ణవుఁడు ముడ్డిఁ జెంబులోఁ గడిగిన
నదియు సదాచార మనఁగఁ దగునె
సోమయాజి సుతుండు శునకంబుఁ జంపిన
నది న్యాయపద్ధతి యనఁగఁ దగునె
పరపీడనము రాజు గురువుగా రొనరింప
నది సాధువర్తనం బనఁగఁ దగునె
పౌరాణికుం డుల్లిపాయ భక్షించిన
నది నిషేధంబుగా దనఁగఁ దగునె
ఛాందసుం డొక్కరుఁడు మలోత్సర్జనంబు
సేయఁ బోవుచు శివుని దర్శించెనేని
యతని సద్భక్తుఁడని కొనియాడఁదగునె
రామలింగేశ రామచంద్రపురవాస! 84

సీ. ఉభయసంధ్యల నిద్ర యుచ్ఛిష్టసంగ్రహం
బసవసవనయన దిగంబరతలు
గ్రాసాతిరేకం బకారణహాసంబు
చరణద్వయాల్ప సంక్షాళనంబు
పరవధూ పరవిత్త హరణాభిలాషయు
స్వాంగవార్యమును ద్యూతాభిరతియు

చలిన్నాంబరత జానువులు మాళిఁజేర్చుట
యవని లేఖనము దంతాల్పపూజ
పలుమ రుమియుట దుశ్శీల భాషణములు
మొదలుగాఁ గల దుర్గుణంబుల నటింప
శ్రీనివాసునకైనను సిరిదొలంగు
రామలింగేశ రామచంద్రపురవాస! 90

సీ. దాసికి దండంబు తలగొరిగించుట । చెలికాని శిక్ష భాషింపకునికి
భార్యను దండంబు పడకకు వెలిచేత । విబుధదండము గారవింపకునికి
అపకారిఁ గొట్టుట యుపకృతిసేయుట । తామసి దండంబు తాల్మిచేత
గర్వాంధునకు శిక్ష గణియింపకుండుట ।ధనవంతునకు శిక్ష తప్పగొనుట

తే. ఇట్టి నయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి । నట్లుచరియించువానికి హానివచ్చు
నాడికలు గల్గు నిది నిక్క మరసిచూడ। రామలింగేశ రామచంద్రపురవాస!

(2) వేంకటమంత్రి శతకము.

క. కలుద్రావువానితో మూ । ర్ఖులతో జవ్వనులతోడఁ గోడెలతోడన్
గలహింపఁబోవరధికులు । విలసన్మతి పొణ్ణుపాటి వేంకటమంత్రీ.

క. కోయక పెరుగదు బచ్చలి । మేయక పాలీయ దావు మేదినిలో డ
బ్బీయక రాదు సుకీర్తియు । వేయేలా పొణ్ణుపాటి వేంకటమంత్రీ.

---

# రావూరి సంజీవకవి

ఈతఁ డనేక కృతులు వ్రాసినట్లు తెలియునుగాని యన్నియుఁ జిక్కుటలేదు. వీరనారాయణశతకము, రుక్మిణీపరిణయమును ముద్రితములు. త్రివిక్రమవిలాసము కూడ వ్రాసె

నఁట. ఈ కవియే వ్రాసిన వసుదేవనందనశతక మొకటి పరిషత్తు వారి కీ నడుమఁ జిక్కినది. ఈ గ్రంథమువలనను, ఈ కవిని గూర్చి యితరులు వ్రాసిన వ్రాఁతలవలనను దెలిసినంత వఱకు వివరములు కొంచెము చూపెదను. తెనాలి తాలూకాలో నున్న పెదరావూరు గ్రామమునం దున్న కరణము లీతని వంశమువారమని చెప్పుకొందురు. "సంజీవకవి స్వగ్రామము మందశము. ఈతని యత్తివారింటిపేరు గంధమువారు. ఈతని వంశీయులలోఁ బ్రస్తుతము తెనాలి తాలూకా పెదరావూరు వెంకయ్యగా రొకరు. వీరి తండ్రితాతలనాఁటినుండియు వంశపారంపర్యముగ నా గ్రామోద్యోగులుగనున్నారు. ఇంకను సంజీవకవివంశీయు లచ్చటఁ గలరు. ఈ రావూరివారు విష్ణుభక్తులు" అని దుర్గాప్రసాదరావుగారు వ్రాసిరి. కవిది బెజవాడ సమీపమునం దున్న మందశము కాపురమైయుండ వచ్చును. తరువాత నాతఁడో, ఆతనివంశమువారో, పూర్వులో రావూరున వసియించియుండవచ్చును. విశేష దూరప్రదేశము కానందున నీచర్చ యనగత్యము.

ఈతనికాల మీతఁడే చెప్పుకొనియున్నాఁడు. వీరనారాయణ శతకమునందు "గుణబాణషట్చంద్రగణనతో శాలివాహన" (1653 శా॥శ॥) వ్రాసితి ననియు, "శకభుజఝషేందుసంఖ్య" (1709 శా॥శ॥) మని రుక్మిణీపరిణయమునను జెప్పుకొనియున్నాఁడు. కావున నీతఁడు క్రీ॥ శ॥ 1730 ప్రాంతములనాఁ

టికే ప్రసిద్ధుఁడైనకవిగా నుండి, క్రీ॥ శ॥ 1786 సంవత్సరము నకుఁబైఁగా రమారమి 80 సంవత్సరములవఱకు జీవించె ననియుఁ జెప్పవచ్చును.

వీరనారాయణశతకప్రోత్సాహకర్త గోపరాజు రాయ నామాత్యుఁ డని యీక్రిందిపద్యమునఁ జెప్పెను.

సీ॥ సుత తటాక వన ప్రభృతి సంతతిని మించి
తిని వీరనారాయణుని మహిమను
కృతిముఖంబునఁ గాని కీర్తి, జగద్వ్యాది
తముగాదు గాన సీసములచేత
సంజీవసుకవీంద్ర! శతక మొక్కటీవు
రచియించు వీరనారాయణున క
టంచు శ్రీగోపరాజాన్వయ రాయనా
మాత్య చంద్రుఁడు రత్నహాట కాంబ

తే॥గీ॥ రాదితాంబూలసత్కృతి నాదరింప
శతకము రచించి యిచ్చితి స్వామి నీకు
కుటిలహృదయవినాశ శ్రీకొలనుపాక
వీరనారాయణముకుంద విశ్వతుంద॥

ఈ గోపరాజు రాయనమంత్రి భరద్వాజగోత్రము వాఁడు. అయ్యవార్మంత్రిసుతుఁడు, కీర్తిమంతుఁడు నని 107వ శతకపద్యమున వర్ణించి తాను కృష్ణభక్తుఁడ నని, సాంఖ్యాయనగోత్రుఁడ నని, రఘుపతిపౌత్రుఁడ, గురవకవీంద్ర పెద్దమాంబలపుత్రుఁడ నని, రఘునాథున కన్న నని, మృత్యుంజయునితమ్ముఁడ నని, రావూరివంశమువాఁడ నని, యనుమకొండ లను ప్రథమశాఖా బ్రాహ్మణులలో నుపశాఖవాఁడ

నని, జాతక సిద్ధాంతముఖకళాచతురుఁడ నని, ఉభయభాషా విశేషరసగుణాలంకృతికవి నని యొకపద్యమునఁ జెప్పుకొని నాఁడు. (చూడుడు - 108 పద్యము. వీరనారాయణశతకము. రుక్మిణీపరిణయకృత్యాది.) ఈ వీరనారాయణశతకమునందు 109 గునుగుసీసములు కలవు. బళిరకటివేల్పు, జయరమా రామ మొదలగు శతకములయందు నిట్లే గునుగుసీసము లున్నవి. ఈ వీరనారాయణశతక పీఠికలో నిట్లున్నది.

"ఈ రావూరువారు సాంఖ్యాయనగోత్రులును, ప్రథమ శాఖా బ్రాహ్మణులును. వీరిని యాజ్ఞవల్క్య లనియు, కాణ్వ లనియు, శుక్లయజుస్సు లనియు, ప్రథమశాఖ లనియు, వాడుదురు. వీరిలో (1) అనుకొండ లనియు, (2) కాకుల పాడు లనియు, (3) ద్రావిడు లనియు, (4) దువ్వ లనియు, (5) ఆర్వ్య లనియు, నైదునాడులు గలవు. ఇం దనుమకొం డలు లౌక్యులు. మాధ్యందిన శాఖయు నిందుఁ జేరినదియ కాని యది వారణాశిప్రాంతమునఁ గల దని చెప్పుదురు."

పై నాడులభేదముల గ్రామనామములచే నిరూ పించియుండిరి. (1) అనుమకొండ ప్రాంతమువారు (2) కాకుల పాడు ప్రాంతమువారు (3) దువ్వగ్రామ ప్రాంతమువారు: (4) దక్షిణాదివారు, (5) ఆలస్యముగ నుత్తరమునుండి వచ్చిన వారు నని యైదువిభాగముల నంది యుండవచ్చును. ఈశాఖ లోఁ జేరిన మాధ్యందిన శాఖవారిని, సర్వసాధారణముగాఁ

దక్కిన బ్రాహ్మణు లేవో కథలు చెప్పి నిరసించెదరుకాని, వేదకాలమునాఁటి యాకథ లెంతవఱకు విశ్వాసపాత్రములోఁ జెప్పలేము. ప్రథమశాఖవారు ప్రాణఘాతకు లని సామెతను, పామువంటివాఁడు ప్రథమశాఖ వాఁ డని వేమనపద్యముల యందును గనుగొందుము కాని, యీ శాఖవారొకప్పు డే కారణముచేతనో తక్కిన బ్రాహ్మణసంఘముతో వైరము సంపాదించుకొని రని చెప్పవచ్చును. ఒక జాతియంతయు నెప్పుడు దుర్మార్గమైన దని గర్హించుటలో సర్వదా సత్య ముండనేరదు. మంచివారును జెడ్డవారునుగూడ నన్నిసంఘము లయందు నుందురు. ఈ శాఖవారిలోఁ గూడఁ జాలమంది తెలుఁగుకవులు కనఁబడుచున్నారు.

ఈ కవినిఁగూర్చి కొన్ని చిత్రమైన కథలు చెప్పు చున్నారు.

(1) దుర్గప్రసాదరావుగా రిట్లు వ్రాసియున్నారు.

ఈ సంజీవకవి మొదట విద్యావిహీనుఁడనియు, అత్త వారింట నవమానపరుపబడి వారణాసికి జని విద్య నేర్చుకొనె ననియు, పిమ్మట యొకప్రభుని తన ప్రౌఢకవిత్వముచే మెప్పించి రెండు కుంచముల యాముదము లివ్వమని కోరి, తన యమాయకత్వమును వెలిబుచ్చె ననియు, తదనంతరమున నాతఁడు కొలనుపాకప్రభువును సందర్శింప నట కేగ రాజస్థాన మందలి పండితు డీతనిని వంచింపఁ బ్రయత్నింప, నాతనికి

హనుమంతోపాసనపరుఁడగు నీ సంజీవకవి లొంగర గ్రామ సమీపములో నున్న ముండ్లపొద కొట్టినయెడ నచ్చట వీర నారాయణుఁ డవతరించు నని రాజున కెఱిఁగించెననియు, అంత నాతఁ డట్లొనరింప సంజీవకవి యీ శతకమును జదివె ననియు, పిమ్మట వీరనారాయణుఁడు భూమి బ్రద్దలుచేసికొని వచ్చెననియు నొక కథ మా పెద్ద వారిలో నొక్కరు చెప్పగా వింటిని."

(2) పరిషత్పత్రికలో నీ కథయే కొంతమార్పుగా నున్నది. కాశికి బదులు భువనగిరి యున్నది. సంజీవకవి విద్యార్థిదశయందలి కష్టములోఁ జదువుకొనుటకు దీపములేక శ్మశానవాటికలోఁ జదువుచుండ రాజు మేడపైనుండి చూచి పిశాచములఁ బ్రయోగించువాఁ డని యనుమానించుటయు, కవిని రప్పించి పరీక్షించి, నిర్దోషియని గ్రహించి యాతనికి సదుపాయములు గుదుర్చుటయు, చదువు పూర్తియైనవెనుక సంజీవకవి కొలనుపాకమీఁదుగాఁ దన స్వగ్రామమునకు వచ్చు చుండ నట వీరనారాయణస్వామిపై శతకము చెప్పి పైకి రప్పించుటయు, నా ప్రభుఁడు మెచ్చి కవి నేమికావలె నని యడుగుటయు, నాస్వగ్రామము చేరువఁగల దారిలో నున్న యొక్కొక్క గ్రామమునకు 24 కుచ్చెళ్ళ భూమిచొప్పున నిప్పింపు మని కోరినట్లును, ఆ ప్రభుఁ డట్లిచ్చుటయు మొద లగు సంగతులు కూడియున్నది.

పై కథలయందుఁ గవి చెప్పుకొనిన సంగతులకు వైరుధ్యములు కనఁబడుచున్నవి. కవి కృష్ణభక్తుఁడ నని చెప్పుకొనెను. కథ కనుకూలముగ నాంజనేయోపాసకుఁ డని మార్పు నొందినది. కవి తనతండ్రి కవి యని చెప్పుకొనెను. కథ విద్యార్జనకు విదేశము లంపుచున్నది. కవి కాలనిర్ణయమును జూచిన కవి వీరనారాయణశతకము బాల్యము నందే వ్రాసినట్లు చెప్పవీలగును. 20 సం॥రముల ప్రాయమున వ్రాసియుండె నందురు. అందువలన నత్తవారింట విద్యరానివాఁడను మొగతాళికి సావకాశము కనఁబడదు. ఏది యెట్లున్నను కవినిగూర్చి తెలిసినసంగతు లివియే!

ఈతఁడు చిత్రబంధకవులవలెను, ఏకాక్షరద్వ్యక్షరకవులవలెను వైచిత్ర్యములు చూపి తన పాండిత్యవిశేషమును ప్రదర్శించియుండెను. ఈ క్రిందిపద్యము రెండుతలలపాము వంటిది.

"క. దామదకరి భూనవకరి
సామరమా భూతనయ దశరథకుమారా
రామా కుధరశథ యనత
భూ మారమసారకవన భూరికదమదా.

తిరుగవేసి చదివినను మొదటిపద్యమే యగును. కాని కవితమాట గంగను గలిసెను. ఈతఁడు వ్రాసినపద్యముల కర్థమీతఁడే సంస్కృతమున వ్రాసియుండెనఁట! మీనసేత్రి, పద్మనేత్రి), పదములు వాడియుండె నవి తప్పని కొంద అభి

ప్రాయపడిరి. కాని యిట్టి ప్రయోగములు నన్నయనాఁటి శాసనములయందు నున్నవి కావున నవి తద్భవములుగా నేల తీసుకొనఁగూడదో తెలియకున్నది. ఈతఁడు కృష్ణలీలాతరంగములు మొదలగు భక్తిరసప్రదము లగు గ్రంథములుగూడ రచియించె నని శ్రీప్రసాదరావుగారు లేకజాబులో వ్రాసియుండిరి. ఈతఁడు క్షేత్రసంపాదన మధికముగఁ జేసె ననియు, నవి చాలవఱకుఁ దత్సంతతివారిచేఁ బరాధీనము లైన నిప్పటికిని రాపూరివారి మాన్యము లనియే వాడుచున్నా రనియుఁ దెలియుచున్నది. ఈయన కుర్దూభాష కూడఁ దెలియునఁట! కొలనుపాక యనుమకొండ ప్రాంతముల నున్నది. ఈతఁడు నైజాం రాష్ట్రములోఁగూడ భూముల సంపాదించెను. ఈకవికి "కవివిరాట్" అను బిరుదము కలదఁట! ఎవ రిచ్చిరో తెలియదు. ఈయన కిచ్చిన భూములపట్టాలలో "కవివిరాట్ రాపూరు సంజీవరాయణింగారికి" అని వ్రాసియున్నట్లు విందుము. శైలి కీతని రెండుశతకముల నుండియుఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## వీరనారాయణ శతకము.

సీ. కెంపమ్మి యడుగుల గిలగిల నందెలు
  మొఱయ మోమున నవ్వు దొరయఁగఁగను
కొనల దయ బెరయ గోపాలబాలక
  వేషమునను కేల వేణునాళ
ము వహించి నీవు నా మ్రోలనిలువ
  పాదములపైని బడికడు మోదమునను

శేవకుండినఁ జూచి లేలెమ్ము భయము
నీ కేల నీ కైదండ యిచ్చి లేవ

దిగిచి పలుకుదు వెన్నఁడు దెలియఁజెప్ప
రాపరాభూతమా దృగ్ధరానురావి
కలభవహారాంత రంగాక కొలనుపాక
వీరనారాయణ ముకుంద విశ్వతుంద.

సీ. అదితికిఁ బుట్టి కశ్యపుని చేత నుపవీ
తుఁడవై పవిత్రము గొడుగు గోచి
ముంజి కృష్ణాజినము కమండలువు జన్ని
దము దండము నమర గొమరు పొట్టి
వడుగువై త్రిభువనవరుఁడగు బలికడ
కరిగి మూఁడడుగులు యవని యతని
వలనఁ గైకొంచు విశ్వము నిండఁ బెఱిగి యొ
క్కఁడుగున దివి యొక్కయడుగున భువి
నదిమి శేషించిన యడుగున కద్దాత
నడుగుపట్టించి సురాధిపతినిఁ

బ్రాజ్య సామ్రాజ్యమునను సంపూజ్యుఁజేయు
నిను త్రివిక్రముఁ గొల్చెద మునిమనశ్చ
కోరికాపూర్ణిమా గాక! కొలనుపాక
వీరనారాయణ ముకుంద విశ్వతుంద. 64

## కడపటి పద్యములు.

సీ. గుణబాణ షట్చంద్ర గణనతో శాలివా
హనశకవర్షము లరుగ వర్త
మాన విరోధికృ న్మార్గ శీర్షాదిమ
పక్షతృతీయేత భానువార
మునను సంపూర్ణమై తనరిన యీకృతి
యాచంద్రతారార్క మగుత ధరణి॥

సీ॥ "తతభరద్వాజగోత్రపవిత్ర పుణ్యచా
రిత్రాయ్యవార్యమంత్రిపుత్ర గోప
రాజాన్వయమహేంద్ర రంగద్యశస్సాంద్ర
రాయనామాత్య చంద్రప్రియంద్ర
శాశ్వతైశ్వర్య సంజాత దాయకకృపా
రససుధాలహరీ విరాజమాన
ఫుల్లారవిందసంపల్లలనాబాస
భాసురి శ్రీవణాంత భాగభాగ"

సీ॥ శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడ సాంఖ్యాయన
గోత్రుఁడ రఘుపతి పాత్రుఁడనుగు
రవకవీంద్ర పెదమాంబాపుత్రుడ రఘునా
థునకు పూర్వజుఁడ మృత్యుంజయున క
నుజుఁడ రావూరి వంశజుఁడ
ననుమకొండ సౌంజ్ఞగల్గిన యాదిశాఖను వెల
సినవాఁడ జాతకసిద్ధాంతముఖకళా
చరితుఁడ నుభయభాషావిశేష
రస గుణాలంకృతి కవిత్వ రసికుఁడ విర
చించితి భవచ్ఛతకము సంజీవికవిని
సంతతాశ్రిత భవభూక కొలనుపాక ॥వీ॥ ౧౦౯

## వసుదేవనందన శతకము.

ఉ. శ్రీసురసాలమూలమునఁ జెల్వగుచున్న చిరత్నరత్న సిం
హాసన సీమనుండి యుభయాశల రుక్మిణి సత్యగొల్వఁగా
భాసుర వేణునాదమయ పానక పానవశీకృతత్రిలో
కీ సకలాత్మ నిన్ గొలుతు కృష్ణ హరీ వసుదేవనందనా!

చ. శతకము నేను సెప్పితిని శాంకర వైష్ణవ శాక్తి ముఖ్యముల్
కృతిమతి మున్నుఁ గొంటి విపు డీ శతకంబు రచించెదన్ యథా

గతిమతి లోకికాంఘ్రి బలిగా నిసుత్పల చంపకావళిం
గృతిగొని నివ్వటిల్లఁగను కృష్ణ హరీ! వసుదేవనందనా!

ఉ. వ్యాకుల మానసంబున నిశాంతమునం బవళించియున్న నీ
యాకృతిఁ జూపుచుంగల నిశాంతమునం దయసేయు దానినిన్
గైకొని శాకమూరికుల కాంతుని బుచ్చనమంత్రిఁ జెప్పఁగా
నీకృతిసేయఁబూనితిని కృష్ణ హరీ! వసుదేవనందనా!

ఉ. తావనపార జేసియు సుధారస తుల్య కవిత్వ కల్పనా
స్రావిని కొండవీటి పెదరావు గుర్వ సుధీతనూజ సం
జీవని సంస్మరింప మనఁజేసెద బుచ్చనమంత్రి కిష్టమై
శ్రీ వెలయంగ నీకృతిని కృష్ణహరీ! వసుదేవనందనా!

ఉ. దీపిత పుష్పవృష్టికర దివ్య గణంబొకవంక సద్వివ
ద్వ్యాపిన సత్వబృంద మొకవంక నిజాలితతానముల్
గోపకులొక్కవంకఁ దగ గొల్వఁగనొప్పు సరస్వతీకళా
శ్రీపరతత్త్వమున్ గొలుతు కృష్ణహరీ! వసుదేవనందనా!

ఉ. ముద్దులుఁ గుల్కు మేల్చుబుకమున్ క్రముకద్రవపాటలద్యుతిన్
శుద్ధములైన దంతములు సుందరతన్ గలలూరు నాసయున్
నిద్దపు చెక్కుటద్దములు నెన్నుదురున్ గల నీముఖాంబుజం
బెద్దిఁర జూపురా త్వరను కృష్ణ హరీ! వసుదేవనందనా!

ఉ. మున్ను ప్రభాంగనా సదనమున్ వడిఁజొచ్చి తదీయగుప్తమౌ
వెన్న గ్రహించె నే కరము వేడినయప్పుడు దత్కరంబునా
కన్నులనిండఁ జూపవలెఁ గాక ప్రియాసము పాలుఁజేసి యిం
కెన్నఁడుఁ జూపవచ్చితివి కృష్ణ హరీ! వసుదేవనందనా!

ఉ. ఘోషగృహస్థుల న్మనుచు గోపకిశోర విశేషమైన నీ
వేషము నా కనుంగవకు విందొనరించి కృపారసంబుచే
తోషితుఁ జేసి మత్కలుషదోషము చిక్కడలించి తోలెనా
యీషణ పాశబద్ధులను కృష్ణహరీ! వసుదేవనందనా!

---

# పుసులూరి సోమరాజకవి



ఈతఁడార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయగోత్రజుఁడు. తణుకుతాలూకా "ఇలింద్రపట్టు" గ్రామవాస్తవ్యుఁడు. ఈతనివల్లనే యీ గ్రామమునకు "సోమరాజు ఇలింద్రపట్టు" అని వాడుక కలిగినది. కవివంశీకు లిప్పటికి నా గ్రామమున నున్నారు. ఈతఁడు రమారమి 200 సం॥రములకుఁ జాలపూర్వుఁడు. అనఁగా క్రీ॥ శ॥ 1700 కంటెఁ బ్రాచీనుఁడు. ఇతఁడు పోతన్నను పేర్కొనుటచే క్రీ॥ శ॥ 1500-1700 నడుమవాఁడగును. ఇతఁడు లీలాశుకుని కృష్ణకర్ణామృతము, చైతన్యస్వామిగ్రంథములను జదివియుండెను. బాలగోపాలభక్తుఁడగుటచే "బాలకృష్ణదాసు" అని వాడుకపడెను. ఈతని తండ్రి ఉమాపతి; తల్లి పాపమాంబ.

ఈ కవి వ్రాసిన శతకములు మూఁడు దొరకుచున్నవి.

(1) చంద్రదూత:—దీనినే యిందుశతక మనిరి. ఇది మేఘదూతవలె విరహిణి యగు గోపిక పూర్ణిమనాఁటి చంద్రుని "ఇందో నందునిమంద నుండికద నీ వేతెంచుటల్ రాకలా" అని సంబోధించుచు గోపాలకృష్ణుని క్షేమసమాచారము లడుగును. ఇందు రమారమి 116 పద్యము లేకప్రాసమున నున్నవి. ఏకప్రాస మని యనవసరపదములుకాని, ధారాశుద్ధి తగ్గుటగాని కనఁబడదు. పైఁగా కదమునడకవలె నుండి కవిభావ

మునకు సరిపోయిన భాష వాడి ధన్యుఁ డయ్యెను. నందుఁడు మందలు, బృందావనము, మందస్మేరము, మొదలగుపద ములే కృష్ణచర్యసమ్మేళనమున మృదుమధుర పద్యము లై పో వును. లీలాశుకుని కర్ణామృతములవలెనే పునరుక్తి యనిపిం పదు. కడుమనోహరము. దీనిని మొట్ట మొదటిసారి ప్రౌఢ్ఢ ప్రౌఢపుఁబువ్వులలో నేను ప్రకటించు నప్పటికి వివరములు తెలియవు. కావున వ్రాయలేదు.

(2) బాలగోపాలశతకము:— దీనినే చారులీలశతక మనియు, ఉపకర్ణామృత మనియు, నందురు. ఇందు 108 సీస పద్యము లున్నవి. ఇతఁడు వైష్ణవమతప్రీతి కలవాఁడు. నీలాచ లేంద్రుఁ డీతని యిష్టదైవము. ఇందలిపద్యములు కృష్ణకర్ణా మృతానుకరణములు.

(3) నందనందనశతకము:— ఇదిమిక్కిలిమనోహర మైనది. ఏక ప్రాసము, ఉత్పలమాలికలే! 80 పద్యములు మాత్రమే చిక్కుచున్నవి. శైలీపరివాహము, భావములును పాఠకుని విడువనీయవు.

చంద్రదమాతలో నీతఁడు తాను "సోమ" వారము నాఁడు పుట్టితి ననియు, తనపేరు "సోముఁ" డనియుఁ జందురు నితోఁ జెప్పుచున్నాఁడు.

"ఇందుఁడన్నిసమ నాకుఁ బేర్కొకటె నే నీభూమి నీవాసరం
బందే సంభవమందినాఁడ గద యత్యంతంబు సఖ్యంబు నా

యందుం జేయుచు నందనందనుని నాకర్షింపు నీవంశజున్
ఇందో! నందునిమందనుండి కద నీ వేతెంచుటల్ రాకలన్.

ఇందలి "ఇందో!" సంబోధనము తెలుఁగులో వ్యాకరణమర్యాదాతిక్రమణ మని పెద్దలు సంస్కరించిరి. కాని కవి జగన్నాథయాత్రకుఁబోయి యోఢ్రదేశమునందలి "ఉకారాంతములకు" "రథో, పాత్రో" మొదలగుస్వరముల విని తెలుఁగులో నేల నివి యనఁగూడ దని యట్లు ప్రయోగించె నేమో? కవియే యట్లు వ్రాసినట్లు నిదర్శనములు లేనందున నట్లే సంస్కరించితిమి. ఈ పై పద్యమువలన నీ "విరహిణి" శతకము నందలి గోపిక కవియే యని కృష్ణగోపికసంబంధము ఘాతికమైనదిగాక, ప్రేమామృతసముద్రము లోని తరంగ మని విస్పష్టముగఁ జెప్పిన తెలుఁగుకవులలో నీతఁడు మేటి యనవచ్చును.

అదియేగాక భక్తుఁ డగుతానే విరహిణి యగుగోపిక. ఈ భావము స్ఫుటముగ వ్యక్తీకరించి జయదేవుని, లీలాశుకుని, చైతన్యుని బోధనలసారము నాంధ్రులకుఁ బ్రసాదించెను. శతకస్వరూపమున నుంట నీతనివాఙ్మయామృత మాంధ్రు లిప్పటివఱకుఁ గోలకుండ గొప్పనష్టము నొంది రని ముమ్మాటికిఁ జెప్పవచ్చును. భాగవతము తెలిఁగించిన పోతన్న, కర్ణామృతములు తెలిఁగించిన వేంగనార్యుఁడు మొదలగు మహాభక్తుల కంటె నీ బాలకృష్ణదాసుని యాంధ్రకావ్యామృతము గణనీయ మైనదనుట సాహసము కాదు. ఈతని మూఁడుశతకముల

నుండియుఁ గొన్ని పద్యములఁ జూపెదను. నిందాస్తుతి, స్తుతి నింద, మొదలగువిశేషములు శాలగోపాలశతకమున నద్భుత ముగ నున్నవి. ఖండశర్కరవంటి పద్యము లెన్నియని చూపఁగలను?

## (1) ఇందు శతకము (చంద్రదూత)

శా. బృందారణ్యము సేమమా? యచటి గో బృందంబులున్ లెస్సలా?
నందుండున్ సతియున్ సుఖాన్వితులె? నానాగోపగోపాలికా
సందోహంబులతో హలాయుధుఁడుఁ గృష్ణస్వామి క్రీడింతురా?
యిందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్. 1

శా. మందస్మేరముతో వయఃకలనతో మాధుర్య గానంబుతోఁ
గందర్పాయుతమూర్తితో వ్రిజనులం గాంతావళీ సేవ్యుఁడై
మందన్ గోవుల గాచుచో నిపుడు ప్రేమం గృష్ణు నీక్షించితే?
యిందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్.

శా. నందాగార విహారియైన హరి నానాశైశవ క్రీడ లా
యందంబుంగని వేడ్కగల్గు మదభీష్టావాప్తిఁ గావింప నా
చందంబారసి యెప్పుడైన మదిలోఁ జర్చించునా జాలితో?
నిందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్.

శా. మందన్ నందయశోదఁ గృష్ణుగని సన్మానించి చిన్నారిమో
మందంబల్లనఁ జూచి వీఁడు మన పుణ్యాంబోధి నైకొమ్మనన్
నందుం డెత్తుక ముద్దులాడుగతి కన్నారన్ విలోకించితే?
యిందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్. 55

శా. మంద వ్రాధికయు వ్రజాంగనలు ప్రేమ న్దాచుకొన్నట్టి సొ
మ్మిందుం దెచ్చు టదేమిధర్మమని యూహింపంగతేమ్మెమయా
ముందాలిచ్చి ధనంబు వారుగొనరా మోహించి కొన్నారొకో
యిందూనందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్. 103

శా. నందాభీరకుమారుతోఁ బలుకుమా నావాక్యముల్ గాఁగ నీ
యందర్పించితిఁ బ్రాణమానధన విద్యాభావముల్ సర్వము
న్సందేహింపక వచ్చికూడుకొని వాంఛల్ దీర్చి రక్షింపుమా
యిందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్. 114

## (2) బాలగోపాల శతకము.

సీ. మాధవా యనుసూక్తి మధురసుధారసా
స్వాదనరుచిగొనె నాదు జిహ్వ
హరికథామృత సరోవరపురాణశ్రుతి
మోదము రుచిగొనె నాదు వీను
లబ్జాక్షు కరుణాకటాక్ష వీక్షణ సు
ప్రసాదము రుచిగొనె నాదు మనసు
నందసూనుపదారవిందసందర్శనా
పాదనరుచిగొనె నాదు కోర్కె
లహహా! యింతయు నీ యనుగ్రహము కాదె
కానఁ గలనైన నిన్ను నేమానఁజాల
బాలగోపాల కరుణాలవాల నీల
శైలపాలావనీపాల చారులీల! 9

సీ. రోటఁగట్టితినా విరోధులతో నిన్ను
బోట్లాడమంటినా పొంది మంచి
పనులు చేయు మటంచు పనిచితినా తల్లి
కోపింప నేమైనఁ గొండియములు
చెప్పితినా రవ్వఁ జేసితినా నీవు
వెన్నదొంగవటంచు విబుధసభలఁ
బాడితినా గొల్లభామలఁగూడితి
వంటినా యేమైనఁ గంటగించి
ప్రాణపదమైన దొరవని ప్రస్తుతింతు
మోముఁ జూపవదెంత నిర్మోహివయ్య

బాలగోపాల్ల కరుణాలవాలనీల
శైలపాలావనీపాల చారులీల! 42

సీ. ప్రాచేతసార్పిత రామాయణము భంగి
వ్యాసకల్పిత భాగవతము మాడ్కి
ద్రావిడవాఙ్మయోదార వేదము రీతి
నారద మధురగానంబు సరణి
లీలాశుకస్తుతి లాలసప్రక్రియ
జయదేవకవి సరస్వతి విధమున
బమ్మెరపోతన్న భారతీక్రమమున
దాసగీతప్రబంధముల పోల్కి
బాలకృష్ణాంఘ్రి దాసోక్త పద్యశతము
దయను గనుఁగొను మాచంద్రతారకముగ
బాలగోపాల కరుణాలవాలనీల
శైలపాలావనీపాల చారులీల! 94

## (3) నందనందన శతకము.

ఉ. అక్కడ వేణుగాన జనితాంగజ రాగవిమోహచిత్తలై
చొక్కెడు గోపకామినులఁ జూచి హసించి దయార్ద్రదృష్టిచే
నక్కున గారవించి పరమార్థ మొసంగిన చిన్ననాఁటి నీ
చక్కదనంబుఁ జూడ మనసైనది చూపుము నందనందనా! 31

ఉ. ఇక్కడనుండి పూవు పొదరిండ్లకు నాడుకొనంగఁ బోకుమీ
యిక్కడిలాతికల్మి ను భ్రమించి మదిన్నిను రవ్వసేయుచున్
తక్కక చాటువారనిన తల్లి మొగంబును జూచినవ్వు నీ
చక్కదనంబుఁ జూడ మనసైనది చూపుము నందనందనా! 14

ఉ. ఫుక్కిట తమ్ములం బడుగఁ బోటికి సూటికి నీయఁజూచి వే
రొక్కతె కోపగింపఁ గనకోత్పలమాలిక లిచ్చినట్టి మే
లిక్కడఁ జూపవచ్చితి బళీ యను రాధిక నూరడించు నీ
చక్కదనంబుఁ జూడ మనసైనది జూపుము నందనందనా! 45

ఒకసారి యాంధ్రపత్రికలో నే నిట్లు వ్రాసియుంటిని.

“108 పద్యములు గల బాలగోపాల శతకము వ్రాసి “నాయమలభక్తి దూతికను” తన ప్రియుఁడైన బాలకృష్ణుని కడకు “దూతికను రాయబారముఁ దోలినాఁడ” నని చెప్పి తన్ను కౌఁగిలింపుమని, ముద్దులిమ్మని, చెక్కునఁ జెక్కుచేర్పుమని, పలుకరింపుమని బ్రతిమాలు చున్నాఁడు. ఈ భక్తుని స్త్రీత్వములో నెంత యానంద మున్నదో బాలకృష్ణ దర్శనభాగ్యముకల సోమరాజకవి మనకుఁ గలుగఁజేయును. కన్నుల దర్శింపుఁడు.

సీ॥ ఏ దిక్కు చూచిన నా దిక్కునందు ని
న్నొప్పుగాఁ జూచి నట్లుండదేని
ఏ శబ్దములు విన్న నా శబ్దములయందు
వేణుధ్వని భ్రాంతి వెలయదేని
ఏ మాటలాడిన నా మాటలెల్లను
తడఁబడ నీపేరు దగులదేని
ఏది భావించిన నీ చరాచరమందు
నీ స్వరూపంబు గాన్పింపదేని
గీ. రేయుఁ బగలును నిన్ను వర్ణింపదేని
ఇతరమహితము గాదేని యేటిభక్తి
బాలగోపాల కరుణాలవాల నీల
శైలబాలావనీపాల చారులీల. 91

ఎట్టి భక్తుఁడో చూచినారా? ఈ మహాత్ముని పద్య మింకొకటి.

సీ. గోపార్భకాకృతిఁ గొన్న తేజము మీఁద
మోహన లావణ్య మూర్తి మీఁద
గోపికా మానముల్ గొన్నబ్రహ్మము మీఁద
కోటి మట్టిన నాఁటి మేటి మీఁద
వేణునాదాంచిత విశ్వంభరుని మీఁద
వితత గోపాంగనా విటునిమీఁద
వేద వేదాంత సంవేద్య ధాముని మీఁద
నందాంగనా స్తనంధయుని మీఁద
గీ. నాటి యున్నది మన్మనోనాటకంబు
అంతకంతకు రుచికర మావహిల్ల
బాల గోపాల.... 66

"పండితజన పక్షపాతంబు లేకుంట పతిత మానవ పక్షపాతి వగుట చాటిచెప్పెద, సకలదేశములందు" నని యాంధ్రనాయక శతకపుఁ బోకడ లా శతకముకంటెఁ బూర్వమే వ్రాసియుండెను. "అమృతరసకోశము" వ్రాసి "కస్తూరి రంగము కౌఁగిలించిన జాలు వాంఛించి యేమైన వరములడుగ" నని ముగ్ధకాంతవలె నెంత పౌఢమైనకోరిక నడుగుచున్నాఁడో, కవి యెంత నంగనాచియో, బాలకృష్ణుఁ డెంత మోహనాకారుఁడో, భక్తులగు పండితులే గ్రహించెదరు గాక!"

(ఆంధ్రపత్రిక – సా. అ.)

ఈ చరిత్ర మింతవఱకు ముగించిన పిమ్మట — నీభక్తుఁడగు కవి మహిమవలననే యైయుండును — ఈ గ్రంథము ముద్రించుచున్న నా కడకు బసకువచ్చి వారివంశీకులలో నొకరును, నాకుఁ బ్రియబాంధవ మిత్రులు నగు శ్రీ పుసులూరి హనుమంతరావుపంతులుగా రీక్రింది సంగతులు చెప్పిరి:—

"ఈ సోమరాజు వాసస్థలము ప్రారంభమున గుంటూరుమండలమునందలి పుసులూరు. అచ్చట నీ కవివంశవృక్షము కలదు. అం దీతఁడు "దేశాంతరగామి" యని వ్రాసియున్నారు. ఈతఁడు పుసులూరునుండి బయలుదేరి కృష్ణదాటి భీమవరముతాలూకా "ఉప్పలూరు" గ్రామము వచ్చి, యచ్చట మూలదాసర్లు (నేఁటికి నర్చకులు వారే) దేవుని కర్చకులుగానుండ మన కవి యా గుడిలోనికిఁ బోవ సందేహింప నాతని కన్నులు పోయెను. అప్పు డీతఁ డా దేవునిపై గొన్నిపద్యములఁ జెప్ప నాతనికి దృష్టికలిగెను. అంతటఁ గవి దేవాలయమును బ్రవేశించి దేవుని దర్శించెనఁట! ఈతఁడు కృష్ణదాటి దారిని నడుచుచుండ నొక కృష్ణసర్పము మణికాంతులతో రేయిం బవళ్లు కవికి మార్గముఁ జూపుచు ముందుఁ బోవుచుండెనఁట. ఉప్పలూరు నుండి తణుకుతాలూకా రేలంగిగ్రామము వచ్చి యచ్చట వేంచేసియున్న యప్పల నృసింహస్వామిపైఁ బద్యములు కొన్ని చెప్పి ప్రక్కనున్న "ఇలింద్రపల్లు" గ్రామ మగ్రహారముగాఁ బడసి యచ్చట నివాస మేర్పరచుకొనెను. ప్రస్తుత మీగ్రామము శనివారప్పేట జమీందారులది. అన్యాక్రాంతమైనది. ప్రస్తుత మచ్చట నున్న పుసులూరి వారందఱు కవి వంశీయులేనని చెప్పవచ్చును. ఆ గ్రామమహిమ యిట్లుండు నని కవి కొన్ని పద్యములు వ్రాసెను. ఆ పద్యములలో నున్నట్లే కడచిన రెండు మూఁడు వందల సంవత్సరముల నుండియు జరుగుచున్నది."

# మతింగంటి సింగరాచార్యులు

ఈ కవి దశరథరాజనందనచరిత్ర మనెడి నిరోష్ఠ్యరామాయణ గ్రంథరచనముచే సుప్రసిద్ధుఁడై కవిచరిత్రమున కెక్కియున్నాఁడు. తిరుమలాచార్యపౌత్రుఁడు, వేంకటాచార్యపుత్రుఁడు, శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు, మౌద్గల్యగోత్రము వాఁడు. ఇతఁడు 150 సం॥రముల క్రిత మనఁగా క్రీ.శ. 1750 ప్రాంతములవాఁ డని యీ వంశమువారు చెప్పినట్లు కవిచరిత్ర మున వ్రాసియున్నారు. ఈతని వాసస్థలము దేవరకొండసీమ యనియు, నేకైకదినప్రబంధరచనాధురీణుఁ డనియు, వింశతి ప్రబంధనిర్మాత యనియు గ్రంథమునం దున్నది కవిచరిత్ర కారుఁడు నుడివి యున్నాడు. దశరథరాజనందనచరిత్రగల తాళపత్రప్రతిలో సీక్రింది శతకము తుద నొకప్రతిలో నున్నది. (చూడుఁడు-పరిషత్సంఖ్య 2568)ఆ ప్రతి చూచినవా రీ"సీతా పతిశతకము" సింగరాచార్యుఁడే వ్రాసెనని యనుమానింపఁ గలరు. కొన్ని పద్యములకుఁ బిమ్మటఁ గవి యిట్లు శతకమధ్య మున వచనములోఁ జెప్పియున్నాఁడు. "ఇక్కడనుండి రామాయణం షట్కాండల శోధించి చాలపురాణకథలు శోధించి సీతారాములకు మానుషలీల పట్టకుండా శాస్త్రిసమ్మతాలగా భక్తివాదాన చెప్పటగాకుండా పెద్దలకు మనస్సు వచ్చేట ట్టుగా చెప్పినారం. ప్రతిపద్యానకు అర్థం చాలా చెప్పరా

వున్నది. కొన్నిపద్యాలలో పురాణకథలే యిమిడి వున్నవి." అని యచ్చటనుండి "రామజన్మహేతుత్రయమ్ వాల్మీకిరామాయణే॥" "తాటకహారణ హేతునిర్ణయపంచకం" అని శీర్షికలు వ్రాసి పద్యములు వ్రాయుచుఁ బోయెను. నారద రామాయణము, హరివంశము, కాశీఖండము, అధ్యాత్మరామాయణము, స్కాందపురాణము, వామనపురాణము, దారుకామాహాత్మ్యము మొదలగు గ్రంథముల శోధించి రామునిమానవత్వము ఖండించి; దివ్యత్వము స్థాపించెను. వాలిని చెట్టుమాటుననుండి గొట్టినది సమర్థించెను. ఇది విమర్శకులు రామాయణపఠకులు గూడఁ దప్పక పఠింపవలసిన శతకరాజము. కొన్ని పద్యములఁ జూపెదను.

శా. శ్రీ లింపాందెడు భద్రపీఠమున నాసీనుండవై సోదరుల్
చాల ప్రేమ భజింప నంగకలితస్రక్చందన స్వర్ణ వ
స్త్రాలంకారరుచిం దలిర్పుచును కొల్వైయుండు మీయొప్పు లు
త్తాలప్రక్రియచే స్మరించెద నయోధ్యారామ సీతాపతీ!

మ. మును రామానుజమాళిఁ గాంచి యటుపై మోదంబుఁ జేకూర భ
క్తి నిరీక్షింపుచు సాధుభట్టగురు మూర్ధన్యు న్మతింగంటి నం
చనయోక్తిం మము గన్న రంగపతివై యారూఢి రక్షింపుమీ
యనవద్య ప్రతిభాధురంధర యయోధ్యారామ సీతాపతీ॥

## తాటకహారణ హేతునిర్ణయపంచకము

మ. మతి దిక్పాలురఁగోరకే దశరథక్ష్మాభర్త నర్థింపకే
చతురంగంబుల వేడకే మునిశిశు చ్ఛద్మంబును న్బోలు ని
న్నతిరాదోర్ధతతాటక న్కనుమాయం జేయ శక్తుండ వం
చతఁ డూహింపుచుఁగాదె పిల్చుట లయోధ్యారామ!సీతాపతీ!

రామజన్మ హేతుత్రయమ్. వాల్మీకిరామాయణె॥

మ. మొదలన్ హేమపువీతిహోత్రిమఁట యామూలందు నందొక్కరుం
డుదయంబై పరమాన్న మిచ్చెనఁట తానుర్వీశుడుం దాని నె
మ్మది కౌసల్యకుఁ బెట్టినం గొనుచు నేమాడ్కిం నినుంగాంచెనో
యది మర్త్యత్వము గాఁగ నేర్చునె యయోధ్యారామ! సీతాపతీ!

ఉత్తరరామాయణె, బ్రహ్మవాక్యమున కర్థము

మ. తనయద్వంద్వము తోడుకొంచు చను మాతంగాంచి వాలిన్ గణం
బున నెవ్వాఁ డెదిరించు వాని బలవిస్ఫూర్తుల్ వడిన్ వీనిఁ జే
రు నటంచున్విధి పల్కుపంపుటల కాగోపించి భూజంబు చెం
త నెమ్మైమాటుచు నేయుటల్ యగు నయోధ్యారామ సీతాపతీ!

"చెట్టుచాటునుండి వేసినందుకు సందేహానివృత్తి యాయెను."

---

# పత్రి రమణప్పకవి



ఈతఁడు మాధ్వమతస్థుఁడు, కౌండిన్యగోత్రుఁడు, పత్రి శ్రీనివాసరావుపంతులు పుత్రుఁడు. ఈతఁడు నూఱు సంవత్సరముల క్రిందటివాఁడు.

ఈతఁడు విష్ణుసర్వోత్తమశతక మని వృత్తములతోను, వేంకటరమణశతక మని కందపద్యములతోను రెండుశతకములను వ్రాసియున్నాఁడు. ఆ శతకములను బ్రకటించిన కవివంశీకు లగు పత్రి వేంకటరమణరావుగారీ విధముగ నాగ్రంథములకుఁ బీఠిక వ్రాసియున్నారు.

"మావంశంబున రమణప్ప యను నొక్కండు పరమభక్తుండై యుభయభాషాభూషణుండై కవియై తనకాలమువారలలోఁ బేరుగాంచె నని మాబంధువు లనేకు లాడుకొనుట విని * * * పరిశోధింపఁగా * * * రెండు నాకుఁ దొరికినవి. * * * * కవి యిప్పటికి 100 సంవత్సరముల క్రిందటివాఁ డని తెలియవచ్చుచున్నది. ఈతని జన్మస్థానము నర్సారావుపేట తాలూకా లోని సాతులూ రనియు, సీతని తండ్రి యగు శ్రీనివాసరావుపంతులవారు వంగోలునందున్న యొకానొకసంస్థానము నందు గొప్పయుద్యోగములో నుండె ననియు నెఱిఁగితిని."

కవి వ్రాసికొనిన యీ క్రిందిపద్యమునందును పై వివరము లున్నవి.

మ. స్థిరకౌండిన్యసగోత్రి మధ్వమతుఁడౌ శ్రీసత్రి తిమ్మప్పకున్
వరపుత్రుండగు శ్రీనివాసమణికిన్ బ్రాహ్మివిష్ణుపుండన్ సదా
హరిచింతాగతి మానసుండ రమణప్పాఖ్యుండ వేడ్కన్ గవీ
శ్వరుఁ లింపారఁ గృతిన్ రచించితిని కృష్ణా! విష్ణుసగోత్త్రమా!
విష్ణుసగోత్త్రమశతకము. 122

ఈ కవి గోదావరిమండలము నందలి క్షణముక్తేశ్వరమునకు యాత్రకుఁ బోయి యాస్వామిసన్నిధినే పరమపదించె నని చెప్పుకొందురని పీఠికలో వ్రాసియున్నారు. శైలి తెలియుటకుఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## (1) వేంకటరమణ శతకము.

క. దశరథ రాజకుమారా । కుశికాత్మజ సవనవిఘ్న కులసంహారా
పశుపతిహృదయ విహారా।విశద యశస్స్ఫూర్తిసార వేంకటరమణా! 12

క. నిగమార్గ ప్రతిపాద్యా । యగణితచిద్రూప సంభృతానందమతీ
జగదారాధ్యనిరంజన । విగతాఖిల కలుషనిచయ వేంకటరమణా! 28

క. ఉద్యద్రవికాంతులచే । ఖద్యోత్తము లణఁగుభంగి ఘనభక్తిమహా
విద్యోతముచే గాఢా । విద్యానాశంబునొందు వేంకటరమణా! 38

క. అతికఠినము చాంచల్యము । మతిదల్పక లోభమోహ మాత్సర్యముచే
సతతంబుబాయ దాశ్రిత । వితతీ నాజీవనంబు వేంకటరమణా! 64

క. భోగములఁగోరి మధురా । నాగరికులు రాఁగజూచి నారాయణ నీ
వాగమ్మృత ధారనుబ్బఁగ । వేగమె తనిపితిరి కరుణ వేంకటరమణా! ॥ 99

## (2) విష్ణుసర్వోత్తమ శతకము.

మ. సరసాలోకన హాసభాసుర విలాసప్రౌఢిచే నొప్పు నీ
స్ఫురదాకారముఁ జూచి క్రేతలు నిను న్మోహించి కాంక్షించి మీ
కరుణన్ సౌఖ్యరసాబ్ధిఁ దేలి పిదపన్ గళ్యాణసంయుక్త మో
క్షురమన్ జెందిరి ముక్తకర్ములయి కృష్ణా! విష్ణుసర్వోత్తమా! ॥

మ. కలకాలంబు మదీయ మానసమునన్ గంజాక్ష నీపాదపున్
నలినంబుల్ బెడఁబాయకుండ భగవన్నామంబు చింతింపఁగా
విలసద్భవ్య కటాక్ష వీక్షణమున్ వేగంబె నీ దానునిౘ
జలనంబందఁగ నీక ప్రోవు హరి కృష్ణా! విష్ణుసర్వోత్తమా! ॥

శా. అక్షీణప్రకట ప్రతాపుఁడగు నయ్యక్షాసురుం ద్రుంచి లం
కా క్షోభంబుగఁగాల్చి రావణుని చుల్కన్ గవ్వఁగాఁ జేసి య
ట్టాక్షేపించుచు సీతవార్త హనుమన్నాముండు తాఁ జెప్పఁడే
దక్షత్వంబున నీ కృపానలముచేతన్ విష్ణుసర్వోత్తమా!॥

# శంకర శంకరకవి

ఇతఁడు రాచబిడ్డఁడు శతక మను గీతపద్యముల శతకము వ్రాసెను. కవి గోదావరిమండలము నందలి దొడ్డంపేట ప్రాంతములవాఁ డని వాడుక కలదు. ఈతని వివరము లేమియుఁ దెలియవు. శైలి కైదు పద్యములఁ జూపెదను. కవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు.

గీ. ముగురు తల్లులనఁగ ముగురు తమ్ములనంగ
దగి యగణ్యమహిమ మిగులఁగా న
యోధ్యయందుఁ జూడనొప్పిన ముద్దుల
రాచబిడ్డఁ డెపుడు బ్రోచు మమ్ము. 5

గీ. అమితసుగుణ సుందరాకారయగు విదేహాత్మజను జగ(న్మాత సీత)
పెండ్లియాడినట్టి (పెను) ప్రౌఢుఁడైన(ట్టి) రాచ. 19

గీ. కడలిమీఁద నలుక గడలుకొనంగ విం
టమ్ము దొడిఁగి కడిమి యణఁచి ప్రార్థ
నమున సేతుబంధనమున కుద్యోగించు । రా॥ 31

గీ. ఇలయుఁ జంద్రుఁ డినుఁడుఁ గలకాలమును ధర్మ
మతిశయిల్ల నేలుమనుచు లంక
ఘనకృప న్విభీషణున కొసంగిన దొడ్డ । రా॥ 55

గీ. సౌఖ్యమొదవ శంకరాఖ్య దాసుని మనో
నిలయమునను నిలిచి నిజకృపా క
టాక్షవిభవ మెసఁగ రక్షించుచున్నట్టి । రాచ॥ 103

60 పద్యములవఱకు రామాయణకథయు, రామనామమాహాత్మ్యమును, 69 వ పద్యమున "పంచదారకంటెఁ

బాలకంటెను దేనెకంటె" రామనామము రుచికర మని భక్తిమార్గమును, పిమ్మట నీతి వేదాంతమార్గములను రచియించెను. సులభమైన చక్కని పద్యము లున్నవి.

---

# మదిన సుభద్రయమ్మ

ఈమె శ్రీరాజా గోడే నారాయణగజపతిరాయనింగారి మేనత్త. విశాఖపురమండల మీమె కాపురస్థలము. జమీందారుల యింటి యాఁడుపడుచు. ఈమె క్రీ॥ శ॥ 1787 న జన్మించెను. ఈమె శ్రీరామదండకము, రఘునాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘవరామశతకము మొదలైన చాటుకృతు లనేకము వ్రాసెను. నాకీ గ్రంథములు దొరకలేదు. కావునఁ గవులచరిత్రము నందలి రెండు-పద్యములు మాత్రము క్రిందఁ జూపెదను.

ఉ. శ్రీరమణీకళత్ర! సరసీరుహనేత్ర! జగత్పవిత్ర! స
త్సారసబృందమిత్ర। సురసన్నుతిపాత్ర! నరేంద్రపుత్ర శృం
గారసమగ్రగాత్ర! జనకర్మ విదారణకృచ్చరిత్ర! శ్రీ
నారదమౌని గీతచరణా రఘునాయక! దీనపోషకా!

ఉ. మన్నన దప్పియున్న యెడ మక్కువగల్గిన వారి నేనియున్
దిన్నఁగ మందలించినను దెల్లముగా మదినొవ్వకుండునే!
యన్నను ధార్తరాష్ట్రునకు నాదర మొప్ప హితోపదేశ మ
ట్లెన్నఁగఁజేసి యావిదురుఁ డేమి ఫలంబును బొందెఁ గేశవా!

---

# పుష్పగిరి తిమ్మకవి

ఈతఁడు ములికినాటి బ్రాహ్మణుఁ డని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. సమీరకుమారవిజయ మనెడి యేడాశ్వాసములకావ్యము, భర్తృహరినీతిశతకము మొదలగున వీతని గ్రంథములుగా దొరకుచున్నవి. కంకంటి పాపరాజు నుత్తరరామాయణ మీకవి రచియించినదే యని వాడుక యున్నది. పాపరాజునకుఁ దిమ్మకవి సాయము చేసి యుండును. తిమ్మకవి నెల్లూరుమండల మందలి మోడేగుంట వాస్తవ్యుఁడు. ఆ గ్రామప్రాంతముల దొరకిన యొక యుత్తర రామాయణము ప్రాఁత వ్రాఁతపుస్తకమునఁ "బాపరాజప్రమోదసంపాదనార్థము" తిమ్మకవి రచియించిన ట్లున్న దని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరి రెండవభాగములో వ్రాయుచున్నారు. ద్విపదభాగవత కర్త యగు తేకుమళ్ళ రంగశాయికవి గూడఁ దిమ్మకవిసాయ మందిన వాఁడే నట! పాపరాజకృతోత్తర రామాయణమునకును, తిమ్మకవి గ్రంథములకును రసములో, పాండిత్యములో, శైలిలోఁ గూడ భేదముండుటచేతను, యిఱువురలోఁ బాపరాజు పండితుఁ డగుటను, తిమ్మకవి సాయము చేసె ననుమాట సత్యము కానేర దని శ్రీ వీరేశలింగము పంతులు గారి యభిప్రాయము. ఇతఁడు హనుమద్భక్తుఁడు. కావుననే సమీరకుమారవిజయము వ్రాసెను. ఇతఁ డాశ్వలాయనసూత్రుఁడు.

విశ్వామిత్ర గోత్రుఁడు. అప్పనార్యుని పుత్రుఁడు. అధ్యాత్మ తత్త్వకవిత్వ విదుఁడు. ఓబళాంబ యితనితల్లి. బ్రహ్మవేత్తయైన వేంకటకృష్ణయ్యాగ్రణి వేంకటాఖ్యకవీంద్రు లితనికి సోదరులు. ఈతఁడు దశకుమారచరిత్రముఁ గూడ వ్రాసె నని కొంద ఱందురఁట. ఎవ్వరో యీతనిఁ గూర్చి యిట్లు పలికిరి.

మ. కమనీయం బగు నీదుకావ్యరస మాకర్ణించి నానాబుధుల్
సముడౌ నీతఁడు పూర్వసత్కవులకున్ సాబాసురే యంచు స్తో
త్రముఁ గావింతురు శంభుజూటతటినీ రంగత్తరంగార్భటిన్
మమతాహంకృతి దూర! పుష్పగిరితిమ్మా! సత్కవిగ్రామణీ!

ఇతఁడు క్రీ. శ. 1750—1790 ప్రాంతములవాఁ డని కవులచరిత్ర మనుచున్నది. భర్తృహరిశతకత్రయము నీతఁడు తెలిగించెను. శైలి కందలి పద్యములఁ గొన్ని చూపెదను.

చ. మతిఁగల జాడ్యము ల్చెఱుచు, మాట లసత్యముఁ గూర్చు, మాన ము
న్నతి నెనయించుఁ, బాపములు నాశ మొనర్చు, మనంబునం బ్రస
న్నతఁ గదియించు, దిక్కుల ఘనంబుగఁ గీర్తుల నించు, సాధు సం
గతి యిఁక నే విశేషములు గల్గఁగఁజేయదు మర్త్యకోటికిన్.

ఉ. నీతు లెఱుంగువారు తమ నింద ఘటించిన నెంచినన్, మహా
భూతులు పాయనున్న నవి పోయినఁ, జావపుడైన గల్ప సం
ఘాతవిరామ కాలములఁ గల్గినఁ గల్గునుగా. కొకప్పుడున్
నీతి పథంబునం జెదర నేరరు ధైర్యరమాధురంధరుల్.

చ. లలితకళావిలాస సమలంకృతుఁడైనను దుర్జనుండు చెం
తల వసియింపఁగాఁదగఁ డసర్హుఁడు, వానిఁ ద్యజింప నేతగున్
గలితనవారుణారుణ ధగద్ధగితోరు ఫణామణి ప్రభల్
గలవని చెంతనున్న భయకంప మొనర్పదె సర్పమేరికిన్.

# పోచిరాజు వీరన్న



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి వీరభద్రుఁడు. తల్లి మూర్తిమాంబ. కృష్ణామండలము) ప్రస్తుతము గుంటూరు మండలము?) లోని కొలకులూరు గ్రామవాస్తవ్యుఁడు. ఈతఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడై యుండవచ్చునని కవులచరిత్ర మనుచున్నది. అది సత్యమైనచో నితఁడు క్రీ॥ శ॥ 1790 ప్రాంతముల వాఁడై యుండును. ఈతఁడు తన గ్రంథము లే వయస్సున వ్రాసినది శ్రీనాథుని వలెఁ దన భల్లాణచరిత్రమునఁ జెప్పుకొనినాఁడు. పదునాల్గవయేట మొదటఁ గృష్ణార్జునసంవాద మను ప్రబంధమును, పదునెనిమిదవయేట పంచకావ్యముల నాంధ్రపంచకావ్యములుగను, యిరువదిరెండవయేట విభూతీమాహాత్మ్యం బను ద్విపదకావ్యమును, యిరువదియారవయేట మార్కండేయచరితమును, ముప్పదవయేట మనువంశముఖ్యనృపపురాణమును, ముప్పదియారవయేట శ్రీముక్తదేవుకథయు వ్రాసెను. ఇవి గాక సంస్కృతమున శంకరాచార్య విరచితము లగు "ఆనందలహరి, సౌందర్యలహరి" తెలిఁగించెను. మరియు భర్తృహరిశతకత్రయమును తెలిఁగించెను. భల్లాణచరిత్ర మీతని తుది కృతి. ఈతని పుస్తకములు చాలవఱ కిప్పుడు దొరకవు. భల్లాణచరిత్రము బందరుపురములో నుండిన యార్యక్షత్రియుల మని చెప్పుకొను ముచ్చికులస్థుఁడైన దాము

మొగ్గన్నకును, మనువంశపురాణము బెజవాడ మల్లేశ్వరస్వామికిని నంకిత మొనరించెను. మనువంశపురాణమునకు "ఖండకపాలాఖ్యాన" మని నామాంతరము. ఇతని భర్తృహరికాని, యితర చాటుకృతులుగాని దొరకనందున శైలికిఁ బద్యము లీయఁజాలనైతిని.

---

# దేవగుప్తాపు రామభద్రకవి

ఇతఁడు మహాదేవశతకమును రచియించెను. ఇతఁడు లింగకవి పౌత్రుఁడును, భాస్కరమంత్రి తనయుఁడు నని శతకాంతమున నున్న యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. విపులస్వచ్ఛతరప్రబంధరచనా విద్వాంసుఁడున్ దేవగు
ప్తపువంశోద్భవుఁడైన లింగకవికిం బౌత్రుండ చంచత్కవీం
ద్రపుఁడౌ భాస్కరమంత్రి పుత్రుఁడను పేరన్ రామభద్రుండ నో
ద్విపచర్మాంబర నీకు భక్తుఁడ మహాదేవా! భవానీధవా! 101

దీనికి భవానీధవశతకమని మాఱుపేరు. దేవగుప్తాపు వారు మొగల్తుర్రు సంస్థానమును బాలించిన కలిదిండి క్షత్రియుల కడఁ జిరకాల మాస్థానకవులుగా నుండి యనేకాంధ్రగ్రంథములు, చాటుకృతులును గూడ రచియించి యుండిరి.

ఈ రామభద్రకవి గోదావరి మండలమునందలి యమలాపురమునకుఁ జేరువ నున్న "దేవగుప్తము" అను గ్రామ

మున నుండువాఁడనియు, నాఱువేల నియోగిబ్రాహ్మణుఁడ నియు, నీ కవి నూఱేండ్లకుఁ బూర్వుఁడనియు, క్రీ॥ శ॥ 1790 ప్రాంతము వాఁడనియు మా బంధుగులును, గవివంశము వారును జెప్పఁగా వింటిని. శైలి తెలియుటకుఁ గొన్ని పద్యములఁ జూపెదను. ఈతని తాతతండ్రులుగూడఁ గవులు,

శా. తే లగ్నింబడిపోవ వెల్వలకు రాఁదీ సుంగనుం బోవఁగాఁ
గేలంటం బొడకున్న పాలసునకున్ గీడైనఁ దప్పింపఁ ద
న్జాలిం బ్రోచినవాని చేటునకె నుత్సాహించు నైజంబులం
దేలాగల్గును తారుమాఱులు మహాదేవా! భవానీధవా!

శా. ఈ లోకంబున రాచవాని తలకాయేలేదు మర్యాద లిం
కేలాగుండును వర్ణసంకరములయ్యె దానికిక్ ముందుగా
మాలండుం ద్విజుఁడుం సమం బనెను దుర్మార్గాగ్రిణుల్ పెద్దలై
తే లోకానకు సౌఖ్య మెట్లగు మహాదేవా! భవానీధవా!

మ. సిరి తోఁబుట్టువు నాగ్యకుం బతివి యా చింతామణీదేవతా
సురభీకల్ప తరుత్కరంబులకు దక్షుం డైన దేవేంద్రుపై
దొర వీరేశు జగంబు లేలుటకు నీతోఁపాటు బిచ్చానికే
తిరుగంజేసితి వేమిచెప్పదు మహాదేవా! భవానీధవా!

మ. మితభాషారతుఁ డప్రయోజనుఁడుగా మేల్వాదమానుండు వి
స్మితుఁడుం డాంబికుఁ డంహతిప్రతిబడాయీ కోరుగా నార్యనిం
దితుఁడుం గుత్సితుఁడుం గృతఘ్నుఁడగు వాఁడే గట్టివాఁడు న్మహా
ధృతిమంతుం డని యెంతు రజ్ఞులు మహాదేవా! భవానీధవా.

# పరశురామపంతుల రామమూర్తి

ఈ కవి శుకచరిత్రరచనమువలనఁ గవులచరిత్రమున కెక్కియున్నవాఁడే! ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. సీతారామాంజనేయము వ్రాసిన లింగమూర్తి తనయుఁడు. ఈతని తల్లి లింగాంబ. ఇతఁడు (క్రీ॥శ॥ 1800 ప్రాంతము) నూఱుసంవత్సరముల క్రితమువాఁడని కవులచరిత్ర మనుచున్నది. ఈతఁడే వ్రాసిన "ఈదులవాయి రామస్వామిశతకము" క్రొత్తఁగా వరంగల్లు ప్రాంతమున లభించినట్లు పరిషత్తువారి 3483 గ్రంథమువలనఁ దెలియుచున్నది. శీలము పాపనృపాలున కీ శతక మంకిత మిచ్చె ననవచ్చును. ఇందు మొదటఁ గేశవ నామముల యుత్పత్తులును, భక్తి, నీతి పద్యములును వ్రాసెను. ఇతఁడే వ్రాసిన మఱిరెండు శతకములుకూడఁ జిక్కుచున్నవి. మనోహరశతకము, పరశురామశతకద్వయము నను నవి యీతని యితర చాటుకృతులు. మూఁడుశతకముల నుండియుఁ గొన్నిపద్యము లుదాహరించెదను.

(1) పరశురామ శతకము.

శ్రీశు నీశు భారతీశు భజించి వి
ఘ్నేశుఁ గొలచి కవుల నెంచి యొక్క
గీతపద్యశతము కీర్తింతు వినుమురా
పటుగుణాభిరామ పరశురామ॥ 1

హరిహరాత్ము లగు మహాదేవగురులింగ
మూర్తి పాదకమలములకు మ్రొక్కి

తన్నెఱుంగు యుక్తి తగ నెఱింగింతురా
పటు గుణాభిరాను పరశురామ||

అప్పు లిచ్చువాని కప్పు లిచ్చిన నొప్పు
ఉప్పరంబు కరణి నున్నవాని
గన్నవాడు నిర్వికారుఁడై యుండురా
పటుగుణాభిరామ పరశురామ|| 189

నిప్పు నీఁగలంటె నింగిని చెదలంటె
ననుట కేని యిట్ల నాత్మవిదుని
సుకృతదుష్కృతములు సుడియక నుండురా
పటుగుణాభిరామ పరశురామ|| 20

భూమినొదవి పరశురామపంతుల రామ
మూర్తి బ్రహ్మతత్త్వమార్గులకును
దెలియ రెండు శతకములఁ దేటపరచెద
పటు గుణాభిరామ పరశురామ|| 205

ఇది వ్రాసినకొలఁది వ్రాయవలెనని యున్నది. చాలా మంచి విషయము. వ్రాఁత తప్పు లధికము.

ధరణి లోకశాస్త్రతనువాసనాబద్ధుఁ
డగుచు విహితకర్మ మాచరించి
సద్విజుండ ననెడి జనుఁడు మూఢుండురా
పటుగుణాభిరామ పరశురామ|| 4

అణువు మధ్యమను మహాత్ముఁ డాత్మని కొంద
అందు రదియుఁ జెంద కనుటగాక
ఆత్మ నిర్వికారుఁ డదియు తా నెట్లురా
పటుగుణాభిరామ పరశురామ|| 76

కోటలోనివాఁడు కోటతాఁ గానట్లు
ప్రకృతిలోనివాఁడు ప్రకృతిగాక

ప్రకృతి నెఱుఁగుచుండు ప్రభుఁడని యెఱుఁగరా
పటుగుణాభిరామ పరశురామ॥ 80

నాస నలరితావి వాసిరామువాని
నాసలేక వాసనానివారి
నొకనిగా నెఱుంగు యుచితత తానురా
పటుగుణాభిరామ పరశురామ॥ 108

## మనోహర శతకము.

ఉ. శ్రీలలనేశ మద్రి సరసీరుహగర్భగణాధిపాంఘ్రిలన్
ఫాలమునోకి మ్రొక్కి యొక పద్యశతంబు రచించి మల్లికా
మాలిక గాను మీకును సమర్పణఁజేసి తరింపఁగంటి నం
బాలపురీశ, రాఘవనృపాల మహీతనయామనోహరా॥

చ. నిపుణతఁ గల్గి యా సగుణనిర్గుణతత్త్వకవిత్వకల్పుఁడ
య్యు పరశురామపంతులకులోదధిసోముఁడు రామమూర్తి ప్రా
ఙ్యుపకృతిగా వహించి యొక యుత్పలపద్యశతంబుఁ జేసె నీ
విపుడ వెలుంగఁజేయు రఘువీర మహీతనయామనోహరా॥ 109

ఉ. ఫాలమునన్ భవచ్చరణపద్మములుం బ్రణుతించుచేతులున్
గేలత్వదీయమూర్తి విని కేవల మర్చనసేయు జాడ వా
గ్జాలములం భవత్కథప్రసంగముఁ జేసెడి నేర్పు నీవె యం
బాలపురీశ, రాఘవనృపాల మహీతనయామనోహరా॥ 19

ఉ. పాలికి నీవు నేను సమబాధ్యుల మంశము లొక్క ఔట నీ
పాలు గలుంగ మోక్షమది పాలిడు నే తమ పాలివాఁడ నా
పాలిడకుండినం దగవుపాలయి ప్రాజ్ఞులబోధదీర్త నం
బాలపురీశ, రాఘవనృపాల మహీతనయామనోహరా॥ 31

ఉ. నీ లలితైకభక్తి జితనిర్జరనాథ బలిప్రదానముల్
కేలవహించి దేవతతికిం గరుణింపఁగ మూఁడులోకముల్
కాలనె కొల్చిపుచ్చుకొనఁగాఁ గను వామను నిన్భజింతు నం
బాలపురీశ, రాఘవనృపాల మహీతనయామనోహరా॥ 101

## ఈదులవాయి రామస్వామి శతకము.

ఉ. శ్రీమదఖండ చిత్సుఖ విశేషపురాణశరీర భూరి మా
యామనుజావతార కమలాసన శక్రసురాది మానసా
రామవిహార దుష్టతవిరామ హితావనకామతత్పరా
హేమకిరీట హారధర యీదులవాయిపురాధినాయకా.

ఉ. నెమ్మది కేశవాది పదనిర్వచనార్థము లొప్ప పద్యముల్
బిమ్మట కాదివర్ణ సముపేతముగాఁగల ప్రాసపద్యము
గ్రమ్ములొనర్చి నీకును సమర్పణఁజేసెద నా కభీష్ట మం
దిమ్ముఁకనైన మ్రొక్కెదను యీదులవాయిపురాధినాయకా. 2

ఉ. కేశియనంగ నొక్క బలుకృత్రిమ ఘోటకదైత్యుఁడా మను
ష్యాశనునిన్ వధించిన సమర్థుఁడవౌట మహాత్ములెల్ల నిన్
గేశవుఁడంచు భక్తిమదిఁ గీర్తనఁజేసి భవంబుఁ బాసి మా
హేశపదంబు నొందుదురు యీదులవాయిపురాధినాయకా. 3

### ఇట్లు కేశవనామాంకార్థ మొక్కొకపద్యము.

ఉ. ఒంటరి నుండువానిఁ గనసూపని వెల్గులవెల్గు వాని నే
మంటకయుండువాని తనసంటి మెలుంగు జగంబు గన్న వా
ల్గంటి గలుంగువాని నినుఁగాంచెడు వాఁడొకఁడైన నూటి వె
య్యింటను లేఁడు చిత్రమిది యీదులవాయిపురాధినాయకా! 4

ఉ. వేణురవప్రవాహపదవీరసమగ్నధురీణనిత్య గీ
ర్వాణ పరిస్తుతాఖిల పురాణవిభాస్పద నాద్యనంత క
ల్యాణ గుణప్రవీణ సరహస్య శరాసనమంత్రశాస్త్ర పా
రీణ నినున్ భజింతు మది నీదులవాయిపురాధినాయకా! 55

ఉ. వింతకు సన్నుతింతు మతి నెంతకు దూరుదు నెంత కోర్తు నే
నెంతకు నాడిపాడుదు నొకించుకఁ బల్కవు చూడవైన శ్రీ
మంతుఁడ వీవు నే మనుజమాత్రుఁడ నీ సరిగోరి పోర నే
నెంతటివాఁడఁ బ్రోవఁదగు నీదులవాయి పురాధినాయకా! 58

ఉ. శ్రీలసనాలవాలుని విశేషగుణావృతకార్య జాలునిన్
శీలము వంశవర్ధన సుశీలుని పాపయనామకావనీ
పాలుని తత్కుమార చినపాపనృపాలుని ధర్మశీలుని
న్నేలుచునుండు మెల్లపుడు నీడులవాయి పురాధినాయకా! 99

చ. నృపులు గణింప సత్కవులు నిర్వృతి నొంద జనానురక్తి గ
ల్గ పరశురాముపంతుల కులప్రభవుం డగు రామమూర్తి యు
క్తపదము లొప్ప పద్యశతకం బొనరించెను దీని ధాత్రిలో
నెపుడు వెలుంగఁజేయు మిఁక నీడులవాయిపురాధినాయకా! 100

---

# చత్రాతి లక్ష్మీనరుసు

ఇతఁడు విశాఖపురిమండలమువాఁడు. ఇతఁడు కోదండ రామ శతకమును వ్రాసెను. విజయనగరపు రాజుల బంధుగుఁడును, దివాను నగు పూసపాటి సీతారామరాజు "తూర్పు యిండియాసంఘము" వారి కాలమున, రాజునకు, దేశమునకుఁ, బ్రజలకును జేసిన యధర్మముల గర్హించి యాతని దుర్మార్గముల నెల్లడించుట కీ తిట్టుశతకము వ్రాసెనని విజయనగరమువారు చెప్పుచున్నారు.

ఈ కవి యడిదము సూరకవి కాలమువాఁడు. క్రీ॥శ॥ 1750 ప్రాంతమున నుండెను. సీతారామరాజు దౌష్ట్యములు తెలియఁగోరువా రాంధ్రకవులచరిత్రము నందలి యడిదము సూరకవిచరిత్రమును జదివినఁ దెలియఁగలరు.

ఈతని శతకమునుండి శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను. ఇందలి 13 పద్యములు బ్రౌనుదొరగారి కాలమునందే యచ్చువేసి యున్నారు. శతకము మృదుమధురమై నీతిబోధకముగ నున్న గర్హాణ కావ్యము. (నిందాగర్భము.)

సీ. వెనువెంటఁ దిరిగితే విటకానితోఁ జెప్పి
సమకూర్చు కార్యంబు సానిదైన
మచ్చిక జేసితే వచ్చిన దొంగను
గూసి పోఁగొట్టును కుక్కయైన
నలవాటుఁ జేసితే యడుగునంటినముల్లు
రక్షసేయును పాదరక్షయైన
నీవాఁడ ననుకొన్న నెల నెల పనిఁ జేసి
మానిపోవును డబ్బు మంగలైన
అంతకన్నను తక్కువైనట్లు దోఁచె
ననుసరించిన వారిఁ గాయంగ లేక
యందలం బెక్కి తిరిగితే యతిశయంబె?
భండనారాతిభీమ కోదండరామ. 1

సీ. పట్టి రేపినవానిఁ గుట్టుగా కీఁగలు
తేనియఁ గ్రోలిన వానికేమి
చెట్టుఁ గొట్టినవాని శిరముపైఁ బడు కొమ్మ
యిల్లుఁగట్టినవాని కేమికొదువ
పోర్లినదానికే పుండ్లంటుకొనుఁగాని
యాసొమ్ముఁ దినువారి కంటుకొనునె
పిడుకువానిని రాఁగ మొదవు దన్నునుగాని
పాల్ద్రావువానికి భయముగలదె
యధిపునకుఁ బాపమేమి బ్రాహ్మణులసొమ్ము
దస్తుఁ జేసినవానికే తగులు కీడు

నరికితే కత్తి రాతిపై మొరవఁబోదె
ఖండనారాతిభీమ కోదండరామ. 2

సీ. కోతిమిరగింజ లంకురములఁ బెట్టునా
పాఁతచెప్పులకాళ్ళఁ బామకున్న
మడిలోపల మనుష్య మలము వేయక కాని
బలువు ముల్లంగిదుంపలు మొలచునె
బరిక చేతనుబట్టి భయపెట్టికొట్టక
కంచరిత్తట్టు శీఘ్రము నడచునె
తండముల్ కోలచే పుండుగాఁ బొడువక
తిన్నగా నడుచునే దున్నపోతు

మెట్టుకొకమారు దొబ్బులఁ బెట్టకున్న
కరిగి మెత్తనఁబడదు ముష్కరుని మనసు
దొంగవానికిఁ జెవిఁగోయ దోసమేమి
ఖండనారాతిభీమ కోదండరామ. 3

సీ. ఏనుఁగ మరలింపలేని మావంతుండు
పైనిఁగూర్చున్న లాభంబుగలదె
జలము మళ్ళింపంగఁ జాలని యొడ్డరి
బట్టె వెంబడి నున్న భాగ్యమేమి
చెట్టు పూయించఁగ చేఁగాని మాలీఁడు
పూఁదోట నుండిన పొదుపుగలదె
వ్యాధి దిప్పఁగలేని వైద్యుఁడు చేసంచి
పట్టుకొ తిరిగిన ఫలమదేమి

రాజుగారికి బుద్ధి మరల్పశక్తి
సేయని ప్రధాని ప్రజలకు చేటుగాదె
(యీచరణం పాతం) - ఖండనారాతిభీమ కోదండరామ. 4

సీ. భాగ్యవంతుని యిల్లు పాడుగా సేయంగ
పరదారగమన పాపంబె చాలు

సొమ్మున్న వా నిల్లు చూఱపుచ్చంగను
గొప్ప వడ్డికి నిచ్చు తప్పె చాలు
నుద్యోగియిల్లు సద్యోహాని సేయంగ
వినకుండ దొంగసొమ్ముఁ దినుటె చాలు
కోమటియిల్లు సంకుచితము సేయ బ్ర
హ్మస్వము దిన్న ద్రోహంబె చాలు
నెంత సామంతుఁడైన వానిల్లు చెడును
బీదబ్రాహ్మణులను బాధపెట్టె నేని
కారడవియైన వహ్నిచేఁ గాలకున్నె
భండనారాతిభీమ కోదండరామ. 5

సీ. సాగరోదకమున సంతృప్తిఁబడియుండు
చేఁప ద్రావఁగ వచ్చె చెలమనీరు
మదిదంతికుంభంపు మెదడు మేయఁగడంగు
హరి నక్కనంజుడు కాసపడియె
బలువు పాముల దినఁ బాల్పడు ఖగరాజు
చిఱుతకప్పలఁ దిన చింతఁ జేసె
బహుదేశమేలు భూపాల శిఖామణి
బ్రాహ్మణక్షేత్రముల్ పట్టసాగె
కాలగతి విపరీతంబుగాఁగవచ్చె
కలిపురుషు నేలుబడి బల్వుగాఁగ హెచ్చె
ధర్మదేవత కిమ్మద్ది దాఁగియుండ
భండనారాతిభీమ కోదండరామ. 6

సీ. రణరంగమున శత్రురాజుల గెలుచునే
దండుగల్ బట్టెడి రండకొడుకు
భూదానములఁబట్టఁ బోవంగ నేర్చునే
కుండలు బడఁద్రోయు మొండికుక్క
సత్పాత్రదానంబు సలుపంగ నేర్చునే
బానిసెలకు నిచ్చు పాడఁగట్టు

తీర్థపరిదేశంబు తిరుగంగ నేర్చునే
ఘోరాటవిఁ జరించుఁ గ్రోతిపోతు
క్రూరకర్ముండు పుణ్యకర్ముండుగాడు
పుణ్యకర్ముండు క్రూరకర్ముండుగాఁడు
దంత కరిగాదు మదదంతి దంతగాదు
భండనారాతిభీమ కోదండరామ. 7

సీ. కలవాడు సత్పాత్రముల దాచుకోనలేని
హీనుని కుద్యోగ మియ్యఁదగునె
యుద్యోగ మున్నప్పు డుపకృతిసేయని
కొయ్యపోతుకు భాగ్య మియ్యఁదగునె
అధికారమున్న వాఁ డాశ్రితుఁ బ్రోవని
క్రూరున కాయుస్సుఁ గూర్చఁదగునె
సామంతమున్నచో జనుల రక్షించని
ఖలునకు సంపదల్ నిలుపఁదగునె
నీకు నేరంబు లివిగావె నిందఁబడకు
దుష్టజనవిగ్రహమున కీర్తులు లభించు
నీరుకట్టైకు భయపడువారుగలరె
భండనారాతిభీమ కోదండరామ. 8

సీ. తామ్రకుభ్రముల చేతరి సరాభుల వేల్పు
వైద్యుల వేల్పు సవ్వాయిసాని
సాలీని వేల్పుగా చాకికరుకురాయి
కంచర్ల వేల్పు తస్కరకులంబు
తిలఘాతకుని వేల్పు కలవాని పండుగ
పిరికిబంటుకు వేల్పు పెదివిగండి
బంట్రౌతులకు వేల్పు ప్రభువైరివర్గంబు
కోమట్ల వేల్పు కకుత్కర్తపరుఁడు
ఘనపురోహితు వేల్పు కాని నక్షత్రంబు
కుమ్మరులకును వేల్పు కుర్కురంబు

పంచాంగులకు వేల్పు భానూపరాగంబు
సాహుకార్లకు వేల్పు క్షామవేధ
వడ్లకమ్మరి వేల్పు వర్షించు తొలకరి
కూలివాండ్లకు వేల్పు గాలివాన
మోషకులకు వేల్పు దోషకృద్గ్రహపతి
మంచిభూభర్త బ్రాహ్మణుల వేల్పు
కడకువారికి వేల్పు తత్కర్మఫలము
మాదృశాదుల వేల్పు నీస్మరణమహిమ
కలదె పులిపక్క జోరీగ కలజ డెందు
ఖండనారాతిభీమ కోదండరామ. 9

సీ. సామంతులకు నివాసములందు పారాలు
వారాంగనలకు సవ్వాయి పుండ్లు
మధుకోశములయందు మక్షికవ్యూహంబు
మొగలిపూచెండ్లకు ముళ్ళగములు
అర్చనగుళ్ళలో నాశ్శీలుగొనువారు
శ్రీగంధతరుల కాళీవిషములు
రాజులయొద్ద దుర్మార్గప్రధానులు
గొర్లమందల యొద్ద కుర్కురములు
గలుగజేసిన విధికేమి గల్గునొక్కొ
తత్త్వదర్శులచేత పొందగల తిట్లై
కానిపనిసేయ దేవతకైననింద
ఖండనారాతిభీమ కోదండరామ! 10

సీ. మెఱుఁగు వేయక కాని మృదువుగా దన్నము
రుచియులేక యుండదు పొగచని కూర
సానఁబట్టక మణిచ్ఛాయ మిక్కిలి కాదు
రతిలేక యింతి సంతతిఁ బడయదు
గొట్టువెట్టక చెట్టు కుసుమంబు లియ్యదు
నూరక యున్న మందు పసిపడదు

ముక్కునుల్వక దీప మెక్కువ వెలుఁగీదు
తరచక వెన్నీదు పెరుగుబొట్టు
పేడిజూపక నెయిగాదు వెన్నముద్ద
ఖలుఁడు గుణవంతుఁడౌను చకారగుళ్ళ.
కలికమునఁ గాని తీరదు కంటితీట
భండనారాతిభీమ కోదండరామ! ౧౦

సీ. పాలభాండము పిల్లి బడఁద్రోయఁగా నేర్చు
నొలికిన పా లెత్త నోపఁగలదె
పూచినవృక్షంబు పురుగంటఁగా నేర్చు
చీడ మానిపి బాగు చెయ్యఁగలదె
పూర్ణతటాకంబుఁ బోరియవెట్టఁగ నేర్చు
నెంటిరిక కలమ పోయించఁగలదె
గోవుమూర్ధంబు ముక్కునఁ దొల్వగా నేర్చు
మాలకాకము పుండు మాన్పఁగలదె
యగ్రహారము ఘాతసేయం దలంచు
పాపకర్ముఁ డది మరల్పంగలండె
దీనులను బ్రోచుటకు నీవె దిక్కుగాక
భండనారాతిభీమ! ॥ ౧౨

సీ. పిల్లలతో మేయ వెళ్లెడు ధేనువు
పెద్దవ్యాఘ్రిమునకు బెదరవలదె
కొమ్మలు గాయ లాకులు నిండువృక్షంబు
ఝంఝానిలమునకు జడియవలదె
పటుయౌవనమున గర్భము మోయు నిల్లాలు
పొరుగింటి సత్తికి వెరువవలదె
సామంతుఁడై సర్వసంపదల్ గలవాఁడు
సత్కవి తిట్టుకు జంకవలదె

బెట్టుమనసున నివి లక్ష్యపెట్టకున్న
దానికైన ఫలంబు ముందరికి తెలుసు
గాలిలో నిడు దీపంబు గూలిపోదె
భండనారాతిభీమ కోదండరామ. ౧౩

---

# గంగాధరకవి

ఈ కవి కాశికి వెళ్ళి విశ్వనాథుని దర్శించి గురుస్వామిచే లింగధారణ మందెను. (94) ఇందీతఁడు విభూతిప్రసమని రెండుమూఁడు సారులు చెప్పినాఁడు. అది యెచ్చటిదో! ఈతఁడు గురుబసవదేవునకు శ్రీశైలమల్లికార్జునునకు నభేదముగ వర్ణించెను. బసవన్న, పండితారాధ్యులు, శివనాగమయ్య, కుమ్మరిగుండయ్య మొదలగు వీరశైవ భక్తుల వినుతించెను. (7; 38; 57; 74; 82) "శ్రీకంఠుఁ జింతించు చిత్తంబు చిత్తంబు; శివభక్తులతోఁ జేయు చెలిమి చెలిమి" యని పోతన్నగారి పోలిక లున్నవి. దాక్షారామ భీమేశ, బెజవాడ మల్లికార్జునులఁ దలపెట్టెను. (56)

సీ. శ్రీమన్మహాదేవ! సృష్టిసంరక్షణ!
దక్షాధ్వరధ్వంస! ధవళవర్ణ!
నందివాహనయీశ! నాగేంద్రకేయూర!
కందర్పసంహార! కలుషదూర!
కైలాసగిరినాథ! కనకాద్రికోదండ!
కారుణ్యనిధి! భక్తకల్పవృక్ష!

గంధర్వగీర్వాణ గరుడ కిన్నెర యక్ష
సిద్ధ విద్యాధర సేవితాత్మ!
పార్వతీప్రాణనాయక భవ్యచరిత!
భర్గలయకాలరుద్ర కృపాసముద్ర!
సర్వగుణధామ శ్రీశైల సార్వభౌమ
చెన్నమల్లేశ! శివలింగ! శరణుశరణు!. ౧

సీ. నవపుష్పకోమలి! నాకిశిరోమణి!
గిరిరాజనందన! కీరవాణి!
గగనసన్నిభమధ్య! గంధేభమదయాన!
యరవిందలోచన! హంసగమన!
కనకజ్జగన్నాథచంద్రబింబానన!
సరసిజాసన వినుతచరణయుగళ!
భ్రమరసుందరవేణి! భక్తచింతామణి!
భూరిగుణశ్రేణి! పుష్పవేణి!
గౌరి! కల్యాణి! శాంభవి పద్మపాణి!
యంబ జగదాంబ భ్రమరాంబ! నాత్మదలఁతు
సర్వగుణధామ! శ్రీశైలసార్వభౌమ!
చెన్నమల్లేశ! శివలింగ! శరణుశరణు!. ౯౫

ఇతఁడు పాల్కురికి సోమనాథు నీ క్రిందివిధముగ స్తుతించెను.

సీ. బసవపురాణ ప్రబంధంబుఁ జెప్పిన
ధన్యుఁడు పుణ్యవర్ధనుఁడు ఘనుఁడు
నిగమప్రవీణుఁడు నీతిసంపన్నుండు
శివకవీంద్రుఁడు దయాసింధుమూర్తి
ప్రతివాదసంఘాత భద్రేభసింహుఁడు
జయశాలి! శాశ్వతచక్రవర్తి!

శ్రీగురుమూర్తి పాలకురికి సోమేశ్వరు
　　　　　　　　　నంఘ్రిద్వయంబును నాత్మ నిల్పి
గీ. మ్రొక్కి కీర్తించి సంతోషమునఁ జెలంగి
పరమహర్షంబుతో మిమ్ముఁ బ్రస్తుతింతు ॥సర్వ॥ 98
" విఖ్యాతి కెక్కిన విభూతిపురమందు
శ్రీగురుబసవన్న శిష్యుఁడైన
కవివరేణ్యుండు ఘనుఁడు గంగాధరుండు
వెలయ నీ పద్యశతకంబు వినుతిఁజేయు॥ " 99

ఈతఁడు పాలుకురికి సోమనాథుని కాలమువాఁడా యని యనుమానము కలుగుచున్నది. ఒక్కొక్కపద్యము చెప్పి, యొక్కొక్క సోపానము నెక్కి శ్రీశైలము చేరినట్లు కాంచో లీ కవినిఁ గూర్చి శైవులు చెప్పుదురు. శైవుల కీ శతకము పరమప్రీతికరమైనది. కావున మఱి రెండుపద్యములఁ జూపెదను. పండితమల్లికార్జునుఁడు ద్రాక్షారామమున విప్రుల గెలిచె ననెను. (67) ఈ శతకము క్రీ॥ శ॥ 1884 న ముద్రిత మైనది.

## చెన్నమల్లేశ్వర శతకము.

సీ. చెంచురూపములు ప్రసిద్ధిగాఁగైకొని
　　　　　　　　　ప్రమథాదులను నెల్ల భటులఁజేసి
సారమేయంబులై చదువులు గొల్వఁగా
　　　　　　　　　పారుటాకులు చుట్టుపాటి మెఱయ
యా యింద్రకీలాద్రి నతివేగమున నెక్కి
　　　　　　　　　కోద్రండంబు నుర్విపైఁ గూలనేసి
కోరవచ్చిన సునాసీరునందను మెచ్చి
　　　　　　　　　కోరిన వరమిచ్చి కృపదలంచి

దివ్యబాణంబుకృపఁజేసి ధీరగతిని
వేల నీ వెంటవిభవంబు వినుతిఁజేతు
సర్వగుణధామ శ్రీశైలసార్వభౌమ
చెన్నమల్లేశ శివలింగ శరణు శరణు|| 23

సీ. చెలఁగి బ్రాహ్మణహింస చేసినవాఁడైన
కడుహీనుఁడగు మాతృగమనుఁడైన
మగువల వధియించు మానవాధముఁడైన
శిశువుల శిక్షించు చెనఁటిరైన
గోహత్య చేసిన కుటిలవర్తనుఁడైన
మద్యపానము సేయు మనుజుఁడైన
కైలాట కాఁడైన కనకచోరకుఁడైన
ఖలుఁడైన నాచారహీనుఁడైన
కాశిలో తనువు వీడ్కొన్నఁ గలుగు ముక్తి
సౌఖ్యకరమైన మీరున్న సరణినుండు
సర్వగుణధామ శ్రీశైలసార్వభౌమ!
చెన్నమల్లేశ శివలింగ శరణు శరణు|| 63

---

# సిద్ధరామకవి

ఇతఁడు సిద్ధరామశతకమును వ్రాసెను. ఈ సిద్ధ రాముఁడు బసవనాదులకుఁ బూర్వుఁడని కొంద అందురు. ఆతని పేరువాఁడింకొకఁడో — లేక యాతనిభక్తుఁడో — దీనికర్త యైయుండును. శతకమునందు సిద్ధరామకవియే దీని కర్త యని నిదర్శనము లేదు. పైఁగా కాఁడనుటకే కవిస్తుతి

యాధార మగును. ఇది సిద్ధరామదాసుఁడే యొక శైవుఁడు సిద్ధరాముని సంబోధించి వ్రాసినట్లు మొదటిపద్యమే సాక్ష్య మిచ్చుచున్నది. కేదారదేవరశిష్యవర్యుఁడు సిద్ధరాముఁ డని యందున్నది. శతక శైలియు నాధునికముగఁ గనఁబడు చున్నది. ఈ శతకము చాల ప్రాచీన మనఁగా క్రీ॥ శ॥ 1800 కంటెఁ బూర్వపుదై యుండును. ఇతఁడు పిడుపర్తి బసవేశ్వ రునిఁగూడ స్తుతించెను. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## సిద్ధరామ శతకము.

సీ. శ్రీకరసముదీర్ణ లోకైకనుతదేవ
నయమార్గతత్వ నిర్ణయనుభావ
మహిఁచతుర్విధయోగ మానసాభ్యుదయాంగ
కలితషట్స్థల భవ్యకారణాంగ
త్రివిధ లింగజ్ఞాన దీక్షావిధానజ్ఞ
సకల వేద పురాణ శాస్త్రధుర్య
పంచముద్రోల్లాస పంచాక్షరీ మంత్ర
మంజుల తంత్ర సమ్మత విశేష
శీలకేదార దేవర శిష్యవర్య
నాదు హృదయాబ్జ కర్ణికన్ బాదుకొన్న
మీకు శతకంబుఁ గూర్చెద లోకులెన్న
చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ! 1

సీ. బసవ పురాణాది బహుశాస్త్ర తతులెంచు
పాల్కురికి సోమేశు బంటుబంట
వర్ణిత సుజ్ఞాన వచనాదు లెఱిగించు
ప్రభు మహాదేవుని బంటుబంట

పరమ రహస్య ప్రబంధాదు లాచరించు
బలుచెన్న బసవేశు బంటుబంట
దీక్షావిధానంబు దెనుఁగించుఁ బిడుపర్తి
బసవేశ్వరస్వామి బంటుబంట
మఱియు వరవీరశైవ సన్మార్గభవ్య
కావ్యలక్షణగణ విచక్షణుల బంట
గాన నే నేర్చుపాటిగాఁ బూనితయ్య
చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ! ||

మెచ్చు వచ్చిన వేళ హెచ్చు మెచ్చులు వేళ
గీడు జెందిన వేళ క్రిందఁబడుచు
కించిత్తు సుఖమెంచి మించి ముచ్చటలాడి
సొక్కి దుఃఖమటన్న కక్కసిల్లి
కలిమి జెందిన వేళ కడుఁ గర్వమునఁ బర్వి
లేమి బ్రామిన సామి నోమి తలఁచి
జనియించు దుర్బుద్ధి జనియించి విలపించి
కరణంబు మరణంబు కలిగి కలిగి
యాకటను వేఁగి కడులాఁగి యాత్మ నాగి
దప్పి నతిదప్పి యెప్పుడు ధరణిఁ దిరుగు
కలుష జీవుండు పరమాత్మఁ గానలేఁడు
చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ! || 45

తా మొరులను చాలఁ దగ నాడుదురు గాని
తా మొక్కరాడినఁ దాళలేరు
అతివేడ్క పరుల సొమ్ము పహరింతురుఁ గాని
తమ సొమ్ము పరులకుఁ దగులనియరు
తగువారి కొఁక కాసుఁ దా మొసంగరు గాని
యొరు లొసంగిన సొమ్ము నొల్ల ననరు
ఒకరి సంపదఁ జూచి యోర్వకుందురు గాని
దమ సంపదలు మేలు దలఁచుకోరు

గొంద అల్పులు ధరలోన కోహాకముల
నెంచి మఱిమించి గర్వించి యెమ్మె దిరిగి
నట్టి జనులకు యమబాధ లెట్టు లుడుగు
చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ! ||

సీ. కలిమి గల్గిననాఁడు గాననేరరు గాని
కలిమిబోయిన దూరఁగలరు నిన్ను
వయసు గల్గిన నిన్ను వన్నెదల్పరు గాని
వయసుబోయిన నిన్ను వగవఁగలరు
ముదముఁజెందినవేళ మొనసిగొల్వరు గాని
కీడొంద తిడుదురు కినుక నిన్ను
తమదార్ఢ్యమున పూజ దనరఁ జేయరు గాని
యలరోగమున నిన్ను నాడఁగలరు
గాని భక్తవిచారైక కలితసార
మహిమగనుటయు నిచ్చలు మరగినిన్ను
కోర్కెమీరఁగ మదిలోనఁ గొలువలేరు
చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ ! 71

సీ, ఒరుల పంచలఁ జేరి యొదిగియుండుట కన్న
నుడిగుండముల దండఁబడుట లెస్స
కడునాత్ర మొరలను కదసి వేడుటకన్న
కోరి బిక్షం బెత్తుకొనుట మేలు
పరుల కధీనమై బ్రతికియుండుటకన్న
తెగి యొక్కఁడై భూమి దిరుగు టొప్పు
నతిమూఢులగువారి నాసఁ జేరుటకన్న
నెన్నఁగ నడవుల నున్న మేలు
కఠినచిత్తునిమాటలు కంటగింప
వినుటకన్నను దేవుఁడై మనుట బాగు
ఎఱుఁగఁగలయట్టి మనుజుల కెన్న దాము
చిత్కళాధామ! శ్రీ గురుసిద్ధరామ!||

# సోమేశ్వరారాధ్యులు

ఇతఁడు పాలుకురికి సోమనాథునిభక్తుఁడు. శిష్యుఁడేమో? శైవగ్రంథములలో భక్తులనేకులు పాలుకురికి సోమన్నను దైవముగా నుతింతురు. పాలుకురికి సోమన్న సంస్కృతమున నొక యన్యవాదకోలాహలము వ్రాసెనందురు. ఈ సోమేశ్వరారాధ్యులు దానిని భాషాంతరీకరించినట్లు తోఁచుచున్నది. "ఏ నుపన్యసింతు నేకాంబ్రగురుచిత్త నలినభృంగసోమనాథలింగ!" అని మకుటము. ఇతఁడు పాల్కురికి సోమన్న నిట్లు స్తుతించుచున్నాఁడు.

సీ. బసవపురాణప్రబంధము మీరు ర
చించిన యభినవశ్రీ నుతించి
మీరర్థి శ్రీపండితారాధ్యచరితంబు
చెప్పిన నిరుపమ స్థితి నుతించి
మీరు చతుర్వేద సారంబు చేసిన
మహితపాండిత్య సమ్మతి నుతించి
బసవరాజీయాది బహుకృతుల్ మీరు ని
ర్మించిన సామర్థ్యమే నుతించి

గీ. రసికతత్త్వభావరతి నన్యవాదకో
లాహలంబు వేదలాలితముగ
నే నుపన్యసింతు నేకాంబ్రగురుచిత్త
నలినభృంగ! సోమనాథలింగ!||

సీ. భవదీయసంబంధ బంధురంబయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలుకురికి

భవదంఘ్రిపూజనాపరుల కిమ్మయ్యె నే
భాగ్యంబుచేసెనో 'పాలుకురికి

* * * *

గీ. పాలుకురికి యెట్టి భాగ్యంబు చేసెనో
నీ స్వనామపూర్వ నిహితమయ్యె
యీ హితానుషంగ ! యేకాంబ్రి గురుచిత్త
నలినభృంగ ! సోమనాథలింగ! ॥

పిమ్మట శైవగ్రంథములలో నుతింపఁబడు పురుషుల నామములు పెక్కు లున్నవి. బసవయ్య, నాచన్న బసవయ్య, నిజలింగ చిక్కయ్య, కక్కయ్య, మాచయ్య, వేమయ్య, శివరాత్రి సంగయ్యఁ మొదలగు శైవ మహాపురుషులఁ బేర్కొనెను.

కర్మవాదము గజిబిజి చేసిన కాట కోటయ్య, జైన వాదము జిట్టుముట్టాడిన దాసి దేవయ్య, కాలవాదము కల్ల చేసిన మార్కండేయ మునియు వచ్చిరి. శైవ సంప్రదాయముగ స్తుతించిన యీ సోమేశ్వరారాధ్యు లెవరు? తెలియుట లేదు.

సీ. మాత్రను చుట్టుఁ దిరుగ మంచిదని నుతింప
గానుగ యెద్దేమి కనియెఁ దిరిగి
స్నానము శుచిచేయు నేని యే శుచియయ్యె
నిత్యంబు గున్నంగి నీళ్ళఁ గ్రుంకి
తలబోడియైనను దత్త్వజ్ఞుఁడేనియుఁ
దలబోడిపడుచు తత్త్వజ్ఞురాలె?
సతిఁగూడకమియ బ్రహ్మ చర్యమేని శిఖండి
సతిఁగూడ దది బ్రహ్మచారి యాానె

గీ. ఏమి చెప్ప భక్తిహీనవర్తితంబులు
బుగ్గిలోన నెయ్యి పోసినట్లు
యెన్న నేల యింక నేకాంబరగురుచిత్త
నలినభృంగ! సోమనాథలింగ!

ఈ గ్రంథము వేదములకు, శాస్త్రములకుఁ దనకుఁ బూర్వములైన ... వగ్రంథములకు సారమని కవి చెప్పుచున్నాఁడు. ఇది పరిశీలింపఁ దగిన దని నాయూహ.

“ కీర్తింప బసవేశు గీతపరిబంధముల్
వాయింప నేర్పరు కైలాస వీణెయనఁగ?
పాలుకురికయ్య పరిబంధములన్నింటి
పెట్టిన యొడికంబు పెట్టెయనఁగ.”

ఇట్లే తన గ్రంథప్రాశస్త్యమును, శివభక్తులకు శరణు శరణు లనుటతోనే యాద్యంతములు నింపివేసెను. ఇది “శ్రీసోమేశ్వరవిరచిత - అన్యవాదకోలాహలము.” అని గ్రంథాంతమున నున్నది. కొన్ని ముద్రితప్రతులలో నిది శివయోగీంద్రవిరచిత మని యున్నది. ఎవ్వరు కర్తలో సత్యము తేలదు. ఎవ్వరు వ్రాసినను క్రీ॥ శ॥ 1750 కంటెఁ బూర్వపుది కావచ్చును.

---

# నిమ్మల లక్ష్మణార్యుఁడు



ఇతఁడు శైవుఁడై యుండును. కంచి యేకామ్రలింగని సంబోధించి శతకము వ్రాసెను. వేమన్నవఱకుఁ గల కవులఁ బొగడెను. కావున నీతఁడు 15 వ శతాబ్దమునకుఁ బిమ్మటి వాఁడు. ఈతఁడు 15, 16 శతాబ్దములవాఁ డని వినఁబడు చున్నది. సాక్ష్యము లేదు. ఇతఁడు కౌండిన్య గోత్రజుఁడు. నిమ్మల వేంకటార్య లక్ష్మమాంబల పుత్రుఁడు, లక్షణకవి. ఈతఁడేగాక మఱియొకకవి కూడ నిదే శతకము వ్రాసి యున్నాఁడు. కర్త పేరు తెలియదు. ఇవి రెండు నముద్రిత ములు. వివరము లింతకంటెఁ దెలియవు. శైలికి రెండుశత కములనుండియుఁ గొన్నిపద్యములఁ జూపుచున్నాను.

## ఏకామ్రలింగ శతకము.

సీ. వ్యాస వాల్మీకుల వర్ణించి యాకాళి
దాసుల నెమ్మది దలఁచి నన్న
వరుస తిక్కనమంత్రి యధిపుల గొనియాడి
భీమ వేమానంత బిరుదుకవుల
బడబార్య పెద్దన బాణయాజినదేవ
సత్కవీంద్రుల నెల్ల సన్నుతించి
నే నేర్చువిధమున నీయంకితంబుగాఁ
జెప్పెద శతకంబు చిత్తగింపు
పరమపావనచారిత్ర ఫాలనేత్ర!
విషమశరశరభంగ వృషతురంగ
యోగిహృత్సంగ బాలచంద్రోత్తమాంగ
అంబికార్ధాంగ! కంచి యేకామ్రలింగ!

సీ. అతివేడ్క శతక మేకామ్రేశ నీపేర
చేసి తానర్పించ చిత్తమలర
గురుతరకౌండిన్య గోత్రపావనుఁడైన
యవని నిమ్మల వేంకటార్యసుతుఁడు
ఘనుఁడు తా లక్ష్మాంబ గర్భాబ్ధిచంద్రుండు
లక్షణవరకవిలక్ష్మణార్యుఁ
డిది విన్న వ్రాసిన నతిభక్తి చదివిన
జనులకు నిహపర సౌఖ్యమొదవు
మోదమలరంగ ముక్తికి మూలమగును
విషమశరభంగ శరభాంగ వృషతురంగ
యోగిహృత్సంగ బాలచంద్రోత్తమాంగ
అంబికార్థాంగ కంచియేకామ్రలింగ! 99

ఇంకొక యేకామ్రలింగశతకము పరిషత్తులో నున్నది. అది యింకొక
ది. శైలికిఁ గొన్ని పద్యములు చూపెదను.

సీ. శ్రీపార్వతీశ్వర శృంగార శేఖర
అహిరాజకేయూర అఘవిదూర
గంగాజపాధార కమనీయగుణహార
హార వైరివిదార యచలధీర
విబుధజనాధార విరహితసంసార
శ్రితలోకపరివార సితశరీర
మునిబృందమందార మూర్తిత్రయాకార
శరనిధిగంభీర ధరనివార
భువనసంచార సంతత భోగసార
చంద్రకోటీర భీకర సమరశూర
మదన మదభంగ మహిత క్షేమాసతాంగ
శరధృతసురంగ కంచి యేకామ్రలింగ॥

సీ. ఆఱపదియమ్ముల గుఱికానిగర్వంబు
మాయజేసిన జగన్మాన్యుఁడీవె
ఒంటత్రాగుడువంట జంటరాకాసిని
మంటఁగల్పిన సితకంఠుఁడీవె
సుడివాలు కేలున జడిఁగొన్న జేజను
పరమమిత్రుండైన భర్గుఁడీవె
చట్టుకూతురుని చేపట్టి లోకములెల్ల
పట్టుగానేలిన భవుఁడవీవె
భక్తజనులను రక్షించు బ్రహ్మవీవె
యనుచు మదిలోన నిన్నెంతు ననుదినంబు
మదనమదభంగ మహిత క్షేమాశతాంగ
శరధృతకురంగ కంచియేకామ్రలింగ 27

సీ. భక్తరక్షకుఁడని భజనచేసితిగాని
ఇంతనిర్దయుఁడని యెఱుఁగనైతి
శంకరుఁడనుచును చాలనమ్మితిఁగాని
కఠినచిత్తుఁడటంచుఁ గాననైతి
దీనావనుండని తెలిసి మ్రొక్కితిగాని
విషగళుండవనుచు వెతకనైతి
నిందుశేఖరుఁడని యిందుఁజేరితిగాని
మదనారి యనుమాట మఱచిపోతి
మంచిదాయెను నీ వెన్నిమాయలైన
జేసి తేమాయె నినుఁబాయ సిద్ధముగను
మదనమదభంగ మహిత క్షేమాశతాంగ
శరధృతకురంగ కంచి యేకామ్రలింగ॥ 72

## పోతన్న పోలిక పద్యములు.

సీ. శ్రీకంఠుఁ బూజించు చేతులు చేతులు
దివిజారి తలఁచిన దినము దినము

గంగాధరునిఁ జూచు కన్నులు కన్నులు
శివునికి మ్రొక్కెడు శిరము శిరము
విశ్వేశు కథ విను వీనులు వీనులు
శివమూర్తి నుతియించు జిహ్వ జిహ్వ
పరమాత్ముమును గొను పదములు పదములు
భూతేశ్వరుని మీది బుద్ధి బుద్ధి
గీ. యనుచు విబుధులచే విని యనుదినంబు
సన్నుతింపుచు నున్నాఁడ సత్య మనుచు
మదన మదభంగ మహిత క్షేమాశ తాంగ
శరధృతకురంగ కంచి యేకామ్రలింగ|| 74

సీ. చంద్రశేఖర నీదు చరణకంజములను
సేవింపఁగా లేని చేతులేల
కందర్పహర నీదు కమనీయమగు మూర్తి
కనుగొనఁగా లేని కన్నులేల
విబుధసన్నుత నీదు విశ్రుత సత్కీర్తి
వినలేని యట్టి యా వీనులేల
త్రిపురాంతకా నీదు దివ్యాలయములకు
చనఁగ లేనట్టి యా జన్మమేల
భక్తిలేక సమర్పించు పత్రి యేల, నిత్యమగు * * ...............
శరధృతకురంగ కంచి యేకామ్రలింగ|| 85

---

# చెన్నాప్రెగడ నాగరాజు

---

చెన్నాప్రెగడ వారిది చాల ప్రాచీన కుటుంబము. వీరిలోఁ బ్రాచీనులు మంత్రులుగానున్న ట్లాంధ్రుల చరిత్రము

సాక్ష్యమిచ్చు చున్నది. వీరిలో 2, 3 వందల సంవత్సరముల క్రితము కొందఱు శుద్ధ శైవులుగా నుండిరి. కొంద ఱిటీవల వైష్ణవ మత ప్రియులైరి. ప్రాచీన కాలము నందు రమారమి క్రీ॥ శ॥ 1750 ప్రాంతమున నున్న యీ నాగరాజకవి వ్రాసిన "గణసాజన్యాఖ్యానశతకము" అను గ్రంథము ప్రాచీన శివ భక్తులు, గణజనములోనివారిని స్తుతించుచు వ్రాసినది దొరకినది. ఈ కవి యాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, గోదావరీ మండలములోని వాఁడు. ఇతఁడు మల్లంపల్లి రామలింగ గురునిచే లింగధారుఁడై దీక్ష స్వీకరించెను. తాళలింగము కొడుకగు బ్రహ్మలింగ మీతని మతగురువు కాఁబోలును. శైలి కీతని శైవ శతకము నందలి పద్యములఁ గొన్ని చూపెదను.

శైవస్థాపనాచార్య స్తుతి శతకము. (గణసాజన్యాఖ్యాన శతకము.)

శ్రీమన్మల్లముపల్లి వంశకరు వాక్ఛ్రీవల్లభప్రేరిత
ప్రామాణ్యాక్షర నైజభావదళనప్రఖ్యాత శ్రీరామలిం
గామర్త్య ప్రభులోకపావనుని లింగాంగైక్య సౌఖ్యాన్వితున్
శ్రీమంతు న్నతియింతుఁ గొల్తుఁ దలఁతున్ సేవింతు దీక్షాగురున్.

ఉ. అల్లమదేవు సత్కృపయు నాబసవేశు మహోన్నతత్వమున్
దెల్లమిగాఁగ మీఁద సరిదేవయప్రాక్తనభృత్య భావమున్
బెల్లుగ సిద్ధరాముని గభీరశివత్వము నొక్కటైన మ
ద్వల్లభు దాళమాన్యసుతుఁ దల్చి భజించెద బ్రహ్మలింగమున్.

చ. పగతులు పెక్కు శంభునికిఁ బ్రాణము మీఁదికి వచ్చుఁ జెల్లఁబో
తగదిటులుండనంచు మఱి తద్దయు గుళ్ళను గోపురంబులున్

అగణితమూల్ రచించి రజితాద్రికి దత్సహితంబుగా నిజం
బగుపడ నేఁగు దీపకళియారిఁ దలంచి నుతింతు నెప్పుడున్.

శా. చెన్నాపెగ్గడ నాగరాజ రచిత శ్రీమద్గుణస్తోమ సా
జన్యాఖ్యానసువృత్తపద్య శతక జ్ఞానార్థ సద్భక్తి సం
పన్నుండైన ఘనుండు శంభుని దయాపాత్రుండునుక్ ముక్తి సం
పన్నుండై సుఖియించుచుండుఁ ద్రిజగత్ప్రఖ్యాతిఁ జెన్నొందుచున్.

---

# శ్రీపతి భాస్కరకవి

ఈ కవి బౌద్ధమతపక్షపాతముఁ జూపుచు నొక "చిత్త శతకము" మనస్సును సంబోధించుచు వ్రాసెను. శ్రీపతి వారు చాల ప్రాచీన కుటుంబమునకుఁ జెందిన వారు. అన్య వాదకోలాహలమును రచియించిన సోమేశ్వరారాధ్యులు (శివయోగీంద్రుఁడు?) శ్రీపతి పండితయ్యను బొగడెను. (చూడుడు. 38 పద్యము.) ఈ శ్రీపతి పండితయ్య పండితత్రయములో నొకఁడైన ప్రాచీన వీరశైవభక్తుఁడు. చిత్త శతకము శుద్ధ వేదాంత ప్రతిపాదకమైన బౌద్ధ శతక మనవచ్చును. అద్వైతమునకు బౌద్ధమునకుఁ గల కొంచెము భేదము కనఁబడుచుండును. వేదశాస్త్ర పురాణముల బొరుషేయములని నిరసించును. కాని యాతఁడు వ్రాసిన మంగళాదిపద్యము నందు మాత్రము శ్రీవాణీగిరిజారమాధిపతులఁ దలఁపెట్టక మానలేదు! బౌద్ధులు లేని యీ నవీన కాలమునం దీ శతకము

వారియ నగత్యము కనఁబడదు. వరంగల్లు రాజ్యపతనము క్రీ॥ శ॥ 1323 నకుఁ బిమ్మట జైన బౌద్ధ ప్రచార మున్నట్లు తెలుఁగు దేశమున నిదర్శనములు లేవు. కాని కూచిమంచి తిమ్మకవి తన కాలమున జైన బ్రాహ్మణు లున్నట్లు తన కుక్కుటేశ్వర శతకమున వ్రాసెను. ఎట్లయిన నీ శతకము 17, 18 శతాబ్దములకుఁ బూర్వపుదై యుండవలె నేమో? శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## చిత్త శతకము.

ఉ. వటపత్రంబఁట, శంకరుండు హరిశశ్వద్బాలుఁడై కేళి స
ల్పుటలాపైనఁట, విష్ణునాభినఁట, వేల్పుం బెద్ద జన్మించెఁదా
నఁట, కల్పించెజగంబులెల్లనుట లత్యాశ్చర్య మీలాటి గొం
తటి చిత్రంబని కంటినంటి కనరాదా నీవుగా చిత్తమా! 5

శా. లోక వ్యాప్తికి మూలమా నెఱుక నీలోఁ జూచి తర్కించి వా
ల్మీకి వ్యాస పురాణ గాథలను కూర్మిన్ జూడ వౌలోక స్వ
ర్లోకప్రాకటయామ్యలోకముల నీలో సౌఖ్య దుఃఖాదులౌ
గాకన్నెప్పుడునమ్మి యూర్జిత మలంకారించుకో చిత్తమా! 47

శా. వేదంబుల్ మనుజుల్ రచించి రతి పాండిత్యంబుతో శాస్త్రముల్
తాదృక్పద్ధతి నుద్భవిల్లె దపముల్ దానంబులున్ ధర్మముల్
మోదం బబ్బును జేయుఁడంచు నరులన్ బోధింతు రవ్విప్రులే
కాదా జంబుకయుక్తులాల్లకు వివేకానందమా చిత్తమా! 19

ఉ. బీదల కన్న వస్త్రములు పేర్మి నొసంగుచు తుచ్ఛ సౌఖ్య సం
పాదనకై యబద్ధములఁ బల్కకు, వాదము లాడఁబోకు, మ
ర్యాద నతిక్రమింపకు, పరస్పర మైత్రి మెలంగు, మిట్టివే
వేదములం చెఱుంగుము వివేక ధనం బిది నమ్ము, చిత్తమా! 76

ఉ. చిత్తరు లుత్తమత్తకవి చెత్తలు, సత్తరు లుత్తమోత్తముల్
ముత్తియ ముత్తి బత్తియును మొత్తము రిత్తను క్రొత్త క్రొత్తలా
పొత్తము లెత్త నుత్తరము పొత్తగు నెత్తరి సత్తు గుత్తమా
బిత్తరవృత్తిసత్తియగు బెత్తలు కత్తళమత్తు చిత్తమా! 78

క. వృద్ధాచార శ్రుతినుత
పద్ధత్యనుభవనిరుక్తి భాస్కరకృతి త
ద్బోద్ధల నాక్షేపించు ప్ర
బుద్ధుల కీ శతక మిచ్చు భుక్తిన్ ముక్తిన్.

మ. భవదీయప్రకృతి ప్రభావ మవినాభావంబునై సోహమై
భవపద్మోద్భవముఖ్యదేవగణమై బ్రహ్మాండభాండంబునై
రవిచంద్రాగ్నినియుక్తతేజమయి విభ్రాజత్సదానందమై
ధ్రువమై చిన్మయమై వెలుంగునుగదా రూఢిక్రియన్ చిత్తమా!

మ ఘృతకాఠిన్యనిమిత్తయుద్రవముభంగిన్ నిశ్చలవ్యాపకా
కృతులంబొందిన దీవె సుమ్ము మృదుసూక్తిన్నమ్ము నిక్కమ్ముగా
వితథానూన కుతర్కకర్కశ సదృగ్వేదాంత సిద్ధాంత ప
ద్ధతు లేలా? యవి స్వప్నతుల్య మనరాదా దెల్పుమా? చిత్తమా!

మ. శ్రీవాణీగిరిజారమాధిపతులన్ సేవింతు నెల్లప్పుడున్
నీవాంఛల్ సఫలంబులయ్యెనో జగన్నిర్మాణచాతుర్య యు
క్ప్రావీణ్యంబధిక ప్రశస్తిఁ గనెనో భాషింపు నీతోడఁ బ్ర
స్తావింపన్నమకట్టి యిప్పుడును సంధానించెదన్ చిత్తమా!

---

# ఆఱివెళ్ల సీతారాముఁడు



ఇతఁడు జానకీపతిశతకమును వ్రాసెను. "జానకీపతీ!" అని మకుటము. ఉత్పల చంపకమాలలు రచించినాఁడు. తన యన్వయనామధేయము లిట్లు వ్రాసికొనుచున్నాఁడు.

సీ. ఆణివిళ్లాన్వయ మాణిక్య నారాయ
ణకవికిఁ బౌత్రుండు సుకవివరుఁడు
శ్రీ వేదమాంబకు శ్రితపాలుఁడైన సీ
తారామశాస్త్రికిఁ దనుభవుండు
గోపతినిభులైన కొండయ్య కామేశ
బుధులకు ననుజుండు బుధనుతుండు
పరదేశి కగ్రజుం డరుణ తేజుఁడు సూరి
వర్యవిధేయుఁడు వర్ణ్యయశుఁడు
శ్రీధర్మలింగశాస్త్రి విబుధపౌత్రుండు
శోభితాప స్తంబ సూత్రపరుఁడు
వెలగు వేంకటశాస్త్రి శ్రీనారమాంబల
దత్తపుత్రుఁడు రామదాస్యకరుఁడు
శ్రేష్ఠవాసిష్ఠ సరిత్తీరవాస్తవ్య
కాకరపర్తి నగరనివాసి
కాశ్యపగోత్రుండు కవితాభిరాముండు
శ్రీసోమనాథార్య శిష్యవర్యుఁ
డాశ్వాసరామాయణాభిఖ్య చంపువు
బుధమానసోల్లాస పుస్తకంబు
సంస్కృతభాషలఁ జక్కఁగాఁ జేసిన
వాఁడు సన్నుత సూరి వర్య పదుఁడు
పండిత సంగమాభ్యస్య మానకణాద
గౌతమతంత్ర సంగతనయుండు
శబ్దార్థలక్షణ సరళమతివ్యాస
శాణాస్మ తేజితస్వాకృతిరత్నుఁ

గీ. డప్రతిముఁడు సీతారామ విప్రవరుఁడు
శతక మొనరించె నీ పేర సరసధారఁ
జూచి కావింపు మాచంద్ర సూర్యముగను
జానకీలోల! రామ! సుజ్ఞానపాల!

వివరము లన్నియుఁ బైనఁ దెలియుచునేయున్నవి. ఈతని తండ్రి వేంకటశాస్త్రి బహుశః కూచిమంచి జగ్గకవి తెలుఁగుచంద్రరేఖావిలాసమును రాజు కృతినొందకుండఁ జేసినయాతఁడే యైయుండును. అట్లయిన నీ కవి తండ్రి జగ్గకవి సమకాలికుఁడు. తండ్రినాఁటికిఁ దెలుఁగు కవిత్వముపై నసహ్యము జగ్గకవివలన బూతులకుఁ గారణమైనది కాని కొడుకగు నీ కవినాఁటికి సరసమై యొప్పిదమైనది. ఇది విచిత్రమైన మార్పు! జానకీపతిశతకము సంస్కృతపదజటిలమై తెలుఁగుపదములకు దూరముగనున్నను ప్రౌఢభాషగల శతకములలో నిది యొకటి యని చెప్పవచ్చును. ఉదాహరణముగ రెండుపద్యములఁ జూపెదను. కొన్నిపద్యములు తేటతెల్లముగ నున్నవి.

చ. నతజనసంఘ పాపగణనాగఖగేంద్రము యాతుధానహృ
చ్ఛదదళచంద్రమఃకరము సాధుజనాక్షి సహస్రపత్రి సం
తతితరణిప్రకాశము స్వదానఖగాబ్దము ధాతృశూల పా
ణితపనకామకల్పకము నీదుపదాబ్జము జానకీపతీ!

చ. సురపతి నేలినాఁడు రిపుసోదరు లెస్సగఁ బ్రోచినాఁడు పా
ర్థ రమణిఁ గాచినాఁడు, మునితల్లజు యజ్ఞముఁ బ్రోచినాఁడు వా
నరపతి మన్చినాఁడు రఘునాథుఁడు కావున వేడుమంచు నా
గురువులు చెప్ప వేడ్కపడి కోరితిఁ బ్రోవవె జానకీపతీ!

శైలి కొన్ని పద్యములయందు మధురమైయున్నది. ఈ శతకము మిక్కిలి ప్రౌఢమై, యానందజనకముగ నున్నది. ఈ కవికాలము క్రీ॥ శ॥ 1750 ప్రాంతము కావచ్చును.

ఈ కవి వాసస్థానము తణుకుతాలూకా కాకరపఱ్ఱుగ్రహారము. ఈ యగ్రహారమునందే వల్లభాచార్యుని వంటి మత సంస్థాపకుఁడు జన్మమందె వని యాత్తరాహులే యంగీకరించి యున్నారు. ఘూర్జరదేశమునందు మతమును స్థాపించి యాచారవర్యుఁ డనిపించుకొనిన వల్లభాచార్యుఁడు తెలుఁగు వాఁడే గాక గోదావరీతీరమున నున్న యీ యగ్రహార మాతని జన్మస్థాన మని వినినప్పుడు మన కానందదాయక ముగ నున్నది. e Dinesh Chandra Sen's "Chaitanya & His companions" by the University of Calcutta.)

---

## శేషప్ప కవి

ఇతఁడు నృశింహాశతకమును రచియించెను. కవికాలము కాని, కులగోత్రాదులుకాని నిర్ణయించుట కాధారములు లేవు. "భూషణవికాస శ్రీధర్మపురనివాస! దుష్టసంహార! నరసింహా! దురితదూర!" యను ప్రసిద్ధమకుటముతో 100 పద్యములను రచియించినాఁడు. శైలి మృదుమధురము — భావములు నూతనములు — భాష యంతగా లక్షణ యుక్తమైనది కాదు.

సీ. కర్ణయుగ్మమున నీ కథలు సోకినఁజాలు
పెద్దపోఁగులజోళ్ళు పెట్టినట్లు
చేతులెత్తుచుఁ బూజ సేయఁగల్గినఁ జాలు
దొరయఁగాఁ గడియాలు దొడిగినట్లు
మొనసి మస్తకముతో మ్రొక్కఁ గల్గినఁ జాలు
చెలువమైన తురాయి చెక్కినట్లు
గళము నొవ్వఁగ నామ స్మరణ గల్గిన జాలు
వింతగాఁ గంఠీలు వేసినట్లు

తే.గీ. పూని నినుగొల్చుటే సర్వభూషణంబు
లితర భూషణముల నిచ్ఛఁగింప నేల
భూషణ వికాస! శ్రీధర్మపురనివాస
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

సీ. కువలయశ్యామ నీ కొలువు చేసిన నాకు
జీత మెందుకు ముట్టఁ జెప్పవైతి
మంచి మాటలచేతఁ గొంచెమియ్యఁగ లేవు
కలహమానికఁ జూమ్మి ఖండితముగ
నీవు సాధువు గాన నింతపర్యంతంబు
చనవుచే నిన్నాళ్ళు జరుపవలసె
నిఁక నే సహింప నీ విపుడు నన్నేమైన
శిక్ష చేసినఁ జేయు సిద్ధమయితి

తే.గీ. నేఁడు కరుణింపకుంటివా నిశ్చయముగఁ
దెగఁబడితిఁ జూడు నీతోడ జగడమునకు
భూషణ వికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఇతఁడు భగవంతునితో సంభాషించుటలో మృదులము, కాఠిన్యము, బెదరింపు, కోపము, మున్నగునవి చూపి నిజమైన భక్తిని స్వతంత్రాభిప్రాయములను జూపఁగలిగెను.

ఇతఁడు చెప్పు ధర్మపురి నైజాము మండలములోనిది. ఇతఁడా పురవాసి యై యుండును. పోతన్న దనుకొనుచున్న నారాయణ శతకమున "అపరాధంబులు నిన్ను నమ్మి......... ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా!" అని యొక పద్యమున నున్నది. దీని నొకసారి శేషాద్రిరమణ కవు లిట్లు హెచ్చరించిరి.

"నిజాము రాష్ట్రములోని ధర్మపురి క్షేత్రము మిక్కిలి సుప్రసిద్ధమైనది. ఇది గౌతమీ తీరమున నున్నది. ధర్మపురి రామాయణము, "భూషణ వికాస శ్రీ ధర్మపురనివాస దుష్టసంహార నరసింహ దురితదూర" యను శతకము నకు నీ ధర్మపురియే జన్మస్థానము. పలువురకు నిజాము దేశీయులకు ధర్మపురి నామ మీ క్షేత్రమును బట్టియే వచ్చినది. దృష్టాంతముగ సిరిప్రెగడ ధర్మపురి కవిని తీసికొనవచ్చును. అనేక ప్రాచీన ప్రబంధములలో నీ ధర్మపురి ప్రశంసయే తఱచుగాఁ గానవచ్చుచున్నది. నారాయణ శతక కర్త చెప్పినటుల నచట నొక లక్ష్మీనాథాలయము కలదు. పోతరా జేగిన గంగా స్నానము గోదావరీ స్నానమని చరిత్రకారు లేకగ్రీవముగ నామోదించి యున్నారు. స్నాన మొనర్చినది గౌతమీ తీర్థమగు ధర్మపురి ప్రాంతపు రేవే యగునేని నారాయణ శతకము పోతన కృతమని విశ్వసింప వచ్చును. ఈ విషయ మింకను విమర్శించి కాని నిర్ణయింప వీలులేదు. నిజాము రాష్ట్రములోని ప్రకృత ధర్మపురి నే యే కవు లెట నెట పేర్కొనిరో పరిశీలింతము.

శా. శ్రీలక్ష్మీకుచ పారిజాత కలితా శ్లిష్టోరువక్షుండు దే
వాలీమౌళి మణిప్రభారుచిరపాదాంభోజుఁ డుద్యద్దయా
లీలన్ ధర్మపురీశ్వరుండు గుణశాలిన్ మాదనాంభోనిధి
ప్రాలేయద్యుతి పెద్దన ప్రభు సమగ్ర శ్రీయుతున్ జేయుతన్.

(చిత్ర భారతము.)

పెద్దన ప్రభుఁడు పాకాల చెఱువు బాగుచేయించినటుల నందుఁ గలదు గావునను, పాకాల ధర్మపురికి సమీపస్థము గావునను, లక్ష్మీనాథు నే పేర్కొని యుండుట వలనను, ప్రకృత ధర్మపురి నైజాముదే.

చ. అతులిత లీలఁ గేశ సచివాగ్రణి ధర్మపురంబునందు నం
చితముగ నన్నసత్త్రమిడి శ్రీ నరసింహుని కుత్సవంబులున్
సతతమహోపహారములు సల్పుచు రామగిరీంద్రమందు సు
స్థితి గుడిఁగట్టి విష్ణుని బ్రతిష్ఠ యొనర్చె సుహాత్మసంపదన్.

(పద్మ పురాణము.)

ఇందుఁ జేర్కొనఁబడిన రామగిరియు నిజాము దేశములోని ధర్మపురి చెంతనే కలదు. ధర్మపురి నృసింహ క్షేత్రము సుప్రసిద్ధమైన దని పైనుదహరించిన యన్ని పద్యముల వలన ద్యోతక మగుచున్నది. నృసింహ యనుటకుఁ బర్యాయ పదముగ లక్ష్మీశ యనుట యొక భేదము కాదు. లక్ష్మీనాథ చిహ్నితమైన ధర్మపురి నిజాము దేశములోని దనుటకు నా యా గ్రంథముల నితరాధారములు నైతము కలవు.

సీ. తతసాధుతరసంపదావసథంబయి, పరగుచుండెడి ధర్మపురియ నేటి

(నవీన వసిష్ఠ రామాయణము.)

ఇటులఁ బ్రశస్తిగల ధర్మపురి నిజాము దేశములోనిదే యని కవులు ప్రశంసించుటచే గ్రహింపవచ్చును. ఇతర స్థానములలోఁ గల ధర్మపురికీ ప్రశస్తి కానరాదు. నారాయణ శతక మెవరు రచించినను సరే. గ్రంథ రచయిత మాత్రము నిజాము దేశములోని ధర్మపురికి సంబంధించినవానిఁగ విశ్వసింపఁ జనును. మహాకవుల నివాస స్థలములు భాషాసేవకులకుఁ బుణ్య క్షేత్రములు కాన నిట్టి నిరూపణమునకు వాఙ్మయ సేవకులు తెలిసినంతవఱకుఁ బనిచేయుట కర్తవ్యము."

(ఆంధ్రపత్రిక సా. అ. రౌద్రి, ఆశ్వ, బ ౧౦ మి; 704 పుట కవి జీవితములును చూడుఁడు.)

నరసింహ శతకము నుండి శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను. ఇది చాల జనసమ్మతి నొందిన శతక రాజము:—

సీ. భువనరక్షక నిన్నుఁ బొగడ నేరని నోరు
ప్రజ కగోచరమైన పాడుబొంద

సురవరార్చిత నిన్నుఁ జూడఁగోరని కనుల్
జలము లోపలి నెల్లిసరపుగుండ్లు
శ్రీరమాధిప నీకు సేవ జేయని మేను
కూలి కమ్మఁడువోని కొలిమితిత్తి
వేడ్కతో నీ కథల్ వినని కర్ణములైనఁ
గఠినశిలాదులఁ గలుగు తొలలు
పద్మలోచన నీ మీఁద భక్తిలేని
మానవుఁడు రెండుపాదాల మహిషమయ్య
భూషణ వికాస! శ్రీధర్మ పురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర! 30

సీ. జందె మింపుగ వేసి సంధ్యవార్చిన నేమి
బ్రహ్మ మెఱుఁగ కున్న బ్రాహ్మణుండె
తిరుమణి శ్రీచూర్ణ గురురేఖలిడ నేమి
విష్ణు నెఱుఁగ కున్న వైష్ణవుండె
బూదిని నుదుటను బూసికొనిన నేమి
శంభు నెఱుఁగ కున్న శైవజనుఁడె
కాషాయ వస్త్రంబు గట్టి కప్పిన నేమి
యాశ లుడుగ కున్న యతివరుండె
యిట్టి లౌకిక వేషాలు గట్టుకొనిన
గురునిఁ జెందక సన్ముక్తి దొరకఁబోదు
భూషణ వికాస! శ్రీధర్మ పుర నివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర! 38

సీ. కమలలోచన నన్నుఁ గన్నతండ్రి విగాన
నిన్ను నేమఱకుంటి నేను విడక
యుదరపోషణమున కొకరి నేనాశింప
నేర నా కన్నంబు నీవు నడపు
పెట్టలే నంటివా పిన్న పెద్దలలోనఁ
దగవు కిప్పుడు దీయఁ దలఁచినాను

ధనము భూరంబైనఁ దలకిరీటము నమ్ము
కుండలంబులు పైడిగొలుసు లమ్ము
కొనకు నీ శంఖచక్రముల్ కుదువఁబెట్టి
గ్రాస మీ విచ్చి పోషించు కపట ముడిగి
భూషణ వికాస! శ్రీధర్మ పురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర! 56

సీ. నీ భక్తులను గండ్ల నిండఁ జూచియు రెండు
చేతుల జోహారు చేయువాఁడు
నేర్పుతో నెవరైన నీ కథల్ చెప్పంగ
వినయమందుచుఁ జాల వినెడువాఁడు
తన గృహంబునకు నీ దాసులు రాఁజూచి
పీటపైఁ గూర్చుండఁబెట్టువాఁడు
నీ సేవకుల జాతి నీతు లెన్నక చాల
దాసోహమని చేరఁ దలఁచువాఁడు
పరమభక్తుండు ధన్యుండు భానుతేజ
వానిఁ గనుగొన్నఁ బుణ్యంబు వసుధలోన
భూషణ వికాస! శ్రీధర్మ పురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర! ॥ 46

సీ. జీమూతవర్ణ నీ మోముతో సరిరాక
కమలారి యతికళంకమునఁ బడియె
సొగసైన నీ నేత్ర యుగముతో సరిరాక
నళినబృందము నీళ్ళనడుమఁ జేరె
కరిరాజవరద నీ గళముతో సరిరాక
పెద్ద శంఖము బొబ్బ పెట్టఁ దొడఁగె
శ్రీపతి నీ దివ్య రూపుతో సరిరాక
పుష్పబాణుఁడు నీకుఁ బుత్రుఁడయ్యె
యిందిరాదేవి నిన్ను మోహించి విడక
నీకుఁ బట్టంపు రాణిగ నెగడెనయ్య

భూవణ వికాస! శ్రీధర్మ పురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర! ॥ 78

ఇతఁడు వంది కులమువాఁ డేమో యని శైలినిఁ బట్టి యనుమానించుచున్నాను. కవి క్రీ॥ శ॥ 1800 కుఁ బూర్వుఁడై యుండ వచ్చును.

---

# మల్లనయోగి

ఈతఁడు వేమన తరగతికిఁ జేరిన వేదాంతి. ఈతనిఁ గూర్చి యీ క్రింది కథ వాడుకలో నున్నట్లు గ్రంథ ప్రకాశకులు వ్రాసియున్నారు:—

"వీరు (మల్లనయోగి) కళింగరాజ్యమునందు పర్లాకిమిడి ప్రాంతమునం దుండిన విశ్వకర్మ వంశజులు; ఈ యోగి యోగవిద్యాభ్యాస ధురంధరుండై పెక్కు పద్యంబుల రచియింపుచుఁ దన కవసానదశ సంభవించునప్పు డా ప్రాంతము లందలి పెద్దలతో "నే నీ శరీరంబు విడిచి పర్లాకిమిడిరాజు నింట జన్మించెద, నిందుకు నిదర్శనము నా సమాధిపైఁ బడి యీ గ్రామపుటేరు ప్రవహించుటయే" యని వక్కాణించి దేహత్యాగుఁడయ్యె ననియుఁ బిదప గొన్ని నాళ్ళకు పర్లాకిమిడి జమీందారు నింట నొక మగశిశువు జనించిన ముహూర్తముననే యీతని సమాధిపై నవారణమగు నేటి వెల్లువ ప్రవహించఁగా నపు డక్కాలపు మహానుభావులందరు "మల్లనయోగియే యీ జమీందారు నింట నవతరించె" నని మహోల్లాసముగా జగంబులఁ జాటిరనియు నేటివర కక్కడక్కడ నీ మహాయోగిపుంగవుని గూర్చి యొక యద్భుత కథఁ జెప్పుదురు. పై కథ యెట్లున్నను నీ మల్లనయోగి నామాంకిత పద్యములు

ఛందో వ్యాకరణ విరుద్ధపదపూరితములై, పండిత కర్ణకఠోరములై యున్నను గొన్ని నీతి యుక్తములై వేదాంతోక్తి సమన్వితములై యుండుటం బట్టి * * "

అని అల్లక వీరభద్రుఁడుగారు 1901 లో వ్రాసి యుండిరి. ఈ పద్యములు వారు ప్రజలకడ సేకరించి ముద్రించినట్లును ఇంకను గొన్ని తమకుఁ దెలియనివి మిగిలియుండు ననియు 166 పద్యములే ప్రకటించిరి. దీనినిఁ బట్టి యీ యోగి వేమనయోగి వలెనే యనేక శతకములు వ్రాసినవాఁడనవచ్చును.

శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

మల్లనయోగి శతకము.

క. మూఁటికి మూలము తానై మూఁటికిఁ దాలోను గాక మూఁటికి వెలియై
మూఁటికి మూఁటికిఁ దుదఁగను మాటికి విజ్ఞానభోగి! మల్లనయోగి!

క. జ్ఞానామృతపరిపూరిత మానసులను దెలియలేక మనుజాధము ల
జ్ఞానధ్వాంతంబును మది మానరు విజ్ఞానభోగి! మల్లనయోగి!

క. దండ కమండలువులు జడ దండలు గాషాయములనుఁ దాల్చి చరించే
బండలు నిందార్హులు జన మండలి విజ్ఞానభోగి! మల్లనయోగి! 59

---

# రాచవేటికవి

ఇతఁ డొక తారావళిని వ్రాసెను. అది వేశ్యలను గర్హించునది. దీనికి గణికాగుణప్రవర్తన తారావళి యని పేరు. ఇందలి కటువు శబ్దములకు నసభ్యములకు వెఱచి కొఁబోలు కొందఱిది పఠనీయము కాదందురు. శుద్ధ భీభత్స

రసమును గురిపించి వేశ్యాలోకముపై యువకుల మనంబుల నసహ్యము కలిగించుటకు వ్రాయఁబడిన దీనియందు తారక నామోపదేశముండునా? వేశ్యల మాయలు, వారి శరీరముల రోతలు, వా రవి కప్పుటకుఁ జేయు మెఱుఁగులు నిర్దయ హృదయముతోఁ గవి వెల్లడించెను. దాని వలన నాతఁడు బుద్ధిహీనుఁ డని కాని, యశ్లీలపద ప్రియుఁడని కాని తలంప వచ్చునా? ఈ యసహ్యకరమైన కుళ్ళు బయలు పెట్టినచో నిదియే మోక్షము, మధురము నని లోకానుభవము లేక పడి పోవు యువకులు చెడకుండ నుండవలె ననియే కవి యభిప్రాయము. "సరసదరహాస భువనరంజనవిలాస బుధజనోల్లాస చిరతనిపురనివాస!" యను మకుటముతో 27 పద్యముల తారావళిని వ్రాసినాఁడు. ఇతని కుల శీల కాలము లేమియుఁ దెలియుట లేదు.

సీ. పాలుపారఁ జక్కెర పూఁతపూసిన విసం
                    బులు సుమ్మి వెలవెలందుల పలుకులు
మన్నారు సున్నగా వెన్న మెత్తినశిలల్
                    సుమ్మి యా వెలయాండ్ర నెమ్మనములు
చొక్కమౌ రత్నాలు చెక్కు సంకెల జుమ్మి
                    ధాత్రిని వారకామినుల చేష్ట
లంగసౌష్టవముల రంగారు గ్రహములు
                    జుమ్మి భోగమువారి సోయగములు
గీ. కాంచినంతనె చిత్తవైకల్యమంటి
నంతనె ధనక్షయంబగు జంతలార
సరసదరహాస! భువనరంజనవిలాస!
బుధజనోల్లాస! చిరుతనిపురనివాస!

ఇంతకంటె సరసముగ యువజననీతిబోధకముగ వేశ్యల యట్టు పుట్టానవాళ్ళు బయలుపడునట్లుగ నే సంఘసంస్కరణ ప్రియుఁడు చెప్పఁగలఁడో, యువకులు చెడిపోకుండఁ గోరు నే నైతికుఁడు వ్రాయఁగలఁడో నే నెఱుఁగఁజాలకున్నాను. ఇట్టి గ్రంథము పఠనీయము కా దనుకొనుట మనసంఘనైర్మల్య మును సూచించుటకంటె మన సంస్కర్తలహృదయ దౌర్బ ల్యమునే యెక్కువగ సూచించు నని నే నభిప్రాయపడు చున్నాను.

సీ. హితవున రక్షించి *తులచే మెప్పించి
కదిసి మోముఁ గదించి గారవించి
మాటలఁ దేలించి మానము దూలించి
యుపముచే విత్తంబు నపహరించి
మదిని గఱంచి బల్ మమతలు పుట్టించి
కలికి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి
తుది లేమిగని వాని దూషించి తనయింటి
పరిచారునిగ నెంచి పరిహసించి

గీ. పొమ్మనుచు బమ్మరిలి వాఁడు బోవ కాళ్లు
రాక యుండఁగ నేతు రా రమణు లరయ
సరసదరహాస! భువనరంజనవిలాస!
బుధజనోల్లాస! చిరుతనిపురనివాస!

ఇంతకంటె నీతిబోధకమైన పద్య మేమున్నది? వేశ్యా సంపర్కమువలన నింతకంటె నెక్కుడు కష్టము లెవ్వరు కన్నులకుఁ గట్టినట్లు చూపఁగలరు. వైజయంతీవిలాసాదులం దింతకంటె నేమి చెప్పిరి? పైపద్యము నందలి "యొక్కశబ్దము"

దూష్య మనుకొందము. ఆ పద ముచ్చరించి నంతమాత్ర ముననే యువకులు తత్పరాయణు లగుదురా? రతిమన్మథనాటకమను సంస్కృతనాటకము పేరునందే యీ శబ్ద మున్న దే? కాక బాలుర కీ పద మర్థమే తెలియదు. యువకుల కందలి స్వారస్యమే తెలిసియుండును. వారు సభ్యమైన పై శబ్దో చ్చారణమాత్రముననే కచ్చలువిడి పరువు లెత్తుదురా? ఇది మన దౌర్భాగ్యదశ! మన సంఘము, మనవాఙ్మయమును గూడ "బూత"నుకొను పాశ్చాత్యనాగరికత ప్రాంత!

నా యభిప్రాయముచే నించుక జుగుప్సాకరములగు పదము లున్నను దేశము మేలుకోరువారు గణికాగుణప్రవర్తనతారావళిని యువకు లందఱచేతను బఠింపఁజేసి హృదయమునకుఁ బట్టునట్లును, వేశ్యాసంపర్కమువలనఁ గలుగు నష్టముల నింక జుగుప్సాకరముగ నుండునట్లు వర్ణించునట్లు కవుల బ్రోత్సహించునట్లును జేయవలె నని మనవిచేయుచు న్నాను. ఈ కవి క్రీ॥శ॥ 1800 కుఁ బూర్వుఁడు కావచ్చును.

———

## పావులూరి మల్లన



ఇతఁడు గణితశాస్త్రమును రచించిన యాతఁడు (గోత్ర భేద ముండుటచేఁ) గానేరఁడు. భద్రాద్రిరామశతకము వ్రాసిన యీ పావులూరి మల్లన్న మఱియొకఁడు. శతకాంత మునఁ దన్నుగూర్చి యిట్లు వ్రాసికొనినాఁడు:—

క. రామవర పావులూరి
స్వామివి నీవనుచు నమ్మి శతకము భక్తిన్
బ్రేమ రచియించితిని గొను
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా॥ 101

క. శ్రీమహిత పావులూరి సు
ధాముడు రామన్నమంత్రి తనయుఁడ కవి సు
త్రాముడ మల్లనసచివుఁడ
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా॥ 102

క. సోమార్క నేత్ర విను నే
నీ మహి వాసిష్ఠగోత్ర హిమకరుఁడను సు
శ్రీమీర నిన్నుఁ గొల్చెద
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా॥ 103

క. స్వామీ ధరఁ బాపమకున్
రామనకుం బుత్త్రకుఁడను రమణీయ గుణో
ద్దాముఁడ నాపస్తంబుఁడ ॥శ్రీ॥ 104

పై వివరములవలన నీతఁడు పావులూరివాసుఁడనియు, రామన్న మంత్రి, పాపమ్మలకుఁ బుత్త్రుఁడనియు, వాసిష్ఠగో త్రుఁడు నాపస్తంబసూత్రుఁడుననియు తెలియుచున్నది. గార్గ్య

గోత్రోద్భవుండగు గణితశాస్త్రపు మల్లన వంశీకులమని చెప్పకొను ఉన్నవ వారర్వేలనియోగులుగా నున్నారు. ఈ పావులూరివారే శాఖాబ్రాహ్మణులో స్పష్టముగ నిర్ణయముకాదు. గుంటూరుమండలము బాపట్లతాలూకాలో నున్న పావులూరే యీయిద్దఱు మల్లన్నల వాసస్థానమును గావలసియున్నది.

క. ఇలఁ గమ్మనాటిలోపల
విలసిల్లిన పావులూరి విభుఁడమ సూత్రా
కలితాపస్తంబద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్య గోత్రోద్భవుఁడన్.

అను పద్యమువలన గుంటూరు మండలమునందలి బాపట్ల తాలూకా ప్రాంతము మొదటి మల్లన కాలమునాటిఁకే కమ్మనాఁడని పేరుపొందినది. ఆ పావులూరి మల్లన్న తన్నుఁగూర్చి వ్రాసికొనిన వివరము లివి.

శ్రీనిలయుండు శివ్వనయుఁ జిమ్మనయుం గుణసూర్యదేవుఁడున్
ధీనిధి ప్రోలనార్యుఁడును దేజమునన్ రవితుల్యులైన యీ
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతులైన సత్య వి
జ్ఞానులు పద్మగర్భవదనంబులు నాలుగుఁ బోలు వారిలోన్.

శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురిపార్శ్వమునన్ నవఖండవాడ యన్
పోలు విభూతితోఁ బడసె భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్త్రుఁడు మల్లఁ డున్నతిన్.

ఈ పావులూరి మల్లన్న తలిదండ్రులు శివన్న గౌరమలు. శతకకవియగు మల్లన్న పద్యములు కొన్ని చూపెదను.

క. రామరాజాధిరాజ
శ్రీమణి నూపురపదాబ్జ శ్రీరవితేజా
వామన వరకుశశయనా ॥శ్రీ॥ 27

క. రామజగదేకవీరా
శ్రీమదయోధ్యావిహార శివజపిత గుణా
సామోదసార్వభౌమా॥శ్రీ॥ 28

క. రామా రాజకులాగ్రణి
రామా నా చక్కనయ్య రఘునాథయ్యా
రామా నాప్రియ దైవమ ॥శ్రీ॥ 32

క. రామా మీ తిరువడిఘులు
చామంతి సుపుష్పములను చంపకములచేఁ
గావించి పూజచేసెద ॥శ్రీ॥ 39

క. రామా నా యిలువేలుప
రామా హరిరామ ఘోరరావణహరణా
రామాసాకేతరామా ॥శ్రీ॥ 44

క. కామితఫలదుఁడ వంచును
నే మిమ్ముల నాశ్రయించి నిరుపమభక్తిన్
నామోచ్చారణఁ జేసెద ॥శ్రీ॥ 65

క. వామనరూపముతోడుత
భూమంతయు నేలుచున్న భూరిబలేంద్రున్
నీ మాయచేతఁ ద్రొక్కవె ॥శ్రీ॥ 85

క. రాముని కన్నను రెండవ
సామియు లేఁడనుచు నీవె సర్వంబనుచుఁ
వేమారు విన్నవించెద ॥శ్రీ॥ 98

క. శ్రీమదయోధ్యానాయక
కోమలనీలాభ్రదేహ గోధ్వజవినుతా
శ్రీమారుత సుతుసేలిన ॥శ్రీ॥ 100

ఈ శతకము కేవల స్తుతినామాత్మకము. కవి క్రీ॥ శ॥ 1750 ప్రాంతమువాఁడు కావచ్చును! ఇత్తువు, కన్నను, ఇచ్చే, ఈమన( = ఇమ్మని), భూమంతయు, నిత్యాది వాడుక భాషా రూపములు వాడి యున్నాఁడు. అంత మంచి శతకముకాదు.

---

## రాయభట్టు వీరరాఘవకవి

ఇతఁడు కస్తూరిరంగశతకమును రచియించెను. "శత్రు మదభంగ! నవఘనశ్యామలాంగా! సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ!" అను మకుటము గలిగి భక్తిరసప్రధానముగ నుండును. ఈ శతక మే కారణముననో 75 పద్యములు మాత్రము రచియింపఁబడఁగా వాడ్రేవు కామరా జను కవి తక్కిన పద్యముల నిటీవల పూర్తిచేసెను.

సీ. రావణుపురిఁ గాల్చె నీవు పంచిన కోఁతి
బండస్త్రీఁ జేసె నీ పదపుభూతి
సేస్తకాఁ డెప్పుడు నీకుఁ బురారాతి
తొగలకుఁ బగతుని సొగసుజాతి

అఖిలాండభాతి శ్రీయట్టి పరంజ్యోతి
యెనసి దాసులకు నీ విడు విభూతి
దశకంఠుమీఁద నీదు శరచిత్తస్వాతి
జడి గురిపించిన స్వామివైతి

గీ. సేతుశీతాచల ఖ్యాతి జేసితి జగ
దొంగవైనావు నాచేత దొరికితి పతి
శత్రుమదభంగ! నవఘనశ్యామలాంగ!
సూరి చిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ!

ఇట్లు వీరరాఘవుని పద్యము లంత్యనియమసంయుక్తములై యుండును. కొన్ని యంత్యనియమములకొఱకే వ్రాసెను.

ఉగాదిసంచిక (10. 125పుట) లో నిట్లున్నది.

"కస్తూరిరంగశతకము, జలక్రీడానాటకము, కృష్ణలీలలు మున్నగు గ్రంథములు రచించి ప్రఖ్యాతివహించిన రాయభట్టు వీరరాఘవరాజకవి, * * మున్నగు విద్వాంసులు వెలనాడున నుండిరి."

రాయభట్టువారు రున్నగ్రామము గుంటూరుజిల్లా, బాపట్లతాలూకా చుండూరుగ్రామ సమీపమున నున్న మోదుకూరి గ్రామము, బహుశః యీకవి యచ్చటివాఁడే కావచ్చును. ఈ కవి క్రీ॥ శ॥ 1800 కంటెఁ బూర్వుఁడై యుండవచ్చును.

ఇరువుర శైలియుఁ దెలియుటకుఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## కస్తూరిరంగశతకము

సీ. పుండరీకదళాక్ష భువనమోహనరక్ష
స్యందనతార్క్ష్య చారువక్ష
నవనీతఘృతభక్ష నారాయణాధ్యక్ష
తేజోజగద్రక్ష దీనరక్ష
వితతజరీక్ష శ్రితజనసురపక్ష
పాండవపక్ష రావణవిపక్ష
రిపుగజహర్యక్ష నృపనమోహవిచక్ష
దారుణాకక్ష కోదండదీక్ష
దాసజనతీక్ష మిమ్ముఁ దలంపవేక్ష
గౌతమీసతి పురాకృత శాపమోక్ష
శత్రుమదభంగ! నవఘనశ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ! 36

సీ. వేదాంత సిద్ధాంత విమలతరస్వాంత
సలలితశాంత దాసానుమంత
ఇందిరసత్కాంత వందిత బలవంత
అప్రమేయానంత యమితదంత
రావణకుంభకర్ణాగ్నివర్ణకృతాంత
జేరితి మీచెంత జీరికొంత
మేపమేనాజాంత నోపుణ్య గుణవంత
పరమాత్మ వని యెంతఁ భక్త లెంత
వేడుచున్నారు యిసుమింత విడువ నెంత
గొప్పవాఁడవు నిన్నెంచి కోరి కొంత
శత్రుమదభంగ! నవఘనశ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ!! 53

సీ. అత్తరాధికమిత్త యబ్ధి నీకు నగద్త
నీపదంబలె పాద్త నిన్ను వేద్త

నీ దాసులను కూడ్త నింగినీతల గడ్త
నీ పదంబులే వేడ్త నిన్ను గాడ్త
శేరుగట్టిన చాడ్త చిక్కినిక్కియు వుడ్త
రాకూడ దాతోడ్త రావు వేడ్త
నరుల వేడగ నోడ్త దురితంబు నే వేడ్త
నీవు మెచ్చగ నాడ్త నిజ మెయాడ్త
నీకుఁ బ్రత్యుత్తరంబిస్తె యిపుడె జడ్త
అధిక సిరులియ్యకున్న నిన్నిపుడె తిడ్త
శత్రుమదభంగ! నవఘన శ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ!! 74

---

## ౨. వాడ్రేవు కామరాజు వ్రాసిన పద్యములు

సీ. పారిజాతముఁ దెచ్చి పడతి రుక్మిణి కిచ్చి
యల సత్యభామకు నాశఁ బుచ్చి
అర్ధాంగియైయున్న యాదిలక్ష్మియు సదా
యింటింట నివసించు యిరుచుమించు
పరస్త్రీలతో నీవు భాషింపుచుండిన
భద్ర విన్చుండును పొంచిపొంచి
కవులు నీపై కృతుల్ కానుకగా నిచ్చి
బాగుగా కాలంబు జాగుబుచ్చి
సోమసుందర నాపైనఁ బ్రేమబెంచి
స్వామి కృపజూడకున్న నీకేమి మంచి
శత్రుమదభంగ! నవఘన శ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ|| 58

సీ. ఏమయ్య రావయ్య యింత జాగేలయ్య
పవళించవయ్య నా ప్రక్కనయ్య
కయ్యంబు లేలయ్య కడు నవ్వు గాదయ్య
నేను నీకనుమాయ నూననయ్య
యేదయ్య నీదయ రానియ్య వేమయ్య
తూగుటుయ్యాలలో నూఁగవయ్య
రతియందు శ్రమచేత రంజిల్లినావయ్య
దానమిచ్చితి నాదు మానవయ్య
అనుచు నీతోను భామలు నాడిరయ్య
పదిలముగ నన్నుఁ బ్రోవక వదలనయ్య
శత్రుమదభంగ! నవఘన శ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ‖ 96

సీ. నీనామ మధురంబు నిరతంబుఁ గ్రోలిన
నిరుపమానందంబు నెఱపుచుండు
నీ పద ధ్యానంబు నేప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ బొందుచుండు
నీ పేర నేకృతి నేపారఁ జేసిన
చిరకాల పదవినిఁ జెందుచుండు
నీ నామ మెప్పుడు నే వేళ నుడివిన
ఘోర పాపంబులు జేరకుండు
నీ స్వరూపము నఖిలంబు నిండియుండు
చింతచేసిన నరుఁడు నీ చెంతనుండు
శత్రుమదభంగ! నవఘనశ్యామలాంగ!
సూరిచిత్తాబ్జభృంగ! కస్తూరిరంగ! 112

# బాణాల వీరశరభేంద్రుఁడు

ఇతఁడగసాలి కులమునకుఁ జెందినవాఁడు. "బాణాల వంశదీపక సనాతన గోత్రము వాఁడ" ననుచున్నాఁడు. "ప్రశస్త భూప్రతీపాలకుఁ"డైన వీరశరభేంద్రుఁడఁట! "నిత్య కోటిలింగాలను" బూజఁజేసి శతకంబు రచించితి ననుచున్నాఁడు. ప్రథమకబళములోనే మక్షికమువలె మొదటి పద్యములోనే యతి తప్పినది.

"రాజిత కాళహస్తి మణిగోపుర సాంబశివా మహాప్రభో!" "సాంబశివా మహాప్రభో" యనునదియే మకుటము. ఇతని కవిత్వము నిర్దుష్ట భాషలో లేదు. దుష్ట సమాసములు, ధూర్జటి యభిప్రాయ చౌర్యములు, గ్రామ్యోక్తులు కన్పట్టుచున్నవి. కొన్ని లేఖక ప్రమాదములై యుండవచ్చును. ధూర్జటి పద్యముల కిది పోలికఁ దెచ్చుటకైన వీలులేనిదైనను గొన్ని పద్యములు భక్తిరస ప్రతిపాదకములై యున్నవి. భక్తున కుండవలసిన యావేశము కాని, నూతనాభిప్రాయ ప్రకటనము కాని కన్పట్టదు. ఇటీవలఁ బాడైన శతకముల కంటె మిన్నగ నున్నది. కొన్ని పద్యములు మృదుశైలి నున్నవి. ఇతఁడు భద్రియ పుత్రుఁడు. కాళహస్తివాసుఁడై యుండును. ఆ ప్రాంతము నందలి సువర్ణముఖినది పేరెత్తినాఁడు. శైలి కొకటి రెండు పద్యములఁ జూపెదను. ఇతఁడు

పద్యము లన్నియు "విశ్వకర్మకుల భూషణుఁడు" కావునఁ బంచపాదులుగా దింపినాఁడు.

ఉ. పిత్తళి హేమమా నెయది యెన్ని పుటంబులు వేసి చూచినన్
ఇత్తడి యిత్తడేని నిధియెక్కువ సొమ్మగు నష్టిచేటు నా
యిత్తడి పైడియౌనె యిది యన్య మెఱుంగక రిత్త వేల్పులన్
సత్తుగఁ బూజఁజేసినను సద్గురుపాదము నమ్మకుండినా
ఉత్తది కాళహస్తి వృషభేశ్వర! సాంబశివా! మహాప్రభూ!

చచ్చిచెడి పద్య మగుచున్నదే కాని సాఫు లేదు, సంతనా లేదు.

ఉ. నెత్తిన గంగయుండ శిఖినేత్రమునం దనిలుండు నుండ నీ
యొత్తునధాన్య ముండ మఱియొత్తుగ చేతను పాత్రయుండ నీ
పొత్తున గూడు వండుకొని చోద్యముగా భుజియింపరాదె యీ
పిత్తమదేమి జోగివలె భిక్షుకుఁ బోవఁగ నేమి వట్టిదే
దిట్టవు కాళహస్తి నుతదిక్పతి! సాంబశివా! మహాప్రభూ!

ఇట్టి యభిప్రాయ చౌర్యము లున్న పద్యములు కొన్ని కొంచెముగా సాఫుగా నడచినవి. కవిత్వ మంతఁగాఁ బ్రౌఢ మైనది కాదని నా యభిప్రాయము. విశ్వబ్రాహ్మణుల మను కొనునట్టి యీ కంసాలురు వ్రాసిన శతకములు పెక్కు లున్నవి. ఈతఁడే వ్రాసిన "దూతసందేశ విషయికమైన శృంగార సీస శతకము" విరహిణి శతకముల జాతిలోని దగు వార్తాపత్రిక (11-9-20) ఓ. లై. యందుఁ గనబడుచున్నది. దాని పేరు గోరంట్ల మాధవ శతకము.

సీ. శ్రీసరోజానన వాసుదేవస్తుత వి
లాసభాసుర యతి ప్రాసఁదిట్ట

కవిమనోహర నిమిష కవిధనంజయ యాంధ్ర
కవిసుధారస చిత్ర కవి నిఘంటు
శబ్దలక్షణసూత్ర శబ్దపోషణజంట
శబ్దగుంభన తెనుఁగు శబ్దశాస్త్ర
నవని దాసప్రజ్ఞ నాటకాలంకార
గీతపద్యబంధ సంగీతలలిత
విజయముల నిచ్చి బాణాల వీరశరభ
కవిని రక్షించి పరసతి కడకుఁజేరె
మగువ వినవమ్మ గోరంట్ల మాధవుణ్ణి
తోడుకొని వేగరావమ్మ తోయజాక్షి!

చేమకూరి అప్పన ననుసరించి సారంగధరచరిత్రము ద్విపదకావ్యముగ వ్రాసిన బాణాల శంభుదాసుఁ డీతనికి బంధుఁడై యుండును. ఆతని ప్రౌఢిమ యీ శతకకర్తకు లేదు. శంభుదాసుఁడు తనది "గౌతమగోత్ర" మని చెప్పుకొనెను.

"ద్వి. శాశ్వతంబుగ భూమి చక్రంబునందు
విశ్వకర్మవతార విజ్ఞానమూర్తి
తలపఁగా మేటి గౌతమగోత్రపరుఁడు
వలనొప్ప బాణాల వంశాబ్ధిచంద్రు॥"

పల్లికొండ గోపాలుఁ డీ శంభుదాసు గురువు. అయ్యప్ప తండ్రి; నాగమాంబ తల్లి; శంభువరప్రసాది. ఈ శతకకవి తనది 'సనాతనగోత్ర' మనుచున్నాఁడు. పూర్వులైన యగసాలెకులమువారు తాము విశ్వకర్మవంశజుల మనిరి కాని బ్రాహ్మణుల మని వ్రాయరైరి. విశ్వబ్రాహ్మణశబ్దము వ్యాకరణసాధితముకాదని కొందఱమతము.

———

# తాడేపల్లి పానకాలరాయుఁడు



"ఈతని పేరఁ బెక్కు శతకములును, వైద్యగ్రంథ మొకటియుఁ గనఁబడుచున్నవి. (1) మానసబోధశతకము (2) చిత్తబోధశతకము (3) పార్థసారథిశతకము (4) రామశతకము (5) లక్ష్మీదేవిశతకము (6) నృసింహస్వామిశతకము (7) రుక్మిణీపతిశతకము (8) నేత్రదర్పణమను వైద్యగ్రంథమును వ్రాసినట్లు కనఁబడుచున్నది. దేవకీనందనశతకాదులు రాజమహేంద్రవరపు వర్తకులు పానకాలరాయకృతము లని ప్రకటించినది ప్రమాదము. ఈతని గ్రంథములవలనఁ దెలియు చున్న వివరములఁ బరీక్షించుకొందము. ఒకప్పు డీతనిఁ గూర్చి యిట్లు వ్రాసియుంటిని:—

"ఇతఁడు మానసబోధశతక మను భక్తిరసప్రధాన మగు శతకమును రచియించెను. "మనసా హరిపాదము లాశ్రయింపుమా!" యను మకుటము గల యీ శతకము పండితపామరజనరంజకమై యాంధ్రదేశమునఁ బ్రఖ్యాతిగల్గి మంచిప్రచారము నొందియున్నది. ఇతఁడు నేత్రదర్పణము, చిత్తబోధశతకము, దేవకీనందనశతకము మొదలగు గ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది.

ఇతఁడు శ్రీవత్సగోత్రమువాఁడు. తాడేపల్లి రంగామాత్యవంశజుఁడు. " పటుశాస్త్రసంఖ్యావనీదేవకులాగ్ర

గణ్యుఁడ" గుట నాఱువేలనియోగి నని కవి యభిప్రాయ మైయుండును. రంగామాత్యుని కొడుకు రాజపూజ్యుఁ డగు సుబ్బారాయఁడు. అతని కొడుకు వెంకన్న. వెంకన్న భార్య మహాలక్ష్మాంబ. ఈ దంపతులకు (1) వేంకటార్య (2) సీతా పతిరాయ (3) పానకాలరాయ లను ముగ్గురు కొడుకు లుద యించిరి. ఇందుఁ గడపటివాఁడు మనకవి. "అఖిలరాజాధి రాజసభాంతరాగ్రపూజితుఁడఁట!" వారెవ్వరో? ఆ రాజులఁ బేర్కొనియుండిన నీతని కాలనిర్ణయమునకు వీలుండెడిది. ఈయన హరిభక్తుఁ డని యీ క్రిందిపద్యము వలనఁ దెలియు చున్నది.

సీ. శ్రీవత్సగోత్రుఁ డంచిత పటుశాస్త్రసం
ఖ్యావనీదేవకులాగ్రగణ్యుఁ
డగు తాడెపల్లి రంగామాత్యపుత్రుండు
రాజపూజ్యుఁడు సుబ్బరాయఁ డతని
తనయుఁడౌ వేంకన్నకును మహాలక్ష్మాంబ
కును తనూజులము ముగ్గురము నందు
చెలఁగి వేంకటరాయ శ్రీ సీతపతిరాయ
లకు సహోదరుఁడ నేఁ బ్రకటముగను

గీ. పానకాలార్యుఁ డనువాఁడ భవ్యయశుఁడ
నఖిలరాజాధిరాజ సభాంతరాగ్ర
పూజితుఁడ సర్వవిద్యావిరాజితుఁడను
సుజనసేవ్యుఁడ హరిభక్తి సుమహితుఁడను.

ఇతని గద్యమువలన నితఁడు వేణుగోపాల భక్తుఁ డనియు రంగయామాత్య పుత్రుఁ డనియుఁ దెలియుచున్నది.

ఇది లేఖకప్రమాదమై యుండును. రంగామాత్యునకుఁ బ్రపౌత్రుఁడు కాని పుత్రుఁడు కాఁడు. ఒకవేళ వెంకన్న రంగామాత్యుని మనుమఁడు కావునఁ బానకాలరాయుని తండ్రియగు వెంకన్నకు రంగన్నయను మాఱుపే రుండెనేమో తెలియదు.

ఇతఁడు కొండవీటి నీ విధముగ వర్ణించియున్నాఁడు.

సీ. రాజాధిరాజ విరాజిత సత్పురి
పాటిదైయొనది కొండవీటిసీమ
సకలవర్ణాశ్రమాచార సత్కర్మ బా
హాటమైనది కొండవీటిసీమ
సంగీతసాహిత్య సరసవిద్యల నిరా
ఘాటమైనది కొండవీటిసీమ
అతులితానర్ఘ్య వజ్రాకరవితతిచేఁ
బాటిల్లినది కొండవీటిసీమ

గీ. ప్రకటితైశ్వర్య సౌఖ్య సంపదలఁ బొదల
నఖిలజనముల కానంద మతిశయిల్లు
జగతి నేఁబదియాఱు దేశములలోన
నీటుగా నెన్నఁదగు కొండవీటిసీమ!

(నేత్రదర్పణము.)

ఆహా! కొండవీటి యదృష్టము! శ్రీనాథాది మహాకవులచేఁ బొగడ్తఁబొందినదే కాక "మనసా హరిపాదము లాశ్రయింపుమా!" అను శతకరాజమును వ్రాసిన భక్తునిచేఁ గూడఁ బొగడ్తగన్నది. పొగడ్తఁగనుటయే గాదు. ఆ కవినే కన్నది. కొండవీటి యదృష్టము చూడుఁడు! గ్రంథకర్త వ్రాఁత.

"వ. అట్టి సీమాప్రదేశమున నుదగ్భాగంబున నింద్రకీలాచలంబునకు మధ్యప్రదేశంబు మంగళాచలంబునం గల కృష్ణానదీతీరంబున"

బెజవాడ నుండి రైలుమీఁద గుంటూరు వెళ్ళిన వారికిఁ గృష్ణ వంతెన దాటిన తోడనే తాడేపల్లి - పిమ్మట మంగళగిరి - స్టేషను లున్న సంగతి విశదమే. ఈ తాడేపల్లి మన కవి జన్మస్థానము. కృష్ణకూడ గోదావరితో సమముగఁ గాకపోయినను మహాకవులఁ గొందఱ తన పావన శీతల జలంబులఁ బెంచినది! తన జన్మస్థానమును గవి యెట్లు వర్ణించు కొనుచున్నాఁడో చూడుఁడు. నే నొకసారి యిటకు రైలు మీఁద సామానులు రాకపోఁగా వెడలితిని. కాని పానకాల రాయని జన్మస్థానమని యెఱుఁగలేదు. మానసబోధ శతకము పుట్టిన గ్రామ మని యెఱుఁగలేదు. ఇప్పుడా తాడేపల్లి కవి కంటె నాకు మనోహరముగ దృగ్గోచరమగుచున్నది. ఆతని వాక్యములనే వినుఁడు.

క. పదిరెండు పర్వతంబులు విదితంబుగ నదులు రెండు విభుఁడు నృసింహుం
డదనైన దుర్గమొక్కటి పదపడి ముదమలరు తాడెపల్లి ధరిత్రిన్.

జన్మస్థాన మని యతిశయము వ్రాయలేదు. సత్యమునే వర్ణించినాఁడు. నా కిదివఱకుఁ గూడ నా ప్రదేశముపై మన మున నొక విధమైన యభిమాన ముండెడిది. దానికిఁ గారణ మెఱుఁగనైతిని.

ఈతని నామముకూడ మంగళగిరి పానకాలరాయనిదే యని సులభముగ మన మూహింపఁగలము. ఈతఁడు జన్మ

దేశముపై గల యభిమానముచే వ్రాసి మన కాహ్లాద మొదవించు నీ పద్యమును దిలకింపుఁడు.

చ. తిరుమలలోఁ బ్రభాతవిధిఁ దీర్చి నీలగిరిన్ భుజించి కే
సరగిరిఁ జందనం బలఁది చల్లనిదాహము మంగళాద్రిలో
గురురుచిఁ ద్రావి రంగపురిఁ గోమలితోఁ బవళించునట్టి యా
సరసునిఁ జేర నీవు! మనసా హరిపాదము లాశ్రయింపుమా!

తిరుపతిలోఁ గాల్యకృత్యములు తీర్చుకొని - జగన్నాథమున భుజించి - సింహాచలములో గంధ మలందుకొని - (భోజనమునకుఁ బిమ్మటఁ జందనమును బూయించుచున్నాఁడు. సింహాచలములో నరసింహామూర్తి మొదలి కాక లడఁగ నెప్పుడును గంధము పూయుట ప్రసిద్ధము) మంగళగిరిలో (తన జన్మస్థానము చెంత) తీయని పానకములఁ ద్రావించి ప్రయాణ బడలికలు తీర్చుచున్నాఁడు. ఈ వెఱ్ఱి భగవంతుని నిత్య ప్రయాణమునకుఁ గవి తన జన్మస్థానము చెంత భగవంతుని కొఱకుఁ జలివేంద్ర పెట్టుచున్నాఁడు. ఆహా! కవి భక్తి వర్ణనాతీతము! శ్రీరంగమున నాముక్తమాల్యదలో "నప్పిన్నది" పెండ్లియైనది కావున నామెను జేరి సుఖింప శయినింపఁ బోవునట్టి శ్రీహరిని మనసా ఆశ్రయింపుము!" పద్యమునందలి భావములు మధురము లని చెప్పుట సూర్యుని కాగడాతోఁ జూపుట కావున నింతతో విరమించెదను.

చ. నిలయము గాఁగా జడుఁడు నీటికినై యిలఁ ద్రవ్వునట్లు నీ
విల నవసానవేళఁ బరమేశ్వరుఁ గొల్చి తరింతువంచు నా

సలఁబడ నేల సేఁడె హరి సర్వశరణ్య రమేశ! కావవే
జలజదళాక్ష యంచు మనసా! హరిపాదము లాశ్రయింపుమా!

పానకాలరాయఁడు పానకమువంటి తీయని పద్యముల వ్రాసి భక్తి రసమున ముంచివేసినది సత్యము'' (7-7-1918)

పానకాలరాయఁడు వ్రాసిన చిత్తబోధ శతకమును మిక్కిలి రమ్యముగ నున్నది. నేత్రదర్పణమును నేఁ జూచితిని. మానసబోధ శతక శైలితోఁ బోలిక లేకయున్నది. ఆంధ్రనాయక శతకకర్త తన శతకము కడపటి పద్యములోఁ దానొక మానసబోధ శతకము వ్రాసితి నని చెప్పుకొనినాఁడు. మకుటము "మనసా హరిపాదము లాశ్రయింపుమా!" అని వ్రాసితి ననినాఁడు. అందువలన నీ శతక కర్త లిర్వురిలో నొకరు దొంగ కావలసి యుండె నని నేను వ్రాసియుంటిని. ఇది సందేహమే కాని దానిని సిద్ధాంతీకరించుటకుఁ దగినంత బలమైన సాక్ష్యము లేదు. ఈ సందేహమును భావి పరిశోధకులు గమనించెదరు గాక! శతకముల కవియే వైద్య గ్రంథ కర్త యనుటకు రుక్మిణీపతి శతకము నందలి 106 వ పద్యము సాక్ష్య మిచ్చుచున్నది.

## 1. మానసబోధ శతకము.

ఉ. గోవు లనేకవర్ణములఁ గ్రుమ్మరుఁ బా లొకటైన భంగి నా
నావిధభూషణంబుల ఘనస్థితిఁగాంచు కడాని మాడ్కి లో
కావళిలోనఁ బానును దదాకృతి లోకము లయ్యు నంతరా
త్మావహుఁ డచ్యుతుండు మనసా హరిపాదము లాశ్రయింపుమా॥

## 2. చిత్తబోధ శతకము.

ఆంధ్రనాయక శతకము నందలి పద్య కథ కలదు.

చ. విరిసరు లీయఁ గైకొనుచు వింతవెఱుల్ సరులందుఁ గాంచి భూ
వరుఁ డలుఁగన్ దదర్చకుని వాక్యము నిక్కముగా శిరోజముల్
విరివిగఁ జూపి యా బెడద వీడఁగఁ జేసెను మున్ను కాకుళాం
తరమున నట్టి శ్రీహరి పదమ్ములు కోరి భజింపు చిత్తమా!

ఈ కథ శివపరముగ రాజోలు తాలూకా పలివెలలో "కొప్పులింగేశ్వరుని పేర" నున్నది. కూచిమంచి సోమసుందర కవి కొప్పులింగేశ్వర శతకముఁ జూడుఁడు.

## 3. శ్రీరుక్మిణీపతి శతకము.

చ. తను వను నావయందు విశదంబుగ హృద్ధ్వజమూని నీదు సే
వనపు దృఢాంబరంబు తెరవట్టి భవమ్మను నిష్టయన్ ప్రభం
జనగతి జ్ఞానమార్గమున సంసరణాంబుధి దాటి ముక్తి గై
కొని సుఖియించ నెన్నెదనుఁ గోరి వసించితి రుక్మిణీపతీ! 98

## 4. మంగళగిరి నృసింహ శతకము.

క. పరువడి రథసారథివై యరిగణములఁ దునుమఁజేసి యాహవభూమిన్
నరునకు విజయ మొసంగిన హరి నీ సరి యెవరు మంగళాద్రి నృసింహా! 99

## 5. పార్థసారథి శతకము.

చ. కడువడి బాణజాలములఁ గాసిలఁ జేసెడి వాని చూ డిదే
బెడిదపు చక్రధారలను భీష్ముని జంపుదు నిన్నుఁ గాతు న
న్విడు విడు మర్జునా యనుచు వింతగ గంతు లొనర్చునట్టి నీ
యడుగులు జూపవే దయ దయామృతనీరధి! పార్థసారథీ! 24

ఇందలి పోతన్న పదముల యనుకరణము చూచితిరి గదా! ''తిరువలిక్కేణి పట్టణపతీ గుణనీరధి పార్థసారథీ!'' 107 వ పద్యము వలన నీ శతకము ప్రసిద్ధుఁడైన చెన్నపురి పార్థసారథిపై వ్రాసె నని తెలియుచున్నది. ఈతని శతకము లింకను గలవు. శైలికిఁ బై పద్యములు చాలు నని యింతతో విరమించుచున్నాను. కవి కాలము మాత్రము తెలియలేదు. తెలిసినవారు ప్రకటించెదరు గాక!''

(ఆంధ్రపత్రిక సా. అ.)

శైలి కితని శతకములనుండి యిప్పుడు మఱికొన్ని పద్యములఁ జూపెదను.

చిత్తబోధ శతకము.

ఉ. జారుని దుష్టవర్తనుని సజ్జనదూరు నసత్యవాదినిన్
జోరుని లుబ్ధు నిర్దయుని జూదరి బ్రాహ్మణవృత్తి ఘాతకున్
గ్రూరుని ధర్మదూషకునిఁ గూడక నిత్యము సర్వకల్మషో
త్తారములైన శ్రీహరి పదమ్ములు కోరి భజించు చిత్తమా! 86

ఉ. గుఱ్ఱము నెక్కి క్రూరులగు ఘూర్జర బర్బర పారసీకులన్
గొఱ్ఱెల కైవడి న్నఱికి ఘోరతర ప్రకట ప్రతాపివై
మొఱ్ఱ లిడంచి దేవతల మ్రొక్కులు గైకొను సామిగల్గ నీ
తఱ్ఱులవీడి శ్రీహరి పదంబులు కోరి భజించు చిత్తమా! 58

చ. సకల పురాణ సార రససంగ్రహ మీ శతకంబు గావునన్
బ్రకటముగా వినన్ జదువ వ్రాయఁగ వారలు తత్త్వవేత్తలై
ప్రకృతిని దాఁటి బ్రహ్మమయభావముఁ గాంచుట కేమి వింత సా
ధకమిదె యంచు శ్రీహరి పదమ్ములు కోరి భజించు చిత్తమా! 10

## మానసబోధ శతకము.

ఉ. చక్కనివాఁడు సర్వగుణ సంపదలుం గలవాఁడు భక్తిచేఁ
జిక్కెడువాఁడు లోకముల చిక్కడలించెడివాఁడు దీనులన్
మిక్కిలి బ్రోచువాఁడు గననేర్చినఁ గన్పడువాఁడు కాన నీ
వక్కఱపాటుతోఁడ మనసా! హరిపాదము లాశ్రయింపుమా!

చ. ఎఱుఁగవు ముక్తిమార్గ మిది యొక్కడి కర్మము దాపరించెఁ జే
టెఱుఁగని బోటి తా మగని కింపుగఁ బెండ్లి యొనర్చినట్లు దు
ష్కరమగు కామ్యకర్మములఁ గాలము పుచ్చెద వేల ? బాపురే!
సరసము గాదు నీకు మనసా! హరిపాదము లాశ్రయింపుమా!

ఉ. సర్వమయుండు విష్ణుఁడని చాటిన యా పసిబాలుఁ గావఁగా
శర్వముఖామరు ల్వొగడ స్తంభమునం బ్రభవించి నిష్ఠురా
ఖర్వనఖాళి దానవుని గర్భముఁ జీరిన శ్రీ నృసింహుఁడే
సర్వఫలంబు లిచ్చు మనసా! హరిపాదము లాశ్రయింపుమా!

## శ్రీ రుక్మిణీపతి శతకము.

ఉ. లోకము లెల్ల నీ కడుపు లోపల నుండఁగ లోకరక్షణా
లోకన తత్పరుండవయి లోకములో కమనీయ గోపికా
లోకసుఖానుషంగ మెదలో గమియించితి వంచుతానకా
లోకముఖామరవ్రజములో గురిగొల్పితి రుక్మిణీపతీ!

చ. క్రతువు లొనర్చిన స్పృహల కానల నుగ్రతపంబుఁ జేసినన్
వ్రతనిగమాగ మాధ్యయనవర్తనలన్ భువి మోక్ష మబ్బునే
సతతము తావకాంఘ్రిజలజంబులు భక్తినిఁ గొల్చు భక్తసం
తతులకుఁ గాక యిప్పలుకుఁ దప్పమి నిశ్చితి రుక్మిణీపతీ!

చ. మఱల జనింపలేక పలుమారును నీ పదపంకజద్వయి
న్బొరలఁగ లేవనైతి పరిపూర్ణకృపారస దృష్టి దన్వ కీ
పొరలను బెట్టనేల తలఁపుల్ వలపుల్ నినుఁజేర్చి యాత్మలోఁ
గెరలుచు నీవ దిక్కనుచుఁ గేల్గవయొత్తితి రుక్మిణీపతీ!

చ. శ్రీనిధి మంగళాద్రి నరసింహున కింపుగ నుత్తరంపు కృ
ష్ణానదిచెంత "తాడెపలి" నాదగు గ్రామమునందు రాజ స
న్మాన్యుఁడు "వేంకటార్యునకు మానవతీమణి లక్ష్మిదేవికిన్
సూనుఁడ"నై జనించితి విశుద్ధతఁ గాంచితి రుక్మిణీపతీ! ॥

ఈ కడపటి పద్యమువలన నేత్రిదర్పణ కర్తయే యీ శతకముల కర్త యని తెలియుచున్నది.

## పార్థసారథి శతకము.

చ. సరసవచోవిలాస విలసత్స్ఫుట కాంచనవాస భావ సం
భరిత ఘృణావికాస పరిపాలిత పాద సరోజదాస సుం
దరదర పాండుహాస నిరతస్ఫురితామిత కీర్తిభాస సం
గర రిపురాగ్నిరాస మురకంఠవిలుంఠన పార్థసారథీ!

చ. పటుతర విస్ఫులింగముల భంగమహత్ప్రళయానలప్రభా
పటలమువోలె దిక్తటులఁ బర్వఁగ దారుణవృత్తి జన్య లం
పటుఁడగు మేదినీసుతునిఁ బట్టి ధరాస్థలిఁ గూల్చినట్టి మీ
చటుల సుదర్శనంబునకు జాగిలి మ్రొక్కెద పార్థసారథీ! 56

చ. జడుఁడ శఠుండ ధూర్తుఁడ నృశంసుఁడ దుష్టుఁడ కష్టుఁడ న్దురా
త్ముఁడ నతిఘోర కల్మషుఁడ మూఢుఁడ దుర్భవసాగరంబునన్
బడలినవాఁడ నో పతితపావన యో హరి యో యదూద్వహా!
తడయకఁ బ్రోవవే యనుచు దండముఁ బెట్టితి పార్థసారథీ! 193

## లక్ష్మీదేవి శతకము.

క. సోమునిఁ గేరెడు మోమును తామరలను మీరు కన్నుదమ్ములుగన ని
న్నే మఱువఁజాల తల్లీ శ్రీమంగళశైల నారసింహుని రాణీ! ॥ 39

క. కామాది వైరివర్గము నా మనమున నిరవుజేసి నను వదలదయో
యేమనుచు విన్నవింతెద శ్రీమంగళశైల నారసింహుని రాణీ! ॥ 63

క. కామాంతకాది త్రిదశులు నీమందకటాక్షమునను నిరుపమగతులన్
కామితపదవులఁ గాంచిరి శ్రీమంగళశైల నారసింహుని రాణీ! ॥ 93

శ్రీ మంగళగిరి నృసింహస్వామివారి శతకము.

క. అరి ధరదరధర ధర
ఖరకర సితకిరణ నయనకరివరవరదా
మురహర శుభకర పురహర
హరిహయవినుతాహ్వ మంగళాద్రి నృసింహా! 5

క. కరివరుఁ డురువడి మొఱయిడ
పరులిడి యరిమకరిఁ దఱిగి బరువడి కరుణన్
విరివిగ మనిపిన వెఱవున
నరయుచు నన్నేలు మంగళాద్రి నృసింహా! 52

క. కలుములచెలి యిల్లాలయి
నలు మొగముల వేల్పు పెద్దనర్మిలి కొడుకై
చెలువగు పాల్కడ లిరవై
యలరెడు నినుఁగొలుతు మంగళాద్రి నృసింహా! 88

---

# రామభద్రకవి

ఈ కవి జానకీపతిశతకము వ్రాసెను. ఇది చాల ప్రాచీన మైనది. ఈ శతకము నందలి యీ క్రిందిపద్యమువలనఁ గవి రామభద్రుఁ డని తలంప వీలగుచున్నది.

ఉ. ఈ రసమేల నీకు విను మేలిక నీవని నమ్మియుంటిఁగా
నేరుపు లేదు నావలన నేరము లన్నియుఁ గల్గియుండినన్

గూరిమి తల్లిదండ్రులకుఁ గోపము లుండునె రామభద్ర! నీ
పేరిటివాఁడనుమ్మి ననుఁ బ్రేమతోఁ జూడవె జానకీపతీ! 48

ఈ యూహ సరియైన దయినచోఁ గవిపేరు తెలిసి కొనినవార మగుచున్నాము. "రామరామ నీ మానిత రామ కీర్తనలు మానక చేసెద" ననుటచేతను, రామదాసుచరిత్ర మునం దీ శతక పద్యము లుదాహరించుటచేతను రామదాసే దీని కర్తయా యని యనుమానము కలుగుచున్నది. కాని శైలిలోఁ జాలభేద మున్నది. ఒంటిమెట్టరఘువీర, నారాయణ మొదలగు శతకముల పోలిక లున్నవి.

"ఉ. ఎవ్వనిచే సృజింపఁబడు నెవ్వనిచే లయమందు లీనమై
యెవ్వనియందు నుండు జగ మెవ్వని సన్నుతిసేయు దేవతల్
యెవ్వని గెల్వ రవ్విభున కీశ్వరు కాద్యు కనంతమూర్తికిన్
నెవ్వగ మాన్పచేయఁ గదె? నీరజలోచన జానకీపతీ. 66

ఇది పోతన్నగారి గజేంద్రమోక్ష పద్యమే కదా!

ఈ శతకము రామభద్రకవి కాని, రామచంద్రకవి కాని వ్రాసియుండవలెను. అది క్రీ॥ శ॥ 1800 కుఁ బూర్వము కావలెను. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## జానకీపతి శతకము.

ఉ. చిలుకను పెంచి ముద్దులకు చేడియ కల్కుచు రామ రామ య
న్పలుకులు నేర్పుచున్ వలుక పైఁబడి మోక్ష మొసంగితంచు నే
పలుమరు నీ కథ ల్వినియు భక్తిని నామము లుచ్చరింపుచున్
బలమగు పాపబంధమునఁ బాఱఁగఁ గంటిని జానకీపతీ.

ఉ. నమ్మితి రామచంద్ర మదినమ్మితి రాజకులేంద్ర మేలుగా
నమ్మితి కీర్తిసాంద్ర కడునమ్మితి దాసచకోరచంద్ర నా
నమ్మిక లేమి జేసెదవొ నమ్మఁగ నర్హులు గానివారలన్
నమ్మనయా దయాబ్ధి (మతి) నమ్మితి నీకె మది జానకీపతీ.

ఉ. నమ్మిన నిన్నె నమ్మవలె నానది యట్లు విరోధితమ్మునిన్
నమ్మిన రాజుఁజేసితి వనాథుల పాలిటి దైవరాయ నే
నమ్మ మరెవ్వరికి మిగుల నమ్మితి నిర్మలకర్మచిత్త వా
క్యమ్ముల నిన్ను నమ్మితి నఖండకృపానిధి జానకీపతీ.

చ. పటుతరతాపకోల్లసదపారశుభాకృతి నస్మదీయ హృ
త్పుటమున నిల్పి నిల్పి రఘుపుంగవ రాఘవ రామభద్ర ధూ
ర్జటినుత రామ రామ యను సారసుధారస మబ్బురంబుగా
ఘుటుకు ఘుటుక్కుటంచు మదిఁ గొంకకఁ ద్రావితి జానకీపతీ.

చ. అతులజగత్పవిత్రముది తామరదివ్య సుగంధధీరతీ
సతతగుణోన్నతీ విమలచారుమతీ దినరాజసంతతీ
కుతుకమనోధృతీ యవితకుంభిపతీ చిరభాగ్యపద్ధతీ
చతురచనస్థితీ సతతసద్గతి మద్గతి జానకీపతీ.

ఉ. ఏమిర రామచంద్ర యికఁ నేటికి నేచెదు మాటిమాటికిన్
బామరుఁ డౌటనో మిగుల పాతకజాలములోన నుంటనో
యేమి యొనర్చిన న్సుతుని యొగ్గులఁ దండ్రికిఁ గిన్కబుట్టునే
నీమది చిత్తగింపు మిఁక నిక్కము నమ్మితి జానకీపతీ.

ఉ. నవ్వులు గుల్కు నెమ్మొగము నల్లని మేను పసిండి వల్లెయుల్
నివ్వటిలంగ నా యెదుట నిల్చి దయారస మొప్పఁ బిల్చి నా
నెవ్వగ వాయ తారకవినిర్మలమంత్ర ముపన్యసింపవే
దవ్వులనుండ నేలఁ దగ దాస్యముఁ జేసెద జానకీపతీ॥

ఉ. ప్రొద్దున లేచి సూర్యకులభూషణు రాఘవు పాదపద్మముల్
బుద్ధిని యుంచి పుష్పములఁ బూజ లొనర్చిన పుణ్యభూజనుల్

హద్దుగ శత్రుచోరభయ మన్నది చెందదు యెన్నఁ జాలు మీ
పద్దులు వింటి భద్రగిరిపట్టణరాఘవ జానకీపతీ||

ఉ. ఒప్పులకుప్ప యో రఘుకులోత్తమ సేవకకల్పభూజ మా
యప్ప దయాసుధారసము లెప్పటి కప్పటి కుప్పతిల్లఁగా
గుప్పవె గొప్ప మేల్పసిఁడి కుప్పలు తెప్పలుగా కదంబముల్
గుప్పినరీతి నిన్ను మదిఁ గోరితి నిప్పుడు జానకీపతీ||

చ. పరమున కెవ్వఁడో ప్రభువు పంకజగర్భునిఁ గన్నవాని శ్రీ
నరహరిరూపమైన సురనాయకు దీనులఁ బ్రోచువాని తా
నరమరలేక జీవులకు నందఱికిన్ సమమైనవాని సు
స్థిరమతిఁ బూజసేయుదును సేమము జేకుర జానకీపతీ||

చ. బలయుతులైన రాజులను భండనమందుఁ దృణీకరించి భూ
వలయములోపలన్ సపరివారముగా బలశక్తియుక్తుఁడై
యిల నుతికెక్కి రాజ్యమును నేలుచునుండఁగఁ గార్తవీర్యునిన్
జలమున వేయి బాహులను చయ్యన ద్రుంపవె జానకీపతీ||

---

## వరహాగిరి కొండ్రాజు

ఇతఁడు కణ్వశాఖీయుఁడు. అనఁగా ప్రథమశాఖా నియోగి బ్రాహ్మణుఁడు, భారద్వాజగోత్రజుఁడు. ఈతని తలిదండ్రుల నామములుగాని, కాలముగాని తెలియ కున్నవి. శతకము జగన్నాథస్వామికిఁ గృతియిచ్చుటను, కొన్నిమాండలికపదములను బట్టియుఁ గవి గంజాము విశాఖపురిమండలములవాఁడు కానోపును. ఇది భాస్కరశతకము ననుకరించి

నట్లు పెక్కుపద్యములు చూపట్టుచున్నవి. కవి తాను రారాజార్చితుఁడ నని చెప్పుకొనినాఁడు. ఏ రారాజులో చెప్పలేదు.

శా. "భారద్వాజసగోత్రుఁడ" న్వైను మెలర్పం "గాణ్వశాఖీయుఁడన్"
రారాజార్చితుఁడ "న్వరాహగిరి కొండ్రాజప్రధానుండ" నీ
పేరన్ సత్కృతి గాఁగ నీశతకముం బ్రీతిన్ సమర్పించితిన్
ధీరవ్రాతము లెన్న దీనిఁ గొనుమా దేవా జగన్నాయకా! 90

కొన్ని పోలికలఁ జూపెదను.

మ. సకలామోదక దానధర్మకలనాసక్తిన్ యథాశక్తి న
ర్థిక నీఁజాలని లోభివానికడఁ బ్రీతి న్విత్తమున్నన్ నిర
ర్థక మెన్నన్ బనిలేదు గొప్పలయి నేత్రంబుల్ దగం గ్రుడ్డివా
నికి నెమ్మోమున నుండినట్టుల యగుం దేవా జగన్నాయకా! 11

మ. బలముం దేజము కీర్తి పౌరుషములుం బ్రాపించి యున్నట్టి స
త్కులమం దొక్కఁడు దుర్నయుండయినఁ దద్దోషంబునం జేసి త
త్కులమెల్లం జెడు నెట్లనన్ గురుకులక్షోభంబు సంధిల్లదే
తెలియన్మున్నొక ధార్తరాష్ట్రువలనన్ దేవా జగన్నాయకా! 35

మ. తనకుం గీడు ఘటించునట్టి పనికిం దా నెమ్మెయిం గాల యా
పనముంజేయుట మేలు దేవకినిఁ ద్రుంపం గంసుఁ డేతేర నే
ర్పున నక్కాలము ద్రోచికొనఁడే పూఁబోఁడి నత్యంత స
ద్వినయుం దవ్వసుదేవుఁ డూర్జితమునం దేవా జగన్నాయకా! 59

శా. అంతస్సార మెఱుంగలేక పయిపై హాసాదరాలోకనా
త్యంతోదార వచోవిలాసముల కాత్మంజిక్కు లుబ్ధాగ్రిణిం
భ్రాంతిం జూచిన బూరుగుం గదియు కీరంబుల్ వలెన్ యాచకుల్
చెంతం జేరిన నబ్బునయ్య ఫలముల్ దేవా జగన్నాయకా! 71

మ. అనయంబున్ గుటిలస్వభావులు ధనం బార్జించినం బూని త
ద్ధనమున్ సద్విజరక్షణార్థమున సంధానంబు కాదెన్న దు

ర్వినియోగంబయి పోవు నెట్లనిన నుర్వి న్వేఁపమా నెంత బం
డినఁ గాకల్ దినుఁ జిల్క కానె యొటనేన్ దేవా జగన్నాయకా!

శా. న్యాయాన్యాయ వివక్షలేక యతి నిద్రాహార యర్థప్రసం
గా యత్తుండయి సత్యశౌచరహితుండైనట్టి మూఢుండు రా
జై యున్నం ఫలియింప దా ధరణి షండాధీనమైనట్టి సు
స్త్రీయుంబోలె విషాదపాత్రమగుచుం దేవా జగన్నాయకా! 84

కవి క్రీ॥ శ॥ 1790 ప్రాంతములవాఁడు కానోపును. జగన్నాయక శతకము లింకను రెండు మూఁడు కనఁబడుచున్నవి.

---

# నృసింహకవి

ఇతఁడు కృష్ణ శతకమును రచియించెను. "కృష్ణా!" యనియే మకుటముతో 102 పద్యములను రచియించెను. ఇతఁడు భరద్వాజ గోత్రమువాఁడు. గంగమాంబ పుత్రుఁడు ఈ శతకమును వీధి బడులలో బాలురు బాలికలు పూర్వము తప్పక చదివెడివారు. భక్తిప్రతిపాదకమైనది. ఈ కవి క్రీ॥శ॥ 1760 ప్రాంతములవాఁడు కావచ్చును.

క. పాణితలంబున వెన్నయు వేణీమూలంబునందు వెలయఁగ పింఛం
బాణీముత్యము ముక్కున బాలుఁడవై దాల్చు శేషశాయివి కృష్ణా॥ 16

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు దిక్కెవ్వరు పాండు సుతుల దీనుల కెపుడున్
దిక్కెవ్వ రయ్యహల్యకు దిక్కెవ్వరు నీవు నాకు దిక్కవు కృష్ణా॥ 54

క. పదునాలుగు భువనంబుల కుదురుగ నీ కుక్షి నిల్పుకొని నేర్పరివై
విదితంబుగ నా దేవకి యుదరములో నెట్లు నొదిగి యుంటివి కృష్ణా॥

కొన్ని వ్యాకరణ దోషము లున్నను సులభమైన పదములతో బాలురకు బాలికల కిది ప్రథమమునఁ జదువఁదగిన దని మనవా రెంచిరి.

క. నీవే తల్లివి దండ్రివి నీవే నా తోడు నీడ నీవే సఖుఁడా
నీవే గురుఁడవు దైవము నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా॥ 2

క. చిలుక నొక రమణి ముద్దుల చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతి పేరం
బిలిచిన మోక్షము లిస్తివి అలరఁగ మిము దలఁచు జనుల కరుదా కృష్ణా॥

క. బల మెవ్వఁడు కరిఁ బ్రోవను బల మెవ్వఁడు పాండుసుతుల భార్యనుఁ గావన్
బల మెవ్వఁడు సుగ్రీవుకు బల మెవ్వఁడు నీవు నాకు బలమా కృష్ణా! 65

క. అప్పా యిత్తువు దయతో నప్పాలను నతిరసంబు లనుభవశాలిన్
అప్పా ననుఁ గనుగొనవే యప్పా ననుఁ బ్రోవు వేంకటప్పా కృష్ణా॥ 85

క. అష్టమి రోహిణి ప్రొద్దున నష్టను గర్భమునఁ బుట్టి యా దేవకికిం
దుష్టునిఁ గంసు వధింపవె సృష్టిప్రతిపాదనంబు సేయఁగ కృష్ణా॥ 11

కవి వివరములు శతకాంతమున నున్న యీ క్రింది పద్యమునఁ దెలియఁగలము.

క. భారద్వాజస గోత్రుఁడ గారవమున గంగమాంబ కరుణాసుతుఁడన్
పేరు నృసింహాహ్వయుఁడన్ శ్రీరమయుత నన్నుఁ గావు సృష్టివి కృష్ణా॥

పై పద్యముల యందే గాక పెక్కు పద్యములలో "ఇస్తివి, జగన్నాథుకు, మదుగుకు, సారథైతివి, దోషకుఁడను," మొదలగు వాడుక రూపములు, ప్రాసతప్పులును

గూడ (84 పద్యము) కలవు. "కనుచుండ" యనుటకు "కంటుండ" యని వాడెను.

---

# కొమ్మరగిరి సంజీవకవి

ఈ శశాంక శేఖర శతకము పై కవి యాశుధారలో రెండు గడియలలో వ్రాసి ముగించెనట. ఈతఁ "డాశుకవిత్వ తాండవోదంచితమండితార్భటి" నిది వ్రాసె నఁట! ఇతఁడు గణాధిపతి ప్రార్థనకుఁ బిమ్మట నవగ్రహములఁ గూడ స్తుతించెను. ముకుందమాలా శ్లోకముల భావభాషాంతరీకరణము లున్నవి. (8, 9) కవి నందవరీకుఁడు, ఆశ్వలాయనుఁడు శేషయ లచ్చమాంబల పుత్త్రుఁడు, వసిష్ఠ గోత్రుఁడు. ఈ శతకమునకు, హరిహరి సంవాద మను మాఱుపే రున్నదో — అది మఱియొక గ్రంథమో — దానినిఁగూడ రెండు గడియలలో వ్రాసెనఁట! శైలి చూపెదను. ఈ కవి క్రీ.శ. 1790 ప్రాంతములవాఁడు కావచ్చును.

## శశాంక శేఖర శతకము

ఉ. దేవ మహానుభావ భవదీయ శుభాంకిత దివ్యపాద సం
సేవన తావకీయ గుణచింతననామ సుధానుపాన సం
భావన గల్గు నాకు నొక పాపము లేదని నిశ్చలోజ్జ్వల
శ్రీవిభవంబుఁ గల్గునని చెప్పఁగ నొప్పు శశాంక శేఖరా. 9

చ. అలసతనైన గోపముననైన వికారముతోడనైన నిన్
దలఁచినవారి కిష్టము లుదారత నిచ్చెదవందు రట్టి నీ
లలితపదాంబుజాతయుగళం బనయంబుఁ దలంచు నాకు ని
శ్చలమగు నీ ప్రసాదము నొసంగు టదెంత శశాంకశేఖరా. 19

చ. పండితరక్షదుర్జనవిపక్షభవన్నిగమాంతభాసురా
ఖండకథాకలాపగుణఖండము మామకశత్రుకోటికిన్
గండము, మిత్రకోటికి నఖండతరేక్షురసార్ద్రశర్కరీ
ఖండము, మద్రిపుప్రకరకంజశశాంక శశాంకశేఖరా.

చ. లోకము లన్నియున్ గెరలి లుంఠన సేయఁగఁ జక్క నిల్పు పూ
ర్ణాకరమైన నీదు ఘటనాఘటనార్థసమర్థలీల వెన్
తాకి మదీయశాత్రవుల దండనసేయఁగ నన్ను సన్నుతా
స్తోకవిలాసు సేయఁగ విశుద్ధము కాదె శశాంకశేఖరా. 34

చ. కమలభవాండభాండమునఁ గల్గిన సర్వపురాణశాస్త్రసం
ఘమను మహాసుధానిధి వికాసమనోగుణ శేముషీ నగో
త్తమమునఁ ద్రచ్చి నీ విమల తత్త్వసుధారుచిఁ గాంచు నాకు చి
త్తము చిగురొత్తకున్నె విశదంబుగ నింక శశాంకశేఖరా. 41

---

# ఉన్నవ యోగానందుఁడు



ఈతఁడు గుంటూరు సమీపమున నున్న "ఉన్నవ" గ్రామవాస్తవ్యుఁడు. ఆ గ్రామమున నున్న రాజగోపాలస్వామిపై నొక శతకమును, పద్మినీపరిణయము మొదలగు కృతులను వ్రాసెను. ఈతఁ డాపస్తంబసూత్రుఁడు, గార్గ్యగోత్ర

జుఁడు, ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఈతని పద్మినీపరిణయ ప్రకాశకులు కవి వివరములు ప్రకటించిరఁట. ఈ కవి క్రీ॥శ॥ 1750 ప్రాంతములవాఁ డని వినుచున్నాము. శతకాంతమున సభాపతి లక్షణములఁ గొన్ని పద్యములలో వివరించెను. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

రాజగోపాల శతకము

సీ. శ్రీకరనిలయమై చెన్నొంది యుష్మత్కృ
పామృతవృష్టిచే నంకురించి
సత్పద సందర్భ సరసవాఙ్మహనీయ
శాఖోపశాఖల ఛాయఁబరగి
పరమసుగంధ కృద్బహుమాన మంజరీ
పరిఫుల్లసుమములఁ బరిమళించి
యలరుచు నుండెడు నస్మన్మహాభాగ
ధేయసారస్వత దివిజతరువు
నందు సత్ఫల ముదయంబు నొందుకొఱకు
సముచితంబుగ సీసశతము రచింతు
సురుచిరాకార! ఉన్నవపురవిహార!
రాజగోపాల! రాధామనోజఖేల! 1

సీ. పాండవు ల్పంపిన పని కియ్యకొని పోయి
దూతకృత్యముచేయు కౌతుకంబు
విహితబాంధవులను విడిచి విదురునింట
విందారగించిన పొందికయును
గర్ణదుర్యోధనుల్ దుర్నీతులై పట్ట
విశ్వరూపముఁ జూపు విభ్రమంబుఁ

జుల్కు_దనం బని జూడకఁ విజయుని
సారథి వైనట్టి పౌరుషంబు
ఘోటకాసురుఁ దునిమిన పాటవంబు
చెలఁగిచాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార! ఉన్నవపురవిహార!
రాజగోపాల! రాధామనోజఖేల! 27

సీ. ముద్దులుగుల్కు_ నెమ్మోము నిద్దపుఁదళ్కు_ఁ
జెక్కు_లసొబగు నాసికము వెడఁద
కన్నులజిగినొప్పు కర్ణము లాజాను
దీర్ఘబాహువులు విస్తీర్ణవక్షు
మును సోయగపుమేను తనుమధ్యమును చిన్న
బొజ్జయు నునుగాంతి పాదము తొడలు
చెలువంపు జంఘలు చిరుతపాదములును
గలిగి యొప్పులకుప్ప కరణిఁ దేజ
రిల్లు నినుఁ గన్నతల్లి నారీమతల్లి
దేవకీదేవి భాగ్యంబుఁ దెలియవశమె
సురుచిరాకార! వున్నవపురవిహార!
రాజగోపాల! రాధామనోజఖేల!

---

# కర్లపాలెము సింగనామాత్యుఁడు

ఈతఁడు గుంటూరు మండలము నందలి బాపట్ల తాలూకా కర్లపాలెము వాస్తవ్యుఁడు. ఆఱువేల నియోగి, ఆపస్తంబసూత్రుఁడు, హరితస గోత్రుఁడు. ఇతఁడు 145 సం॥ రముల క్రిత మనఁగా 1760 క్రీ॥ శ॥ ప్రాంతములఁ బుట్టెను. తరువాత నా గ్రామ కరణముగా నుండెను. ఈతని తండ్రి

సీతారామయ్య, తల్లి బుచ్చమ్మ, ఈతని భార్య లక్ష్మీదేవమ్మ ఈతని వంశ వృక్షము.



* ఈ కవి వివరములఁ దెలిపినవారు

నర్సారావుపేట తాలూకా చిలకలూరిపేట సమీపస్థమగు పసుమర్తి గ్రామ మీ కవి వంశీకులగ్రామము. అప్పటికి వీరి యింటిపేరు "భట్రాజువారు." ఈ కవి ముత్తాత కర్లపాలెము వచ్చి తన మేనత్త భర్త కరణీకమున కంగీకరించి నాఁటినుండి కర్లపాలెమువా రన్న యింటిపేరు నందెను. ఈతని గ్రంథరచనము క్రీ॥ శ॥ 1790 ప్రాంతమున నారంభమై యుండవచ్చును.

ఈ కవి తండ్రికిఁ బినతండ్రియు, సోమయాజియు నగు నారాయణ సోమయాజినిఁగూర్చి యొక కథ చెప్పుదురు. ఆతఁ డాశ్రమస్వీకారముఁ బొంది, కృష్ణామండలములోని గుడివాడ ప్రాంతమునఁ గల "వడాలి" దేవస్థానమును నిర్మించి, తద్రక్షణార్థము తన మహిమచేఁ గృష్ణానదియందు మునిఁగి, నిజాముద్దౌలానవాబుసభామధ్యమునఁ బ్రత్యక్షమై, యా నవాబును మెప్పించి, వడాలి గ్రామమును సర్వదుంబాలాగ్రహారముగ *ఫర్మానా గొన్న మహిమోన్నతుఁడు; శ్రీపరివ్రాజకాచార్యవర్యపురుషోత్తమానందావధూత యని పేరొందెను. అవసానదశయం దీయన కర్లపాలెమునకు రాఁగాఁ దన యౌరసపుత్రుఁడు గ్రామాంతరమున నుంటచేఁ

* ఈ ఫర్మానా నకలును, నవధూతమహిమలును శివవేంకటకవులచే రచియింపఁబడి, వడాలి దేవస్థానము వారిచే క్రీ. శ. 1915 సం॥న సేతు ముద్రాక్షర శాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడిన "జగన్నాథీయ" మను గ్రంథమునఁ జూడ నగును.

దనకు సమాధిచేయుట మొదలగు స్మార్తకర్మల నీ కవి జన
కునిఁ జేయుమనియు, "తిరిగి జన్మింపవలసియున్నది. వెంటనే
నీకుఁ గుమారునిగఁ బుట్టుదు" ననియుఁ జెప్పి, సిద్ధిఁ బొందె
నఁట. ఆ ప్రకారమే యీ కవి కనుజుఁడుగఁ బుట్టి, యుపన
యనానంతరమున మృతినొందెనఁట.

ఈతని సంతతి వా రిప్పటికిని కృష్ణా గుంటూరు మం
డలముల యందున్నారు, వీరిది పండితసంప్రదాయము. ఈ
కవి విష్ణుభక్తుఁడు. నరసింహ మంత్రోపాసకుఁడు. రేపల్లె
తాలూకా నిజాముపట్టణ సమీప మందున్న "అల్లూరి"
గ్రామమున వేంచేసి యున్న శ్రీ లక్ష్మీనృసింహస్వామి యీ
కవి యిష్టదైవము. ఈ కవి కొకసారి మతి చలింప నీ శతకము
తండ్రి చదువ నప్పటి నుండియు మతి కలిగెను. వీరి కుటుం
బమునఁ బుట్టు ప్రథమ శిశువున కా దేవుని పేరుఁ బెట్టి,
కులదేవతగాఁ బూజించుచున్నారు. ఇతఁడు సంస్కృతాంధ్ర
ములు వచ్చినవాఁడు. ఇతని మంత్రశాస్త్రజ్ఞానము 31, 32,
33 పద్యముల ద్యోతక మగుచున్నది. ఇతఁడు భక్తిజ్ఞాన
వైరాగ్యములు గలిగి సాంఖ్యయోగమునందుఁ బ్రవేశమున్న
బ్రహ్మవేత్త యని శతక పీఠికలో వ్రాసిరి. "ఈయన సత్యవా
క్యపరిపాలకుఁడు. వాల్మీకి రామాయణ పారాయణ మొనర్చు
వాఁడు" నని కూడ వ్రాయుచున్నారు. ఇందు కేశవ నామ

ముల కొక్కొక్క పద్యము వ్రాసెను. శైలి భక్తిరసముతోఁ గూడి శ్రావ్యముగ నున్నది. కొన్ని పద్యములఁ జూపెదను.

### నరసింహ శతకము.

మ. అల నందవ్రజమందు గోపికలు నీ వత్యంత చోరుండ వం
చు లలిన్ జాగ్రిత నుండ కన్మొఱఁగ నా చోద్యం బిదే చూడఁడో
లలనారత్నములార! వెన్న దిని నిర్లక్ష్యంబుగా నేగెదన్
అలుగం బోలదు పట్టుఁడందువు నృసింహా! భక్తసంరక్షకా! ॥ 27

మ. ధరలో మర్కటవత్సభంగి నిను నే దాసుండు నీ పాదపం
కరుహద్వంద్వము నెమ్మది న్నిలిపి యో కంజాక్ష! రక్షింపవే
శరణంబంచు నుతించు నాతని గృపన్ సత్యంబుగాఁ బ్రోతువో
హరి! యల్లూరిపురీవిహార! నరసింహా! భక్తసంరక్షకా! 50

మ. ధరలో కేశవ నామసంస్మరణచే దారిద్ర్యముల్ వాసి సు
స్థిరలక్ష్మీవిభవాఢ్యుఁడై జనులలో శ్రేష్ఠుండునై తత్త్వమా
ర్గరహస్యంబు లశేషముల్ దెలిసి నీ కారుణ్యముం బొందు నో
హరి! అల్లూరిపురీవిహార! నరసింహా! భక్తసంరక్షకా! 64

---

# తిరుక్కడయూరి కృష్ణదాసు

ఈతఁడే రామదాసు చరిత్రమను హరికథ వ్రాసిన కవి కావచ్చును. ఈతని వివరము లేవియుఁ దెలియవు. కాని క్రీ॥ శ॥ 1800 కుఁ బూర్వుఁడై యుండవచ్చును. కంచర్ల గోపన్న చరిత్రమును దేశములో నున్న వాడుక కథలనుఁబట్టి,

రామదాసు వే కొన్ని కీర్తనలును, పలు గ్రంథముల యందలి శ్లోకములు, పద్యములును జేర్చి వ్రాసెను. ఈతఁడే వ్రాసిన కృష్ణ శతక మొకటి చిక్కుచున్నది. అందలి పద్యములు కొన్ని శైలికిఁ జూపుచున్నాను.

క. దివ్యాక్షి నొసఁగి నరునకు
భవ్య భవద్విశ్వరూప పరిదర్శనమున్
సువ్యక్తతఁ జూపినగతి
నవ్యవహితుఁడవయ్యుఁ జూపు మాకిటు కృష్ణా 27

క. సేవను భరతుఁడు సతతము
భావజ్ఞుండయ్యు శీలభావముఁ జెందెన్
త్రైవిధ దాసత్వంబున
నా వాయుజు మహిమఁ బొగడ నలవియె కృష్ణా! 54

క. ధన మదమున నిను మఱతును
ధనరహితత్వమున నిష్టదగ్ధమగు విర
క్తి నిఁ బొందదిందిర్రియంబులు
తనుధర్మము దరుము గోపతనయా కృష్ణా॥ 82

క. నీ నామము భవహరణము
నీ నామము సర్వసౌఖ్యనిచయప్రదముణ్
నీ నామ మమృత తుల్యము
నీ నామము నే స్మరింతు నిత్యముఁ గృష్ణా॥ 98

క. విశ్వాత్ముఁడ వైనందుకు
విశ్వాసము మీర నన్ను విశ్వాత్ముఁడవై
విశ్వమున బాధ లొందక
నీశ్వర కనిపెట్టి కావవే శ్రీకృష్ణా॥ 108

రామదాసు చరిత్రమునందుఁ గంచర్ల గోపన్న రచియించిన కీర్తనల నుదాహరించుటయే గాక యాతని దాశరథీ శతకము నుండి కూడఁ బద్యము లుదాహరించి యున్నాఁడు. ఈ రామదాసు చరిత్రము రమారమి నూరు సంవత్సరముల నుండి వ్యాప్తిలో నున్నది, ఇందు దాశరథీ శతకము నుండియే గాక మఱికొన్ని శతకములనుండి కూడఁ బద్యము లుదాహరించెను. గోపన్న యనేక కావ్యములు వ్రాసితి నని చెప్పి యున్నాఁడు. కావున నీ క్రింది శతకము లొకవేళ గోపన్నవే కొన్నియై యుండవచ్చును. అట్లనుమానించుటకు వీలైన శతకములఁ గొన్నిఁటి చూపెదను. ఇది కేవల మనుమానమే కాని సిద్ధాంతము కాదు. (1) రంగశాయి శతకము. (2) జానకీపతి శతకము. (3) మహీజాధిపా శతకము (4) భావనారాయణ శతకము. (5) రామతారక శతకము. (6) ఆర్తరక్షామణీ శతకము. (7) దాశరథీ శతకము. (8) మానసబోధ శతకము. ఈ యెనిమిది శతకములలో నా తెవ్వరు వ్రాసిరో తెలియదు. 1, 2, 5, శతకములు దొరకు చున్నవి. 3, 4, 6, శతకములు దొరకవు. ఇదిగాక తాడేపల్లి పానకాలరాయని మానసబోధ శతకము నుండి పద్యము లుదాహరించెను. కావునఁ బై శతకము లితరులవి కూడ నై యుండవచ్చును. దాశరథీ శతక ప్రశంస కంచర్ల గోపన్న చరిత్రము నందును, మానసబోధ శతక ప్రశంస తాడేపల్లి పానకాలరాయ చరిత్రము నందును, జానకీపతి శతక ప్రశంస

రామభద్రకవి చరిత్రమునను గననగును. దొఱకుచున్న తక్కిన శతకముల చరిత్రము కర్తలపేరు తెలియని శతకముల క్రిందఁ జూడనగును. 3, 4, 6, శతకములనుండి యొక్కొక్కపద్య ముదాహరించెదను. ఈ శతకము లెనిమిదియు రమారమి 100 సం॥ రములకుఁ బూర్వపు వని నిశ్చయించుకొనవచ్చును.

## (3) మహీజాధిప శతకము.

శా. ఏరా జాలముసేయఁగాఁ దలఁచినావేమో తలంపైనఁ గా
నీరా దీనుల నేచ నీకు సరిగానే దోఁచెఁగాబోలు నె
న్నోరూపంబులఁ జేయు నీమహిమ లేరున్ విర్విగా మున్నె వి
న్నారా తాతయగారిముద్ర యెటులైనం దప్పదన్నట్లుగా
రారా నా కభయప్రదాన మియరా రామా మహీజాధిపా॥

(పుట 63 రామదాసుచరిత్రము.)

## (4) భావనారాయణ శతకము.

మ. కరినేలింది హుళక్కి, ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర, కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యం బిచ్చుటల్ గల్ల, యి
త్తరి నన్నేలిన నిక్క మీ కథ లనంతా! భావనారాయణా!

(పుట 63. రా. చ.)

మ. అతికాఠిన్యుఁడ వీవు నిక్కముగ నత్యాపన్నుఁడ న్నేను నీ
మతిలో నించుక జాలిఁబుట్ట దిఁక నే నేదేవుఁ జింతింతు నే
గతి యేత్రోవఁ జరింతు నన్యమెఱుఁగన్ గాంక్షించి నీప్రాపుఁ జొ
చ్చితి నీచిత్తము నెట్లు వచ్చినసరే శ్రీభావనారాయణా!

(పుట 63. రా. చ.)

(6) ఆర్తరక్షామణీ శతకము.

శా. బాలత్వంబునఁ గొన్నినాళ్ళు పిదపన్ భామాకుచాలింగనా
లోలాభ్యున్నతిఁ గొన్నినాళ్ళు మఱియిల్లున్ ముంగిటన్ గొన్నినా
శ్రీలీలన్ విహరించితిన్ సుఖఫలంబిందేమియున్ లేదుగాఁ
జాలు న్నీపదభక్తి చేసెదను రామా! యార్తరక్షామణీ।

(పుట 87. రా. చ.)

ఈ పై శతకము లన్నియుఁ క్రీ॥ శ॥ 1800 లకుఁ బూర్వము పుట్టిన వనవచ్చును.

---

## కాండూరి వేంకటుదాసు

ఇతఁడు భార్గవపురాణము, దీనచింతామణీశతకమును వ్రాసెను. "కృష్ణా! దీనచింతామణీ" యని మకుటము. ఇతఁడు భారద్వాజసగోత్రుఁడు, వైష్ణవుఁడు, రామానుజమ్మ, లక్ష్మణార్యుల తనయుఁడు. ఈతఁడు విశాఖపురిమండలప్రాంతమువాఁడని, నూఱు నూటయిరువది వత్సరములకుఁ బూర్వుఁడని కవివంశీకు లున్నా రని చెప్పఁగా వింటిని. ఇతని వివరములు భార్గవపురాణకృత్యాది నున్నవి. శైలికి రెండుపద్యములఁ జూపెదను.

మ. వసుధన్ శ్రావణకృష్ణపక్షు విలసద్బ్రాహ్మతిథి తారాష్టమిన్
వసుదేవప్రభు దేవకీసతులకు న్వాద్యంబు లాస్యంబు గీ

తిసమేతంబుగ వేల్పు లచ్చరలు బీ్రితింజేయ జన్మించితీ ..
వసమానంబుగ లోకరక్షణకు కృష్ణా! దీనచింతామణీ! 28

మ. మురళీరావముతో, లలాటవిలసన్ముక్తాకలాపంబుతో
సురశార్దూలనఖాంకభూషణముతో నొప్పారుకర్ణద్వయీ
చరదంచన్మణికుండలద్వయముతో, సౌవర్ణచేలంబుతో
హరి నీ సేవ యొసంగు దాసునికిఁ గృష్ణా! దీనచింతామణీ! 56

---

# కాసుల పురుషోత్తమకవి

ఇతఁడు వ్రాసినవి రెండుశతకములు దొరుకుచున్నవి. (1) ఆంధ్రనాయకశతకము (2) హంసలదీవిగోపాలశతకము (3) మానసబోధశతకము (4) భక్తకల్పద్రుమశతకము నను నవి వ్రాసెను. కడపటి రెండు శతకములు నిప్పుడు దొరుకవు. ఈతఁడు వ్రాసిన శతకములలో నాంధ్రనాయకశతకము కడపటిది. అందుఁ దా నదివఱకు వ్రాసిన శతకముల పేళ్ళ న్నియుఁ జెప్పెను. ఆంధ్రనాయకశతకము చల్లపల్లి ప్రాంతములయందుఁ గృష్ణాతీరము నం దున్న శ్రీకాకుళము నందలి కాకుళేశ్వరుఁ డను నాంధ్రవల్లభుని సంబోధించి చెప్పినది. ఈ శ్రీకాకుళమునుఁ గూర్చియు, ఈ కవి హంసలదీవిగోపాల శతకమునుఁ గూర్చియు నే నొకసారి యాంధ్రపత్రికలో వ్రాసి యుంటిని.

"ఇది యొక యద్భుతశతకము. వ్రాసిన కవి కాసుల పురుషోత్తముఁడు. ఇతఁడు భట్రాజు. ఇది శ్రీకాకుళమునం దున్న యాంధ్రనాయకుఁడగు నాంధ్రవిష్ణువు పై వ్రాసినది. కావున ముందు మనమీ శ్రీకాకుళము, ఆంధ్రవిష్ణువులచరిత్రములఁ గూర్చి విచారణ మొనరించుకొందము.

## శ్రీకాకుళము

ఈ పేరున గంజాముమండలమున నొకపట్టణ మున్నది. కాని మన ప్రస్తుత శ్రీకాళము మదికాదు. ఇది కృష్ణామండలమునం దున్నది. బందరుతాలూకా యవనిగడ్డకుఁ జేరువను చల్లపల్లిజమీందారీలో నున్నది. ఇం దొకకాలమున వైష్ణవగురువులు వచ్చి నివసించినట్లు శ్రీ పరవస్తు గోవిందరామానుజదేశికులవారి శిష్యుఁడును, ముక్తవరాన్వయమువాఁడును, ముక్తామణీనాథపుత్రుండును, నగు పరవస్తుకవి తన యుత్తారకపంచకాభ్యుదయ మను గ్రంథమునం దీ క్రిందివిధముగ వ్రాసియున్నాఁడు.

> "వచ్చి సదాంధ్రనాయకునివాసమునైన శ్రీకాకుళంబునన్
> మచ్చిక వైష్ణవోత్తము లమానితవైభవ మొప్ప సన్నుతుల్
> మెచ్చఁగ సేయ నాహరిని మేల్మిఁ బ్రదక్షిణపూర్వకంబుగా
> హెచ్చిన (?) భక్తి మ్రొక్కి మదికింపగు వేడ్కల నుండి రెండిగన్"

శ్రీకాకుళమునందలి యాంధ్రవిష్ణునే దర్శించి శ్రీకృష్ణదేవరాయఁడు తన యాముక్తమాల్యద వ్రాయఁ

దోడంగెను. "నేను తెలుంగువల్లభుండ!" నని దైవ మీాత నికిఁ జెప్పినట్లు వ్రాసిన దీ శ్రీకాకుళము నందలి యాంధ్ర విష్ణువును గూర్చియే! ఏమనఁగా? "మున్నె కళింగ దేశ విజగీషామనీషఁ దండెత్తిపోయి, విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపఁ బోయి" యనుటవలన నీ శ్రీకాకుళము కృష్ణామండలములోనిదే. ( ఇది శా॥ శ॥ 1440 సం॥ రమున నైయుండునని శ్రీ కె. వి. లక్ష్మణరావుపంతులుగారు పరిషత్పత్రిక 7-316 లోఁ జర్చించియుండిరి.)

ఈ శ్రీకాకుళమును గూర్చి యిటీవలి వగు పై రెండు వైష్ణవగ్రంథములే కాక యచ్చటి తిరునాళ్ళను గూర్చి క్రీడాభిరామములోఁ గూడ వర్ణన లున్నవి.

గీ. దవనపున్నమఁ గాకుళాధ్యక్షుఁడైన
తెలుఁగురాయఁడు దేవతాధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం బవధరింప
నందుఁ బోయితి మీా పోయినట్టి యేడు. 204

గీ, కారవల్లిమతల్లి కాకల్పవల్లి
కడుపునిండారఁ గాంచిన కొడుకుఁ గుఱ్ఱ
జారచోరమహాధూర్త చక్రవర్తి
దేవ వేశ్యాభుజంగుఁడు తెలుఁగుభర్త. 365

ఇట్లే 207, 208, 209, 210, 211, 212 పద్యములలోఁ తిరునాళ్ళలోని యసభ్యవిషయములఁ గూడ వర్ణించి యుండెను. ఈ క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయ

కృతము. ఈతనికాలము క్రీ॥ శ॥ 1420 యని చరిత్రజ్ఞులు నిర్ణయించియున్నారు. కావున నుత్తారకపంచకాభ్యుదయ కావ్యమును బట్టి కాలనిర్ణయము కాకయున్నను క్రీ॥ శ॥ 1420 నాఁటికి దిరునాళ్ళును, శా॥ శ॥ 1440 ( క్రీ॥ శ॥ 1519 ) శ్రీకృష్ణదేవరాయని శ్రీకాకుళశాసనము ప్రకారము 16 వ శతాబ్దాదికి నీ యాంధ్రనాయకుఁడు మిక్కిలి శ్రద్ధతోఁ బూజల నొందుచున్నట్లు తెలియుచున్నది. చక్రవర్తి యైన రాయ లీ మారుమూలప్రదేశమునకుఁ వచ్చి యీ దేవున కైదూండ్ల దానముచేయుట కీ తెలుఁగునాయకుని ప్రఖ్యాతి యూహింపవలసినదే కాని వర్ణింప నలవికానిది కదా! కాని యీ యాంధ్రనాయకశతకము వ్రాయునప్పటి కీ దేవాలయ మే కారణముననో శైథిల్యమునొంది, పూజలు, తిరునాళ్ళను లేక యున్నట్లు కనఁబడుచున్నది. (చూడుఁడు 10, 11, 12, 15 పద్యములు) ఇవి చూచియే కాబోలు ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితాగారవివరణపట్టికయం దీవిధముగ వ్రాసియున్నారు.

"కృష్ణాతీరమందలి శ్రీకాకుళపుణ్యక్షేత్రమందు వెలయు నాంధ్రనాయకస్వామి దేవయతనాదులు శిథిలములై యుత్సవాదులు తగ్గియుండుకాలమునఁ గాసుల పురుషోత్తమకవి నిందాస్తుతితో "చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ! హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ!" యను మకుటముఁగూర్చి యీ సీసపద్య శతకమును రచియించెను. అతని కులగోత్రాదిక మెఱుఁగఁబడదు."

అని వ్రాసియున్నారు. కాని శతకమునందు కవి తన కులమును గ్రంథమధ్యమున వివరించియున్నాఁడు. "ఇట్టి నీ సంప్రదాయంబు గుట్టుబెట్టి రట్టుసేయుదు గనుము నా బట్టుతనము చిత్ర॥ 42". ఇతఁడు బట్టువంశమువాఁడని పలువు రెఱుఁగుదురు. 10 వ సంవత్సరాదిసంచికలో నొక రీతఁడు బట్టుపల్లె కాపురస్థుఁడని వ్రాసియున్నారు. ఈతని సంతతి వార లిప్పుడు కృష్ణామండలమున నివసించియున్నారు.

మనము ముందు విచారింపఁదగిన దా దేవాలయమున కుత్సవాదులు మానినప్పు డీ శతకము వ్రాయఁబడినట్లుండు టయు, కవి 150 వత్సరములకంటెఁ బూర్వుఁడు కా వీలులే నట్లు తెలియుచున్నందునను శ్రీకాకుళము తిరునాళ్లు మాను టకుఁ గారణములఁ గాని, శ్రీకాకుళము నందలి యాంధ్ర విష్ణువు దేవాలయప్రస్తుతస్థితిగాని మన మెఱుఁగవలెను. బందరు తాలూకావా రెవ్వరైన విచారించి వ్రాయుదు రని నమ్ముచున్నాను.

ఆంధ్రవిష్ణువు.

(1) అనంతామాత్యుఁడు తన భోజరాజీయమునందుఁ దన తండ్రియైన తిక్కన యీ దేవుని సేవించినట్లు వ్రాసి యుండెను.

సీ. విలసితం బగు కృష్ణవేణీ మలాపహా
రిణి భీమనది నా ధరిత్రియందుఁ

దనరు నపీత్రయాంతర్వేది యగుపావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
ధరనివాసం బగు పెరుమగూరిపురంబు
నందు విద్వజ్జనానంద మైన
జీవనస్థితిచేతఁ జెన్నొందె వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది
గీ. నెమ్మిఁ బ్రత్యక్షపరమపద మ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యాంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు.

(2) శ్రీనాథుఁడు వల్లభాభ్యుదయ మను గ్రంథము వ్రాసి శ్రీకాకుళము నందలి యాంధ్రవల్లభునకుఁ గృతియిచ్చె ననియు నందుఁ దిరునాళ్ళలో జరుగు నసభ్యములు క్రీడాభిరామముకంటెఁ బచ్చిగ నున్న వనియు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు క్రీడాభిరామము పీఠికలో వ్రాయుచున్నారు.

(3) ఆంధ్రవల్లభుఁడు దక్షిణమున కాంచీనగరాధీశ్వరుఁడుగానుండిన సంపరాయని (శంభురాయని) కుమారుఁడైన తెలుఁగురాయఁ డనియు, నతని శ్రీనాథుఁడు దర్శించె ననియు, కవులచరిత్రము నూతనముద్రణము 489 పుటలో శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాయుచున్నారు. ఆంధ్రవల్లభుని తెలుఁగురాయఁ డని యర్థముచేయుటయందలి శ్రీవీరేశలింగముపంతులుగారి యభిప్రాయము తప్పని తోఁచుచున్నది.

(4) బ్రహ్మాండపురాణమునందు "ఆంధ్రవిష్ణుస్సర యుక్షోదనుజేన నిశుంభనా" యనియు.

(5) "ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశుంభు దనుజాపహో
పురాస్వాయంభువమనోః కాలే కలియుగే పూరిః
కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః
అభవ త్సర్వదేవైశ్చ వేష్టితో లోకపూజితః॥"

అను నాంధ్రకౌముదివాక్యముల ననుసరించి శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగా రాంధ్రులచరిత్రము పూర్వయుగము ప్రథమముద్రణము 28 వ పుటలో నొకరాజు నొనర్చి, బ్రహ్మాండ పురాణము క్రీ॥ శ॥ 11-వ శతాబ్దములో వ్రాసి రను వాదమును బలపఱచిరి.

కవి దైవమును "నేఁటిదా నీ ప్రతిష్ఠ వర్ణించిచూడ" అని 15 వ పద్యమునఁ జెప్పిన వాక్యముచే నింక నీ ప్రశంస విడిచి శ్రీకాకుళమును, ఆంధ్రవిష్ణువును జాల ప్రాచీనములని పై వివరములవలన స్థాపితమైనదని మాత్రము చెప్పియిఁక శతకవివరములకు వచ్చెదను.

శతకకర్తృత్వము తెలియుచున్నది. కాలము 150 సంవత్సరముల కీవలవాఁడు. కవికులము బట్టురాజు లను వందికులము. ఈ వివరములు సుస్పష్ట మగుటఁ జర్చతో నిమిత్తములేదు.

ఈ శతకమునందు మొదటి తొమ్మిది పద్యములు కేవలస్తుతి మాత్రములు. పదవపద్యమునుండి శ్రీహరి దేవాలయమునం దుత్సవాదులు లేవని, 16 వ పద్యమువఱకుఁ జెప్పెను. 17 వ పద్యము నుండి నిందాస్తుతి యారంభము.

"క్రొంక్కొంగఁదగునె ముందొక్క పువ్వునకుఁ దాఁ
గక్కసించిన యాలి కక్కజముగ, 117

నాటించఁగలవొ సన్నకసన్నె వనంబు
పెట్టుక్రమా న్వెకలించి పెరటిలోన." 18

అని పారిజాతాపహరణకథను, భాగవతకృష్ణలీలను వర్ణించి గేలిసేయును. నిందాస్తుతి కింత యద్భుతరచనము మఱి చూచుట దుర్లభము. తిట్టులాగున కనఁబడి తిట్టు కాక పోవుటలోనే కవి నేర్పు మిక్కిలి మెచ్చఁదగియున్నది. అవతారచర్యల భూషింపఁదగినవి దూషించినట్లు కనఁబడఁజేయునట్టి యీతని నేర్పు భక్తిచేఁ గలిగిన రసగుళికలవలె నుండి ద్రాక్షగుళుచ్ఛములవలె నంటిన వెంటనే రస మనుభవింపఁదగి యున్నవి. పండితపామరజనవేద్యమై, బట్టుకవిత్వమునకుండు ప్రత్యేకత సుస్పష్టముగఁ గానఁబడుచు, జాతీయోక్తులతో నిండి యుండును. పద్యము ధార, వాక్యక్రమము, భావము, మృదుమధురముగనుండి యాంధ్రనాయకశతకమని సార్థకనామ మగు చున్నది.

(1) ఉచ్చనీచంబు లెఱుఁగక యిచ్చఁజేయు
చేష్టలివి భక్తహితమతిఁజేసితంద్రడు ॥చిత్రి॥ 21

ఇది యెంత తిట్టువలెఁ గనఁబడుచున్నది.

(2) నాండుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటినుండియు నీవు దామోదరుఁడవె! 26

ఇది యెంత మనోహరముగ నున్నది.

(3) తెలియ నవ్యక్తుఁడవుగావు తెలిసికొన్న
నిట్టివాఁడని తెలియలే దెవ్వరికిని 27

ఇదెంత సత్యమున్న వేదాంత వాక్యము.

(4) ఒకరికంటె గుణాధికు లాకరు మీరు
ఇంతచక్కన దెలిసె మీ యింటి వరుస'' 28

(5) సకలంబు నీవయై యొక మఱ్ఱియాకుపై
నిచ్చఁబరుండుట నాఁ డెంతగలవో?

* * * *

పరువు గలవాఁడవేని పాల్ఁబల్కులందుఁ
దెలియ వరిమిక్కుటమ్ములంత గలవో లేవో॥చి॥ 29

ఇట్టి హృదయ ముప్పొంగఁజేయు పద్యములు - గుణ మునే దోషముగాఁ జేసి చూపు వాక్యములు - పరమవేదాంతరహస్యములఁ బరిహాసమొనరించి మన బుద్ధులకుఁ బని గల్పించు మాటలు - పెక్కులుండి కవి ధన్యుఁ డని మనకుఁ దట్టుచుండును. కవిశతకమంతయుఁజూపుచు నిట్లుపోవలసినదే.

"కీర్తి నిందగ వర్ణించి గేలి పరుతు (16)" నన్న యీాతని వాక్యము నతి నిపుణముగ నెగ్గించుకొనెను.

26 పద్యము నారాయణశతకము నందలి "ధరసింహా సనమై" యను పద్యచ్ఛాయ కలది.

37 "మానసభోధ శతక" పద్యమున కనుకరణము.

38 దశావతారవర్ణనము.

65 పద్యమునుండి రామావతారవర్ణన మారంభించి 87 వఱకు సాగించెను. తక్కినవి కృష్ణావతార పరముగ వ్రాసెను.

83 బలరామావతారము 84 త్రిపురసంహారము 85 కల్క్యవతారము 91 కొన్ని యవతారములు 93 కృష్ణపరముగ నాతని బంధుగుల మిత్రుల దూషించి శ్రీకాకుళమున తన మందిరముననే యుండు మని మందలింపు.

96 పద్యమునుండి స్తుతి తిరిగి యారంభించెను.

99 వ పద్యము "అల వైకుంఠపురంబులో నగరిలో" నను పోతన్నగారిపద్యమున కనుకరణము వినుఁడు.

సీ. కోరికలీను వైకుంఠంబులోని లో
నగరిలో నామూల నవ్యదివ్య
సౌధంబు దాపలి సరసమందార చ
నాంతరామృత సరఃప్రాంతచంద్ర
కాంతోపలోత్పల కల్పితపర్యంత
సకల సౌభాగ్యలక్షణ నివాస
లక్ష్మి మనోజ్ఞ విలాసవశీకృత
సంభోగసామ్రాజ్య సంతతాభి

గీ. రామమూర్తికి వాంఛేతర ప్రపంచ
మేమిగావలె లీలార్థ మింతె కాని
చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ. 39

సీ. కావ్యదోషము తెలుంగని మత్కవిత్వంబు
విద్వన్నుతంబు గావించినావు
బహిరంతరేంద్రియ పరిశుద్ధి లేని నా
తలఁపులోపలవచ్చి నిలచినావు
పుణ్యకర్మ మొకింత పూనిసేయని నన్నుఁ
బెద్దలచేత మెప్పించినావు
పురుషప్రయత్నంబు గుఱుతెఱుంగని నన్ను
భుక్తి గలుగఁజేసి ప్రోచినావు
గీ. పతితుఁ జేపట్టినావు చేపట్టినావె?
యన్యగతిఁ బోవనీయకు మార్తరక్ష||చిత్ర|| 105

అను పద్యమువలనఁ గవి భుక్తికి కలవాఁడని, సంతృప్తుఁడని, భక్తుఁ డని తెలియుచున్నది.

107 వ పద్యము "అరయఁగ శంతనుపుత్రుపై" యను దేవకీనందనశతక పద్యమువంటిది.

108 పద్యములో కవి యితరకృతులు కవినామమును గనఁబడుచున్నవి.

(1) "మనసా హరిపాదము లాశ్రయింపుమా" అను మకుటము గల శతక మొకటి వ్రాసితి నని, (2) "రామా భక్తకల్పద్రుమా!" అని వొక శతకమును (3) "హంసలదీవి గోపాలశతక మలరులదండ నా గోపాలున కర్పించితి" నని

వీనికి బిమ్మట నీ యాంధ్రనాయకశతకము వ్రాసితి నని కవి వ్రాయుచున్నాఁడు.

ఇందలి మానసబోధశతకము కనఁబడదు, కాని ప్రస్తుత మున్నది తాడేపల్లి పానకాలరాయకృత మని ప్రకటన మందు చున్నది. ఈ పురుషోత్తమకవిది కనఁబడదు. కావున నీ క్రింది సందేహములు కలుగుచున్నవి.

(1) పానకాలరాయకవి వ్రాసిన చిత్తబోధశతక మింకొకటి యుండుటను, ఆతని వితర శతకములు రెండు మూఁడింత ప్రౌఢములుగ లేకపోవుటను ప్రస్తుతము మన కున్న మానసబోధశతకము పురుషోత్తమకవిదా? పానకాలరాయఁడు ప్రాచీనుఁడు కాఁడని చెప్ప వీలున్నది కాని వీ రిద్దరును సమకాలికులో, ప్రాచీనార్వాచీను లెవ్వరో యింతవఱకుఁ దెలియలేదు. కావున నొకరి మకుటము నింకొకరు తీసికొని వేర్వేరుగా శతకములు వ్రాయఁ బురుషోత్తమకవిది కనఁబడుటలేదా?

మానసబోధశతకమందలి "తిరుపతిలోఁ బ్రభాతవిధిఁ దీరిచి" అనుపద్యమున కచ్చముగ నకలుగ "అప్పనంబులు గొను నఖిలదిక్పాలేశ్వరులచే వేంకటాచలనివాసుఁడు" అను 37 వ పద్యము 'ఆంధ్రనాయకశతకము'నఁ గనఁబడుచున్న దిందువలన నీ యిర్వురుకవులలో నొక్కరింకొకరి గ్రంథముఁ జూచియుండితీరవలెను. అందు పురుషోత్తముఁడు

మిక్కిలి ప్రౌఢకవి యగుటను, పానకాలరాయని రుక్మిణీపతి, పార్థసారథిశతకము లంతప్రౌఢము కాని వని నాకుఁ దోఁచి నందునను, నేను పురుషోత్తముఁడే ముందు వ్రాసినకవి యని యభిప్రాయపడుచున్నాను. సత్యము కాక పోవచ్చును. భావి పరిశోధకులు దొంగను బట్టుకొందురుగాక!

(2) రెండవశతక మగు భక్తకల్పద్రుమశతకము చిక్కుట లేదు.

(3) హంసలదీవిగోపాలశతకము కొన్నిపద్యములు మాత్రము లోటుగాఁ జిక్కుచున్నది. సంపూర్ణప్రతి చల్లపల్లి ప్రాంతములఁ జిక్కునని వినుచున్నాను. ఉదాహరణమున కొక్కపద్యము చూపెదను. గోపాలశతక మాంధ్రనాయక శతకకీర్తి నభివృద్ధి చేయు మనోహరశతక మని ప్రస్తుతము చెప్పినఁ జాలును.

శైలికిఁ బద్యములు:—

(1) హంసలదీవి గోపాలశతకము.

సీ. స్తనవిషదుగ్ధంబుఁ ద్రావించు పాతకి
పూతకి కమృతంబు పోసఁగ నిచ్చె
హింసింప కంసుఁ డూహింప రప్పించిన
వానికి వైకుంఠ వాస మొసఁగె
దుర్భాషలాడిన దుష్టాత్ము శిశుపాలు
నఁశ తనయుఁడె సైక్యంబు జేసె

వీనుల తనకథల్ వినని ఘంటాకర్ణు
నెలమి కైవల్య నిశ్చలునిఁ జేసె
గీ. రిపులఁ బ్రోచినదే వింత శ్రితుల కెంతొ?
భావజవిలాస! హంసలదీవివాస
లలిత కృష్ణాబ్ధిసంగమస్థలవిహార!
పరమకరుణాస్వభావ! గోపాలదేవ॥

ఈ శతకమకుటము నందలి కవిభావము చదువరులు శ్రద్ధతో గమనించెదరుగాక!

(2) ఆంధ్రనాయక శతకము

సీ. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె
కాని పెట్టినావె చేతనుల కెల్లఁ
జేసినంత భుజింపఁ జేసినా వింతె కా
కెక్కువ లెవ్వరి కిచ్చినావు
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవుగా
కిచ్చినొక్కనిఁ బోవ నిచ్చినావె?
వెసఁ బృథక్స్వకృతుల వేఱుబెట్టితివిగా
కందఱి కైకమత్య మిడినావె
గీ. తెలిసె నీ రక్షకత్వంబు దేవదేవ!
వేఱె గతిలేక నిన్ను సేవింపవలసె
చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ!

[ఆంధ్రపత్రిక దుర్మతి పుష్య బ ౨ శని]

దానిపై "చిరువోలు కుటుంబరావుగారు" కష్టపడి ప్రయత్నించి హంసలదీవిగోపాలశతకమును గవి స్వగ్రామ

మగు పెదప్రోలునుండి కవి వంశీకులకడ సంపాదించి ముద్రించి యొక ప్రతిని నా కంపిరి. కవి వివరములు మఱికొన్ని తెలిసినవి.

ఈ క్రింది పద్యమున "కాసుల పురుషోత్తమకవి" కాశ్యపగోత్రుఁడనియు, అప్పలరాజు రమణాంబల పుత్రుఁ డనియు, అద్దంకి తిరుమలాచార్యశిష్యుఁ డైన వైష్ణవుఁ డనియుఁ దెలియుచున్నది.

సీ. కాశ్యపగోత్రుఁడ, కాసులవంశచం
ద్రముఁడ నప్పలరాజ రమణాంబ
కూర్మితనూజుండ గురువులౌ నద్దంకి
తిరుమలాచార్య శ్రీచరణపద్మ
భవ్యతీర్థమరంద పాన ద్విరేఫాయ
మానమానసుఁడను మాన్యహితుఁడ
పురుషోత్తమాఖ్యుండ పూల్దండవలె నీకు
శతకంబుఁ గూర్చితి శాశ్వతముగఁ

తే. గీ. జిత్తగింపుము మీ పాదసేవకుఁడను
భావజవిలాస! హంసలదీవివాస!
లలితకృష్ణాబ్ధిసంగమస్థలవిహార!
పరమకరుణాస్వభావ! గోపాలదేవ!

ఈ కవి "దేవరకోటజమీ ప్రభువులలో విశేషకీర్తి నార్జించినట్టియు, క్రీ.శ. 1798 లో మద్రాసు గవర్నరు ఇన్ కౌన్సిలువారివలన పరిపాలనార్హు లైనట్లు ప్రకటింపఁబడినట్టియు శ్రీమంతురాజా అంకినీడుబహద్దర్ (1)వారి ఆస్థానకవు లని కవివంశీకులును, ఇచ్చటి వృద్ధులును చెప్పెదరు. శ్రీకాకుళాంధ్రనాయకుని దేవాలయము, నదీపాతముకాఁగా పైన వివరించిన ప్రభువే తిరిగి కట్టించినారు. అప్పటినుండియు ఆలయపరిపాలన వారివంశీకులకే చెంది యున్నది."

అని శ్రీకుటుంబరావుగారు వ్రాసి కవివంశవృక్షమును, కవిపోషకప్రభువులవంశవృక్షము నీ క్రిందివిధముగఁ దెలియఁజేసి యున్నారు.

(1) కవివంశవృక్షము.



కవివంశమునకుఁ బూర్వవివరములు తెలియలేదుగాని, తరువాత వివరములు తెలిసినవి. పోషకప్రభువులు వంశవృక్షము కూడ వారు రాజ్యమునకు వచ్చిన సంవత్సరములతో వివరించిరి. ఇందు వలనఁ గవికాలము సుస్పష్టముగఁ దేలుచున్నదని చెప్పవచ్చును.

ఆంధ్రనాయకశతకమునందు 12 వ పద్యము లో "వైఖానసోక్తికి వంచనరాకుండ నెఱులు చూపినమాట నిజమయేని" అను వాక్యమున కొక కథ చెప్పుచున్నారు.

ఈ దేవాలయపుఁ బూజరి యగు వైఖానసుఁడు ప్రతి దిన మా శ్రీకాకుళప్రభునకు దేవుని నిర్మాల్యము (సుగంధ పుష్పమాలికలు) దేవునికిఁ దీసిన పిమ్మట భక్తుఁ డగు రాజున కిచ్చుట యచ్చట వాడుకగ నుండెను. వైఖానసుఁడు ప్రతి దిన మట్లు తీసికొనిపోవుచుండెను. అతఁడు వేశ్యాప్రియుఁ డగుటచే నొకనాఁ డా దండలతో వేశ్యయింటికిఁ బోయి దాని మెడ నాహారము లుంచి, దానితో నుండి, యా దండలు మఱలఁ దీసి యవి తీసికొనిపోయి రాజున కిచ్చెను. రాజు భార్య యా దండల భర్తచే నందుకొనువేళఁ దెల్లనిపూలపై నొక తలవెండ్రుక కనఁబడ "నాథా! ఇది యేమి? వైఖానసుఁడు మోస మొనరించెను. ఎవ్వరో నరులు ధరించిన హారముల మన కిచ్చె" నని యా దండలఁ గ్రిందఁ బారవైచెను. అప్పుడు రాజు క్రోధకఁ దొక్కిన త్రాచువలె లేచి వైఖానసుని

రప్పించి "యేమిరా! పొగరుబోతా! నరులు ధరించి విడిచిన మాలలఁ దెచ్చి మా కిచ్చితివి?" అని యడిగెను. వాఁడును విస్మయము నొంది, యేమి చెప్పుటకును నోరాడక వేశ్యకు ధరింపజేసినది జ్ఞప్తికి వచ్చి, యొడలు సెమ్మ గ్రమ్మ "మహా ప్రభూ!" అని నాల్క తడఁబడ వణఁకుచుండెను. "ఏమి?" అని రాజు గద్దించెను. వేశ్యకు ధరింపఁజేసితి నని చెప్పిన పూజరిపుత్రి కోటగుమ్మమునఁ గట్టుదురు. ఏమైన సరియే! యని "దేవా! దేవరవారితో నేమి మనవి చేయను? కేశవు నకుఁ గేశము లున్నవి." యని బొంకెను. రా జేది చూత మని కొందఱు వెంటరా గుడి కేగి తలుపులు తీయించెను. వైఘానసుఁడు వేశ్యాలోలుఁడైనను భక్తుఁడు. అందువలన విష్ణువిగ్రహము "నెఱికురుల క్రొమ్ముడి" దాల్చియుండెను. రా జది చూచి సమాధానపడి వెడలిపోయెను. భక్తుఁడు "బ్రతుకు జీవుఁడా" యని స్వామి నత్యంతభక్తితో సేవించు చుండెను. ఇది యొక కథ! ఈ వాడుకలో నున్న కథ మన కవి సత్య మని నమ్మియే దేవునిఁ బలుకరించు చున్నాఁడు.

సీ. ధర నూటయెనిమిది తిరుపతులందు శ్రీ
  కాకుళం బరయ బ్రఖ్యాతియేని
ఆంధ్రనాయకుఁడవం చఖిలదేశంబుల
  నిన్నుఁ గీర్తింతురే నిజమయేని
వైఘానసోక్తికి వంచన రాకుండ
  నెఱులు జూపిన మాట నిజమయేని

వైకుంఠుఁడవు స్వయంవ్యక్తిగా నర్చావ
తార మొందితి వంద్రుడు తథ్యమేని

గీ. వివిధపూజోత్సవములు నిర్విఘ్నములుగఁ
జేసికొనకున్న నీకుఁ బ్రసిద్ధికలదె
చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్య భావ
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ!

అని కవి దేవు నుగ్గడించుచున్నాఁడు, ఈ కథయే గోదావరిమండలము నందలి కొత్తపేటకుఁ జేరువ నున్న పలివెలలోఁ గొప్పేశ్వరస్వామికిని జెప్పుదురు. పలివెలదేవాలయము చాలప్రాచీనమైనది. ప్రసిద్ధమైనది. అది దేవతలు కట్టిరని జను లనుకొందురు. ఆ యీశ్వరుని పేరు కొప్పులింగేశ్వరుఁడు. లింగమునకుఁ గురులకొప్పిప్పటికిఁ గన్పట్టుచున్నది. అది కూడ శిలయే! ఈ కొప్పులింగేశ్వరునిపైఁ గూచిమంచి సోమసుందరకవి శతకము వ్రాసెను.

(1) హంసలదీవి గోపాలశతకము

సీ. పుట్టి నప్పుడె బట్టి, కొట్టఁగాచినమామ । గట్టఁబాపినయట్టి దిట్టదొంగ
మెల్లమెల్లన గొల్లపల్లెలో పాల్వెన్న । కొల్లకొల్లఁగఁ గొన్న పిల్లదొంగ
జలములాడఁగఁ జూచి చానల వల్వలు । చెలఁగుచుఁ దెచ్చిన చిన్నిదొంగ
వైరముచే వెంటనంటి బట్టఁగవచ్చు । యవను మాయించిన యట్టిదొంగ
దొరకితివి నాకు, నిశ్శంక, విడువనిఁక । భావజవిలాస! హంసలదీవివాస
లలితకృష్ణాబ్ధి సంగమస్థలవిహార! । పరమకరుణా స్వభావ! గోపాలదేవ!

సీ. తల్లిదండ్రుల చెరల్ దప్పింప కంసుని
హతునిఁ గావించు టార్తారవంబొ?

బాణబాహాగర్వభంగం బొనర్చిన
పాత్రుఁ డెచ్చుట జగద్భద్రకర మొకొ?
ధార్తరాష్ట్రులఁ జంపి ధాత్రీతలము మేన
బావ కిచ్చుట దీనబాంధవంబొ?
అన్న గారి విరోధు లగు దానవుల నాజి
బొలియించుటే సర్వపోషణంబొ?
కరుణ నీ వారిఁ బ్రోచుటె బిరుదు నీకు
భావజవిలాస! హంసలదీవివాస!
లలితకృష్ణాబ్ధి సంగమస్థలవిహార!
పరమకరుణాస్వభావ! గోపాలదేవ!

సీ. తనకుఁ గళేబరంబునకు భేదజ్ఞాన
మతిలేనివాని నిర్మలత యెంత?
తనువు వర్జించు నంతటఁ జీవుఁ డేమౌనొ
తెలియనివాని తాత్త్వికత యెంత?
కన్నతండ్రిని జగత్కర్తను నాత్మలో
బోధచేయని వాని బుద్ధి యెంత?
భవజరామరణాది భయనివారణమైన
పదముఁ జేరని వాని భాగ్య మెంత?
ఏమి నేరని ననుఁ బ్రోచు టిదియె వింత
భావజవిలాస! హంసలదీవివాస!
లలితకృష్ణాబ్ధి సంగమస్థలవిహార!
పరమకరుణాస్వభావ! గోపాలదేవ!

## (2) ఆంధ్రనాయక శతకము

సీ. శౌర్య మెక్కించి విశ్వామిత్రుఁ డూరకఁ
దొడరింపఁ దాటకిఁ దునిమినావు
వైదేహి వాక్యనిర్బంధంబుఁ దోయ వే
షటిమూరి మారీచు నటికినావు

వెనుకఁజవై-చిన విడువక పైకిరా
నరుదుగా ఖరు తలఁ దరిగినావు
మొట్టో యనుచు దేవమునులు వారెన్నాళ్లో
యనుసరింప దశాస్యుఁ దునిమినావు
కాని రోసంబుఁ గలదె నిక్కముగ నీకు
మనసు మెత్తనివాఁడ వేమనఁగవచ్చు
చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ! 7

సీ. దుర్జనభంజనోద్యుక్తసుదర్శన
ధారివే నీవు యదార్థముగను
శాత్రవ భయద నిస్వనపాంచజన్య భూ
షితకరాంబుజుఁడవే సిద్ధముగను
మత్తారిభేదనాయత్తకౌమోదికి
నిజకరభరితమే నిశ్చయముగ
ఘోరవిద్విడ్రక్తధారార్ద్రనందక
సంధానపాణివే సత్యముగను
సన్నుతామోఘబాణైక శార్ఙ్గచక్ర
శయుఁడవే నమ్మవచ్చునే స్వామి నిన్ను
చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్యభావ
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ. 94

సీ. అఖిలపోషకుఁడవ న్నాఖ్యమాత్రమె కాని
కర్తవు నీవె భోక్తవును నీవె
యక్షురుండవను బ్రఖ్యాతిమాత్రమె కాని
చర్చింప వేఱొండు సాక్షి గలఁడె
సుగుణాబ్ధివని నిన్ను స్తుతి యొనర్చుటె కాని
నిర్గుణుం డెవ్వఁడు నీకు మించ
విశ్వాత్ముఁడ వటంచు వినుతించుటయె కాని
చొచ్చి నిన్నెవ్వఁడు చూచినాఁడు

గీ. వినుకరులె గాని నిన్ను నీ విశ్వములను
మొద లెఱుంగుదురే నిజంబునకుఁ బిల్వ ॥చిత్రి॥

## (3) భక్తకల్పద్రుమ శతకము

ఈ శతక మింతవఱకు దొరకలేదు. కాని కొన్ని పద్యము లీ కవి వంశీకులకడ సంపాదించి శ్రీ చిరువోలు కుటుంబరావుగారు నాకుఁ బంపిరి. ఈ శతకము పంచచామరములలో వ్రాసెను.

పంచచామరములు

మొఱాలకించవయ్య నీకు మ్రొక్కెదన్ రఘూద్వహా
బిరాన నా మది న్వసించి ప్రేమ నుంచి నూట్పుదార్
వరాలు శాలు విచ్చినట్లు వచ్చు కీర్తి నీ కహో
పరాకు భద్రిశైలరామ భక్తకల్పకద్రుమా! ॥ *
ధరామరేంద్ర మానిపూజితా ధరానుతాయుతా
ధరాధరేంద్ర ధీరహీర తారహారచారుకం
ధరా, ధరాధిపాధిపాత్ర ధా ప్రభాంతకందరా
పరాకు భద్రిశైలరామ భక్తకల్పకద్రుమా! ॥ 2
గురున్ గుచేలు చింకిగుడ్డ కొంగుముక్కగింజ లా
దరంబుతోడ మెక్కి వాని ధన్యుఁజేయ నెంచి బల్
సిరిన్ ఘటించి యేలినట్టి చిత్స్వరూపరాఘవా
పరాకు భద్రశైలరామ భక్తకల్పకద్రుమా! ॥ 3

ఈ శతకము పురుషోత్తమకవి ప్రారంభశతకమై యుండనోపును.

---

* ఇట్టి మకుటముగల శతకము పర్లాకిమిడిలో నున్నట్లు వింటిని. పంపెదమని పంపినారు కారు.

సజాతీయగ్రంథములు:

ఈ శ్రీకాకుళాంధ్రదేవునిపైఁ బల్వురు స్తోత్రములు, కృతులును వ్రాసియున్నారు.

(1) శ్రీకాకుళ శ్రీహరి శతకము.

నీ వాంధ్రావని నాయకుండవని నిర్ణిద్రానురాగాప్తి నా
భావం బాంధ్రకవిత్వరీతిని భవత్పాదారవిందస్తుతి
ప్రావీణ్యంబున నుండె బాలకృత దూరస్ఫార శీతాంశుబిం
బావాప్త్యర్థకరప్రసారగతి దోఁపన్ గాకుళశ్రీహరీ! 13

దీని సంపూర్ణమకుటము "కృష్ణ రఘువర్యా, కాకుళ శ్రీహరీ!" యని యున్నది.

(2) శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్య మను సంస్కృత గ్రంథము బ్రహ్మాండపురాణాంతర్గత మని ముద్రించియున్నారు.

(3) దీనికి భాషాంతరీకరణము వల్లభాభ్యుదయ మను పేర హారితసగోత్రుఁ డగు భట్లపెనుమర్తి గోపాలసచివ పుత్త్రుం డగు కోదండరామకవి యొనరించిన నాల్గాశ్వాసముల తెలుఁగుప్రబంధ మొకటి యున్నది.* మూలమునకు భాషాంతరమునకు భేదములు కలవు. మూలము వ్యత్యస్తముగ నున్నదని కవియే వ్రాసియున్నాఁడు.

---

* ఈ గ్రంథము బెజవాడలో నున్న శ్రీ కొండాలి ఆంజనేయులుగారి దయవలన నేను చూచుట తటస్థించినది.

(4) కేయూరబాహుచరిత్రమున నండూరి గుండ మంత్రి కాకుళేశ్వరభక్తుఁ డని యున్నది.

(5) విశిష్టాద్వైత ప్రవర్తకు లగు వేదాంతదేశికుల పుత్రుఁ డగు వరదదేశికుఁడు సంస్కృతమున శ్రీకాకుళ స్తవము వ్రాసెను.

(6) కృష్ణరాయల యాస్థానవిద్వాంసుఁడగు బొల్ల లక్ష్మీధరపండితుఁ డొక శాసనమున నీ యాంధ్రవిష్ణువును స్తుతించినట్లు శ్రీ ప్రభాకరశాస్త్రిగా రుదాహరించిరి. (ఆంధ్ర పత్రిక దుర్మతి మాఘ శు ౧౧)

(7) కంచర్ల శరభనకవి యధ్యాత్మరామాయణ మున వీరప్రతాపరాయలపేర శాసన మున్నట్లు వ్రాసి యుండెఁగదా!

(8) కొన్ని సంస్కృత భాణములలో నీ క్షేత్ర ప్రసంశ యున్నట్లు శ్రీప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి.

(9) తెలుఁగురాయఁడు, తెలుంగురాయఁడు నీ దేవుని పేరఁ బరగువా రని కొంద అనుచున్నారు.



శ్రీ ర స్తు

# శతక కవుల చరిత్రము

## చతుర్థ భాగము*

(క్రీ.శ. 1800 – 1900)

### సదానంద వరదరాజయోగి

ఇతఁడు "నవ్యతరభోగి శ్రీసదానందయోగి" యను మకుటముతో సదానందయోగిశతకమును రచియించెను. "సకలతత్త్వార్థములు సంగ్రహించి" ఇది వ్రాసెనఁట! వేదాంతప్రతిపాదకమైన వైరాగ్య యోగశతకము.

గీ. కష్టమాంసము నెత్తురు గప్పుకొన్న
కాళ్ళుఁ గొనిపోయి ముంతురు నీళ్ళలోన
శుద్ధిగాదది మనఃపరిశుద్ధిగాక
నవ్యతరభోగి! శ్రీసదానందయోగి! ॥

---

* ఈ భాగమునందు 19 వ శతాబ్దమునందలి యాధునిక కవులదేగాక కొందఱు కాలము తెలియని కవులచరిత్రము కూడఁ గలదు. కొంద ఱట్టి వారు మిగుల ప్రాచీనులు కూడ నుండవచ్చును. దీని వెనుకభాగమునందుఁ గూడ క్రీ॥ శ॥ 1700 నకుఁ బూర్వులును, ఎంత పూర్వులో తెలియనివారును గూడ వచ్చియుండిరి. అట్టివారి కాలనిర్ణయము స్థిరముగఁ జెప్పక సందేహముగనే వెల్లడించి యుంటిని.

గీ. పూయవచ్చుఁ బట్టెడు బూడిదైన
వేయవచ్చును రుద్రాక్ష వేల సంఖ్య
నేయఁగారాదు మనసు సుస్థిరముగాను
నవ్యతరభోగి! శ్రీసదానందయోగి! ॥

ఈతఁడు క్రీ. శ. 1800 కుఁ బూర్వుఁడై యుండవలె నని ప్రాచీన తాళపత్రములవలన నూహింప నగును. సత్యముగఁ గాలము తెలియనందున నీ 19 వ శతాబ్దమున నుంచితిని. నన్నయ తిక్కనాదుల మాత్రమే స్తుతించి, యిప్పటివాఁ డని చెప్పుటకు వీలులేని ఈశ్వరభట్ల ఫణిభట్టు తన పరతత్త్వరసాయన మను వేదాంతగ్రంథమునం దొక సదానందయోగి వచ్చిన ట్లీ క్రిందివిధముగ వ్రాసియున్నాఁడు.

గీ. ఏ మునీంద్రుని కరుణామయేక్షణంబు
లాశ్రితాఘౌఘరోగ రసాయనంబు
లాతఁ డెఱఁ సదానంద యతి యనంగ
నవనిఁ బెంపొందు భువనత్రయంబుఁ బొగడ॥

గీ. తనదు సల్లాపరుచి పార్శ్వ జనుల శ్రుతుల
దప్పి దీర్పంగ వెంచేసెఁ దగ మదీయ
మందిరంబున కల సదానందయోగి
విభుఁడు మత్పూర్వభవపుణ్య విభవమునను.

తెలుగులో వేదాంతగ్రంథము వ్రాసిన ఫణిభట్టునకుఁ దెలుఁగు శతకము వేదాంతవిషయికమైనది వ్రాసిన యీ సదానందయోగియే గురువై యుండును. "సకలవేదాంత సిద్ధాంతమైన యద్వయబ్రహ్మ విద్యారహస్యమును" తనకు

బోధించిన యీ సదానందయోగికే ఫణిభట్టు పరతత్త్వ రసాయనము నంకితము చేసెను. సదానందయోగి కవి గృహమునకు వచ్చి వేదాంతమును బోధించెనఁట! ఈ సదానంద యోగి సాక్షాన్మహేశ్వరుఁ డని శిష్యులు తలంచువారు. కాని కాలనిర్ణయమున కాధారములు లేవు. శతకము నందలి శైలి, భాష, భావములును శ్లాఘ్యముగ నున్నవి. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## సదానందయోగి శతకము

గీ. శ్రీమహోన్నత విజ్ఞాన సిద్ధినొసఁగు
సద్గురుస్వామి చరణాబ్జములు దలంచి
సకల తత్త్వార్థముల నెల్ల సంగ్రహించి
గీత శతకంబు రచియింతుఁ గీర్తి వెలయ ॥ న ॥ 1

గీ. బట్టబయలైన యీ పరబ్రహ్మమహిమ
దేశికస్వామి కృపఁగాని తెలియరాదు
యెన్ని చదువులు చదివిన నేమిఫలము
నవ్యతరభోగి! శ్రీసదానందయోగి! 4

గీ. శివుఁడు జీవుఁడు రెండు వస్తువు లటంచు
నెంచు నెంచిన సాయుజ్య మెట్లు గల్గు
జీవ శివ భేద మెన్నఁడు సేయరాదు
నవ్యతరభోగి! శ్రీసదానందయోగి! 13

గీ. తన్నుఁ దెలసిన జగ మెల్ల తానె యయిన
మర్మ మెఱుగంగఁ జాలని మందమతులు
గడువఁజాలరు సంసార ఘనపయోధి
నవ్యతరభోగి! శ్రీసదానందయోగి! 60

గీ. చుట్టములు తల్లిదండ్రులు సుతులు సతులు
తానుఁ బొయ్యేటి గతులకుఁ దగిలిరారు
నారు త్రోవకు వచ్చేటి వారుగారు
సవ్యతరభోగి! శ్రీసదానందయోగి! 98

---

# వంగూరి నరసకవి

ఇతఁడు 'అచ్చన' పుత్రుడు. నారసింహాభిధానుఁడు. బహుశః యింటిపేరును బట్టి యీూలువేలనియోగిధై యుండ వలెను. వంగూరివారు గోలకొండవేపారు లందుఁ గూడఁ గల రని వింటిను. ఇతఁ డే కాలమువాఁడో తెలియదు. ప్రసన్న రాఘవశతకమును రచియించెను. "ప్రసన్న రాఘవా!" అనియే మకుటము. కవిత్వము భాషాదోషములతో నిండి యున్నది. ఇతఁడు రెండువందల పద్యములను "శతకద్వయ ము"గా వ్రాసినాఁడు. రామాయణ కథయే శతకరూపమున వ్రాసెను. ఇంక ననేకు లిట్లే రామాయణ భాగవతాది కథలు శతక రూపమున వ్రాసియున్నారు. శైలికి రెండుపద్యము లుదాహరించెదను.

ఉ. విల్లును రెండు పొండనిన వేగమె తెచ్చిరి కోటిమానవుల్
దల్లడమంద దేవతలు దానవరుద్రపయోధియంచు భీ
తిల్లగ రాజవల్లభుఁడు తెచ్చుటఁ బెట్టెను యాగశాలలో
నెల్లవిధంబుల న్విరువ నెంతటివారు ప్రసన్నరాఘవా ॥

ఉ. ముందఱ గానకేశ్వరుఁడు మూలబలంబు లనేక రాక్షసుల్
నందఱఁ గూడి వచ్చుచును నాగ్భటముల్ బలు బొబ్బరింతలున్
చిందులు ద్రొక్కుచు న్నడువఁ జెప్పెను వేగ విభీషణుండు యీ
కందువవచ్చు బల్ముఖులఁ గంటివె స్వామి ప్రసన్నరాఘవా ॥

రామాయణకథ యంతయు నించుక మార్పులతో నిట్లే రచియించినాఁడు. లేఖకప్రమాదములు ముద్రాపకుల దోషములును గవి తప్పులకంటె నధికముగ నుండుటచేఁ గవి పాఠము నిర్ణయించుట దుస్తరము. అంత ప్రౌఢమైన శతకము కాదు.

ఈ కవి వివరము లేమియుఁ దెలియవు. మా వంశములోఁ బూర్వు లనేకులు కవులు పండితులుగా నుండిరి. మా తాతలు, తండ్రులు, సోదరులు కూడ వ్రాసిన ఖండకావ్యభాగము లున్నవి కాని వారు పెద్దపేరులు సంపాదింప లేదు. ఈ నరసకవినామము మా కుటుంబములో నున్నది కాని యీ కవిని గుఱించి నే నెప్పుడును వినియుండలేదు.

మా వంగూరివారు రమారమి 200 సంవత్సరముల క్రితము తమ యల్లుండ్రకు గ్రామము లేకబోగపుమిరాసీలుగా నీయఁగలిగినంత ధనవంతులు, కీర్తిమంతులు నని మాకు వియ్యంకుల కుటుంబములోని వా రగు వల్లూరి వారిలోఁ బూర్వకవి యొకఁడు వ్రాసిన వివరములవలన దెలియఁగలము.

నర్సాపురము తాలూకా వల్లూరిగ్రామవాస్తవ్యుఁడును మా గ్రామమున కేజెనిమిది మైళ్ళ దూరమువాఁడు నగు

వల్లూరి నరసింహకవి తన నాగ్నజితీపరిణయములో నిట్లు వ్రాసెను.

గీ. అమ్మ రాణ్మంత్రి విఖ్యాతినలరి కాజ
సీమలోని యుల్లంపట్టు సిరిదలిర్ప
వంగురీ మల్లమంత్రిచే వ్రాసియొసఁగఁ
గైకొనియె వేడ్క నేకభోగపుమిరాసి ॥

చ. వరసుగుణాంబురాశియును వంగురి సూరపరాజు పట్టియై
యురుతరభోగభాగ్య విభవోజ్జ్వలగాఁదగి భద్రకాళి నా
బరగు సతీలలామ కరపల్లవ సంగ్రహణంబుచేసి యు
ర్వరపయి వీరరాఘవుఁడు వన్నియ కెక్కఁ గడింది వేడుకన్.

ఈ చరిత్ర మిదివఱకు మాకుఁ దెలియదు. కవి యీ కాలమువాఁడై యుండనోపును.

---

# ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవి

ఈ కవి గోదావరీమండలము నందలి యమలాపురము వాస్తవ్యుఁడు. ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. హనుమచ్ఛతకము వ్రాసి వాడ్రేవు కృష్ణభూపతి కంకిత మిచ్చెను. కవి కృతిభర్త లిరువురును బంధుగులు. కవి 100 సం॥రముల క్రిందటివాఁడు. క్రీ.శ. 1810 ప్రాంతములవాఁ డన వచ్చును. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## హనుమచ్ఛతకము

సీ. శ్రీమీఱఁ జేయును సిరిబలంబిచ్చును
శర్వాణి వాణీ ప్రసారపటిమ
పలుకుల చెలిగూర్చు పరిపాలనాఢ్యత
పంకజాక్షుఁ డొసంగు బ్రబల జయము
నల సర్వమంగళా లలనాప్రియుఁడు దార్చు
నజుఁడు దీర్ఘాయువు నలవఱుచును
రుచిసహస్రమరీచి యుచితంబుగ నొనర్చుఁ
బుత్రపౌత్ర సమృద్ధిఁ బొసఁగ జూచు
పాకశాసనముఖదివ్య పరికరంబు
కృతికి పతియగు వాడ్రేవు కృష్ణయాఖ్య
విభునకు భవద్దయప్రశస్తి వెలయుగాత
వార్ధిలంఘన సంరంభ వాయుడింభ ॥

సీ. దమయంతి మహితసౌందర్య సమృద్ధిచే
సతియగా పతివ్రతాసరణిచేత
బరమనిష్ఠలను లోపాముద్ర కెనయగు
జాటూక్తి మహిమచే శారదయగు
వైభవంబున విష్ణువల్లభయనఁ జను
శమదమసంపత్తి శచియ యగును
సత్కీర్తిచేతను సావిత్రియై తగు
దతగుణముల నరుంధతీ యార
యనుచు గొనియాడఁదగు బంగరమ్మ భార్య
పుత్రపౌత్రాది సంతాన పూర్తి వెలయఁ
బరగు వాడ్రేవు కృష్ణయ ప్రభుని బ్రోవు
వార్ధిలంఘన సంరంభ వాయుడింభ ॥ 2

సీ. ఘోటీభవచ్చరణాటీక నోచ్చర
త్కోటీరభాఢ్య దిక్కోటికంబు

రోషానలస్ఫూర త్రోపార్భటీరణ
ద్భాషాబ్దనిర్ఘోషకాషకంబు
హుంకారసంకరాహంకారవిస్ఫార
టంకార వికలితాటంకకంబు
చాపాథికోజ్వల దోర్ప్రాప్త హేతి వి
క్షేపాభియాతి స్ఫూర్తాపపంబు
నైన రామానుజోద్ధత యానము నొగి
వీనులను గూర్చి నచ్చి యాతనికి మెచ్చి
సాత్వికుని జేసితివి మైత్రి సరణివనధి
వార్ధిలంఘన సంరంభ వాయుడింభ ॥ 27

సీ. ఇందిరా సుందరీ మందిరుం డాదని
మందరం బందిన చందమునను
నిందు నందును జనమందఱు మదమంద
బిందెకై వడి జిన్న నింగి కేల
మందులకొండ నీ సందిటనిడి రిపు
బృందంబు లందంద సందడినిడ
గ్రందుకయ్యంబున ముందలలనుబట్టి
చిందరవందరఁ జెందఁజేసి
డిందుపడుసేన ప్రాణముల్ పొందుపఱచి
తొందరను రాము నాజ్ఞ నమందగతిని
ముందుకేతిని దాని నీవందయిడితి
వార్ధిలంఘన సంరంభ వాయుడింభ ॥ 79

# వంకాయలపాటి వేంకటకవి

ఇతఁడు గోదావరీమండలములోని కోలంకవాస్తవ్యుఁడు. ఇతఁ డనేక కృతులు వ్రాసెను. అందు మదనగోపాలశతక మొకటి. ఈ శతకము వేణుగోపాలశతకము వంటి నిందాగర్భ కావ్యము. కొన్ని నాటు పదము లున్నవి. కవి రమారమి క్రీ. శ. 1800 ప్రాంతమువాఁ డని వినియున్నాను. శైలి తెలియుటకుఁ గొన్ని పద్యములఁ జూపెదను. ఈతఁ డారువేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు, గౌతమ గోత్రుడు. వెంకయ, కామమాంబల పుత్రుఁడు. గుండు వేంకటరాముని శిష్యుఁడు. పంచాక్షరీసిద్ధి కలవాఁడు. శైవ వైష్ణవ సదాచారనిరతుఁడు.

సీ. దండంబు దోర్దండమండిత కోదండ
దండంబు భూరిపరితాపచండ
దండంబు పాలితాశ్రితస్తుత్య వేదండ
దండంబు మునివరత్రాణశౌండ
దండంబు దండితాహితనిశాచరకాండ
దండంబు వైరిరౌద్రప్రకాండ
దండంబు భక్తసంత్రాణమహోద్దండ
దండంబు బ్రహ్మాండ ఖగపక్షిచండ

దండ మో పాపతిమిరమార్తాండ నీకు
యనుచు మ్రొక్కెద ననుఁ బ్రోవుమయ్య వేగ
భూరిమయవాస! కోలంకిపురనివాస!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. తనవారు తలవంపు బనులు సేయ సహించు
పరులు జేసిన తప్పు పట్టఁజూచు
తన యింటిలోఁ గానిపని కమ్మకో జూచు
పొరిగింటి పని రవ్వ పరుపఁ దలఁచు
తన పుత్రి జారవర్తన మాటుపడఁజేయు
పరుల బిడ్డల రంకు బయలఁబెట్టు
తనదు చెల్లెలి దొంగతనము లోన నడంచు
లాఁతివారైన హేళన మొనర్చు
యిట్టి దుర్మార్గులకు యమపట్టణమున
దీనికి ఫలంబు తథ్యమై గానవచ్చు
భూరిమయవాస! కోలంకపురనివాస!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. కుక్షింభరుని బుధరక్షాపరుండంచు
నతి నికృష్టుని మహాత్యాగి యనుచు
బహుబీజసంభవుఁ బరమపావనుఁ డంచుఁ
జంచలాత్ముని ధైర్యశాలి యంచు
దౌర్జన్యకారిని ధార్మికోత్తము డంచుఁ
గఠినచిత్తుని దయాకరుఁ డటంచు
జారకర్ముని పరదారవర్జితుఁ డంచు
నుత్తమూఢుని శాస్త్రవేత్త యంచుఁ
గవులు కవిత్వ (?) ర్తిచేతను గడుపుకొఱకు
సన్నుతింతురు మదిలో విచారపడక
భూరిమయవాస! కోలంకపురనివాస!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. కొండంత విత్తంబుఁ గూడఁబెట్టిన నేమి
దానహీనుండైన మానవుండు
నిఖిలవిద్యాభ్యాస నిపుణుఁడైనను నేమి
యమిత దుర్గర్వాంధుఁ డైన మనుజుఁ

దురతర సంపత్తు లొదవియుండిన నేమి
దీనరక్షాశూన్యుఁడైన జనుఁడు
బహుకాల మాయువుఁ బడసి యుండిన నేమి
యపకీర్తి భాజనుండైన నరుఁడు
యిట్టివారల గొప్పల నెన్నుచున్న
పురుషునవివేక మెంతని పొగడవచ్చు
భూరిమయవాస! కోలంకపురనివాస!
మదనగోపాల! గాధికాహృదయలోల!

సీ. చతురంగబలసమృద్ధతినిఁ గ్రాలిన నేమి
యాపన్నరక్షసేయని నికృష్టుఁ
డిద్ధరాతలమంత నేలుచుండిన నేమి
బుధులఁ బోషింపని మూర్ఖచిత్తుఁ
డన్యదేశంబులు నాక్రమించిన నేమి
పరిజయార్తి బాపిఁ బ్రోవని ఖలుండు
బిరుదు పెక్కెంబులు పెక్కుపూనిన నేమి
శరణాగతులను బెంచని దురాత్ముఁ
డిట్టివారల సౌభాగ్య మెందుకొఱకు
వీరిఁ గొనియాడఁబో దపస్మారగాని
భూరిమయవాస! కోలంకపురనివాస!
మదనగోపాల! గాధికాహృదయలోల!

సీ. పరజనద్రవ్యాపహారిత్వ మొక్కటి
అన్యసతీసంగమాప్తి యొకటి
పితృమాతృ సద్భక్తి విముఖత్వ మొక్కటి
యాశ్రితజన పరిత్యాగ మొకటి
సాధుసజ్జనబంధు జనదూష్య మొక్కటి
స్వామినిందాపరభావ మొకటి
వివిధపండితవర్గ విద్వేష మొక్కటి
మిత్రఘాతృత్వపరిమేయ మొకటి

యిన్నియును గల్గి వర్తింపుచున్న పోట
కొయ్యల కొకళ్ళు తీర్పులు చెయ్యఁగలరె
భూరిమయవాస! కోలంకపురినివాస!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. పిడికెడు బిచ్చంబుఁ బెట్టఁజాలని దాత
యిష్టార్థసంసిద్ధు లివ్వఁగలఁడె
చేని గట్టే దాటలేని గుఱ్ఱము వైరి
గిరిదుర్గములను లంఘించఁగలఁడె
యూరఁబందికి భీతి నొంది పారిన బంటు
దాడి బెబ్బులుల వేఁటాడఁగలఁడె
కొలుచువారికి జీతములు నొసంగని దొర
యర్థులఁ బిలచి వెయ్యారు లిడునె
బట్టుఁ బొగడిని నొకపూట బత్తెమిడని
యతి నికృష్టుఁడు సత్కృతు లందఁగలఁడె
భూరిమయవాస! కోలంకపురినివాస!
మదనగోపాల! రాధికాహృదయలోల!

ఈ శతకము పుట్టుక పిఠాపుర పరిసరముల నని చెప్పనఁ జాలును.

---

## జూలూరి అప్పయ్య

ఈతఁడు "వేణుగోపాల ప్రసాదాసాదిత శ్రీమధ్వశాస్త్రసంపన్నుఁడు." బ్రౌనుదొరగారి కాలమునందు వారి కడ నాంధ్రపండితుఁడుగా నుండి, వారి యాజ్ఞానుసార మనే

కాంధ్రగ్రంథములకు వ్యాఖ్యలు వ్రాయుటయే గాక వారి భాషాపరిశ్రమమునందుఁ జేదోడు వాదోడుగా నుండిన గొప్ప పండితుఁడు. క్రీ. శ. 1810 ప్రాంతమువాఁడు.

ఇతని గ్రంథములను విమర్శించుచు నిట్లు వ్రాసియున్నారు.

"మహారాజశ్రీ జూలూరు అప్పయపంతులుగారిచే రచియింపఁబడిన శ్రీనివాస తారావళి, రామపంచాశత్కందములు, యదువంశభూషణశతకము నీ మూఁడుగ్రంథములు * * * చేకొంటిమి. కరకంకణన్యాయముగ రాజశ్రీ బ్రౌనుదొరగారివలన పండితులుగారు విశేషఖ్యాతిని వహించిరి. దొరగారికి వీరియందు నతిగౌరవమని వినికి. * * వీరినిగూర్చి యందే (నిఘంటువునందు) గొప్పగ దొరగారు వ్రాసియున్నారు. * * * పై గ్రంథత్రయములో మొదటిగ్రంథము మల్లికార్జున కలువాయి శతకముల శైలిం బోలియున్నది. ద్వితీయగ్రంథము లను ప్రాసాదులం గలిగి శ్రుతిమనోహరమును కదళీపాకమును వహించియున్నది. మూఁడవశతకము ధారాళసరళిని వహించి ప్రౌఢమై శతక మూర్ధన్యమై యున్నయది" (చూడుఁడు- అముద్రిత గ్రంథచింతామణి సంపుటి 7 సంచిక 2 పుట 7.)

ఈ మూఁడవశతక మొక్కటే నాకుఁ జిక్కినది. ఇది క్రిందటి దుర్మతిలో ముద్రింపఁబడిన ప్రతి చిక్కినది. అందలి వివరములఁ దెలుపుచున్నాను. ఈతఁడు మాధ్వుఁడు. నిజాముపేట వాస్తవ్యుఁ డగుట వలన నేమో యందలి గోపాలుని స్తుతించెను. ఈతఁడు పాపన్న చెల్లమ్మలకుఁ బుత్రుఁ డని యీ క్రింది పద్యములు శతకాంతమున నున్నవి తెలుపుచున్నవి.

శ్రీలలరంగ సేవశిఖరిణా విహరించి నిజాముపేట గో
పాలుఁ డనంగ భక్తపరిపాలనసేయు మహాత్మ నీకు నే

వేళ శుభంబె కావలయు వేడుక మీరఁగ నా మనంబులో
గేళిఁ జరించు మెల్లపుడు కృష్ణహరీ యదువంశభూషణా ॥ 99

ఉన్నతిమీర జూలురి కులోదధి పూర్ణసుధాంశుఁడైన పా
పన్నకు సాధ్వి చెల్లమకు నంచితపుత్రుఁడ నప్పగారాఖ్యుఁడన్
గ్రన్నన మీకు నర్పణముగా శతకం బిది జెప్పఁ నాడ నిం
కెన్నిక కెక్కఁజేయఁదగు కృష్ణ హరీ యదువంశభూషణా ॥ 100

శతకమధ్యమునుండి మఱికొన్ని పద్యములు శైలి తెలియుటకుఁ జూపెదను.

## యదువంశభూషణ శతకము

శ్రీకర యోగిమానసవశీకర కంసముఖాసురేంద్ర హృ
ద్భీకర చంద్రశేఖర విధిస్వరధీశ్వర వంద్యరత్న నా
మీకర భూషణాకర సమిద్ధకృపాకర కాళియాఖ్యద
ర్పీకర గర్వనాశకర కృష్ణహరీ యదువంశభూషణా ॥ 1

మీ చరణారవిందముల నీఁద దలంపిడు బుద్ధి తోఁచనే
తోఁచదు తోఁచెనా మెఱుఁగుదోఁచి యడంగిన భంగి నంతలో
నే చపలత్వమొందు నిది నిక్కము నా దగు కర్మ మెట్టిదో
ఖేచరలోకపాలనుత కృష్ణహరీ యదువంశభూషణా ॥ 10

కెంపులబావులీ లురులకింపఁగు మౌక్తికహారవల్లరుల్
దుంపెసలార ముంగురులు దూగఁ గుచద్వయము౯ నటింప నిన్
సొంపుగ నూఁచి పాడు వ్రజసుందరులం గని నవ్వునాఁడు వీ
క్షింపఁగనైతి నీ సొబగు కృష్ణహరీ! యదువంశభూషణా! ॥ 38

మన్ను దినంగఁ బాడియె కుమార మృషావచనుండుగాని నీ
యన్నయె చెప్పె నన్న తగదమ్మ తదుక్తులఁ నమ్మ మోము నీ
కన్నులఁ జూడవమ్మ యని క్రన్ననఁ దల్లికి ముజ్జగంబు లీ
వెన్నిక మీరఁ జూపితవు కృష్ణహరీ! యదువంశభూషణా! ॥ 42

ఇలఁ గల రాజవర్యులకు సేయఁగరాక విహాయసంబున
న్నిలసిలు మత్స్యయంత్రము భువిం బడ నేసియు మద్రకన్యకన్
సలలితభవ్యలక్షణ విచక్షణ లక్షణ శత్రుకోటులం
గెలిచి పరిగ్రహించితవు కృష్ణహరీ! యదువంశభూషణా ॥ 80

---

# తరిగొండ వెంకమ్మ

సకలతత్త్వార్థవివేకిని యగు నీమె యనేక గ్రంథములు వ్రాసి తరికొండ నృసింహస్వామికిని వేంకటేశ్వరస్వామికి నంకితము చేసెను. తరిగొండ కడపమండలములోని వాయిల్పాడునకు నాలుగుమైళ్లదూరమున నున్నది. రాజయోగసార మను ద్విపదకావ్యమును, వేంకటాచలమాహాత్మ్య మను పద్యకావ్యమును, భాగవతము ద్వాదశస్కంధములు ద్విపద కావ్యముగను, శివవిలాసమును నీమె రచియించెను. శివవిలాసము క్రొత్తఁగా దొరకినది. (చూడుడు – పుట 379 సం. 5. సం. 10, 11, 12 ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక) ఈమె నందవరీక నియోగి బ్రాహ్మణ వనిత. వసిష్ఠగోత్రపవిత్రుఁ డగు కృష్ణయామాత్యుని పుత్రిక. ఈమె బాలవితంతు వని కవులచరిత్ర మనుచున్నది. భక్తివేదాంతములయం దపరిమితాసక్తి కలది. ఈమె క్రీ.శ. 1840 లో జీవించి యున్నట్లు బ్రౌనుదొరగారు నిఘంటువు పీఠికలో వ్రాసిరి. ఈమెకు భగవంతుఁడు ప్రత్యక్షు

మగుచుండినట్లును, అతిమానుష చర్యలుగల దైనట్లును గథలు కలవు. ఈమె వ్రాసిన కృష్ణమంజరినుండి శైలి చూపెదను.

మంజరి :— కనకరత్నప్రభాకలితమైనట్టి
సురుచిరమకుటంబుఁ జూపవే కృష్ణా ॥ 3
గంగాతరంగ సంగతవామపాద
భాసురాంగుష్ట మేర్పడఁజూపు కృష్ణ ॥ 3
తామసరాజసద్వయములోఁ జిక్కి
కోపతాపములకు కుదురైతి కృష్ణ ॥ 60
రహిమీర కపికిశోరన్యాయమాత్ర
మైన స్వశక్తి నాయెద లేదు కృష్ణ ॥ 85
కుదురైన సుగుణదుర్గుణసామ్యస్వ
భావ మెప్పటికిఁ దప్పకచూపు కృష్ణ ॥ 115

ఇట్లే 137 ద్విపదలు గలవు. ఇది ద్విపదశతకమన వచ్చును. అనేకులు స్త్రీలు గణయతిప్రాసనియమములు లేకుండ వ్రాసిన శతకములు కొన్ని చిక్కుచున్నవి. సజీవులగు స్త్రీ లిప్పు డనేక శతకములు పద్య కావ్యములును వ్రాసినవా రున్నారు. ఉత్సాహవృత్తములు, పాటల వృత్తములు గల శతకములు కొన్ని పురుషులు వ్రాసినవి కూడఁ గనఁబడు చున్నవి.

# మాత్తూరి అప్పావు మొదలి

కవులచరిత్రమువలన శుద్ధద్రావిడుఁడగు త్యాగరాజ మొదలి మిక్కిలి సమర్థతతో వ్రాసిన సుబ్రహ్మణ్యవిజయాది గ్రంథములను గూర్చి మనము వినియున్నాము. అన్యదేశమువాఁడగు కవి మన భాష నభ్యసించి యంత మాతృభాషగాఁ గల మనకంటె మనోహరముగ వ్రాయఁగలశక్తి నార్జించుట సామాన్యవిషయము కాదు. తెలుఁగుభాష తేనెల తేరలవంటి మధురభాష యగుటచేతనే ద్రావిడులు, కర్ణాటకులు, మహారాష్ట్రులును గూడ మనభాషలోఁ గావ్యములు వ్రాసినట్లును మన కావ్యముల భాషాంతరీకరించుకొనుచున్నట్లును దెలిసికొనఁగలము. మనభాష యన్యులకు సులభముగఁ బట్టుపడును. మహారాష్ట్రుఁడగు చిదంబరకవి కూడఁ దన యంగదరాయబారము కావ్యమునందు మనభాష మాధుర్యమే తా నీ భాషలోఁ గావ్యము వ్రాయుటకుఁ గారణమని వ్రాసె నని వింటిమి. ఇందువలన మనభాష యభ్యసించుట పరులకు సులభసాధ్యమని తేటబడుచున్నది. అనేక భాష లభ్యసించిన మనవారు చెన్నపురిలోఁ జిరకాలముండియుఁ గూడ నఱవమును వ్రాయలేకయున్నారు. ప్రస్తుతాంశ మగు మన యప్పావుమొదలి మనకందఱకుఁ బ్రీతికరమైన ''మాతృశతకము'' నతి రసవంతముగ వ్రాసియున్నాఁడు. ఈ కవి శతకమునందీ క్రిందివివరములఁ జెప్పుకొనెను.

ఉ. శ్రీవెలయంగ లోకమి దిది చిత్రమటంచు మదిం దలంప న
ప్పావనిభక్తితో జననిపైఁ గల ప్రేమ దురంగలించి రాఁ
గా వగమీర మాతృశతకం బొనగూరిచెఁ గానఁ జూచినం
బూవిలుకానిఁ గన్న సిరిఁ బోలిన తల్లినిఁ బోల రెవ్వరున్. 100

ఈతఁడు కన్నెలు పసివయస్సునుండియు బిడ్డలఁ గన వలె నను దైవనియమిత మగు కోరికకు (instinct) పాలగుదు రని శిశువులుగానున్న రెండుమూఁడేండ్ల బాలికల వయస్సు నుండి వారి కుండు తల్లిభావమును వ్రాయ నారంభించి క్రమముగా బాలిక పెద్దదై భర్తనుచేరి బిడ్డలకై వ్రతము లాచరించి, గర్భిణియై కష్టములఁబడి, కని, పెంచి, పెద్దవానినిఁ జేసి మనుమల నెత్తువఱకు నుండు మాతృమూర్తి మహా ప్రేమమును ద్రాక్షేక్షురసములఁ జిలుకు పద్యములతోను, ప్రేమమూర్తి యగు మాతృదేవత నిశ్చలస్వరూపము భావ గోచర మగు మేధాశక్తితోడను వ్రాసియున్నాఁడు. సృష్టికిఁ గారణ మగు స్త్రీ జాతి మాతృత్వమును గోరు కోరిక (instinct) యెంత స్వభావసిద్ధ మైన దని జీవశాస్త్రకారులు మనకు బోధించినను, మనసార మాతృదేవతను బూజింపఁ గలిగిన సృష్టి, తల్లికిని బిడ్డకును గల సంబంధము 'టెస్టు ట్యూబు' వలనఁ పరీక్షింపఁదగిన దని (ప్రకృతియే) యంగీకరింపదు. "అమ్మ" అను పదము నందలి మాధుర్యము బహుశః, అభావముగలవారి కెక్కువ తెలియునా? ఆవు దూడ కూడ "అంబా" యని బిలువఁగలదు. క్రిమికీటకాదుల యందుఁ గూడ మాతృప్రేమము ద్యోతక మగును. తల్లి

సాధువుగా నుండునది యైనను, బిడ్డయందలి ప్రేమకొఱకు ప్రాణములు తృణప్రాయముగ నిచ్చివేయును. పరమసాధు వగు గోవు, బడితెచూపిన పారిపోవు పంది, అతి విశ్వాసము గల కుక్క, మనుష్యునిఁ జేరని కోడి, యివి యెల్లప్పుడును మనుష్యునికి భయపడునవి, పిరికి స్వభావముగలిగి ప్రాణ రక్షణమునకుఁ బారిపోవు స్వభావ మెచ్చుగఁ గలవికూడఁ బిల్లలఁ గన్న యప్పుడు ప్రాణములకుఁ దెగించి యెదుర్కొనును. ఈనిన పులి భయంకర మను సామెత మన మెఱుఁగనిదికాదు. కావున సంతానముకొఱకుఁ బిరికిజాతి జంతువులు కూడఁ బ్రాణము లర్పించు నను భావమే ముఖ్యమైనది. ఇచ్చట నా యనుభవములో నున్న యొక కథ వ్రాయవలసియుండెఁ గాని మాతృప్రేమము — బిడ్డలఁ గను కోరికలో స్త్రీల కుండు సహజ వాంఛ — ఋజువుచేయవలసినభాగము నాపై వేసి కొన నగత్యము లేదని శతక పద్యములే కొన్ని చూపెదను.

చ. చిరుతతనంబునన్ జెలులఁజేరి విహారము సల్పువేళ నా
దరమునఁ గొయ్యబొమ్మను ముదంబునఁ బుత్త్రినిగాఁ దలంచి తాఁ
బరవశమొంది వేడుక నెపం బిడి లాలనఁ జేసి మిక్కిలిన్
మురిపముఁ గాంచి మోహమున నూల్కొను తల్లినిఁ బోల రెవ్వరున్. 3

ఉ. బాలలఁ గూడి బొమ్మ నొడిపైఁ గడు ప్రేమ చెలంగ నిల్పి తా
నోలలఁ బాడుచున్ బొదలి యుగ్గిడి కేలను మేను దువ్వుచోఁ
జాలమనంబుతో నిటుల చక్కనిపట్టినిఁ గాన నెప్పుడో
కాలమటంచు నెంచు మదిఁగల్గిన తల్లినిఁ బోల రెవ్వరున్ ॥ 4

చ. తనయుని మీఁది బాళి మదిఁ దాఁకినచో నుపవాస మీశ్వరా
ర్చనమును నోము లాది యగు సత్క్రియ లెల్లను జేయుచో నెదం
బెనఁగిన ప్రేమమై నొగిఁ దపింపఁగ నోర్చుచు సౌఖ్యమేమి నె
మ్మనమున నాసపాల్పడని మానినిఁ దల్లిని ॥ 9

చ. ఇలఁ బెరవారి నందనుల నెత్తుచు ముద్దిడుచోఁ బెనంగి య
న్నులఁగని బిడ్డలెన్నటికి నో కననోఁతు నటంచు బల్కి లే
మొలక మెఱుంగు నవ్వులకు మోదముఁ జెందుచు నిష్టదైవమున్
దలఁచుచుఁ బుత్రవాంఛమతిఁ దాకిన తల్లిని ॥ 12

చ. నెల నిలిచెంగదా యనుచు నీరజపాణులు వల్కినంతలో
పల నిధిగన్నయట్లుదరభాగములోపలఁ బిండ ముష్ణమున్
దొలఁగెడు రీతి భోజనవిధుల్ మఱిఁ గోరుచుఁ బుత్రమోహమ
త్యురుతరభంగిఁ గొల్పు వగ నుండెడు తల్లిని బోల రెవ్వరున్ ॥ 17

ఉ. మాసము లెల్లఁ బూర్ణమయి మానవతీమణి గర్భవేద నా
యాసముతోడ నుండుతరి సంగన పుత్రునిఁ గాంచె నన్నఁ దా
నా సడి విన్నమాత్రమున నా వచనం బమృతప్రవాహ ధా
రాసమ్మైనచో మనము రంజిలు తల్లిని బోల రెవ్వరున్. 21

చ. విసుగుచు బిడ్డనుం గనిన వేదనఁ గుందుచునున్న యప్పు డా
నిసువును దెచ్చి పొత్తులను నించినచోఁ దన కష్టరీతులన్
మసలక తత్సుతావన విమర్శ ఘనంబుగఁ జిందు ద్రొక్కఁ దా
మనమునఁ బ్రోచు నేర్పుగల మానినిఁ దల్లినిఁ బోల రెవ్వరున్. 24

చ. తన పొరుగిండ్ల భామినులు తారసిలంగను దృష్టితాఁకునో
యని మహిరాదిక గ్రహచయాభినుతు ల్పచరించి మానలో
చనను దలంచి నందనుని సంగతిఁ బాయక ప్రోవవమ్మ యో
జనని యటంచు నంజలులు సల్పెడు తల్లిని బోల రెవ్వరున్. 30

చ. మన మతి ప్రీతినొంద నొక మంచి ముహూర్తముఁ జూచినంత దా
ననుపమరంగ రంగలరు నన్నము ముట్టఁగఁ జేసి బిడ్డఁ డిం

పెనయఁగ నాఁకటంబొదలి యెన్నఁడు బువ్వఁదినంగ నేర్చునో
యని మది నూహ పొల్పడెడి యంగనఁ దల్లిని బోల రెవ్వరున్. 35

చ. తనయుని కొంటెచేఁతలకుఁ దండ్రి యహో బెదరించుచున్న తే
దనుచు నిజాత్మనాయకుని యాజ్ఞ దొలంగఁగ రాదటన్న వా
గ్ధన మటుడించి నందనుని దండన పొల్పడనీక యడ్డముం
జని కరుణింపఁజేయు నెరజాణను దల్లిని బోల రెవ్వరున్. 60

చ. వెడవెడ నింక భోజనపువేళ గతించిన బిడ్డఁ డేమొకో
బడి విడి రాఁడు నేఁడనుచుఁ బాతరలాడుచు నుండు నంత లో
గడఁ జనుదేర నెత్తుకొని కౌఁగిటఁ జేరిచి చుంచు దువ్వి మై
బడలిక దీర సంతసిలు భామినిఁ దల్లిని || 65

ఉ. శ్రీలలరారు సంతత సుశీలుఁడు భూతదయాపరుండు వా
చాలుఁ డనన్యచారు జలజాతముఖీహృదయానుకూలుఁ డీ
బాలకు డంచు సజ్జనులు పల్కనఁ దద్వచనంబు వీనులం
గ్రోలుచు సంతసిల్లు సుమకోమలిఁ దల్లిని || 78

చ. కొడుకును గోడ లొంటిపడి కొంకుచు సైగలు పేరజంపు టా
గడములు వింతవింత నెఱగారవముల్ గిలిగింతలాడు మే
ల్నడి సడిసన్నలుం గుసగుసల్ జరిగించుటఁ జూచి యాత్మలోఁ
బుడమి సమస్త మేలుగతిఁ బొంగెడు తల్లిని || 85

ఉ. కోడలు గర్భమూట తనకు న్మదిఁ గోఁచిన యంతఁ బ్రేమ గొం
డాడ సుపుత్రినిం బడయునట్లు ఘటింపు మటంచు శూలి పూ
బోడిని మందగామినినిఁ బుష్పసుగంధిని మీనలోచనన్
వేడుకమీర వేడు నలివేణినిఁ దల్లిని || 93

(1) "వేంకటేశ్వరునకు మీదుకట్టుట (87)"
(2) "మధుర మీనాక్షికి మ్రొక్కుట" "శూలిని బ్రార్థించుట" కూడ వ్రాసిన యీతఁడు శివకేశవభేదము లేనివాఁ

డనవచ్చును. మధుర మీనాక్షిని బలుమారులు పేర్కొనుట నీతఁడు మధురప్రాంతములవాఁడని కొందఱనిరి. ఈ శతకమును ముద్రించిన యీకవి పుత్త్రుఁడగు మీనాక్షిదాసు క్రీ॥ శ॥ 1861 న నుండెను గావున నీకవి 19 వ శతాబ్దాదినున్న వాఁ డనవచ్చును. ఈ శతక మేఁబదెనిమిదిసంవత్సరములకుఁ బూర్వము రచియింపఁబడె ననవచ్చును.

కాని క్రీ॥ శ॥ 1840 నాఁటికే తాటియాకుల కెక్కి బ్రౌనుదొరగారిచేఁ బ్రతి వ్రాయింపఁబడిన మఱియొక మాతృశతక మిదే మకుటముతోఁ గనఁబడుచున్నది. అందలి వివరములఁ దెలుపు పద్యములఁ గొన్ని చూపెదను.

"కలిత మహత్త్వబుద్ధి శతకంబులు చెప్పిన యట్టివారినిం
దెలియఁగ దేవతాంకితము తెల్లము జేయుదు రెందు వేదముం
దలఁపఁగఁ దల్లియే పరమదైవము గావున జేసితిట్లు పెం
పలరఁగ మాతృదేవ శతకాఖ్యము తల్లినిఁ బోల రెవ్వరున్ ॥ 2

వినుతికి నెక్కు నీలగిరి, వేంకట, మంగళ, భద్రి, సింహ, శో
భనగిరులందు నిద్దరును బాయక భక్తి వసించునట్లుగా
ననయము వేడ్క "కోటగిరి"యందుల నిల్చి "తదన్వయంబు" పెం
పెనయగ బ్రోచు దాశరథి తల్లిని ॥ 3

పరమత నాగపంచముఖ భక్తసురద్రుమ మర్థవిస్ఫుర
ద్వ్యరుతర తత్త్వ బోధ పరిశోధను "వైష్ణవసార్వభౌము" నా
గురుమది గంటి జగ్గురు కూర్మితనూభవు రంగపాగ్రణిన్
స్థిరమతిఁ గొల్తు నిష్టఫలసిద్ధికిఁ దల్లిని ॥ 4

పై పద్యములవలనఁ గవి మదిగంటి రంగప్ప శిష్యుఁడని, కోటగిరి వాస్తవ్యుఁడని, కోటగిరి యను గృహనామము వాఁడని వైష్ణవశిష్యుఁడని తెలియుచున్నది. మఱి రెండు పద్యములలోఁ దన "పెదతండ్రి కోవ్యముల ధనుంజయుఁడని, దానకర్ణుఁడగు సదాశివయ్య (5) యని, తండ్రి రాజపూజితుఁడగు గోపవసుధాధిపుఁ (6) డని" తెలియఁజేసియున్నాఁడు. కవిపేరు తెలియలేదు కాని కోటగిరి గోపరాజు పుత్రుఁ డని తెలియుచున్నది. శైలికి రెండుపద్యములఁ జూపెదను.

నమ్మికగా సమస్తభువనావన దక్షతనాఢ్యులైన యా
యమ్మల ముప్పురొక్క దయ నందరుగా మను నాదు తల్లి లిం
గమ్మ పదాంబుజంబుల సహాయతఁ, జెప్పెద పూని సత్యవా
క్యమ్ములు గల్గు మాతృశతకం బిది తల్లిని ‖ 7

అదను నెఱింగి పాల్గుడిపి యర్భకు నాఁకలిఁ బాపి పక్కలోఁ
జెదరకయుండఁ గౌఁగిటను జేర్చి ముదంబున జోలఁ బాడుచు
న్నిదురను బుచ్చినట్టి సుఖనిర్ణయ మేమని చెప్పుదింక నా
పాదిగిలి వజ్రపంజరము పోల్పఁగఁ దల్లినిఁ బోల రెవ్వరున్ ‖ 30

ఈ రెండుశతకములలోఁ గడపటిదే ముందు వ్రాసిన ట్లూహింప నవకాశ మించుక యున్నను, అప్పావుమొదలి శతకమే కొన్నివిషయములలో మేలుగా నున్నది. దాక్షిణాత్యుఁడు, శుద్ధద్రావిడియు నగు కవి తెలుఁగుకవి కంటె బాగుగ వ్రాయలేనిమాట వాస్తవ మైనను గొన్ని భావములు మృదువుగా నున్నవి. కోటగిరివారు వెలమవా

రున్నారు. తండ్రిని "వసుధాధిపుఁడు" అనినాఁడు. కావున నీ శతకకర్త పద్మనాయకుఁడు కావచ్చును. ఇదివఱకొక్క మాతృశతకమునకే మురియుచున్న మన కీ రసవంత మగు రెండవశతకము సంతోషము నినుమడింపఁజేయును. బాలుకు బాలికలును జదివి హృదయము నార్ద్రింపఁ జేసికొనవలసిన యీ శతకద్వయము నాంధ్రులు ప్రతియింటఁ జదివి నానంద వార్ధి నోలలాడుదురుగాక! స్త్రీలో నున్న మాతృత్వ వాంఛ కంటెఁ బూజనీయ మైన సద్గుణము - స్వభావసిద్ధ మైన నైజము - మఱియొకటి యున్నదా? "అమ్మా!" యని పిలువఁగలవా రందఱు నీ శతక ద్వయమును జదివి శతకమునందలి పంచరత్నము లైనను వాక్కున నెల్లప్పుడు నలంకరించుకొందురుగాక! ధన్యు లగుదురుగాక!

— — ——

# పారనంది సర్వేశ్వర శాస్త్రి



ఈతఁ డీ బ్రహ్మపురి వేంకటేశ్వర శతకము నొక్క వాసరములోఁ జెప్పఁగలిగితి నని వ్రాసెను. ఆత్మసూరి భామన, ఆదినారాయణశెట్టి, వేంకటరంగములకు శతకాంతమున నాశీర్వాదము లున్నవి. బాలకులకు, భక్తులకు నీ శతక ముద్దేశించి కవి వ్రాసెను. ఇందలి బ్రహ్మపుర మెచ్చట నున్నది

తెలియదు. కవిత్వము లలితముగ నున్నది. ఈ కవి క్రీ. శ. 1840 కి బూర్వుఁడై యుండవచ్చును. శైలికిఁ బద్యములు చూపెదను.

బ్రహ్మపురి వేంకటేశ్వర శతకము

క. శ్రీయఃప్రాప్తికి సాధన
మాయుర్వర్ధనము నీపదార్చన వరకా
శ్రేయకరానాప్యయపరా
పాయహరా! వేంకటేశ బ్రహ్మపురీశా! ॥ 14

క. ఏ పాదము లోకత్రయి
వ్యాపించియు సుతలమందు బలిదనుజేంద్రుం
బ్రాపించెఁ దత్పదంబే
పాపపగు శ్రీవేంకటేశ బ్రహ్మపురీశా! ॥ 31

క. కౌమోదకి నందకముల
నామోదముతోడఁ దాల్చి యరినికరంబున్
వే మాయింపవె నతను
త్రామా! శ్రీవేంకటేశ బ్రహ్మపురీశా! ॥ 50

క. నయమున నాదాయములో
వ్యయమును దశమాంశఁ జేసి వసుమతిలో స
ద్వ్యయి సుఖమును యశమునుగను
రయమున శ్రీవేంకటేశ! బ్రహ్మపురీశా! 65

క. నీచులతో సాంగత్యము
తాచుఁజుటోఁ జెలుపులాట తగదని మది నా
లోచింపవలయుఁ బాలిత
వాచస్పతి! వేంకటేశ! బ్రహ్మపురీశా! 72

# బహుజనపల్లి సీతారామాచారి



ఇతఁడు సుందరరాజశతకము, వినాయకశతకమును గూడ వ్రాసెను. గొప్పపండితుఁడు. శబ్దరత్నాకర మను నిఘంటుకర్త. ఈ శతకము క్రీ॥శ॥ 1847 లో వ్రాసెను. ఇతడు "నాగపట్టణ" పురవాసి. "అంబర, శైల, శిఖరి, ధరణులు" తో నిది వ్రాసెను. ఇతఁడు నామమువలననే వైష్ణవుఁ డని తెలియఁగలదు. ఈతఁడు తెలుఁగుభాష కూపిరివోసిన మహాత్ము లలో నొకఁడు. తన పాండిత్యమును దేశజుల కొఱ కుపయోగించిన పండితులలోఁ జిన్నయసూరికిఁ బిమ్మట దాక్షిణాత్యు లలో నీతఁడు గణనీయుఁడు.

## (1) సుందరరాజ శతకము

క. మలయజశిశిరతనురుచిర
జలరుహాదళ సదృశనయన జలనిధిశయనా
కలరవకలిత కటకయుగ
సులలిత మృదుపదపయోజ సుందరరాజా! 67

క. అగణిత చరితగదాగ్రజ
జగధీశ జగన్నిదాన శాంతాకారా
ఖగరాజఘనస్యందన
నగధర హరితేజ నాగనగరీరాజా! 80

క. హరశూల నామశరదా
శరదాసితగాత్ర భక్తజనహితవరదా

వరదామరుచిరసురదా
సురదాస్యమహిత సురాజ సుందరరాజా॥ 88

క. శూర పరవారహార నర
నారాయణ యాదిదేవనాథ యవనిజా
జార, మహాపాతకహిమ
సూర యశోదాతనూజ సుందరరాజా. 97

క. దోషము లున్నను నీకృతి
దోషజ్ఞతవానిఁ దలఁచి త్రోవకమతి ని
ర్దోషత్వ మెన్ని చేకొను
శోషితసాగర సుతేజ సుందరరాజా. 98

## (2) వినాయక శతకము

క. తల్లులు పరిగొన భక్తుల
కుల్లాసము పుట్టఁజేసి యురుమదధారల్
వెల్లిగొన సొంపునూనెడు
బల్లిదు నినుఁ గొల్తునయ్య భవు వెనకయ్యా! 11

క. వంకరతొండము చేటల
పొంకముగల చెవులు పెద్దపొట్టయుఁ దగ ని
ర్వంకల వందులు వొగడఁగ
బింకముతోఁ దాల్తువయ్య పే ర్వెనుకయ్యా! 23

క. పిరియ మెద్దియొ నీ కతి చిం
తయొనర్చుచుఁ బేరిమ నీవెదక దేమొకొ చిం
తయు వెదకనేల యిప్పని
కయి వృథా నా నెయ్యమీవక వెనకయ్యా. 96

క. పలుఁదెరఁగుల మెఱు లిడినను
బలుకఁగనే నోరు దెరవఁ బ్రాల్మాలెద వీ

యలసత గనియొకో నిను నే
యెలనాగయుఁ గోరదయ్య యెద వెనకయ్యా! 81

క. తెలిసియొ తెలియకయో నే
సలిపిన నేరములు దలఁచి శిక్షపెట్టరు నీ
సలలిత కారుణ్యపుఁ జూ
పులు నాపైఁ బఱపుమయ్య పొరి వెనకయ్యా! 94

---

# శాంతానందయోగి

ఇతఁడు శాంతానందయోగిరామశతకము వ్రాసెను. వేదాంత బోధకము. వేమనశతక జాతిలోనిది. కవి వివరము లేమియుఁ దెలియవు. శైలికిఁ గొన్ని పద్యములు చూపెదను. ఇతఁడు 1850 ప్రాంతమువాఁడై యుండవచ్చును.

## శాంతానందయోగిరామ శతకము

క. తుచ్ఛసుఖంబున కొడఁబడి
హెచ్చుగ నీ దివ్యమహిమ యెఱుఁగక భూమిన్
చిచ్చునఁబడు మిడుతలవలెఁ
జచ్చిన నరులెంద ఱవని సద్గురురామా!

క. అజ్ఞానములను నెఱపుచు
ప్రజ్ఞలు బలుకుచును మట్టిపడియెడిదాకా
యజ్ఞానులతో స్నేహము
సుజ్ఞానుల కేల నిలను శుభకరరామా! 40

క. వనితలచే శృంగారము
వనితలచేఁ గలుగుకీర్తి వంశంబునకున్
వనితలచే నపవాదము
వనితలచేఁ జెడును తెలివి వసుధనురామా! 5

క. పురుషు సుషుప్తినిఁ జేసియు
బరపురుషుని సన్నఁ జేసి బడకకు రాదీ
సి రమించి సుఖముఁబొందెడి
తరుణుల నమ్మంగదగునె దశరథరామా! 62

క. కాటేరి పంపకంబని
కూటంబులుఁగూడి మిగుల గుసగుసయనుచున్
గోటున కెత్తేఁగించెదమని
మోటులు తమ యాప్తజనని మొరుగరె రామా! 73

క. వెన్నెల కందమ పున్నమ
కన్నుల కందంబుఁ జూపు కనుటయు మిగులన్
కన్నెల కందము సుగుణము
వెన్నుల కందంబె జొన్న వేడుక రామా! 86

---

# ఫక్కి వేంకటనరసయ్య

చిన్నతనమునందు బాలికలకుఁ గఱపు కుమారీశతక మను చిన్నపద్యముల శతకము నీతఁడు రచియించెను. తేట తెలుఁగుమాటలతో లోకోత్తరమైన నీతులఁ గఱపి బాలికలకు మంచి యుపకార మొనరించినాఁడు. విశాఖపట్టణము

నందలి క్రైస్తవపాఠశాలయందుఁ దెలుఁగుపండితుఁడుగా నుండెడివాఁడు. క్రీ. శ. 1836 లో నీతఁడు శకుంతలాపరిణి యమును రచియించెను. ఇతఁ డెనుబదివత్సరముల క్రిందటి వాఁ డైనను కుమారీశతకమువలన నీతఁడు సుమతిశతకాది పూర్వకవులవలెఁ గీర్తిని గడించియున్నాఁడు. ఆధునికవాఙ్మ యమునం దింత వ్యాప్తినొందిన మంచి గ్రంథ మింకొకటి చూపుట కష్టము. ఇతఁడు అమరపదకల్పద్రుమము, నారా యణస్తవము, మదనసాయకాపరిణయము, కవిదర్పణచ్ఛం దము, నారాయణశతకము నను గ్రంథముల కూడ రచియిం చినట్లు కవుల చరిత్ర చెప్పుచున్నది. కుమారీశతకమునుండి కొన్ని పద్యము లుదాహరించెదను.

క. జపములు గంగాయాత్రలు
దపములు నోములును దానధర్మంబులు పు
ణ్యపురాణము పతిభక్తికి
నుపమింపను సాటిరాక యుండు కుమారీ.

క. అమ్మకు రెం డబ్బకు రెం
డిమ్మహిఁదిట్టించు కూతు రెందుకు ధర నా
దిమ్మరి పుట్టకపోయిన
నిమ్మళమని యండ్రు జనులు నిజము కుమారీ.

క. నడకలలో నడుగుల చ
ప్పుడు వినఁబడకుండవలయు భువిగుంటలు
కన్పడరాదు మడమనొక్కులఁ
బడఁతుల మర్యాద లెఱిఁగి బ్రతుకు కుమారీ.

క. పనిసేయునపుడు దాసీ
వనితవిధంబునను మేను వంపగఁవలయున్
ధనవంతుల సుతయైనను
ఘనతగలుగు దానివలనఁ గాదె కుమారీ.

ఈ శతకము నే నిప్పుడు చదువునప్పుడు నా బాల్యము నందలి మనోహరరంగములు నాకు జ్ఞప్తికివచ్చును. నా సోదరీమణు లీ శతకము చదివినప్పుడు నా కేయభిప్రాయములు కలిగెడివో, యే పుష్పములు పరిమళించెడివో, యే పక్షులు కిచకిచలాడుచు నెగిరెడివో యవి యన్నియు నా యీ పద్యములు చదివినప్పుడు పూర్వజన్మము నందలి రంగములవలె జ్ఞప్తికి వచ్చి నాసోదరి చెప్పు చిన్నకథలు - మింటఁజుక్కలఁ జూచుచు వేసికొను పొడుపుకథలు స్మృతిపథంబున - నొక వింత యైన లోకము - బాలలోకము - కన్పట్టుచుండును.

## కుమారీ శతకము

క. ధర బక్కికులుఁడు వేంకట
నరసింహకవీంద్రుఁ డిట్టి నడతలు ధరపైఁ
దెరవల తెరువు లటంచును
జిరతరసత్కీర్తి వెలయఁ జెప్పెఁ గుమారీ.

క. అత్తపయిన్ మరఁదలిపయి
నత్తిన కోపమున బిడ్డ నేడ్పించుటకై
మొత్తినఁ దనకే కీడగుఁ
జిత్తములో దీనిఁ జింత సేయు కుమారీ. 28

క. బద్ధకము సంజనిద్దుర
వద్దసుమీ దద్దిరంబు వచ్చును దానన్

గద్దింతు రింటివారలు
మొద్దందరు తోఁడివారు ముద్దుకుమారీ. 37

క. నవ్వంగ రాదు పలుమరు
నవ్విన చిరునవ్వుగాని నగరా దెపుడున్
గవ్వల వలె దంతంబులు
జవ్వనఁ గానంగఁ బడెడి జాడఁ గుమారీ.

క. ఎంతటి యాఁకలి గలిగిన
బంతినిఁ గూర్చుండి ముందు భక్షింపకు సా
మంతులు బంధువులును నిను
మంతైనను జెల్లదందు రమ్మ కుమారీ. 62

క. ఇద్దరు గూడుక యొకచో
నొద్దిక మాటాడుచుండ నొదిగి యొదిగి యా
యొద్దికిఁ జనఁగూడదు తన
పెద్దతనం బెల్ల నణఁగఁ బెట్టుఁ గుమారీ. 96

ఈతని వంశమును గూర్చి కవులచరిత్రమునం దిట్లు వ్రాసిరి.

"ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భరద్వాజగోత్రుఁడు. నారాయణ మంత్రి పుత్రుఁడు."

మంత్రిశబ్దమును జూచి శ్రీవీరేశలింగముపంతులు గారు పొరఁబడియుందురు. ఉత్కళదేశజు లగు నీ సృష్టికరణములు గూడ లౌక్యవ్యాపారధురంధరులై కరణములకు బదులుగా సృష్టికరణము లనియు, మంత్రు లనియు వాడుకొనుచున్నారు. వీ రుత్కళదేశస్థు లగు కాయస్థులో, బ్రాహ్మణులే సారఘోకవిప్లవమున మాఱిరో తెలియదుగాని వీరి గోత్ర

నామాదికములు వీ రొకప్పు డుత్కృష్టస్థితి నుండిన బ్రాహ్మణులో, తదంశసంభూతులో యని యనుమానము కలుగుచున్నది. వీరు సృష్టికరణములు. ఈ వంశములో నప్పల నరసయ్య యను మఱియొక కవి కుమారశతకమును క్రీ॥ శ॥ 1860 లో వ్రాసియున్నాఁడు. ఈ సృష్టికరణములలోఁ బెక్కుమంది కవులు కనఁబడుచున్నారు.

---

# మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి

ఈతఁడు మాడుగుల యాస్థానమునఁ గవిగా నుండెను. కృష్ణభూపతి యితని పోషకుఁడు. కృష్ణార్జునచరిత్ర మనెడి ద్వ్యర్థికావ్యమును వ్రాసెను. సీతారామచరిత్ర మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును భీమలింగశతకము నితని యితర కృతులు. కవి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; హారితసగోత్రుఁడు; శరభనపుత్రుఁడు. ఈ కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతముల మృతినొందెను. 19 వ శతాబ్దపు మొదటిభాగ మీతని గ్రంథకరణకాల మన వచ్చును. శైలికి శతకమునందలి కొన్ని పద్యములఁ జూపుచున్నాను. ఇతఁ డుభయభాషలయందును జక్కని పాండితి కలవాఁడు. ఈతఁడు పండితారాధ్యుని శివతత్త్వసారము నెఱిఁగియుండె నని యీపద్యము చెప్పుచున్నది.

క. తత్పురుష బహువ్రీహుల
సత్పురుషులు రామదాస శబ్దార్థమిలన్
దాసీకృత జననీకృత
కౌసల్యా భీమలింగ! కలుషవిభంగ!॥

## మఱికొన్ని పద్యములు.

### భీమలింగ శతకము

క. ధనమబ్బు ఘనమబ్బున్
జనమబ్బును కీర్తియబ్బు సద్గతియబ్బున్
నినుఁగొల్చిన చాపీకృత
కనకాచల! భీమలింగ! కలుషవిభంగ॥

క. చెలువమర రాజసభలన్
బలుకని వరు నోరు బుధులు బాసిన యూరున్
కలిగియు లేని దనంబడు
కలకంధరక్షభీమలింగ! కలుషవిభంగ ॥ 58

క. కాయలు లేని మహీజము
కోయిల లేనట్టి వనము గుడిలేని పురం
బాయిత మోదముఁ జేయవు
కాయజహర భీమలింగ! కలుషవిభంగ॥ 60

క. జీతంబు లేని కొలువును
దాతలు లేనట్టి పురము తమి లేని కవల్
ఖ్యాతిని బొందకయుండును
కౌతుకయుత భీమలింగ! కలుషవిభంగా ॥ 64

క. తొంబదిరెండు పదే డె
న్నంబడు శాలివాహన శకంబుల్ శ్రా

క్లంబగు చైత్రికి నీశత
కంబయ్యెను భీమలింగ! కలుషవిభంగ!॥ 117

క. హారితసగోత్ర పవిత్రుఁడు
శరభేశ్వరమంత్రి యతనిసతి సీతమయా
యిరువురకును దనయుఁడ శం
కరపురహర! భీమలింగ! కలుషవిభంగ!॥ 119

---

# శ్రీ నివాసకవి

త్రిపురసుందరీశతక మను ప్రాఁత యచ్చు గ్రంథ మొకటి తప్పుల తడక చిక్కినది. తెలుఁగులిపిలో ముద్రించిన యీగ్రంథము తెలుఁగువాఁడు చదువ వీలులేని వింతస్థితిలో ముద్రాపకులు ముద్రించిరి. ఇది 1888 సం॥రములో కవిరంజనీముద్రాక్షరశాలయందు ముద్రించిన ప్రతియొకటి, యంతకుఁ బూర్వపు దొకటియుఁ గనఁబడినవి. రెండును చేర్చి చదివినను పద్యము రాదు. అందుఁ గొన్ని పద్యము లిట్లున్నవి.

"కూరిమితోడ నామదిని కోరిన కోర్కె లొసంగు మిప్పుడున్
నారయ బంధుమిత్ర సఖు లాప్తులు నా తలిదండ్రు లందఱున్
నీరునుగాక నాకెవరు మిక్కిలి యెవ్వరులేరు దిక్కు యో
భైరవి! శాంభవీ! పరమపావని! నీ నిజదాసుఁ డేను యో
సారసనేత్రినీ! త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ!॥

పై తప్పులు కొన్ని కవివో కావో? తెలియదు.

"బంగరుబొమ్మ నీకు నతిభక్తుఁడు దాసుఁడు శ్రీనివాసుకుఁ
ముంగల దీవనిచ్చి యతిమోదమునన్ గరుణించినట్లు నీ
వుంగర మిందు నా కొసఁగు మొక్కటి నేఁడడియాలమిమ్మ యో
మంగళదాయి నిన్నిపుడు మన్ననతో నతిభక్తిఁ గొల్తు నో
సంగరకేళినీ! త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ॥

భక్తుఁడును, త్రిపురసుందరీశతకకర్తయు నగు శ్రీనివాసునిఁ బ్రోచినట్లు నన్ను కాపాడు మని శతకపఠకుఁడు ప్రార్థించినట్లు కవి వ్రాసెనో — లేక కవివేఱును, పై పద్యము నందలి శ్రీనివాసుఁ డను భక్తుఁడు వేఱు నని కవి యభిప్రాయమో తెలియదు. కవిపేరుగాని యితరవివరములు గాని తెలియనందున "శ్రీనివాసునిన్" మైయుండునో? అట్లు పాఠము మారినను గవి యాతఁడే యనుటకుఁ బైపద్యమునం దన్వయ మగుట లేదు. కావున శతకకర్తనామ మనుమాన ముతోఁ గూడినది.

న్యాయము లేకపోయె భువినాథుల నీతులు తప్పిపోయె న
న్యాయపుఁ గాలమయ్యె భువనంబుల వింతలు బుట్టుటయ్యె నా
న్యాయము ధర్మదానములు నాఁటికి నేఁటికి తీసిపోయె న
మ్మాయలు నెక్కువయ్యె సురమత్తత భూమిని నిండిపోయె కం
జాయతలోచనీ! త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ॥

శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. ఈ శతకము మిక్కిలి ప్రాచీన మైనదేమో? ఏ వివరములును దెలియవు. కవులు నామములు, గ్రామనామములు గల కొన్నిపద్యములఁ గూడఁ జూపెదను.

## త్రిపుర సుందరీ శతకము.

ఉ. కాళివరప్రసాదకవికాళి సరస్వతి భద్రకాళి కం
కాళి కృపాళి శూలికరకాళి మహోగ్రభయంకరీ జగ
త్కాళి మరాళి శక్తి ధరకాళిని యుజ్జయినీపురీ మహం
కాళినిర్దైన దేవి ననుఁగావుము నిన్నిపు డేను గొల్తు నో
చోళనృపార్చనీ! త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ ॥

ఉ. లోకములోన రాక్షసుల లుంఠము జేసియు ఘోరమౌ మహో
భీకరమైన దేహముల ప్రేగులువారఁగఁ దీసి జందెముల్
జేకొని వేసితీ బిరుదు చిహ్నము లొప్పఁగ సర్వలోకముల్
నేకముగాఁగ నేలిన మహేశ్వరి నిన్నుపు డేను గొల్తు మో
క్షాకరినీవె యో త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ ॥

ఉ. రుద్రుని కెన్నిరూపములొ రూఢిగ నన్నియుఁ దాల్చి నీవు నా
ముద్రవహించి యీశ్వరుని మోహనలీల విలాసలోలవై
భద్రకరంబు సేయుచును పాపములెల్లఁ దొలంగజేసి హై
మాదిరికొమార్తవైన పరమాత్మని నిన్నిపు డేను గొల్తు నో
సద్వ్రతలోలినీ త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ! ॥

ఉ. అంబరవీధినుండి ప్రళయంబుగ నొక్క ముహూర్తమందు వ
ర్షంబుగ స్వర్ణసంఘములు చాలుపుగాఁ గురిపింపఁజేసి లో
కంబులఁ గీర్తిఁజెందియుఁ బ్రికాశినివౌ బెజవాడ కన్కదు
ర్గాంబవు నీవె యాదుగదవమ్మ నిజంబుగ నిన్ను గొల్తు నో
సాంబసదాశివే త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ ॥

ఇట్లే మధురమీనాక్షి, అరుణాచలదేవి, శ్రీకాళ హస్తిజ్ఞానప్రసూనాంబ, కంచికామాక్షి, కాశీవిశాలాక్షి మొదలగు దేవతల వీవే యని యనేకప్రదేశముల నున్న దేవీమూర్తులఁ గొన్ని పద్యములలో వివరించెను.

ఉ. మల్లియతీఁగవంటి నడుమా కమలంబులవంటి కన్నులున్
మొల్లలవంటి పల్వరుస మోహనచంద్రునివంటి మోముతో
నల్లికవంటి పాపజడ యందముతో శివకామవల్లి నా
తల్లివియైన నీదు పదదాస్యము నెప్పుడు సల్పుచుందునో
సల్లలితాంగినీ త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ ॥

ఉ. వ్యాస పరాశరాది నవవ్యాకరణజ్ఞుల రూఢతత్వ సం
భాసుర మౌనియోగివుల పండితచంద్రుల మున్ను కాళికా
దాసుని బ్రోచినట్టులను ధన్యునిఁజేసి తరింపఁజేయ నీ
దాసునిగాఁగ నెంచవలె తత్వవిలాసిని నిన్నెగొల్తు వి
శ్వాసగుణాత్మనీ త్రిపురసుందరి! యాదిపురీనివాసినీ ॥

అంత్యజుఁ గొల్చుట కాలమాయె ననియు, మ్లేచ్ఛులు సంచరించు చున్నారనియు, తాను పరదేశవాసి ననియు, తల్లి దండ్రుల నుండియు, పుత్రపౌత్రులనుండియు వీడితి ననియుఁ గొన్నిపద్యములలోఁ జెప్పెను. "బంగరుబొమ్మ నీకు నతి భక్తుఁడు దాసుఁడు శ్రీనివాసుకుఁ" "న్యాయము లేకపోయె భువినాథుల నీతులు తప్పిపోయె నన్యాయపుఁ గాలమయ్యె" నని శతకాంతమున రెండుపద్యములలోనుఁ జెప్పెను.

---

# రఘునాథమారుతము వేంకటసుబ్బకవి

ఇతఁడు శ్రీసూర్యనారాయణశతకమును రచియించెను. ఇది మయూరకవి వ్రాసి దేహారోగ్యమును బొందె

నని చెప్పి సూర్యశతకము మాదిరి వ్రాయవలె నని కవి వ్రాసెను. శతకాంతమునఁ దన్నుఁ గూర్చి యిట్లు వ్రాసికొని నాఁడు.

పటువాగ్జాలుఁడు, రామరాన్వయుఁడు, శంభద్రామ సూర్యాత్మ వి
స్ఫుటసంభూతుఁడు సూర్యమోఘపదసత్పూజారతుండైన వేం
కట సుబ్బయ్య కవీంద్రుఁ డీ శతకము న్గావించి యుష్మత్కృపన్
జటులారోగ్యముఁ జెందెఁగాన నిది భూచక్రమ్మునన్ నిత్య ప
ర్యటనంబు న్గని యుండుఁ గాత సుచిరంబై నీకృతుల్ చిత్రపకా
శలు కోరింగొని సాఁపెదన్ జగములన్ శ్రీసూర్యనారాయణా! 100

కవి యీ శతకము వ్రాసి తానుఁ గూడ నారోగ్యము నొందెనట. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. ఈతని పద్యములలో ధూర్జటి పోకడలును గనఁబడుచున్నవి — కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతముల వాఁడై యుండును.

శా. ప్రాతఃకాలమునం దెవండయిన సద్భక్తిన్ గృతస్నాతుఁడై
ధ్యాతాంతఃకరణైకనిష్ఠతముఁడై దండప్రణామంబులం
జేతు ల్మోడ్చి నుతు ల్పఠింపుచు మిమున్ సేవించినం జాలదే
సేతుస్నానఫలంబు వేరెగలదా శ్రీసూర్యనారాయణా! 7

శా. బందాకోరులు కొందఱయ్యవనిపైఁ బ్రత్యక్షదైవంబుగా
డెందంబందుఁ దలంపలేక కడు వ్యాధిగ్రస్తులై యుందు రో
మందేహాసురమానభేదనచణా మార్తాండ నీవాఁడ నా
నందబ్రహ్మమయుండ వీ వనెద గానన్ నన్నుఁ బోషింపవే
సిందూరారుణవర్ణబాల్యకిరణా శ్రీసూర్యనారాయణా॥ 8

శా. నీ మంత్రంబు జపించు కుంతి మునివాణి న్మెచ్చి తాఁ గన్యయై
యేమాటన్ సుతుఁ గోరెఁ గోరనటు నీ వెంతో విచిత్రంబుగా

నామాట్కిన్ దగవజ్రివర్మ్మని మహా యాజానుబాహున్ వెసన్
గామాకారుని రత్నకుండలధరుం గర్ణుం బ్రసాదింపవే
నీ మాహాత్మ్య మెఱుంగ బ్రహ్మతరమే నీ మాయ నీకే తగున్
శ్రీమద్భక్తనిదానవార్ధికరుణా శ్రీసూర్యనారాయణా! 28

శా. బాలార్కప్రభ లుట్టిపడ్డగతి శుంభత్తేజులై రక్తగం
ధాలంకారులు రక్తపుష్పధరు లుద్యద్రిక్తవర్ణాంబరుల్
నాళీకాప్తమణీప్రభూషులు విమానప్రిస్ఫురద్యానకుల్
నీలోకంబున నుండుభక్తులు పునీతు ల్నిత్యు లెన్నంగ దు
శ్శీలారణ్యదవానుతీక్ష్ణకిరణా శ్రీసూర్యనారాయణా! 39

శా. దేవుం డెక్కడ నుండు నంచనఁగ నంతే మిన్నుఁ జూపింతు రా
దేవుం డీవని పల్కరాదె మది నర్థిన్ సంశయం బెందుకో
దేవాధీశ్వర హంసనామక మహాతేజోనిధీ పామరుల్
దేవుం డీ వనలేరు పెద్దలు మహాదేవుండ వీ వందు రో
భావాతీత సుయజ్ఞకర్మఫలదా పద్మాప్త సర్వేశ్వరా
శ్రీవిఖ్యాత యశోవిభూషణచణా శ్రీసూర్యనారాయణా! 55

శా. కాయల్గాచెను మ్రొక్కి మ్రొక్కి కరము ల్కంఠంబు రాసెన్ సెరా
యాయాసంబున నీ కృతు ల్బలికి యింకా నీకటాక్షంబు రా
దాయెన్ బ్రోచుట కస్తి నాస్తి యిద మర్థంబంచు నీ వన్న కా
శీయాత్రేని చరించివత్తు సెలవా? శ్రీసూర్యనారాయణా! 6

---

# సాహెబురాజు రామన్న

ఈతఁడు సీతాపతిశతక మను గ్రంథమును వ్రాసెను. మనోహరమైన పద్యము లున్నవి. కొన్ని పూర్వకవిపోకడలు

అనుకరణములును లేకపోలేదు. మృదుమధురమైన శైలి. శతకము కడపటిపద్యమువలన నీతడు వీరన్న రాజమాంబల పుత్రుఁడుగ దెలియుచున్నది. ఇంటిపేరువలన నీతఁడు మాధ్వుఁడని యనుమానము కలుగుచున్నది. ఇతని పూర్వుల కిది బిరుదమై యుండనలెను. కవికాలనిర్ణయమునకుఁ గాని యితర వివరములకు గాని యాధారములగు సంగతులు లేవు. కాని యీతఁడు క్రీ.శ. 1850 ప్రాంతము వాఁడు కానోపును. శైలికిఁ గొన్నిపద్యము లుదాహరించెదను.

శా. కళ్యాణప్రద సచ్చరిత్ర మునిహృత్కంజాతసంచార కా
సల్యాగర్భసుధాబ్ధిసీతకర పాషాణస్వరూపాయితా
హల్యాశాపవిదూర సేవకనికాయాధార రక్షింపవే
కళ్యాణాచలచాపసన్నుత నమస్కారంబు సీతాపతీ॥ 22

శా. కన్యావిక్రియులై ధనంబున కపేక్షం జెంది లోకంబునం
దన్యాయం బొడిగట్టుకోఁ దలచిఁ దుర్వ్యాపారు లూహింప సా
మాన్యప్రాభవ మిచ్చయించి రకటా! మర్త్యాళి శిక్షింపలే
రన్యుల్ నీవు సహించియుండుటకు చోద్యంబయ్యె ॥సీ॥ 9

మ. బలువైతోఁచ నసాధ్యమైనపని నీపైఁ బెట్టఁగాలేదు నీ
పరకాసైన ధనంబులో వ్యయముసేయన్ వద్దు నా కార్య మె
వ్వరితోనైనను దెల్పు సేయుమనరాదే వాగ్వ్యయంబాట కే
జఱుప న్జొచ్చెద వెట్లొనంగెదవు మోక్షం బింక ॥సీ॥ 14

మ. సొగసౌ వేలుపుఱేనిఠానిగనిగల్ జూపట్టు నెమ్మేనితో
నగ వొప్పారెడు ముద్దు నెమ్మొగముతో మాడెంపు హారంబట్టు
శాల్జిగిమేన న్వలెవాటుతో పుడమిచూలిం గూడి తమ్ముండు గొ
ల్వఁగ నీ వెన్నఁడు వచ్చి నిల్చెదవు మ్రోలన్ దండ్రి ॥సీ॥ 20

మ. ధరపైఁ బట్టకుఁ బొట్టకై యొకని చెంతం జేరి యాచింపఁ జుం
దిరుగం జేసితి వింక సద్గతిని జెందే మార్గ మేమైన నా
కెఱుఁగం దెల్పక పోతి వీవఱ కయో యేమందు నాకర్మమో
కరుణే లేదో మొఱాలకింపవు పరాకా యింత ॥సీ॥ 25

మ. అడుగం బోవుట కన్న లాఘవము, కన్యాదానముం బోలి చొ
ప్పడు దానం బనృతంబుకన్న, ఘనపాపం, బర్థి యాచించిన
న్వడి దా నిచ్చుటకన్న గీర్తియును, నెవ్వాల్పొందు కన్న న్వ్రత
ల్పుడమి న్లేవు తలంప నీకు సరి వేల్పు ల్లేరు ॥సీ॥ 29

మ. ధర నావంటి మహాపరాధుఁ డిఁక మర్త్యశ్రేణిలో లేఁడు ని
ర్జరు లెన్నంగను నీకు మించ నిల నార్తత్రాణ దీక్షాధురం
ధరులైనన్ మఱిలేరు సత్యమిఁక నీ దాసుండనై 'యన్యథా
శరణం నాస్తి' యటన్న న్యాయమున నిచ్చ ల్గొల్తు ॥సీ॥ 60

శా. చుం చల్లాడఁగ రావిరేకు గతులం జోద్యంబుగా గల్లు గ
ల్లంచుం గజ్జెలు పాదపద్మముల మ్రోయ న్మ్రోల నన్నెత్తుకో
మ్మంచుం జిందులు ద్రొక్కుచుం జనని కాహ్లాదంబుఁ గావించు నా
చంచద్బాలమనోహరాకృతుని నిచ్చల్గొల్తు ॥సీ॥ 64

మ. సిరు లీఁ జాలుదురో మనోరథములన్ సిద్ధింపఁగాఁ జేతురో
గుఱిగా నమ్మ నితం డటంచు మదిలో గోరంత చింతింతురో
కరుణం బాముల కడ్డ మయ్యెదరొ మోక్షం బిత్తురో తోఁచఁ దీ
నరుల న్వేఁడెద రేల సత్కవులు దీనత్రాణ ॥సీ॥ 83

మ. పుడమిన్ సాహెబురాణవంశకలాశాంభోరాశి సంపూర్ణచం
ద్రుఁడు వీరన్నకు రాజమాంబకు సుపుత్రుండైన రామన్న సొం
పడరంగా శతకం బొనర్చియు సముద్యద్భక్తి నర్పించెఁ జే
ముడిచేగైకొని ప్రోవు డెప్పుడును లేముల్బాపి ॥సీతా॥ 108

కవి చాల బీదవాఁడుగా నుండినట్లును, నరకృతు లిచ్చి విసిగినట్లును, కావ్యకన్యల విక్రయించుట దుష్కర్మ

మని నిరసించియుండినవాఁడుగను గనఁబడుచున్నాఁడు. ధూర్జటి, జగన్నాయక, నారాయణశతకముల పోలిక లున్నవి. గ్రంథబాహుళ్యము శంకించి మానితిని. ఈ శతకము నందలి పద్యము లింకను మనోహరకల్పన లున్నవి కలవు.

---

## బండి బాపనమ్మ

ఈమె మధురాపురి మీనాక్షీ దేవిపై నీ కందశతకము వ్రాసియుండెను. మీనాక్షీ పాండ్యరాజ్యపుత్రి యని వాడుక. ఈమె గోపాలుని సోదరి. (87) ఇతరవివరము లేమియుఁ దెలియవు. కవన మతిసొగసుగ నుండి స్త్రీలశతకములలో స్త్రీదేవతపైఁ జెప్పినది మనోహరముగ నున్నది. స్త్రీవిద్య మనదేశమునందు బూర్వము ప్రచారములో లేదనుకొనువారికి శతకకవులచరిత్రమునందుఁ గొన్ని కవయిత్రీమణుల చరిత్రములు కనఁబడును. ఈమె క్రీ॥శ॥ 1850 కిఁ బూర్వముండి యుండవచ్చును.

### మీనాక్షీ శతకము

క. బంగారపుఁ బళ్ళెరమునఁ
బొంగలువలఁ దమ్మిరాజ చేమంతు లిడి ని

న్నంగనలు పూజ సల్పఁగ
శృంగారపు బొమ్మవైతి శ్రీమీనాక్షీ. 6

క. అంబా! యోజగదంబక
దంబాటవినిలయుకొమ్మ! దయఁజూడవమ్మా
బింబాధరి హైమవతీ
యంబుజముఖి గౌరిదేవి! హరుమీనాక్షీ! 13

క. దీపింతువు భక్తులయెడ
మాపింతువు కలుషములను మది నిను నమ్మన్
గోపింతువు దుష్టులఁ గని
వ్యాపింతువు లోకములను వరమీనాక్షీ. 30

క. మానవజన్మము లెత్తిన
మానసతులు నీదు కరుణ మంజులభక్తిన్
మానసతలమున మిమ్మున్
మానకఁ గొనియాడి రెలమి మహి మీనాక్షీ. 62

క. పరహితము జేయ జగతిని
పరుసొమ్ముల కాసపడక పరమే లోర్వక్
నిరతము మదిఁగల్గిన వర
వరులకు నొక కొఱఁతలేదు వరమీనాక్షీ. 91

---

# వెండిగంటము గురునాథము

మన మిదివఱకుఁ బ్రబంధకవులచరిత్రమువలనఁ బైడి గంటము వారు వ్రాసిన గ్రంథములు వినియున్నాము. ఇప్పు

డీ కవి వెండిగంటము గురునాథ మనినప్పుడు పాఠకులు మందహాసవదనులు గాకపోరు. ఇతఁడు సరస్వతీశతక మెవ్వరు వ్రాయలే దని వ్రాసిన కారణముననే కాఁబోలు వెండిగంటము వాఁ డయ్యెను. ఇతని కాల మీ క్రిందిపద్యమునఁ జెప్పుకొనెను. క్రీ॥ శ॥ 1854 లో నున్నవాఁడు.

## సరస్వతీ శతకము

చ. ఘనముగ శాలివాహన శకాబ్దము లాఱును నేడు నేడు నోం
డని యొడి సౌమ్యవత్సరమునందలి రెండవమాసమందు దె
ల్లని జిగిరెక్కయందు నకలంక యజుశ్శ్రుతిశాఖ విప్రసం
జనుఁడు శారదాసతి కొసంగెఁ గృతిన్ గురునాథుఁ డాద్రుతిన్ ॥

చ. చదువగవచ్చు వేదములు శాస్త్రములున్ స్మృతులున్ బురాణముల్
చదివెడివేళ నీవు సరసంబుగ నా రసనన్ వసించి స
మ్మదమునఁ బల్కుచున్న బుధముఖ్యులు మెచ్చ సదుత్తరంబు తోఁ
చమగద భక్తగణవిచక్షిణి సత్యవతీ సరస్వతీ ॥ 9

చ. తెలుఁగు కవిత్వ మల్లఁగల ధీరులు సర్వసుధాంకితంబులై
చెలగఁగ గొన్ని సత్కృతులు చేసి రిలన్ భవదీయనామ సం
కలితముగాఁగ నొక్క శతకంబు రచింప రదేమొ తత్కృతుల్
తెలియఁగనీవె యాదరిని యో ధీమతి సత్యవతీ సరస్వతీ ॥ 11

ఉ. ముచ్చరు తల్లు లెల్ల జగముల్ పరిపాలనచేయనైన మీ
ముచ్చరిలోన నిర్జరకుఁ బుట్టువునున్ దలిదండ్రులున్ గలా
రవ్వరో నీకుఁ దల్లియెవరైరో యెఱుంగను గిన్కమాని లే
నవ్వునఁ దెల్పు మీసరవి నాయమ సత్యవతీ సరస్వతీ ॥ 23

చ. కవితయు నా నెఱుంగరు జగంబున మున్నట వామలూరు సం
భవుఁడు భవత్ప్రసాదమున పద్యనిబంధము రామమూర్తిపై

శివకరదేవభాషను సృజించిన వ్యాసుఁడు కాళిదాసుఁడు
న్నవలఁ బ్రసిద్ధులైరి జగదంబిక సత్యవతీ సరస్వతీ ॥ 66

చ. అవనిఁ దెనుంగు కావ్యముల కాదిగురుం డగు నన్నపార్యుఁడున్
కవికులసార్వభౌముఁ డనఁగాఁదగు తిక్కనసోమయాజియున్
భువననుతప్రకాశుఁడగు పోతనమంత్రియు నీదయన్ మహా
కవు లని లోకులెన్న నడిఁగాంచిరి సత్యవతీ సరస్వతీ॥ 67

---

## ఊడుమూడి సూరపరాజు



ఇతఁడు శ్రీవేంకటేశ్వరశతకమును రచియించెను. "ద్వారకా తిరుపతి వేంకటాచలపతీ ననుఁ బ్రోవుము వేగ శ్రీపతీ!" అని మకుటము. ఇతనిది గోదావరీమండలములోని జొన్నాడ యను జిన్నవాడ కాపురము. ఈ జిన్నవాడకడ బ్రహ్మ యజ్ఞము చేయుటచే దీనికి యజ్ఞవాటిక యని పేరు కలిగినదఁట. అది యచ్చతెలుఁగున జిన్నవాడ యైనదఁట! ఈ యుత్పత్తి యిటీవలివా రూహించినదైన నుందురు. లేదా బ్రహ్మ కాకపోయినను బ్రాహ్మణులైన నచ్చట యజ్ఞముచేసి యుంట నీ పేరు వచ్చియుండవచ్చును. ఇతఁడు జనార్దన స్వామి భక్తుఁడు. జొన్నాడ జనార్దనస్వామిపేరఁ గూడ నీతఁ డొక శతకము రచియించియుండును. ఇతనిది వందివంశము, అనఁగా భట్రాజు. ఇంటిపే రూడుమూడివారు. సూరయ నర

సమ లను దంపతులకుఁ గుమారుఁడు బ్రహ్మరాజు. అతని భార్య భద్రమ. ఈ యిరువురకుఁ బుత్రుఁడు ప్రస్తుత శతక కర్త యగు సూరపరాజు. ఇతని గురువు "అనంతకవి."

చ. ఇరువుగ నీదు కుక్షి నిరు సేడు జగంబులు దాల్చి దిట్టవై
బరగిన నీవు దేవకికి బాలుఁడవై యుదరంబులోపలం
బెరుగు టదెట్లు నేర్చితి వభేద్యచరిత్ర మహాత్మ ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. వర యతి లక్షణజ్ఞులగు పండిత సత్కవు లెల్ల మెచ్చఁగా
గరిమను నేక ప్రాసశతకం బొనఁగూర్చి సుపుష్పమాలఁగా
నరహరి మీ కొనర్చెదను నారద గానవిలోల ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

ఈతఁడు చెప్పినట్లు "ర"కారప్రాసముతోఁ బద్యము లన్నియు గట్టి ప్రయత్నముచేసి వ్రాసినాఁడు. అందువలననే భావము లిచ్ఛమెయి సంపూర్ణత నొంది నూతనము లైనవి కాకపోయినవి.

ఈతఁ డాదికవిస్తుతియందు తిక్కన్న, భట్టుమూర్తి, బమ్మెర పోతన్నలను మాత్రము స్తుతించియున్నాఁడు. తన కులమువాఁ డగుట భట్టుమూర్తినిఁ గూడ స్తుతించెను. భట్టుమూర్తి యనఁగా రామరాజ భూషణుఁడా? మూర్తియా? అను తగ విక్కడఁ దేలదు. మొత్తముమీఁద గవి 16 వ శతాబ్దము నకుఁ బిమ్మటవాఁ డనుట స్పష్టము. జొన్నాడ ప్రాంతముల

విచారణ మొనర్చినచో నీతనివంశమువారివలన నేమైన వివరములు తెలియవచ్చును. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

చ. కూరునకు మ్రొక్కి పార్వతికి నంజలిఁ జేసి వినాయకాఖ్య దే
వరకు నమస్కరించి మది వాణికి దండ మొనర్చి చంద్ర భా
స్కరులకుఁ గేలుమోడ్చియును గబ్బము మీ కొనఁగూర్తు ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ననుఁ బ్రోవుము వేగ శ్రీపతీ ॥ 2

చ. వరకవితాపటిష్ఠుఁడగు వ్యాసునకున్ మఱి తిక్కయజ్వకున్
నిరతము భట్టుమూర్తికిని నిత్యము బమ్మెర పోతరాజుకున్
సరవిని మ్రొక్కి మీకుఁ గృతి చంపకమాలలుఁ గూర్తు ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ననుఁ బ్రోవుము వేగ శ్రీపతీ. 4

చ. హరుఁడట నీకు మిత్రుఁడు హిమాలయపుత్రి నుతించు భక్తులా
వర ముచికుంద భీష్మ శుక వ్యాస పరాశర వాలఖిల్య తుం
బురు లట నీదు నామరుచి నొందిరి మూఢుఁడ నేను ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ననుఁ బ్రోవుము వేగ శ్రీపతీ. 39

చ. శరనిధిఁ గట్ట నావుడుత సంతస మందుచు సైకతంబులోఁ
బొరలుచు గట్టుపై దులిపిపోవుటఁ జూచి దయాపరుండవై
తరుణమునందు దానినట ధన్యను జేసిన తండ్రి ద్వారకా
తిరుపతి వేంకటాచలపతీ ననుఁబ్రోవుము వేగ శ్రీపతీ. 53

---

## చేకూరు సిద్ధయ



ఇతఁడు "వేదమార్గప్రతిష్ఠాపనాచార్య లుభయవేదాంతవర్తనులు నల్లగొండ నృసింహాచార్యులు కుమారుఁడు

లక్ష్మీనరసింహాచార్యుల కరుణచే" విష్ణుపురాణాది వివిధ కృతులు తెలిఁగించినవాఁడు. క్రీ॥శ॥ 1868 వ సంవత్సరము నకే యీశతకము ముద్రితము. ఇందలి యెల్లమాంబాపుర మెచ్చటిదో? ఈతని వివరము లేమియుఁ దెలియవు.

## వేణుగోపాల శతకము

సీ. మందరధర దివ్యమంగళవిగ్రహ
గ్రహరూప పరమాత్మ కనకవసన
సనకాదియోగిహృత్సరసిజ దినమణి
మణిమయోజ్జ్వలభూష మంజుభాష
భాషాధినాథ సంభావిత పదపద్మ
పద్మాసతీలోల పాపహరణ
రణధరాస్థలి దుష్టరాజన్య మర్దన
ధననాథసఖిమిత్ర దానవారి

వారిజాయత నేత్ర గీర్వాణపోష
పోషకుఁడ వంచు నెంచితిఁ బ్రోవు నన్ను
ఎల్లమాంబాపురీవాస హితవిలాస
వేణుగోపాల పాలితవిబుధజాల. 14

సీ. అడవి దహించు దావాగ్ని కైవడి మదీ
యాంతర్బహిశ్శత్రుహత మొనర్పు
వనదంబు నిర్జించు వాయుగతిని మదీ
యాంతర్బహిశ్శత్రు హత మొనర్పు
మంధకారము రవి హరియించు క్రియ మదీ
యాంతర్బహిశ్శత్రు హత మొనర్పు
శైలముల్ భేదించు శతకోటివలె మదీ
యాంతర్బహిశ్శత్రు హత మొనర్పు

గజసమూహంబు గడపు సింగంబు కరణి
మామకాంతర్బహిశ్శత్రు మథనజేయు
మెల్లమాంబాపురీవాస హితవిలాస
వేణుగోపాల! పాలితవిబుధజాల!.

---

# చీదెళ్ల రామకవి

ఇతఁడు కృష్ణగురుశతక మను కందపద్యశతకమును వ్రాసెను. కవి వివరము లేమియుఁ దెలియవు. పద్యములు వేదాంతప్రతిపాదకములు క్రీ॥ శ॥ 1850 కిఁ బూర్వుఁడై యుండును.

## కృష్ణగురు శతకము

క. నిర్మలసంపూర్ణుఁడవై
కర్మాతీతుండవగుచు కైవల్యుఁడవై
మర్మములేకను చిత్సుక
ధర్మాకృతి వెలుఁగుఁ దీవె తథ్యము కృష్ణా॥ 34

క. సంకల్పమె బంధంబని
సంకల్పక్షయమె మోక్షసౌఖ్యంబని యా
సంకల్ప మసంకల్పుల
శంకలు విడియుందు వీవె చక్కఁగఁ గృష్ణా॥ 52

క. జ్ఞానంబు నెఱిఁగి నంతట
గానంబడు నఖిలజీవగతి దేహములన్

గానక యవి వాచ్యంబని
పోనడిచిన యాత్మ వీవె పూర్ణము కృష్ణా॥ 80

క. పట్టును విడుపును లేనిది
బట్టబయలనుండఁ జూచి పట్టును విడుపుల్
పట్టక యూరక మఱియును
చట్టువలెన్ గదలకుంట సౌఖ్యము కృష్ణా॥ 97

క. అందమగు కందశతకము
వందిత చీదెళ్ళరామ వరభక్తుఁడ నే
నందముగా నీ కొసఁగితి
పొందుగ ధరియింపవయ్య పొలుపుగ కృష్ణా॥ 100

---

# పాటూరి లక్ష్మీనృసింహకవి

ఇతఁడు దేవరాజు పుత్త్రుఁడు. తిక్కనసోమయాజి సంతతివారి కిప్పుడు నెల్లూరుప్రాంతములఁ బాటూరివా రని వాడుక కలిగినది. తిక్కన తాతయింటిపేరు గుంటూరువా రందురు కాని తిక్కననాఁటికిఁ గొట్టరువువా రని దశకుమార చరిత్రకృత్యాది సాక్ష్య మిచ్చుచున్నది కదా! ఈ లక్ష్మీనరసింహకవి నెల్లూరిప్రాంతమునందలి పాటూరువంశమువాఁడై యుండనోపును. ఇతఁడు క్రీ॥ శ॥ 1858 కి బూర్వుఁ డని మాత్రము తెలియుచున్నది. కవి మంచి పండితుఁడు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## లక్ష్మీనృసింహ శతకము

శా. పక్షిధ్వజోత్తన దీనపాలన సదాపన్న ప్రసన్నాత్మ సం
రక్షాశిక్షిత దానవేంద్రవరదా దారిద్ర్యమాతంగ హ
ర్యక్షా సూక్ష్మ సరీరదర్శనము నిమ్మాలస్యమున్ వీడ వే
లాక్షాసార నిభాధరారుణవిభూ! లక్ష్మీనృసింహప్రభూ!॥ 13

మ. జననం బెత్తియు నిన్నుఁ దక్క మఱి యే సామాన్యులా వేల్పులన్
మననం బెన్నడు సేసి నే నెఱుఁగ శ్రీమంతుండ నాపాల నీ
వనుకూలంబుగ నుండితేని వినుమా యబ్జాసనుం డెంత క
ల్లనఁగా దీ వచంబు గావవె విభూ! లక్ష్మీనృసింహప్రభూ! 26

శా. రక్షోవక్షముఁ గోటఁ జీరి వడిగా రక్తంబు గ్రోలంగ మేల్
దీక్షావక్షుఁడవై దహించిన మహాదివ్యప్రభల్ గప్పు నీ
దక్షోభ్యాకృతిఁ గాంక్ష దీరఁగను వే హర్షంబుతోఁ గాంచ వే
లక్షల్ గన్నులు సాలునా హరివిభూ! లక్ష్మీనృసింహప్రభూ!॥ 36

మ. అమరాధీశుఁడు జాలవానగురియన్ హా గోవులున్ వత్సబృం
దములుం గోపులు గోపభామినులు నీ దాపొంది ఘోషింప మో
దముతో వారల నూరడించి కృపచేతన్ వ్రేలిగోటన్ సుశై
లముఁ బైకెత్తి బిరానఁ బ్రోచితి విభూ! లక్ష్మీనృసింహప్రభూ!॥ 51

మ. కుటిలాచ్ఛాదనుఁడైన విప్రుఁడు మహాగోప్యంబుగాఁ గొంగులో
నటుకుల్ చేరెడుఁ దెచ్చి యిచ్చిన నవే యాకంఠ సంపూర్తి నీ
కెటులయ్యెన్ భళి కాండభాండ హృదయాహీనుండవై స్వామికో
లటగా నీ కవి యయ్యె నాఁటికి విభూ! లక్ష్మీనృసింహప్రభూ!॥

---

# మోదుకూరి శంకరకవి

ఈ కవి యెప్పటివాఁడో తెలియదు. క్రీ. శ. 1862 నాఁటికే యీతని ధీరధీశతకము ముద్రితమైయున్నది. "సురుచిర సత్పదార్థముల శోభిత త్వత్ప్రతిపాదనస్తుతోత్తరములు చెప్పినట్టి శతకంబు" అని కవియే తుదిపద్యమున వ్రాసియున్నాఁడు.

## ధీరధీ శతకము

చ. హరిహర దంతదంతుర ఘనాంచిత సంచితకీర్తి విద్య సుం
దరధరహార భాసురవదాన్య తనుద్యుతి లీఢగాఢ కం
ధరధరణీతలేంద్ర వరధర్మ సముజ్జ్వల శౌర్య సేవధీ
ధరశరధీ! రధీశనుత దాశరధీ! ధరధీర ధీరధీ! 13

చ. ఎఱుఁగను స్నానసంధ్య లుపనిష్టవిధు ల్వరతత్త్వపద్ధతుల్
ఎఱుఁగను ధర్మమార్గము మఱన్నఁ డెఱుంగ పరోపకార మే
దరి నను జేర్చి కాచెదవో ధారుణిలోఁ గడు మూఢభక్తుఁడన్
ధరశరధీ! రధీశనుత దాశరధీ! ధరధీర ధీరధీ!. 48

చ. సరసచమత్క్రియాభి నవసౌరభ సాంద్రి ఘుమాయమాన భ
క్తిరసమృదూక్తి పుష్పముల కేవల బాంధవసూత్రిపద్ధతిన్
వరుసను జేసి యిచ్చెదను వారిగఁ జంపకవృత్తమాలిక
ల్ధరవరధీ! రధీశనుత దాశరధీ! ధరధీర ధీరధీ!. 68

చ. సరసను నీ వధూటి కపచారముఁ జేసిన కాక దైత్యునిన్
శరవరపీడితున్ శరణుజారగఁ బ్రోచితివే కదా నిరం
తర మపచారినే శరణనంగను దుర్దశ బాధ మాన్పవో
ధరశరధీ! రధీశనుత దాశరధీ! ధరధీరధీరధీ!. 95

చ. వర జయరామ యో సకలభాగ్య ధురంధరరామ యో జగ
ద్భరరఘురామ యో నిఖిల పార్థివశేఖర రామ యో రమా
వరద దయానిధే శరణు వంచనసేయక బ్రోవరాఁగదే
ధరశరధీ! రధీశనుత దాశరథీ! ధరధీరధీరధీ!. 99

## అమలాపురపు సన్యాసికవి

ఈ కవి శతశతకములు వ్రాసెనఁట. విశాఖపురమండలములోని పాలతేరు వాస్తవ్యుఁడు. కుమ్మరికులమునకుఁ జెందినవాఁడు. విప్రు లీతని శిష్యులుగా నుండుటయే యీతని పాండిత్యము జగద్విదిత మైనదని వెల్లడించుచున్నది. ఈతఁడు (శా॥ శ॥ 1682) క్రీ॥శ. 1760 లో మృతినొందెను. ఈతని శతకము లైదాఱు చిక్కినవి. వీనియందు భాష యనవసరముగ నియమబద్ధమై కవిత కుంటుపడియున్నది. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

### (1) పంచముఖేశ శతకము

క. శ్రీరమ్యగిరికుమారీ
నారీమణిచిత్తచోర నాగాధిప కే
యూరా జగదాధార య
పారకృపారసనివేశ పంచముఖేశా॥ 1

క. సరిదధిపగభీరా వే
సరితిని భూధవులసేవ సలిపి ధరిత్రిన్

సరియేరి నీకు వేల్పులు
పరమకృపారసనివేశ పంచముఖేశా ॥ 54

క. దరహాస సమన్విత సుం
దరవదనాబ్జాత నుత బుధవారితా మం
దరకందర పరిచారా
పరమకృపారసనివేశ పంచముఖేశా ॥ 84

## (2) ముఖలింగ శతకము

క. అసమప్రజ్ఞుఁడ కవివ
ర్యసమాజహితుండ భాస్వ దమలాపురవం
శసముద్భూతుఁడ సన్న్యా
సి సమాఖ్యుఁడ నన్నుఁ బ్రోవు శ్రీముఖలింగా॥ 2

క. సుప్రాసాదాయితనగ
విప్రాశీర్వాదమొంది వెసఁ ద్వత్కృతిఁగా
ద్విప్రాస కందశతకము
క్షిప్రాసక్తిని రచింతు శ్రీముఖలింగా ॥ 33

క. దూరితి ధనికుల గృహములఁ
గోరితి నిఖిలార్థసమితిఁ గొంచించక వే
సారితి నీయడుగులదరిఁ
జేరితి రక్షింపవయ్య శ్రీముఖలింగా ॥ 20

క. భూతలములోన ధరణీ
నేతల భజియించుటెల్ల నిష్ఫలము సదా
జ్యోతులు నీ కొనరించెద
జేతులు నెన్నుదుటఁ జేర్చి శ్రీముఖలింగా ॥ 26

క. అభవాభవాభవానీ
శభవామయ వైద్యసాధుజనహృద్య లస

ద్విభవా రుచితదేవ
ర్షిభవారిజ గగనగంగ శ్రీముఖలింగా ॥ 75

## (3) శివ శతకము

క. వాఃపూరము దిగనాడిప
యఃపాన మొనర్చు రాజహంస గతి మద
హాఃపుంజమడఁచి సుకృతమ
నఃపరివృతుఁ జేయవయ్య నను సాంబశివా ॥ 5

క. ప్రాజ్ఞులకుఁ గాక భువి స
ర్వజ్ఞభవన్మహిమఁ దెలియ వశమా నే కిం
చిజ్ఞులకు జడుఁడ మామక
విజ్ఞాపన చిత్తగించు విశదముగ శివా ॥ 30

## (4) పంచముఖేశ్వరప్రభూత శతకము

అంబరకేశ యీశ ధవళాంగకపర్ది పినాకపాణి ఫా
లాంబకనీలకంఠ త్రిపురాంతక శంకర నీలలోహితా
సాంబ పురాణపూరుష వృషధ్వజశూలి కపాలమాలి యిం
చుం బలుమారు వేడెద యశోధన పంచముఖేశ్వరప్రభూ ॥ 2

నీ చరణాతపత్రముల నీడను నిల్చినఁ బాపతాపమున్
వే చను నీ కథామృతము వేడుక గ్రోలినఁ దృప్తిఁదీరు దో
షాచరవైరి నీ గరిమసన్నుతి సేయఁదరంబె దీనర
క్షాచణ దేవదేవుఁడవు గావున పంచముఖేశ్వరప్రభూ ॥ 2

గురు ధనధాన్యసంపదలు గోరఁ జిరాయువుఁ గోర నవ్యసుం
దరులనుఁ గోర ఘోటకమదద్విరదాదులఁ గోర నీ పదాం
బురుహయుగార్చనం బొసఁగు భూస్థలమందున స్వర్గమందునన్
హరిపురి నున్న నాకుఁ ద్రిపురాంతక పంచముఖేశ్వరప్రభూ ॥ 76

## (5) విశ్వనాథ శతకము

సీ. కరికాళుఁ డొసఁగు మా కందఫలంబులు
మిక్కుటంబగు కూర్మి మెక్కి మెక్కి
మాదర చెన్నాఖ్యుఁ డాదరంబునఁ బెట్టు
సురుచిరాంబకళంబుఁ జుట్టి జుట్టి
నిమ్మవ్వ మదిఁ బత్తి నివ్వటిల్లఁగ బోయు
జావ సంతసమునఁ ద్రావి త్రావి
బోయ కన్నఁడు యెడఁబాయక నర్పించు
నంజుడు తునకలు నమలి నమలి

తృప్తిఁ దీరక బిక్షాం ప్రదేహి యనుట
జనులు చీర్తురె తుత్తు విశ్వంభరునకు
భూరిగుణయూథ కాశికాపురసనాథ!
విదళితామర్త్యరిపుయోధ! విశ్వనాథ! 34

సీ. కాత్యాయనీ పృథు కబరి కాభరమున
విరులదండలు జుట్టి వెలయు వేళ
హైమవతీ లలాటాద్రమందు సితాభ్ర
తిలకంబు సొగసుగా దిద్దు వేళ
లసదపర్ణాకపోలములు కస్తురిచేత
వారక మకరిక వ్రాయు వేళ
నగజాకఠోరస్తనస్తబకద్వంద్వ
మంపు గుంకుమపంక మలఁదు వేళ

నుమకు కిలికించి, తములు సేయుచును హాస్య
రసముఁ జూపవె స్మేరవిరాజితాస్య
భూరిగుణయూథ! కాశికాపురసనాథ
విదళితామర్త్య రిపుయోధ! విశ్వనాథ! 65

## (6) పంచముఖేశలింగస్తుత్యంచిత సీసపద్యాత్రింశతి.

సీ. పావనాకార పారావారతూణీర
శత్రుమేఘసమీర శైలధీర
శైలేంద్రజాధార సకలలోకాధార
పురదైత్యసంహార పరమసార
తారేశకోటీర తాపసమందార
కారుణ్యవిస్తారగర్వదూర
నీహార నాకధునీహార ఘనసార
సారయశస్స్ఫార శమదసార
వనధిగంభీర దనుజకాననకుఠార
ఘనసితశరీర పాలితమునికుమార
భుజగకేయూర సాలూరి పురవిహార
యీశ భవభంగ పంచముఖేశలింగ! 2

ఈ కవి తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను.

సీ. అమలాపురాన్వయోత్తముఁడగు కాశీప
తికిని గంగాభవానికిని సుతుఁడ
సన్యాసినామకసహితుఁడ శ్రీకాటి
కోన లక్ష్మణసమాఖ్యు[illegible]
మాంబకుఁ బుత్రికయగు కన్నమాహ్వాయ
పత్నితోఁ గూడి వివా[illegible]
నరుఁదెంచి యేనుఁ గృతాంజలినై ప్రభూ
కానుక లివ్వఁగలాను [illegible]
నీకృతి రచించితినిఁ గొని మాకు నైక్య
మొసఁగుమని వేడితిని నట్లు యొసఁగరాదె
భుజగకేయూర సాలూరు పురవిహార
[illegible] భవభంగ పంచముఖేశలింగ! 33

ఈ క్రింది సీసమాలికను బట్టి కవికాలము దెలియనగును.

"తనవంశకర్త్రయై తనరారు శాలివా
హనమహారాజు శకాబ్దములు క
రగజర్షి విధుసంఖ్యఁ దగు రౌద్రివత్సర
చైత్రశుద్ధనవమి మిత్రపుత్ర
వారత్రయామాదిరయి రహిన్గను సమ
యంబున నమలాపురాన్వయామృ
తాంభోదిరాకాసుధాంశుండు నాగ ను
ద్భవమంది మదిని సద్భక్తి మెఱయ
గట్టుమూరి కులాగ్రగణ్యుఁడై మించు కా
మేశ్వరాఖ్య కవీంద్రువలన
నకలంక వృత్తిని సకలాంధ్రభాషావి
శేషజ్ఞుఁడై నిజశిష్య సంచ
యమునకు నెల్ల మహాముద మొదవంగ
గరతలామలకంబు గాఁగ నన్ని
విద్యలఁ గఱపి వివేకాత్ముఁడగుచుఁ గా
శీప్రముఖాఖిల క్షేత్రములను
గ్రమమున సేవించి రామాయణగ్రంథ
మమరంగ వ్రాసి పట్టాభిషేక
మొనరించి ధరణీసురగోత్రము లలర రు
ద్రాక్షమహాత్మ్య ముఖ్యప్రబంధ
ములు మూఁడొనర్చి నిచ్చలు సోమవార మ
హావ్రతుండయి యనయంబునిటుల
నలరు సన్యాసి నామధేయాన్వితుఁడు స
ముజ్జ్వలం బగు లింగైక్య మొందె నౌర
తలపఁగా నిట్టి పురుషుండు ధాత్రిఁగలఁడె
యనుచు జనులెల్ల నొక్కటై యభినుతింప.

ఈ మాలిక యిక్కడి శిష్యులలో నొకరగు శ్రీ దేవులపల్లి చంద్ర శాస్త్రిగారు రచించిరి.”

అని యీశతకపు వ్రాఁతప్రతి చివర నొక లేఖకుఁడు వ్రాసి యుండెను.

---

## కూచిమంచి సోమసుందరుఁడు

ఇతఁడు వ్రాసినవి రెండు శతకములు కనఁబడు చున్నవి. కొప్పులింగేశ్వరశతకము, భక్తచింతామణిశతకము. క్రీ॥ శ॥ 1874 సంవత్సరమునాఁటికే కొప్పులింగేశ్వరశతకము చిత్తూరిమండలమునఁ బ్రచారము నొంది కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారి సహాయమున ముద్రింపఁబడుట నీ కవి యంతకుఁ బూర్వుఁడు. ఇతఁడు గోదావరీమండలము నందలి పలివెల గ్రామమువాఁడు. ఈ కొప్పులింగేశ్వరుఁ డక్కడ దేవుఁడే! ఈ దేవాలయమునందు రెడ్ల పరిపాలనకాలము నాఁటి శాసనము లున్నవి. ఈ క్రింది పద్యమువలన నా దేవుఁడు పూజారినిఁ గాపాడుటకుఁ గొప్పు ధరించె నని తెలియుచున్నది.

### కొప్పులింగేశ్వర శతకము

మ. మరుకేళి న్మను వేశ్య కిచ్చిన భవన్మాల్యంబె పూజారి దా
సరగన్ భూపతి కివ్వ నందొక శిరోజం బున్నఁ జర్చింపగాఁ

బరఁగ న్వాడది స్వామిదే యని వచింపన్ వాని రక్షింప నీ
శిరమం దప్పుడు కొప్పుఁ దాల్చితఁట యో శ్రీకొప్పులింగేశ్వరా. 2

శా. నీకై మ్రొక్కులొనర్చు నట్టి శిర మెంతే యుత్తమాంగాఖ్యకౌ
నీ కీర్తిస్తుతిసేయు జిహ్వయును వర్ణింపన్ రసజ్ఞాఖ్యకౌ
నీ కళ్యాణ కథాప్తినుండు చెవులున్ నిక్కంబు శ్రుత్యాఖ్యకౌ
శ్రీకంఠా యటుగాని వెల్లఁ దగునా శ్రీకొప్పులింగేశ్వరా! 44

శా. పాపారణ్యదవానలం బఖిల సంపద్వల్లికాచైత్రము
గ్రాపత్పర్వత వజ్రమిష్టఫల కల్పాగంబు సంసార సం
తాపచ్ఛేదసుధారసంబు నిగమాంతశ్రీనిధానంబు నీ
శ్రీపాదాంబుజ భక్తికన్నఁ గలదా! శ్రీకొప్పులింగేశ్వరా! 57

శా. జారుండైనను చోరుఁడైనను దురాచారుండె యైన న్మహా
క్రూరుండైనను భక్తి నొక్కపరి నీకున్ మ్రొక్కినన్ వారలన్
సారోదారకృపాకటాక్ష శుభవీక్షారూఢి నీదగ్గఱన్
జేరందీసి వరంబు లిచ్చెదుగదా! శ్రీకొప్పులింగేశ్వరా! 59

## భక్తచింతామణీ శతకము.

మ. గురుపత్నీగమనోగ్రపాతకకళంకుండైన చంద్రుండు నీ
శరణన్నంతనె నెత్తిఁబెట్టుకొని వాత్సల్యంబు సంధిల్లఁగాఁ
బరిరక్షించితి విట్టి యాశ్రితకృపాపారీణు లింకెందునుం
బరికింప న్మఱిలే రిఁకెవ్వరును సాంబా భక్తచింతామణీ! 34

శా. సత్యజ్ఞానసుఖస్వరూప మగు నీ శశ్వన్మహత్త్వంబు దా
నత్యంతాద్భుతమై పవిత్రకరమై యజ్ఞానవిధ్వంసియై
నిత్యశ్రీకరమై చెలంగు నిదిగో నిక్కంబు సర్వశ్రుతుల్
ప్రత్యక్షంబుగఁ జాటుచుండు శివసాంబా! భక్తచింతామణీ! 47

శా. విపరీతార్థ కుతర్కవాదములచే విజ్ఞాన మొప్పారునే?
కపటాచారవిడంబనక్రియలచేఁ గైవల్య మేతెంచునే?

చపలాశావిభయోపభోగములచేఁ జల్లారునే తృష్ణ నీ
యపరోక్షానుభవంబులేక శివసాంబా! భక్తచింతామణీ! 74

మ. తనవారొక్కరుఁ గూడరారు యమబాధల్మాన్పఁగాలేరు ముక్తా
ధనకాంక్షన్ దనుఁ గూడినారు తుదఁ జెంత న్నిల్వఁగాఁబోరు గా
వున వైరాగ్యము మీఱు ధీరు లతిభవ్యుల్ వారు నీభక్తి భా
వనచే ముక్తికిఁ జేరువారు శివసాంబా! భక్తచింతామణీ! 79

మ. సకలస్థావరజంగమాత్మ వని యశ్రాంతంబు నిన్వేడ నీ
వకటా! నాదు మొఱాలకింప విపు డాహా! కేవలస్థాణుమూ
ర్తికి నే మ్రొక్కిన చందమయ్యె శివుఁ డెంతే సుప్రసన్నాత్ముఁడన్
ప్రకటఖ్యాతికి సంశయం బొదవె సాంబా! భక్తచింతామణీ! 95

---

## బాలకృష్ణకవి



ఈ కవి భక్తి జ్ఞాన శృంగార నీతి విషయములు గల వరదరాజశతకమును వ్రాసెను. ఈ గ్రంథము 60 యేండ్ల క్రితము దుర్మతిలో ముద్రణ మందినది. భర్తృహరివలె విషయ విభాగ మొనరించెను. ఈతని తండ్రి బాలయ్య, తల్లి లక్ష్మమాంబ. ఈతని వివరము లేమియుఁ దెలియవు. ఈతఁడు క్రీ॥ శ॥ 1860 కిఁ బూర్వుఁ డని చెప్పనగును.

### వరదరాజ శతకము

చ. మురుగులు గొల్సులున్ పతకము ల్మొలత్రాళ్ళును నుంగరంబులున్
పరిపెనలుం గిరీటములు శాలువ లుత్తరజన్నిదంబులున్

సురభుజకీర్తు లే నడుగ నొక్కటి నీపదభక్తి యిమ్ము మం
దరధర! కుందసుందరరదా! వరదా! మురదానవాంతకా! 14

చ. హరుని గృతార్థుఁ జేసితివి యబ్జజునిన్ ఘనుఁ జేసి తౌను నా
హరిహయు కోర్కెఁ దీర్చితివి యందఱకన్నను నన్ను నొక్క క
న్నరసియు బ్రోవవయ్య బిరుదప్పుడుఁ జెల్లును దేవరాయ! మం
దరధర! కుందసుందరరదా! వరదా! మురదానవాంతకా! 36

చ. ధర జనియించు పెల్లఁ బరదారధనంబులఁ గోరునందుకా
తెరవునఁ బోవు వారలను దేరికనుంగొని మోహమొందనా
విరసములాడి పెద్దలను వృద్ధులఁగొట్టుటకా సుతుండు మం
దరధర! కుందసుందరరదా! వరదా! మురదానవాంతకా! 67

చ. తరుణుల నమ్మరాదు తనుఁ దానె మహాత్ముఁ డనంగరాదు తా
పరిపరి త్రోవలం దిరిగి బాధల నొంది కృశింపరాదు యే
మరి కనుమూయరా దటవి మధ్యను జాలముఁ జేయరాదు మం
దరధర! కుందసుందరరదా! వరదా! మురదానవాంతకా! 77

చ. త్వర నదిదాటి యాజ్ఞ యను దొడ్డ గిరీంద్రము నెక్కి యచ్చటన్
వరుసగ నానదిత్రయము వాంఛనుఁ గాంచి సులక్ష్యమార్గులై
పరువడి షణ్ముఖున్ గనిన భవ్యులు నావలె నంటివయ్య మం
దరధర! కుందసుందరరదా! వరదా! మురదానవాంతకా!

---

# అడిదము బుచ్చివేంకటరాయఁడు



ఇతఁ డడిదము బాల భాస్కరకవి పుత్రుఁడు. శ్రీవిజయనగరసంస్థాపితమగు "అన్నమరాజుపేట" లో రివిన్యూ ఇన్‌స్పెక్టరుగాఁ బనిచేసి యున్నాఁడు. భాస్కరకవి యడి

దము సూరన్నకొడుకు గుటచే నీకవి సూరకవి మనుమఁ డని తెలియుచున్నది. "శంకరా!" యను మకుటముతో 128 పద్యములు గల శంకరశతకమును రచియించియున్నాఁడు. అడిదము సూరకవి వంశీకులలోఁ గొందఱు బాలురు సహితము పద్యము లల్లఁగల ధారాశుద్ధి కలవా రని తెలియుచున్నది. ఇతఁడు తుట్టతుదపద్యము నిట్లు వ్రాసియున్నాఁడు.

చ. అడిదము సూరయాహ్వాయ మహాకవిపౌత్రుఁడ భాస్కరాఖ్య పు
త్రుఁడ కవిరాజహృత్కమలతోయజమిత్రుఁడ వేంకటాఖ్యుఁడ
న్బుడమిని దావకాంకితముఁ బూనుచు నీ శతకం బొనర్చి తి
య్యెడ సుమమాలకీతిని రహిం గొను మర్పణఁజేతు శంకరా.

చ. తెలియదు నీదుమాయ జగతీరథ పుట్టుచుఁ గిట్టుచున్న వా
రల ధరలో ననేకుల నిరంతరము న్ననుగొంచు జన్మ ని
ష్ఫల మని లోనెఱింగి భవబంధనిబద్ధులునై సుతాంగనా
నిలయధనాళుల న్విడువనేర రదెంతటి వింత శంకరా!.

చ. దురితుఁడు వీఁడటంచుఁ గృపతో నను రక్షణ చేయకుండినన్
ధరణి దిగంతరిక్షముల దర్పితమై మహితప్రతీతమై
బరగుచు నున్న నీ పతితపావననామవిరాజమానమౌ
బిరుదును మోసము న్గలుగు వే మదభీష్టము నిమ్ము శంకరా!.

కొన్ని లక్షణదోషములును గన్పట్టుచున్నవి. కవిత్వము ధారకలది. అక్కడక్కడ నూతనాభిప్రాయములు నున్నవి. శైలి చక్కఁగ నున్నది. ఇతఁడు సూరకవి మనుమఁ డగుటచే క్రీ॥ శ॥ 1820 ప్రాంతములవాఁడై యుండవచ్చును. ఈతని వంశములోనివాఁడైన "అడిదము సన్యాసికవి" కేశవ

శతకము, రుద్రశతకమును వ్రాసెను. అవి ప్రాచ్యలిఖితాగారమున నున్నవి.

---

# బుద్ధిరాజు కనకరాజు

ఇతఁడార్వేలనియోగి. శివశతకము వ్రాసెను. ఇప్పటికి రమారమి నూఱు సంవత్సరముల క్రితమువాఁడు. అనఁగా క్రీ॥ శ॥ 1820 ప్రాంతములవాఁడై యుండును.

## శివ శతకము

క. శ్రీదేవికాంఘ్రియుగళం
బాదర మొప్పంగ మానసాబ్జమునందున్
బాదుకొనఁజేసి పూజలు
మోదముతోఁ డుతను జేతు ముదితాత్మ శివా!

క. శరణాగతవత్సలుఁడవు
పరమేశుఁడ వనుచు శ్రుతులు బల్కఁగ విని నిన్
శరణని వేడితి నను నీ
చరణాబ్జము కడకుఁ జేర్చు జగదాత్మ శివా! 3

క. సాధన చతుష్టయముచే
సాధింపఁగఁ బడుదు వనుచు సమరసచిత్తుల్
బోధింపఁగ విని నే నిను
బోధమయుఁడ వనుచు గంటి బుద్ధాత్మ శివా! 39

క. వేదాంతసారమయుఁడవు
వేదాంతాతీతుఁడవును వేదాంతుఁడవున్
వేదాంత వేద్యుఁడవు నీ
వాద్యంతవిహీనుఁ డౌర యకలంక శివా! 43

క. బోధాత్మ బోధరూపక
బోధానందస్వరూప బుధమానస
సద్బోధానందమయాత్మక
సాధనమున గందురి నిన్ను సన్మునులు శివా! 4

---

# తోట విజయరాఘవకవి

ఇతఁడు పార్థసారథిశతకము, నాయకీనాయకశతకము వ్రాసెను. తిరువళిక్కేణి హిందూబాలి కాంధ్ర ద్రివిడ పాఠశాలోపాధ్యాయుఁడు. శాలివాహనశకవర్షంబులు 1771 లో ముద్రించెను. కడచిన విరోధి నామసంవత్సరమున వ్రాసెను. ఈ కవి క్రీ॥శ॥ 1840 లో నుండెను. పార్థసారథిశతక మేక ప్రాసకందశతకము. భక్తిభరితము. కోమూరి కృష్ణమాచార్యులకుఁ గవి శిష్యుఁడు. విరోధి, అశ్వయుజ బహుళ విదియ నాఁటి కీ శతకము వ్రాసెను. రెండు శతకములనుండి శైలికిఁ బద్యములు చూపెదను.

(1) పార్థసారథి శతకము

క. శౌరాచలధీరావర
ధీరాజితహృదయ సదయ దితిసుత తతకాం

తారావార దవానల
సారతరోద్భావ పార్థసారథి దేవా! 3

క. ధారాళంబగు నీ దయ
హారాళంబుగను నా పయిం గొలిపి సుధీ
శ్రీరాజితుఁ జేయవదే
సారతరోద్భావ పార్థసారథి దేవా!. 43

క. పౌరాణిక వినుత ఘృణా
ధోరణి మద్దురితపాళిఁ దూలింపవదే
కారాకులఁ గఱువలిఁబలె
సారతరోద్భావ పార్థసారథి దేవా!. 52

క. కారణసంభవమాలా
కారాకృతార్చనలఁ బ్రీతిఁ గాంచి యతనిఁ జె
న్నారఁగ సంరక్షింపవె
సారతరోద్భావ పార్థసారథి దేవా! 67

క. హీరసుదంత సుదంతా
వారిదనీలాలకా విహారంబై సిం
గారము నరంగు మీఱవె
సారతరోద్భావ పార్థసారథి దేవా!. 84

రెండవ శతక మగు నాయకీనాయక శతకము శృంగారరసప్రధానము. ప్రియుఁడు ప్రియురాలికి, ప్రియురాలు ప్రియునికి వ్రాయు వలపు సందేశములు వచ్చిగ నున్నవి. ఇవి తెలుఁగు దేశమునందు వేశ్యాలోకమునఁ బ్రచార మొందినవి. లోకానుభవములేని బాలురు బాలికలు చదువఁ దగినవి కావు.

### (2) నాయకీ నాయక శతకము. (స్త్రీపురుష విరహము.)

శ్రీకరుఁగా మహారసికశేఖరుఁగాఁ గరుణామయాత్ముఁగా
లౌకిక వైదికాది సకలాసుకళాపునిఁగా సుమూర్తిఁగా
బ్రాకట కీర్తిఁగా సకలపండితవంద్య గుణప్రవర్తిఁగా
లోకులు నిన్నుఁ జెప్ప విని లోనయితింగద నీకు నాయకా!

చిత్తజు మేల్మరాళికి, విశేషవరాళికి, జల్లగాలికిన్
మత్తమరాళికిన్, శశిసమగ్రకరాళికి, నిత్యముం ద్వదా
యత్తమునా విరాళికి, శుకాళి బికాళికిఁ జిక్కి తింక నీ
చిత్తము నాదు భాగ్య మిఁక చెప్పెడి దేమి? రసజ్ఞశేఖరా! 7

కంతుని, నవ్వసంతుని, మృగాంకుని, సంతుని నానలావనీ
కాంతుని, నజ్జయంతుని, ముఖాముఖిఁ గెల్వఁగఁజాలు రూపమా
వంతుని, నిన్నుఁ బాసి వలవంత నిదెంతని తాళువాన నా
చెంత నిరంతరస్థితి వసింపఁగదే, రసికావతంసమా! 14

నిన్ను మనంబునం దలఁచి నీరజసాయక సాయకాహుతిన్
ఖిన్నతనొంది నీప్రియసఖి న్నతవృత్తినిబాతిమాలి నీ
యున్న నివాసభూమికి నయోన్నతిఁ దోడుక పొమ్మటన్న నా
విన్నప మాలకింప కది వేఱుగఁ జూచెఁగదే మనఃప్రియా! 31

ఇంపుఁ దొరంగి సారె యలయింపఁ గుమారుని రేచ నన్ను డా
యింపకు, కోపమిచ్చ యలయింపకు, మున్నటి నేస్తమెల్ల మా
యింపకు, బోవఁదల్చి వినయింపకు నీ విరహాగ్ని గాసి సే
యింపకు మార్గ్వబుద్ధి వహియింపకు, మొక్కెద నామనోహరీ! 44

భువి విటకాంద్ర కింపుమది బుట్టఁగ స్వోచితవృత్తి మీరఁ దోఁ
ట విజయరాఘ వాఖ్యకవి డంబుగఁ దా రచియించె హృద్య మా

ర్ణవరస పూర్ణలాలిత సుధామధురోక్తుల రక్తిగుల్కఁగా
రవముసఁ జేకొనుండు కవిరాజులు తప్పులు పట్టకెంతయున్. 51

---

# కొమఱ్ఱాజు రామలింగకవి

ఇతఁడు శ్రీగిరిమల్లేశశతకము, వీరభద్రశతకము మొదలగు చాటుకృతుల రచియించెను. కొమఱ్ఱాజువారు రమారమి నూఱు సంవత్సరముల క్రితము లింగధారణ మొనర్చుకొని శైవులైన యార్వేల నియోగులు. వా రవలంబించిన క్రొత్తమతము నందలి పట్టుదలచేఁ గొన్ని శైవశతకములు వ్రాసిరి. మునగాల దివానులుగను, విజ్ఞానచంద్రిక, విజ్ఞానసర్వస్వముల సంపాదకులుగను నుండిన శ్రీలక్ష్మణరావుగారికి వీరు పూర్వులు. ఈ రామలింగయ్యగారు వారికిఁ బినతాత. రేపాలరాజలింగశతకము వ్రాసిన వెంకటప్పయ్యగారు శ్రీలక్ష్మణరావుగారితండ్రి. వీ రేఁబదెనుబది సంవత్సరముల క్రిత ముండిరి. క్రీ. శ. 1850 ప్రాంతముల రామలింగకవి యుండె ననవచ్చును! వీరి వంశవృక్షము చూపెదను. వీరిది భారద్వాజసగోత్రము.




## (1) శ్రీగిరిమల్లేశ శతకము.

సీ. శ్రీపార్వతీదివ్య చిత్తాబ్జసారంగ
సారంగ దానవక్షణనభీమ
భీమాట్టహాస విభేతాంధకపుర
పురపూర్వదేవ సంహారణబాణ
బాణగృహద్వారపాలనవిధిదక్ష
దక్షమఖధ్వంస ధరనివాస
వాసవపూజిత వరపాదరాజీవ
రాజీవపదహార రాజమిత్ర
మిత్రచంద్రాగ్ని నేత్ర యమిత్రవిశర
శరధితూణీర నను(బ్రోవు స్మారహర!

రామలింగార్యపోష సద్రాజభూష
శరణు శ్రీగిరి మల్లేశ శాంకరీశ! 1

ఉద్భటారాధ్యవంశ్యుఁ డగు వీరభద్రయోగి కవి గురువు. ఇందు భక్తి హెచ్చుగ నున్నది. పరమతనింద యున్నది, ఆక్షేపణము లున్నవి. ఈ కవి యిష్టదైవము "దుర్వర్ణశైలవాసుఁడు" (91 పద్యము)

సీ. కాలికిఁ జెప్పట్టు జోళ్లెఱుంగనివారు
పల్లకు లెక్కుటి పాల్పడిఁ గనిరి
కట్ట గుడ్డలు లేక కడు కృశించెడివారు
దివ్యాంబరప్రాప్తిఁ దేజరిలిరి
కుండ కూడెప్పుడుఁ గుడుచుచుండెటివారు
బిండె తప్పేలాల పెంపుఁ గనిరి
తమిదంబలియు లేక తప సొనర్చెడివారు
పరివంటకంబుల వప్పుఁ గనిరి

గీ. బండెపోట్లను ఖైదునఁ బడ్డవారు
పెద్దలైనారు నేఁటికి పేరుఁ గనిరి
రామలింగార్యపోష సద్రాజభూష!
శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ॥ 57

## (2) వీరభద్ర శతకము

క. శ్రీవీరభద్ర నే మది । భావించిన సిరు లొసంగు భవము నణంచున్
సేవించ మోక్షపదవులు । గావించును వీరభద్ర కారుణ్యనిధీ! 1

క. వర కొల్లులూరిపురిలో । స్థిరమతిచే వెలసి భక్త సేవితమతివై
ధర కీర్తిఁ జెందితౌరా । కరుణించుము వీరభద్ర కారుణ్యనిధీ! 3

క. సిరి తోఁబుట్టువ నెచ్చెలి । హరిదశ్వుని దంతచయము లణఁగించుటచే
వెరగందిపారి రమరుబు । కరుణించుము వీరభద్ర కారుణ్యనిధీ!

---

## అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

అల్లమరాజువారు ఆరామద్రావిడబ్రాహ్మణులు. వీరిది హారితస గోత్రము, ఆపస్తంబసూత్రము. వీరిలోఁ గవులు చాలమంది కలరు. మన మెఱిగియున్నంతలో, బాపయకవి, పూర్వుఁడు. ఇతఁడు గౌతమీమాహాత్మ్యము వ్రాసెను. ఇది యంత మంచి కవనము కాదు. ఇతఁడు క్రీ॥శ॥ 1735 ప్రాంతములవాఁడు. ఇతని కొడుకు ఎల్లన్న. ఎల్లన్న కొడుకు రంగధాముఁడు. ఈతఁడు నారాయణాచలమాహాత్మ్యమును వ్రాసెను. ఈతని కొడుకులలో రామకృష్ణ, సుబ్రహ్మణ్యకవులు పెక్కు గ్రంథములు వ్రాసిరి. వీరి తండ్రి యైన రంగధాముఁడు నారాయణాచలమాహాత్మ్యమును వ్రాసి చినబాపభూపునకుఁ గృతియిచ్చెను. ఇది మూఁడాశ్వాసముల గ్రంథము. ఇతఁడు విజయనగర ప్రభు వగు నారాయణగజపతిగారిపై 8 అర్థముల చాటుపద్యములు వ్రాసెనఁట! ఇతఁడు ద్రోణాచార్యులవలె సాముగరిడీలు చేయుచు వింజర మను గ్రామములోఁ గొందఱు క్షత్రియుల కావిద్యలు కొంతకాల ముపదేశించుచు శరీరపారిశ్రామికగురువుగా నుండెను. ఇతఁ డఱువదిసంవత్స

రముల ప్రాయమున నిప్పటికి 75 సంవత్సరముల క్రితము మర ణించె నని తద్వంశీకు లనుచున్నారు.

రామకృష్ణకవి 19 వ శతాబ్దమున నుండెను. సుబ్రహ్మణ్యకవి సోదరుఁడు. పిఠాపురము సమీపము నందలి చేఁబ్రోలు గ్రామవాస్తవ్యులు. ఈతఁడు మాడుగుల కృష్ణభూపతిని దర్శించెను. ఇతఁడు కవిచకోరచంద్రోదయము, వైనతేయవిజయము, సత్యభామావిలాసము, గౌతమీమాహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, సుశోభావివాహము, హనుమదాఖ్యానము, సుకవిజనమనోరంజనము, మదాలసాపరిణయము, శంతనువిలాసము, అధ్యాత్మరామాయణము, అచ్చతెలుఁగుభాగవతము, రామకృష్ణీయ మను ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్యను వ్రాసెను. కవిచకోరచంద్రోదయమును దాక్షారామభీమేశ్వరునకు క్రీ॥ శ॥ 1835 సం॥రమునఁ గృతి యిచ్చెను. రామకృష్ణీయము క్రీ॥శ॥ 1841 లో ముగించెను.

సుబ్రహ్మణ్యకవి మాడ్గుల కృష్ణభూపతి కంకితముగ ప్రత్యక్షరశ్లేషపద్యావళిని, మెనుముల రామనదొరను మెప్పింప మణిధ్వజచరిత్రమును, భద్రాపరిణయమును, ఆత్మబోధమును, శేషధర్మేతిహాసమును, శ్రీకృష్ణకళ్యాణమును రచించెను. భద్రాపరిణయ మను కావ్యము పిఠాపురప్రభు వగు శ్రీగంగాధరరామారాయనింగారి కంకితము చేసెను. ముకుందవిలాసము దొంగిలించి సుబ్రహ్మణ్యకవి దానికే

భద్రాద్రిపరిణయ మని పేరు పెట్టి కృత్యాదిపద్యములు మొదలగునవి మాత్రము కొంచెము మార్చి వ్రాసెను. శ్రీకృష్ణకళ్యాణము వ్రాసి బచ్చు రామేశ మను వైశ్యునకుఁ గృతి యిచ్చెను. ఇవిగాక సుబ్రహ్మణ్యషక్కికలు వ్రాసెను. ఇది సంస్కృతములో వ్రాసిన తెలుఁగువ్యాకరణ విమర్శనము. ఇతఁడు పెక్కు శతకములు కూడ వ్రాసెను. (1) సింహాద్రి రామాధిపశతకము (2) పాపయమంత్రిశతకము (3) కృష్ణభూపాల శతకమును వ్రాసెను. ఈ పై కవుల కవిత్వము సాధారణముగా నిస్సారముగ గతానుగతికముగఁ గష్టపడి వ్రాసినట్లుండు నని తజ్ఞు లనుచున్నారు. సుబ్రహ్మణ్యకవి క్రీ॥ శ॥ 1892 లో మరణించెను. ఈతని పుత్రుఁడు రంగశాయికవి జీవించియున్నాఁడు. ప్రతి శతకమునుండి కొన్ని పద్యముల మాత్రము చూపెదను.

## సింహాద్రిరామాధిప శతకము

మ. మును బాల్యంబునఁ గొంచమేని సలిలంబు ల్పోసి పోషింప మ
న్నిచిన యా నారికెళంబు పిమ్మట ఫలానీకంబు స్వాదూదకం
బు నజస్రంబు నొసంగు నట్లు ప్రకృతిం బుణ్యుండు దాఁ దొల్త గాం
చి నితాంతంబు నొనర్చు ప్రత్యుపకృతిన్ సింహాద్రిరామాధిపా!

శా. శృంగారైకరసప్రధానకవితాశ్రీనూక్తిచే నంగనా
పాంగాలోకనభాషణాదికముచే భాసిల్లు గానంబుచే
సాంగంబౌచుఁ గఱంగ దెవ్వని మనం బాతండు లాంగూలమున్
శృంగద్వంద్వము లేని యెద్దనఁబడున్ సింహాద్రిరామాధిపా!

66 పద్యము లిట్లు వ్రాసి 67 వ పద్యము నుండి శంకరాచార్యకృతమైన ప్రశ్నోత్తరరత్నమాల తెలుఁగులోనికి శతకఘణితినే భాషాంతరీకరించియున్నాఁడు.

శ్లో॥ భగవన్ కిముపదేయం గురువచనమ్
హేయమపిచ కిమ కార్యం కోగురు రధి
గతతత్త్వస్సత్యహితాయోద్యతస్సతతం.

మ. అమరన్ గైకొన నర్హ మెద్ది గురువాక్యం బెద్ది హేయం బకా
ర్యము, సేవించుట కెవ్వఁ డుత్తమగురుం డశ్రాంతి మామ్నాయసూ
క్తమహీన్ వాక్యగతార్థనిశ్చితవిబోధి పాపిభవం బెల్లఁ గాం
చి మనోమారుతముల్ జయించి నతఁడే సింహాద్రిరామాధిపా!

మ. ధరణిం బొల్పగు శాలివాహన శకాబ్దంబుల్ నిధిబ్రహ్మభూ
ధరచంద్రస్ఫుట సంఖ్యలం జరుగఁగా ధాత్రబ్ద మాఘాద్యమై
యరయం బంచమి శుక్రసారమునకున్ సాంగంబుఁ గావించు నీ
స్థిరసత్కావ్యము నంది తీవు సభలో సింహాద్రిరామాధిపా!

శా. బ్రాహ్మీభవ్యకృపానులబ్ధకవితా ప్రాగల్భ్యనిక్ నన్ను సు
బ్రహ్మణ్యుం గని వేంకటాద్రినగరగ్రామంబున న్మాన్యమా
బ్రహ్మస్థాయిగ నిచ్చి హేమకటకద్వంద్వంబు వస్త్రాళిని
ర్జిహ్మస్వాంతతఁ గొంత సొమ్ము నిడితౌ సింహాద్రిరామాధిపా!

శరభవరం సమీపమం దున్న సింహాద్రి రామందొర గారు కృతిపతి. ఈయన కొంత భూమి యిచ్చెను. వీరు "ఒంటరులు." ఈ కవి వ్రాసిన యితర శతకములు.

## (2) పాపయమంత్రి శతకము

ఉడుతల పాపయ్య యను నియోగికిఁ గృతి. శేషధర్మములు కూడ నీతని యిష్టదైవ మగు శ్రీరామునికిఁ గృతి. ఇది వర్తమానతరంగిణిలో ముద్రింపఁబడినది. ప్రతిఫలముగఁ గృతిపతి కవికి నూఱురూపాయ లాదాయము వచ్చు భూమి లింగంపర్తిలో నిచ్చెను. ఇది కవి పుత్రులు నాలుగేండ్ల క్రింద నమ్మివేసిరి.

## (3) కృష్ణభూపతిలాలమ శతకము

ఇది మాడుగుల కృష్ణభూపతికిఁ గృతి. 116 లు బహుమాన మిచ్చి పిమ్మట సంస్థానకవినిఁ జేసికొనెను. ఈయన యొక సంవత్సరము మాడుగులలోఁ గాపురముండఁగా భూపతి మరణింప స్వగ్రామ మగు చేబ్రోలు వచ్చిరి.

## (1) శ్రీకృష్ణభూపతిలలామ శతకము

సీ. బొండుమల్లెకు లసద్భూరిసౌగంధ్యంబు
చెఱుకుఁ గోలకు సముంచిత మధురిమ
కంఠీరవమున కుగ్రప్రభావ సమృద్ధి
యంచకుఁ బాలు నీ రెంచు నేర్పు
గండుఁగోయిలకుఁ జక్కని కలధ్వనిలీల
ప్రహ్లాదునకు హరిభక్తి నియతి
మలయానిలమునకు లలితశీతలవృత్తి
వాణికిఁ జాతుర్య వర్ణనంబు

గీ. నీదు వితరణశీలంబు లోక మెల్లఁ
బొగడుచుండఁగఁ దోడనె పుట్టెనార
మత్స్యకులదీప దివ్యమన్మధసురూప
పరమగుణధామ! కృష్ణభూపతి లలామ!

సీ. కొంక నక్కకు శౌర్యగుణ మెంతగల్గినఁ
గంఠీరవము మీఁదఁ గవయఁగలదె?
బలుగూడకొంగకుఁ దెలు పెంత గల్గిన
నవమరాళము రీతి నడువఁ గలదె?
బొంతకాకికిని గొండంత నోరున్నను
గోకిలతో సరి కూయఁగలదె?

* * * *

యెంత బలమున్న వైరిభూకాంతుఁ డధిప
నీ నిరాఘాటధాటికి నిలువఁగలఁడె
మత్స్యకులదీప దివ్యమన్మధసురూప
పరమగుణధామ! కృష్ణభూపతిలలామ!

ఇది సుబ్రహ్మణ్యకవి స్వంతకృతియే యైనచోఁ జాల దివ్యముగనున్నది. మాడుగుల కృష్ణభూపతి వంటి రాజును వర్ణించి యీకవి ధన్యుఁ డయ్యె ననవచ్చును.

## (2) పాపయమంత్రి శతకము

క. లాలిత కవిత రసజ్ఞుని
పాలుపడఁజెనేని మిగుల భాసిల్లుఁ జుమీ
మేలైన వరుని కొసఁగిన
బాలారత్నంబు రీతి పాపయమంత్రీ! 14

క. పలువురు దుర్బలు లొకటిగ
నలమి బలాధికుని నొంతు రట్లయగుఁ దృణా

పతివ్రతరజ్జువు దంతా
వలమైనం గట్టువడదె పాపయమంత్రి! 27

క. ఏరికి భాగ్యమె సుమ్మా
కారణ ముద్యోగకలనఁ గా దలహరికిన్
శ్రీ రమణి, విషము హరునకు
వారిధి మథనమున దొరకె పాపయమంత్రీ! 42

క. పురుషులకుఁ దొడవు శాంతత
పరసతులకుఁ దొడవు లజ్జ వసుధాపతికిన్
స్థిరధర్మపథము దొడ వం
బరమే తొడ వందఱకును బాపయమంత్రి! 56

క. విభవ మనేకుల కొసఁగిన
ప్రభు వొక సుకవి కిడకున్నఁ బాయును కీర్తిన్
ప్రభలును నూఱ్ఱోన్నముల నొక
వ్యభిచారిత దొలఁగకున్నె పాపయమంత్రీ! 99

క. తగురామున కొసఁగితి వె
న్నగ మిక్కిలి మల్లికార్జున కవీంద్రునిచే
నొగి తెనుఁగుగఁ గూర్పించిన
భగవద్గీతాది కృతులు పాపయమంత్రీ!

క. ఈ మెచ్చిన కృతికై నా
కేమిచ్చిన మనసు దనియ దించుకయైనన్
భూమిచ్చిన నీయోగ్యత
పైమెచ్చును లోక మెల్ల పాపయమంత్రీ!

ఈ విధముగ యాచించి భూమినందీ యా జాతినే తరువాత నీతఁడు తిట్టెనా? కటకటా!

క. హరిపూజాపరులై భా
సురులగు భూసురుల కెల్ల సుక్షేత్రసమ
త్కారములు మందిరములు నం
బరముల నిచ్చితివి నీవు పాపయమంత్రీ!

క. సుమఫలముల సమనలముల
సమజలములు గలిగి వెలయు సాంద్రతరూద్యా
నములు తటాకములును గూ
పములుం బ్రతిష్ఠించి తీవు పాపయమంత్రీ!

క. ఘనలింగపర్తిపురం
బున సుక్షేత్రముగ రెండు పుట్లగు భూమిన్
గనకాంబరాభరణములు
వనరుగ నొసఁగి తీవు పాపయమంత్రీ! *

---

* ఇట్టి చిన్నశతకము వ్రాసినందుల కీ కృతిపతి కవికి గొప్పభూదాన మొనరించెను. ఇట్లు నియోగుల సొమ్ము వంశపారంపర్యముగఁ దినుట కంగీకరించిన యీకవి నియోగులను బూరుగవృక్షము లని దుష్కృత్య మొనరించియే యుండిన నది కృతఘ్నత యగును గాదా! (వెనుకకు చూడుడు 367 - 368 పుటలు ఈ శతకకవులచరిత్రమే) ఇట్లే యనేకు లీ కాలమునందుఁగూడ నియోగులను ప్రభువు లని పొగడుచు, ప్రారంభమున వారి యాస్థానకవుల మని చెప్పుకొని వారిచేఁ గృతులిచ్చి బ్రతుకుచు పిమ్మటఁ దమకు మహాపదవి వచ్చిన దనుకొను గర్వముతో నియోగిజాతినే తిట్టి నీచవృత్తికి దిగి పతితులగుచున్నారు. ఇది యెంతవైపరీత్యము! పూర్వమంత్రులు తమసోదరు లగు పండితుల కనేకవేల యగ్రహారము లిప్పించుటకుఁ గారకులు. ఇప్పటి యా పండితులసంతతివా రా యగ్రహారము లనుభవింప నర్హతలేనివారు. తమ సోదరులు దాతలు నగు వారిసంతతివారిని నిందించుటయే పరమావధిగఁ బెట్టుకొనుటఁ జూడ జాలి కలుగుచుండును. తెలుఁగుకవి యన్నను, దాన భాస్కరుఁ డన్నను దేశ మెల్లయెడల నిప్పటికి నియోగియే యనవలసియుండఁగా నీ యారామద్రావిడి చాటుపద్యము మాకు హానికర మని యీ వాక్యములు వ్రాయలేదు. సత్యేతరము వచించినది కాదంటిని. తమ సోదరులు, పోషకులు నగువారిని నిందించుట తగదంటిని.

మంత్రి యిచ్చినట్లు వాడుక కాదు! కవి సమ్మతిని వ్రాసి యిచ్చిన రసీ దిది.

క. బ్రాహ్మీప్రసాదలబ్ధా
జీహ్మసత్కవిత మెచ్చి సిరిని దనిపితా
బ్రాహ్మణు నల్లమరాట్సు
బ్రహ్మణ్యకవీంద్రు నన్ను పాపయమంత్రీ!

---

## పరిమి వేంకటాచలకవి

ఇతఁడు హారితసగోత్రుఁడు. ప్రథమశాఖానియోగి బ్రాహ్మణుఁడు. సూరమ రఘునాయకుల పుత్రుఁడు. తుంగభద్ర సమీపమునందలి జాగర్లమూడి నివాసి. "ఈనోడు" సమీపమునందలి "భవానీకూడుదల్" అను ప్రసిద్ధ శైవస్థలమునం దున్న దేవుని "కూడలిసంగమేశ్వరా!" అని సంబోధించెను. మా ప్రాంతముల "సంగము జాగర్లమూడి" యని వాడుక వినియుంటిని. ఇతఁడు కంచర్ల గోపన్నవలెనే యాదిశాఖవాఁడ ననుకొనెను.

### సంగమేశ్వరశతకము

ఉ. నెయ్యాను మీఱఁ దొల్లి కరుణింపవె సత్కృపతోడ నాది రా
జయ్యను బండితార్య బసవన్నను శానిమయాది కోటకో

టయ్యను దేశిరాజు సిరియాళునిఁ జోళమహీశు
మయ్యను బాచరాజు దరసయ్యను గూడలి సంగమేశ్వరా! 18

ఉ. కానుకఁ గందపద్య మఱకానుకు వృత్తము గుడ్డిగవ్వకున్
సీసముగా నిటు ల్చవుకఁ జెందెఁ గవిత్వము గావున న్మనో
ల్లాసితులౌ ధరాధిపతుల న్మది రోసి నిను న్సదా నుతుల్
చేసెద వేగ నన్ను దయసేయవె కూడలిసంగమేశ్వరా! 72

చ. చిరకృప మంగళాద్రి నరసింహుఁడు నా మదిపాదులోన సు
స్థిరముగ నాట నంత భవదీయకటాక్ష సుధాప్రవృష్టిపైఁ
గరిసిన నెచ్చి నల్దెసలఁ గూడిన మాయక కావ్యకల్పవ
ల్లి రహిఁబుధావళి మెచ్చగ ఫలింపదె కూడలిసంగమేశ్వరా!

ఉ. మేలుగఁ దుంగభద్రకు సమీపమునం దమరావతీ పురిం
బోలినయట్టి "జాగరలమూడి" పురిం దగ సర్వమంగళా
లోలుఁడవై వసించి, సిరుల న్నిజభక్తుల కిచ్చుచున్ దయా
శీలత నొప్పుచుందువు ప్రసిద్ధిగఁ గూడలిసంగమేశ్వరా!

చ. నరహరిభక్తి మించు "రఘునాయక" మంత్రికి "సూరమాంబకున్"
వరసుతుఁడన్ ధరం "బరిమి వంశజుఁ"డన్ భవదీయ దాసుఁడన్
"హరితసగోత్రజుండఁ" జెలువొంద జనించితి "నాదిశాఖ" యం
దరయఁగ వేంకటాచల "సమాఖ్యుఁడఁ" గూడలిసంగమేశ్వరా!

---

## వేల్పూరి వేంకటకవి

---

ఈతఁడు "శ్రీమద్గౌరీరమణకృపాకటాక్షప్రసాదలబ్ధ
కవితావిద్యానవద్యగద్యపద్యయక్షగానాదిగ్రంథముల" రచి

యించినవాఁడు. ఈతఁడు జానకీరామశతకమును, గౌరీశంకర విలాస మను నాట్యప్రబంధమును, శ్రీరామలీల యను యక్షగానమును, గోవ్యాఘ్రచరిత్రమును, విచిత్రరామాయణ మును పద్యమయముగను, కందతారావళిని, యింక ననేక మాలికాదులను రచియించెను. "నియోగిబ్రాహ్మణుఁడు, మౌద్గల్య గోత్రుఁడు, బ్రహ్మనామాత్య పుత్రుఁడు" నని కవులచరిత్ర మనుచున్నది. ఈతని వాసస్థానము విశాఖపురి మండలము నందలి విజయనగరసంస్థానములోని రావివలస యను గ్రామ మనియు, క్రీ॥శ॥ 1851 సంవత్సరమున స్వర్గస్థుఁడయ్యె ననియుఁ గూడ కవిచరిత్రకారులు వ్రాసిరి.

విచిత్రరామాయణకృత్యాదిని కవి తా నా గ్రంథము డొంకా గోపినాథకవి రచియించిన వచనకావ్యము ననుసరించి వ్రాసినట్లు చెప్పుకొనెను. డొంకా గోపినాథునిఁగూర్చి యొక సారి యిట్లు వ్రాసియుంటిని "ఇతఁడు విచిత్రరామాయణము నుత్కళభాషనుండి భాషాంతరీకరించి తెలుఁగులో వచన ముగ వ్రాసెను. వాల్మీకి కుశలవులచే రాముని యెదుటఁ బాడించుటకు వ్రాసిన గ్రంథానుసారమఁట. ఇతఁడాదికవి స్తుతిలోఁ దిక్కన్నను మాత్రము స్తుతించెను. సిద్ధేశ్వరదాసుం డుత్తరదేశమున నోఢ్రభాష రచియించినదాని కిది తెలిఁగింపని తెలిపెను. కవి స్తుతికరణము. డొంకాన్వయంబున భారద్వాజగోత్రంబున జన్మించినవాఁడు. లక్ష్మీనారాయణ

నామధేయము గల దంపతుల పుత్రుఁడు. ఛంద మెఱిఁగినవా
రేరైనఁ బద్య మొనరింతు రని వచనమున వ్రాసెను. వచ
నము రసవంతమై హృద్యమై యున్నది. గద్యకావ్యముల
యం దాదరణ లేని దినములలో వ్రాసినవాఁడు కావునఁ
బద్యమున వ్రాయలేకపోయినందులకుఁ గవి విచారించెను.
కృత్యాది పద్యములలో నున్నందున నీతఁడు పద్యములు
వ్రాయలేనివాఁడు కాఁడు. ఈ కవి గురువు జగన్నాథుఁడు.
ఇతఁడు వితరణవిజితరాధేయుం డని గద్యము చెప్పుచున్నది''

(సుదర్శని పత్రిక 1-4-1918: హితకారిణి 2-12-1917 చూడుఁడు.)

ఈ వచనకావ్యమును మన వేలూ్ప్రి వేంకటకవియే
గాక గోదావరిమండలము నందలి వెలగతుఱ్ఱు వాస్తుఁ డగు
నరసింహదేవర వేంకటశాస్త్రి కూడ పద్యమయముగ వ్రాసి
యుండెను. ఇతఁడు మహేశ్వర సూరి పుత్రుఁడు, ఆపస్తంబ
సూత్రుఁడు, శ్రీవత్సగోత్రజుఁడు నని తెలియుచున్నది. కాని
యీ రెండవగ్రంథము వేలూ్ప్రి వేంకటకవి దాని కంటె
దోషము లున్నను రసవంతముగ నున్నదని కవులచరిత్రమున
వ్రాసిరి.

వేలూ్ప్రి వేంకటకవిచరిత్రము జానకీరామశతకారం
భమున వేంకటకవి పుత్రుఁడైన వెంకట్రామయ్యగారు పద్య
ములలో వ్రాసియున్నారు. అందలి విషయములు పైని

జెప్పియుంటిని. ఈ క్రింది పద్యములో నాతని చరమకాలము చెప్పియున్నారు.

ఉ. ఇర్వదినాల్గు హాయనము లింపుదనర్చిన కాలమాది యా
శర్వుని యాజ్ఞచేఁ గృతుల సర్వముఁ జెప్పి త్రిషష్టివర్షముల్
యుర్వరఁ గీర్తినొంది జనె నొప్పుగ స్వర్గము; యాగకర్మ తా
ఖర్వము శాలివాహనశకాబ్దము లగ్ని నగాద్రి చంద్రులం
బర్వు విరోధికృన్మహితవత్సర నాశ్వినకృష్ణపంచమిన్
సర్వకలాప్రవీణ కవిసత్తము వేంకటమంత్రి ధాత్రిలోన్.

కవి క్రీ॥ శ॥ 1850 లో కీర్తిశేషుఁ డయ్యె ననియు, 63 సంవత్సరములు జీవించె ననియుఁ దెలియుచున్నది. శైలి తెలియుట కీతని పద్యములు కొన్ని చూపెదను.

సీ. నా మొఱ్ఱ విన విదేనా భక్తపరిపాల
నా సక్తి నీ వల్ల నాయె నేని
చేపట్టి కృపఁజూడు చేతగాకున్న నీ
కన్న మిక్కిలి వేల్పులున్ననైన
నన్నప్పగించి మన్నన నేలుమని ప్రతి
మాలు యాచన నీచమా ప్రసిద్ధ
మే మీకు దేవతా భూమీశు కొఱకునై
బలిని వేడవె పొట్టిబాపడవయి
భువిత్రిపదములుఁ దొల్లి నీ బూమె లెల్ల
దలఁచి చూచిన కరతలామలకమయ్యె
రామ! దనుజవిరామ! సంగ్రామభీమ!
జానకీరామ! రవికుల సార్వభౌమ! 5

సీ. కడుసోయగంపు బంగారుచేలము గట్టి
నాగరికంబైన పాగ జుట్టి

శృంగారమగు పువ్వు టంగీ బచారించి
జిలుగు నుస్ధుప్పటి మొలఁ బిగించి
ఫాలస్థలమునఁ బెంపారు కస్తురి దిద్ది
చోప్పాణిముత్యాల గొప్పపోగు
లొప్పారఁ దాల్చి సారోదారనవరత్న
ఖచితాంగులీయముల్ ఘనతఁ బూని
యున్న నినుఁగాంచుటకు వేయి కన్నులున్నఁ
జాలవని యన్న కందోయి నేలయన
రామ! దనుజవిరామ! సంగ్రామభీమ!
జానకీరామ! రవికులసార్వభౌమ! 3

సీ. భరతుఁ డిచ్చిన రాజ్య భారకత్వము మాని
కైక కపఖ్యాతిఁ గట్టినావు
తగుభక్తి నల సుమిత్రాసూతి నిను నమ్మి
చేరిన సన్యాసిఁ జేసినావు
కాలోచితుఁడవై యకారణంబుగ మాటు
పొంచి వాలిని సంహరించినావు
జనకరాట్పుత్రి వాస్తవ మెఱుంగుట మాని
తుద కగ్నిలోపలఁ ద్రోచినావు
తొల్లి నమ్మినవారికీ దొడ్డలాభ
మబ్బె నిఁక నేమి గల్గు దురాశ గాక
రామ! దనుజవిరామ! సంగ్రామభీమ!
జానకీరామ! రవికులసార్వభౌమ! 36

సీ. నిగనిగలాడు నీ నగుమొగమున ధగ
ద్ధగ లీను చెక్కుటద్దముల చెంప
కల్లీలపొంత జగాజిగితో దశ
ముఖ బాహుగర్వనిర్మూలనంబు

గావలె త్వరితంబుగా నని తెల్ప వ
చ్చిన గురుకుసుత్రిలోఁ యనఁగ నా_క్తి
కములు బ్రకాశింపఁగాఁ నీ యొయ్యారంబు
గని దశరథరాజు గాధిసుతున
కియ్య నను మాట నేరమే యితర జనులు
దాళఁజాలరు కైక మాత్రంబు దక్క
రామ! దనుజవిరామ! సంగ్రామభీమ!
జానకీరామ! రవికులసార్వభౌమ! 49

# మంచెళ్ల కృష్ణకవి

ఇతఁడు వేంకటనగాధిపతిశతకమును వ్రాసెను. ఇతఁడు పాపయ్య మంత్రి పుత్రుఁడు. భారద్వాజసగోత్రుఁడు. కడచిన ప్రభవసంవత్సరము నాఁటికే యాతని శతకము తాళపత్రముల కెక్కియున్నది. శైలి మృదుమధురముగ నున్నది. కవి క్రీ॥ శ॥ 1850 కిఁ బూర్వుఁడై యుండవచ్చును. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## వేంకటనగాధిపతి శతకము

శ్రీమహిళాభిరామ మునిశేఖర సంస్తవసోమ తోయద
శ్యామ మరుల్లలామ సమరాంగణభీమ నితాంత వైభవో
ద్దామ సమస్తభవ్యగుణధామ మహీజనదోష హృత్ప్రశ
స్తామితనామ వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ! 1

ఖాత్రిజిత మంచళాన్వయుఁడ పాపయమంత్రి తనూజుఁడన్ భర
ద్వాజసగోత్రజుండ తవభక్తుఁడ కృష్ణకవిన్ భవత్పదాం
భోజయుగాంకితంబుగ సమున్నతిఁ గావ్య మొనర్చినాఁడ న
వ్యాజతఁ గొమ్ము వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ! 11

అంచితమైన కావ్యరస (మారసఁ) గాంచి రసజ్ఞునట్లు మో
దించునె ముష్కరాధముఁడు దేవనదీజలజాతకాండముల్
గాంచి ముదంబు బొందుట బకంబున కెన్నఁగ శక్యమానె రా
యంచకుఁ గాక వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ! 23

చేసిన పాప మెల్ల మఱిఁజెప్పినఁ బాయు నటంద్రు పాపముల్
జేసిన హానియుం చనక సేయఁగఁ గాంచి మహోగ్రకృత్యముల్
జేసితిఁ గాన నీకెఱుఁగఁజేసితి నేగతి నన్నుఁ బ్రోచెదో
యాసురవైరి వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

వేమరు వేడసాగె నని వేసట నొందితొ యట్లుగాక నీ
పామరుబ్రోవ నెయ్యది యుపాయ మటంచును చింతఁ జెందితో
యేమొఱఁబెట్టినం దలఁచ వెక్కడి రాజసమయ్యొ నీకు భ
క్తామరశాఖి వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ! 77

---

## తిరువాయిపాటి రామానుజయ్య

ఇతఁడు "మానితకార్య భవ్యబహుమానుఁ" డట! వేంకట రామ సోదరాఖ్యానుఁడు. 101 పద్యములు గలవు. ఆముక్తమాల్యద కథానాయక యగు చూడికుడుత్త యను రంగనాయకిని సంబోధించుచుఁ జెప్పినది. శైలికిఁ గొన్ని

పద్యములఁ జూపెదను. క్రీ. శ. 1850 ప్రాంతమువాఁడై యుండును.

## చూడికుడుత శతకము

ఉ. పారములేని మోహపరిపాకమునన్ మదిఁ బొంగి రంగమ
న్నారుహరిన్ వరించు మదనాగలసన్నిజయాన దివ్యమం
దారసుగంధి చూడికుడుతా యని పిల్చినఁ బల్కవేమి నా
నేరము లెంచ నీకుఁ దగునే సడిదాగునె రంగనాయకీ! 4

ఉ. మా యని విన్నపంబు వినుమా యని సద్గుణ మంజు పుంజ సీ
మా యని వార్ధిఁగన్న ఫలమా యని పాయని విష్ణుచిత్త జా
తా యని నేఁడు చూడికుడుతా యని పిల్చినఁ బల్కవేమి నీ
నాయెడ నింతవింతఁ దగునా జననీ యిఁక రంగనాయకీ! 23

ఉ. కొట్టి పిసాళిదేవతలకున్ దలయొగ్గి భజించు టెల్లఁ బై
మిద్దెలమీఁదిగంతు మిడిమేలముఁ గావునఁ గావుమంచు నిన్
దద్దయు వేఁడి చూడికుడుతా యని పిల్చినఁ బల్కవేమి నీ
విద్దెలు మాని చేవిడువ జేని తరించెద రంగనాయకీ! 63

ఉ. ఇంచుక కల్మిఁగల్గి జనియించిన యాసతి నీటులేమి వ
ర్ణించఁగరా దసంఖ్య నొగి నిండిన సంపదఁ గల్గి నిన్ను నెం
తెంచు నుతించఁ జూడికుడుతా యని పిల్చిన బల్కవేమి గో
త్రాంచిత సత్క్షమాగుణనిధానమణీ వర రంగనాయకీ! 84

ఉ. శ్రీరమణీమణీ హరి వరించిన పల్లవపాణి విల్లిపు
త్తూర నెరాసిరుల్ గులుకు తొయ్యలి విన్నప మాలకించ రా
దా రయమొప్ప చూడికుడుతా యని పిల్చినఁ బల్కవేమి పం
కేరుహవాసినీ కనకకీలితభూషణి రంగనాయకీ!. 100

---

# శిష్టు సర్వశాస్త్రి

ఇతఁడు శిష్టు కృష్ణమూర్తికవి పుత్రుఁడు. ఈతఁడు కాసలనాటి బ్రాహ్మణుఁడు. ఈతఁడు తండ్రి మరణానంతరముకూడఁ గాళహస్తిలో నుండి యచ్చట నవధానము లొనరించెనఁట! ఈ కవి యమకమును గూడఁ దెలిఁగించెను. ఈతఁడు తండ్రి మరణించిన రెండుసంవత్సరముల కనఁగా ప్రజోత్పత్తిసంవత్సరమున ననఁగా నిప్పటికి రమారమి 50 సంవత్సరముల క్రిందట మరణించెను. ఈ శతకమునందు దామెర వేంకటపతి ప్రసంశ కలదు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

శా. శ్రీమాన్యం బగు కాళహస్తినగరీ సీమంబున స్సజ్జన
క్షేమప్రక్రియఁ గూర్చుచు న్సకలశక్తిస్తోమము ల్గాల్వఁ గొ
ల్వై మాన్యస్థితి నున్న నిన్విడిచినే నన్యాశ్రియంబొల్ల నన్
సామాన్యంబుగఁ జూడకమ్మ పుడమిన్ జ్ఞానప్రసూనాంబికా! 2

మ. సమదానేకమతంగజావళియు నాజేనేయవారంబు ను
త్తమరథ్యాళి రథంబులు న్సమరవిద్యాపాండితీమండితా
సమయోధావళి రత్నకాంచన సమంచత్వత్రదారాదియో
గము నీపూజలభించు నోజ నిజమో జ్ఞాన ॥ 16

శా. శ్రీయస్సంతతధామ దామెరకుల శ్రీ వేంకటేంద్రాజ్ఞఁ బ్రి
జ్ఞాయత్యాచిత సర్వశాస్త్రి యిటులాయ్యంజేసె జ్ఞానాఁబికా
గ్రీయానుగ్రహలీల బద్యశత మీరీతిన్ బఠింపన్ జనుల్
ధీయుక్తస్థితి నన్నివిద్యలఁ బ్రశస్తింజెంది పెంపెక్కరే. 103

## దూపాటి తిరుమలాచారి

ఇతని ముకుందశతకము భాగవతకథాభరితము. పద్యము లంత్యనియమయుతములు, ఏకసమాసఘటితములు, శ్లోక రూపములు మొదలగునవి కలవు. ఇతఁడు తిరుమల సింగర గురు శిష్యుఁడు (27) కవి లోహితాన్వయుఁ డగు దూపాటి కొండమార్యునకు, రంగమాంబకును పుత్రుఁడు. క్రీ. శ. 1871 కిఁ బూర్వుఁడు. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. రావిపాటి రామశతకమునందు షట్కాండల రామాయణకథ కాండ విభాగముచేసి 109 పద్యములలో ముగించెను. 108 బిందువులలో వాల్మీకికవి వ్రాఁతను జూపితి నని వ్రాసెను.

### (1) ముకుంద శతకము

క. బృందారక రిపుకదనా
   పందారు బుధాళిహృదయ వనరుహసదనా
   కుందముకుళాభరదనా
   మందస్మిత వదనమదన మదన ముకుందా! 9

క. శుద్ధాత్ముల త్రిపురాసుర
   శుద్ధాంతాంగనల వ్రతము చూరలుఁగొనవే
   బౌద్ధావతారము నసుగ
   సాధ్యాయములఁ బొగడ భక్త సాధ్య ముకుందా! 38

క. పతిశుశ్రూషామతులగు
   సతులకు నీ కుదయమైన సవినయశౌర్యా

న్వితులగు సుతుల గణింపఁగ
శతధృతి శర్వులకు వశమె సదయ ముకుందా! 85

క. భాసుర కాంచనమణిసిం
హాసన మొసఁగెదను పంకజాక్షకృపను నీ
వాసీనుఁడవై బ్రోవుము
శ్రీసతితోఁగూడి గుణధురీణ ముకుందా! 93

క. ఏలా లవంగ వరహిమ
వాలుక సత్క్రముకచూర్ణ వర్ణితమగు తాం
బూల మొసంగెదఁ గైకొను
శ్రీలలనారమణ మృదులశీల ముకుందా! 104

## (2) రావిపాటి రామ శతకము

సీ. భవదీయ పరిణయోత్సవసమయంబున
మహితవైవాహికమౌక్తికములు
అవనిజా పద్మారుణాంజలిపుటమున
పద్మరాగంబుల పగిదిఁ దోఁప
స్ఫుటతరవజ్రకిరీటశోభితశిరం
బున మల్లెమొగ్గల పోల్కిఁ దనర
భవదీయగాత్ర ప్రభాకలితంబులై
యింద్రనీలంబుల యింపుఁ బూన

తత్సభాసదు లెల్లరు తద్విచిత్ర
మునకు వెరగందుచును చాల మోదజలధి
మగ్నులై జూచుచుండిరె మఘువిరామ!
భవ్యగుణధామ! శ్రీరావిపాటిరామ!

సీ. పట్టాభిషిక్తులై భద్రపీఠంబునఁ
గూర్చున్న వేళలఁ గూర్మితోడ

భరతుండు ధవళాతపత్రంబు చేఁబూన
నల సుమిత్రాసుతు లమితమైన
భక్తిని కాంచన భరితరత్న విచిత్ర
దండచామరములు దాల్చి వీవ
వామదేవ వశిష్ఠ వాలఖిల్యాదులు
స్వస్తివాచకములు చదువుచుండ
సర్వభూపాలకులు నీదు చరణకమల
ములకు మ్రొక్కంగ శతకోటి వనజమిత్ర
తేజము వహించితిరి గాదె దేవదేవ
భవ్యగుణధామ! శ్రీరావిపాటిరామ!

---

# మేకా బాపన్న

ఇతఁడు నరసాపురముతాలూకా ఆచంట గ్రామవాస్తవ్యుఁడు. క్రమనాయకు లను కమ్మవారి కులమునకుఁ జెంది యుండును. ఇతఁడు క్రీ. శ. 1850 ప్రాంతములవాఁడు (శాలివాహన "లోచన, గిరి, శైలేందు" సౌమ్య)లో వ్రాసెను. చతుర్థకుల సంభవుఁడ నని చెప్పుకొనినాఁడు. శాస్త్రపురాణము లెఱిఁగినవాఁడని వ్రాసిరి. నాగయ్య చెల్లమాంబల పెద్దకొడుకు. ఈతఁడే మదనగోపాలశతకముకూడ వ్రాసెనఁట. అది నాకుఁ జిక్కలేదు. శైలికి రెండు పద్యములఁ జూపెదను.

## ఆచంటరామేశ్వర శతకము

సీ. చెన్నగు మొగమున వెన్నెల వెదఁజల్లు
నవ్వుతో జాబిల్లి పువ్వుతోడఁ
బెద్దవేలుపుపుట్టై పేరులఁ జెన్నారు
నురముతో జడలల్లు శిరముతోడ
పసిమిరంగుఁ జెలంగు పసమీరు పులితోలు
వలువతో సామేని చెలువతోడ
తలఁ గ్రాలు రతనాల తళ్కుల పాపరా
పేరుతో మెడకప్పు తీరుతోడ
నీవు విచ్చేసి దయఁ నేఁడు గావకున్న
ఎవరి వాఁడను నే నాదు నెంచి చూడు
భూతలోకేశ! ఆచంటపురనివేశ! 28
భావభవనాశ! రామేశ! పార్వతీశ!

పుట్టింప రక్షింపఁ బొలియింప నబ్జసం
భవుఁడవై శ్రీరమాధవుఁడవై భ-
వుఁడవయి యున్నాఁడ వొక్కఁడ వరయంగ
నాద్యంతశూన్యుండ వజుఁడ వాద్యుఁ-
డ వటంచుఁ దెలియు శుకాగస్త్యశౌనక
దూర్వాశ కౌశికాదులకుఁ గాక
వశమె యస్మాదృశకృశమనీషుల కెన్న
పటహాభూరిధ్వని స్ఫాయదుత్క-
టార్భటీఘోరకహాకహా కాట్టహాస
ఘోషనిర్భిన్న బ్రహ్మాండ కుహరదేశ!
భూతలోకేశ! ఆచంటపురనివేశ!
భావభవనాశ! రామేశ! పార్వతీశ! 72

---

# వికిృలి మల్లికార్జునకవి



ఇతఁ డేనుఁగు లక్ష్మణకవిదైన పెద్దాడ గ్రామవాస్తవ్యుఁడు. ఈతడు రామచంద్రచరిత్రము, నాచికేతూపాఖ్యానము, భేతాళపంచవింశతి, విక్రమార్కచరిత్రము. భగవద్గీత* రాఘవశతకము మున్నగు పెక్కు గ్రంథములు వ్రాసెను. ఈ కవి 70 యేండ్లు జీవించి క్రీ. శ. 1875లో మృతినొందెనని వీరి పుత్రులు దుర్గయ్యశాస్త్రిగా రనుచున్నారు. కావున నీ కవి క్రీ. శ. 1805లోఁ బుట్టియుండును. బ్రాహ్మణుఁడు. ఈతని విక్రమార్కచరిత్రము నేనుఁగు లక్ష్మణకవి జాహ్నవీమాహాత్మ్యప్రోత్సాహకర్త యగు నందూరి కామమంత్రి మునిమనుమఁ డగు కామమంత్రికి క్రీ. శ. 1856 (కలివర్షంబులు "ఋతుశరజలజోద్భవ వేదసంఖ్య") లోఁ గృతి యిచ్చెను. నాచికేతూపాఖ్యానము కీ. శే. పిఠాపురపుదివాను వాడ్రేవు చలమయ్యగారికిని, రాఘవశతకము మా పినమామగా రగు పోతాప్రగడ శ్రీరాములు పంతులు గారికినిఁ గృతి యిచ్చెను. పోతాప్రగడ శ్రీరాములు గారు గోదావరీమండలము నందలి గోపాలపురవాస్తవ్యులై మొదటితరగతి న్యాయవాదులుగను జమీందారుల వ్యవహారకర్తలుగను కీర్తిగడించిరి.

---

*భగవద్గీతకుఁ బ్రేరేపకుఁడు ఉడతల పాపయమంత్రి యని యల్లంరాజు సుబ్రహ్మణ్యకవి తన శతకమునఁ జెప్పెను. (చూడుఁడు. 590 పుట. ఇందే.)

## రాఘవ శతకము

శా. భూతాంతఃపరివర్తిగా నిను మదిం బొందించి సేవించు సం
పూతాత్ముల్ సమవర్తిలోకమునకుం బోరే జనుల్ త్వత్పదా
బ్జాతాధీనులు గారో వారలు పశుప్రాయుల్ గదా రాఘవా!
పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీబాంధవా! 49

శా. నీతిం గోరి చరించు మానవుఁడు క్షోణీవిశ్రుతాకీర్తికై
భీతిం బూని వసించుఁ దానుట కీవే సాక్షి లోకోక్తి చే
సీతన్ గర్భిణి గానలన్ విడిచి గాసిం బెట్టవా రాఘవా!
పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీబాంధవా! 59

శా. సీతాహారి విరాధదానవవిభున్ శిక్షించి యా పిమ్మటన్
వాతాశిన్ శరభంగు గన్గొని సుతీక్ష్ణాగస్త్యముఖ్యర్షి సం
ఘాతార్చంగొని తత్సపర్యలను వేడ్కం జేయవా రాఘవా!
పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీబాంధవా! 73

శా. ఆతీవ్రాతిశయప్రతాపమున శక్రారాతి మాయాశ్రియో
పేతుండై నిను నాగపాశయుతుఁ గావింపన్ భవద్వాహదో
ర్వ్యాతాంకూరముచే విముక్తములు గావా పాశముల్ రాఘవా!
పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీబాంధ.వా! 89

శా. చేత్రోవీథి నిమేషమేనియు నినుం జింతింప మున్నిట్టి నా
కేతద్దేహము సాక్షి యీభవమునం దేముక్తి నా కబ్బె నీ
పై తాత్పర్యము నిన్ను జెందుటనిఁకం బ్రార్థింప నిన్ రాఘవా!
పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీబాంధవా!. 99

---

# పూసపాటి వీరపరాజు

విశాఖపురిమండలము నందలి ప్రాచీనమైన "ప్రాక్పురి" జమీందారుఁ డగు పూసపాటి దక్షిణదిక్కవాఁ డైన దుగ రాజాది బిరుదాంకితుఁ డగు పెద్దమల్లపరాజు తమ్ముఁ డయిన వీరపరాజు బాలుర కొఱ కిది వ్రాసెను.

## చిఱుత వజీరు శతకము

క. కూడనిపని సేయకు మా
టాడకు మెప్పు దయ్యవారలకు మాటలకున్
గూడకు దొరసానుల పని
చేడెలతోఁ గీడువచ్చు - చిఱుతవజీరా॥ 8

క. వెలయాండ్రను నమ్మకు ర
చ్చల నమ్మకు గోడఁ జాల్వజలఁ జిమ్మకు ని
చ్చలు దోసమ్ములఁ గమ్మకు
చిలువ చెలిమి గ్రిమ్మబోకు - చిఱుతవజీరా. 34

క. తనసరి చుట్టఱికము పొం
దిన పంతము దోఁపు దురము దిట్టఱికము మే
కొను చెట్టఱికముఁ దగు ని
చ్చిన వారల తోడఁదగవు చిఱుతవజీరా॥ 53

క. నెలవులఁగల చెలువుల వెల
చలువల నిసువులను విడిచి సన్నానుతమం
చలయుత్తలముల మత్తులఁ
జెలఁగు పజకు లేవు రెండు చిఱుతవజీరా. 88

క. ఇచ్చిన నియ్యకయున్నను
వచ్చును గీడెఱిఁగి యియ్యవలె నిచ్చియుఁ దా
నొచ్చుకొనిన మెచ్చుకొనినఁ
జెచ్చెర మతిలేదు మేలు చిఱుతపజీరా. 96

క. వెన్నెలరావంగసమున
వన్నెయు వాసియును గలిగి వఱలుచు నిలలోఁ
జెన్నగు శ్రీమల్లపనృపు
చిన్ని సహోదరుఁడు వేడ్క చిఱుతపజీరా. 100

---

# కోటీశ్వర దీక్షితుఁడు

ఇతఁడు కృష్ణవేణీతటమున జన్మించెను. (6) ఇతఁడు పశ్చిమమున నున్న 'మురచీ' నగరమున నార్తినందెనఁట! కాశికాప్రముఖపురీనివాస బుధభద్రకృపాపరిలబ్ధి గల్గినను గమలజుఁ డార్తినొందమని వ్రాసినది తప్పలేదఁట! ఇతఁడు కందసామి పుత్రుఁడు. విశ్వపతి భృత్యుఁడు. ఇతర వివరము లేమియుఁ దెలియవు. క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁడై యుండును.

## విఠలేశ్వర శతకము.

చ. అతులిత యోగపీఠమున నాయత భీమ రథీతటంబునన్
జతురునిఁ బుండరీకనువిశాల కృపారస నీతలేక్షణున్

మతిఁ దళుకొత్త నించుచు సమస్తముఁ బూజ యొనర్పనున్న నీ
గతిఁ బడయంగ నాకెటులఁ గల్గు నశక్తుఁడ విశ్వలేశ్వరా! 12

ఉ. చచ్చినవాఁ డొకండు ధనసంపదలేని యతం డొకండు దా
నచ్చిన చోటఁ గోరిన ధనంబుల నివ్వనివాఁ డొకండు బల్
మచ్చికతోడ విప్రులను మన్ననఁ జేయని వాఁ డొకండు ను
ద్యచ్చరితా సమాను లని యందురు పెద్దలు విశ్వలేశ్వరా! 25

చ. కమలదళాయతాక్ష రణఖండితఘోర విపక్షవాహినీ
రమణ తనూభవా కలితరత్న పరిష్కృతవృక్ష దేవ భూ
మ్యమరగణాభిరక్ష, వివిధాహవకౌశలదక్ష నే నమో
నమ యని నీకు మ్రొక్కెద ననుం గృపఁ గావవె విశ్వలేశ్వరా! 49

ఉ. దండితదైత్యకాండ బహుధాపరిపాలిత సర్వపద్మ గ
ర్భాండ విహంగకాండ శ్రవణాంతమణీమయకుండల ప్రభా
మండితగండ దుష్టరిపుమర్దన దుర్గమచండ శాజ్గకో
దండమునన్ భవద్గుణకథారతుఁ జేయుము విశ్వలేశ్వరా! 61

ఉ. మానులకైన వేల్పులకు మానవదైత్యులకైన పూర్వ క
ర్మానుభవంబుఁ దప్పదఁట యస్మదుదీరత భంగి యల్ల య
జ్ఞానము తప్ప దేలయనఁ గల్గిన నైషధ ధర్మపుత్రి రా
మా నిమిషేంద్రు లేలఁ గని రంతటి దైన్యము విశ్వలేశ్వరా! 94

---

# ఘటికాద్రి కవి

ఇతఁడు శనైశ్వర శతకమును రచియించెను. "శనినా
యక! దివ్యఫలప్రదాయకా!" అను మకుటముతో 108 పద్య

ములు రచియించెను. ఇనకులుఁడును, కాసిగోత్రుఁడు నగు తుపాకుల రామయ్య, "జనకులగోత్రము" నందలి పాప మ్మను బెండ్లియాడెను. ఆ దంపతులకు నారాయణయ్య పుట్టెను. అతఁడు వేంకమాంబను బెండ్లియాడెను. ఈ దంప తుల కీ శతకకర్త ఘటికాద్రి జనియించెను. కనుపర్తి వేంకట కవి యను విప్రుఁడు గ్రంథకర్త గురువు. ఈ కవి క్రీ॥ శ॥ 1850 కిఁ బూర్వుఁడై యుండవచ్చును.

## శనైశ్వర శతకము

చ. రవిసుత నీ ప్రభాశిఖల గంకెల కోర్వఁగఁ జాల రెవ్వరున్
దివిజులు విన్నమాత్రమున దీనత పొందుచు తత్తరింతు రో
భవహర! నీ ప్రతాపము లపారముగాదె నినున్నుతింపఁగా
నవనిలో నాతరంబె శనినాయక! దివ్యఫలప్రదాయకా!

చ. మునుపటి జన్మమందు ముదమొప్పఁగఁ నెంత తపంబుచేస్తినో
దినకరపుత్రి మీ మహిమ దివ్యముగాఁ గొనియాడఁగల్గె యీ
జన్మమునందు నాకు ఘనసంపద జ్ఞానము గల్గెనయ్య నీ
యనుమతిచేతఁ గాదె శనినాయక దివ్యఫలప్రదాయకా!

ఇట్లే దిద్దరాని దోషములతో నిండి శైలి యప్రౌఢమై యున్నది. తుపాకుల అనంతభూపాలాదుల బంధువా?

———

# చిలకమర్తి నారాయణాచార్యులు

ఇతఁడు పిఠాపురమునకుఁ జేరువ నున్న కొమరగిరి వాసుఁ డని తోఁచుచున్నది. శ్రీవేణుగోపబాల శతకమును రచియించెను. "కొమరపురిపాల శ్రీవేణుగోపబాల!" యని మకుటము. ఇతఁడే గణోదయప్రబంధము, భాగవతదశమ స్కంధపూర్వభాగయక్షగానమును రచియించెను. ఇతఁడు శ్రీవైష్ణవుఁ డని శతకపీఠిక వలనఁ దెలియుచున్నది. "తుల్యలోనుండి మాకూరిత్రోవగాన" అని తన యూరునకుఁ దుల్యానది దాటి పోవలయు నని చెప్పుచున్నాఁడు. తుల్య గోదావరీమండలము నందలి చిన్న నది. పల్లెరుమూడి వేంకటగురునికడ సంస్కృతము, వీణావాద్యము, ఆంధ్రసాహిత్యము, ఉభయభాషాకవనము, సంగీతము, భరతము, జ్యోతిషము, వైద్యము, వేదము, మంత్రశాస్త్రములు మున్నగు విద్యలభ్యసించెను.

## వేణుగోపబాల శతకము

సీ. కదలిన పండ్లకు గట్టి చక్కిలమేల
    స్నానహీనునకు త్రిసంధ్యలేల
గుడ్డికంటికిని బైగోరయద్దం బేల
    సలక హీనకుఁ గొప్ప గొలుసులేల
చాందినీ లేతాకు పందిరులకు నేల
    తాటాకు దళ్ళకు దరుజులేల
పొట్టచెవులకు కుచ్చుల బావిలీ లేల
    వణుకు చేతులకు గంకణములేల

గీ. బోసి నోరున శేల గప్పురపు విడియ
మెంగిలన్నంబుఁ దిన మడియేల మాదు
మూల గుమ్మంబునకు వన్నె ముగ్గులేల
కోమరపురిపాల! శ్రీ వేణుగోపబాల!

సీ. తడక లేని గృహంబు చెడు కుక్కలకుఁ దల్లి
మద్యపాయుల కీండ్రి మల్లి తల్లి
జారకాంతకు వ్యభిచారి దూతిక తల్లి
తస్కరులకు నిశీథంబు తల్లి
జారులకును జెడు సదనం బెపుడు తల్లి
కన్యకాక్రయునకు గన్య తల్లి
గార్ధభంబుల కూరి కడనొట్టియలు తల్లి
భూసురులకు శూద్రి పురము తల్లి

గీ. ఘోరమగు నక్కలకు నేటి యొర తల్లి
బింకమగు పాములకు బేప డొంక తల్లి
బెడగుగల తూటికెల్ల మామడుఁగ తల్లి
కోమరపురిపాల! శ్రీ వేణుగోపబాల!.

ఈ శతకము శాలివాహనశకవర్షంబులు "మహాని దంతావళ మహానిశశుల" ననఁగా 1787 శా॥శ॥ (1865 క్రీ॥శ॥) రక్తాక్షి సం॥ రాశ్వయుజ శుద్ధ దశమినాఁటికి రవి కన్యారాశియం దుండఁగా ముగించితి నని శతకము చివర కవి వ్రాసి కొనెను.

## ఇంద్రకంటి వేంకటకవి

ఇతఁడు శా॥ శ॥ శ్రుతి, కరి, గిరి, ఇందు (1784) లో నున్నవాఁడు. రౌద్రిలో వేంకటాచల రమణ శతకము వ్రాసెను. (అనఁగా క్రీ॥ శ॥ 1862) ఉపమాకపురము (విశాఖపట్టణప్రాంతము) నందు వేంచేసి యున్న వేంకటేశ్వరునిపై నీ శతకము వ్రాసెను.

### వేంకటాచల రమణ శతకము

క. కంతు నల నిశాకాంత వ
సంత జయంత శతకోటి సమరూపజితా
నంత రసనాభిపంకరు
హాంత రజద్రిహిణ వేంకటాచలరమణా!

క. అమరాసుర సమరంబున
నమరారుల సమయఁజేతు వకటా వలప
క్షము తగవహితాహితశూ
న్య ముదితభక్తజన వేంకటాచలరమణా!



## పల్లి పార్వతీశము

ఈ కవి రామరాఘవశతకము, మఱికొన్ని యష్టకాదులును వ్రాసెను. ఈతని వాసస్థలము పల్నాడుతాలూకా

లోని గుత్తికొండ. ఈయన పుత్రులిప్పు డుండుటచేఁ గవి యేఁబది సంవత్సరముల లోపువాఁడు. ఈయన తండ్రి నరసింహము. శతకమున శబ్దాలంకారము లెచ్చుగా నున్నవి. ఈయన తిట్టుకవి, యాచకుఁడు నని శతకప్రకాశకులు వ్రాసి యున్నారు. తన్నుఁ గూర్చి కవి యిట్లు వ్రాసికొనెను.

ఉ. శ్రీయుత కాశ్యపాన్వయ సరిద్వరశీతకరుండు పల్లి వం
శీయుఁ డనంగ నొప్పు.నరసింహకవీంద్రున కాత్మజుండ నే
నో యతుల ప్రభావ లసదుత్పల మాలలు నీ కొసంగెదన్
బాయక పార్వతీశుఁడను భక్తుఁడ బ్రోవుము రామరాఘవా! 102

శైలి చూపెదను. ఇతఁడు భద్రాచలయాత్ర చేసి యుండవలెను.

ఉ. చూచితి గౌతమీనదినిఁ జూచితి భద్రనగాధిరాజ ము
న్జూచితి జానకీసతినిఁ జూచితి వాయుతనూజ ముఖ్యులం
జూచితి నిన్ను లక్ష్మణునిఁ జూచితి శత్రునిషూదనాదులం
జూచితి పూర్ణభావమున సూటిగ నిన్నును రామరాఘవా!

"భండనభీముఁ" డను దాశరథిశతకపద్యపుఁ బోలిక భావసంగ్రహణము.

ఉ. శ్రీమహనీయమూర్తికి విశేషవచఃపరిపూర్తికి న్మహో
ద్దామ దయానువర్తికి సుదంచితకీర్తికి రామమూర్తికి
న్వేమరు సాటి లేదనుచు వేడుక ఘంటిక మ్రోఁత లొప్ప నీ
నామము దిక్కుల న్వినఁ గనంగ నొనర్చెద రామరాఘవా! 2

అనుకరణములు, దేవతాస్తుత్యాత్మకనామ సంఘటిత పద్యములు, కొన్ని సామాన్య పద్యములును గలవు. భక్తి ప్రతిపాదక మైనవే!

---

## చామర్తి శేషగిరిరాయకవి

ఇతఁడు కాళిందీపరిణయము,* నమశ్శివాయశతకము, రామకథాసుధాలహరి యను గ్రంథముల రచియించెను.

### (1) కాళిందీపరిణయ గ్రంథాదిని

శ్రీకమలాక్షి జగ్గ నుసుచెక్కులు ముద్దిడి తమ్ములంపు డా
లాకలకంఠి బో నడవ నల్లన నవ్వినవ నట్ల సేయు త
ళ్లోకకుచన్ కవుంగిటను గూర్చి తదాప్తి దొలంగఁజేయ సు
శ్లోకుఁడు రుక్మిణీవిభుఁడు సొంపుగ నింపుగ మమ్ము బ్రోవుతన్ ॥

సకలదేవతాస్తుతికిఁ బిమ్మట వేదాంతియు, యోగియు, మహానుభావుఁడు నగు లక్ష్మణగురువర్యుని స్తుతించెను.

### (2) ఆదికవిస్తుతి

వినయముతో భజించెదను వేమరు నాకుజు, వ్యాసు, కాళిదా
సుని, భవభూతి, దండి, రవి, సోము ననంతు నృసింహు నన్నపా

---

* అనేకులు శతక కవు లప్రౌఢులయ్యు తరువాత ప్రౌఢప్రబంధ కవులై యుందురు. శతక కవుల వనేక ప్రబంధములును, ప్రబంధకవుల వనేక శతకములును పోయి యుండును.

ర్యుని, జయదేవు, భాస్కరు, మయూరుని, పోతన, భీమ, తిక్కయ
జ్వని సుమదంతు బిల్హణుని వీరన భారవిఁ బెద్దనార్యులన్ ||

అని సంస్కృతాంధ్రకవుల గలిపి మాత్ర కట్టినాఁడు. పిమ్మట కవివంశవర్ణనము. సృష్ట్యాది విష్ణువు, బ్రహ్మ మొదలు తన గోత్రఋషి యగు కణ్వుని వఱకు వర్ణించెను. పిమ్మట నాగోత్రమున బుట్టిన దోసనమంత్రిని వర్ణించుచున్నాఁడు.

సీ. స్థిరకీర్తియుత గాకతీయ రుద్రావనీ
పాలుని కృపచేత బ్రౌఢికెక్కి
సాగిపోతన సభాస్థలిఁ దానె మంత్రియై
సర్వసౌభాగ్యముల్ సంతరించె
యేటూరు వారితో నెనసి వర్తిలి దేశ
పాండ్యాగిరీ పటు దార వృత్తి
కొండవీ డ్బెల్లముకొండ నందిగ్రామ
సీమల పాలొంది చిత్రముగను
తనకు సరియెవ్వరును లేక దానవిభవ
కీర్తినిర్మల వాక్ప్రమత్కృతుల మించి
యఖిలలోక వశీకృతుండై జెలంగ
నమ్మహాత్మునిఁ గొనియాడ నలవియగునె?

అతని సంతానము, మనుమలను, మునిమనుమలను వర్ణించెను. వార లనేకులు, కొందఱు మంత్రులు, కవులు, శిష్టాచారసంపన్నులు కలరు. కవియే యొక పద్యములో నిట్లు చెప్పెను.

కొందఱు దీనపోషకులు కొందఱు సర్వకళావిశారదుల్
కొందఱు ధర్మవర్తనులు కొందఱు సూనృత వాక్యవర్ధను

ల్గొందరు రాజపాలకులు కొందఱు కర్మకలాప్రదీపకు
ల్గొందఱు భాగ్యశీలు రొకకొందఱు సత్కవు లందఱుందఱే!

వీరికిఁ జామర్తివా రను నింటిపేరు వచ్చుటకుఁ గార ణము వ్రాయుచున్నాఁడు.

క. శ్రీమానిని కిరవై వా
గ్భామను నెలవై విచిత్రవైఖరు లలరన్
చేమర్తి నగరినేలుట
చేమాకు గృహాహ్వాయంబు చేమర్తిదగున్

(1) ఎఱపాపన (2) వేంకటమంత్రి (3) రామమంత్రి మున్నగువారు కవు లని చెప్పినాఁడు. వారు రచియించిన గ్రంథములఁ జెప్పలేదు. తన తండ్రి యగు వేంకటమంత్రి బచ్చెల్లపాటి రత్నమంత్రి కూతురును బెండ్లియాడెనఁట. తుదకుఁ గవి స్వవర్ణన చేసికొనినది వినుఁడు.

శ్రీగిరిజామనోహరుని చిన్నమిటూరపు టోరజూపునా
పైఁగలుగన్ సమస్తజన వర్ణనశీలుఁడనై జరింతు భూభాగ
మునందు స్వస్తవము భావ్యము కాదని పల్కఁజాల స
ద్రాగవిరాగ శేషగిరిరాట్కవిచంద్రుఁడ కీర్తిసాంద్రుఁడన్॥

ఇది "యాత్మస్తుతి పరనిందా యెఱుఁగని నాకూ పావలా యిచ్చి, పలుగుముండాకొడుకు వాడికీ పావలా సంభావన యిచ్చుట యేమి న్యాయమయ్యా?" అనిన విప్ర వాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చు నాత్మస్తుతి. పిమ్మట షష్ఠ్యం తాలు. కథారంభము. కృష్ణునకుఁ గృతి. గ్రంథవిషయము కాళిందీవైవాహికకథ. గ్రంథము చివర గద్య—.

మ. ఇది సాయంతననాట్య ధూర్జటికి నర్దేద్ధోద్ధతస్వర్ధునీ
వదనప్రోక్షఘుమంఘుమార్భటిల సద్వాచానుధామోద సౌ
ఖ్యద చామర్తికులీన శేషగిరిరాయాసత్కృతంబై తగుం
గద నాశ్వాసము భానుజాపరిణయాఖ్య గ్రంథమున్ ద్వంద్వమై॥

"ఇది శ్రీమాదుమారమణ కరుణాకటాక్షవీక్షాసుధారస పరిలబ్ధ సరస కవితాభినందిత రసికజనసముదయ సకలరాజసభాంతరాళ జేగీయమాన ఘటనాఘటన చాతురీ సామర్థ్య సమారంభితయుక్త కార్యనిర్వాహక సదయహృదయ నిరంతరానుష్ఠిత తైలధారావదచ్ఛిన్న శుద్ధబుద్ధబ్రహ్మతత్వ సాక్షాత్కార విద్వజ్జనవిధేయ చామర్తి వంశపయః పారావార సంపూర్ణ పూర్ణిమాతేజ్రియ పాదయామాత్య పౌత్ర వేంకట మంత్రిపుత్ర, కణ్వసగోత్ర పవిత్ర విబుధమిత్ర సుందర శేషగిరిరాయకవి పురందర ప్రణీతంబైన కాళిందీ పరిణయం బను మహాప్రబంధంబునందు......." శ్రీశ్రీశ్రీ

గ్రంథాది నొకపత్రముపై "గ్రంథాదిని వ్రాయవలసిన పద్యములు" అనియు నింకొక పత్రముపై

"శరనిధి శైలచంద్ర శకసంఖ్య జెలంగఁగ భావనామ వ
త్సర మధుమాస పూర్ణిమను సత్కృవుల్ నవకృష్ణభానుజా
పరిణయ మింపుగానుడివె భానుజవైరి కృపన్ బుధాంఘ్రిపం
కరుహారతుండు శేషగిరి కంసవిదారికి నంకితంబుగన్॥

అనుటవలనఁ గవికాలము శా. శ॥ 1795 అని స్పష్టము గు చున్నది.

ఈ గ్రంథముపై నితర కవు లిచ్చిన యభిప్రాయములు కొన్ని పద్యము లున్నవి.

కుందమరందబిందువుల గుంపులొ శార్కరసారపూరమో
కందకణంబులో సుధలఁ గ్రమ్మిన తేటలొ దివ్యధేనువు

గ్దాంబువులో యటంచు కవులందఱనందగు భోగభాగ్య సం
క్రోందనమూర్తి శేషగిరిరాయని సూక్తులు యుక్తులొప్పగున్॥

కవి మొన్న మొన్నటివాఁడు కదా. కొండపల్లి ప్రాంతము వాఁడని వినికిడి.

రామకథాసుధాలహరి రామాయణకథ చంపూమార్గమున వ్రాసిన శతకము. నమశ్శివాయ శతకము శతకమే. మూఁడు గ్రంథములనుండి యొక్కొక్కపద్యము శైలికై చూపెదను.

## (1) కాళిందీపరిణయము

అంత వసంతకాలము దురంతకృతాంతనితంబినీ కుచ
ప్రాంతపటీరసౌరభనిరంతరహారి సమీరవారరు
ద్ధాంతము కంతుకాంతితలతాంతమరందచరన్మిళిందని
క్రాంతరవాతితాంతయుతకాంతము బొల్చె నితాంతకాంతమై॥

## (2) రామకథాసుధాలహరి (సీతవర్ణన.)

తమ్ములు పాదముల్ పరభృతమ్ములు వాక్కులు చక్రవాక పో
తమ్ములు చన్ను లుత్పలజితమ్ములు కన్గవ బోటి తేటి మొ
త్తమ్ములు కుంతలాళిభశతమ్ములు గోరులు సాంద్రచంద్ర కాం
తమ్ములు నవ్వులా గుణగణమ్ములు సత్ఫలితమ్ము లింతికిన్॥

## (3) నమశ్శివాయ శతకము

ఎంత దృఢమతినైనచో నింద్రు ముఖులు
కరుగఁదీసి గులాముగాఁ బరపు టరుదె
మరులు కొల్పదె విప్రుని మధురవాణి
మధిత గజదనుజాయ నమశ్శివాయ.

# విజయనగరపు చెంగల్వరాయకవి



ఇతఁడు మదనగోపాలశతకమును వ్రాసెను. వేంకటగిరివిభుఁ డీతని తండ్రిపేరు. బహువిధ కృతు లొనరించె నఁట.

సీ. వసుధ విజయనగర వంశాబ్ధిచంద్రుఁడౌ
వెలయు వెంకటగిరి విభున కెలమి
వరపుత్రుఁడై హరివరమున బహువిధ
కృతులు గావించి సత్కీర్తి వెలసి
రాజిల్లు చెంగల్వ రాయాహ్వయుండ నే
దేజమొప్ప నృసింహ దేవు పాద
కమలముల్ మదినుంచి గరిమ శ్రీహరిపేర
నంకితంబుగ శతక మమరఁ జెప్పి

గీ. యబ్జనేత్రుని పదముల కర్పణంబు
చేసి విఖ్యాతిమైనుండఁ జెలఁగి నాదు
వాంఛితము లెల్ల సమకూర్చి వరము లొసఁగు
మదనగోపాల సత్యభామావిలోల||

ఈ శతకము శృంగారరసప్రధానము. పచ్చిశృంగారము లేకపోలేదు. ఉన్నదే పచ్చిశృంగార మనినను దోషము లేదు. పై పద్యము నందలి భక్తుని విశ్వాసమును గమనించినవా రిది దుష్టశృంగారము కొఱకు వ్రాసిన శతకమన వీలు లేదు. భగవత్పరముగ నెట్టి యవాకులు వ్రాసినను దప్పుగానీ జాతికవులు తలంపలే దనవలసివచ్చును.

## మదనగోపాల శతకము

సీ. శ్రీరుక్మిణీనాథ జితకోటి రతినాథ
సుందరాకార సానంద శరణు
సుర యక్ష కిన్నెర వరమాని శుభకర
నరకాంతకా పద్మనాభ శరణు
జలధరనిభగాత్ర జలజాతదళనేత్ర
పరమపవిత్ర గోపాల శరణు
నిర్మలగుణతోష నిజభక్తజనపోష
కవిపచోభూష ప్రకాశ శరణు

గీ. అనుచు నిను చాల నుతియించి యబ్జభవుని
వెలఁదిఁ నెంతయు గొనియాడి విఘ్నపతిని
సన్నుతి యొనర్చి రచియింతు శతకముగను
మదనగోపాల సత్యభామావిలోల॥

సీ. రవనూనె మెఱుఁగిడి రాణించు నెటికురుల్
దువ్వి కొప్పమరించి తోరమైన
గొప్పరాగిడి మేటి యొప్పైన కుప్పెయు
సవరించి మొగ్గలసరులు మీర
పరగ కెంపులు చెక్కఁబడినట్టి పాపట
బొట్టు పై శశిపువ్వు పొసఁగఁ దాల్చి
నిద్దంపుఁజెక్కుల వద్దిక గా వజ్ర
తాటంకముల ఘాళఘళ్య మమర

గీ నాణిముత్తెపు నత్తు మోపందిగుల్క
నెంచఁదగినట్టి తొలకరి మించొయనఁగ
దానివగజూడఁ దమినిల్వఁ దరమె నీకు॥ మ॥

కొన్ని పద్యములు కలువాయి శతకము నందలి
ముల రీతి నున్నవి.

విరహము, చంద్రనింద, గాలినింద, పాలిండ్లు, కెమ్మోవులు, విరివిగా వర్ణించెను. ఉదాహరించుట కట్టివి లేని పద్యములు పట్టుకొనుట కష్టమైనది.

"పసిడి బుటేదారి పట్టువల్వ ధరించి
రాణించు పైఠాని రవిక దొడిగి"
"సందిటగల బాజుబందు కుచ్చుల చాలు
తోరమై పలుమారు తూగులాడ"

పావడ, అద్దాలరవికె, మొదలగు దుస్తులవర్ణనము చరిత్రకారులు కుపయోగించును గాని గుహ్యాంగములఁ గూడ రమ్యముగు చిలుకలతోను, పండ్లతోను బోల్చి చూపిన పద్యము లసహ్యాజనకములుగనుండి గ్రంథముపైఁ గోపము వచ్చునట్లుచేయును.

దూతిక మదనగోపాలునితోఁ జేసిన ట్లున్న సంభాషణపద్య మొక్కటి చూపెదను.

సీ. చెలియరో పోవమ్మ క్షేమంబులగు నీకుఁ
దలఁపున మాయింతిఁ దలఁప నేను
తలఁపకుండఁగ నీకుఁ దప్పేమి చేసెను
వివరింపఁవలె నది వేదవేద్య
వివరింపఁగా నేల వెలఁది నేఁ గోరిన
కోర్కె దీర్చక పోయె కువలయాక్షి
కోర్కె లీడేర్ప మా కోమలి నీపొందు
కోరియున్నది రార కోమలాంగ

గీ. నయము నెఱుఁగని స్త్రీలను నమ్మఁదగునె
వినయములు పెక్కు పల్కెద వెలఁది నీవు
నమ్మఁదగునయ్య నా మాట నలిననాభ॥౧౦॥

పిమ్మట నాయకీనాయకుల సమకూర్చి శతకము ముగించెను. ఈ కవి యే కాలమువాఁడో తెలియదు. ఇతర వివరములు తెలియ పడలేదు.

---

## మద్దాళి సుబ్బయ్య

ఇతఁడు శ్రీహరిశతకమును వ్రాసెను. అది రామాయణకథాఘటితము. 132 పద్యము లున్నవి. ఈ కవి నెల్లూరిమండలము నందలి కావలిగ్రామములో నుండెడి "యాంగ్లోవర్నాక్యులర్ స్కూలు"లో ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు. ఈయన యెల్లప్పుడును గ్రాంథికభాషలో మాటలాడుచుండువాఁడు. క్రీ॥శ॥ 1870 ప్రాంతముల నున్నవాఁడు. రామాయణకథ పట్టాభిషేకమువఱకు నున్నది.

### శ్రీహరి శతకము

ఉ. శ్రీరఘురామభూవిభుఁడు సీతకరంబు కరాంబుజంబుచే
సారతరానురాగమున జక్కఁగబట్టుడు సాత్త్వికోదయా

దారత ఘర్మబిందువుల దద్దయు హస్తము జారవేమఱున్
జారుకరంబుఁ బట్టఁగను జానకి యించుక నవ్వెఁ శ్రీహరీ! 32

చ. కనుగొని రావణుండు లయకాలమహోగ్రనిభంగి బేర్చి రా
మని నిశితాస్త్రపంక్తి వడి ముంపఁగ నన్నియు ద్రుంచి రాఘవుం
డనుపమితాస్త్రరాజమున నద్దశకంధరుఁ గూల్చె నంత దే
వనివహసంస్తుతుల్ గుసుమవర్ష మవారణ మించె శ్రీహరీ. 125

---

# కొల్లము సీతారామకవి



ఈకవి నందవరవంశోత్తంసుఁడు. ఈతఁడు యోగాంజనేయ స్తవతారావళి, హరిచరణ స్తవరాజము, ఘటికాద్రీశ శతకము, విజయ ప్రతిజ్ఞాపూరణకథ, దేవకీసుతానయనం బను యక్షగానము మొదలగు గ్రంథముల వ్రాసెను. "మత్తేభవిక్రీడితవృత్తగర్భితక్రమాలంకారత్రిస్తబకముక్తపదగ్రస్త దశావతార స్తవనిరోష్ఠ్యయమకసర్వలఘు సీసపద్యాదిసంయుతం" బయిన శ్రీరమాకాంతరంగశతకము రమారమి నలుబది సంవత్సరముల క్రితమే ముద్రితమై యున్నది. కవి కాశ్యపగోత్రుఁడు. తండ్రి రామకృష్ణుఁడు; తల్లి లక్ష్మమాంబ. క్రీ॥శ॥ 1880 సం॥ ప్రాంతములవాఁ డై యుండును.

## శ్రీరమాకాంతరంగ శతకము.

సీ. వేదగోచర నిన్ను వెదకి నే వీడ్కొన
ధ్రువమతియైన యా ధ్రువుఁడ గాను
నాగవందిత నీదు నామసారముఁ గ్రోలఁ
దుహినాద్రి సుతయైన దుర్గఁ గాను
మందరోద్ధర నీకు విందొనరింప నే
నిరుపమస్వాంత విదురుఁడఁ గాను
సరసిజానన నీకు సురభిగంధము భక్తి
యుక్తి నీఁ గుబ్జాఖ్య యువతిఁ గాను
భక్తపాలన నే వట్టి పామరుండఁ
బ్రోవు శరణంటివారితోఁ బురుడొనర్చి
ఖలజనవిభంగ యుత్తుంగ ఖగతురంగ!
కామశోభాంగ శ్రీరమాకాంతరంగ! 10

సీ. రాధికావృత్తామరసమత్త సారంగ
సారంగలోచన సాంబమిత్ర
మిత్రవిందాస్యాబ్జ మిహిరగోకులవాస
వాసవనతభక్త వారిభద్ర
భద్రాంగనాధర నరబింబ ఫలశుక
శుకమౌనివినుత కౌస్తుభ సువక్ష
లక్షణానేత్ర సల్లలిత కైరవసోమ
సోమకచ్ఛేదన సుఖదపాద
పాద పద్మోద్భవదళన గోపాలకృష్ణ
కృష్ణజీమూత సంకాశ కేశిమధన!
ఖలజనవిభంగ యుత్తుంగ ఖగతురంగ!
కామశోభాంగ శ్రీరమాకాంతరంగ! 2

# గుఱ్ఱంకొండ భక్తవత్సలుఁడు



ఇతఁడు హారితసగోత్ర శ్రీరామానుజార్యకరుణ నీ శతకము వ్రాసితి ననెను. సుమతిశతకమువలె బాలుర నీతి కొఱకు సుబుద్ధి శతకము వ్రాసెను. సుమతి, భాస్కరశతకముల వలె నకారాది నియమముతో నీ శతకము వ్రాసెను. తచ్ఛతకచ్ఛాయలు నున్నవి. భాస్కరశతకము నందుఁ బ్రారంభమున నున్న సారంగధరప్రసంగ మిందును బ్రారంభమున నున్నది. "కవి సేనానిధికాష్ఠల నలవడి రససంజ్ఞఁగూడి యమరిన యబ్దంబుల శ్రీనివాసగురుదయ" నీ శతకము వ్రాసెను. అనఁగా కలి యుగాది 4986 సంవత్సరమున నిప్పటికి 37 సంవత్సరముల క్రిత మిది వ్రాసెను. (సేన=4; నిధి=9; కాష్ఠలు=8 దిక్కులు; రస=6) క్రీ॥ శ॥ 1885 లో నిది వ్రాసెను. శైలికిఁ గొన్నిపద్యములు చూపెదను.

## సుబుద్ధి శతకము

క. ఉతయాత్పూర్వమె నిద్దుర
వదలియు విణ్మూత్రములను వర్జించితగన్
రదనములంతోమి శుచిరై
కదలక హరి భక్తి సలుపఁ గనుము సుబుద్ధీ! 10

క. కులమును శీలము రూపము
నలరెడు దయ జీవులందునను సద్గుణముల్

తులయగు నెలప్రాయంబును
గల సతిఁ బెండ్లాడువాఁడు ఘనుడు సుబుద్ధీ॥ 26

క. చిఱుతలుఁ గూడినదిట్టులుఁ
గొఱఁతలు వాటిల్లు బాళ్ళఁగొని కొట్టుదురన్
గొఱుకుదురు నల్లలాలుకఁగఁ
గొఱమాలిన పనియునదియ కొనకు సుబుద్ధీ॥ 40

---

# పాలెపు వెంకటసూర్యగోపాలకవి



ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. క్రీ॥శ॥ 1880 ప్రాంతముల గోదావరీమండలమున నున్నవాఁడు కానోపును. హారితస గోత్రజుఁడు. లక్ష్మీనృసింహమంత్రికిఁ బాలకసుతుఁడు. ఈతఁడాధునికుఁడు. బహుశః ఈతఁడే క్రొత్తపల్లి పద్మనాయకుల యాశ్రితుఁడై యుండును. పుష్పబాణవిలాసమును దెలిఁగించిన రావు రామారాయనింగారికడ నీతఁడుండి, వారికి గ్రంథకరణమునందు సాయపడెడువాఁ డని విని యున్నాను. ఇతఁడు శౌరినామాంకితకందపద్యశతకమును, వల్లురిగోపబాలశతకమును వ్రాసెను. రెండు శతకములనుండియుఁ గొన్నిపద్యముల జూపెదను.

## శౌరినామాంకిత కందపద్య శతకము

క. మిత్రారవిందశాత్రప । నేత్రాచామీకరాభ నేత్రాజలము
గ్గాత్రాబుధసంరక్షా । సూత్రా నమ్మితిని నిన్నె నూవే శౌరీ!

క. యొకమాటమేలబేలనె । యొకమాటను మోముఁజూపకున్నను నిను నే
నిఁకమాట సంస్కరింపఁగ । నొకమాటాడిన నుతింతునోయీ శౌరీ!31

## వల్లూరి గోపబాల శతకము

ఉ. దండ మఖండ చండ భుజదండ పరాక్రమ దండితోసురా
దండ మజాండభాండ సముదంచిత విస్తృతమందభాసురా
దండము పుండరీక హరి దంతిశరద్ఘన పాండురగ్యశా
దండము దుగ్ధవార్నిధి సుతాధవ వల్లూరి గోపబాలకా ॥ 34

ఉ. పొంగుచు వేణునాద ఘనమోహవశాత్మతఁ జేరవచ్చు న
య్యంగజు హేతుల న్నెనయు నంగన లందఱ కన్నిరూపులై
యంగజ సంగరంబున నితాంతదయామతిఁ దేల్చినట్టి నీ
కుంగల గమలాక్షుపాంజ లిదిగో వల్లూరి గోపబాలకా ॥ 49

---

# పేకేటి కాశిరాజు

ఈతఁడు డాలువేలనియోగి బ్రాహ్మణుఁడు. తణుకు తాలూకా పేకేరు వాసుఁడు. రమారమి నలుబది సంవత్సరముల క్రితము మరణించెను. ఈతఁడు వ్రాసిన కేశవశతక మొకటి కనఁబడుచున్నది. శతకాంతమునఁ గవి వివరము లున్న భాగములఁ జూపెదను.

సీ. వేడ్కతో నా దాఱువేల్నాటిశాఖయు
గోత్రంబు కౌండిన్యగోత్రమయ్యె
పేకేటివా రింటిపేరు వీరాజుకు
సతి బాపనమ్మ యా సతిపతులకుఁ
దనయుఁడ నాపేరు ధరణిలో నెల్లరు
కాశిరాజందురు కమలనాభ
నేను నీ మీఁదను నేరక చెప్పిన
సీసపద్యశతంబు చిత్తగించి
గీ. యతుల ప్రాసల గణముల యందు నన్ను
దోషములు బాపి నన్ను నిర్దోషుఁ జేయు
భూసురాధార పేకేటి పురవిహార
భక్తమందార కేశవ భవవిదూర ॥ 10

వీనినిఁ బట్టి యీతఁడు కౌండిన్యగోత్రజుఁడు; వీరాజు బాపనమ్మల పుత్రుఁడు నని తెలియఁగలదు. శైలి కింకొక పద్యము చూపెదను.

సీ. నీమామ కంసుండు నిన్నుఁ జూడఁగ గోరి
తనయింటికిని నిన్నుఁ దక్షణమునఁ
దీసుకరమ్మని ధీరుఁడైనట్టి యా
సార్థకనాము నక్రూరుఁ బంపె
పొందుగా నతఁడేగి బృందావనములోన
నిలను నీపాద రేఖలనుఁ జూచి
మ్రొక్కుచు నీవున్న యిక్కడకు వచ్చిన
గాగిలించియు వాని గారవించి
వచ్చినట్టియు పని విని వాంఛవీర
జేతఁజెయివేసి వానిల్లు చేరినావు

భూసురాధార! పేకేటి పురవిహార!
భక్తమందార! కేశవ! భయవిదూర ॥ 34

---

# వంగిపురము నృసింహాచారి

"ఆంజనేయ వరప్రసాదకుఁ డైన బళ్ళారిమండలము ధర్మవరము తాలూకా చెన్నకొత్తపల్లె—" వాసుఁడు కవి యని ముద్రాపకులు వ్రాసిరి. కవి క్రీ॥ శ॥ 1885 ప్రాంతము లవాఁడు. భాగవతపుఁ బోకడ లున్నవి. "పోతన తిక్కన భూరిసత్కీర్తులౌ పెద్దన తిమ్మన భీమకవుల" నని యాంధ్ర కవులు నుతించెను. యతిరాజు భాష్యకారులు, దేశికాచార్యులఁ బొగడెను. "సీనమాంబ రామార్యులు" తలిదండ్రులు. శతకమునందుఁ గొంతవఱకు దశకములవంటి విభాగ మున్నది. సర్వనామస్తుతి, దశావతారవర్ణన, విశ్వరూపవర్ణనము మొదలగున వున్నవి.

## ఆంజనేయ శతకము

సీ. వైభవాస్పదమైన వైకుంఠపురమున
మందారవనమధ్య మందు మేలు
నవమానికములను నవరించు జగతిపై
నుంచు కాంతోపలా లుంచు వేది

కలపైన బలుపైన వెలకొంచె మనరాని
రవలుదాపిన మందిరంబునందు
శేషునిపై నీవు చెలువొందగానున్నఁ
శ్రీదేవి భూదేవిఁ జేరియున్న
ధాత మొదలైన దేవతల్ ధరణిపైన
కనక కశ్యపు వేధకు నునికి జాల
మయ్య యనువారి రక్షింప నరుగువాడ
వద్రిసమకాయ సురగేయ యాంజనేయ॥

---

# రఘుపతుల రామమూర్తి

ఈ కవి భావబోధరసాయనశతకమును వ్రాసెను.

ఇతఁడు 9 వ పటాలము, తొమ్మిదవకంపెనీ సిపాయి. పాపయ్య పుత్రుఁడు, శ్రీమద్బ్రహ్మవిద్యావశిష్ఠసిద్ధాంతనిర్ధారణు లగు కొండలరాయ చిదానందయోగులవారి శిష్యుఁడు. క్రీ॥ శ॥ 1888 కిఁ బూర్వుఁడు. వేమన్న వేదాంతమువలె సులభశైలి నున్నది. 108 కందపద్యము లున్నవి.

భావబోధరసాయన శతకము

క. రాతిని నాతిగఁ జేసిన
సీతాపతి వేడుకొన్న చిత్సౌఖ్యములఁ
ఖ్యాతిగ భక్తుల కొసఁగును
ప్రీతిగ నా రాము నెపుడు బిలువుము భావా! 11

క. ఆలి నిల నమ్మ యనుమా
భూలోకము దానివలనఁ బుట్టెను సుమ్మా
మేలెఱుఁగ నేర్పుఁగనుమా
నీలో మననంబుఁజేసి నిలువుము భావా! 52

---

# పిట్టల రామయ

ఈ కవి సనాథనాయక శతకమును వ్రాసెను.

ఇతఁడు కృష్ణయామాత్యపుత్రుఁడు. జామయ యను మహాకవి శిష్యుఁడు. క్రీ॥ శ॥ 1887 లో నీ శతకము ముద్రితము. ఇంతకంటె వివరములు తెలియవు.

## సనాథనాయక శతకము

చ. ధరనుత మీనరూప మటుఁ దాల్చి నిశాచరు జంపి వేదముల్
సరగునఁ దెచ్చి బ్రహ్మకును సవ్యముగాను నొసంగినాఁడ వీ
వరయగ నన్నుఁ బ్రోచుటకు యడ్డ మొకింతయు లేదటంచు సు
స్థిరమతి నమ్మినాఁడ దరిఁ జూపుము వేగ సనాథనాయకా ॥ 19

చ. హరిహర నామభేదముల నచ్యుతుఁ డంచు శివుం డటంచు యీ
సరికి నెఱుంగలేరు నిను సవ్యముగా నొకరైన ధాత్రిలో
పరువిఁక నేది భక్తుల కబద్ధము లాడ నదేమి యోగ్యతో
యెఱుఁగుదుమంచుఁ బల్కెద రిఁకేమనఁబోదు సనాథనాయకా ॥ 82

---

# కావూరి వెంకటరామకవి



ఈ కవి నిమిషాంబాశతకము వ్రాసెను. ఈతఁడు "సుబాయిలాకా — అశ్వారావుపేట కాపురస్థుఁ" డని ముద్రాపకులు వ్రాసిరి. 1888 లోనే ముద్రిత మందినది. ఆర్యక్షత్రియుఁడు, నిమిషాంబికాభక్తుఁడు, దాత, సుందర రూపుఁడు, కొండపల్లి వేంకటశివార్యుల శిష్యుఁడు. ఈ కవి 19 వ శతాబ్దమున నున్న యాధునికుఁడు.

## నిమిషాంబా శతకము

చ. వితరణచే తరింతునని వీక్షణఁజేసిన మందభాగ్యుఁడన్
వ్రతనిరతోపవాస జపవహ్ని సపర్యలు సేయ రోగినే
నతిశ్రుత సత్పరిశ్రమల నాంతరశుద్ధినిఁ జెంద మూర్ఖుఁడన్
హితమతి నేలుమింక జగదీశ్వరి శ్రీ నిమిషాంబికామణీ ॥ 4

చ. హరిణి తిలోత్తమోర్వశి ముఖామర వారనితంబినీమణుల్
వరుసగ నాడ, కింపురుష వైణిక కిన్నర వర్యు లంచిత
స్వరములఁ బాడ, విష్ణువిధి వాసవముఖ్య సుపర్వు లంద జా
ధరమునఁ జూడ సంతసముఁ దాల్చెదు శ్రీనిమిషాంబికామణీ ॥ 17



# మందపాటి రామకృష్ణకవి



"ఆంధ్ర దేశంబున శ్రీమందపురి యను దివ్యదేశ మందు వెలసి యుండు శ్రీసీతారామస్వామివారి భక్తుం" డగు రామకృష్ణకవి వ్రాసిన యేకప్రాసకందశతకము. కవి వివరములు తెలియవు. ఆంధ్రదేశమున మందపాటివా రార్వేలనియోగులు, క్షత్రియులు కూడ నున్నారు. ఈతం డార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. శ్రీరామశతకమును వ్రాసెను.

## శ్రీరామ శతకము

క. శ్రీరామ సంతతార్చిత
చారణ గంధర్వ సిద్ధ సాధ్యస్తోమా
వారణ దుఃఖనివారణ
దారుణచక్ర నిజధామ దశరథరామా! 20

క. శ్రీరామ నీదునామము
ధారుణిలో నిఖిలభక్త తతి కీప్సితముల్
దీరుపగ కామధేనువు
చారణ గంధర్వధామ! జగదభిరామా! 38

# బొడ్డు లక్ష్మినారాయణకవి

ఇతఁడు గోడవర్తి తిరువేంగళాచార్య శిష్యుఁడు. "మృదుమధురాంధ్రకవిత్వవైభవసాంద్రుఁ" డగు బొడ్డు లక్ష్మినారాయణకవి నరసింహుని పుత్త్రుఁడు. హేలాపురి శతకము వ్రాసి యేలూరిపురంబున వెలసియున్న వేణుగోపాలుని సంబోధించి చెప్పినది. మా యూర బొడ్డువారు వర్ధిల్లు చున్నారు. బొడ్డువారు కృష్ణామండలమునఁ గమ్మవా రున్నారు. ఈతఁ డే కులమువాఁడో? విరహిణిశతకముల తర గతి కీ శతకము పోలిక కలది.

## హేలాపురి శతకము

సీ. దినకరశశినేత్ర దివ్యాభరణగాత్ర
నిరుపమానచరిత్ర ధరపవిత్ర
కమలాలయాభర్త కాళీయఫణినర్త
నమితపుణ్యావర్త నాదికర్త
పద్మశోభితవక్ష పాపపుంజవిశిక్ష
దీనరక్షణదీక్ష దివిజపక్ష
మహిమాభిసంకీర్ణ మానితక్ష్మాపూర్ణ
జీమూతజితవర్ణ శ్రీసువర్ణ
చేల ధర మమ్ము బోషింప జాలమేల
మేలమునిలోల సద్గురుశీల యనుచు
లలితమణిభాసురంబు హేలాపురంబు
వేణుగోపాలు తోడితేవే లతాంగి ||

సీ. శిరమందు నిరవొందు సిరినొందు సికఁబొందు
నిరుఁగెలంకుల యందు నీటుఁ జూప
ననువొందు నుదురందు లనుకందు దళుకొందు
మినుకకాటుకబిందు మిసిమి నెరప
రతనంపు తతిఁబెంపు నతిసొంపుఁ గులికింపు
కనకతాయితు లింపు కాంతిఁగింప
లలితంపుఁ గలిపింపు రవణంపు రవణింపు
విషయంపు రహినింపు విధముఁ దోఁప
కేళికలసోలి యొదవ్రాలి కినుకమాలి
బాళికలబాళి వగజోలిఁ గోలుపుగేలి
లలితమణిభాసురంబు హేలాపురంబు
వేణుగోపాలు తోడితేవే లతాంగి! 2

---

# ఫక్కి అప్పలనరసు

ఈ కవి కుమార శతకమును వ్రాసెను. పద్యములఁ జూపెదను. ఈతఁ డాధునికుఁడు, దైవభక్తికలవాఁడు.

క. ఆజ్ఞ యొనర్చెడి వృత్తుల
లోజ్ఞానము గలిగి మెలఁగు లోకులు మెచ్చన్
బ్రాజ్ఞతయుఁ గలిగియున్నన్
బ్రాజ్ఞులలోఁ బ్రాజ్ఞుఁ డౌదు ప్రబలి కుమారా! 2

క. పెద్దలు వద్దని చెప్పిన
పద్దులఁ బోవంగఁ రాదు పర కాంతల నే

ప్రొద్దున నెదఁబరికించుట
కుద్దేశింపంగఁ గూడ దుర్వి కుమారా ॥ 5

క. కల్ల లగు మాటలాడక
యెల్లజనంబులకు వేగ హృదయము కడు రం
జిల్లఁగఁ బల్కుము నీకది
తెల్లమి రహిఁ గీర్తిఁ గాంచు తెరవు కుమారా! 18

సంవత్సరాదిసంచికలో నీతని గూర్చి యిట్లు వ్రాసి యున్నారు. "వీరు విశాఖపట్టణము నందలి నల్లిపురమున నివసించియున్నారు. వీరికి సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యముకలదు. వీరు నిర్వచనహేమలతాకావ్య మను ప్రబంధమును, బాలికారత్నబోధిక, కుమార శతకము, ముకుందమాల, మొదలగు గ్రంథములను రచియించినారు. వీరి కిపుడు డెబ్బదిసంవత్సరములకుఁ బైగా నున్నను మనో బలము గలిగి కాలక్షేపమును జేయుచున్నారు." పుట 243, ప్రథమసంవత్సరాది సంచిక (ఆంధ్రపత్రిక)

---

# ఎల్లయ



ఇతఁడు శ్రీబాలగోపాలశతకము వ్రాసెను, ఈ కవి కాత్యాయనసూత్రి భారద్వాజగోత్రుఁడు. లక్షణశాస్త్ర సమీక్షణాసక్తుఁడు; భవ్యకావ్యవినోది, బ్రాహ్మణుఁడు,

బాలికాశాలికోపాధ్యాయవర్యుండు. ఇందలి ముక్తాపుర మెచ్చటిదో?

సీ. దండ మొక్కటి నీకు పుండరీకదళాక్ష
పదిదండములు నీకు పద్మనాభ
శూరకులోత్తంస నూఱు దండములయ్య
వేయి దండంబులు వేదవేద్య
పదివేల దండముల్ పతితపావన నీకు
లక్ష దండంబులు పక్షివాహ
పదిలక్ష దండముల్ పవనభుగ్వరశాయి
కోటి దండంబులు కుజనహరణ
ఇన్ని దండంబు లొనరించి యిందిరేశ
నన్ను మన్నించి బ్రోవుమో నళిననేత్ర
శ్రీవధూల్లాస ముక్తాపురీనివాస!
బాలగోపాల రాధికాకేళిలోల ‖ 4

ఈ పద్యము సత్యభామ భాగవత యక్షగానమునందు మాధవిచేఁ జెప్పి పంపును.

సీ. నిఖిలలోకంబులు నీవని భావించి
యజ్ఞానరాసుల నడఁచిపెట్టి
మదమత్సరాదులఁ గుదియించి యటుమీఁద
పంచేంద్రియములచే పట్టువడక
సకలజీవుల యందు సముఁడనై వర్తించి
మోహసాగరమున మునఁగకెపుడు
నీ నామరూపముల్ నిరతంబు భజియించి
నవనవభక్తితో ననవరతము
నీదు పాదాబ్జములసేవ నింపెలర్ప
సేయుటకు బుద్ధి నాకిమ్ము శేషశయన

శ్రీవధూల్లాస ముక్తాపురీనివాస
బాలగోపాల రాధికాకేళిలోల ॥ 16

## కింకరు కన్నయ

ఈ కవి పార్థసారథికృష్ణశతకమును వ్రాసెను. ఇదియుఁ జెన్నపురియందలి తిరువెళ్ళిక్కేణిలో వేంచేసి యున్న శ్రీపార్థసారథిస్వామి వారిపైఁ జెప్పినశతకమే! కంద పద్యశతకము. వివరములు తెలియవు.

### పార్థసారథి శతకము

క. గంగా యమునా శారద
సంగమమునఁ గ్రుంకులిడియు సయ్యన జని తా
లింగముఁగల దేవస్థల
సంగతిఁగన ముక్తి పార్థసారధి కృష్ణా! 10

క. ఎఱుకే దైవము వినుమీ
యెఱుకే పరమొందఁజేయ యెఱుకే యెఱుకన్
యెఱుకో మఱపో తెలివో
సరిగాఁగన ముక్తి పార్థసారథి కృష్ణా ॥ 31

# కానుకొలను నాయునప్ప



ఈతనికే వేంకటదాసను నామాంతరము. ఇతఁడు శ్రీమత్త్రిలింగకర్తపుర పట్టాభిరామశతక" మని యొక శతకము రచియించెను. చింతగుంటపాలె మను బందరులో నొక పేట పేరున కిది గీర్వాణము. "చింతగుంటపాలెపురామా!" అని కవి యచ్చతెలుఁగుగఁ జెప్పుచుండ నిది ముద్రించినవారీ గీర్వాణపర్యాయపదము ముఖపత్రమునఁ బైవిధముగ నచ్చు వేసిరి. 1816 వ సం॥రములోఁ బైకవి 12 వత్సరముల ప్రాయమున నుండఁగా నీ శతకము వ్రాసెనఁట. ఇదియే సత్యమైన నాశ్చర్యకరముగ నున్నది.

క. పెక్కైను నిక్కపు మక్కువఁ
జిక్కుచు నీ చక్కదనపు జిగిచెక్కెంకే
దక్కితిఁ జిక్కితి మొక్కితి
పక్కన నగ చింతగుంటపాలెపురామా॥

---

# నారాయణయ్య



ఇతఁడు నారాయణశతక మను శతక మొసఁగెను. ఇది పదశతకము. నారాయణయ్యగారిచే రచియింపఁబడిన

దని ముద్రాపకు లనుచున్నారు. ఇది స్త్రీలు చాలమంది చదువుదురు. గ్రంథమునఁ గవిపేరు తెలియుట కాధారములు లేవు. ఇందు వేదాంతము తేటమాటలతో బోధించెను.

### చిన్ననారాయణ శతకము

శ్రీరమా హృదయేశ్వరా! - భక్తజన - చిత్తజలరుహ భాస్కరా!
కారుణ్యరత్నాకర! - నీవగతి - కావవే నారాయణా|| 1
పాపకర్మములఁజేసి - నరకకూ - పములఁ బడఁజాలనిఁకను -
నీపాద భక్తియొసఁగి - యొక్కదరిఁ జూపవే నారాయణా|| 2

---

## మండ రామస్వామికవి



ఇతఁడు వక్కలంక రామజోగారావుగా రను జమీందారుపై "శ్రీరామజోగారాయశతకము"ను రచియించెను. "జోగారాయా!" యను మకుటము.

క. శారద నీరద పారద
హీరమహాశేంద్రదలరి హిమరుచిర శ్రీ
శారద ప్రసన్న గావుత
సూరిజనవిధేయ రామ జోగారాయా!

క. బలవిజయ విలాసము ని
ర్మలహృద్గత పాండురంగ మాహాత్మ్యంబై

వెలయు మనుచరిత్రము మం
జులతాపక మహిమ రామజోగారాయా!

---

# పిళ్ళారిశెట్టి కోదండరామకవి

ఈతఁడు కలిఋషిగోత్రజుఁడు. వేంకటస్వామికి ద్వితీయపుత్రుఁడు. "విజయసంవత్సరాశ్వయుజశుక్ల" మం దీశతకము వ్రాసెను. కాండూరి అప్పలాచార్యుల శిష్యుఁడు. నెల్లూరి రంగనాయకస్వామి కంకితము. కవి వివరము లింతకంటెఁ దెలియవు.

## రంగనాయక శతకము

సీ. ముక్కోటిభానుల ధిక్కరించుఁ బ్రిపీప్తి
గల్గు నీదివ్య విగ్రహము జూపు
శంఖగదాచక్రశార్ఙ్గఖడ్గములతో
బొసగు చతుర్భుజములను జూపు
కమనీయమై యొప్పు కౌస్తుభరత్నంబు
గల్గి యున్నట్టి వక్షంబుఁ జూపు
హలికులిశాదిచిహ్నముల రాజిల్లెడు
త్వత్పదాబ్జములు మోదమునఁ జూపు

గీ. మన్న నావంటి యాశ్రితు చిన్నబరుప
తగదు మదివాంఛ లొసఁగవే నగధుదీణ

బుధజనోల్లాస నెల్లూరి పురనివాస
రంగనాయక కోదండ రామపోష॥

---

# బృందావనము లక్ష్మణదేశికుఁడు



ఇతఁడు కర్లపట్టణము నివాసి యఁట! ఇతఁడు "సంస్కృతాంధ్రకవితా విఖ్యాతుఁడు." "శ్రీరామావరదేశిక" శిష్యుఁడు. రామాయణ కథాసంఘటితముగ రాజకంఠీరవ శతకము వ్రాసెను. ఇతఁడు క్రీ॥ శ॥ 1870 ప్రాంతముల వాఁడు కావచ్చు నని తెలియుచున్నది. వైష్ణవుఁడు. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## కవిచరిత్ర మున్న పద్యములు

"శా. శ్రీరామాయణ సత్కథారసరణి శ్రీకొప్ప నీపద్యముల్॥" 123

"శా. భారద్వాజకులాబ్ధిశీతకిరణ ప్రఖ్యాతిచే నొప్పమా
శ్రీరామావరదేశికేంద్ర కృపచేఁ జెల్వొందు నీవృత్తముల్॥" 124

మ. ఇది బృందావనవంశ వార్ధిశశి భృన్నీరేజపత్రేక్షు స
త్పదభక్తాగ్ర శిరోమణుల్ విబుధసంభావ్యుల్ త్రయీసాగరుల్
విదు లత్యద్భుత సంస్కృతాంధ్ర కవితా విఖ్యాతు లష్టాదశా
ర్థదులౌ లక్ష్మణదేశికుల్ నుడివె రామారాజకంఠీరవా॥ 125

## శైలికిఁ బద్యములు

మ॥ ధరణీనాథుఁడు వేడ్క దేవర నయోధ్యారాజ్యసింహాసన
స్థితుఁ గావింపఁగఁ జెత్తనంబొట నీతే మాలి కామ్యార్థమై

తనుజాం దేకయుప్రీతి లోఁదలచి యాత్మాంగి సౌభాంతమో
హాగముం జొచ్చెఁగదా తలంప రఘురామా రాజకంకీరవా॥ 36

మ. కరికంఠుండు నిజాంతరంగమునఁ దా కాంక్షించి నీమూర్తి హ్పా
త్సరసీజాతమువంటు వేడ్క నిలువొందం జేసి నీపేర భీ
కర సంసారమహాబ్ధికిం దరణిగా కౌమారికిం జెప్పె ది
వ్యగహాస్యం బిది మంత్రిమంత్రిమని రఘురామారాజకంఠీరవా॥

---

# రత్నమాంబ



ప్రబంధములలో మొల్లవలె శతకములలోఁగూడఁ జాలమంది వనిత లున్నారు. శతకములు వ్రాసిన స్త్రీ లింక ననేకులు కలరు. ఈమె శ్రీ వేంకటరమణశతకమును రచించినది. "వేంకటరమణా!" యనియే మకుటముతో నందములైన కందములఁ గూర్చినది.

క. నీ దాస దాసినగు నా
కేదరిఁ జూపెదొ భవాబ్ధి నీఁదఁగఁజాలఁగా
నీదయ శ్రీధర నమ్మితి
వేదాంతవిచార ధీర వేంకటరమణా!

ఇట్టి మధురకందముల నీ కవయిత్రీమణి చక్కని భావము లేర్చి కూర్చినది.

మంత్రి వంశాంబుధిసోముఁడును, పెనుగొళ్ళగోత్రుం డును రూఖ్షానుపేట హేమభూపతి పెద్దకొడుకు నగు ననంత భూపతి యర్ధాంగిరత్న మగు నీ రత్నమాంబ కాలనిర్ణయమున కీ శతకమునందాధారములు లేవు. అధునికురా లని సందే హించెదను. గోత్రనామములు చెప్పుకొనిన పద్య మిది.

సీ. అవనిపై మంత్రి వంశాంబుధి సోముఁడు
పెనుగోళ్ళగోత్రుండు ప్రియధనుండు
యెలమి రూఖ్షాన్పేట హేమభూపత్యగ్ర
తనయుండు నతుల సద్ధర్మశాలి
భవ్యుఁ డనంతభూపతి యా నరేంద్రుని
యర్ధాంగి యగు రత్నమాంబయందు
శ్రీ వెంకటేశుఁ డక్షీణకటాక్షంబుఁ
జేర్చియు శతకంబుఁ జేయుమనుచు

గీ. యాజ్ఞ నిచ్చినఁ జెప్పెను ప్రాఙ్జలిదియుఁ
గరుణ వెలయఁగ జూచి సత్క్రమముతోడ
లక్షణాదులు చెడిన సలక్షణముగ
దిద్దుఁ జేయుడి మదుల సందేహ ముడిగి

శతకము చివర రెండు కందార్ధములును, తిరుపతి వేంకటేశ్వర స్తోత్రమయ మగు ద్విపదయుఁ గలవు.

క. ఆడింతువు మదిలోపల
నీడలుగాఁ దోఁచునట్టి నిగమాదుల నీ
వాడవు వాటినిగూడుక
వేడుకతో నించుకైన వేంకటరమణా!

క. చుక్కల నెన్నఁగ వచ్చును
మక్కువ నీనామరూప మహిమల్ క్రమతః

లెక్కింప బ్రహ్మకైనన్
వెక్కసమై తోఁచబడును వేంకటరమణా!

క. వేడను ధనధాన్యంబులు
వేడను దీర్ఘాయు వవని వేడను కీర్తిన్
వేడను వైకుంఠాదుల
వేడెద నీ పాదసేవ వేంకటరమణా!

ఇట్లే ముద్దుపద్దెముల నీ ముద్దియ వ్రాసి తనభక్తిని వెల్లడించుకొనెను. శైలియు, గమనమున చక్కఁగ నున్నవి.

---

## గంగనపల్లి హుసేన్‌దాసు



ఈతఁడు హుసేన్‌దాసు శతకమును వేమన్నవలె వ్రాసిన వేదాంతి. ఈతనిఁగూర్చి గ్రంథప్రకాశకు లిట్లు వ్రాసియుండిరి. "శ్రీమాన్ వుసేన్ సచ్చిదానంద స్వరూపః॥ అఖిలవేదాంతార్థ ప్రతిపాదకంబును, నాఖిలముముక్షుజన యపేక్షితంబులైన ఈ హుశేన్ సుజనవర్య యను గీతశతకంబును ఈ గ్రంథము కడపజిల్లా పుల్లంపేట తాలూకా రాజంపేట నివాసు లగు మృదుమధురమనోహరకవీశ్వరుం డగు మహమ్మదీయవంశపయః పారావార రాకాసుధాకరుం డైన

శ్రీగంగనపల్లి సయ్యాదుమబీసాహేబు సత్యవరసుపుత్త్రుం డగు సయ్యాదువుసేన్ సుజన వర్యునిచే రచియింపఁబడియె." ఈ పీఠికవాక్యముల సత్యాసత్యములు పాఠకులే క్రిందిపద్యముల వలన గ్రహింపఁగలరు. ఈతఁడు వేమన్న ననుసరించిన వేదాంతి. ఇందు నీతివైరాగ్యములు, బ్రాహ్మణనిందయుఁ గూడ నున్నవి.

గీ. బ్రాహ్మకులమని బాపల పాదములకు
పూజసేయుచునుందురు భూమిజనులు
కులము దెలియక చెడిరి యా గుణములేక
ధర్మగుణధుర్య శ్రీహుసేన్ దాసవర్య!

గీ. పప్పుకూడని విని మూర్ఖ బాపలెల్ల
పదులు నూఱాముడైనను పసులు విడిచి
పోవుగతి పామరుల తోటి పొందువిడువ
ధర్మగుణధుర్య శ్రీహుసేన్ దాసవర్య!

గీ. కల్లు సారాయియును దాగి కష్టపడుచు
వళ్ళు మఱచుచు తమపైని వాంఛవిడిచి
కల్లలాడుచు నుందురు కఠినమతులు
ధర్మగుణధుర్య శ్రీహుసేన్ దాసవర్య!

ఇతఁడు కావ్యాదిని మహమ్మదును, అబూబీకర్ ఉమ్మరులని ఉస్మానలీయని యున్న అసహాబులను, హసన్ హుసేన్ వీరులను, సర్వపైగంబరులను బొగడి, కాళిదాసాది కవులకు మ్రొక్కె లిడెను. 117 - 125 పద్యములలోఁ దన వంశవివరములఁ జెప్పుకొనెను.

ఈతఁడే వ్రాసిన సుమతిశతకము కూడఁ గనఁబడు చున్నది. సుమతికి బుద్ధులేల? సుమతికే చెప్పవలె నని వేంకటార్యకవి మఱియొక సుమతిశతకమును వ్రాసెను.

క. అక్కఱ గలిగిన వేళల
చక్కఁగ బంధువులఁ జూచి చాలగ మదిలో
మక్కువతోడ నుతించెదు
గ్రక్కున చెడు దంపువలన గాదా సుమతీ॥ 1

క. ప్రియమును గలుగని కొలువును
నియమము లేనట్టి పూజ నెన్నకు మదిలో
దయసును సమమగు పదమును
నయముగఁ గానంగతరమె నవనిలొ సుమతీ॥ 4

# మండవేముల వెంకయ్య

ఇతఁడు "నవసుగుణధామ సచ్చిదానందరామ" యను మకుటముతో గీతపద్యశతకమును రచియించెను. భక్తిజ్ఞానముల బోధించెను. కవి వివరము లేమియుఁ దెలియవు. కవి 19 వ శతాబ్దము వాఁడై యుండును. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

సచ్చిదానందరామ శతకము

తే.గీ. పరమ మునిశాపమున నున్న బండరాతి
చెలువఁజేసిన నీ పాదములనుఁ బ్రీతి

భావమున నిల్పి దలఁచినఁ బాయు భీతి
నవసుగుణధామ సచ్చిదానందరామ! 21

గీ. సాధనచతుష్టయంబును సరగ నొంది
పరమసాధులు చేయు దీవనలఁ బొంది
మెలఁగు భక్తుఁడు ముక్తుఁడౌ మేలుఁ బొంది
నవసుగణధామ సచ్చిదానందరామ! 35

---

## చిత్రావర్ఘుల సూర్యప్రకాశకవి యు



ఈ కవి 30,40 సం॥రముల క్రింద నుండువాఁడు. పిఠాపురప్రభువగు శ్రీరావు గంగాధర రామారాయాశ్రితుఁడు. సంస్థానపండితుఁడు. ఇతడుఁ శ్రీరామపాదస్తవసహితంబగు దీనచింతామణీశతకమును రచియించెను. "దీనచింతామణీ" యని మకుటము. గ్రంథము 4979 కలియుగాదికిఁ బూర్వము రచియింపఁబడినది. అనఁగా క్రీ॥ శ॥ 1879 కిఁ బూర్వము. ఇతఁడు సంస్కృతాంధ్రములయందుఁ జాల ప్రజ్ఞకలవాఁడు; భక్తుఁడు.

శా. చేయంజాలక మంచి కార్యములు దుశ్చేష్టార్థమై కృత్రిమో
పాయంబు ల్సమకూర్చు హీనుఁడు మహాప్రాగల్భ్యసంయుక్తుఁడై
ధీయుక్తుండు భవత్పదాబ్జములఁ జింతించు న్దయాసాగరా
మాయాతీత విహారధీర రఘురామా! దీనచింతామణీ!

మ. అంకలంకాత్మకులయ్యుఁ గొందఱు భవద్ధ్యానంబుచేనున్న సే
వకబృందంబుల కోర్కెఁ దీర్చుటకునై స్వప్నంబున న్వచ్చి ర
మ్యకటాక్షంబులఁ జూచుచు న్నగుచు సంభాషించెదీ వన్న న
మ్మక వాదించెద రేమి సేయుదును రామా! దీనచింతామణీ!||

---

# మండపాక పార్వతీశ్వరకవి



ఈతఁడు 1833లో జన్మించి 1897లో మరణించిన ప్రసిద్ధకవి. సంస్కృతాంధ్రములఁ బండితుఁడు. ఈతఁడు వ్రాసిన గ్రంథము లనేకము లున్నవి. చాటుకృతు లెనుబది వఱకుఁ గనఁబడుచున్నవి. ఆ పేరుల వివరములు అముద్రిత గ్రంథచింతామణి సంపుటము 7 సంచిక 7 పుట 30లో వివరించియున్నారు. కవి పండ్రెండవయేట నారంభించిన కంద పద్యములు మొదలు యేకప్రాసశతకములు, చిత్రకవిత్వశతకములు పెక్కులు వ్రాసెను. సమస్తదేవతల మీఁదను గలవు. మంచిధార కలవాఁడు. వీరి చరిత్రము సంపూర్ణముగ హరిహరేశ్వరశతక పీఠికగ నున్నది. ఒక్కశతకము నుండి శైలి కొక్కపద్యము వ్రాసెదను.

### శ్రీగోపాలకృష్ణ శతకము

సీ. చిత్తజాతునిఁ గన్న మత్తకాశినిబత్తి
జొత్తిలి యొకయడు గొత్తుచుండ

విత్తవతీయశోవిత్తయా బిత్తరి
పొత్తుమై నొకపవం బొత్తుచుండ
నుత్తుంగరుచు లిగురొత్త హస్తములు క
ట్యుత్తమాంగస్థలుల్ హత్తి వెలయఁ
దత్తత్సువర్ధసంపత్తికై ప్రజలు ప్ర
పత్తిమై గేల్గవ లెత్తి మ్రొక్క

గీ. మెత్తనగు పాపరా మెత్త నొత్తిగిలఁగ
సత్తమిలి బత్తులను నెల్ల బుత్తిముత్తు
లిత్తువఁట కొర్త్తయే యిట్టి వృత్తి నీకు
భక్త పాలనతృష్ణ గోపాలకృష్ణ॥

వీరు వ్రాసిన హరిహరేశ్వరశతకమున కవి స్వీయ చరిత్రము సంపూర్ణముగ వ్రాసియుండెను. వీరిది పండిత వంశము. వారందఱు వ్రాసిన కృతులపేర్లు పై చింతామణిలోనే యున్నవి.

## మృత్యుంజయస్తవము. (అంత్యకవిత్వము.)

క. భృత్యుల నెల్లప్పుడుఁ గృత
కృత్యులుగాఁ జేయు శివుఁడు గృపచేననుచుక్
నిత్యము వినుచుండుటచే
మృత్యుంజయునకు నమస్కరింతుఁ దరింతున్. 4

క. జాత్యాశ్రిమానుఃపఞక
ర్మత్యాగ నిదానమైన పరిబలాజ్ఞానం
బత్యయ మొందునటుల్ గను
మృత్యుంజయునకు నమస్కరింతుఁ దరింతున్.

సీతారామద్వ్యర్థి శతకము

క. శ్రీజనకసముంచితపదమై జగదానంద కందమై నీయోజన్
రాజిల్లుచున్న కవనముచేఁ జొక్కింతు నిన్నుఁ బ్రేమ సీతారామా! 1

---

# బండరుపల్లి రామకృష్ణకవి

ఇతఁడు శ్రీషికింద్రానగరేశ్వరశతక మొండు రచియించెను. "శ్రీషికిందానగర సంస్థితమహేశ స్ఫురితగౌరీ సమేత శంకరశివేశ!" యని మకుటము. ఇతఁడు కులగోత్రము లిట్లు తెల్పుకున్నాఁడు.

సీ. వసుధ బండరుపల్లి వంశాబ్ధిచంద్రుండ హనుమనమంత్రికి నాత్మజుండ
లలితభారద్వాజ లక్షణగోత్రుండ సారిది నాపస్తంబ సూత్రజుండ
భూరి కృష్ణానదీతీరవాసుండను రామకృష్ణకవీంద్ర నామయుతుఁడ
కాళికోపాసన కారుణ్యసిద్ధుండ భవదీయపాదాబ్జ భక్తియుతుఁడ
గీ. గాన బుధజనకారుణ్య ఘనతవలన శతకమొక్కటి నీకు నేఁజేసినాడ
శ్రీషికిందాఖ్యనగర సంస్థితమహేశ స్ఫురితగౌరీసమేత శంకరశివేశ||

పై పద్యమువలన నీతఁ డాపస్తంబసూత్ర భారద్వాజ గోత్రము వాఁడనియు, హనుమన్న మంత్రి కాత్మజుఁడనియు, కృష్ణానదీతీర వాసుఁడనియు, కాళికోపాసకుఁడనియుఁ దెలుపుచున్నాఁడు. షికిందానగర మనఁగా సికింద్రాబాదే! నైజాముమండలములోనివాడగుట నాదేశముఖ్య

నగరము నందలి మహేశుఁ డీతని కిష్టదైవము కాఁబోలు. ధవళాగరు దశరథరాయుఁ డీతని పోషకుఁడు. అతఁడు దాన రాధేయుఁ డనియు, గుణాధ్యక్షుఁ డనియు, బాలాజీలక్ష్మ భాయి దంపతులకుఁ బుత్త్రుఁడనియు నాతని వర్ణించెను. పోష కుఁడు మహారాష్ట్రుఁడో, మార్ధ్వుఁడో తెలియదు. 99 వ పద్యములో నీతని రక్షింపుమని కవి శివునిఁ బ్రార్థించుచు న్నాఁడు. ధవళాగరాన్వయుఁ డని చెప్పుచున్నాఁడు.

సీ. సకలపాతకకోటి సదనంబు బహుదుఃఖ
సముదయంబుల కెల్ల జన్మభూమి
కామాదిశాత్రవ గణముల కిరు విల
నీషణత్రయముల కింపు నెలవు
బహుళాశలకుఁ బట్టు భూమి నీ సుతవిత్త
బంధురబంధ సంప్రాప్తసీమ
బహురోగపీడిత భంగ కలాపంబు
జననకర్మలకాది సదన మవని
గీ. ఇట్టి సంసార సౌఖ్యంబు లేమి ఘనత
యనుచు నినుఁ జేరు మార్గంబుఁ గనుట మేలు
శ్రీషికింద్రాఖ్యనగర సంస్థితమహేశ
స్ఫురితగౌరీసమేత శంకరశివేశ ॥

కవి దశరథరాయని యాశ్రితుఁడై బహుశః యాతని యునికి యగు షికింద్రాబాదు పోయినప్పు డాతనికోర్కెపై నీశతక మచ్చటి శివునిపైఁ జెప్పియుండవచ్చు నని తోఁచు చున్నది.

# దామరాజు లక్ష్మణదాసు



ఇతఁడు సీతారామశతకమును రచించెను. 'రామా!' యనియె మకుటము. ఇతఁ డాఱువేలనియోగి. శ్రీవత్సగోత్రుఁడు. కడపటి పద్యమున నిట్లు వ్రాసినాఁడు.

క. భూసురముగ మల్కాపుర
వాసుఁడనై వెలసినావొ వసుధాస్థలిపై
నాసించి యుంటి లక్ష్మణ
దాసాధిప యిమ్ము మభయ దానము రామా!

దామరాజువారేలూరు వైపుల నున్నారు. ఇతఁడు మల్కాపుర వాసియేమో? మచ్చునకు రెండుపద్యము లుదాహరింతును.

క. తలఁచెద ఘననిభగాత్రము
తలఁచెద నీ నగుమొగంబు దలఁచెద గుణముల్
తలఁచెద మధురోక్తుల నే
తలఁచెద పదకంజయుగము తప్పక రామా ॥ 30

క. ముగ్గురువేల్పులలో నీ
వగ్గలమైనట్టి వేల్పు వంచును విని నీ
దగ్గరకుఁ జేరినాఁడను
యొగ్గెమియు సేయఁబోక యేలుము రామా! 46

ఈతనికాల మెప్పుడో తెలియదు.

# శృంగారకవి వేంకటరాముఁడు

ఇతఁ డాధునికుఁడు. మాధవశతకమును రచియించెను. "మాధవా" యని మకుటము. భరద్వాజగోత్రుఁడగు "అవసరాల వేంకట్రాయునకును రమణమ్మకును" బుత్రుఁడగు సీతరామయ్య గారీ గ్రంథమును ముద్రించెనఁట! కవి కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంబసూత్రమువాఁడు. వింజరము కాపురస్థుఁడు. పళ్ళయ కుమారుఁడు. బ్రాహ్మణుఁడు, భక్తుఁడు, నని తెలియుచున్నది.

## మాధవ శతకము

ఉ. కూరిమితో దురాశ అను కొమ్మలు మాత్రము గల్గినట్టి సం
సారమహీజమందు ననిశంబుఁ జరింప మరందవారి చే
కూరునె మానసాళి కతికోమలమైన భవత్పదాబ్జము
ల్చేరి భజింప లభ్యమగు శీఘ్రముగా వనమాలి మాధవా! ||

ఉ. గోపిక లందఱు న్గుములు గూడుక వచ్చి యశోదఁ గాంచి వీ
పాపఁడు మీఁగడ ల్పెరుగుఁ బాలును నిచ్చటఁ ద్రావి పోవ నె
ట్లోపుదుమమ్మ రాజసుతు లూర్జితమా యిటువంటి చైదము
ల్కాపుర మెట్లొనర్తు మనఁగాఁ గద గట్టెను రోట మాధవా ||

# మున్నంగి వేంకటదాసకవి



ఇతఁడు వేణుగోపాలశతకము వ్రాసెను. భక్తిరస ప్రధానము. ఆపస్తంబసూత్రుఁడు, హారితసగోత్రుఁడు, ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. అతిదాసశీలుఁ డగు మున్నంగి సుబ్బయ పుత్రుఁడు. గ్రంథకర్తయే వ్రాసిన ప్రాఁతగ్రంథము వెలగపూడి దానయ్యగారికిఁ జిక్కినట్లు (ఆంధ్రపత్రిక 8-10-1919లో) వ్రాసియున్నారు. శైలి కొక పద్యము చూపెదను.

సీ. మించు క్రొమ్మించు కొంచించు నెమ్మేనితోఁ
దళుకు చెక్కులకాంతి తళుకు తోడ
కమ్మతేజాలదాలు గ్రమ్ము నెమ్మొగముతో
కులుకుతో మురిపెంపు పలుకుతోడ
నగవుతో భ్రమియించు వగతో నొయారంపు
నటనతోఁ గుదురైన దిటముతోడ
కచకుచాభరణ సంకుచితమౌ నడుముతో
చరణమంజీర నిస్వనముతోడ

గీ. ఎదుట నిలిచిన రాధను నుదుట గుబ్బ
అంటఁగదిసిన స్వామి నా వెంటరార
శ్రీశ మునికోటి పురవాస చిద్విలాస
వేణుగోపాల రుక్మిణీప్రాణలోల!

# తోలేటి లింగయ

ఈతఁడు పంచాక్షరీగాణాపత్యమంత్రోపదేశము నొందిన సాత్వికానందవేది నని చెప్పుకొనెను. తోలేటి లింగయామాత్య విరచిత మని వ్రాసికొనెను. తోలేటి పట్టణ కేశవస్వామికిఁ గృతి. విరహిణీశతకములలోఁ జేరినది. కవిత చక్కఁగ నున్నది. కవి బుద్ధిమంతుఁడే! ఈస్టిండియాకంపెనీకిఁ దరువాతవాఁడు. ఆధునికుఁడే! ఈతని వివరము లింతకంటెఁ దెలియలేదు.

## తోలేటి కేశవ శతకము

సీ. నాసాగ్రమా క్తికాభాసమైత్రీభూత
హాసదీప్తముఖాబ్జ మమరువాని
గళకౌస్తుభ ప్రభామిళితాంగముల మించి
యత్యున్నతాంశంబు లమరువాని
బర్హిపింఛప్రభా భాస్వత్పితాంబర
కమనీయ కటిదేశ మమరువాని
అలవేణునాదానుగుణనూపురనినాద
సమకేళికానృత్య మమరువాని
గీ. దివ్యమంగళవిగ్రహ నర్తకుంజ
కలితవక్షస్థలేందిర గల్గువాని
వనిత తోలేటిపట్టణ వాసుఁడైన
కేశవస్వామిఁ దేవె రాకేందువదన॥

# ముగ్గిసెట్టి పులియప్ప రేడు



ఈతఁడు వీరశైవుఁడు. వీరన్న పౌత్రుఁడు; రామన్న శెట్టి రాచమదేవులకుఁ బుత్రుఁడు; త్రిపురాంతకునికిఁ దమ్ముఁడు. కల్లూరి చిక్కయదేవర పుత్రుఁ డగు నలవూరి దేవరారాధ్యుని మనుమఁ డగు శరభయ్యదేవరకు, కవి శిష్యుఁడు. 100 సీసపద్యముల శతకము రచియించెను. శివభక్తి, విష్ణుదూషణము, శివభక్తుల స్తుతులును గలవు. వేదాంతము లేకపోలేదు. ఇతఁడు చాలకీర్తనలు, శైవచరిత్రము, 50 సం॥ రములు నిండకుండ నీ శతకము, కేదారవ్రతకథ మొదలగు గ్రంథములు రచించితి నని చెప్పుకొనినాఁడు. (98 పద్యము)

## మల్లెలరామలింగ శతకము

సీ. ఇల్లాలు గుణవతియైన యింటికి కీర్తి
            ఘటియించు దిశలు ప్రకాశముగ
    ప్రబలు సౌభాగ్యంబు పాలు పొంగిన రీతి
            సిరివచ్చి వాకిటఁ జేరియుండు
    సకలగుణసంపదల్ సరవితో డుత నొప్ప
            మదికి సంతోషంబు వదలకుండు
    పాడిపంట లభీష్ట ఫలితంబు నేవేళ
            సకలకార్యంబులు సఫలమౌను
గీ॥ మన్నుఁ బట్టిన బంగారమై రహించు
    కులము లేటికి వనితల గుణము కులము

భక్తజనసంగ భక్తులప్రాణలింగ
రక్తియలరంగ మల్లెలరామలింగ! 97

ఈ పద్యము నందలి కవిభావము చక్కఁగ నున్నది. కులము లేని జంగమ మతప్రియుఁడు నిశ్చయమైన సత్యము నొకదానిని వెల్లడింపఁ గలిగెను.

---

# రంగయ

---

ఇతఁడు వసుదేవనందనశతకమును వ్రాసెను, ఈ కవి 107 వ పద్యములో బంధకవిత్వమున "శ్రీశ-రంగయ శుభ కవితా యను రెండుద్ధారకము లున్నవి" అని ముద్రాపకులు చూపియున్నారు. కవి పేరు చెప్పుకొనెను. మన్నవ లక్ష్మ ణార్యుఁ డను విద్యాగురువు శిష్యుఁడ ననియు, "గదాగ్రజ సుబ్బమ యాదినార్లకుఁ" పుత్రుఁడ ననియు, రంగయ ననియుఁ గవి 104 వ పద్యమున వ్రాసికొనెను. "శ్రీధర భూమి వేంకటగిరి నృదిరంజిలఁ బాఁతకోట నారాధితుఁ డౌచు శ్రీవరదరా జనిపేరు వహించియున్న నా నాథుఁడ" వని భగవంతునిఁ బ్రార్థించెను. (9) ఆదికవిస్తుతిలోఁ బోతన కడపటి వాఁడు! ఇతర వివరములు తెలియవు.

## వసుదేవనందన శతకము

ఉ. రాజనిభాననా విహగరాజతురంగ దయాంతరంగ గో
రాజనికేశమౌళి సురరాజసహోదరహామిత్ర భీష్మ రా
డ్రాజసుతాహరీ యసురరాజభయంకర భక్తశంకరా
రాజసహోదరీహృదయరంజన శ్రీవసుదేవనందనా! 17

ఉ. ఇంద్రుని రాజ్యలక్ష్మిఁ గొని యేగిన దానవుఁ జేరి గుజ్జువై
మందశుభోక్తులం ద్రిపద మండలి దానముఁ బొంది యంత సై
సాంద్రత నిండి యా బలి రసాతలికిన్ బడఁద్రొక్కి రాజ్యమా
యింద్రున కిచ్చినట్టి జగధీశ హరీ వసుదేవనందనా! 16

ఉ. కొండికనాఁడు గోపకులఁ గూడి వనంబుల నాల మేఁపుచున్
గండని గాళియోరగుని గండరఁగాండము నందు దూఁక నీ
దుండగ మవ్వకన్ దెలిపి తోడ్కొనిరా ఫణిఁ ద్రోలి యంతఁ గ
న్పండువుగాఁ గనంబడవె భవ్యగుణా వసుదేవనందనా!! 2

---

# దేవరింటి సోమిరెడ్డి



ఈతఁడు సుంకిరెడ్డి కొడుకు. ఆకుమళ్ళపురము నందలి చెన్నకేశవస్వామిపై నీ శతకము వ్రాసెను. నీతి వైరాగ్యములఁ జెప్పెను. గ్రామీణతాస్పులని నాగరకులు నిందించు పద్యములు లేకపోలేదు.

## చెన్న కేశవ శతకము

సీ. స్వర్ణంబు లొకటియే సొమ్ములు వేర్వేఱు(?)
యాలరూపులు వేఱు పాలు నొకటె
మృత్తిక యొకటియే మృద్భాండములు వేఱు
దేహంబులును వేఱు దేహి యొకటె
పరగఁదత్త్వ మొకటె, పటములు వేర్వేఱు
గురువులు వేర్వేఱు గుఱుతు నొకటె
శాస్త్రంబు లొకటియే శాస్త్రార్థములు వేఱు
పలుకులు వేర్వేఱు భార తొకటె.

గీ॥ భువనములును వేఱు భువనజలోచన
పరగఁ గర్త వీవె పరులు వేఱు
ధరణి యాకుమళ్ళపురమున వెలసిన
చెన్నకేశవార్య సార్వభౌమ॥

భాషాదోషములు పెక్కు లున్నవి. ఇంకను గొన్ని దిద్దినప్పు డీ రూపము వచ్చినది. కొన్ని లోపములు ముద్రాపకులవి. కవి కర్నూలు మండలములోని కోవెలకుంట్ల తాలూకా ఆకుమళ్లగ్రామమువాఁడని ముద్రాపకులు ముద్రించిరి. కవి యాధునికుఁడు.

## మద్దాలి గురుస్వామి



ఇతఁడు వ్రాసిన నరసింహశతకము, లక్ష్మీనరసింహ తారావళియు నాకుఁ జిక్కినవి. ఇతఁడు గౌతమగోత్రజుఁడ నని మాత్రము శతకాంతమునఁ జెప్పికొనెను. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

నరసింహ శతకము

క. రామ విశాలపరాక్రమ
భీమసురారి జయకామ భీకరపాప
స్తోమవిరామ శుభాకర
నామ దయాకరుణసీమ నరసింహహరీ!

క. మున్నుం దమ చరితంబుల
నెన్నంగాఁ జాలుకా మునీశ్వరవర కో
ట్లున్నారో సర్వేశా
నన్నుం దవదాసుఁ జేయ నరసింహహరీ! 21

---

## తిమ్మరాజు పేరకవి

ఈ కవి సచ్చిదానంద స్వరూపుఁడు. ఇతఁడు బడగలనాటి కన్నడి కులుండు. పాపయ్య పుత్రుఁడు. మౌద్గల్య

గోత్ర, అశ్వలాయనసూత్రుఁడు. క్రీ॥ శ॥ 1892 లో సీతని శతకము ముద్రణ మందెను. ఈతఁడు శ్రీరఘురామశతకమును, ఆత్మారామశతకమును వ్రాసెను. రెండు శతకములును వేఱు వేఱు కవులు వ్రాసినవేమో సందియము కలుగుచున్నది. రెండుశతకములనుండియుఁ గొన్ని పద్యములు శైలికిఁ జూపుచున్నాను.

## శ్రీరఘురామ శతకము

సీ. మధుఘృతశర్కర మాధుర్యముల కంటె
రామనామము సుధారసము తీపు
దధిచూతజంబీర ద్రాక్షాఫలముకంటె
రామనామము సుధారసము తీపు
గుడమిశ్రమాపూప గోక్షీరములకంటె
రామనామము సుధారసము తీపు
పనసరంభకపిత్థ ఫలరసంబులకంటె
రామనామము సుధారసము తీపు

అన్ని మాధుర్యముల కంటె నధికతీపు
రామనామంబు భువిలోన రామచంద్ర
రామనామంబుతో సాటి రాదు సెద్ది
రామ రఘురామ శ్రీరామ రామరామ! 13

సీ. రామచంద్రుని వంటి రాజు గల్గితె గదా
పవనతనయుని వంటి భటుఁడు గలఁడొ
సారపింహుని వంటి సాధుఁడుండెఁ గదా
దానవసుతవంటి దాసు గలఁడు

నారాయణుని వంటి పూర్ణుఁడుంటే గదా
వైనతేయునివంటి వాఁడు గలఁడు
దశరథాత్మజు వంటి యసమఁడుంటే గదా
యల విభీషణువంటి యాప్తుగలఁడు
రాజనాథత్వ పూర్ణత్వ యశము లెల్ల
నీకు తగుఁగాక నితరుల కగునె యర్థ
మిమ్ము నిరయవసౌఖ్యంబు లిష్టముగను
రామ రఘురామ శ్రీరామ రామరామ ॥

## ఆత్మారామ శతకము

క. జంట దరంగి యలంగెడి
కంటి నలుసుకన్న దేవకర్తలు గలరా
మింటికి మంటికి నొకపై
యంటియు నంటకయె వెలుఁగు నాత్మారామా! ॥

క. జననం బందిన యప్పుడె
ఘనకర్మంబులకుఁ జొరును గావున మఱలన్
జననంబులేని నిరవయ
మును నొందిన వాఁడె సుఖుఁడు నాత్మారామా! ॥

---

# పసుపులేటి వేంకటదాసు

ఇతఁడు చంబకూరిపురిహరిశతకమును వ్రాసెను. కవి వివరము లేమియుఁ దెలియవు. 105 పద్యము లున్నవి.

క. హేరంబుని భారతినిన్ పేరిమిగల శకుని మేటి పెద్దనకవినిన్
సారెకు వాక్సిద్ధికినై కోరెద లక్ష్మీశ చంబకూరిపురీశ! 14

క. పరనిం దాత్మస్తుతిరతి పరధన పరదారగమన పరులగు వారే
దురితంబున పేగుదురో గురుతుగ లక్ష్మీశ చంబకూరిపురీశా! 39

---

# గురురాజకవి

ఈ కవి శేషధర్మములు వ్రాసి బళ్ళారిమండలము నందలి జోహారాపురాధిపతి యగు సంజీవరెడ్డిగారి కంకితము చేసినట్లును. కవి నలువది యేఁబది సంవత్సరముల క్రితము వాఁడనియుఁ, గవులచరిత్రమునం దున్నది. ఈ కవి పద్మావతీపరిణయము నాటకము, రుక్మిణీపరిణయము (పద్య గద్యకృతి), రాఘవేంద్రాష్టకము, అనిరుద్ధచరిత్రము (నాటకము), భర్తృహరి శతకములను వ్రాసి కర్ణాటకృతులఁ గూడ వ్రాసెనట! ఈతని భర్తృహరి తెలిఁగింపు నాకుఁ జిక్కనందున శైలికిఁ బద్యము లీయలేకపోతిని. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁడు.

---

# తటవర్తి వేంకటమంత్రి

తటవర్తివారు తణుకుతాలూకా మల్లేశ్వర గ్రామ ప్రాంతములఁ జాలప్రసిద్ధి గలవారు. వీరిలోఁ జాలమంది తెలుఁగునఁ బ్రసిద్ధపండితు లుండిరి. తెలుఁగు భారతమును వీరిలోఁ గొందఱు పఠనముచేసి సంపూర్ణముగఁ బుస్తకసహాయము లేకుండఁ జదువఁగలిగెడివారు. అందులకై వీరికి బొబ్బిలి, పిఠాపు రాస్థానములలో భూములు వార్షికములు నొసంగిరి.

ఈ వంశములోనివాఁడైన తటవర్తి వేంకటమంత్రి యే యూరివాఁడో యే కాలమువాఁడో తెలియదు. ఇతఁడు రమామనోహరశతకము వ్రాసెను. విష్ణుస్తవాత్మక మైనది. వియ్యమ కృష్ణమంత్రుల పుత్రుఁడు. క్రీ॥ శ॥ 1850 ప్రాంతమువాఁడు కావచ్చును.

## రమామనోహర శతకము

ఉ. శ్రీరఘువంశ సంభవ సుసేవక సన్మునిపుంగవ ప్రభా
ధీరమనోవికాస కరధీబల రావణసంహారక్రియా
కార దిశాంతశాత్రవనికాయ భుజంగవిరాజ రాత్రిసం
చార సరోజసోమసురసారసహంస రమామనోహరా॥

ఈతని పెంపుడుకొడు కగు కొండయ రామశతకము వ్రాసెను.

# తటవర్తి కొండయ

ఈతఁడు పై వేంకటమంత్రి దత్తపుత్రుఁడు. వీరిది కౌండిన్యసగోత్రము ఇతఁడు రామశతకము, మల్లేశ్వరశతకమును వ్రాసెను. రామశతకమునందు రామాయణకథ కలదు. మల్లేశ్వరస్వామి రామచంద్రపురముతాలూకా మనగపల్లిగ్రామమున నుండెఁగాఁబోలు. రెండు శతకములనుండి రెండుపద్యములఁ జూపెదను. కవి యేఁబదిసంవత్సరముల క్రితమువాఁడై యుండవచ్చును. (క్రీ॥ శ॥ 1870.)

## (1) రామ శతకము.

క. కుశికాన్వయుఁడగు ముని మిము
గుశలముఁబొందింపఁ దలఁచి కోరిక లొప్పన్
దశరథునకు మీ మహిమలు
విశదముగాఁ దెలిపి మిమ్ము వేడెను రామా!

## (2) మల్లేశ్వర శతకము.

సీ. శ్రీగణాధ్యక్షునిఁ జిత్తంబులో నిల్పి
భారతీదేవికిఁ బ్రణుతిఁ జేసి
శ్రీమహావిష్ణుని సేవించి మదిలోన
పద్మాసనస్థుని భక్తిఁ దలఁచి
వరమహాలక్ష్మికి వందనం బొనరించి
నగరాజకన్యకు నతు లొనర్చి
సురముని వరులను సరవితోఁ బూజించి
యిష్టదైవతముల నెలమిఁ గొల్చి

కాళిదాసాది కవులకుఁ గరము మొగిచి
సీసశతకంబుఁ జేసెదఁ జిత్తగింపు
పండితోల్లాస మస్కరపల్లివాస!
భవభయవినాశ! మల్లేశ! పార్వతీశ!

---

# కామేశ్వర కవి

ఈ కవి బ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు. శ్రీరామ ప్రభుశతకమును రచియించెను. కవి వివరములు కాని కాలము కాని తెలియదు. ఇది సంపూర్ణముగ ధూర్జటి కాళహస్తీశ్వరశతకమును విష్ణుపరముగ మార్చిన శతకము. అందలి భావములు, ఎత్తుగడలు, పదములు, వాక్యములు నిం దనేకము చేరినవి.

## రామప్రభు శతకము

శా. శ్రీమత్తారకనామ రామ జయలక్ష్మీధామ నీలాంబుద
శ్యామ వైరివిరామ రూపలలితాశ్యామావళీకామ సం
గ్రామోద్దామ రచింతు వృత్తశతకగ్రంథంబు నీపేర నిష్కామాసక్తిని సావధానమతి నాకర్ణింపు రామప్రభో॥ 1

శా. ఏనాఁ డాప్తుఁడు పక్షిరాజు కవిరా జేనాఁటి చుట్టంబు లం
కానాథానుజుఁ డెన్నినాళ్ళ హితుఁ డా కంఠీరవాఖ్యాత్మజుం
డే నాఁడాత్మ కిరాత నేఁ డవనిలో నేనాఁటి చుట్టంబయా
నేనే యన్యుఁడ నైతినా పరసతీనిష్కామ రామప్రభో॥ 13

---

# తోట వెంకటనృసింహకవి



ఈ కవి కుల్లూరువాసి. తోఁట నరసింహా ఎఱుకలాంబల పుత్రుఁడు. చిననాగయదాసు మందిరమున నీ రాముఁడు వెలసెనఁట. ఇది శుక్లనామసంవత్సర మార్గశిరబహుళ బుధవారము వ్రాసితి నని కవి గద్యలోఁ జెప్పెను. ఇందు నీతి, పిండోత్పత్తి, సంసారపరిభ్రమణము, మహాభూతోత్పత్తి మొదలగు విషయములఁ జర్చించెను. పాటవలెఁ జాలమంది యీ శతకము చదువుచుందురు. ఇట్టిదే నారాయణశతక మొందున్నది.

రామరామ శతకము

పా. జీవుఁడే యీశ్వరుండు - తలపోయ జీవుఁడే పరమాత్మయు
జీవుఁడను భ్రాంతివిడువ - యఖిలంబు జీవుఁడౌ రామరామ. 13
ఈ ముఱికి గర్భమిపుడు - దాఁటినను నిఁక కర్మముల జేయను
సామి కడతేర్చు మనుచు - సుజ్ఞాని వలె వేడు రామరామ॥ 32



# తోట రాజేంద్రకవి



ఇతఁడు పరమరామశతకము "పరసుధాధామ సద్గురు పరమ రామ" యను మకుటముతో పరమరామశతకమును,

"చిత్కళాసాంద్ర శ్రీతోట శ్రీగజేంద్ర" యను గజేంద్ర శతకమును, కోవెలపాటలు, వేదాంతకీర్తనలు వ్రాసెను. ఇది బ్రహ్మవిద్య, ఇది తత్వవారాశి, ఇది బ్రహ్మసాయుజ్యము, అను శీర్షికలక్రింద విభజించి వేదాంత బోధకముగ వ్రాసెను. ఈతోటవారీ శతకములు చాల వ్రాసి యుందురు.

"ఆప్రదేశంబున * *
కుండిన దేశంబుండు నందు పురుషోత్తపట్నంబు। పొలుపొందు శ్రీతోట
రాజేంద్రుఁ డను వాఁడ నీ కరుణనుండువాఁడ."

ఈ కుండినసీమ గుంటూరుమండల మని కొంద అనుచున్నారు. శైలికొకపద్యము.

హస్తగతమైన బ్రహ్మంబు నాశ్రయింప
లేక భ్రమపడు మనుజు లెందైన మంత్ర
తంత్రములయందుఁ బడుదురు ధరణిమీఁద
చిత్కళాసాంద్ర శ్రీతోట శ్రీగజేంద్ర॥

---

# కొర్లానపురి బుచ్చి రామయ్య

ఇతఁడు నృసింహశతకమును రచించెను. వివరము లేమియుఁ దెలియవు.

## నృసింహ శతకము

వాసిగ ద్రౌపది మానము
భాసురగతి గాచినట్టి బల శ్రీకృష్ణా

దోసిలి యొగ్గియు వేడిన
కాసింతయు మనసు కరిగి కావు నృసింహా॥ 53

---

# కద్రకవి

ఈ కవిపేరు కద్రుఁడో, అంకేంద్రుఁడో తెలియుట లేదు. రెండు ప్రతులలోను సందిగ్ధముగ నున్నది. "దారో జగన్నాయకా" యను మకుటముతో నొక జగన్నాయకశతకము వ్రాసెను. కవి సింహాద్రినందనుఁడు. వివరము లేమియుఁ దెలియవు.

## జగన్నాయక శతకము

మ. ఘనతన్ శ్రీశుభనామకీర్తన లపేక్షంజేయు మీ భృత్యుఁడున్
అనఘుండో మహనీయుఁ డన్న బెగరార్యస్తోత్ర పాత్రుండు స
జ్జనమాన్యుండు నృసింహసేవకుఁడు సౌజన్యుండు సింహాద్రి నం
*దనుడన్ కద్రకవీంద్రనామకుఁడ నే దారో జగన్నాయకా! 110

మ. మత్తేభంబులు హృద్యపద్యమని సంభావింప శార్దూలముల్
మత్తేభంబులు నేటి వృత్తములు ప్రేమన్ జేసితిన్ నూలుమీ
చిత్తంబింక భవత్కటాక్షమున రక్షింపం గృపంజూడుమీ
దత్తాత్రేయమునీ స్వరూప హరి చా ల్దారో జగన్నాయకా.

---

*"నందనుఁ డంకేంద్రకవీంద్ర నామకుఁడనే దారో జగన్నాయకా"
అని పాఠాంతరము

ఈతఁ డేకాలమువాఁడో, యెచ్చటివాఁడో వివరములు తెలియవు. కోటీశ్వర సుబ్బమాంబల పుత్రుఁ డనియు, కంభాలూరి యప్పగురుని శిష్యుఁ డనియు మాత్రము తెలియుచున్నది. శైలికిఁ గొన్ని పద్యముల మాత్రము చూపుచున్నాను. ఇందు హఠయోగానుసారము వేదాంతవివనము తేకనఁబడుచున్నవి.

## భద్రాద్రిరామ శతకము

సీ. శ్రీజానకీరామ సేవకసుత్రామ
రఘుకులాంబుధిసోమ యఘవిరామ
పతితపావననామ భవ్యపరంధామ
కరుణాలలామ సంగ్రామభీమ
వారివాహశ్యామ వరతులసీదామ
యమితవిక్రమ త్రిలోకాభిరామ
విజితభార్గవరామ వినుతమానిస్తోమ
సంపూర్ణకామ సత్సార్వభౌమ

భక్తమందార నగధీర భయవిదూర
దనుజసంహార విమల వేదాంతసార
రమ్యగుణధామ భద్రాద్రిరామ, సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ.



# సందడి నాగదాసు

ఇతఁడు (1) శ్రీలక్ష్మీనారాయణశతకము (2) శ్రీపతి శతకమును వ్రాసెను. ఈ కవి శాలివాహనశకవర్షంబులు "ఋతునభదిగ్గజరూపసంఖ్య"ను వ్రాసినట్లు శతకాంతమునఁ జెప్పుకొనియెను. క్రీ॥ శ॥ 1884 కావలెను. తారణ మార్గ శీర్ష శుద్ధతదియకు ముగించెను. ఇతని చిన్నతనమున భాగవతశ్రవణ మొనరించెను. మంత్రార్థములు వేంకట రామగురుఁడు చెప్పెను. యోగవిద్య వేంకయగురువు చెప్పెను. శ్రీపతి శతకము శా॥శ॥ 1869లో ముగించెను. (శకాబ్దములు నిధిఖద్వీపాబ్జ సంఖ్యోరుబలంబున.)

శైలికిఁ గొన్నిపద్యములు.

## శ్రీపతి శతకము

ఉ. ఎప్పుడు స్వప్రకాశమున నిద్దర నాత్మ వెలుంగుచుండఁగ
నొప్పు కొకప్పుడు న్మననుగూర్చిన నేమగునందుఁ గొంద ఱీ
చొప్పదిగాదు నొక్కపరిఁ జూచిన వస్తువు కండ్లఁగప్పిన
ట్లొప్పనుగాన చిత్తలయ మొక్కపరైన నొసంగు శ్రీపతీ. 25

## శ్రీలక్ష్మీనారాయణ శతకము

సీ. నీదాసవరుల సన్నిధి గల్గినటులైన
వైకుంఠమున కేగు వాంఛయేల

నీదాసవరుల వర్ణింపఁ గల్గినజాలు
నితరదేవతల సన్నుతు లవేల
నీదాసులను పూజ నిత్య జేసిన జాలు
విగ్రహార్చనమీఁద వేడ్క లేల
నీదాసవరుల ప్రమోదింపజేసిన
చాలు యజ్ఞముఁజేయు శీల మేల

గీ. యట్టి నీదాస సాంగత్య మనవరతము
గలుగ వరము ప్రసాదింపవలయు దేవ
నతజనసురక్ష ఘనకరుణాకటాక్ష
లక్ష్మి నారాయణాబ్జాక్ష లలితవక్ష.

---

# రేమెల రామదాసు

ఇతఁడార్వేలనియోగి. అప్పయ వెంకమ్మల నాఁడవ పుత్రుఁడు. ప్రతివాది భయంకర ఆర్యశింగరాచార్యుల శిష్యుఁడు. పిఠాపురము జమీందారుల ప్రాపకమున దగ్గరు దుర్తిలో నుండువాఁడు. శ్రీరావు గంగాధరరామారావు గారినిఁ జేర్కొనెను. వైలికిఁ గొన్నిపద్యములు చూపెదను. కవి క్రీ॥ శ॥ 1870 ప్రాంతములవాఁడు.

## మహిజామనోహర శతకము

ఉ. రంగదరాతిభీమ మణిరాజవిరాజితభూష గోపికా
సంగసమగ్రవేష ననయంబున దాసజనాళిపోష ని

ర్భంగతరంగసంఘములు పాపపయోనిధి శోష కామ దు
స్సంగతిఁ బొందకుండఁగను జేయఁగదే మహిజామనోహరా॥ 34

ఉ. పాపపుబుద్ధిచేత బహుపాపము లార్జనఁ జేయుచున్ దురా
లాపము లాడుచుండె నని రాఘవరామ తలంపకయ్య నీ
దాపునఁ జేరియుంటి నను దాసునిఁగాఁ గృపఁజూచి నేరముల్
కోపములేకఁ బాపఁగదె కూరిమితో మహిజామనోహరా॥ 81

---

# తాతరాజు వేంకటసుబ్బదాసు



ఇతఁడు కోరుమామిడి పురమునందున్న చక్రిపాణిపై విరహిణి శతకము వ్రాసియుండెను. ఇతఁడు చలమయామాత్య పుత్త్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. యజుర్వేదసూత్రి మంత్రితత్త్వజ్ఞానమహిమవేత్త నని చెప్పుకొనెను. (138) క్రీ॥ శ॥ 1870 నాఁటికే శతకము ముద్రితము. కవి యెప్పటి వాఁడో తెలియదు. ఈతని చక్రిపాణిశతకము నుండి యొక పద్యముఁ జూపెదను.

చక్రపాణి శతకము

సీ. శ్రీకృష్ణుఁ డీవేళఁ జెలికాండ్రఁగూడుక
శృంగారవనికి సుశ్రీకరముగఁ
విహరించుటకు జని విడిదికి రాఁడయ్యె
నిదియేమి చోద్యమో యిగురుబోఁడి

పతిని నే నీమిషంబు జతఁబాసి యెఱుఁగను
నే నెటు లీరేయి నిదురఁబోదు
పతిపోయి లేవేళ నతిప్రీతితోఁ జూచి —
యతనిఁ గూడుటకునై యంపెనమ్మ
పేర్మి మగవారు నూతనప్రియులు గారె
వారి నమ్ముట వలదమ్మ వనితలకును
కోరుమామిడి పురవాసుఁ గువలయేశు
చక్రపాణినిఁ దేగదే చంద్రవదన!

---

## కైవరపు నారాయణకవి



ఈతఁ డఖిలవేదాంత ప్రతిపాదకంబగు నమరనారాయణ శతకము వ్రాసెను. ఇది నీతిశాస్త్రప్రతిపాదకమని కవి (4) వ్రాసెను. కవి వివరములుకాని, కాలముకాని తెలియదు. గురుఁడు శ్రీవిష్ణువని శతకాంతపద్యమువలన నూహింప వీలగుచున్నది.

### అమరనారాయణ శతకము

సీ. కాయంబుపై నాస కాంక్షత్తు నిలుపడు
వరకవియగు యోగివరుఁడు - భువిని
అతిథులపై చాల నతిప్రేమతో నుండు
వరకవియగు యోగివరుఁడు భువిని
సకలజీవాత్ముల సమముగా భావించు
వరకవియగు యోగివరుఁడు భువిని

పొట్టబట్టకు బహుగొట్టయిన వగవఁడు
వరకవి యగు యోగివరుఁడు భువిని
ఇన్నిగుణములు గలిగిన కవీశ్వరుండు
భగవదనుభవ మొనరించు భక్తి నెపుడు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక! కైవరపురి విహార!

---

## మండవేముల వెంకయ



ఇతఁడు సచ్చిదానందరామశతకము వ్రాసెను. వేదాంతప్రతిపాదకమగు నీశతక మెప్పుడు వ్రాసినదో తెలియదు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

### సచ్చిదానందరామ శతకము

శ్రీకరుండ సకల సురసేవితుండ
నిర్వికల్పుండ నిత్యుండ నిర్మలుండ
నాశరహితుండ శరణు శ్రీనాయకుండ
నవసుగుణధామ సచ్చిదానందరామ.

బద్ధులేలయ్య ననుగన్న ముద్దులయ్య
రద్దుజేయక వడినిందు రాఁగదయ్య
కలుషజాలంబులను ద్రుంచి కావవయ్య
నవసుగుణధామ సచ్చిదానందరామ.

---

## శౌనక కృష్ణయార్యుఁడు



ఈతఁడు కోటిఫలిఁ (కోటిపల్లి, గోదావరి) యందు వెలసిన శ్రీరాజరాజేశ్వరి కంకితముగ నొక శతకము వ్రాసెను. కవి రామప్ప భూదేవుల పుత్రుఁడు. ఇతర వివరములు తెలియవు. శైలికిఁ గొన్ని పద్యములు.

### శ్రీరాజరాజేశ్వరీ శతకము

శా. కాలోన్మత్త వినీలకాసరగళ గ్రైవేయ ఘంటోద్భవ
ద్వేలాధ్వానము నెన్నఁడు న్వినఁడు త్వత్కీర్తిస్ఫురన్మల్లికా
జాలానర్గళ దివ్యసౌరభఝరీ చ ... న్మహద్వీచికా
మాలంగ్రోలు వివేకి కోటిఫలి శ్రీమద్రాజరాజేశ్వరీ.

శా. పాపాధైర్యవినాశినీ కృపతుసద్వ్యామాంగ సంకాశినీ
తాపారణ్య విభేదినీ సుఖదినీ దైన్యావనామోదినీ
కాపట్యం బెడఁజేయుచు న్నము సదా కాపాడు నీ వెమ్మెయి
న్మాపాలొగదవమ్మ కోటిఫలి శ్రీమద్రాజరాజేశ్వరీ. 38



## జయంతి కామేశ్వరకవి



ఈతఁడు జానకీవరశతకము వ్రాసెను. (మద్రాసు) హైకోర్టులో వకీలుగా నుండెను. రామభక్తశిరోమణి యని పేరొం

దేను. జానకీపతిశతకమున ముకుందమాల పోలికలున్నవి. శైలి మృదుమధురము. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

### జానకీవర శతకము

ఉ. కోరను వాజులన్, గరులఁ గోరను, హాటక సంచయంబులన్
గోరను, నాకభోగములఁ గోరను, దక్కిన కోర్కెలేమియున్
గోరను, నీ పదాంబుజముఁ గోరితి, దాఁచక చూపునాకు, నో
సారసనేత్ర, దానఁ గడు సంతస మొందెద, జానకీవరా.

ఉ. స్నానము లెన్ని చేసినను, సంధ్యల గింధ్యల నెంతవార్చినన్
గాననవాసులై యెపుడు గందములే భుజియించుచుండినన్
మానసమందుఁ నీస్మరణ[illegible]నక చేయని మానవాధముల్
గాఁనగలేరు ముక్తి[illegible]మ్ముకైనను జానకీవరా. 15

---

## ఆదూరి కృష్ణయ్య

ఈ కవి నారాయణశతకము వ్రాసెను. ఇతఁడాత్రేయ గోత్రుఁడు. దీనినే గుజలీవారు పెద్దనారాయణశతక మందురు. మత్తకోకిలాదివృత్తములవంటి పాటలఛందములో వ్రాసెను. వేదాంతప్రతిపాదకము. కవి "ఆదూరి యెంబెరుమాళ్లు" పుత్రుఁడు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపుచున్నాను.

నారాయణ శతకము

జననంబు లొటయుఁ జేసియున్ఁ జనరక్షకర్తవు నీవుఁ దా
ధనమంచు కొందఱు రక్షకై తగనిన్ను పూజలు చేసియున్
ననుపొంద నెమ్మది నుండినన్ దతిభక్తి మొ్రొక్కెడు దిప్పుడున్
ననువంటిదీనుని బ్రోవవే! నారాయణా! నారాయణా॥

కవులెల్ల సమ్మతిగాఁగ నే ఘనమార్గలక్షణయుక్తమై
వివరింపఁజాలని నిన్ను దా వినుతింపఁజేసిన దేవరా
భువి నిన్ను సత్కవు లాదిగా బుధు లెల్ల మెచ్చఁగ సేయనో
నవమోహనా భవభంజనా నారాయణా నారాయణా॥ 38

---

# పోతుల వేంకటరామకవి

ఈ కవి పెన్నపట్టణ వాసి. శ్రీకృష్ణనాటకము, ఉషా నాటకము, మల్లికార్జుననాటకము, శ్రీవేంకటేశ్వరకృతులు మొదలగు గ్రంథముల వ్రాసెను. ఇతఁ డాదిశాఖవాఁడు. కౌండిన్య గోత్రుఁడు, రామమంత్రి పౌత్రుఁడు, వేంకటాచల ప్రధాని పుత్రుఁడు, నని యొక పద్యమున వ్రాసెను. ఈతని కుక్కుటేశ్వర శతకమునుండి కొన్నిపద్యములఁ జూపెదను.

కుక్కుటేశ్వర శతకము

నేరక కొన్నియున్ మఱియు నేరిచి యుండియుఁ గొన్ని పాపము
ల్గూరిమిఁ జేసితిన్ సుజనకోటిని దూరితి మోసపుచ్చితిన్

డెను. జానకీపతిశతకమున ముకుందమాల పోలికలున్నవి. శైలి మృదుమధురము. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

### జానకీవర శతకము

ఉ. కోరను వాజులన్, గరులఁ గోరను, హాటక సంచయంబులన్
గోరను, నాకభోగములఁ గోరను, దక్కిన కోర్కు లేమియున్
గోరను, నీ పదాంబుజముఁ గోరితి, దాఁచక చూపు నాకు, నో
సారసనేత్ర, దానఁ గడు సంతస మొందెద, జానకీవరా.

ఉ. స్నానము లెన్ని చేసినను, సంధ్యల గింధ్యల నెంతవార్చినన్
గాననవాసులై యెపుడు గందములే భుజియించుచుండినన్
మానసమందుఁ నీస్మరణ[illegible]నక చేయని మానవాధముల్
గాఁనగలేరు ముక్తి[illegible]ఖ్యముకైనను జానకీవరా. 15

---

# ఆదూరి కృష్ణయ్య

ఈ కవి నారాయణశతకము వ్రాసెను. ఇతఁడాత్రేయ గోత్రుఁడు. దీనినే గుజలీవారు పెద్దనారాయణశతక మందురు. మత్తకోకిలాదివృత్తములవంటి పాటలఛందములో వ్రాసెను. వేదాంతప్రతిపాదకము. కవి "ఆదూరి వెంబెరు మాళ్లు" పుత్రుఁడు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపుచున్నాను.

### నారాయణ శతకము

జననంబు లొటయుఁ జేసియున్ జనరక్షకర్తవు నీవుఁ దా
ధనమంపు కొందఱు రక్షకై తగనిన్ను పూజలు చేసియున్
ననుఁబొంద నెమ్మది నుండినన్ దతిభక్తి మ్రొక్కెడు దిప్పుడున్
ననువంటిదీనుని బ్రోవవే! నారాయణా! నారాయణా॥

కవులెల్ల సమ్మతిగాఁగ నే ఘనమార్గలక్షణయుక్తమై
వివరింపఁజాలని నిన్ను దా వినుతింపఁజేసిన దేవరా
భువి నిన్ను సత్కవు లాదిగా బుధు లెల్ల మెచ్చఁగ సేయరో
నవమోహనా భవభంజనా నారాయణా నారాయణా॥ 38

---

## పోతుల వేంకటరామకవి

ఈ కవి పెన్నపట్టణ వాసి. శ్రీకృష్ణనాటకము, ఉషానాటకము, మల్లికార్జుననాటకము, శ్రీవేంకటేశ్వరకృతులు మొదలగు గ్రంథముల వ్రాసెను. ఇతఁ డాదిశాఖవాఁడు. కౌండిన్య గోత్రుఁడు, రామమంత్రి పౌత్రుఁడు, వేంకటాచల ప్రధాని పుత్రుఁడు, నని యొక పద్యమున వ్రాసెను. ఈతని కుక్కుటేశ్వర శతకమునుండి కొన్నిపద్యములఁ జూపెదను.

### కుక్కుటేశ్వర శతకము

నేరక గొన్నియున్ మఱియు నేరిచి యుండియుఁ గొన్ని పాపము
ల్గూరిమిఁ జేసితిన్ సుజనకోటిని దూరితి మోసపుచ్చితిన్

నేరము లెన్నొ చేసి తుది నీ పదభక్తుఁడనైతి నిప్పు డే
తీరున గాలపాశమున తీవ్రతబాపెదొ కుక్కుటేశ్వరా॥ 10

బందుగు లన్నదమ్ములును భార్యయు బుత్రులు మిత్రులు న్గురు
ల్బొందుగఁ దల్లిదండ్రులును బొల్పు దలిర్పఁగ భృత్యవర్గమున్
ఱొందఱు నున్నగాని తను వెవ్వరు నాపఁగలేరు ప్రాణముల్
బొందినిఁ బాసిపోవు తరి భూరికృపాకర కుక్కుటేశ్వరా॥ 30

---

# నిమిషకవి వేంకటేశకవి

చెన్నమల్లయ గోత్రోద్భవుండును తాతయ వెంకమల పౌత్రుండును, వేంకటరావు చెల్లయాంబల పుత్రుఁడును, నగు జగన్నాథరావున కంకితము. ఈ జగన్నాథరావు యోగి యయ్యెను. ఈతని కంకితముగఁ బైకవి యీ జగన్నాథయోగిశతకము వేదాంతప్రతిపాదకముగ రచియించెను. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతమువాఁడై యుండవచ్చును. శైలి కొక పద్యము.

## జగన్నాథయోగి శతకము

సీ. పటికంపు జాయము వనద నినాదంబు
మహి తాదిశక్తియు మత్స్యముద్ర
దనరు విశుద్ధాఖ్య తామరసం బొగి
తావుమూలల తావునందు.

బదియారుదళములఁ బఱగుచు స్వరములు
బీజాక్షరంబులై తేజరిల్లు
నాకాశతత్త్వమై యమరి మరాళము
లోకఁ జేయి యాడంగఁ బ్రకటితముగ
నందు నీశ్వరుఁ డధిదేవుఁడై చెలంగు
గురుని సేవించి సాత్త్వికగుణముఁ గాంచు
నాతఁడే ధాత్రి యోగి యానందుఁడు బుధులు
జ్ఞానభోగి! గోడే జగన్నాథయోగి!॥ 42

---

# కొమ్మరాజు వేంకటశివుఁడు

ఈతని వ్యవహారనామము వేంకటప్పయ్య. రేపాల రాజలింగశతక మీతని కృతి. (వెనుకకు 582 పుట చూడుడు) ఉద్భటారాధ్యశేఖరుఁడగు వీరభద్రగురు శిష్యుఁడు. ఈకవి మునగాలప్రభ్వియగు శ్రీరాజా నాయని లచ్చమ్మారావు గారి మంత్రి. (క్రీ॥శ॥ 1881) శివతత్త్వసుధానిధి యను కావ్యమున కీకవి ప్రోత్సాహకర్త. అది శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారి కవులచరిత్ర కొఱ కీయఁగాఁ బారవేసిరఁట! ఈ కవి మఱియొకశతకమును, జ్యోతిష గ్రంథమును గూడ వ్రాసెనఁట. కృష్ణామండలము నందిగామతాలూకా పెనిగంచిప్రోలు వాస్తవ్యుఁడు. భరద్వాజస గోత్రుఁడు. శైవుఁ

డైన యాజు వేలనియోగి. నాల్గుతరముల క్రింద శైవులైరి. వైష్ణవులతో వీరికి సంబంధము లున్నవి.

## రేపాలరాజలింగ శతకము

సీ. శంకర పరమేశ శాశ్వత సర్వేశ
కాలకాలాంతక గరళకంఠ
చంద్రశేఖర భీమ శంకరిహృదయేశ
సర్వమహాదేవ శరనిభాంగ
ఫాలనేత్ర గిరీశ పంచాక్షరీరూప
భవహర పురహర భక్తవరద
గంగాధర సురేశ కంజాక్షసన్నుత
భుజగభూషణ దీనపోష సోమ
యనుచు పఠియించువారికి ఘనతక్షీర
మోక్షసత్రంబు లేసిన దీక్ష నీదె
భావభవభంగ గౌరి హృత్పద్మభృంగ
రాజితశుభాంగ రేపాలరాజలింగ॥ 8.

పోతన్న భాగవతమునందుఁ బాల్కురికిఁ డై వాస్తవం బులు కొన్ని వదలినట్లు కవి వ్రాసెను. దీనినిఁబట్టి వీరభద్ర విజయరచనముపై నప్పటి వాడుకలును గ్రహింపవచ్చును.

## విజయరాఘవాచారి



ఇతఁడు వైఖానసుఁడు. కృష్ణశతకమును వ్రాసెను. రఘునాథ భట్టరాచార్యుని నప్తృఁడు, వనమాలి

పౌత్రుఁడు. రామాచారి పుత్రుఁడు. అరుగొళపురీశుఁడగు కృష్ణుని నుతించెను.

## కృష్ణ శతకము

సీ. శ్రీవత్సవక్షు లక్ష్మీవర కరుణా
కటాక్షవీక్షణ సురాధ్యక్షవినుత
ఇందిరారమణ గోవింద ముకుంద స
మ్మోదనందన నందనందదేవ
కరిరాజవరద సుందరరూపగిరిధర
సరసిజనేత్రి సంస్తవనపాత్రి
అండజవాహ కోదండధరాఖండ
మండలాధీశ ప్రచండతేజ
యనుచు నీ నామకీర్తన లనుదినంబు
భజనసేయుచునుండు నాభావమందు
అరుగొళపురీశ శ్రీకృష్ణ! యఘవినాశ
శ్రీశ సర్వేశ వినుత! విశ్వేశయీశ. 1

---

# భృంగిరిట బసవయలింగకవి



ఇతఁడు వీరభద్రశతకము వ్రాసెను. ఇతఁడు విశ్వకర్మకులజుఁడు. సుంకరణ వెంకయ యీతని గురువు. రుద్రకవీశ్వరు లనిఁ గావ్యాదినిఁ దలఁచెను. విశ్వబ్రాహ్మణశబ్దము వాడినందున నీతఁ డాధునికుఁడు. శ్రీరావు గంగాధర

రామారాయనింగారిని (పిఠాపురప్రభువుల) 16 వ పద్యమునఁ బేర్కొనెను. శ్రీరావు రామారాయణింగారినిఁ బేర్కొనెను. క్రీ॥ శ॥ 1870 ప్రాంతములవాఁడనవచ్చును. పట్టిసపుగ్రామము నందలి వీరభద్రున కంకిత మొనర్చెను. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

స్తవప్రకరణము, యుద్ధప్రకరణము, ప్రార్థనప్రకరణము నని శతకము విభజించి వ్రాసెను.

## వీరభద్ర శతకము

క. ఇందిరఁ గొలిచెద మది నానందంబుగఁ గావ్యసిద్ధికోఁ బకై నా హృ
న్మందిరమునందు మునిజన వందిత శ్రీవీరభద్ర పటుతరరౌద్రా. 7

క. రాజశిఖామణి యగు నా రాజా శ్రీరావురామరాయనృపాలున్
రాజితసత్కృప నేలుము భ్రాజిత శ్రీవీరభద్ర పటుతరరౌద్రా. 17

---

# మీసరగండ మునిస్వామి

ఇతఁడు విశ్వకర్మ కులోద్భవుఁడు. ఈతని నివాస స్థానము తిరుపతి కాగ్నేయమూల పదిమైళ్లదూరమున నున్న వడమాలపేట యను గ్రామ మని శతకాదిని ముద్రాపకులు వ్రాసియున్నారు. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁ డైయుండును. శ్రీరఘురామశతకమును రచియించెను. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

రఘురామ శతకము

క. నతు లొనరఁ జేసి వరసం
స్కృతకవులకు నాంధ్రకావ్య కృతినిపుణుల స
న్నుతిజేసి నిను భజించెదరా
జితముగ శేషాద్రిధామ శ్రీరఘురామా! 6

క. సురలయితిమి దొరలయితిమి
ధరణీసురలయితి మనుచు దర్పితమతులై
హరి నిన్మరచిన సుఖమా
చిరముగ శేషాద్రిధామ శ్రీరఘురామా! 32

---

# ముదిగొండ శంకరారాధ్యులు



ఈ కవి యాధునికుఁడు. క్రీ॥ శ॥ 1919 లో మరణించెను. హనుమకొండ మట్టెవాడ నివాసి. 1960000 గణార్చన మొనర్చి యన్నదానము చేసెను. ఆరాధ్యులకు నాయకుఁడు. ఈతఁడు భావలింగశతకము, చాటుపద్యములు, మానసపూజాద్విపద, శివభజనకీర్తనలు, మల్లికార్జునలింగశతకము; తటస్థగ్రామపంచరత్నములు, మొదలగునవి వ్రాసెను. హెచ్చుగా గీతములు వ్రాసెను.

భావలింగ శతకము

ఆ. వె. మ్రొక్కు_లిడుదు సర్వమునకు సర్వాత్మకు
శంకరునికి నతని కింకరులకు

నీదు పాదములకు నిత్యఁబు మ్రొక్కెద
పాపభయవిభంగ భావలింగ! 1

గీ. గోచికన్న లేదు గొప్ప దరిద్రంబు
చావుకన్న లేదు జరుగఁగలది
రెండు కెంతచింత లెట్టివారలకును
పాపభయవిభంగ భావలింగ! 13

## మల్లికార్జునలింగ శతకము

క. శ్రీరామచంద్రపురమును
బీరము గూడెంబు పాదపీఠతదోఁపన్
జేరక్కన శ్రీగిరిని వి
హారంబుగ వెలయు మల్లికార్జునలింగా 61

క. ధనవాంఛ నూరనేర్వఁగ దనుఁ దినుటకు నక్క లేడ్చు దావములోనన్
గన నిది చోద్యమ యంతట ననుకొను సంగతికి మల్లికార్జునలింగా! 92

శిరపురపు జోగనార్యుని ప్రేరణచే వేదవిజ్ఞానము, శివజ్ఞానము నొంది విరాగియయ్యెను. ఉద్భటారాధ్య వంశ్యుఁడగు భోగలింగార్యుని కనిష్ఠపుత్రుఁడు.

---

# నూతులపాటి సుబ్బకవి



ఈతఁడు భద్రాద్రిరామచంద్రశతకమును దేవిశెట్ల గోత్రజుఁడగు దోసపాటి సర్వయ పౌత్రుఁడును, వేంకటాచలము పుత్రుఁడును, అగు కోటయ్య ప్రోత్సాహమున వ్రాసెను. ఆధునికుఁడు.

## భద్రాద్రిరామ శతకము

సీ. చంద్రమండలముతో సరివచ్చు నీఫాలభాగంబున ద్యుతు ల్పరిఢవింప
చిత్రతమా శతపత్రంబులను గేరు సొగసైన నీ నేత్రయుగళ మరయ
శ్రీకారములసౌరు చీకాకుఁగావించు విలసితమైన నీ వీను లహహ
చెక్కుటద్దంబుల చక్కన హసియించు పొలలున నీ కక్షముల బెడంగు
ఇట్టి సంపూర్ణసుందరం బినుమడింప
నరసి మానులు మోహించు టబ్బురంబె
యమలగుణసాంద్ర! సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్ర! భద్రాద్రిరామచంద్ర! 33

సీ. ఇక్ష్వాకురాజవంశ క్షీరవార్ధికి సాంద్ర శరత్కాల చంద్రుఁ డనఁగ
సరవిని కోసలక్ష్మానాథు సుతగర్వ రమణీయ పేటికి రత్న మనఁగ
ప్రముదాత్ముఁడా దశరథుమహారాజు నేత్రంబులకును పెన్నిధాన మనఁగ
సంతతాశ్రితజన సమితిపాలిటి కెన్న పాలుపొంద మందార భూజ మనఁగ
జనన మొందితివో గదా సకల సురలు
సంస్తుతు లొనర్ప లోకప్రశస్తముగను
యమలగుణసాంద్ర! సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్ర! భద్రాద్రిరామచంద్ర! 35

---

# చెలికాని చెల్లయ్యమ్మ



ఈమె పద్మనాయకవంశజుఁడగు చెలికాని వెంకయా ర్యుని ధర్మపత్ని. అనవరత భగవద్భాగవత భక్తియుక్త రాలు. వీరిది కుప్పనూళ్ళగోత్రము, రావు భావయ్య చిన్న

మ్మగార్ల పుత్రిక. "పురాతన వేళంగిపురనివాసి నిజానీంతన కరపపురవాసి". తన బంధుగులకు, సర్వలోకమునకు శ్రేయము కలుగుట కీ రెండుగ్రంథములను వ్రాసెను. (1) పార్థసారథి పద్యములు (2) జానకీపద్యములు నీమె కృతులు. నూఱేసి పద్యములు కొన్ని కీర్తనలును గూడ వ్రాసెను. మంచి ధార కలదు. యతిప్రాసలు పాటింపలేదు. వానియంతట నవి కొన్ని పడినవి. భాషలోఁ జాల వాడుక రూపము లున్నవి. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను. క్రీ॥ శ॥ 1900 ప్రాంతమున నీమె యివి వ్రాసెను.

## (1) పార్థసారథి పద్యములు

సీ. కూర్మావతారమై కుదురు నుండగ నెవడు
జలధి మర్దించిన జట్టి యెవడు
అమృతభాండం బెల్ల సురల కిచ్చిన దెవడు
అసురుల హతము గావించె నెవడు
కాలకూటవిషంబు ఘనముచేసె నెవండు
శివునికంఠంబున నుంచె నెవడు
శృంగారమైన శ్రీ మోహినీరూపమున
అసురులను మోహింపఁజేసె నెవడు

గీ. ఇన్ని మాయలతోడ నీభువిని నేలు
అనుదినంబును నానోటనుండు నెవడు
సాధురక్షణ సత్వాధిఘనుడు యెవడొ
పార్థసారథి నీపాద శరణు శరణు.

## (2) జానకీ పద్యములు

సీ. ఇంపుతో నిజరూపు జూపి రక్షింతువు
నిను నమ్మియుంటిని నీరజాక్షి
గానలోలు నితోడ కరుణజూపు మటంచు
నా నుడువుగా నీవు నెరపవమ్మ
తిరుమంత్రమును చెప్పి తెరవు చూపెడు తల్లి
జ్ఞానంబు బోధించు లోకమాత
పాపపంకిల మందు బడియుంటి నని దెల్ప
కల్లసంసారమున నుంటి నను
గీ. ఏమి సేయుదునమ్మ యోజానికమ్మ
నన్ను రక్షింపకున్న నాకెద్ది తెరవు
నిన్ను వేడుచునున్న నన్నేలుకొమ్మ
జన్మమిఁకనొల్ల నన్నేలు జానికమ్మ.

---

# దేవాదుల పెద్దన్న

ఇతఁడు శివభక్తుఁడు. విశ్వకర్మ కులోద్భవుఁడు. ఉత్సాహావృత్తములలో "ఉమామహేశ్వర శతకము" వ్రాసెను. వివరములు తెలియవు. శైలికిఁ గొన్నిపద్యములు

### ఉమామహేశ్వర శతకము.

#### ఉత్సాహావృత్తము

శరీర మెన్న తేరు బుద్ధి సార్థిఁ నందు బూన్చినన్
తురంగ మింద్రియంబు లందు దుష్టవిద్య చక్రముల్

తెలుంగు దప్పకుండ నస్మదీయ చిత్తసీతినిన్
స్థిరంబుగాను నిల్పిగావు శ్రీయుమామహేశ్వరా ॥

ధరిత్రియందుఁ బుట్టి నిన్నుఁ దల్చనట్టివాఁడు వా
నరుండు యోగ్యజన్మ లెల్ల నాగభూష నిన్ను సం
స్మరింతు సంతతంబు పూజసల్పి ముక్తులైరి న
న్భరించి ప్రేమ జూపు గావుమా యుమామహేశ్వరా॥ 2

---

# సన్నిధిరాజు జగ్గకవి

ఈ కవి రాజలింగశతకము వ్రాసెను. పిఠాపురము ప్రాంతము నందలి యుప్పాడ నివాసి. క్రీ.శ. 1810 ప్రాంతములవాఁడు. ఈతఁడు సంగీతసాహిత్యవేదాంతముల నెఱిఁగినవాఁడట! ఈతఁడే జీవరత్నములు కలకురవంజి యను యక్షగానము వ్రాసెను. ఈ శతకము విరహిణీశతకముల జాతిలోనిది. పార్వతి విరహము వర్ణితము. వాకతిప్ప రాజశేఖరున కంకితము. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. కవి యజుశ్శాఖ, కాశ్యపగోత్రుఁడు. అమ్మయ పేరమాంబల పుత్రుఁడు.

## శ్రీ రాజలింగ శతకము

సీ. బొమ్మరా బంగారు బొమ్మరా ముద్దుల
గుమ్మరా మనవి నాకొమ్మటంచు

కాంతరా పుణ్యనితాంతరా సద్గుణ
శాంతరా మహిమ లనంతె మనుచు
కల్కిరా కర్పురంపుమొల్కరా మరునిచే
చిల్కరా నీ దయ జిల్కు మనుచు
వెలఁదిరా సద్బుద్ధిగలదిరా యిదినీకు
కొలఁదిరా కోపము వలదటంచు
నతివగో వాని బ్రతిమాలి హితవుపరచి
పతిని మరపించి నన్నొక గతినిఁజేర్ప
వనిత! భవసాగరపుతెప్ప వాకతిప్ప
రాజలింగునిఁ దేగదె రాజవదన ||

5. నీ యిల్లు గుడిగాను నీ మేను శిలగాను
పరగ నీ తల శశిఁబాము గరువ
నీ గళంబున విషాన్వితఘోరమై యుండ
నీ పుత్రు గర్భంబు నిల్వ బగుల
నీ వాహనము ఘాసు నిత్యంబు మేయను
నీదు సొమ్ములు శేష నియతిగాఁగ
నీ హారసమితియు నెలమిపుర్రెయుగాఁగ
నీ జటపై కొమ్మ నీరు గాఁగ
నీదు ఫాలాక్షమున నగ్ని నిండుకొనను
యేల సతినేలుకోవని తూలనాడి
వనిత భవసాగరపుతెప్ప వాకతిప్ప
రాజలింగునిఁ దేగదే రాజవదన ||

# తూములూరి వేంకటరంగయ్య



## శ్రీ మీనాక్షీకల్యాణ శతకము.

సీ. నాసికాగ్రమునంద నవమౌక్తికంబు ము
క్కరవీను లపరంజి కమ్మలమర
కరకంకణావళుల్ కంఠహారములు మ
ధ్యమున నొడ్డ్యాణంబు దనరఁగాను
అందియల్ మ్రోయంగ నతిరూపవతులైన
శ్రీభారతులజంట చేరివచ్చి
శోభనంబులు పాడుచును నవ్వు మోముపై
ముంగురుల్ గునిసి యాడంగ నిలిచి

యెదుట ముత్యాలహారతుల్ యెత్తునపుడు
శంకరుండైనను సుందరేశ్వరునివద్ద
వేంకటేశుని చెల్లెలై వెలయు గౌరి
కరుణగలయమ్మ మీనమ్మ వరములిమ్మ ॥



# అద్దంకి వేంకటాచార్యుఁడు



ఈ కవి వ్రాసినవి నీరజాక్షశతకము, విరహిణీశతకము, గుంటూరు మండలము నందలి చీరాలదేవునిపైఁ జెప్పి నట్లున్నది.

## నీరజాక్ష శతకము

కమలాకళత్రుండు కాంచననేత్రుండు
నవనీతచోరుండు నగధరుండు
వేణువినోదుండు వేదాంతవేద్యుండు
పద్మాయతాక్షుండు పావనుండు
నీరదగాత్రుండు నిగమాంతగేహుండు
శరదిందు వక్త్రుఁడు శాశ్వతుండు
వనధిగంభీరుండు వసుదేవపుత్రుండు
మంజులభాషుండు మాధవుండు
మునిజనస్తోత్ర పాత్రుండు మురహరుండు
భక్తరక్షణదక్షుండు భవ్యయశుఁడు
నీరజాక్షుఁడు చీరేలనిలయుఁడైన
చిన్నికృష్ణుని తేరమ్మ చేడెలార! 80

పులుగుతత్తడి నెక్కి భువనముల్ రక్షించుఁ
పురుషరత్నమె సుమ్మి పువ్వుబోఁడి
పాలమున్నీట లోపల పవ్వళించియు
లోకముల్ కాపాడు లోలనేత్ర
పన్నగరాజుపై పవళించి సుజనుల
పాలిటిదైవమే పద్మగంధి
కాయకూరలు దిని కానలఁ దిరిగెడి
మునుల కాధారమే ముద్దుగుమ్మ
నమ్మియున్నట్టి వారల నెమ్మనమున
పాయకుండియు కడతేర్చు భారకుండు
నీరజాక్షుఁడు చీరేల నిలయుఁడైన
చిన్నికృష్ణుని తేరమ్మ చేడెలార! 81

# మేడుకొండూరి కృష్ణదాసు



ఇతఁడు శ్రీహరిశతకమును రచియించెను. కవి యెప్పటివాఁడో తెలియదు.

## శ్రీహరి శతకము

కోరితినయ్య నిన్ను మదికోరిక లుప్పతిలంగఁ జేయుమీ
వారిజగర్భరుద్ర సురవందిత పాదసరోజ నన్ను మీ
కూరిమి పుత్రుఁగాఁ దలఁచి కోపము మానియు గొప్పఁ జేయుమీ
భూరిదయాసముద్ర యిదె వేడెద మీ శరణంబు శ్రీహరీ. 58



# వెచ్చ కస్తూరి రంగకవి *



ఇతఁడు లక్షణచూడామణి యను రంగరాట్ఛందము సాంబనిఘంటువు, కృష్ణార్జునసంవాద మను నైదాశ్వాసముల కావ్యమును రచియించెను. శ్రీవత్సగోత్రుఁడు. వేంకటకృష్ణార్యపుత్రుఁడు. ఆర్వేల కమ్మనియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి కృష్ణార్యుఁడు. తల్లి కామాక్షమ్మ. ఇతఁడు తన లక్షణ

* ఈ కవి మొదలు (1) సత్యవోలు భగవత్కవి (2) రాచూరి లక్ష్మీరామదాసు (3) వెలిచేటి వేంకటరామప్రధానియు నీ నల్వురును మూఁడవ భాగమునకు బోవలసినవారు. పొరబాటున నిక్కడ వేయవలసివచ్చినది.

చూడామణి, ఫ్రెంచిగవర్నరగు డూప్లేదొర దుబాషీ యగు "ఆనందరంగపిళ్లై"కుఁ గృతియిచ్చెను. ప్రభుత్వమువారు ప్రకటించిన రంగపిళ్ళై దినచర్య (Dairy) లో నీకవికిని భార్యకును గల తగవు పరిష్కరించిన శ్లోకటి రెండు చోట్ల నున్నట్లున్నది. క్రీ॥ శ॥ 1750 కిఁ బూర్వుఁడై యుండవలెను. పుదుచ్చేరిలో నుండియుండవలెను. ఈతని సాంబనిఘంటువు 108 పద్యములు గల శతకరూపమున నున్నది. శైలి కొరకు పద్యముఁ జూపెదను.

సాంబ నిఘంటువు

"సీ. సాంధ్రినామనిఘంటువనెడి కృతిని, .... .... ....

గీ. గవులదయచేత నీకటాక్షంబువలన నీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు
దనుజసమవర్తి భక్తహృదబ్జవర్తి సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి ॥

సీ. గురు వన నొజ్జకు బరువునకుఁ జెలంగు
నారి నా యల్లెకు నాతి కెనయు
నూరనఁ బల్లెకు నూరువునకుఁ బొల్చుఁ
దమి యన రాత్రికిఁ దమికి నమరుఁ
గరి యన దంతికిఁ గప్పునకుఁ దనర్చుఁ
జింత నాఁ దింత్రిణి చింత యొనరు
మూల యనఁగఁ గోణమునకు దిక్కుకుఁ జెల్లు
మను వన బ్రతుకును మనువును నగుఁ

తే॥ గూట మన శిఖరమునకు గుంపున కగు
జాతియన నన్వయమునకు జాతి కెనయుఁ

బురి యనఁగ నెమ్మి తోఁకకుఁ బురికిఁ దనరు
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి ॥

నానార్థవర్గ 95

నిఘంటువు 95 పద్యములలో ముగించెను.

---

# సత్యవోలు భగవత్కవి

"ఈతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; జనార్దనామాత్య పుత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు. ఈతఁడు గోదావరిమండలమునం దించుమించుగా నూటయేఁబది సంవత్సరములక్రింద నుండువాఁడు. ఈతఁ డేనుగు లక్ష్మణకవి మొదలగువారితో సమకాలికుఁ డని చెప్పుదురు." అని కవుల చరిత్ర మనుచున్నది. ఇతఁడు రుక్మిణీపరిణయ మను ప్రబంధమును, నూఱు శతకములను వ్రాసెను.

క. ధీరత శతశతకంబులుఁ
దారావళులుఁ దశావతారావళులున్
జారూదాహరణంబులు
శ్రీరాజిత దండకములుఁ జెప్పినవాఁడన్॥

ఈతని రుక్మిణీపరిణయము నందలి దశావతారపద్యములు తెలుఁగుదేశ మంతటను వ్యాపించినవి. పలువురు భోజనసమయములయందుఁ జదువుచుందురు. ఈతని శతకము

లేమియు నాకుఁ జిక్కలేదు. దశావతార పద్యముల నొండు రెం డుదాహరించెదను.

## కూర్మావతారము

సీ. అమృతవారాశిఘటము మందరముఁ గవ్వ
మ్ము ఫణి రజ్జువుఁ జేసి పూర్వదేవ
తలు దేవతలుఁ బట్టి తరువఁగా ఘుమఘుమ
ధ్వనులు బ్రహ్మాండము తల్లడపడ
నపుడు "పరోపకారార్థమిదంశరీ
ర" మని కూర్మావతారమునఁ గ్రుంగి
న గిరి క్రింద నిలిచి "నాన్నోదకసమం
దాన"మని సురల కమృత మిచ్చి

గీ. నిరుపమానలక్ష్మీరమణీమణీ మ
ణులుగొలువ విలసిల్లితో నలఘు దాన
శీల! వైకుంఠనాథ! లక్ష్మీసనాథ!
రక్షణపరాయణుండ! నారాయణుండ!

## శ్రీ రామావతారము

సీ. సూర్యవంశము పరిశుద్ధమని దశరథుఁ
డు నతులమనోరథుఁ డని భరత
లక్ష్మణ శత్రుఘ్నులకు సన్నవై పుట్టి
సౌందర్యచాతుర్య సౌకుమార్య
శౌర్యధైర్యౌదార్యవీర్య సత్యౌచిత్య
గాంభీర్య కర్తుమకర్తుమన్య
థాకర్తు మతిసమర్థత్వ సత్యాఘట
ఘటనాపటీయస్త్వ ఘనయశస్త్వ

గీ. సౌఖ్య సఖ్య దయాముఖ్యశాలివైన
రాముని సరాముని దయాభిరాము నిను భ
జింతు వైకుంఠనాథ! లక్ష్మీసనాథ
రక్షణపరాయణుండ! నారాయణుండ!

ఈ పై పద్యములఁ జూచి కాశీచైనుల లక్ష్మణకవి యొక దశావతారస్తవము వ్రాసియుండెను. అందాతఁ డిట్లు నుడివెను.

సీ. * * మునుదిట్టకవి ప్రకాశునిచే విరచితమై
యున్న పద్యంబులకన్న వన్నె
కలిగియున్నవి యివి కాశిచయనుల
లక్ష్మణకవియ నాదుకలను జెప్పె"

నట్లు పై లక్ష్మణకవి వ్రాసెను. ఈ పద్యములు దిట్టకవి ప్రకాశునివి కాకపోవుటయేగాక, వెట్టిభగవంతుడీ లక్ష్మణకవితో నాతని పద్యములే బాగుగ నున్న వని రెండసత్యములు స్వప్నములోఁ బల్కుట వింతగఁ దోఁచకమానదు. ఈ లక్ష్మణకవి పద్యము కూడఁ జూపెదను.

కూర్మావతారము

సీ. క్షీరాబ్ధిఁ గలశగాఁ జేసి మందరగిరి
కవ్వంబుగా నందుఁ గ్రందుకొల్పి
వాసుకిఁ ద్రాఁడుగా వలనొప్పఁగావించి
దేవదానవులు మథింప దద్భ
రంబునకోడి యాయంబుధిలోఁ ధరిగి
రిసహితంబుగాఁ గ్రుంగఁజూచి

శంఖంబు ముఖముగాఁ జక్రంబు గప్పర
మగను శార్ఙ్గ పాదయుగముగాఁ గ
గీ. దయు ఖడ్గ మవలిపాదద్వయముగఁ బూని
కూర్మంబవై క్రుంగు గోత్ర మెత్తి
యమృతపాత్రంబు చేఁబూని యతివవై య
సురలకొసగఁక శోధించి సురల కిడితి
కృష్ణ వైకుంఠనాథ, లక్ష్మీసనాథ
రక్షణపరాయణుండ! నారాయణుండ!

---

## రాచూరి లక్ష్మీరామదాసు

ఈతఁడు కరణమో; మఱియొక యుద్యోగియో యై యుండనలెను. ఈస్టిండియాకంపెనీదినములలో జరిగిన కొన్ని పెద్దయుద్యోగుల విపరీతచర్యలకుఁ గినిసి రాజమహేంద్ర వరమునందలి శ్యామలాంబను సంబోధించి తనశత్రువుల సంహారింపు మని ముఖాముఖిని దేవతతో మాటలాడుచు వ్రాసిన శతకము. ఇందు వాడుకరూపములు, కవికి దేవతపైఁ గల నమ్మకము విచిత్రముగ నుండును. చింతలపూడి కృష్ణారావు కవికిఁ బ్రతిపక్షి. కాంట్రేగుల రాజాజీ యధికారి. కవికిఁ బోయిన గూడూరియుద్యోగమును దిరిగి యిప్పింపు మని దేవతను బ్రార్థించును. ఆ కాలమునందలి కలిదండివారి దోపుళ్లు మొదలగు దేశవిశేషములు తెలియుచున్నవి. ఉద్యో

గులకష్టములు కన్నులకుఁ గట్టినట్లుండును. ఇంతకంటె వివరములు తెలియవు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

## శ్యామలాంబా శతకము

సీ. ఈ పురంబున కిల నింపుతో నీవును
జేసిన పనులెల్లఁ జెప్ప నేర్తు
కలిదిండివారను ఘనతగా బలిమితో
దోఁచినవారినిఁ దోలినావు
కొవ్వూరికాడను క్రొవ్వుమరాటీలు
దోఁచగావచ్చిన దునిమినావు
పందానుడును మఱి ప్రజలనుదండిగ
కొనవలె నన్నను కొట్టినావు
ఇట్టి దానవశత్రుల యిఁకను దునుము
ఘట్టిగా నినునమ్మితి కరుణయుంచు
పుడమిలో రాజమహేంద్రి పురనివాసి
శాశ్వతంబైన వరమిమ్ము శ్యామలాంబా ‖ 1

సీ. బందరులోపల బాగుగ దయఁజేసి
ధొరలచే సన్నదుల్ దొడ్డగాను
వ్రాయించితివి నీవు వరుస బైలో చేత
కోటిధొరలచేత గొప్పగాను
రాచూరితలలగు రామదాసుని పేర
తాకీదు వ్రాయించి త్వరితముగను
మఱియు చింతలపూడి మఱి కృష్ణరాయుకయి
జాబు వ్రాయించిచ్చి సరసముగను
మొగలితుర్తిలో మాకును ముదముతోను
రుసుము యిప్పింప సన్నదు రూఢివ్రాసి
పుడమిలో........................................ ‖ 22

సీ. ఈ కుంపిణీవారు యీ రాజ్యమందునఁ
దగువులు దీర్చుచు ధర్మముగను
సన్నదు వ్రాసిచ్చి సత్యంబుగా ధొర ల్న
డుచుకొమ్మన్నను నరులు యిపుడు
మరుమాటలాడుచు మహిని వుండిరి యిపుడు
నీయాజ్ఞచేయవే నిపుడువారిఁ
గుంపిణీవారికి కువలయచక్రింబు
నేలించవే యిపుడు వేడ్కతోడ
సన్నదును మాకు నిప్పించి జనని నీదు
ఆజ్ఞచెల్లించి నడిపించు మంబ నీవు
పుడమిలో................................ || 27

సీ. నీ వాకిటను యున్న నిజముగా గొల్లకు
దృశ్యంబుగాదది దృఢము మాకు
రాజాజిగారికి రాజ్యమహాలక్ష్మి
యెదుట నిల్చియు నీవు యొఋక చేయి
ప్రభువు గోరుధొరకు బాగుగాఁదెల్పుము
జగపతిరాజుకు సారె జెప్పి
నీ భక్తులను నెల్ల నిజముగాఁ దెల్పుము
నమ్మితి నేనును నాతి నిన్ను
ఇపుడు దెల్పిన గొల్లని కిఁకను నీవె
వీరికిని నీవు దెల్పిన విహితమమ్మ
పుడమిలో........................... || 38

# వెలిచేటి వేంకటరామప్రధాని



ఇతఁడు ప్రాచీనకవి. "పంచడబ్బులు" అని పిలువఁబడు కావ్యములలో నొకటగు కృష్ణార్జునసంవాదము వ్రాసినవాఁడు. తన కృష్ణార్జునసంవాదమునం దీతఁ డిరువదియైదు శతకములును, విజయలక్ష్మీనృసింహావిలాసము, వియన్నదీపరిణయము, బాణాసురయుద్ధనాటకము మొదలగు కృతులు వ్రాసితినని చెప్పెను.

సీ. మృదువుగా విజయలక్ష్మీనృసింహవిలాస మంచితగతిని రచించినావు
పరగ వియన్నదీపరిణయం బను కావ్యమొప్పుగా విలసిల్లఁ జెప్పినావు
వినయంబుతోఁ బంచవింశతిశతకముల్ విరచించి హరికి నర్పించినావు
భాసురమతిని బాణాసురయుద్ధాది వెసనాటకములు గావించినావు

గీ. సరసుఁడవు నీవె రచియించు సవ్యసాచి
కృష్ణసంవాదమను మహోత్కృష్టకావ్య
మొనర మా పేరఁ గృతియిచ్చి ఘనతమీర
విస్తరింపుము లోక ప్రశస్తిగాను.

ఈ కృష్ణార్జునవిజయము భక్తిప్రతిపాదకమైనది. ఇందు గయోపాఖ్యానమే కథ. ఇతఁడు జగ్గయమంత్రి పుత్రుఁడు. మల్లికార్జునదేవునకుఁ గృతియిచ్చెను. మూఁడాశ్వాసముల గ్రంథము. ఈతని శతకము లేమియుఁ జిక్కనందున శైలికిఁ బద్యము లీయఁ జాలకపోయితిని. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁడై యుండవచ్చును.



# డబ్బీరు నరసకవి

ఇతఁడు కలువాయిశతక మను (శృంగారశతకము) ను రచించి యున్నాఁడు. కలువాయి గ్రామము నందలి కృష్ణుని సంబోధించు మకుటమున్నది. "చెలియ నీ వేగి కలువాయి చిన్నికృష్ణు, తోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి" అను మకుటముతో 100 సీసపద్యములు వ్రాసి యున్నాఁడు. విరహిణియగు స్త్రీ తన చెలికత్తెను కృష్ణునిఁ దెమ్మని తన విరహబాధ నంతయు వర్ణించి చెప్పును. కొన్ని పద్యములు రాధికాస్వాంతనాదుల యందువలె చాలశృంగార భూయిష్టములై యున్నవి. గుహ్యాంగవర్ణనాదు లెక్కువ. ఇది బాలురు, బాలికలు చదువఁదగినది కాదు. డబ్బీరువారు సృష్టికరణములు, విశాఖపట్టణములో నున్నారు. శైలికి రెండు పద్యములు:—

సీ. తిలకంబు నీటుగా దిద్ది మోము చూచి
బలుదర్పణముఁ ద్రిప్పి పారవైచు
కురుల కొప్పమరించి విరివిగా నటు చూచి
విడినీలముల దిగ్గిప్పి విసరివైచు
కంచుకం బమరించి కడు వేడ్క నటుచూచి
పూలబంతుల దిగ్గిప్పి పుడమివైచు
సొమ్ము శృంగారించి సుందరం బటుచూచి
తెప్పున రత్నముల్ ద్రిప్పివైచు
నిన్నివిధముల నన్ను మోహించి యేలు
మచ్చికల నెట్లు మదిలోన మఱచినాఁడో

చెలియ నీ వేగి కలువాయి చిన్నికృష్ణు
తోడికొని వేగరాఁగదే తోయజాక్షి.

సీ. కడుబీదకును బెద్దకత్తియుఁ గలదుగా
నాకులు నీకమ్మలాయెఁ గదర
చెంచువానికినైన మించు విల్లుండఁగ
నయ్యయో తుంట విల్లాయెఁగదర
కోఅగానివానికి గుఱ్ఱంబు లుండంగ
నడవిచిల్కల నెక్కనాయెఁగదర
యాకృతు ల్ప్రాణుల కందరకుండంగ
నంగహీనపు బ్రతుకాయెఁగదర
చెడుగు బుద్ధుల నట్టుల నెడితి వంచు
నెన్ని చెప్పిన మత్సరం బెచ్చెనమ్మ
చెలియ నీ వేగి కలువాయి చిన్నికృష్ణు
తోడికొని వేగరాఁగదే తోయజాక్షి.

నెల్లూరు జిల్లా, ఆత్మకూరి తాలూకాలో "కలువాయి" గ్రామ మున్నది. ఈ కవి యచ్చటివాఁడేమో? కవి కాల, కుల, నిర్ణయాదుల కాధారములు కన్పట్టవు. విశాఖపట్టణమండలమున డబ్బీరువారు సృష్టికరణములు కలరు. కొంద ఱితఁ డావంశమునకుఁ జెందినవాఁ డనిరి. సత్యము తెలియదు, ఇది విరహిణిశతకములజాతిలోఁ జేరిన తాడిమళ్ల రాజగోపాలశతకము, శ్రీశైలమల్లికార్జునశతకముల వంటిది. ఇందు దూతిక పోయి నాయకునితో నాయకి పడుచున్న విరహబాధ వర్ణించి నాయకునిఁ బ్రతిమాలి తీసికొనివచ్చును.

---

# రామాజెట్టి



ఇతఁడు "బాలచక్రవేమశతకము" వ్రాసెను. ఇతఁడు కర్తకాక లేఖకుఁడేమో యనియే యనుమానముగ నున్నది. ఈ శతకము కదిరిలో వెలసిన మన ప్రసిద్ధ వేమనయోగిని గూర్చియే వ్రాసినది. ఇది కడచిన ఖరసంవత్సరమున వ్రాసిన గ్రంథము. వేమనచరిత్ర మను పెద్దగ్రంథములో నీ శతక ప్రసంగము వ్రాసితిని. ఇప్పు డీ శతకమే దొరుకుట నాకు సంతస మొదవించినది. విషయములు చర్చితములు కావలెను.

బాలచక్రవేమ శతకము 32 - C. 5 (ADYAR)

కదిరి తూర్పుదిక్కు ఘనతశోభిల్లఁగా
పరగ వర కటారుపల్లి యనఁగ
అచట యునికిఁజేసి యమరియుండుదురయా
బాలచక్రవేమ భవ్యనామ. 104

4 వ పుట 62 పద్యమునుండి 106 పద్యములు గలవు.

తల్లి దండ్రి యన్నదమ్ము లాత్మసఖులు ఎలమి బంధువులాది యెల్లజనులు
గలిగి వర్ధిల్లి రావూరు ఘనతమీర బాలచక్రవేమ భవ్యనామ!

సంపూర్ణము

శ్రీకృష్ణార్పణమస్తు. శ్రీ శ్రీ శ్రీ జేయునూ.



# అనుబంధము



ప్రథమ భాగము

**( 1150 - 1500 )**



శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.,
ఆంధ్ర శాఖాధ్యక్షులు
మదరాసు విశ్వవిద్యాలయము.

# మల్లికార్జున పండితారాధ్యులు

కవులచరిత్రిలో మల్లికార్జునపండితారాధ్యులను గూర్చి తెలిపినవారిలో సుబ్బారావుగారు మొదటివారు. వారికి, ఆ నాటికి (క్రీ. శ. 1923) కీర్తిశేషులు కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రకటించిన శివతత్త్వసారమే ఆధారము. శివతత్త్వసారమున లభ్యమైన 489 కందపద్యములకంటె, వేఱుగా నొకటి రెండు పద్యములు లక్షణగ్రంథములయం దుదాహృతము లగుటచేత, వారింకను కొన్ని పద్యము లం దుండవలెనని యూహించిరి. శ్రీ సుబ్బారావుగారు, పై సందర్భమును పరిశీలించి, శివతత్త్వసారమున వేయిపద్యము లుండునని యొక నిర్ణయమునకు వచ్చిరి. చూడుఁడు వారి వాక్యములు. పుట. 2. "ఐనను 'శివా' యను సంబోధనమే హెచ్చుగా వాడినందున నిది శివసహస్రముగ వ్రాసి యుండిన నుండవచ్చును." పుట 5. "ఈ యూహ కవి శివతత్త్వసారమును సహస్రముగా వ్రాసియుండు నను నా యూహకు బలమిచ్చుచున్నది."

రమారమి ముప్పదినాల్గేండ్ల క్రిందట సుబ్బారావుగా రూహించినది నేడు యథార్థముగాఁ బరిణమించినది. ఇది యొక్కటియే వారి పరిశోధనా దీర్ఘదర్శిత్వమునకు తార్కాణ.

— క న్న డా ను వా ద ము —

ఒక దశాబ్దికిరింద, కన్నడభాషలో "శివతత్త్వ సారము" అను గ్రంథము లభించినది. పరిశీలించి చూడగా నది మల్లికార్జునపండితుని తెలుఁగుగ్రంథమునకు కన్నడాను వాద మని స్పష్టమైనది. కన్నడానువాదమును మల్లికార్జున పండితుఁడే రచించినట్లుగా నందలి యంకితాంక పద్యమే చాటుచున్నది. కన్నడ శివతత్త్వసారము కూడ పూర్తిగ లభింపలేదు. కాని తెలుఁగున లేని పద్యము లందు కాన వచ్చుటయేకాక పద్య సంఖ్య - 184 నుండి 491 వఱకును, 725 నుండి 740 వఱకును కన్పట్టుచున్నది. దీనినిబట్టి తెలు గున కూడ యీ పద్యము లుండి యుండవలెననియు నందుచే వేయి పద్యము లుండుట సంభావ్యమని నిర్ణీతమైనది.

శివతత్త్వసారము "శతకము" అను నభిప్రాయమును ప్రప్రథమమున లక్ష్మణరావుగారు వ్యక్తపఱచిరి. సుబ్బా రావుగారు దానిని బలపఱచిరి. కాని యిందును సుబ్బారావు గారొక క్రొత్తసూచనను గావించిరి. వారు 4 వ పుటలో - "ఇదియే సిద్ధాంత మనుట కట్టివారీ కవి వ్రాసిన శతక మును చూపవలసియుందురు." నేఁడు మల్లికార్జునపండితుని శతక మొకటి బయల్పడినది. అది సంపూర్ణముగా లభ్యము కాలేదు. కాని ఈ క్రిందిపద్యము మాత్రము లభించినది.

"లోకము లెల్ల నీ తనువులోనివ నీ వట యెంతకల్గుదో
నాకప పద్మసంభవ జనార్దను లాదిగ నెల్ల పెద్దలుఁ
నీ కొలదింత యంత యన నేరక మ్రొక్కెదొడంగి రన్న ని
న్నేకరణిం నుతింతు పరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా."

విశేష మేమనఁగా నీ శతకమునే సోమనాథుఁడు శివతత్త్వసారమునకు ముందు చేర్చి 'శతకంబు, శివతత్త్వసారము' అని పేర్కొన్నాఁడు. శివతత్త్వసారము శతకమని ఆతఁ డెచ్చటను సూచించి యుండలేదు. శివతత్త్వసారము శతకమే యైనచో "శివతత్త్వసార గద్యపద్యసమితిఁ జెప్పినట్టి మల్లికార్జున పండితయ్యగారిని" యని అనుభవ సారమున వ్రాసిన వాక్యమునకు నర్థములేదు. అచటి శతకమను మాట లేకపోవుటయే కాక 'గద్యపద్య' అని యుండుటచే లక్ష్మణరావుగారు గద్యలో కూడ నొక శివతత్త్వసారమును వ్రాసెనా? యని సందేహపడవలసి వచ్చినది. శివతత్త్వసారము శతకము కాదనుటకు వేఱుపపత్తు లేమియు నవసరములేదు. చిత్రమేమనఁగా పైనుదహరించిన శతకమునకు కన్నడమున యనువాదము లభించినది. దాని మొదటి పద్యమిది.

శ్రీపతి వాక్పతి ప్రముఖదేవతెగళ్ బహువేదసారవా
గ్రూప గళింద కాణదిహ శైవమహాత్త్వ మనల్పబుద్ధి యిం
రూపి సలాసమర్థన కృతార్థన దంతహానల్బదిర్కె చి
దూ్రపన వాచ్యనం నుతిపనై శివపర్వత మల్లికార్జునా!

ఇది తెలుఁగు శివతత్త్వసారమందలి మొదటి పద్యమునకు వృత్తరచన

" శ్రీపతి వాక్పతి ముఖ్యమ
హాపురుషులు నెఱుఁగనోప రతివాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపం బెట్టిదని నే నిరూపింతు శివా!

"శతకవాఙ్మయసర్వస్వము" అను గ్రంథమున మొదటి 26 పుటలలో మల్లికార్జునపండితారాధ్యులజీవితము గలదు. అందు చర్వితచర్వణములైన విషయములేగాని నూతనము లేకపోవుట సరికదా! అసంబద్ధములగు ననవసరప్రసంగములే కలవు. "శివతత్త్వసారము శతకముకాదు, శ్రీగిరి మల్లికార్జునశతకము శతకము" అను విమర్శకాభిప్రాయమును తగిన యుపపత్తులు చూపకయే తీవ్రముగ విమర్శించుటయే కాక, అంతకుముందే విద్వల్లోకములో వెల్లడియైన శ్రీగిరిమల్లికార్జునశతకమునందలి పై పద్యమును కూడ యుదాహరింపలేదు!* ఇక్లే

* పై పద్యము సర్వస్వకర్త తన గ్రంథము 12వ పుటలో నుదాహరించిన తారణ ఫాల్గునమాస భారతి - (1949 జాన్యువరి) వ్యాసములో వివరముగా వ్రాయబడియేయున్నది. వా రా వ్యాసములో నొకభాగమును విమర్శించుచు ఆ వ్యాసమందే గల పై పద్యము నుదాహరింపకపోవుట చూడగా, ఆ వ్యాసమును వా రామూలాగ్రముగ చదువలేదని స్పష్టమగుచున్నది. పరిశోధనయం దిట్టి యప్రామాణిక రచనలు గావించుట శోచనీయము.

శివతత్త్వసారము నందలి మతసంప్రదాయములను గూర్చి, యప్రామాణికపు వ్రాతలు కన్పట్టుచున్నవి. వాని నన్నింటిని గూర్చి చర్చించుట కిది యదనుకాదు. శతకవాఙ్మయసర్వస్వమున నున్న శతకకవులను గూర్చి వ్రాయునపు డెల్ల అందలి విషయములు విమర్శింతును. దానికి "శత. స" అను సాంకేతిక ముపయోగింతును.

గ్రంథసూచి:- తెలుఁగు కవులచరిత్ర ని. వేంకటరావు
మద్రాసు విశ్వవిద్యాలయప్రకటితము
పండితత్రయము - వ్యాసము.
ఆంధ్రపత్రిక ఆంధ్రరాష్ట్రావతరణసంచిక - 1953.

## పాల్కురికి సోమనాథుఁడు

పాల్కురికి సోమనాథుని కాలమును గూర్చి యిటీవల కొన్ని వాదప్రతివాదములు బయలుదేరినవి. ఆతఁడు క్రీ. శ. 1190-1250 ప్రాంతమువాఁడను విషయమును సుబ్బారావు గారు సోపపత్తికముగా నిర్ణయించియున్నారు. అదియే పది పంద్రెండేండ్ల క్రిందటివఱకును ప్రామాణికముగ నిలిచినది. ఈ వెనుక సోమనాథుఁడు క్రీ. శ. 1295-1325 ప్రాంతమువాఁడను వాదమును కొందఱు లేవదీసిరి. కాని శైవవాఙ్మయమున పరిశ్రమచేసిన ప్రామాణిక విద్వాంసు లెల్లరును దీనిని ఖండించిరి. ఈ వాదమును గూర్చి యొక గ్రంథముకూడ

వెలువడినది. శతకవాఙ్మయసర్వస్వమున కూడ నీ రెండవ వాదమే ప్రతిపాదింపబడినది. ఈ వాదము బహుముఖముగ, సునిశితముగను పరీక్షించి శ్రీ బండారు తమ్మయ్యగా రామూలాగ్రముగ దీనిని ఖండించి, తిరిగి తలయెత్తకుండఁ జేసిరి.[1] ఈ నాఁడు సుబ్బారావుగారి కాలనిర్ణయమే సర్వాంగీకృతమైనది. సోమన వృషాధిపశతకమును గూర్చి తొలుత వివరముగాఁ దెల్పినవారు సుబ్బారావుగారే !

## యథావాక్కుల అన్నమయ్య

అన్నమయ్యను గూర్చి, యాతని సర్వేశ్వరశతకమును గూర్చి యీ వఱకును వ్రాయఁబడినవాని[2] నుండి క్రొత్త విషయముల నిందు తెలుపుచున్నాఁడను.

అన్నమయ్య కృతి భావములచేతనే గాక భాషచేతను శైవవాఙ్మయమునకు సంబంధించినది. కావున నీతఁడును, నన్నెచోడ, పాల్కురికి సోమనాథాదులవలె "శివకవి".

1. క్రీ. శ. 1952 లో బసవపురాణ ద్వితీయముద్రణ పీఠికయం దీ వాదమును ఖండించిరి. (పీఠికాకర్త నిడుదవోలు వేంకటరావు) 1954 లో పరిశోధన సోమనాథుని ప్రత్యేక సంచిక యందు నీ వాదము పూర్తిగ పై విద్వాంసులు పరాస్తము చేసివైచిరి. సోమనాథుని గ్రంథములు, కాలము మున్నగునవి తెలుసుకొనుటకు పై రెండును గాక శ్రీ బండారు తమ్మయ్యగారి పాల్కురికి సోమనాథుని జీవితము అను గ్రంథము కూడ చాల ముఖ్యమైనది. పై మూడును ప్రామాణిక రచనలు.

2. భారతి తారణ ఫాల్గున సంచిక - తెనుఁగుకవులచరిత్ర పుటలు 351-377.

అన్నమయ్య కృతియందు శివపంచస్తవములలో, మహిమ్నము, మల్హణము అనామయము, హాలాయుధము అను నాలుగు స్తవముల నుండి శ్లోకముల నేరి వాని కాంధ్రను వాదము గావించి యున్నాడు. మఱియు, మల్లికార్జున పండితుని శివతత్త్వసారము నుండియు పండితారాధ్యచరిత్రము నుండియు కొన్ని పద్యద్విపదలకు పద్యానువాదము గావించియున్నాడు. తనకు పూర్వమందు గల శైవాచార్యుల వాక్యములను యథామాత్రకముగా ననువదించుటచేతనే యీతనికి యాథావాక్కుల అన్నమయ్య అను పేరు వచ్చినది.

పుష్పదంతవిరచితమైన మహిమ్నస్తోత్రమునందలి శ్లోకానువాదములను సర్వేశ్వర శతకమునందు గాననగును. మచ్చున కొక యుదాహరణము.

హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజముదహరన్ నేత్రకమలం
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం.

19 వ శ్లోకము.

సమయోద్దిష్ట సహస్రపంకరుహ పూజాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవత్పాదంబు లర్చించి చ
క్రము నీచే గొని దైత్యకోటి ననిలో ఖండించె దా నీ పద
క్షమతా సేవ సమస్తదేవతలకున్ సత్త్వంబు సర్వేశ్వరా. 137

## మల్హణస్తవము (మల్హణకవి విరచితము).

శ్లో॥ "బాలోపి సంస్మరణ మాత్ర మచేత నస్తే
లింగం కరోతి హరపాంసు మయం వినోదాత్
అత్యంత దేశ ధన ధాన్య సమృద్ధి భాజి
రాజ్యం కరోతి హతకంటక మున్నతంచ. (34)

"క్రీడా ప్రపంచ నిరత శ్శిశవో భృవంత
మారాధయంతి ........................." (12)

ఆడంబోయిన చోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచు పేర్కొన్నంతటం జేసి నా
రాడం బోయి సురాంగనాకలిత దివ్యారామ చింతామణి
క్రీడాశైల విహారులై వెలయుటల్ గీర్తింతు సర్వేశ్వరా!

## అనామయస్తవము (దండి మహాకవి రచితము).

శ్లో॥ యోగీ భోగీ విషభుగమృత శ్శస్త్రపాణిస్తపస్వీ
శాంతః క్రూర శ్శమిత విషయ శ్శైలకన్యా సహాయః
భిక్షావృత్తిః భువనపతిః శుద్ధిమా నస్థిమాలీ
శక్యోజ్ఞాతుం కథమివ శివత్వం విరుద్ధస్వభావః

సకలాధీశ్వర పట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంత శాం
తకళాత్ముండవుఁ రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికా సంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టి వా
రికి దా శక్యమె నీ నిజం బరసి చర్చింపంగ సర్వేశ్వరా.

## హలాయుధస్తవము (హలాయుధ విరచితము.)

"యత్ప్రత్యక్షం సకలభువనాశ్చర్య భూతం విభాతి
జ్యోతిర్లింగం కనకకపిశం శ్రీగిరౌ వ్యోమ్ని దివ్యం
తత్పశ్యంతః శివసుకృతినస్త్యక్తసంసారబంధా
స్త్వత్కారుణ్యా చ్చిరగణ పదప్రాప్తి భాజో భవంతి॥"

ధరణిం బ్రొక్తన భక్తనిర్మిత మహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరి ముఖ్యంబగు దివ్యతీర్థముల భక్తింజూచిరే వారి దు
స్తరదోషంబులు వాయు నన్న మఱి సాక్షాద్భక్తులం జూచినం
బరమార్గంబుగఁ బాయదే నరుల పాపంబెల్ల సర్వేశ్వరా! 88

శివతత్త్వసారము నుండియు ననుకరణములు గలవు. ఉదాహరణమున కొకటి.

ఏ దేశంబున నే పురి
నే దెస వసియించి యుండు నిల శివభక్తుం
డా దేశంబున నా పురి
నా దెస వసియించి యుండు హరతీర్థంబుల్ (207)

ఏ దేశంబున నే దిశాముఖమునం దే యూర నే వాడ మీ
పాదాభ్యర్చన సేయు నిర్మలుఁడు సద్భక్తుం డొకం డుండు నా
యా దేశంబును నా దిశాముఖమును న్నా యూరు నా వాడ గం
గాది స్నానసమ పవిత్ర ఫలదంబై యొప్పు సర్వేశ్వరా! (119)

# శివదేవయ్య

## శివధీమణీ శతకము.

మనకు లభ్యమైన యీ శతకమునందలి రెండు పద్యములలో నీ క్రింది పద్యమును తిక్కనసోమయాజి మహాభారతమున ననుకరించి యున్నాడు.

ఉ॥ ప్రాణు నపానుఁ గూర్చి యని పాముఁ గదల్చి తదూర్ధ్వ కీలితో
ద్ప్రాణము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘోణము చేర్చి యా ప్రణవ ఘోషణముం విని యందు మానస
క్షీణము సేసినం బసనసిద్ధుఁ డనా శివదేవధీమణీ!

శివదేవధీమణి శతకము.

తిక్కన - యనుశాసనిక పర్వమున శివపార్వతి సంవాదము.

ఉ॥ ప్రాణము నపాను నందును నపానుని( బ్రాణములో యందు నిల్పి ని
ర్వాణముఁ గోరి చిత్తము దిరంబుఁగఁ బట్టఁగఁ బ్రాణ సంయమా
క్షీణత దేహమధ్య శిఖిఁ జిమ్మఁగఁ దత్త్రియ మొందె మూర్ధ పా
రీణతఁ గోర్కి సల్పు నపరిచ్యుతిఁ దద్గతుఁడైన యోగికిన్ (5-260)

మఱియు సౌప్తికపర్వములో ధర్మరాజునకుఁ గృష్ణుఁడు శివ ప్రభావము చెప్పు సందర్భములో

ఉ॥ తెల్లమిఁ గాఁగ నేను శివదేవు నెఱుంగుదు

అని యుండుట, తిక్కన శివదేవయ్య నెఱుంగునని ధ్వనించుచున్నది.

కాకతీయగణపతిదేవచక్రవర్తి కడకు తిక్కన వెళ్ళి నప్పుడు శివదేవయ్యను గూర్చి "ఈతఁడు సాక్షా దీశ్వరుఁడే కాని మనుష్యమాత్రుఁడు కాఁడు" అని చెప్పుటయు, భీష్మ పర్వమున నీతని కృతియగు పురుషార్థసారమును "పురుషుఁడు పురుషార్థసారభూషణుఁడు గదే" అని ధ్వనింపఁ జేయుటయు తిక్కనపై శివదేవయ్య ప్రభావము స్పష్టపఱచుచున్నది. ఈతఁడే, ఆంధ్రకవితాపితామహుఁ డన్న బిరుదము ధరించిన వారిలో మొదటివాఁడు.

చూడుడు. వ్యాసము ప్రథమాంధ్రకవితా పితామహుఁడు - శివదే వయ్య - భారతి.

ని. వేంకటరావు.

# చక్రపాణి రంగనాథుఁడు

పాల్కురికి సోమన సమకాలికుఁడును, నాతని శిష్యుఁడును, నగు చక్రపాణి రంగనాథుఁడు, తొలుత వైష్ణవుఁడై సోమనతో వాదించి, యోడి, యాతనివలన శివదీక్షపొందిన వెనుక శివపరములగు కృతు లనేకములు రచియించెను. రంగనాథుని చరిత్ర కన్నడ భాషలోఁ దెలిపిన సిద్ధనంజేశకవి, వృత్తశతకములను, కందశతకములను నాతఁడు పెక్కులు రచియించినట్లు తెలిపియున్నాఁడు. వాని యవి మనకు లభ్యము కాలేదు. వాని యందలి కొన్ని పద్యములు మాత్రము లభించినవి.

వృత్తశతకము – "గిరిజాధినాయకా" అను మకుటము.

చ॥ అదలని తేరు, తేరునకు నాదరువైతగు విల్లు, వింటికిం
గుదురని నారి, నారి పయిఁ గూర్కు శరంబు, శరంబు బొడ్డునం
బొదలిన యంత, యంతముఖముల్ నిజవాసములైన గుఱ్ఱముల్
చెదరక నీకు నెట్లు పనిసేయునయా! గిరిజాధినాయకా"

కందశతకము – "చంద్రాభరణా" అను మకుటము.

క. జడలల్లి భూతి పూయని
పొడవులఁ బొడగాన మాది పురుషులలోనన్
నడుమంత్రపు సమయంబులు
జడమతు లలరించుకొనిరి చంద్రాభరణా!

క. ఫాలతల భస్మరేఖలు
మే లెవ్వఁ డెఱుంగ నేర్చు మృగమదపంక

వ్యాలేపనాది రుచులకుఁ
జాలింపఁడు గాక బాల చంద్రాభరణా!

## శరభాంకుఁడు

ఈతఁడు రచియించిన "శరభాంకలింగమా" అను మకుటము గల వృత్తపద్యశతకము ముద్రితమై ప్రచారమున నున్నది. శరభాంకుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని మంత్రి యైనట్లు ప్రతాప చరిత్రము చెప్పుచున్నది. తురుష్కులు తెలంగాణముపై దండెత్తి వచ్చినప్పుఁ డీతఁడు చెప్పిన

"చాపముగా నహార్యమునుఁ జక్రిని బాణముఁగాఁగ, విల్లుఁగా
బాపవొరం బొనర్చి తలపం ద్రిపురంబులఁ గాల్చవే మహో
ద్దీపిత తీవ్రకోపమున దేవతలెల్ల నుతింప నాటి విల్
పాపపు ఢిల్లి మీఁద తెగఁజాపఁగదే శరభాంకలింగమా!

పై పద్యమును క్రీ. శ. 1560 ప్రాంతమున నున్న సులక్షణసారకర్త యుదాహరించి యున్నాఁడు. పై పద్యము ముద్రితప్రతిలో లేదు. శతకము వీరశైవభక్తిప్రతిపాదకము. శరభాంకుని, వేమన, ఎడపాటి ఎఱ్ఱన, రాజలింగకవి, నాగర ఖండ రచయితలును పేర్కొనుటచే నీతఁడు మంత్రి శిఖామణియును, మాన్యతరమైన కవివతంసుడనియుఁ జెప్ప వచ్చును.

శరభాంకలింగ శతకము వీరశైవభక్తి ప్రతిపాదకము, శివభక్తుల కథ లిందు ప్రధానముగా ప్రపంచితము లైనవి. మచ్చునకు రెండు పద్యము లుదాహరించుచున్నాను.

ఉ॥ ధాత కపాలమాలికలుఁ దాల్చఁగలేని సరోజనాభునిన్
నాతిఁగఁ జేయలేని, ఫణినాథుని, ముద్రిక లందలేని యా
యీతరి బీద వేల్పులకు నేమని మ్రొక్కుదు మ్రొక్కినంతనే
చేతులతీటయు న్బోసలిచేటుఁ గదా శరభాంకలింగమా!

ఉ॥ పారిపారి మేకమాంసములు బొక్కుచు నిక్కుచు సోమయాజిరై
సురపురి కేగి గంభకడ సొక్కుచు సోలుచు గామయాజిరై
ధరణికి డిగ్గి యింద్లకడ దాస్యము చేయుచుఁ గర్మయాజిరై
సారె దిరుగాడు శ్రామి మిముఁ జూడడయా శరభాంకలింగమా.

# ఎఱ్ఱా ప్రెగ్గడ

ఈతఁడు స్వగ్రామ మగు గుడ్లూరియందు నెలకొన్న నీలకంఠేశ్వరుని పేర నొక శతకము రచియించినట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఆ శతకమంతయు లభ్యముకాలేదు. లభ్యమైన పద్యము నీ క్రింద పొందుపరచుచున్నాను.

మ॥ నిను సేవించినఁ గల్గు మానవులకున్, వీటీవధూటీఘటీ
ఘుటీకోటీశకటీ కటీతటిపటీ గంధేభవాటీ పటీ
రసటీ హారిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటి కాపేటికల్
కనదామ్నాయ మహోతురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!

# శ్రీగిరికవి

మడికిసింగన సకలనీతిసమ్మతములో శ్రీగిరి శతకము లోని దని యీ క్రిందిపద్య ముదాహరించి యున్నాఁడు.

సీ. జీతంబు గిలిబిలి చిలుకలు దూరంబు వహఁజూడ నదిపాల్ల ప్రాఁత కల్ల
అపరాధములుకోటి నృపుఁజంపఁడను పాటి మాన్యత వెడసెడ మాటబొంకు
కోపంబు ముమ్మడి కోలాసనలు మడి సత్య మారజమిాగి జమలి తోట్టు
ఆచార మెడఁ దప్పు నాశ్రమ మట్టట్టు దొరతనం బది పూఁత దుగము లేఁత
ఆ.వె. చరిత మెల్ల నిందరిజాలంబు తలఁ పెల్ల నెల్లిదంబు మాట లెల్ల దంబ
మిట్టి కుమతిఁ గొల్చి యెవ్వాఁడు మనసూపుఁ జిరతరప్రకాశ! శ్రీగిరీశ!

సింగన యుదాహరించిన శతకమునకుఁ గర్త శ్రీగిరి. ఈతఁడు క్రీ. శ. 1315 ప్రాంతమున నున్నట్లుగా నా సంవత్సరమున నీతని కొసగఁబడిన దానశాసనమును బట్టి తెలియుచున్నది. మఱియు నీతఁడు రెడ్డిరాజులలో ప్రథముఁ డగు ప్రోలయ వేమారెడ్డిచే సమ్మానితుఁడు. శాసనములలో నీతఁడు 'ప్రథమకవి' యని పేర్కొనఁబడినాఁడు. నవనాథ చరిత్ర పద్యకృతిగా రచించిన కవి యీతఁడే యైయుండఁ దగును. ఈతఁ డెఱ్ఱాప్రగడ సమకాలికుఁడు. ఈతఁడు మల్లికార్జునపండితుని వంశమువాఁడని యొక శాసనమునఁ గలదు. ఈ శతకమున పై పద్యము తప్ప గ్రంథము లభింప లేదు.

# ఏకామ్రనాథకవి

## అన్యవాదకోలాహలము

శతక కవుల చరిత్రమున తృతీయ భాగమున వర్ణితుఁడైన సోమేశ్వరారాధ్యులు అన్యవాదకోలాహల గ్రంథకర్త

కాడు. కొన్ని ప్రతులలో శివయోగీంద్రకృతమని యున్నది. శివయోగియు గ్రంథకర్త కాడు. గ్రంథరచయిత శైవాచార్యపరంపరలో నొకఁడగు ఏకోరామనాథుఁడు. ఈ పేరు శతకమున "ఏకామ్రనాథ"శబ్దముగ రూపాంతరమునందినది. ఈతఁడు పాల్కురికి సోమనాథుని గ్రంథములోని విషయము లన్నింటిని సంగ్రహించి యున్నాడు. ఈ ఏకోరామనాథుడు మల్లంపల్లి వారి మూలపురుషుఁడు. ఈతఁడు క్రీ. శ. 1350 ప్రాంతమువాఁడు. కావున నితడును ప్రథమభాగమున చేర్చఁబడినాఁడు.

(చూ. 'మల్లంపల్లి బుచ్చికవి' అను నావ్యాసము. త్రిలింగ, జాన్యువరి 1955)

## రావిపాటి త్రిపురాంతకుఁడు

ఈతని 'అంబికాశతకము' నుండి సుబ్బారావుగారుదాహరించిన వానికంటె పద్యములు వేఱేమియు లభింపలేదు. ఆతని కృతి త్రిపురాంతకోదాహరణము నాచేత పూర్తిగ సంపాదితమై విపులమైన పీఠికతో ప్రకటితమైనది. ఈ గ్రంథ ప్రకటనమే నవీన వాఙ్మయమున, ఉదాహరణ శాఖ పునరుద్ధరణము చెందుట కాధారమైనది. ఆ వెనుక "ఉదాహరణవాఙ్మయచరిత్ర" మను పేర యీ శాఖావాఙ్మయచరిత్రము నంతను గ్రంథరూపమున ప్రకటించితిని.

నేటికి నిది యొక్కటియే యీ శాఖాచరిత్రమును తెల్పు ప్రామాణిక గ్రంథము.

పుట 86 లో "పాల్కురికిసోమనాథుఁ డుదాహరణములు రెండు వ్రాసినట్లు నిదర్శనము" అని యున్నది. అవి రెండును నేఁడు లభ్యమైనవి. ముద్రితములైనవి. ఒకటి సంస్కృతము, ఒకటి తెలుఁగు. రెండును బసవనిఁగూర్చినవియే రెండును సంస్కృతాంధ్రవాఙ్మయముల నుదాహరణశాఖకు శ్రీకారము చుట్టినవి.

## పెద్దయ కవి

జక్కన విక్రమార్కచరిత్రమున, తన తాత యగు పెద్దయకవి నెల్లూరి తిరుకాళత్తివిభు సభయందు ప్రసిద్ధి వహించె నని చెప్పుచు నాతఁ డొక శతకమును రచియించె నని యిట్లు వ్రాసి యున్నాఁడు.

"సీ. సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
గడియలో నొక శతకంబుఁ జెప్పఁ."

అనగా, నొక శతకములోనే, సంస్కృత ప్రాకృతాది భాష లన్నియు వ్రాసియున్నాడని తెలియవచ్చుచున్నది. దీనినిఁబట్టి తెలుఁగు కవు లా కాలమున ప్రాకృత భాషలో కవిత్వము చెప్పెడువారని గ్రహింపవచ్చును. శతకము లభ్యము కాలేదు. ఈతని కాలము క్రీ.శ. 1350 ప్రాంతము.

# వటమూలుఁడు

ఈతనిని వేమన, తన గురువులలో నొకనిగా పేర్కొనినాఁడు. ఈతని శతకము "వటమూలమందిరా" అని పేరు గలది. ఇది వేదాంతవిషయికమైనది. గ్రంథమంతయు లభ్యము కాలేదు.

ఉ॥ సాఁగిన కోపవహ్ని నిజశాంతజలంబుల చల్లనార్చి యా
శాగిరులన్ నివృత్తి కులిశాహతి నుగ్గుగఁ జేసి యత్తమో
నాగవిభున్ వివేకమృగనాయకుచే నణఁగించి లోన సం
యోగ వియోగముల్ విడువ యోగియగున్ వటమూలమందిరా!

ఈతఁడు వేమన గురువు గాన క్రీ. శ. 1450 ప్రాంతమువాఁడు. ఈతనిని తురగా రామకవి, అయ్యంకి బాలసరస్వతి కవులు కవిస్తుతిలో స్తుతించిరి.

# తాళ్ళపాక అన్నమయ్య - తాళ్లపాక అన్నమాచార్యుఁడు*

పై యిరువురు నొక్కవ్యక్తియే. ఈనాఁడు తాళ్ళపాక వారి వృత్తాంతము, శాసనముల మూలముననుు, తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన అన్నమాచార్యచరిత్రము, శృంగారాధ్యాత్మిక సంకీర్తనముల మూలముననుు, తద్వంశీయుల

* ఈ కవి చరిత్రము - శతకకవులచరిత్రము యొక్క ద్వితీయభాగములో నున్నది.

కృతుల మూలమునను సమగ్రముగాఁ దెలియవచ్చు చున్నది.

అన్నమాచార్యులవారు శ్రీ దివ్యతిరుపతిక్షేత్రమున సంకీర్తనాచార్యులు. పదకవితాసార్వభౌము లని ప్రఖ్యాతి వహించినవారు. సంకీర్తన వాఙ్మయ స్రష్టయైన మహనీయులు. వారు వేలకొలది సంకీర్తనలనే గాక ద్విపదలో రామాయణ మును కూడ రచించిరి. వారి జీవితకాలము 96 యేండ్లు (1408 - 1503). వీరి శతకరచన శ్రీ వేంకటేశ్వర శతక మును నేను సంపాదించి వావిళ్లవారిచేఁ బ్రకటింపఁజేసితిని. శతకరచన శృంగారపరముగా చేయుటకు దారితీసినది రావి పాటి త్రిపురాంతకుఁడు. ఆ మార్గమును క్షుణ్ణము చేసినది అన్నమయగారు. ఈ శతకమకుటము వేంకటేశ్వరుని పేర నున్నను, దానిలో ప్రతిపద్యమున నలమేలుమంగ ప్రసక్తియే వచ్చుచుండును. ఆ దివ్యదంపతుల శృంగార మిందు ప్రతిపా దింపబడినది. తెలుఁగున వెలువడిన శృంగారశతకముల కిది మేలుబంతి. తాళ్లపాకవారినిఁ గూర్చి వివరములు తెలియని యారోజులలో (1923 లో) లభ్యమైన విషయము లన్నిం టిని సేకరించి వ్రాసిన వారిలో సుబ్బారావుగారు ప్రథములు.

## కొనుకొలను అన్నమయ్య లేక అన్నమరాజు

అమరుకాంధ్రీకరణ కర్తలలో కొనుకొలను అన్నమయ్య మొదటివాఁడు. ఈతని కృతి సంపూర్ణముగ మనకు లభ్యము కాలేదు. మొదటి శ్లోకమున కాంధ్రీకరణము, ప్రబంధరత్నాకరమున జగ్గన యుదాహరించి యున్నాఁడు.

"ఉ॥ చులుకనఁ జాపముం దిగుచుచోఁ గటకాముఖపాణిమీఁదఁ జె
ల్లాలయు నఖాంశులం గదిసి యొప్పెడు కెంజిగురాకు గుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన తుమ్మెదవోని పార్వతీ
లలన కటాక్షదృష్టి మనలం జరితార్థులఁ జేయుఁ గావుతన్"

ఈ యన్నమరాజు క్రీ.శ. 1484 లో నున్నట్లు శాసనమున్నది.♦ కావున నీతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు. కాని యీ గ్రంథము లభ్యము కాలేదు.

## గంగాధరకవి *

చెన్నమల్లేశశివలింగ శరణుశరణు అను మకుటముగల శతకమును రచియించిన గంగాధరకవి గురుబసవన్న శిష్యుఁ

---

♦ కవి కాలనిర్ణయము - శాసనాధారములు - భారతి సం. 26. పుట 21. — ని. వేంకటరావు.

* ఈ కవి చరిత్రము - శతకకవుల చరిత్రము తృతీయ భాగములో నున్నది.

డనని, విభూతిపుర వాసుఁడ ననియు చెప్పుకొన్నాఁడు. ఈ గురుబసవన్న క్రీ. శ. 1450 ప్రాంతమువాఁ డని కర్ణాటకవి చరిత్ర చెప్పుచున్నది. కావున నాతని శిష్యుఁడగు గంగాధర కవి 1450 - 1500 ప్రాంతమువాఁ డని చెప్పదగును. ఇతఁడు కూడ ప్రథమభాగములో చేర్పఁదగినవాఁడు కావున నిందు చేర్చితిని.

## పెగ్గడపల్లి పోతయ్య

ఈతఁడు గోదావరీనదిని వర్ణించుచు నొక శతకమును రచియించి యున్నాఁడు. అది మత్తేభ శార్దూలవృత్తములతో నొప్పినది. శతకశైలి లోకోత్తరమైనది. శతకమంతయు లభ్యము కాకపోవుట దురదృష్టము. ఈ క్రింది పద్యమును చదువుఁడు.

మ॥ స్థిరపుణ్యోదయ మేదినీందువదనా సీమంతవీథీ లస
ద్గురు ముక్తాఫలసూత్రమో? సురుచిరక్షోణీపురంధ్రీయశో
ధర ధమ్మిల్ల లతాంతమాలికయొ? భూతస్వీ కుచశ్రీ మనో
హర సువ్యానమొ నాఁగ నీవగు ప్రవాహం బొప్పు గోదావరీ.

ఈతఁడు వ్రాసిన యొక పద్యమయశాసనమును బట్టి క్రీ.శ. 1466 లో నున్నట్లు తెలియుచున్నది. కావున ప్రథమ భాగమున జేర్చితిని.

# విరూపాక్ష కవి *

శ్రీకాళహస్తిలింగశతకమును రచియించిన విరూపాక్షకవి క్రీ.శ..1600 – 1700 మధ్య నున్నవాఁడని శ్రీ సుబ్బారావుగా రూహించిరి. వారు వ్రాసినట్లుగా నీ శతకమున వీరశైవాచారము లుగ్గడింపఁబడినవి. కావున నీతఁడు శివకవులలోనివాఁడు. తన తండ్రి పాపయ యనియు తన తాత శ్రీగిరి యనియు – "పావన శ్రీగిరి పాపవిభుని యాత్మజాతుండ విరూపాక్షాహ్వయుండ" అన్న పద్య పాదముల వలన తెలియఁజేసి యున్నాఁడు. శ్రీగిరికవి క్రీ. శ. 1315 ప్రాంతమువాఁ డని యాతని చరిత్రమున వ్రాసియున్నాడు. విరూపాక్షకవి యాతని మనుమఁడు గాన క్రీ.శ. 1400 ప్రాంతము వాఁడని నిర్ణయింపవచ్చును. కావున నీతని ప్రథమ భాగములో ననుబంధమున చేర్చితిని.

# సదానందయోగి

శతక కవుల చరిత్రమున చతుర్థ భాగమున మొదట నున్న సదానందయోగి క్రీ. శ. 1450 – 1500 మధ్య నున్నట్లుగా నీ నడుమ ప్రకటితమైన ఈశ్వరఫణిభట్టకృత పరతత్త్వరసాయనమును బట్టి తెలియు చున్నది. ఫణిభట్టు –

* ఈ కవి చరిత్రము శతకకవుల చరిత్రము - ద్వితీయభాగములో నున్నది.

క్రీ.శ. 1450 - 1500 ప్రాంతమువాఁ డని యీ పీఠికలో నిర్ణయింపబడినది. ఫణిభట్టునకు గురువు సదానందయోగి. ఆతనికే గ్రంథము కూడ కృతి. "నా కిష్టార్థ మొసంగు గావుత సదానందాది దేవుం డిలన్"- అని యందు కలదు. కాబట్టి సదానందయోగియు నీ ప్రాంతమువాఁ డని నిర్ణయింపఁబడినది.

(చూడుడు. ఆంధ్రకవి తరంగిణి 6 వ సంపుటము - 227 - 228 పుటలు).

## తెనాలి శ్రీగిరికవి

ఈతఁడు తెనాలి రామలింగని తాత - శ్రీశైల మహాత్మ్యమును రచియించెను. కాని యది లభ్యముకాలేదు. ఈతఁడే "జితపురత్రయ దనుజేశ శ్రీగిరీశ" అను మకుటముతో నొక సీసపద్యశతకము రచియించి యున్నాఁడు. అందుండి యొక పద్య ముదాహరించుచున్నాను.

సీ. శ్రీనాథలోచన శ్రితపద్మపూజిత భాసు రాసుర ముని ప్రకర వినుత
కైవల్యపదభాస కైలాసగిరివాస ప్రమథనికాయేశ పాపనాశ
ఘనతరంగతరంగ గంగానదీజూట కమనీయతర సుధాకర కిరీట
భోగీంద్ర కేయూర భూధరసంచార నిఖిలలోకాధార నిర్వికార

గీ. ధవళవర్ణాంగ మిమ్మాత్మఁదలఁచి మీకు సీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు
శంభు సకలేశ యచలేంద్రజాసతీశ! జితపురత్రయ దనుజేశ! శ్రీగిరీశ!

ఈ శతకము సంపూర్ణముగఁ గలదు - ముద్రితము కాలేదు. (సంఖ్య - 1784 - 85). మఱియు నితఁడే వైష్ణవ

గ్రంథమగు శ్రీరంగమహాత్మ్యమున రచియించెను. అందుండి నాల్గు పద్యములు ప్రబంధరత్నాకరమున జగ్గన యుదాహరించి యున్నాఁడు. శైవుఁడగు రామలింగకవి రామకృష్ణుఁడై వైష్ణవ గ్రంథములు రచియించినట్లు మనకు తెలియుచున్నది - బహుశః ఆతఁడు, తన తాత, శైవ వైష్ణవ గ్రంథరచన చేసిన పద్ధతినే యనుసరించి యుండును. కాలము క్రీ.శ. 1500 ప్రాంతము.

## తాళ్లపాక పెదతిరుమలయ్య

ఈతఁడు తన తండ్రి రచించిన వేంకటేశ్వరశతకము ననుసరించి, వేఱొక వేంకటేశ్వరశతకమును రచించినాఁడు. అదియును శృంగారమయమే. అన్నమయ్యగారు శృంగార రససందర్భము ననుసరించి, చంపకోత్పలమాలికలనే యుపయోగించినారు. కాని పెదతిరుమలయ్యగారు మత్తేభ శార్దూలములను వాడిరి. అప్పుడు "వేంకటాద్రీశ్వరా" అను మకుటము వాడిరి. మచ్చునకు-

మ. కలరా నా కిల రాము లెవ్వారయినం గా రీడుగా జోడుగా
గలరా నీ వలరాజుఁ బూనుకొను మింకా ఘూసవాం కానవా
వలగా జవ్వలరాయ డించుఁగ సటల్ దష్టలగా! యేలగా!
కొలరా కాఁకలరాఁపుఁ జేసి నను నీకుఁ వేంకటాద్రీశ్వరా!

ఉ. యవ్వని కోమలాంగి మఱి యవ్వనితామణి నిన్నుఁ జూడరా
దవ్వని పోడు నీవలపు దవ్వని పాటిక లేదు ముగ్ధ వా
కుర్రివ్వని కాంత శీవి మోడఁ గుర్రివ్వని పేరుగఁ దాల్చు మెప్పగుం
దెర్రివ్వని బాంధవంబు లెడతెర్రివ్వని దేఁటికి వేంకటేశ్వరా!

# ద్వితీయ భాగము

## ( క్రీ. శ. 1500—1600 )

## చిత్రకవి పెద్దన

ఈతఁడు చిన్నతనమున తన యిష్టదైవమగు హనుమంతుని పేర నొక శతకము రచియించినట్లు తన లక్షణసారసంగ్రహమున నిట్లు చెప్పుకొన్నాఁడు.

"మున్నొక శతకము మారుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి వికనున్
సన్నుత లక్షణ కృతి య
స్మన్నామాంకితము సేయుమా! యిపు డనినన్"

ఈ శతకము దొరకలేదు. కాని యప్పకవి యుదాహరించిన మరున్నందనశతక మిదియే యని శ్రీయా వఱకు నిరూపింపఁబడినది. ♦

## సిద్ధరామకవి *

సిద్ధరామశతకకర్త యగు సిద్ధరామకవి తాను కేదారదేశిక శిష్యవర్యుఁడ నని వ్రాసికొన్నాఁడు.

"లీలకేదారదేశిక శిష్యవర్య నాదు హృదయాబ్జ కర్ణికఁ బాదుగొన్న"

♦ చూడుఁడు— లక్షణసారసంగ్రహపీఠిక — ని. వేంకటరావు.

* ఈ కవి చరిత్రము శతకకవుల చరిత్రము తృతీయ భాగములో నున్నది.

అను వాక్య మింధుల కాధారము. ఈ కేదారదేశి కుఁడు శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యాన కృతికర్త యగు బాచయకు గురువు. మఱియు నద్దంకి గంగాధరకవికి గురువు. ఈ యిరువురు శిష్యులును క్రీ. శ. 1530 – 1580 ప్రాంతము వారు. కావున సిద్ధరామకవియు పదునాఱవ శతాబ్దివాఁడు. కావున ద్వితీయభాగములో చేర్చఁదగినవాఁడు.

# వేగినాటి కొండయ

(క్రీ. శ. 1600)

ఈతఁడు వివేకసింధు వను వేదాంత విషయకప్రబంధ మునేగాక దత్తయోగీంద్రశతక మను పేర తన గురువగు దత్తాత్రేయునకు నంకితముగా నొక సీసపద్య శతకమును రచించి యున్నాఁడు.

దాని మొదలు:—

సీ॥ శ్రీకరాకార శాశ్వత నిత్యపరిపూర్ణ
ఆనందయోగవిద్యావిహార
రూపవిక్రమ కళాపేపప్రకాశ యో
గాధ్యక్ష యోగికులావతంస
నారదస్తుతపూర్ణసారాంచితవినోద
కరుణాకటాక్షవీక్షణవిహార
భూతిలేపన జగత్పూర్ణచారుచరిత్ర
సకలలోకాధార సగుణరూప

గీ॥ పరమపావనమహనీయభవ్యరూప
విశ్వసన్నుత యోగీంద్రవినుతలోల
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్య!

శతకాంతమునం దున్న పద్యము:—

సీ. పరతత్త్వ వాచ్యార్థ భావంబు లన్నియు
వేర్వేర నొక్కొక్క విధముగాఁగ
సీసపద్యంబుల జెలువొంద శతకంబు
చెప్పితి సత్కవి శ్రేష్ఠు లలర
పరమదత్తాత్రేయ గురునంకితంబుగా
నా నేర్చు విధమున నవ్యముగను
వేగినాటికులాబ్ధివిధుఁడను బండ్లపు
ల్లన్వయు డను నాగయప్రధాన

గీ. సుతుఁడ శ్రీవత్సగోత్రుఁడ సుకవి కొండ
ధన్యుఁడ వెలయ నాచంద్రతారకముగఁ
జిరశుభాకారమోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవర్య.

ఈ శతక మంతయు వేదాంతపరమైనది.

# ముమ్మడి మల్లనార్యుఁడు

ఈతఁడు రామస్తవరాజ మను వేదాంతగ్రంథమును రచియించి ప్రసిద్ధికెక్కినవాఁడు. ఈతని శతక కృతులు రెండు లభ్యములైనవి.

(1) "కృష్ణసచివునిమల్లా" అను మకుటముతో నొక కందపద్య శతకము. ఇం దేబదియేడు పద్యములు మాత్రమే లభించినవి. ఈతఁడు వేమన మొదలగు వేదాంతులవలె తన్ను తాను సంబోధించుకొనును. ఇది వేదాంత విషయమే.

కం. బంగరు నిగ్గుం బలె ప్రియ
వాంగన భ్రూమధ్యమందు నణువగు దానిన్
అంగజు కేళిం దనిపిన
సంగతి ముక్తెల్లఁ గృష్ణసచివునిమల్లా.

(2) ముక్తికాంతాప్రియ శతకము.

ఇది మత్తేభ శార్దూల వృత్తములతో రచితమైనది. మధ్య తండ్రియగు కృష్ణసచివుని పేరు విడువబడినను, కొన్నింటి యందుఁ గలదు. మఱియు నిందు ధేనువుకొండ తిమ్మయ గురుప్రశంసయు నిది మల్లనార్యకృతమని స్పష్టము చేయుచున్నది. రామస్తవరాజమునం దీతఁడు పేర్కొనబడినాఁడు.

శా॥ శ్రీకారుణ్య మహానుభావ విజయ శ్రీ................
శ్రీకళ్యాణ నిజాశ్రితాభిమత శ్రీ వేదవేదాంత వి
ద్యాకౌతూహల భోగమోక్ష సుఖదీర్ఘాయుల్ దయన్ మిమ్మిటుల్
మాకున్ ముమ్మడిరాజు కృష్ణఘనుమల్లా! ముక్తికాంతాప్రియా!

శా॥ శ్రీమద్ధేనువుకొండ తిమ్మగురునిన్ శ్రీరామపట్టాభిషే
కామోదంబున భోస..................దాసగ్రిహ
శ్రీమూర్తిన్ సురమాని నాత్మగ మదిన్ సేవించి యోగీశ్వరుల్
స్వామీ ముమ్మడిరాజు కృష్ణఘనుమల్లా ముక్తికాంతాప్రియా!

———

# తృతీయ భాగము

## ( క్రీ. శ. 1700—1800 )

## మంచెళ్ల కృష్ణకవి

శతకకవుల చరిత్రమం దీతని శతకమొక్కటియే యుదాహృతమైయున్నది. "వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!" అని దీని మకుటము. ఈ తరువాత నాతని శతకము వేఱొకటి "పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్" అనునది లభించినది. ఈ రెండింటిని ఆంధ్రసాహిత్యపరిషత్తువారు శతకసముచ్చయము ప్రథమ భాగమున ప్రథమ ద్వితీయ శతకములుగా ముద్రించినారు. (1931)

వేంకటనగాధిపశతకము చివర కృష్ణకవి తా నైదు శతకములు రచియించినట్లు చెప్పియున్నాఁడు.

ఉ॥ పూరుషముఖ్య, రంగ, రఘుపుంగవ, వేంకటనాథ కృష్ణ శ్రం
గారక థాళి నైదు శతకంబు లొనర్చి తటాక బాహ్యధా
త్రీరుహముఖ్యసంతతులు ప్రేమ నొనర్చి యొసంగి నాఁడ సొం
పార గ్రహింపు వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ!

ఈపద్యము శ్రీ సుబ్బారావుగారు చూచిన ప్రతిలో లేనట్లున్నది. ఉన్నచో వారు దీనినిగూర్చి తప్పక పరిశోధన చేసి యుందురు.

పై యైదింటి వివరము.

(1) పూరుషముఖ్యశతకము. ప్రస్తుతము ముద్రితమైనది. ఇం దన్నియు నుత్పలమాలా వృత్తములు-రేఫప్రాస.

ఉ. కోరి కుచేలుచేతి యడుకుల్ కొడితెండు భుజించిన ట్లొగిం
జేరుకొనంగఁ గృష్ణసుకవి ప్రవరుండు రచించి భక్తిఁ బూఁ
జేరుగ నిచ్చినట్టి రసవిభ్రమితోత్పలవృత్తపద్యముల్
నూఱును నెమ్మదిం గడు ననుగ్రహబుద్ధిఁ బరిగ్రహించె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్

(2) రంగశతకము - ఇదియును నుత్పలమాలికాశతకమే. "రంగశాయి మనపాల గలండు విచారమేటికిన్" అను మకుటము గలది. రసోత్తరమైన రచన గలది. కవిపేరు గల పద్యము లోపించుటచే గ్రంథముద్రాపకులు దీనికర్తృత్వము నిరూపింపలేకపోయిరి. కృష్ణకవి వ్రాసిన శతకము లన్నియు చంపకోత్పలమాలికలతో గూడినవి. ఈ శతకము నట్టిదే. రచన కృష్ణకవి యితర శతకరచనలతో సమానముగ నుండి కొన్నిచోట్ల మెఱుఁగులుఁ జూపుచున్నది. కృష్ణకవియు రంగశతకము తన రచనగా చెప్పుకొనుటచే నిది యాతనికృతియే యని నిశ్చయింపఁదగును. ఇది చాల వ్యాప్తిఁ జెందినది.

ఉ. సింగపుమోమువాఁడు, తులసీదళదామమువాఁడు కామినీ
రంగదురంబువాఁడు, పలరాయనిఁగాంచినవాఁడు భక్తిక
ప్పొంగెడువాఁడు దానవుల పొంక మడంచెడువాఁడు నేఁడు మా
బంగరు రంగశాయి, మనపాల గలండు విచారమేటికిన్.

ఉ. ఆలికి యల్లుఁడై, పిదప యల్లునికిం దగ దానె యల్లుఁడై
ఆలికి తండ్రియై మనుమరాలికి పెండ్లి కుమారుఁడై సదా
ఆలి మఱంది చెల్లెలికి నాపతియై కడుగూర్చునట్టి గో
పాలుఁడు రంగశాయి, మనపాల గలండు విచారమేఁటికిన్.

(3) రఘుపుంగవశతకము లభింపలేదు.

(4) వేంకటనాథశతకము వేంకటనగాధిపతిశతకమే!

(5) కృష్ణశతకము - ఇదియే కృష్ణకవి ప్రణీతము అని శతకసముచ్చయమున ముద్రితమైన 7 వ సంఖ్య - వరదరాజ శతకము. ఇది యేకప్రాసమకుటము గల చంపకమాలికావృత్త శతకము — శతకాంతమున

"వరగుణశాలి బాలయకు వారిజలోచన లక్ష్మమాంబ కే
వరతనయుండఁ గృష్ణకవి వైభవ మొప్పఁగ వృత్తపద్యముల్
సరవి రచించితి న్సుకవిసంఘము మెచ్చఁగఁ బ్రోవు నన్ను మం
దరధర కుంద సుందరరదా వరదా మురదానవాంతకా"

అని కలదు. ఇందు కృష్ణకవి తాను బాలయకు లక్ష్మమాంబకుఁ బుత్రుఁడ నని చెప్పుకొన్నాఁడు. శ్రీ సుబ్బారావుగారు శతకకవులచరిత్రమున చతుర్థభాగమున "బాలకృష్ణకవి" అను పేరితో నీ శతకకవిని నుదాహరించియున్నారు. బాలయకొడుకు కృష్ణకవి గావున బాలకృష్ణకవి యని వ్రాసియున్నారు. పరిషత్తువారు కృష్ణకవిప్రణీత మనియే వ్రాసియున్నారు. కృష్ణకవి "భ్రాజిత మంచెళాన్వయుఁడ బాపయమంత్రి తనూజుఁడన్ భరద్వాజసగోత్రజుండ ప్రియభ

క్షుఁడ కృష్ణకవిఁ" అని తన్నుఁగూర్చి వేంకటనగాధిపశతకములోఁ జెప్పుకొని యున్నాఁడు. ఇచ్చట "బాపయ" అనునది వరదరాజ శతకములో బాలయగా లేఖనప్రమాదమునఁబడి యుండవచ్చును. క్రీ.శ. 1862 లో ముద్రితమైన ఈశతకము అట్టిప్రతిని బట్టి ముద్రితము గావచ్చును. కాగా కృష్ణకవి తండ్రి 'బాపయ' అని తల్లి లక్ష్మమ్మ అని నిశ్చయింపవచ్చును. తల్లి పేరు చెప్పిన శతకమిదియు కావచ్చును.

పై పరిశీలనమువలన కృష్ణకవి వ్రాసిన శతకములలో నాల్గు లభించినవి. తెలుఁగు శతకకవులలో నీతఁడొక ప్రత్యేకస్థాన మలంకరింపఁ దగినవాఁడు.

## అమలాపురపు సన్యాసి



ఈ కవి చరిత్రము శతకకవుల చరిత్ర - చతుర్థభాగములో నున్నది. ఇతఁడు కులాల కులజుఁడు (కుమ్మరి).

ఈతఁడీ క్రింద వివరించిన శతకములనే కాక మూఁడు ప్రబంధములను రచియించి యున్నాఁడు. మూఁడును శైవ మతమునకు సంబంధించినవి.

(1) రుద్రాక్ష మహాత్మ్యము (2) సోమవారవ్రత మహాత్మ్యము (3) కుమ్మరి గుండయ్య కథ.

రుద్రాక్షమహాత్మ్యము - మూఁడాశ్వాసముల ప్రబంధము - దీనికి రుద్రాక్షఫలమహాత్మ్యము అను నామాంతరము గలదు.

సోమవారవ్రత మహాత్మ్యము - శైవులకు ముఖ్యమగు సోమవార వ్రత విధానము, తన్మహాత్మ్యమును దెలుపునది. మూఁడుఆశ్వాసములు

కుమ్మరి గుండయ్య కథ. అరువత్తు మువ్వురు నాయనారులలో నొకఁడగు తిరునీలకంఠనాయనారి చరిత్రము. అమలాపురపు సన్యాసికవి కుమ్మరివంశీయుఁడే గాన తన పూర్వులలో మహాభక్తుఁ డగు నీతని చరిత్రను మూఁడాశ్వాసముల పద్యకృతిగా రచించెను. ఇదిగాక కిమ్మూరి జగన్నాథరాజు సమక్షమున సర్వాంధ్రసారసంగ్రహ మను నిఘంటువును వ్రాసియున్నాఁడు.

## శతక కృతులు.

(1) కాశీవిశ్వనాథశతకము – అమలాపురపు సన్యాసి 116 సీసపద్యములు

"భూరిగుణయూథ కాశికాపురసనాథ
విదళితామర్త్యరిపుయోధ! విశ్వనాథ!" అను మకుటము.

(2) ముఖలింగశతకము – కందపద్యములు – ద్విప్రాస 108 పద్యములు – "శ్రీముఖలింగా అను మకుటము.

(3) పంచముఖేశ్వర ప్రభు శతకము – ఉత్పలమాలికలు – 109 పద్యములు – "పంచముఖేశ్వరప్రభూ" అను మకుటము.

(4) గౌరీరమణశతకము – కందపద్యములు – "గౌరీరమణా" అను మకుటము. ఏకప్రాస – (ల ప్రాస).

(5) శివశతకము – "శివా" అను మకుటము – దుష్కర ప్రాసములు – 128 కందములు.

(6) పంచముఖేశలింగద్వాత్రింశత్తు – 32 సీసపద్యములు

"భుజగకేయూర! సాలూరు పురవిహార
ఈశ భవభంగ! పంచముఖేశలింగ!" అను మకుటము.

(7) యోగావళి – 30 పద్యములు – 'శ్రీరామేశా' అను మకుటము – కందపద్యములు – యోగవిషయము.

ఈతనిఁ గూర్చి తుమరాడ పాపకవి యను నామాంతరముగల పాపయ్యశాస్త్రి వ్రాసిన సీసమాలిక నిందుఁ బొందుపఱచుచున్నాను.

అమలాపురపు సన్యాసికవిని గూర్చి చెప్పిన సీసమాలిక.

సీ. శ్రీమన్మనీషావిశేషంబు చెలువొంద భూమీజనస్తుత్య భూరికీర్తి
ప్రకటింపుచు గిరీశ పాదారవింద నిష్యందమాన లసన్మరంద బిందు
బృందపానానంద దిందిందిరాత్ముఁడ వగుచు సద్భక్తి నిరంతరంబు
ననవద్య గద్యపద్యాంకిత వరసుధారస హృద్యహరకథా శ్రవణమునను
వీనులం దనుపుచు విబుధసంఘంబులు భళిభళి యని వేడ్కఁ బ్రస్తుతింప
లలితమౌ నాటకాలంకార సాహితీ చతురవైభవ మెల్ల సంగ్రహించి
సకలజనామోద సంధానకరమైన లలితాంధ్రభాషావిలాసమూని
గోస్తనీపరిపాక కోమల కవితా చమత్కార భూరి సామర్థ్య మొనర
విద్యల నన్నింట వెలయంగ జాణవై ధర్మైకవిపుల తాత్పర్య మొప్ప
గౌరీపురీశ విశ్వేశసందర్శనావాప్త చతుర్విధోద్యత్ఫలుండ
వఖిల పవిత్రాధికంబగు నిత్యసోమవారవ్రత దీక్షాధురంధరుఁడవు
గంగాతరంగిణీ కవితావగాహన పరిహృతాఖిల జన్మ పాపతతివి
మణికర్ణికా మహోన్మజ్జనైక విశేషపావనీ భూత సర్వావయవుడ

గీ. వగుచు చెల్వొందితౌ భళీ జగమునందు
గీర్తి పౌరుష విజ్ఞాన పూర్తి గలిగి
శ్రీమదమలాపురాన్వయ సోమసుగుణ
ధామ సన్యాసినామ విద్వల్లలామ॥

— తుమరాడ పాపన్న శాస్త్రి (R. 581. P. 86)

# పోచిరాజు వీరకవి

ఈ కవి చరిత్రము, శతకకవుల చరిత్ర - తృతీయభాగమున నున్నది. పోచిరాజువారు శాండిల్యగోత్రులు - వీరకవి వంశము.

పోచిరాజు భద్రనమంత్రి భార్య యెల్లాంబ.




---

విభూతి రుద్రాక్షమహాత్మ్యము (ద్విపద) యొక్క కృతిపతి వంశము.

కాశిక గోత్రము - శ్రీపతి పండితారాధ్యుల నాగలింగారాధ్యుఁడు



భావనాఋషిమహాత్మ్యము (పద్యకావ్యము) లోఁ బైని చెప్పిన వంశక్రమము చెప్పి తన రచనలను గూర్చి యిట్లు చెప్పియున్నాడు.

క. అభవప్రసాదకరుణా
విభవమ్మున తెనుఁగుఁగాఁగ విరచించితి సౌ
రభయుక్తి పంచకావ్యము
లుభయకవీశ్వరులు మెచ్చ నుచితస్ఫూర్తిన్.

సీమంతినికథ (ద్విపద) శ్రీపతి పండితారాధ్యమహాదేవకవి రచితము - బెజవాడ మల్లీశ్వరస్వామికి కృతి.

# వేల్పూరి విస్సన్న - సాంబశివకవి

క్రీ.శ. పదునేడవశతాబ్ది ఉత్తరార్థమున మొగలాయి చక్రవర్తులలో చివరవాడగు అవురంగజేబు శ్రీ కాశీక్షేత్రముపై దండెత్తి, విశ్వేశ్వరాలయము ధ్వంసము కావించి అచ్చోట మసీదు కట్టించెను. కాని తరువాత విశ్వేశ్వరాలయము తిరిగి నెలకొల్పఁబడినది. అవురంగజేబు దండెత్తి ధ్వంసము చేయునపుడు వారిని పాఱద్రోల వేల్పూరి విస్సన్నకవి విశ్వేశ్వరునితో మొఱపెట్టినాడు. అదియే విశ్వేశ్వర శతకము - సీసపద్యములు. మొదటి 73 విస్సన్నకృతి. ఆ పై పద్యములాతని యినుమనుమఁడగు సాంబశివకవి రచించెను.

"విజితపరయూథ కాశికావిశ్వనాథ" అను మకుటము గల సీసపద్యశతకము. కృతిరచన ప్రమాదీచ సంవత్సర శ్రావణ శు ౬ మంగళవారము.

## శ్రీవిశ్వేశ్వరశతకము

సీ॥ శ్రీకర గౌరీవిచిత్రపత్రాలేఖ
భాసురాంచన్నఖ బహుపరాకు
బహుతర బ్రహ్మాండ భాండ సంరక్షణ
భద్రాసనాసీన బహుపరాకు
ప్రణుత దిక్పాలకోద్భట జయజయనాద
లహరీముఖామోద బహుపరాకు
రంభోర్వశీ ముఖ్యరమణీ రసోచిత
ప్రకట లాస్యాలోక బహుపరాకు

గీ. దేవ యవధారు బహుపరాకే వహించి
యుంట దగునయ్య యిపుడు నీ బంట నేను
విన్నవించెద నా మాట విన్న లెస్స
విజితపరయూథ కాశికావిశ్వనాథ!

సీ. శ్రీకాశికానగరీ మహాసామ్రాజ్య
సింహాసనం బధిష్ఠించఁగలవె?
అవధారనుచు వేత్రహస్తు లెచ్చరికింప
ఒడ్డోలగంబయి యుండఁగలవె?
సమయమా యిది పద్మసంభవాదులకను
కంచుకి పలుకు లాలించగలవె?
జగదంబయైన విశాలాక్షి ముందట
నలరుచుఁ దాండవం బాడగలవె?

గీ. ఆబరించుకో యవ్వురంగజేబు మూఁక
వెల్లివిరిసెను నీదు దోర్విక్రమంబు

మాపి యతివేగమున రూపుమాపకున్న
విజితపరయూథ కాశికావిశ్వనాథ!

ఇది వైరిహరరంహ సింహాద్రినారసింహ శతకమును బోలినది. 73 పద్యములు కాగానే కాశీపట్టణమునుండి యవురంగజేబు సైన్యము తొలఁగిపోయినది. అక్కడనుండి యాతని యినుమనుమఁడు సాంబశివకవి శతకమును పూర్తి చేసియున్నాఁడు. (R. 573)

## కొమట్రాజువారి వంశము

భారద్వాజ గోత్రము

కొమట్రాజు

శంకరుఁడు (బుచ్చమ్మ భార్య)
(ఈతడు ముదిగొండ వీరభద్రగురుని శిష్యుడు)
(శ్రీశైలమునకు మూడుమాఱులు ప్రదక్షిణముచేసినవాఁడు)






# కొట్ర బాలకవి

ఈతఁడు సుప్రసిద్ధుఁడగు నడిదము సూరకవి సమకాలీనుఁడు. ఈతఁడు రచించిన "ఇల్లమనాయకేంద్రశతకము" ఇల్లమనాయఁడను నొక గొప్ప భూస్వామినిఁ గూర్చినది.

"అరికరిమృగేంద్ర! చీడికులాబ్ధిచంద్ర!
నవ్యగుణసాంద్ర! ఇల్లమనాయకేంద్ర!

అనుమకుటము గలది. ఇది శ్రీకృష్ణుని శృంగారవిలాసవర్ణనపూర్వకముగా నాయకుని యాశీర్వచనముతో ముగియును. చక్కని తెలుఁగు పలుకుబడిచే హృద్యమైన దీ కృతి - విశాఖమండలమున రాజాము వద్ద నున్న యిల్లంనాయని వలస యీ శతకనాయకుని పేర వెలసినదియే.

## ఇల్లమనాయకేంద్ర శతకము

సీ॥ సిరులపైకమ్ముల సిరులఁ బిసాళించు
జిడ్డు సంద్రము పుట్టు దొడ్డ కెంపు
కన్నులసింగాణి మన్నీనిఁ గన్న కెం
దలిరుటాకులబోడి గలవెడంద
జొమ్ము నీలపుఁజాలు తమ్మి కెంపుల మాని
కాలు పచ్చల పుల్గురాలు మూల
రాలు గీలుకొలుపు మేలిమి బంగరు
సందికడెములఁ బెంపొందు నలుబు

గీ॥ జములు ధరియించి దేవకీసతికిఁ బొడము
చిన్నికృష్ణుఁడు నీ కిచ్చు సిరులగములు
అరికరిమృగేంద్ర! చీడికులాబ్ధిచంద్ర!
నవ్యగుణసాంద్ర! యిల్లమనాయకేంద్ర!

సీ॥ అంభోజినీపరిరంభణ క్రియచేతఁ
గొఱలుచునుండెడి కువలయారి
క్షణదానితంబినీ మణిసుఖవారాశి
నోలాడుచున్న మహోత్పలారి
సకలగీర్వాణసంచార విభ్రాజిత
సానుకులాచల సంచయంబు
వివిధపయోరాశి వేష్టిత నవఖండ
మండితంబగు మహీమండలంబు

గీ॥ నెంతకాలము సుస్థితి నిరవునొందు
నంతకాలంబు నీ కృతి యలరుఁగాక
అరికరిమృగేంద్ర! చీడికులాబ్ధిచంద్ర
నవ్యగుణసాంద్ర! యిల్లమనాయకేంద్ర.

ఈ యిల్లమనాయని పేర వెలసిన గ్రామమే "యిల్లంనా

యుఁడువలస'' విశాఖమండలమ్మున, చీపురుపల్లి తాలూకాలో రాజాము దగ్గఱ నున్నది. గ్రంథకర్త గ్రామముకూడ నిదియే. ఇందు 133 పద్యములు గలవు. (R 419)

## ప్రయాగ కామేశ్వరకవి

ఈతఁడు 'భద్రాచలధామ' శతకమును రచియించెను. "భద్రాచల ధామా రామ నీలజలద శ్యామా" అను మకుటము గల కందపద్యశతకము. ఇందు 102 పద్యములు గలవు.

మొదలు:-

క. మొల నూలు పైఁడి గంటలు
గలుగల్లన కౌశికుని మఘముఁగాచుటకై
విలువూనిచనవె భద్రా
చలధామా! రామ! నీలజలదశ్యామా!

తుది:-

క. స్థిరమతి ప్రయాగ కామే
శ్వరకృత ల పాద్రిస కందశతకము నరులే
వ్వరు చదివి రేని వారికి
సరవిన్ సిరు లీర భద్రిశైల విహారా!

శతక మముద్రితము.

# భల్లా పేరయకవి

( క్రీ.శ. 1770 ప్రాంతము )

తెలుఁగు దేశమున సింహాచల క్షేత్రమున తురకల హాళాహాళి కలిగినపుడు, గోగులపాటి కూర్మనాథకవి, సింహాద్రినారసింహాశతకమును జెప్పి వారిని తరిమివేయించి నట్లు మనకు ప్రత్యక్ష ప్రమాణము లున్నవి. అట్లే పెద్ద తిరుపతిపై తురకలు దండెత్తినపుడు, మఱియొక కవి "శత్రుసంహార వెంకటాచలవిహార" అను శతకమును జెప్పి వారిని తరిమివేయించినాఁడు. (ఈ శతకమునందలి పద్యములను, గోగులపాటి కూర్మనాథకవి చరిత్రలో సుబ్బారావుగా రుదాహరించి యున్నారు.) చాటరాతి లక్ష్మనరసకవి భండనారాతిభీమశతకము, వేలూరి సాంబశివకవి విశ్వేశ్వరశతకము నిట్టివే.

ఇట్లే క్రీ.శ. 1769–70 ప్రాంతమున భద్రాచలముపై తురకలు హడావడి చేసి, దండెత్తినప్పుడు భల్లా పేరయకవి ఆ యాపద తప్పింప భద్రాచల రాముని వేడుకొనుచు భద్రగిరి శతకమును రచియించినాఁడు. ఇది యీజాతి శతకముల వలె సీసపద్యశతకము. తొలుత భగవంతుఁ డూరక యుండెనని నింద, ఆపైని యాతని యనుగ్రహము కలిగిన వెనుక స్తుతి, యీ శతకములలో సాధారణముగఁ గన్పట్టును. ఇవి సాధారణముగా. పరాకుతో ప్రారంభించును.

సీ॥ పద్మభవస్తోత్ర పావనచారిత్ర పంకజదళనేత్ర బహుపరాకు
దైతేయశిక్షణ ధర్మవిచక్షణ భక్తసంరక్షణ బహుపరాకు
వారిధిబంధన వరభక్తచందన, భరతాది వందన బహుపరాకు
తాటకభంజన తాపసరంజన పరమనిరంజన బహుపరాకు

గీ. భద్రగిరినుండి వచ్చు నీపౌరుషంబు
విశ్వవిఖ్యాతి సేయక విడువనింక
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

మహాభక్తుఁడగు భద్రాచలరామదాస పోషకుఁడని దైవమును స్తుతించుటచే నీకవి రామదాసభక్తుఁ డని స్పష్ట మగుచున్నది. ఆనాఁ డింగ్లీషువారి పాలనలో నవాబు హాయాములో నెట్టి పరిస్థితు లుండెడివో యీ శతకమువలనఁ దెలియనగును. అచ్చటచ్చట "అక్బదుబ్ఖై, బాహాసేన్ యూహాసే, పీర్లు" మొదలగు తురకపదము లుపయుక్తములై నవి. భద్రాచలదేవాలయము తురకలపాలైనది యిఁక తురక మత మవలంబింపఁదగునని కవి వ్రాసిన నిందాస్తుతి మనస్సునకు చులుకుగాఁ దగులుచున్నది.

సీ॥ భరతాది సహజన్ము నరులకు నీపాటి
"ఫారసీ" చెప్పించు పంత ముడిగి
వ్యాసాది మునిగణ ప్రతతికి నెలను "ఖు
రాన్" చదివింపఁ దలంపుసేయు
పరగ నింద్రాది దిక్పాలక శ్రేణికి
నెటి "నమాజులు" సేయు నేర్పు నేర్పు
వారింపలేవు నాళ్వారాదులకు వేగ
"సున్నితీల" ప్రియత్న మెన్నఁజేయు

గీ॥ చేయకుండిన తురకలు చెడుగు వాండ్రు
హద్దువిడివచ్చి రింక మీా రాఁగలేరు ॥ భద్రి ॥

విజయసంవత్సరమున నీ తురకల యలజడి పోయి శ్రీరాముఁడు భద్రగిరి యందు పట్టాభిషిక్తుఁడైనట్లు కవి యిట్లు శతకాంతమున వ్రాసి యున్నాఁడు.

సీ॥ సర్వధా రను పేర సంవత్సరంబున
ధంసాను వెలిచి యిద్దరికి వచ్చి
పోలవరంబులోఁ బొలుపొంద నైదేండ్లు
వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయమతయుతు సంహార మొనరించి
మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయఁ
దగ పూసపాటి సీతారామరాజు వి
జయరామరాజుల సరసముగను

గీ॥ విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరి శేరి తౌనయ్య భద్రముగను
భద్రగిరి వాస శ్రీరామభద్రిదాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

ఇది పదునెనిమిదవ శతాబ్దినాటి యాంధ్రదేశపరిస్థితులను దెలుపు చారిత్రకశతకము. సుప్రసిద్ధ చరిత్రకారులు, శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు దీనినిఁ గూర్చి భారతిలో వ్రాసిరి.

# కూచిమంచి తిమ్మకవి

తిమ్మకవి నిరర్గళకవనధారాపారీణతను నాతని శివ భక్తిని నిరూపించు మఱిరెండు శతకము లాతనివి మనకుఁ జేకూరినవి.

1. భర్గాపార్వతీవల్లభా! అను మకుటముగల శతకము.
2. చిరవిభవశతకము.*

"చిరవిభవా భవా విజితచిత్తభవా యభవా మహాభవా!" అను మకుటము గల ఏకప్రాస చంపకమాలికలు.

మొదటి శతకమునుండి మచ్చునకు—

పురుహూతాగ్నిప రేతరాట్టలభుగంభోధీశ వాతార్థపాం
బరకేశాబ్జభవాచ్యుతాదిక మహాబర్హిర్ముఖానీక భా
స్వరకార్తస్వర విస్ఫురన్మకుట శశ్వత్పద్మరాగప్రభో
త్కర నీరాజిత పాదపంకరుహ! భర్గా పార్వతీవల్లభా!

జనసంస్తుత్య మహాప్రబంధఘటనాసామర్థ్యముం గల్గి స
జ్జను లత్యల్పులు దీనతంబొగడుటల్ జాత్యంధతం జెంది కా
కనుపొప్పన్ దమ రెన్నడుఁ సుకవితా యద్యస్తి రాజ్యేనకి
మ్మను వాక్యంబు వినంగ లేదొ మును భర్గా పార్వతీవల్లభా!

ఈ శతకరచనాకాలము క్రీ. శ. 1729.

చిరవిభవశతకము—

తరలనిభక్తి నా హృదయతామరసంబున సంస్మరింతు దు
ర్భరదురితాంధకార విసరప్రసరన్నళినీసుహృల్లస

---

* శతకవాఙ్మయసర్వస్వములో కూచిమంచి తిమ్మకవి చరిత్ర 174 - 200 పుటలలో చిరవిభవశతక ప్రశంసయే లేదు.

త్కారణములైన దెందులూరి దివ్యకులోద్భవు లింగనార్య స
ద్గురుచరణంబు లుగ్రభవతోయధిసంతరణంబు లెప్పుడున్
చిరవిభవా! భవా విజితచిత్తభవా! యభవా! మహాభవా"

దీనిని బట్టి యొకపాదమంతయు మకుటమగుటచే — దీనిని పంచపాది వృత్తముగాఁ దలఁపరాదనియు, సంబోధనయే కావున యెంతపెద్దది యున్న నది పాదముగా పరిగణిత మగుటకు వీలులేదనియు విమర్శకాభిప్రాయము. 101 పద్యములు.

## కూచిమంచి జగ్గకవి

ఈతఁడు కూచిమంచి తిమ్మకవి సోదరుఁడు. తిట్టు కవిత్వమునకు హాస్యరచనకు పేరుపడ్డవాఁడు. చంద్రరేఖావిలాప రచనకుఁ గర్త. ఈతఁడు "రామా భక్తమందారమా" అను శతకము వ్రాసినాడు. ఇందలి శైలి యనర్గళము.

ధాటీపాటవచాటు కావ్యరచనోద్యద్ధోరణీసారణీ
వ్యాటీకోద్గత సత్కవీశ్వరుఁడు నిత్యంబుం దమున్ నేడగా
వీటీఘోటకహాటకాదులిడ రుర్విన్ నిర్దయాబుద్ధిచే
మాటే బంగరు నేఁటి రాజులకు రామా! భక్తమందారమా!

ఈ శతకము ముద్రితమైనది.

## శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి

అభినవభట్టుమూర్తి మహోద్దండకవి యగు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి 'వాయుపుత్ర' శతకమును రచియించి

యున్నాడు. "వారిరుహబంధుసుతమిత్ర! వాయుపుత్ర" యను మకుటము గల సీసపద్యశతకము. ఇందు సంస్కృత సమాసభూయిష్ఠము లగు పద్యములు, అచ్చ తెలుఁగు పద్యములు - అంత్యప్రాస - సర్వతఃప్రాస - ముక్తపదగ్రస్త - వృత్త్యనుప్రాసాలంకారపద్యములు గలవు. అధునాతన శతకములలో మిక్కిలి ప్రౌఢమైన రచన గలది. ఏకసమాసపద్య రచన — మచ్చునకు

సీ॥ శల్కితశంకుకాశరజాత సంస్ఫోట నీరేకపంకాంధభారకాక
నగలోమబకిరాతినందన శోభావిజితలంక సుఖకూట జిద్ధభీర
తాపాలిభగ్నోనలాపాతజీర్ణధితాక్షుకంజత్వాత్పడవనిసంస్థ
హావభోజతేజోవిభవ మలిమ్లుచలపితగుణాదిజాత సంతతవశాంక

గీ॥ ప్రాణితసదృక్షుగాంధర్వఫణితసత్రి హరిణరింభోళికాగ్రియసురకులప్రి
కాంచబధ్నవితర్దికాకలితకూట! వారిరుహబంధుసుతమిత్ర వాయుపుత్ర!

## నిమ్మల లక్ష్మణార్యుఁడు

ఈ కవి చరిత్రము 426 వ. పేజీలో నున్నది. ఈతని ఏకామ్రలింగశతకమున "మొగలాయి దెబ్బకే మునిగె నీ పనులెల్లఁ దగఁ బార్థు దెబ్బకుఁ దాళితెట్లు" - అను పాదము వలన మొగలాయీల ప్రశంస యుందుండుటచే నీతడు క్రీ.శ. 1680 ప్రాంతమున జీవించి యుండవచ్చును. మొగలాయిలు దక్షిణదేశమునకు వచ్చుట ఔరంగజేబు చక్రవర్తి

కాలమున జరిగినది. ఆతఁడు క్రీ. శ. 1686 – లో గోల్కొండ నవాబు తానీషాను చెఱఁబట్టుట సుప్రసిద్ధవిషయము. ఈతఁడు తృతీయభాగమున నుండుట సమంజసమే.

## గోగులపాటి కూర్మనాథకవి

ఈ కవి చరిత్రము 340 వ పేజీలోనున్నది. ఈతఁడు భక్తిపరముగా "వైరిహరరంహ సింహాద్రినారసింహ" యని శతకము రచించి, నృసింహుని మెప్పించిన భాగవతోత్తముఁడు. అయినను, శృంగారరసావిష్కరణమున తనకు సామర్థ్యముగలదని నిరూపించుటకు "సుందరీమణిశతకము"ను రచియించినాఁడు. కావున నీతఁడు భక్తిశృంగారముల రెండింటిని సమ్మేళనముచేసిన మహానుభావుఁడు. ఈ శతకములోని పద్యములు కూర్మనాథకవి తన లక్ష్మీనారాయణసంవాదమను కృతియందు చొప్పించియున్నాఁడు. ఇది ముద్రితమయ్యెను, కవిచరిత్రల కెక్కలేదు.

శ్రీలలరంగఁ జంద్రకళ చెల్వున లేనునవ్వువెన్నెలల్
గీలుకొనంగ నంగజశిలీముఖదీతిఁ జెలంగుచున్న నీ
లీల గనుంగొనంగ నవలీల నఖండసమస్తభూతలం
బేలిన కన్న సౌఖ్యమని యెంతుఁజుమీ మది సుందరీమణీ!

తేవదనస్యచంద్రరుచిధిక్కరణప్రతిభాస్తు తేదృశో
భావభవోత్పలాంబురుహబాణకదంబ జయోస్తుసంతతమ్
తేవచనస్యకోకిలతతిప్రవరాయసకృద్విథో஽స్తుటం
చే వినుతింతు నీకు శుభమీయఁగ దేవుని సుందరీమణీ!

# బృహత్తటాకము నాగశాస్త్రి
(క్రీ.శ. 1740)

ఈతఁడు దక్షిణదేశమున మధురనగర సమీపమున నున్న "పెరియకుళము" నివాసి. దీనినే సంస్కృతీకరించి "బృహత్తటాకము" అని కవి వాడి యున్నాఁడు.

"శూరసంహార! కిరిగిరి సుఖవిహార!
సుకవిజనగేయ! శ్రీ బాలసుబ్బరాయ!"

అను మకుటముతో నితఁడొక సీసపద్యశతకము రచించియున్నాఁడు. ఇది ముద్రితము. ఈ శతకము సింహాద్రినారసింహాశతకముతో సరిపోల్పఁదగినది. దక్షిణదేశమున వెలసినది.

సీ॥ సమయంబునకు లేని జముదాడి యదియేల?
 వేళకుఁ బూనని శూల మేల?
తఱిచూడకున్న కోదండబాణము లేల?
 జన్యంబు సేయని శక్తి యేల?
వీరంబు లేని మయూరవాహనమేల?
 శృంగారమునకు వజ్రాంగి యేల?
దండెత్త లేకున్న దళవాయితనమేల?
 రోసంబు లేకున్న మీసమేల?

గీ॥ కొట్టి, గోడించి, మ్లేచ్ఛుల గుట్టుఁ గూల్చి
మట్టుసేయక యుండిన మహిమ యేల?
శూరసంహార! కిరిగిరి సుఖవిహార!
సుకవిజనగేయ! శ్రీ బాలసుబ్బరాయ!

సీ॥ శక్తిఘంటాఘోష చలితాఖిలాజాండ
 భానుకోపాంతక బాహుదండ

ధృతఖడ్గ ధీరాది దీప్తోరు కోదండ
మహితౌర్వకీలాసమానకాండ
అతిదేహకాంతి ధిక్కృత చండమార్తాండ
శూరపద్మాది సంహారకుండ
వీరరౌద్రరసాది విస్ఫురితోద్దండ
ఘనరత్నకుండల కలితగండ
గీ. ఖండపరశు తనూజ లేఖా ద్యఖండ
మానసోల్లాస నిన్ను నెమ్మదినిఁ గొల్తు
శూరసంహార! కిరిగిరిసుఖవిహార!
సుకవిజనగేయ! శ్రీ బాలసుబ్బరాయ!

## కర్ణాట తేరపకవి

(క్రీ. శ. 1750 ప్రాంతము)

"అనఘ కర్ణాట తేరపావన నరేంద్ర
రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర"

అను మకుటముతో నితఁడొక సీసపద్యశతకము రచియించి యున్నాఁడు. ఇది ముద్రితమైనది.

సీ॥ దశరథమూలకంద ప్రసూనంబునై
కైకయీ సుతకాండ కలితమగుచు
సౌమిత్రి విస్తృత శాఖాయుతంబునై
భూరి వానర పత్ర పూర్ణమగుచు
వాల్మీకిముని కావ్యవారి వర్ధితమునై
రావణానుజ సుమ భ్రాజి యగుచు
సీతా తనూలతాశ్రితమునై పవమాన
తనయ ఫలాఢ్యమై ధరణి వెలయ

గీ॥ రామకల్పద్రుమంబు నేఁ గామమరయఁ
జేరి కొలిచెద సర్వార్థ సిద్ధి కొఱకు
అనఘ కర్ణాట తేరపావన నరేంద్ర
రమ్యగుణసాంద్ర! దశరథరామచంద్ర!

సీ॥ అని యిట్లు సర్వలోకాధీశ్వరుని పేర
వితతాగమాంత సన్నుతుని పేర
సురుతెర కర్ణాట వరవంశసంభవుం
డైన యుళక్కియం చసెడు వాని
తమ్ముఁడ కామాక్షితాయి పెంచినవాఁడ
చిరవిప్రసాదసంసేవనాప
యాతకల్మషుఁడఁ దేరాభిధానుఁడ నన్ను
రక్షింపుమనుచు శ్రీరామమూర్తి

గీ॥ కంకితమ్ముగ శతక మియ్యాదనఁ జెప్పి
యొప్పగించితిఁ గైకొమ్ము యొప్పమీఱ
అనఘ కర్ణాట తేరపావన నరేంద్ర
రమ్యగుణసాంద్ర! దశరథరామచంద్ర!

## శేషప్పకవి

ఈ కవి చరిత్రము శతకకవులచరిత్ర - తృతీయభాగములోనున్నది. ధర్మపురి నరసింహశతకమును చెప్పి ప్రసిద్ధిగన్న శేషప్పకవి "ధర్మపురీనృకేసరీ" అను మకుటముతో నొక చంపకోత్పలమాలికావృత్తశతకము రచించియున్నాఁడు.

ధర్మపురీనృకేసరీ శతకము ధర్మపురి నృసింహస్వామి పేరఁ జెప్పబడినది.

### ధర్మపురీ నృకేసరీశతకము

చ॥ కలియుగమందు విప్రుడను గాను, నృపాలుఁడ గాను, మేటివై
శ్యులజతవాడ గాను, బలుశూరుఁడ గాను, సమస్తమైనజా
తుల నొకరుండఁ గాను, జుమి దుర్దనుజాంతక, నీ పదాబ్జముల్
దలఁచెడి వారి దాసులకు దాసుఁడ ధర్మపురీనృకేసరీ!

చ॥ ఇలను మనుష్యజాలముల కెక్కువ తక్కువ లున్న వన్నచో
కులముల శ్రేష్ఠ మెవ్వరిది? కొంచెము గానగరాదు వారు ని
ర్మలినశరీరులౌనొ? గుమగుమా యని కుక్షిని గంధమున్నదో
తెలిసిన నిండు భక్తులు సుధీరులు ధర్మపురీనృకేసరీ!

ఉ॥ నే చతురత్వ మే మెఱుఁగ నీ కృపనల్ల కవీశ్వరుండనై
తోఁచిన పద్యముల్ ముదముతో రచియించితి తప్పులున్న నీ
వే చెలువారఁజేసి వెతఁబెట్టక కోర్కులనెల్లఁ దీర్చి శే
షాచలవాసు నేలు మునిసన్నుత ధర్మపురీనృకేసరీ!

## రామకృష్ణమూర్తికవి
(క్రీ. శ. 1780 ప్రాంతము)

"రామకృష్ణమూర్తి రమ్యకీర్తి" అను మకుటముతో నాటవెలదులలో నొక వేదాంతశతక మీతనిది కలదు. అందు 76 పద్యములు లభించినవి.

### రామకృష్ణమూర్తి శతకము

గీ॥ ఉప్పుగల్లు చూడ గొప్పవారాశిలో కలిసిపోయి మరల గానరాదు
బ్రహ్మమంచు నీ ప్రపంచ మావిధమయ్యె, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి.

గీ॥ జలధినున్న చేప జలమునకై యటుఁ, దిరుగఁ జనునె యన్యదేశములకు
తన్ను నిండుకొన్న తత్త్వంబు వెదకునా, రామ॥

గీ॥ జ్ఞానియనఁగఁ బ్రభువు జ్ఞాన మాతని సొమ్ము
సొమ్ము పెట్టె లాగమమ్ము లెల్ల
మెరయఁ జదువువారు మోఁతకూలీలయా, రామ॥

ఈతఁడు పరశురామపంతులవారి వంశీయుఁడై యుండు నని యూహించుట సమంజసము.

# చాటరాతి లక్ష్మీనరసకవి

ఈకవి చరిత్రము శతకకవుల చరిత్ర - తృతీయభాగమున నున్నది. ఈతఁడు భండనారాతిభీమశతకమే గాక, ఈశ్వరీపరిణయము, పద్మనాభయుద్ధము అను రెండు ప్రబంధములును విశేషాంధ్ర మను నొక యచ్చతెనుఁగు నిఘంటువును రచించి యున్నాఁడు. వీనిలో మొదటిది లభ్యముకాలేదు - పద్మనాభయుద్ధము విజయనగరరాజగు విజయరామరాజునకు, ఇంగ్లీషువారికి "పద్మనాభము" అను క్షేత్రస్థలమున జరిగిన యుద్ధమును వర్ణించునది. ఇది క్రీ.శ. 1794 సంవత్సరమున జరుగుటచే కవి యాకాలమునాటివాఁడు. ఇది ముద్రితమైనది. విశేషాంధ్రము ముద్రితము కాలేదు. భండనారాతిభీమ శతకమిపుడు పూర్తిగ లభించుచున్నది.

దానిలో మొదటి పద్యమిది:-

భండనారాతిభీమ శతకము.

సీ॥ శ్రీమద్ధరిత్రీ భవా మధురమధురవాక్సుధాపానశ్రవణ పరాస
కౌశికయజ్ఞశిక్షణదక్షరక్షోవిఘాతి కార్ముకశరకర పరాక

క్షత్రియకోటిభక్షణవిచక్షణపరశ్వథధారిభంగధూర్వహ పరాకు
దండకావనసముద్దండచండపలాశఖండనకాండప్రకర పరాకు

గీ॥ పాదభక్తజనస్వాస్థ్యబాధ షాడమి
నప్పు డూరక యుంట న్యాయంబె నీకు
నీవు కనిపించుకొనక ది క్కేవిధాన
భండనారాతిభీమ కోదండరామ!

# తుమ్మలపల్లి శివరామకవి

ఈతఁడు. శైవబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. హరిహరుని పుత్రుఁడు. క్రీ.శ. 1707 లో వీరశైవమతసిద్ధాంతమును ప్రతిపాదించుచు "సోమేశ్వరశతకము" అను పేర నొక మత్తేభశార్దూల వృత్తశతకము రచించినాఁడు. కవియే స్వయముగా దాని కొక విపుల వ్యాఖ్యానము రచించి యున్నాఁడు. ఇందు స్తుతింపబడిన సోమేశ్వరుఁడు. నారాయణపట్టణమున వెలసిన లింగమూర్తి. ఇందు 106 పద్యము లున్నవి.

మ. క్రియ సద్భావము నిర్మలంబయిన భక్తి జ్ఞాన మార్గంబు ని
శ్చయ మిాతీ రతి వీరశైవులకు సాక్షాత్ బ్రహ్మతత్త్వంబు ని
ర్భయ మొందం దెలియంగఁ జెప్పితిని నేఁ బద్యంబుల న్నూఁటి ని
ర్ణయమై నీకు సమర్పణంబుగఁ జిదానందాత్మ సోమేశ్వరా!

---

# ఎఱగుడి కన్నయ

ఈతఁడు వేదాంతవిషయికమగు "కన్నా" అను మకుటముగల కందపద్య శతకము రచియించెను. ఈతఁడు పిల్లలమఱ్ఱి బుచ్చనగురు శిష్యుఁడైనట్లుగా నాతని నుతించిన యీ కందపద్యములవలనఁ దెలియుచున్నది.

క. పిల్లలమఱి బుచ్చనగురుఁ డుల్లము చల్లఁగను చేసి యుంచిన యపుడే
తల్లియుఁ దండ్రియు వారలె, యెల్లప్పుడు నెఱుఁగకన్న యెఱగుడికన్నా!"

సుబ్బయగురుఁ డను మఱియొక గురుఁ డీతనికిఁ గలఁడు.

క. సుబ్బయ్యగురుఁ కృపవల్లను, వచ్చెను బాలాంబ కరుణ యానందముతో
గొబ్బున నైకోని మనుమీ, యిబ్బంగిని యెఱుఁగకన్న యెఱగుడికన్నా.

ఇందు 107 కందములు గలవు. కొన్ని కందములలో "యినకులకన్నా" అని సంబోధనలు గలవు. కొన్నిచోట్ల "యఱగుడికన్నా" యని మకుటము యకారాదిగా నున్నది. ఇందు యోగవిషయము చక్కఁగా వివరింపబడినది.

క. యోగమువల్లనె చిత్తము, వేగము కుదురొంది జ్ఞానవిభవముఁ గనరా
బాగుగ నంతయు దానౌ, నీగతి మఱినెఱుఁగకన్న యెఱగుడికన్నా!

చిత్కళను గూర్చి కొన్ని కందములు గలవు.

క. చిత్తము చిత్కళఁ బొందిన, నత్తఱి నీమనసు వృత్తి యీసుడిగి తగన్
హత్తును బ్రహ్మపదంబున, నెత్తుర యిది యెఱుగకన్న నినకులకన్నా!

కవి క్రీ.శ. 1800 ప్రాంతమువాఁడు కాదగును.

# నిష్ఠల ఉపమాక వేంకటేశ్వరుఁడు

(క్రీ.శ. 1798 ప్రాంతము)

ఈ కవి మల్లికార్జునశతకమును, శివకందాష్టకమును రచించెను. తండ్రి విశ్వనాథుఁడు. తల్లి కామాంబ. మల్లికార్జునశతకమును క్రీ.శ. 1798 లో రచించినట్లు కవియే వ్రాసికొనెను. గంట్యాడలో గిరిపై వెలసిన శ్రీ మల్లికార్జునస్వామిపై చెప్పిన శతకము. "గంట్యాడనగాధివాస! నమదర్జున శంకర! మల్లికార్జునా! అని మకుటము.

సీ॥ బ్రహ్మద్వితీయపరార్థంపు మొదటిదినంబునఁ బదిరెండునాఁడులైన
తరువాత శుభ్రనూకరకల్పమునఁ బొల్చు వైవస్వతాంతరభావమైన
కలియుగాదిమపాదకలితమా శాలివాహనశకంబున సౌరహాయనములు
(1798) సామజరసగిరిసోమసంఖ్యలుగాఁగ వర్తమానపరాభవాఖ్యవర్ష
ఫాల్గున శుద్ధ భాస్వత్తిథివాసరయుతకాలమునఁ బాదయుతశతకము
గంట్యాడగిరిగేహగత మల్లికార్జునాకింతము నుత్పలసరాంచితము భక్తి
నిష్ఠల కులపయోనిధి సుధాకరుఁడగు విశ్వనాథాఖ్య సద్విజవరుండు
కామాంబ యందునఁ గనియెఁ బుత్రుల నార్వురను వారిలో నగ్రజ
నుఁడ రామ
శివమయోజోగతచిత్తుండ నుపమాక వేంకటేశ్వరుఁ డనవెలయువాఁడ
నేను సత్కవిజనానూనదయార్థినై రామకథాగర్భితామరపద

గీ॥ ప్రదము శ్రీమల్లికార్జు నార్పణము గాఁగ
నీశ్వర ప్రేరణంబున నిది నుడివితి
నిష్టసిద్ధులు గాంతురు తుష్టమతిని
బఠన చేసిన పుణ్యులు భర్గు దయను.

మల్లికార్జునశతకమునుండి—

ఉ॥ లాడులు లడ్డువాలును జిలాబులు బూరెలు గారె లప్పముల్
జీడెలు పాలముంజెలును జిల్లెడుగాయలు చంద్రకాంతముల్

నాడెపు శర్కరారాజ్యముల లావుగ వండిన విత్తుఁగొమ్మ గం
ట్యాడనగాధివాస! నమదర్జునశంకర! మల్లికార్జునా!

ఏబదిపద్యముల తరువాత "రామాయణకథావతరణము" అను పేరుతో మిగత పద్యములను వ్రాసెను.

శివకందాష్టకమునుండి—

క. సుందరతర మందస్మిత కందళజితహారహీరకాశసురధునీ
కుందశరభబృందశరత్కందా! గంట్యాడమల్లికార్జునలింగా!

---

# చతుర్థభాగము

## ( క్రీ. శ. 1800 – 1950 )

## పరశురామపంతుల లింగమూర్తి

(క్రీ. శ. 1800)

ప్రసిద్ధవేదాంతకవి యగు నీతఁడు మనశ్శతకమును రచియించినాఁడు. కందపద్యములు – "మనసా" అను మకుటము.

### మనశ్శతకము

క. నీకన్న తక్కువగు నీ ప్రాకట విషయేంద్రియముల పజ్జ మెలఁగుట
స్తోకవివేకమె? తగదిఁకఁ । గాకుత్థాన్వయునిఁ గూడు గ్రక్కున మనసా!

క. రాముని కరుణ నిజాత్మా । రాముఁడనై యుండెదను తిరంబుగ నిఁక నీ
వ్యామోహ ముడిగి నాలోఁ । వేమఱుఁ గలియుము నివృత్తి వృత్తిని మనసా!

## కొండవీటి కోటయ

క్రీ. శ. 1800

ఈతఁడు నీతిశాస్త్రమును "శివశతకము" గా రచియించి యున్నాఁడు.

### శివశతకము

క. కొండటికిఁ దెనుఁగు హితవగుఁ
గొండటికిని సంస్కృతంబు కూరిమియగు నే
నందటి కనుగుణ్యము మది
జెందఁగ శుభయోక్తు లర్థిఁ జేకూర్తు శివా!

క. తనయాత్మ బుద్ధి సుఖమగు
ఘనుఁడగు గురుబుద్ధి సాధకం బన్యులు చె
ప్పిన బుద్ధి నాశనము భా
మినిబుద్ధి ప్రళయకాలమృత్యు వగు శివా!

# మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యుఁడు

( క్రీ.శ. 1800 )

ఈతని యగస్త్యేశ్వరశతకమును పరిషత్తువారు ముద్రించిరి.

## 1. పెదనలగస్త్యేశ్వరశతకము

శా. చిల్లీలాకృతి మల్లికార్జునయతి శ్రీపండితారాధ్యహృ
త్ఫుల్లాంభోజవిహార భూరివిలసత్పుష్పంధయస్వామివై
మల్లంపల్లి వసించియున్న త్రిజగన్మాన్యుండ వీ వండ్రు సం
పల్లీనా పెదనాభిధాన శివపూర్వస్త్యాదగస్త్యేశ్వరా!

మ॥ రథరద్యద్విరదాంగ సారథి ధనుర్బాణేషుధిజ్యాళి, యా
పృథివీ వేదరవీందు వాక్పతి సురాద్రి శ్రీవధూనాథ వా
ర్నిధి భోగీంద్రులుగాఁ బురత్రయమును న్నిర్జించు నీ చర్య లు
గ్రధురంబుల్ పెదనాభిధాన శివపూర్వస్త్యాదగస్త్యేశ్వరా!

## 2. శ్యామలాంబాశతకము – 101 సీసపద్యములు.

సీ॥ పలితశుద్ధసువర్ణ ఫలకాసదృశకపోలక శానిరాకృత ముకురలీల
నిబిడాంధకార సన్నిభ నీలకుంతలద్యుతి సముద్ధూత మధుకరజాల
మత్తమాతంగ సమానయానమనోజ్ఞ నిర్జితకరహారి నికరఖేల
కలమగర్భప్రతీకాశ జంఘారుచి మహిమపరాభూత మకరహేల

గీ॥ వికసితకటాక్ష చకిత కామకరవాల
శైలమలబాల పెదనపురీలలామ

రామలింగేశ్వరస్వామి వామభాగ
చంద్రశాలాసభాలంబ! శ్యామలాంబ!

# ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు

( క్రీ. శ 1800 ప్రాంతము )

ఈ విద్వత్కవి "కృష్ణాదీనరక్షామణీ" యను శతకమును రచించెను.

కృష్ణాదీనరక్షామణీశతకము.

మ॥ జలసౌకర్యము లేని యూరు విధవాజాలంబు బల్నారు లం
జలకాముం డగువాని పేరు, పటికార్చ్యణ్రాని బంగారు దు
ర్నిలయంబైన బిడారు తీ రుపకృతుల్ నీ నామసంకీర్తనల్
సలుపంజాలని నోరు నీఱుగద కృష్ణా! దీనరక్షామణీ!

మ॥ చలదాత్మీయకరాసినిర్దళిత తుచ్ఛమ్లేచ్ఛ రాహుత్తభి
జ్జలజాత ప్రియబింబ మధ్యబిల దృశ్యాకార నెల్యచ్ఛలా
తులనిష్పార్శ్విత కంకణగ్రహణ ధీతోయావగాహోర్థ స్వ
ర్జలవత్ భ్రాంతి దక్షుండ సంఘటిత కృష్ణా! దీనరక్షామణీ!

# తాడికొండ మల్లనారాధ్యులు

క్రీ. శ. 1800 ప్రాంతము

వీరారాధ్యబ్రాహ్మణులు - భారద్వాజసగోత్రులు - వీరు సంస్కృతాంధ్రభాషాకోవిదులు-మంత్రశాస్త్రవేత్తలు. శ్రీమలాని జు గుండారాయనివారిని మెప్పించి, నందివెలుఁగు

గ్రామమున భూస్వాస్థ్యము సంపాదించిరి. వారాశువుగా నేక ప్రాసతో నొక శతకమును ప్రభుపరముగా జెప్పిరి. అది ఏకాక్షర కందపద్య శతకము.

"వీరాధిపగుండభూప! విభవదిలీపా" అను మకుటము.

క. కోరితి నీదగు దయ సుర । ధారణిరుహ సురభికర్మ ధారాధర ధా
  త్రీరాజ దానధుర్యా । వీరాధిప గుండభూప! విభవదిలీపా!

క. ధీరా యీమనిపురమునఁ । దూరుపునామాన్యభూమి తూమెడుగింజల్
  కారుకుఁ బండవు దూరము । వీరాధిప! గుండభూప! విభవదిలీపా!

క. కోరితి దీనిం గైకొని । మారుగ దక్షిణమునందు మాన్యము దమి నీ
  పేరుగ నీయఁగ నాకును । వీరాధిప! గుండభూప! విభవదిలీపా!

# చౌదరి పురుషోత్తము

(క్రీ.శ. 1803–1890)

ఈతఁడు క్రైస్తవకవి. నిగ్గుపట్టుమగు శైలిలో క్రైస్తవ నీతిబోధప్రకాశము, కీర్తనలు రచియించియున్నాఁడు. ఏసు నాథ శతక మీతని కృతి వ్యాప్తి నందినది. ఇదిగాక సత్క్రైస్తవ శతక మను మఱియొక కృతి గలదు. దేశభాషా క్రైస్తవకవులలో నగ్రగణ్యుఁడు. ఈతని సత్క్రైస్తవశతకము అలభ్యము.

# కొటికెలపూడి కోదండరామకవి

( క్రీ. శ. 1807 – 1883 )

విశాఖమండలమున బొబ్బిలిసంస్థానమున నాస్థాన పండితుఁడై, కవియై, పురోహితుఁడై, జ్యోతిషమున విశేషప్రజ్ఞగడించిన కొటికెలపూడి వెంకటకృష్ణసోమయాజి నాల్గవపుత్రుఁడు కోదండరామయ్య. ఈతఁడు తండ్రివలెనే సంస్కృతాంధ్ర భాషాపాండితీవిశారదుఁడై జ్యోతిషమున గణితమున ప్రఖ్యాతికెక్కిన యాచార్యుఁడై విలసిల్లినాడు. తెలుగున నీతఁడు బహుగ్రంథరచయిత. నృసింహపురాణము – ప్రపదనపారిజాతము – తారకబ్రహ్మమహాత్మ్యము మొదలగు నీతని పద్యకృతులే కాక, ఆర్యభట్టీయమునకు నీతఁడు రచియించిన సుధాతరంగవ్యాఖ్య చాల ప్రసిద్ధములైనవి. ఆర్యభట్టీయ సుధాతరంగవ్యాఖ్య .నీ నడుమనే మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారు ప్రచురించియున్నారు. ఈ విద్వత్కవి యిదివఱ కే కవుల చరిత్ర కెక్కియుండలేదు. ఈ క్రింది యీతని శతకకృతులు – ఈతని శైలి నిరర్గళమై గంగా ప్రవాహమును బోలి యుండును.

1. భారతీశతకము – శార్దూలమత్తేభవృత్తములు – 'భారతీ' మకుటము.

2. శ్రీసతీ శతకము – 'శ్రీసతీ' మకుటము – వ్రాసిన తేదీ – ప్రభవ మార్గశిర శు॥ ౧ బుధవారము.

3. మాధవ శతకము - 'మాధవా' మకుటము.
4. జానకీవల్లభశతకము.
5. రామప్రభూ శతకము - వ్రాసిన తేదీ - విరోధి చైత్ర శుద్ధ ౮ గురువారం.
6. మారుతీ శతకము-వ్రాసిన తేదీ - ప్రభవ కార్తిక బ॥౮ శుక్రవారం.
7. రాజవతంస శతకము - కందపద్యములు.
8. దేవచూడామణి శతకము — మత్తేభశార్దూలములు. వ్రాసిన తేదీ - కాళయుక్తి ఆషాఢ శు ౧౦ జయవారం.
9. వేణుగోపాలశతకము - 90 పద్యములు.

## 1. భారతీ శతకము.

శా॥ శ్రీరంజిల్లు మొగంబుతోఁ గటకకాంచీహారకోటీరమం
జీరోదారవిభూషణవ్రజముతో శీతాంశుతుల్యాభతో
కారుణ్యామృతపూరపూరితకటాక్షశ్రీలతో భూరి శృం
గారాకారముతోడ వచ్చి నను వేడ్కం బ్రోవుమీ భారతీ!

మ॥ ధరణిం గొల్కొలపూఁడి వంశజుఁడఁ గోదండాభ్రమయాఖ్యుండ నీ
కరుణంగల్గిన సాంఖ్యవిద్య నపవర్గశ్రీల వాంఛించి దా
శరథన్ ధ్యానము సేయుచో నగు మనశ్చాంచల్యమున్ బాపి స
త్వరతఁ సిద్ధియొనర్చి ప్రోవఁదగు నీవాఁడన్ జుమీ భారతీ!

## 2. శ్రీసతీశతకము.

శా. శ్రీరంజిల్లు ముఖేందుమండలముతో శాజానమంజీరశో
భారమ్యాంఘ్రులతో వినీలకబరీభారంబుతోఁ జంద్రికా
కారస్మేరముతో మదద్విపసదృగ్గంభీరయానంబుతోఁ
జేరవ్వచ్చి కృపార్ద్రదృష్టి నను రక్షింపవ్వలెన్ శ్రీసతీ!

శా. మందాక్షాధికభారసంకుచితకుంభల్లోచనోదీర్ణదృ
క్స్పందోహంబుదయార్కభార్గదళితాబ్జవ్రాతగర్భస్థితా
మందేందిందిరబృందమట్లు తగఁ బ్రేమన్ భర్తగాఁ గోరి గో
విందుం బొందిన నిన్ను భక్తిఁ గొలుతున్ వేఁబ్రోవుమా శ్రీసతీ!

మ. ధరణిం గొక్కులపూఁడివంశజుఁడఁ గోదండరామయాఖ్యుండ, వే
దరహస్యజ్ఞుఁడ సత్కవీంద్రుఁడ సముద్యజ్జ్యోతిషామ్నాయవి
ద్గురుఁడన్ రామపదాబ్జభక్తుఁడను నీకున్ సేవకుండన్ ననున్
గరుణాపూర్ణసమగ్రదృష్టిఁగని వేడ్కం బ్రోవుమా శ్రీసతీ!

## 3. మాధవశతకము

మ. గహనావాసముఁ గోరి నీవు చన మార్గంబందు నిన్ జూచి దు
స్సహదుఃఖాతురుఁడౌచుఁ దావకపదాబ్జాతంబులం బడ్డ యా
గుహు సంబోధితుఁజేసి తద్దయకు సంతోషించి యిష్టార్థముల్
సహజానంద మొసంగు నీ కరుణకున్ సాష్టాంగముల్ మాధవా!

విలసత్ కొక్కులపూఁడి వంశభవుఁడన్ విద్వత్పదాంభోజసం
కులగేహుండ భవత్కథాకథకుఁడన్ గోదండరామాఖ్యుఁడన్
దలపన్ శక్యముగాక గొప్పలగుచున్ దాపత్రయార్తుల్ ననున్
బలిమిం బట్టెను కావు కావుము దయాపాదోనిధీ మాధవా!

## (4) జానకీవల్లభ శతకము

శా. శ్రీలక్ష్మీవదనాబ్జమిత్రసుమనోజేగీయమానస్వరూ
పాలంకారవిహార ధైర్యకరుణావ్యాపార సర్వేశ్వర
త్వాలోలత్వశుచిత్వసత్యమహిమాహ్లాదకక్రియానిత్యతా
శీలత్వాదిచరిత్ర భక్తసులభా శ్రీపార్వతీవల్లభా!

మ. జయకల్యాణకరాకృతే జయజగజ్జాలాఖిలస్వాకృతే
జయ వేదాంతపరిష్కృతే జయమహైశ్చర్యప్రభావోన్నతే
జయసద్భక్తజనాదృతే జయయశస్స్వర్భూజమూలస్థితే
ప్రియమే తత్కృతిరస్తు భక్తసులభా శ్రీ జానకీవల్లభా!

## (5) 'రామప్రభూ' శతకము

శా. శ్రీసీతాకరపద్మసేవితములై సిందూరశోణంబులై
ప్రాసాదధ్వజశంఖచక్రభిదురాబ్జచ్ఛత్రచాపాదిరు
గ్వ్యాసక్తాకములై మునీశ్వరమనోగమ్యంబులై భక్తసం
త్రాసంబుల్దొలఁగించు త్వచ్చరణముల్ ధ్యానింతు రామప్రభూ!

మ. సగసీజచ్ఛవి, బంధుజీవకుసుమచ్ఛాయన్ ప్రవాళప్రభన్
దరుణార్కద్యుతి నబ్జరాగఘనరత్నజ్యోతిర్మరక్తోత్పల
స్ఫురణం బల్లవకాంతులన్ గెలిచి సంపూర్ణారుణత్వంబుచే
త రహింభాసిలుచుండు నీ చరణముల్ ధ్యానింతు రామప్రభూ!

మ. గురిగా జ్యోతిషవిద్యయం దధికుఁడన్ గోదండరామాఖ్యుఁడన్
విరతిజ్ఞానవివృద్ధభక్తియుతుఁడన్ శ్వేతాచలాధీశభూ
వరవాల్లభ్యవిశేషభూషితుఁడ నీవాఁడన్ భవాంబోధినిన్
దరియింపం దలపోసి నీచరణముల్ ధ్యానింతు రామప్రభూ!

## మారుతీ శతకము

శా. శ్రీమద్రామకథాసుధారసము లే సీమం బ్రవర్తించుఁ ద
ద్భూమిన్ హర్షపయఃపరీతనయనంబుల్ కంటకాంచత్తను
శ్రీమీఱన్ దృఢభక్తితోడ శిరముం జేదోయి జోడించి నా
నామానీంద్రులు మెచ్చ నిల్చి తగు నిన్వర్ణించెదన్ మారుతీ!

శా. కంజాప్తాన్వయదుగ్ధవారినిధిరాకాచంద్రు సద్వాక్యముల్
కంజాక్షీమణియైన సీతకును దత్కాంతామతల్లీవచః
పుంజంబుల్ రఘుభర్తకుం దెలుపుచున్ బుత్రికృతి న్వారిచెం
తం జెల్వారఁ జరించి మించిన నినున్ ధ్యానించెదన్ మారుతీ!

మ. హరిపాదాంబుజభక్తిసంయుతుఁడ దివ్యజ్యోతిషామ్నాయవి
ద్గురుఁడన్ కొల్లైలపూడివంశభవుఁడన్ గోదండరామాఖ్యుఁడన్
విరతిజ్ఞానయుతుండ నన్ను గరుణ న్వీక్షించి తాపత్రయ
స్ఫురణంబుల్ తొలగించి ప్రోవు కరుణాంభోజద్యుతీ మారుతీ!

## రాజవతంస శతకము

క. శ్రీమద్ధరాత్మజాన్విత । వామా! జీమూతధామ! వైశ్రవణస్తు
త్యామితకల్యాణగుణ । గ్రామ! విబుధసోమ! రామ! రాజవతంసా!

క. శ్రీకరసల్లాలితనిగ । మాకల్పస్వచరణద్వయధ్యానరవా
స్తోకమునిలోక దురిత ని । రాకరణోద్దామ! రామ! రాజవతంసా!

క. కోదండరామయ భవత్ । పాదములకు మ్రొక్కి పలుకు పద్యశతము నీ
వాదరమునఁ గొని ప్రోవుము । ప్రాదుర్భూతగుణరామ! రాజవతంసా!

## రామా దేవచూడామణీశతకము

శా. శ్రీమద్భూమిసుతాకరాంబురుహసంసేవాన్వితంబుల్ త్రియా
శ్యామామాళివిభూషణంబు లరుణచ్ఛాయాస్పదంబుల్ ముని
గ్రామస్తుత్యములైన నీయడుగు లే కాలమ్ము మచ్చిత్తసీ
మామధ్యంబున నిల్పి ప్రోవు నను రామా! దేవచూడామణీ!

శా. ఏలాప్రోచితి రావణానుజుఁ బిశాచేంద్రుం గుహున్ గాళియ
వ్యాళాధీశు నజామిళున్ శబరిఁ బ్రహ్లాదున్ దయాశాలివై
నీలోఛిద్రముగల్గుటన్ విషమతల్ నీయందు లేమిన్ ననున్
బాలింపందగునంచు వేఁడితిని రామా! దేవచూడామణీ!

మ. నతిఁ గావించెద నీ సహోదరులకున్ భక్తాళికిన్ మేదినీ
సుతకున్ వాయుతనూజముఖ్యులకు రక్షోహారికోదండమం
డితకాండావళికిన్ భవద్గురునకున్ నీకు న్ననున్ దీను స
మ్మతితో బ్రోవుము భృత్యభృత్యుఁడను రామా! దేవచూడామణీ!

మ. గుణవత్కొక్కెలపూడి వంశభవుఁడన్ కోదండరామాఖ్యుఁడన్
గణితజ్ఞుండఁ గవీశ్వరుండ నిగమాంతజ్ఞుండ సత్కీర్తిభూ
షణుఁడన్ బొబ్బిలిపూ ర్నివాసుఁడను యుష్మత్పాదభక్తుండ బ్రా
హ్మణుఁడన్ నన్ను దయార్ద్రదృష్టి గను రామా! దేవచూడామణీ!

## వేణుగోపాల శతకము

శా. శ్రీయాదోనిధికన్యకావదనరాజీవంబుపై షట్పద
చ్ఛాయం జెందు నిరీక్షణంబులఁ గృపాసారంబు వర్షించి భ
క్తాయాసంబు లడంచు మీకు ముద మొప్పారంగఁ గైవారముల్
సేయం బాయని యాపదల్ గలుగునే శ్రీ వేణుగోపాలకా!

మ. సిరులం దూగెడు బొబ్బిలీపురమునన్ శ్వేతాచలాధీశభూ
వరుఁ డర్పింపఁగ హేమరత్నమయభాస్వద్దివ్యగేహంబునన్
సరిగాఁ బార్శ్వములన్ విదర్భతనయాసాత్రాజితుల్ గొల్వ సు
స్థిరతన్ నిల్చిన నీకు మ్రొక్కెదనుమీ! శ్రీ వేణుగోపాలకా!

మ. అవితాశేషవిరాగు యోగిజనహృద్యావద్యసంయోగు గో
పవధూకల్పితభోగుఁ గల్పతరుకల్పత్యాగు గంగానురా
గవశక్ష్మామితకీర్తిభాగు విలసత్కాక్షేయధారాకృతా
రివరాంగాత్మవిభాగు నిన్నుఁ దలఁతున్ శ్రీ వేణుగోపాలకా!

(10) జానకీరామశతకము "జానకీరామ దేవతాసార్వ భౌమ" అను మకుటము 303 పద్యములు - ఒక్కొక్క శతక మొక్కయంకముగా విభాగింపఁబడినది. ఈ శతకమున నితని జననకాలము తెలుపఁబడినది.

సీ॥ శ్రీరామ కాకుత్స్థ సీతాపతి ఖరారి రాఘవ మనువంశ రామభద్ర
కౌసలేయ దశాస్యఖండన మారీచమర్దన దశరథాత్మజ మహేశ
కుంభకర్ణాంతక కుంభజవరద కోదండపాణి ఖరసురేంద్రమథన
తాటకాంతక సప్తతంతుపాలక భరతాగ్రజ పద్మాక్ష యాంజనేయ

గీ. సేవ్యమాన కపీంద్రసంభావ్య తాళ । సప్తకచ్ఛేధి సాకేతసద్మ దండ
కాటవీపుణ్యకర లవణాబ్ధిభయద । జానకీరామ దేవతాసార్వభౌమ!

సీ. కోటికెలపూఁడి సత్కులమున నవనేత్రి
మునిశశిశకవర్షములు చనంగ

ప్రభవసంవత్సర (1807) శ్రావణాసితహరి
దినమున నదితిభాంతిమసదమున
కర్కాటకాఖ్యలగ్నమున వేంకటకృష్ణ
సోమయాజికి వెంకుసోమిదేవి
కిని జనియించి నీకృప గన్న కోదండ
రామాఖ్య భూసురప్రవరుచేత

గీ. నీవు చేయించినట్టి యీ నిఖిలసీస
పద్యముల్ వినువారికి భద్రమొసగి
వేడుకను బ్రోతువని నిన్ను వేడుకొంటి
జానకీరామ దేవతాసార్వభౌమ!

## పంతుల బ్రహ్మదేవకవి లేక బ్రహ్మన్నకవి

ఈతడు విశాఖమండలమున పార్వతీపురమున శ్రీధనంజయభా(ట్రాజుగారిచేత సమ్మానితుఁడైన విద్వత్కవి. కందుకూరి బసవరాజు (ఉర్లాము జమీందారు)గారిచే సమ్మానితుఁడు – "పంతుల బ్రహ్మన్న సాటి పండితుఁ డేఁడి" అని ప్రఖ్యాతిగన్నవాఁడు. ఈతఁడు సంస్కృతాంధ్రములలోనే కాక పదకవిత్వమున ప్రఖ్యాతి నార్జించినాఁడు. ఈతని శతకము ధనంజయమహారాజశతకము 100 కందములు (ఇందు ప్రాస – యతి నియమము చివరపాదమున గలదు.)

కం. సిరియును గౌరియు, వాణియు,
హరియును శంకరుఁడు నంబుజాసనుఁడునుఁ బ్రో
తురు మిమ్ముఁ గోర్కులొసఁగుచు
హరితేజా శ్రీధనంజయమహారాజా!

కం. విరచించినాఁడ కరుణాకర పంతుల బ్రిహ్మదేవ కవివరుఁడు భవ
చ్చరిత కృతికందశతకము హరితేజా శ్రీధనంజయమహారాజా!

ఈతఁడు, ఇందుమతీపరిణయ మను మూఁడాశ్వాసముల ప్రబంధమును సంస్కృత నక్షత్రమాలా కృతి - దేవీస్తవము - శృంగారగీతములు కృతి సర్వస్వము గేయకవి - మొదలగునవి రచించెను. భాగవతకలాపము దరువులు - మృగయావర్ణనము కూడ రచించెను.

## మండపాక కామకవి
### ( క్రీ.శ. 1810 - 1872 )

ఈతఁడు శతకవాఙ్మయచరిత్రలో నిత్యోఽధిక ప్రఖ్యాతివహించిన మండపాక పార్వతీశ్వరశాస్త్రి జనకుఁడు. సంస్కృతాంధ్రభాషలయందు నసమానప్రజ్ఞ గడించి బలరామక్షేత్రమహాత్మ్యము, బహ్మోత్తరఖండము, కార్తికమహాత్మ్యము అను ప్రబంధములేగాక, నీ క్రింది శతకకృతులు రచియించెను.

(1) శ్రీరామచంద్రప్రభూశతకము. (2) శ్రీసూర్యనారాయణశతకము. (3) జానకీరామశతకము.

పై వానిలో లభ్యమైన శ్రీసూర్యనారాయణశతకము నుండి యొక పద్య ముదాహరించుచున్నాను.

శా. ద్యోవీథిం జనుమూర్తి వేఁడిమి మనుష్యుల్ కన్నులం జూచుచున్
సేవింపంగ నశక్యమంచు నెదలం జింతింపఁ దన్మానసా
శీవాంఛల్ ఫలియింప నీయరసవల్లిన్ సౌమ్యరూపంబుతో
........................ ...............సూర్యనారాయణా!

# గోపీనాథము వేంకటకవి

( క్రీ.శ. 1820 - 1890 )

మహాప్రసిద్ధుఁడగు నీతఁడు రచించిన బ్రహ్మానందశతకము - ప్రచారమును బడసినది. కామశాస్త్రవిషయికము.

## బ్రహ్మానందశతకము

సీ. వరగుణశాలి సర్వజ్ఞకుమార య
చక్షమానాథుండు సత్కళా వి
శారదుం డొకనాఁడు సంతోషమున గోపీ
నాథ వెంకటకవినాథు నన్ను
రావించి మన్నించి రమణ శ్రీకృష్ణునిఁ
గోర్కెతో కృతినాయకుని నొనర్చి
యాతనివిరహంబు లన్నియు శృంగార
శతకంబు సేయుము సరసఫణితి

గీ. నరయ నానందపరిపూర్ణుఁడైన కృష్ణు
చారుతర విషయానంద సరణు లెల్ల
నవ్యమృదువాగ్విభూతి వర్ణనము సేయు
టరసి చూడ బ్రహ్మానంద మదియ కాదె.

సీ. కామసంతృప్తుండు కానివాఁ డిల మోక్ష
కామిగాఁ డను గాథ కలిగియుండు

నదిగాక సురతభవానంద మరయ బ్రి
హ్మానందలేశంబు గాని వేఱు
లేదు కావున మీరు గరిమతో మొదల శ్రీ
కృష్ణుండు వల్లవస్త్రీలఁ గూడి
చేసిన లీలావిశేషంబు లన్నియు
శృంగారశతకంబుఁ జేసి ప్రీతి
నవలఁ దదుక్తగీతార్థసారం బింత
సంగ్రహించి సమస్తసమ్మతముగ

గీ. నొక్క శతకంబు గావింపు ముర్విలోన
దేనియెడఁ బ్రీతిగలవారు దానిఁ జూచి
తెలిసి సౌఖ్యవారాన్నిధిఁ దేలుచుందు
రంచితముగ బహ్మానంద మదియుకాదె.

శతకమంతయు కామశాస్త్ర విషయికము.

# క్రోలేటి జోగయ

"త్రిస్తబకరామశతకము" అను పేర శ్రీరామపరముగా నొక కందపద్యశతకము నీతఁడు రచించెను. ఇది సమగ్రము.

క. శ్రీమత్సూర్యకులాంబుధిసోమా! సోమాద్యశేషసురగణ్యగుణ
గ్రామా! పరభీమా! వరభామాచరమాస్య జగదుపాస్యా రామా!

క. క్రోలేటి జోగయార్యునిఁబాలింపుచు నాదరించి భరియింపు కృతిన్.
శ్రీలాలితమాలావృత నీలాసితగాత్ర కనకనేత్రా రామా!

(R. 537)

## ఆకొండి వేంకటకవి

(క్రీ.శ. 1820 ప్రాంతము)

ఈతఁడు మూఁడుశతకములు రచియించెను. (1) రామశతకము (2) శ్రీరమణశతకము – నారాయణభక్తపోషణా శ్రీరమణా అను మకుటము (3) రామప్రభూశతకము.

చివరశతకమునం దొకపద్యము

"అఘనాశాఖిలదేవతానిచయ సౌఖ్యప్రాపకోద్యత్ ప్రభా
వఘనా! దివ్య సువర్ణచేల మణి భాస్వత్ కాంచి కాంచన్మహా
జఘనా! హారకిరీటముఖ్యవరభూషాభూషితప్రోజ్జ్వలా
వఘనా! కీర్తిఘనా! ఘనాఘనసమాభాధామ రామప్రభూ"

మిగత రెండుశతకములు అలభ్యములు.

## అనంతరాజు సుబ్బారాయకవి

( క్రీ. శ. 1825 – 1884 )

ఈతఁడు సదాశివేశ్వరశతకము రచించెను.

ఇది "నగవరశరాస! కార్వేటి నగరవాస
గిరిధరశరా సదాశివ కృత్తివాస"

అను మకుటము గలది. ఇందు బంధగర్భచిత్రకవిత్వములు గలవు. పాండితీప్రౌఢమైనది.

శ్రీసదాశివేశ్వరశతకము – చిత్రబంధకవితావిచిత్రరచనము.

సీ॥ విలస దర్థోత్కర విస్ఫురితాఖిల గుణాలంకార సంయుక్తరా ప్రకాశ
శ్రియసమాహ్లాదక, రీతిలక్షణ సుశీలాంచచ్చమత్కారిరా సుభాషి

సరసభావోచిత సర్వశాలిని సుమీ రాజత్సువర్ణాంగిరా మనోజ్ఞ
సురసవత్త్వంబున సొంపుతో పదములన్ రమ్యస్వరోద్భాసిరా సువృత్త

గీ॥ నవ్యసుకుమార! గైకొమ్ము నాదు కావ్య
దుహిత నిచ్చితి మత్తేభ సహితముగను
నగవరశరాస! కార్వేటినగరవాస!
గిరిధగశరా సదాశివ కృత్తివాస!

పై సీసపద్యమున మత్తేభవృత్త మిముడ్చబడినది.

లసదర్థోత్కరవిశ్రుతాఖిలగుణాలంకార సంయుక్తరా
యసమాహ్లాదకకీతిలక్షణ సుశీలాంచచ్చమత్కారిరా
రసభావోచిత సర్వశాలిని సుమీ రాజత్సువర్ణాంగిరా
రసవత్త్వంబున సొంపుతో పదములన్ రమ్యస్వరోద్భాసిరా.

## శ్రీ రాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరు
( క్రీ.శ. 1827 – 1905 ).

ఈతఁడు విశాఖపట్టణమండలమున సంగమవలస యను నెస్టేటును నేబదేడేండ్లు - (1848 – 1905) పాలించిన జమీనుదారు. శ్రీమహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యుల వారిశిష్యుఁడు. సంస్కృతాంధ్రములందే కాక చతుష్షష్టికళల యందుఁ బ్రవీణుఁడు. సంస్కృతమున కాళిదాసనాటకత్రయికి వ్యాఖ్యానము వ్రాసినవాఁడు. తెనుగున మానసబోధ శ్రీశంభుశతకము, నీతిసంగ్రహము, భల్లాణరాజచరిత్ర, అరసవెల్లి సూర్యనారాయణస్వామిచరిత్ర మున్నగు గ్రంథములు

రచించినవాఁడు. ఈతని శతకరచన మొక్కటియే - మానస బోధ శ్రీశంభుశతకము. ఈ శతకము కందపద్యములతో రచితము. 101 పద్యములు. రెండుపాదములు మకుటము. ఏకప్రాస ఏకయతి నియమము గలది.

క. శ్రీశైలభ్రమరాంబాధీశుని పదపూజనంబె ధృఢమనుచు సదా
శ్రీశంభో శ్రీశంభో శ్రీశంభో యనుచు స్మరణసేయుము మనసా!

కవి సంస్కృతపండితుఁ డగుటవలన 'శ' ప్రాసవలన నపూర్వసంస్కృతశబ్దములు వాడి వాటికి తానే వ్యాఖ్యవ్రాసి సుగమము కావించినాఁడు.

వీశధ్వజమిత్రుఁడు వృషభేశధ్వజుఁ డుగ్రపాపభేది యటంచున్ ॥ శ్రీ॥

"వీశధ్వజమిత్రుఁడు అనగా గరుడధ్వజసఖుఁడు. వి + ఈశ + ధ్వజ. వి = అనగా పక్షి, పక్షుల కీశుఁడు రాజు గరుత్మంతుఁడు, ఆతడే ధ్వజముగా గలవాఁడు. విపిష్కిరపతత్రిణ - ఇత్యమరః."

కాశవిభూషణు డీయజపేశీకోశమున నిండిఁ బెంపలరె నహో ॥శ్రీ॥

"అజపేశికోశము = బ్రహ్మాండము. పేశకోశోద్విహీనేఽండమిత్యమరః. ఇట్లే వాశితములు-శుకశారికాదుల పలుకులకు ప్రయుక్తములైనవి. ఈ శతకము 1873 సం॥ ఆగష్టు నెలలో బందరులో కేశవరాజు అండు కంపెనీవారి ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

## నరసింహదేవర వేంకటశాస్త్రి

( క్రీ.శ. 1828 – 1915 )

ఈతని శతకములు రెండు - (1) వేంకటేశ్వరశతకము (2) గౌరీశతకము (అలభ్యము)

## ముడుంబ నృసింహాచార్యస్వామి

( క్రీ.శ. 1841 - 1927 )

శతకకవులచరిత్ర చతుర్థభాగమునఁ బేర్కొనఁబడిన యీవిద్వత్కవి శ్రీవిజయనగరసంస్థానమున, ఆనందగజపతీంద్రుని కాలమున ఆస్థానకవిపండితాగ్రేసరుఁడై, రాజగురుపదమున విలసిల్లినవాఁడు. సంస్కృతాంధ్రముల రెండువందల గ్రంథములు రచించినవాఁడు. వీనిలో సంస్కృతమున సంజ్ఞారామాయణము, తెనుగున శృంగారరసకృతులు మిక్కిలి ప్రసిద్ధిగన్నవి. ఈతని రంగేశశతకము శ్రీరుక్మిణీకథాత్మకము. ఇందలి పద్యము లన్నియు సీసములు - వీతభవతృష్ణ రంగేశ వేషకృష్ణ అను మకుటము.

సీ॥ నీకట్టి వదలిన నెఱిక కన్నుల నద్ది
యుత్తరీయంబుగా నుంచుకొందు
నీచుట్టి విడిచిన నిరుపమ మాల్యముల్
ముదమంది కొప్పులో ముడిచికొందు
నీమహా త్తరపాదనీరేజతీర్థంబు
చేఁ దాల్చి శిరమునఁ జిలికికొందు

నీనోటికఁ బంపు నెఱిపీడె మిచ్చుచో
నమృతంబుగాఁ గేల నందుకొందు
గీ॥ నీదు పాదుక లౌదలఁ బాదుకొలిపి
చెనఁటి జన్మంబు సఫలతఁ జేసికొందు
నయ్య! దాస్యమొసంగఁ గదయ్య! నేఁడు
వీతభవతృష్ణ రంగేశ వేషకృష్ణ!

సీ॥ నిబిడ నిష్ఠుర బాణ నిర్ఘాత పాత ప
తత్ప్రతీపావనీ భృత్ప్రతీక
శశ్వత్స్రవద్రక్త ఝరకర్దమితశమీ
కాంగణాభోగ విశదచలచక్ర
రథసమాకృష్టివైపథికసారథికళా
హితకృచ్ఛ్రవిక్రమదార్త వివిధ
కంకళానిష్కళకరమ నిష్ఫలీకృత
రథికలోకపురస్సరత్కరాళ
గీ॥ శరవిఖండితసాదినిసాదిపతన ధావమానాశ్వగజమయ్యె దావకాను
జన్మకోల్తల కనిలోన శత్రుసేన వీతభవతృష్ణ రంగేశ వేషకృష్ణ!

## భుజిమెళ్ల భగవచ్ఛాస్త్రి

(క్రీ.శ. 1830 ప్రాంతము)

"తిరుమల శ్రీవేంకటేశ త్రిదశాధీశా"

అను మకుటముగల కందపద్యశతకము రచించెను. పరిషత్తువారిచే ప్రకటితము.

### తిరుమల శ్రీవేంకటేశశతకము

క. శరణాగతపరిపోషా! సురుచిర మృదుసత్యభాష! సుందరవేషా
సురవరహృత్సంతోషా తిరుమల శ్రీవేంకటేశ త్రిదశాధీశా!

క. శిరమున రత్నకిరీటం బురమునఁ గౌస్తుభము వెలయ నురుకుండల స
త్కరకంకణములుఁ జెలఁగెడు తిరుమల శ్రీవేంకటేశ త్రిదశాధీశా!

# వెల్లాల నరసింగకవి

( క్రీ.శ. 1830 ప్రాంతము )

భర్తృహరిసుభాషితత్రిశతి నాంధ్రమున కందపద్యములతో, వెల్లూరి వెంకటాచలరమణా అను మకుటముతో రచియించియున్నాఁడు. ఇది పరిషత్తువారిచే ముద్రింపఁబడినది.

## భర్తృహరిసుభాషితత్రిశతికందపద్యములు

క. కరిబిసతంతునఁ గట్టను దిరిసెనవిరిమణిని మెదుపఁ దేనె కడలి మా
ధురి నిడనగు మూర్ఖుఁ దెలుప నరుదగు వెల్లూరి వేంకటాచలరమణా!

క. కరికుంభపలముఁ దిను హరి జరనాకలి కష్టపడి రుజను శిథిలంబై
చరమదశనైనఁ బులు దిన నరుగునె వెల్లూరి వేంకటాచలరమణా!

( పరిషత్ప్రకటితము 1931 )

# గాదె ఆదిశేషకవి

( క్రీ॥శ॥ 1830 – 1835 ప్రాంతము )

"చారుతారకనామ కోచ్చర్లధామ" అను సీసపద్యశతకమునకుఁ గర్త. వేదాంత విషయమైన చిత్రబంధ కవిత గలది.

కొచ్చెర్లకోట శతకము

సీ॥ భవరోగములుం బోవు బలువైనమందుల
నెఱిగింతుఁ బెద్దల నెఱిఁగికొనుట
పూర్ణచంద్రోదయంబు పరాత్పరుని సేవ
సంజీవ మనెదు రసాయనంబు
సానంద మైయొప్పు సానంద భైరవి
గురుపాద మే జ్వరాంకుశము దెలియ
దాసోహ మనుట చింతామణి గురు సేవ
మండూర యతి భక్తి యభ్రకంబు

గీ॥ రామనామంబు వీరవిక్రమరసాయ
నంబు రసభూపతి హరివ్రతంబు మదినిఁ
దలఁప నీ సేవ పరమామృతంబుఁ దెలియ
చారుతారకనామ! కొచ్చెర్లధామ!

## అభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యకవి

( క్రీ.శ. 1835 - 1895 )

తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు ముందు నత్యద్భుత శతావధానములు చేసి, అఖండమేధాసంపన్నుఁ డని ప్రఖ్యాతిఁగాంచిన మాడభూషి వేంకటాచార్యులవారు, విద్యాభోజుఁడగు నానందగజపతిని (1851 – 1897) దర్శించినపుడు చెప్పిన శతకము ఆనందగజపతీంద్రశతకము, కవి వైదుష్యమునకు, గజపతీంద్రుని సర్వతోముఖప్రజ్ఞకు నిది తార్కాణము. ఇం దన్నియు సీసపద్యములే కాని యవి సువర్ణమ

యములు. భరతాభ్యుదయము, పుష్పబాణవిలాసము (ఆంధ్రీకృతి) రామావధూటినక్షత్రమాల యీతని కృతులు.

### ఆనందగజపతీంద్రశతకము

సీ. పరమపావన పూసపాటిమహావంశ కలశపాథోరాశి కల్పకంబు
రమ్యవిజయరామరాజ మహారాజ పూర్వజన్మార్జిత పుణ్యరాశి
ఘనగర్భ శుక్తిముక్తాఫలంబుగ గనె జనని శశిని గన్న చందమునను
శ్రీమత్కళింగదేశీయ మహాజన నయనసరోభవానందపదము
అనగ వెలసితి వౌర మహాంతరిక్ష
కాయమానాప్తనిజయశః కల్పవల్లి
మంజుసమపుంజ సుఫలాయమానతార
కానికరచంద్ర యానందగజపతీంద్ర! 17

సీ. సాధుసంస్కృతశబ్ద సంభావణక్రియా
పాటవంబును జూడ పాణినీయ
మఖిల పదార్థ గుణి గుణ విజ్ఞాన
కౌశలంబును జూడ గౌతమీయ
మర్థశబ్ద గుణదోషాలంకృతి రస వి
జ్ఞానంబు గన నలంకారశాస్త్ర
మజ్ఞ సర్వజ్ఞ కాలా శబ్దరూప ని
ర్ధారణంబును జూడ దత్త్వశాస్త్ర
మధిగతస్వాఖిలార్థంబు లగుచు
కరతలామలకములైన కరణిదోచె
నిట్టి పాండిత్య మరుదయ్యె నృపులలోన
ఘనదయాసాంద్ర యానందగజపతీంద్ర! 18

సీ. గజపతి పౌరుషాఖ్యానంబు గల నీకు
ఘనదానవిస్ఫూర్తి గలుగు టరుదె

ఆనంద నామధేయంబు గల్గిన నీవు
గో బ్రాహ్మణ హితంబు గోరు టరుదె
విజయరామాధిపాత్మజుండవై తగు నీకు
గుశలవత్వంబు గలుగుటయు నరుదె
ప్రకటనారాయణ పౌత్రుండవైన నీ
కఖిలాంగ సౌందర్య మబ్బుటరుదె

విజయనగరాధిపత్యంబు వెలయు నీకు
సకల జయములు గల్గు టాశ్చర్యకరమె
గుణము లవి నీకు జన్మానుగుణములయ్యె
ఘనదయాసాంద్ర ఆనందగజపతీంద్ర॥ ( R-591. )

# తరిగొండ వెంగమాంబ

(క్రీ.శ. 1840)

ఈ కవయిత్రి చరిత్రము శతకకవులచరిత్ర చతుర్థభాగమున నున్నది. తరిగొండ వెంగమాంబ రచించిన నృసింహ శతకము చంపకోత్పలమాలికలతో "తరిగొండ నృసింహ దయాపయోనిధీ" అను మకుటముతో 103 పద్యములలో పూర్తియైనది. దీనిలో రాజయోగసారాది గ్రంథములలో వివరింపబడిన శరీరయోగముద్రారహస్యములు చూపఁబడినవి. ఇందుఁ గొన్ని చోటుల వ్యాకరణచ్ఛందో దోషములును నశ్లీలపదప్రయోగమును గానవచ్చుచున్నవి. వస్తుస్వరూపము ననుసరించి తదధికారులకు దోషగణనము ప్రధానము కానేరదు.

భూచరుఁడైన నేమి శివపూజలు చేసి యనేక ముద్రలన్
జూచిన పుణ్యమేమి యది చూడక యుండిన నేమి తక్కువల్
ఖేచరముద్రి గాంచి మది కిన్నరభావము మానసంబులో
గోచరమైన ముక్తి తరికొండ నృసింహ దయాపయోనిధీ!

ఎలమిని సొంపు పెంపొదవ నింజెటి వంశజుఁడైన వెంకటా
చలపతి నామధేయుని నిజాంగన వెంగమ సత్కవీంద్రు లి
మ్ముల ముదమంద నీ శతకమున్ రచియించి యొసంగె మీకుఁ గో
ర్కులు సమకూర్పవయ్య తరికొండ నృసింహ దయాపయోనిధీ.

ఈ శతకము మహాప్రసిద్ధులగు మా. రామకృష్ణకవి గారిచే ప్రకటితమైనది. Journal of Sri Venkateswara Oriental Institute - Vol. V. Part II June. Dec. 1944. P. 1-16

# కట్టమూరి కామేశ్వరకవి

ఈతఁడు "రామప్రభూ" అను శతకమునకుఁ గర్త. వావిళ్ళవారి భక్తిరససంపుటమున ముద్రితగ్రంథమునను నిది ప్రయాగ కామేశ్వరకవి కృతమని వ్రాయఁబడియున్నది. కాని రామప్రభూ శతకకర్త ప్రయాగ కామేశ్వరకవి కాఁడు. ఇతఁడు 'కౌశికగోత్రుఁడు'. ఆ శతకాంతమున "శ్రీమత్కాశ్యపగోత్రజాతుఁడను" అని కలదు. కావున కాశ్యపగోత్రుఁడగు కామేశ్వరకవియే దీనికి కర్త. ఈతఁ డీ శతకమును వ్రాసినట్లుగా విశాఖమండలమువారి కెల్ల విదితము.

## మంగళపల్లి సుబ్రహ్మణ్యకవి

ఈతఁడు "అర్సవిల్లిపురమార్తాండా! జగద్బాంధవా" అను మకుటముతో సూర్యపరముగా నొక శతకము రచియించి యున్నాఁడు. అది క్రీ.శ. 1864 లో ముద్రితమైనది. ప్రశస్తకవనము గలది. ఆర్సవల్లి (హర్షవల్లి - సంస్కృతము) క్షేత్రము, సూర్యదేవతాయతనము గలది. శ్రీకాకుళము జిల్లాలో శ్రీకాకుళము వద్ద గలదు.

## అల్లూరి పుండరీకాక్షుఁడు

ఈతఁడు "శ్రీపురుషోత్తమదేశికోత్తమా" అను మకుటముతో పురుషోత్తమదేశికేంద్రుఁ డను తన గురువుపేర నొక శతకము రచించినాఁడు. శతకము సమగ్రముగ లభ్యమగుచున్నది. కవినిఁ గూర్చినది-

ఉ. మోక్షఫలప్రదాత వని మ్రొక్కులు వేయును మ్రొక్కి యీ కృతిన్
మోక్షము కోరి నీకొసఁగి పుణ్యుఁడనైతిని నేను పుండరీ
కాక్షుఁడ నేటి దాసుఁడను నారయ నర్సనమంత్రి పుత్రుఁడన్
శిక్షకుఁడన్ భవత్కృపను శ్రీపురుషోత్తమదేశికోత్తమా!

(R-511)

# పూండ్ల చెంగయకవి

## (క్రీ.శ. 1840 ప్రాంతము)

"శయనపురిధామ దనుజసంచయవిరామ
చండకరకోటిధామ కోదండరామ"

అను మకుటముగల సీసపద్యశతకమునకుఁ గర్త.

### కోదండరామశతకము

సీ. శ్రీ లలరంగ నాహ్వేల కులాబ్ధి శు
భాంశుఁడౌ పూండ్ల శేషాభిధాను
పౌత్రుఁడ పిచ్చయపుత్త్రుండ చెంగయా
హ్వాయుఁడను విబుధసంచయవిధేయుఁ
డను భవత్ శ్రీపాద వనజాత యుగమిళిం
దన్మానసుఁడ భరద్వాజగోత్ర
సంజనితుండ యుష్మద్దాసదాసుండ
నతిభక్తితో సీసశతక మిదియు

గీ. నొనర రచియించినాఁడను గొనుము దీని
నమల భవదీయ కరుణారసాప్తి నించి
శయనపురిధామ! దనుజసంచయవిరామ
చండకరకోటిధామ! కోదండరామ!

# కొల్లూరి కామశాస్త్రి

## ( క్రీ.శ. 1840 - 1907 )

ఈతఁడు విజయనగర సంస్థానాధీశుఁడై విద్యాభోజుఁడని వినుతికెక్కిన యానందగజపతీంద్రుని ( 1879 - 1897 ) యాస్థానమున వెలసిన విద్వత్కవి. సంస్కృతసాహిత్యమునం

దీతని పాండిత్య మసాధారణమైనది. మహావైయాకరణి మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రులవారి కీతడు సాహిత్య గురువు. ఈతఁడు తెలుఁగున నిర్ణయసింధువు అను ధర్మశాస్త్రగ్రంథమును వచనముగా రచియించియు న్నాఁడు. అది విజయనగరసంస్థానాధీశు లచ్చు వేయించిరి. ఇదిగాక యీతఁడు "రఘునాయకశతకము" అను పేర రామస్తుత్యాత్మకమైన శతకమును రచియించినాఁడు. ఈ శతకశైలి ప్రౌఢమైనది.

ఉ. డింభక ఘాతుకాతత గిరితటీనికటీకృత భేదబోధక
స్తంభవిదారణక్షణత సితస్వనఖాంకురలగ్నదైత్యరా
డ్డంభసటాచ్ఛటాస్ఫురిత తారకితాభ్రనృసింహవేషునిన్
సంభృతదాసు నెంతు రఘునాయక భక్తవరప్రదాయకా!

ఉ. కల్యభిమానహార్త్రగుణగానవిలాసకథానిధాన మా
ద్గల్యసగోత్రుఁ డార్యనుతధన్యచరిత్రుఁడు కామశాస్త్రి మం
గళ్యకరమ్ము పద్యశతకమ్ము సమర్పణచేసె భక్తమం
డల్యనుకంపఁ గొమ్ము రఘునాయక భక్తవరప్రదాయకా!

ఈ శతకము కీ. శే. చెలికాని లచ్చారావుగారి శతక సంపుటమున ముద్రితమైనది.

# శిష్టు సర్వశాస్త్రి

అమరుకము నాంధ్రీకరించుటయేగాక, జ్ఞానప్రసూనాంబికాశతకమును రచియించిన సర్వశాస్త్రి - లలితాస్తోత్ర

మను పేర సీసపద్యశతకము నొకదానిని రచియించి యున్నాఁడు.

"అధరజిత బింబ శ్రీనగరావలంబ
పదనమద్దేవమునికదంబ లలితాంబ"

అను మకుటము - క్రీ.శ. 1842 లో నీ శతకరచనము జరిగినది. ఇందలి శైలి ప్రశస్తమైనది.

సీ. శ్రీమదాగమ సమాశ్రితపరబ్రహ్మంబ; విపులచిదానంద విలసనంబ
ఫలపరిపూర్ణసకలతంత్రసారంబ; చారుతరానీన చంద్ర బింబ
జితమహీమండలాకృతిభాసురనితంబ; నియతభక్త్యావన నిర్విలంబ
లలితనిజోత్సంగలాలితహేరంబ; కబరీనివేశిత ఘనకదంబ

గీ. శయకృతవినూత్నతరకుశేశయవిడంబ । మానితాత్మీయకేళికాధీనసాంబ
అధరజితబింబశ్రీనగరావలంబ । పదనమద్దేవమునికదంబ లలితాంబ.

# యామునచర్ల కోదండరామకవి

ఈతఁడు తిరుత్తని పురమున వెలసిన చెంగల్వరాయ (సుబ్రహ్మణ్యస్వామి)ని నాయకునిఁగాఁ జేసి నాయకుని దూతీముఖమున నాయిక పిలిపించునట్లు గల విప్రలంభశృంగారశతకమును రచియించెను.

"రామ నీ వల్ల చెంగల్వరాయు నిటకు
తోడుకొని వేగరాగదే తోయజాక్షి."

అను మకుటము - ఇందు 64 పద్యములు మాత్రమే లభించుచున్నవి.

సీ. శ్రీసదాశివరూప చిహ్నాచే చెలుతని
పురమేలువాఁడె నా పురుషుఁడమ్మ!
కలుషాంధకారముల్ ఖండింప దినమణి
చెన్నొందు వాఁడె నా చెలువుఁడమ్మ
అనుదినంబును భక్తజనుల రక్షించెడి
ఘనకీర్తివాఁడె నా కాంతుఁడమ్మ
ఏవేళ ననుగూడి భావంబు రంజిల్ల
దేలించు వాఁడె నా దేవుఁడమ్మ

గీ. ధరను యామనచర్ల కోదండరామ
సుకవి రక్షించువాఁడె నా సొబగుఁడమ్మ
రామ నీవల్ల చెంగల్వరాయ నిటకు
దోడుకొని వేగరాఁగదే తోయజాక్షి.

సీ. నిండుచందురుఁ గేరు నెమ్మోము గలవాడు
కలువ రేకులఁ బోలు కనులవాఁడు
తళుకుటద్దపు జోళ్లు దనరు చెక్కులవాడు
సుదతి నైనయట్టి నెన్నుదురువాడు
దీపితంబై మీరు దివ్యదేహమువాడు
తమ్మిలవంటి నేత్రములవాఁడు
పద్మరాగము పెంపు పరగు వాతెఱవాఁడు
తలిరుల మీఱు పాదములవాఁడు

గీ. కులుకు నడలందు ముద్దులు గులుకువాడు
మేలిమిగ నెల్ల లోకంబు లేలు వాడు
రామ నీ వల్ల చెంగల్వరాయ నిటకు
దోడుకొని వేగరాగదే తోయజాక్షి.

సీ. కమలంబ కానవే కమలపత్రాక్షుని, కుందంబ కానవే కుందరదను
వకుళంబ కానవే వకుళపుష్పార్చితు, కుముదంబ కానవే కుముదవర్ణు
చూతంబ కానవే చూతపల్లవపదు, కనకాంబ కానవే కనకచేలు
కేతకి కానవే కేతనాంశువిలోలు, బంధూక కానవే బంధురితుని

గీ. అనుచు వెదకుచునున్న వాయబ్జముఖుని
జూచి యుండెదె తగదని పల్కరాదె
రామ నీ వల్ల చెంగల్వరాయు నిటకు
తోడుకొని వేగరాగదే తోయజాక్షి.

# గా ను గ పా టి కో ట య్య

(క్రీ.శ. 1858 ప్రాంతము)

కంచివరదరాజస్వామి వారికంకితముగా నీకవి "శ్రీకంచి వరదరాజ!" అను మకుటముతో నొక సీసపద్యశతకము రచియించియున్నాఁడు. శతకరచనాకాలమును కవియే యిట్లు తెలిపియున్నాఁడు.

సీ. వెయ్యెన్ని యేనూర్వెలయంగ నెనబది
యగు శాలివాహన యమరశకము
నందు సిద్ధార్థియు నయమొప్ప మఱియింక
భాద్రపదంబున బహుళమందు
వరదరాజేశ్వర వరున కంకితముగా
వరగంగ శతకంబు భక్తితోడఁ
బరువడి గానుగపాటి కోటయచేత
నలుపంగఁబడియెను చతురతముగ
దీని పఠియించువారలు తేజమలరఁ
దప్పకెప్పుడు ముక్తిని దలఁచుగాఁగ
నొప్పియుందురు భువిలోన నొక్కమొగిని
గలుగు సాయుజ్య మప్పుడు గణుతికెక్క (సంఖ్య 1483).

శతకమున 102 పద్యములున్నవి.

# పద్దిపర్తి కోనమరాజకవి

( క్రీ॥శ॥ 1754 - 1834 )

ఈతఁడు ఆఱ్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు శ్రీవత్సగోత్రుఁడు. వేంకటామాత్యపుత్రుఁడు. నివాసము విశాఖపట్టణమండలమున సర్వసిద్ధి. ఈతఁడు మహాలక్ష్మీపరిణయము, వేంకటేశ్వరోపాఖ్యానము, రేవతీపరిణయము అను మూఁడు ప్రబంధములు రచియించెను. అందు మొదటివి రెండును ముద్రితములైనవి. వానిలో మహాలక్ష్మీపరిణయ మాంధ్రప్రబంధములలో నుత్తమమైన శ్రేణికిఁ జెందినది. ఈతడు తన స్వకీయవృత్తాంతమును శ్రీరామునికి నివేదించుచు నొక సీసపద్యశతకమును రచియించెను. "జానకీరామ రవికుల సార్వభౌమ" అను మకుటము. తన స్వంత దావా సమయమున కోర్టువారి యెదుట నీక్రింది విధముగ శ్రీరాముని ప్రార్థించెనట. వెంటనే కోర్టువా రీతని పక్షమున తీర్పు గావించిరట.

సీ॥ ధరణి మున్నుబు సభాస్థలి సుధర్మామధ్య
సింహాసమున వేంచేయు దేవ!
ఘనవచోమూలకృత్ గ్రంథకారుల మనం
బున భారతీదేవి నునుపు దేవ!
సాక్ష్యవిచారణసమయమందు ధరాధి
పంచభూతములఁ బల్కించు దేవ!
పరికించి తీర్చెడి ప్రభువు జిహ్వాగ్రంబు
నను ధర్మదేవత నునుపు దేవ!

గీ॥ నిజము సాధించి నాభూమి నిర్వహించి
తీర్పు నాపక్షముగఁ జేయు దేవదేవ!
కదనరిపుభీమ! చండభార్గవవిరామ
జానకీరామ! రవికులసార్వభౌమ!

(కవి వృత్తాంతము క్రీ.శ. 1917 లో కవిపౌత్రులగు వీరరాఘవస్వామిగారిచే ముద్రితమైన మహాలక్ష్మీపరిణయపీఠిక నుండి గ్రహింపఁబడినది.)

## వద్దిపర్తి అప్పయకవి

( క్రీ.శ. 1805 – 1885 )

ఈతఁడు వద్దిపర్తి కోనమరాజకవి పౌత్రుఁడు. వెంకట రెడ్డి పుత్రుఁడు. ఈతఁడు రామశతకమును, మహాప్రభూశతకమును, కొన్ని కీర్తనలు రచించెను. వానిలో రామశతకము ముద్రితముకాలేదు. మహాప్రభూశతకము క్రీ.శ. 1930 లో ముద్రితమైనది. ఇందుండి కొన్నిపద్యము లుదాహరించుచు న్నాను. అచ్చటచ్చట రామప్రభో, ఆత్మప్రభో, అను మకుటము లున్నవి.

ఉ॥ శ్రీకరముల్ సమస్తశుభచిహ్నితముల్ ఘనభక్తియోగ ల
క్ష్మీకరముల్ ముముక్షుజనసేవితముల్ విధిరుద్రదేవతా
నీకశరణ్యముల్, కులిశనీరజశంఖగదాదిచక్రరే
ఖాకలితాంఘ్రిపద్మములు గన్గొనగోరెద నాత్మలోన మో
క్షాకరమైన యట్టి భవదంఘ్రులఁ జూపఁగదే మహాప్రభో!

మ॥ వరశ్రీవత్సపవిత్రగోత్రజుఁడ శ్రీవత్సాంకసేవానుమో
దరతుండన్ రఘురామభక్తుఁడ, భవద్దాసానుదాసుండ నీ
చరణంబుల్ విడువంగఁ జాలనిక నీ సందేహముల్ మాని నన్
గరుణింపంగదవయ్య శ్రీధరహరీ కంజాక్షరామప్రభో!

శా॥ ఆధారాదిషడబ్జపత్రముల నిత్యానంద మింపొంద ని
ర్భేదబ్రహ్మపదార్థనాశము తుదన్ గ్రీడించు మూర్ధన్యంబునం
దాదిత్యప్రభ వెల్గుచుండెడు సహస్రారాబ్జమధ్యస్థునిన్
మోదంబొప్ప భజింతు నక్షరపరున్ మోక్షేచ్ఛ నాత్మప్రభో!

( ఈ శతకమును, నిక్కవి రచియించిన కీర్తనయు క్రీ. శ. 1930 లో కవి సోదరపుత్రుఁడగు వెంకటరెడ్డిచే ముద్రింపబడి ప్రకటింపఁబడినవి. )

## శ్రీపతి పండితారాధ్యుల పండితస్వామి

( క్రీ.శ. 1819 - 1903 )

వీరు శైవపండితత్రయమున ప్రథములగు శ్రీపతి పండితుని వంశీయులు - ఆరాధ్య బ్రాహ్మణులు - కౌసిక సగోత్రులు - సంస్కృతాంధ్ర భాషలలో సమాన పాండిత్య ముగడించి, బహుశైవమతగ్రంథకర్తయై తన జీవిత సర్వస్వ మును శైవమత వ్యాప్తికి నర్పించిన మహానుభావులు. సికిం ద్రాబాదున సెకెండుబజారునగల పండితస్వామిమఠము వీరు నిర్మించినదే. సంస్కృతమున శ్రీకరభాష్యము, ఉపనిష ద్భాష్యము, సవైదిక వీరశైవ సిద్ధాంత ప్రకాశిక మున్నగు గ్రంథములు రచించిరి. తెలుఁగున (1) మహాదేవమననము

(వచనము - పూర్వోత్తరభాగములు) (2) సత్యవేదాంత సిద్ధాంత సారసంగ్రహము (3) చందనచర్చావిలాసము (4)శివభక్తచింతామణి (5) శివభజనకీర్తనలు (6) రాజలింగ (7) బసవ (8) మల్లికార్జునశతకములు రచించిరి. వీనిలో లభ్యమైన బసవశతకమును గూర్చి యిందు వివరించుచున్నాను. ఇందు పాల్కురికి సోమనాథుని కృతికి ననుకరణము లుండుటచే, వాఙ్మయచరిత్రకారుల కిది చాల ముఖ్యమైనది.

బసవశతకము - 142 కందపద్యములు - "బసవా" అను మకుటము - పోకల శేషాచలమునాయనివారిచే పరిష్కృతము. శ్రీహరి ముద్రాక్షరశాల (చెన్నపురి) లో 1893 లో ముద్రితము. 25 పుటలు. చిన్నసైజు.

క. శ్రీపతి పండిత వంశజ। శ్రీపతి నుతచరణకమల సేవింతు నినుఁ
యాపత్పరంపరాటవి । బాపి సుఖింపంగజేయు భవహర బసవా!

ఇందు, లింగాంగవిచక్షణము, శివరాజయోగస్వానుభూతి, శివజ్ఞాన పద్ధావతి (?) పరిపూర్ణ బోధ, యెఱుగుని వాక్యములు, పరశివవేత్తల రీతి, పరశివపరిపూర్ణలక్షణము, దేహాత్మవైలక్షణ్యనిరసనము, శివయోగస్థితి, నిరావరణరీతి, ఎఱుకవిడిచిపోవుక్రమము-అను శీర్షికలు గలవు. ఇందు పాల్కురికి సోమనాథుని యనుభవసారమునకు ననుకరణములు గలవు.

అనుభవసారము :—

క. కన్నిడునే పరసతులకుఁ దన్నిడునే భక్తుఁ డన్యదైవంబులకున్
వెన్నిడునే భవములకును మున్నిడునే మనము విషయములకు మహాత్మా!
(118)

బసవశతకము :—

క. వెన్నుడునే భవబాధకు కన్నుడునే పూర్ణుఁ డితరఘనదృశ్యముపై
తన్నిడునే వ్యర్థముగా మిన్నడునే విషయమందు మెలఁగఁగ బసవా!
(99)

అనుభవసారము :—

క. చేరునె మానవసంగతి కోరునె దుర్వ్యసనసుఖముఁ గుటిలాత్ముండై
పారునె సుఖగోష్ఠియెడం గోరునె పరధన నిషక్తి గుణరత్ననిధీ!(119)

బసవశతకము :—

క. కోరునె దుర్విషయంబులు చేరునె కుచ్చితుల చెంత శివయోగివరుల్
పారునె సద్గోష్ఠ్యందున పోరునె దుచ్ఛాస్త్రరీతి పొలుపుగ బసవా! 97

అనుభవసారము :—

క. కూడునె యుపాధిగుణములు
నోడునె వంచించి యవసరోచితములఁ దెరం
డాడునె సద్భక్తుఁడు కొం
డాడునె భవవిపినముల మహానందాత్మా! 121

బసవశతకము :—

క. వేడునె హరుని ఫలంబులు
కూడునె భవబంధరూపకృత్యము లెల్లన్
వీడునె భక్తిభయంబులు
వాడునె ముఖకాంతి దుఃఖవహ్నికి బసవా! 101

అనుభవసారము :—

క. జాఱునె నియమవ్రతముల
మీఱునె శివునాజ్ఞ నెందు మితిగడవకమున్
పాఱునె పలుత్రోవలకును
దాఱునె భక్తుండు భక్తతతిఁ ద్రిపురారీ! 122

బసవశతకము :—

క. మీఱునె హరగురుచరులను
తాఱునె శివయోగమందు తత్త్వసుయుక్తిన్
దూఱునె మూర్ఖుని కైవడి
గేరునె శివధర్మనిష్ఠ కేవలబసవా! 98

అనుభవసారము :—

క. కొనునే నిషిద్ధపాకము వినునే శివదూషణంబు వేరొకతోఁ ద్రివం
జనునే సద్భక్తుఁడ నే ననునే గర్వించి భక్తియందు మహాత్మా! 120

బసవశతకము:—

క. వినునే దుచ్ఛాస్త్రంబులు కనునే లింగావ్యయములు ఘనదృశ్యములన్
జనునే బద్ధపుఁగర్మకు ననునే ముక్తుండ ననుచు నవ్యయ బసవా! 100

# వెదురువాడ కణ్వలింగము

(క్రీ. శ. 1850 ప్రాంతము)

ఈతఁడు, "భూసురోల్లాస అంగరపురనివాస కరధృతకురంగ భస్మాంగ కణ్వలింగ" అను మకుటముతో నొక సీసపద్యశతకమును రచియించియున్నాఁడు. అందు కొన్ని పద్యములు లభ్యమైనవి. ఈతఁడు తూర్పుగోదావరిజిల్లాలోని అంగరగ్రామ వాస్తవ్యుఁడు. (సంఖ్య 1484.)

సీ. శ్రీమహాదేవేశ చిన్మయ సర్వేశ
పరమేశ భక్తహృత్పద్మభృంగ
భుజగేంద్రకేయూర పురదైత్యసంహార
నగజామనోహర నందితురగ
నిన్నుఁ బూజించెద నేఁ గవుల్ నుతిసేయ
వాక్ప్రసూనంబుల పన్నె మీఱ

దురితాంధకార భాస్కర నీవు ధర్మార్థ
కామమోక్షంబులు గలుగఁజేసి
కరుణతోఁ దుత పెదరాడ కణ్వయాఖ్య
కోర్కె లొనఁగూర్చు మని వేడుకొంటినయ్య
భూసురోల్లాస అంగరపురనివాస
కరధృతకురంగ భస్మాంగ కణ్వలింగ!

సీ. భూతేశ యని నిన్నుఁ బొందుగాఁ దలచితే
భూతభయంబులు పూనలేవు
పరమేశ్వరా యని పలుమారు దలఁచితే
పరభయంబు లవన్ని పాఱిపోను
సర్వేశ్వరా యని సతతంబు దలఁచితే
జ్వరభయంబులు తన్నుఁ జేరవెఱచు
త్రిపురాంతకా యని స్థిరముగాఁ దలఁచితే
సకలకర్మంబులు వికలమగును
ఆట్టి మంత్రంబు నాజిహ్వ కనువుపరచి
ప్రోవవే నీకు మ్రొక్కెదఁ బుణ్యమూర్తి
భూసురోల్లాస! అంగరపురనివాస
కరధృతకురంగ భస్మాంగ కణ్వలింగ!

# వెలివెల శంభుమూర్తి

(క్రీ.శ. 1890 ప్రాంతము)

ఈతఁడు తూర్పుగోదావరీమండలమున నున్న మురుమళ్ళ గ్రామమందలి వీరశంకరేశ్వరుని పేర "మురుమళ్ళ పురాధిప వీరశంకరా" అను నొక చంపకోత్పలమాలికా శతకమును రచియించి యున్నాఁడు. ఇది శృంగారరసాత్మకము – 105 పద్యము లున్నవి. మచ్చునకు :—

శ్రీకరుణాసముద్రి నినుఁ జిత్తమునందుఁ దలంచి ప్రేమ నీ
రాకలఁ గోరుచుండు ననురాగముతోడ నిరంతరంబునున్
ప్రాకట మైన నీచరణపద్మములే గతి యంచు నమ్మితిన్
మాకు నభీష్టమిమ్ము మురుమళ్ళపురాధిప వీరశంకరా !

# మల్లంపల్లి బుచ్చికవి

( క్రీ.శ. 1850 ప్రాంతము )

బొబ్బిలిదొరవారి యాస్థానపండితుఁడై హాలాస్యక్షేత్ర మహాత్మ్యాది ప్రసిద్ధగ్రంథకర్త యగు బుచ్చికవి సుందరేశ్వర శతకమును రచియించి యున్నాఁడు. "సుందరేశ్వరా" అను మకుటము గలది. శతకము అముద్రితము – 101 పద్యములు. * మచ్చునకు :—

ఉ. జ్వాలత యద్రిఁ గూర్చి రవిచంద్రులఁ గండ్లనుఁ జేర్చి సా
బాలున బాలదార్చి తెలివంకను జూటమునం దమర్చి గో
పాల విధీంద్ర ముఖ్యపరిపాలన కోర్చిన నిన్నుఁ గూర్చి నేఁ
జాలఁగ సన్నుతించెదను సారెకుఁ బ్రోవుము సుందరేశ్వరా!

# వడ్డాది కృష్ణమరాజు

( క్రీ.శ. 1890 ప్రాంతము )

"రమారమణాలసద్గుణా!" అను మకుటముతో చంపకోత్పలమాలికారూపమున నొక శతకమును పై కవి రచియిం

* ఈతని వంశమునుగూర్చి, యీతనిగూర్చి, 1950 జాన్యువరి తే 7 ది యందు వెలువడిన "త్రిలిఙ్గ" పత్రికలో సంపూర్ణ వివరములను అనుబంధ గ్రంథకర్త యిచ్చియున్నాఁడు.

చెను. తండ్రి కృష్ణమరాజు. తక్కిన వివరములు తెలియవు. విష్ణుస్తుతి, లోకనీతి విలసితము - 108 పద్యము లున్నవి.

ఉ॥ విందగుతావి నొప్పు నరవింద మరంద మమందగక్తి నిం
దిందిరబృందమానిచెడఁదీయ, దిభేంద్రము పద్మమూడ్చిత
ద్బిందువుఁ గ్రోలలేదు మృదుభీషణచర్యలకార్యమిట్టిదో
నెందునుఁ జూడవో త్రిజగదీశ! రమారమణా! లసద్గుణా!

## మేడూరి అనంతదాసు

( క్రీ.శ. 1890 ప్రాంతము )

"మత్స్యపురాధినాయకా" అను మకుటముగల విష్ణుస్తుత్యాత్మకమైన చంపకోత్పల శతకము నీతఁడు రచించెను.

ఉ॥ శ్రీయదువంశదీప మునిసేవిత సర్వజగన్నివాస కం
జాయతపత్రనేత్ర శరణాగతరక్ష మహానుభావ నిన్
బాయక తల్చువారలకు భాగ్యము లబ్బును గాక దుర్నివా
రాయతులైన వారలకు నబ్బునె మత్స్యపురాధినాయకా!

ఈతఁడు విశాఖమండలమువాఁడు కాఁదగును. మత్స్యపురి * యీ జిల్లాలో గలదు.

---

* పశ్చిమ గోదావరి జిల్లాలో, నరసాపురమునకు సమీపమున గూడ మఱియొక మత్స్యపురి కలదు. దీనినే మచ్చపురి యని కూడ పిలుచుచున్నారు.

# విశ్వనాథ కామయ్య

( క్రీ.శ. 1850 ప్రాంతము )

"ఉమామహేశ్వరా" అను మకుటముతో ముగియు నీ చంపకోత్పలమాలికావృత్తశతకము, అమరావత్యుమామహేశ్వరుని జాహ్నవిదేవిని సంబోధించి చెప్పుచున్నట్లు విప్రలంభశృంగారాత్మకముగా పై కవీశ్వరుఁడు రచియించినట్లు ఒక తాళపత్రప్రతి మొదల- "విశ్వనాథకామయ్య కవనం" అను వ్రాఁత వలనఁ దెలియుచున్నది. సుప్రసిద్ధుఁ డగు వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడు అమరావతిపురమున నొక పుష్కరిణి శివగంగ గావించెనని యిందు చెప్పబడినది. కావున కవి వేంకటాద్రినాయనివారి కాలములో నున్నవాఁడు. అనగా 18 వ శతాబ్దిపూర్వార్ధము. శైలికి

సురవరపూజితాయ, మృగశోభితపాణిసరోరుహాయ సా
గరశయుసాయకాయ, కనకాచల చాపధరాయ చంద్రభా
స్కరశిఖిలోచనాయ, మునిజాలనతాయ, నమశ్శివాయ, గీ
ర్వరవినుతాయ నిత్యయమరావతిభాస్వదుమామహేశ్వరా!

# మేడూరి కృష్ణదాసు

( క్రీ.శ. 1880 ప్రాంతము )

"వేంకటరామపురీశరాఘవా" అను మకుటముతో చంపకోత్పలమాలికలతో నొక శతకము నీతఁడు రచించెను.

ఈతఁ డాత్రేయగోత్రుఁడు. తిరువేంగళార్యుని పుత్రుఁడు. శతకమంతయు పూర్తిగ లభ్యమగుచున్నది. ఇందు నూట పదునాఱు పద్యములున్నట్లు కవియే యిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. ఉత్పల చంపకంబు లన నొప్పగు నూటపదాఱు పద్యముల్
ఉత్పల చంపకాఖ్య కుసుమోజ్జ్వల మాలిక గా ధరించుఁడీ
తత్పరతన్ త్వదీయ నిజదాసునిఁగా ననుఁ జూచి వేడ్క భూ
భృత్పరతత్త్వరూపహరి వేంకటరామపురీశ రాఘవా!

## బసవన్న

( క్రీ.శ. 1890 ప్రాంతము )

ఈతఁడు విశ్వకర్మ కులజుఁడు. తండ్రి గురవయ్య. తాత మల్లయ. కాంచీపట్టణమునందుగల యంబిక పేర నీతఁడు చంపకోత్పలవృత్తములతో "కాంచిపురియంబ మదంబ ఫల ప్రదాయినీ" అను మకుటముతో నొక శతకము రచియించి నాఁడు. అది అముద్రితము. కవితారచనకు నొక పద్యము నుదాహరింతును.

ఉ॥ శ్వేతచలాధినాథుకృపఁ జెప్పితి నీ శతకంబు లోకపు
ఖ్యాతిగ నీదు పేరిటను గ్రమ్మఱ నంకిత మొప్పఁ జేసి నా
పాతక కోట్ల నెల్లఁ దగఁ బాఱఁగఁద్రోలియు నన్ను బ్రోవు మీ
యాతతశక్తిఁ గాంచిపురి యంబ మదంబ శుభప్రదాయినీ!

(సంఖ్య 1469)

## దెందులూరి పద్మనాభకవి

( క్రీ.శ. 1860 ప్రాంతము )

ఈతఁడు వీరశైవసంబంధమగు "అల్లమప్రభు" శతకము రచించెను. "అల్లమప్రభూ" అను మకుటము. ఈతఁడారాధ్యబ్రాహ్మణుఁడు. యజుశ్శాఖి. కౌశికగోత్రుఁడు. గంగనకు గౌరమ్మకు పుత్రుఁడు. శైలి మనోహరము. అల్లమప్రభువు సాక్షాదీశ్వరాంశసంభవుఁడగు శివయోగి. "ప్రభులింగలీలలు" అను గ్రంథమీతని మహిమ దెల్పునదియే.

ఉ. శ్రీశివ చంద్రమౌళి సురసిద్ధమునీంద్రనుతా మహేశ స
ర్వేశ యనంత కేశిహర విష్ణుసఖా రజితాచలేశ భో
గీశ విభూష శంకర నగేంద్రసుతాధిప చిత్ప్రకాశ భూ
తేశ రతీశభంగ ప్రమథేశ దయానిధి యల్లమప్రభూ!

(సంఖ్య 1474)

## కొక్కొండ వేంకటరత్నము

( క్రీ.శ. 1842 – 1915 )

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు, సంస్కృతమున బిల్వనాథశతకము, తనుమధ్యావ్యాశతకమును రచించిరి. అవి క్రీ.శ. 1868 - 70 ప్రాంతమున ముద్రితములైనవి. తెలుఁగున బిల్వేశ్వరశతకమును రచించిరి. అది క్రీ.శ. 1902 లో ముద్రితమైనది. అది చాలవఱకు పంతులుగారి స్వీయచరిత్రయే.

మ. ధరణి న్సజ్జను లెల్ల మెచ్చ ననవద్యంబా ప్రిజోత్పత్తి వ
త్సరమందు న్విజయాది రాఘవకృపక్ సంజీవనీనామ వి
స్ఫురితం బే నిడ మాసపత్త్రిక యదింపుం బెంచి పంద్రెండు వ
త్సరముల్ నిండఁగ నంతరించె జగధీశా! బిల్వానాథేశ్వరా!

ఇందు బిల్వకేశ్వరా! శ్రీశ్వరా! అను మకుటములు గల చంపకోత్పలమాలికలు కూడ కలవు.

# విక్రాల రంగాచార్యులు

( క్రీ.శ. 1845 ప్రాంతము )

ఈతని శార్దూలశతకమును వావిళ్ళవారు ముద్రించిరి. తిట్టు శతకములలో పట్టయినది. వేంకటగిర్యధీశ్వరుఁ డగు శ్రీగోపాలకృష్ణయాచేంద్రుని పైఁ జెప్పినది.

శా॥ ద్రవ్యంబున్ జనతాసమృద్ధిగల తా రాజంచు గర్వించి సం
భావ్యంబైన మదీయ భూమిఁ గొనె గోపాలుండు నాకేమి క
ర్తవ్యంబున్నది యింక శాపము వినా దైవంబు కాఁబట్టి దు
ష్టవ్యాపారుఁడు వీఁడు చచ్చు ననితిన్ శార్దూల విక్రీడితన్.

శా॥ కాలా! కంఠగతాసువున్ చన హతుంగావింపవే రాజగో
పాలున్ వేంకటగిర్యధీశ్వరుని విప్రక్షేత్రబాధాకరున్
శూలిద్రవ్యహరున్ సమాదృత మహాశుంఠాప్త వేగంబ శా
ర్దూలాకారముఁదాల్చి సాధుజన సంతోషమ్ము వర్ధిల్లగన్.

# తిప్పాభట్ల వెంకటశివకవి

(క్రీ. శ. 1870 ప్రాంతము)

ఈతఁడు లింగాంబికా వరదసూరుల తనయుఁడు. కౌండిన్యగోత్రుఁడు. తాత సూరార్యుఁడు. ఏలూరిలో నుండెడు సంతానగోపాలదేవునిపై "సరసదరహాస యేలూరిపురనివాస! గోపికాలోల సంతానగోపబాల" అను మకుటముగల సీసపద్యశతకము రచియించినాఁడు. దీనికి స్వీయముగా తానే సంస్కృతభాషలో టిప్పణి రచియించియున్నాఁడు. "అది సంజీవని" యను పేరు గలది. ఈతఁ డీ శతకమును రచించునాఁటికి పంచవింశదబ్దవయస్కుఁడట! శతకము సంపూర్ణముగఁ గలదు. (సంఖ్య R 323)

## సంతానగోపాలశతకము

సీ॥ శ్రీరమ్యహృదయానుసార సారసపత్రనేత్ర నేత్రత్రయస్తోత్రమహిమ
హిమగిరి వసుగి ర్యహీనకనద్ధీర ధీరజనోద్ధార ధారణాస
నాదియోగాంగ క్రియోవిచింతిత పాద పాదలగ్నానంతవేద బృంద
బృందార కోచ్చయార్పిత సప్తసంతాన సంతానతరు సమసమరభీమ
గీ॥ భీమశత్రువినాశనాశామదేభతుండ సన్నిభకౌశల దోర్విలాస
సరసదరహాస! యేలూరిపురనివాస! గోపికాలోల సంతానగోపబాల!

సీ॥ సారిది నాపస్తంబసూత్రుఁడఁ గౌండిన్య
గోత్రుఁడ సూరార్యపౌత్రుఁడ వర
దాహ్వాన సూరి లింగాంబికా పుత్రుఁడఁ
గామసూర్యానుజుఁడ రామయాహ్వ

నహఁ గోనయాభిదునకును బూర్వజుఁడ ది
ప్పాభట్ల వంశ్యుఁడ పంచవింశ
దబ్దవయస్కుఁడ నఖిల వేదాంతాది
సత్కళాచతురుడ సంస్కృతాంధ్ర

గీ॥ భాషణావిశేషశబ్దగుంభనకవిత్వ పటిమధీయుతుఁడను వేంకటశివకవి
జెప్పితిని నీదు శతక మాశ్రితనివాస సరసదరహాస...... ...........

కవియే దీనికి సంస్కృతమున సంజీవని అను వ్యాఖ్యానము రచియించియున్నాఁడు. "ఇతి తిప్పాభట్ల వేంకటశివ సూరి విరచితాయాం సంజీవనీసమాఖ్యాయాం సంతానగోపాలశతకమ్ సమాప్తమ్" అని గ్రంథాంతమున గలదు.

(R 322)

## ప్రరేప లక్ష్మణాచార్యుఁడు

( క్రీ.శ. 1880 ప్రాంతము )

కురంగేశశతక మను పేర, కోరంగి యందుండెడు శివునిపై నీతఁ డొక సీసపద్యశతకమును రచియించినాఁడు.

భువనమందార కోరంగి పురవిహార
భావభవభంగ భక్తహృత్పద్మభృంగ
శ్రీశివార్ధాంగ యో కురంగేశ లింగ!

ఈ శతకము నీతఁడు పేకేరను గ్రామమున నున్న ప్రెగడపాటి సుబ్బారాయుని ప్రేరణచే రచించెను. కావున నీతఁడు తూర్పు గోదావరీ మండలమువాడు. ఇందు 105 పద్యము లున్నవి. (పశ్చిమగోదావరీమండలములోఁ గూడ నొక పేకేరు కలదు.) (R 367)

సీ. శ్రీదేశికోత్తముఁ జిత్తమ్ములో నిడి
హరిహరబ్రహ్మాది సురలఁ బొగడి
మానుల వేఁడి సుజ్ఞానులఁ గొనియాడి
కాళిదాసాది సత్కవుల బాడి
సకలచరాచరాత్మక మైన విశ్వంబు
పేర్వాడి నాదైన భీతి వీడి
సకలంబు నీయందు సకలంబులో నీవు
గూడి యున్న విధంబు జూడఁ దెలిసి
గీ. సీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు
భువనమందార కోరంగిపురవిహార!
భావభవభంగ భక్తహృత్పద్మభృంగ!
శ్రీశివార్థాంగ యో కురంగేశలింగ!

సీ. శ్రీమదాంధ్రక్షమాసీమంతినీ ముఖ
మ్మనఁగఁ జేకే రను ఘన పురమ్ము
గలదు వసిష్ఠాపగాపూతమై యందు
నెందుఁ జేర్కొన్న బాలేందుధరుని
నర్చించు పురుషోత్తమాఖ్యుఁడై పేరిరేప
వంశవర్ధనుఁ డన వసుధ వెలసె
ఆ మహాత్ముని పుత్రుఁడగు లక్ష్మణార్యుఁడఁ
గోరంగి యను పురి నోర్కు లలరఁ
గీ॥ బ్రిగడపాటి కులంబునఁ బ్రబలుచున్న
సుబ్బరాయని ప్రార్థన సుస్థిరముగఁ
జేసి నీమీఁద పద్యముల్ చెప్పినాఁడ
శ్రీశివార్థాంగ యో కురంగేశలింగ!

సీ. వరహంస ఖగపతివాహన ప్రముఖ గీ
ర్వాణులు సంతోషవార్ధిఁ దేల
భారతీముఖదివ్యభామిను లేతెంచి
పార్వతీదేవిని బలిసి కొలువ

బాణుండు మొదలగు ప్రమథు లత్యంత సం
తుష్టాంతరంగులై స్తుతులు సేయ
హిమవత్ ప్రభృతి బంధుహితజనంబులు ప్రీతి
సలుపుచుఁ దమలోన సందడింప

గీ. సర్వమంగళతోఁ గూడి సంతసమున
నందివాహన మెక్కి యమందగతినిఁ
బరమకైలాసపురిఁ జేరి ప్రబలితౌర
భువనమందార! కోరంగిపురవిహార
శ్రీశివార్ధాంగ! యో కురంగేశలింగ!

105 పద్యములు. (R 367)

# సుభద్రార్యుఁడు

(క్రీ.శ. 1890 ప్రాంతము)

ఈతఁడు ప్రతివాదిభీకర రాఘవదేశికుని శిష్యుఁడు. భారద్వాజగోత్రుఁడు "రేవతీ కామ బలరామ రిపువిరామ" అను మకుటముతో బలరామశతకమును సీసపద్యములలో రచించినాఁడు. ఇందు నలుబదిపద్యములు మాత్రమే లభించినవి. ఈతఁ డీ శతకములో తొలిపద్యములో మొదట "శ్రీ కోరుకొండ నృసింహుని భావించి భద్రాద్రిరాముని ప్రస్తుతించి" అని వ్రాసికొనుటచే నీతఁడు తూర్పుగోదావరీమండలములోని వానిగా భావింపవలయును. మరియు నీతఁడే కోరుకొండ నృసింహస్వామిపై నొక వృత్తశతకమును రచించెను అందు 32 పద్యములు లభించినవి. శైలికి –

మ. అసుహృత్సంవిదనీకభీకర నభోయాతాంఘ్రికంజాతరూ
ధసదంగుష్ఠనఖాగ్రనిర్దళదజాండస్త్రస్తగంగాధునీ
రసపూతాఖిలలోకలోకవిలసత్ప్రద్యోతనాలోకభూ
ర్యసమశ్లోకసుకోరుకొండనరసింహా! దైవసింహా! హరీ! (R 365)

# రాజా జనార్దన రంగారావు

( క్రీ.శ. 1850 ప్రాంతము )

ఈతఁడు బొబ్బిలి రాజు. రాయడప్ప రంగారాయ పుత్త్రుఁడు. క్రీ.శ. 1850 ప్రాంతమున నున్నవాఁడు. ఈతఁడు "మిత్త్రవిందాపరిణయము" అను ప్రబంధమునే కాక "భవ్య గుణజాల వేణుగోపాలబాల" అను మకుటముతో రాధాకృష్ణ లీలలు వివరించుచు, నొక సీసపద్యశతకము రచియించియు న్నాఁడు. అందేబదియైదు పద్యములున్నవి. ఈ వేణుగోపాల మూర్తి బొబ్బిలిపురమున వెలసిన మూర్తి. ఇందలి రచన తెలుఁగుపలుకులచే నిండి రసవంతమై యుండును.

## వేణుగోపాలశతకము

సీ. సిరుల వెలుంగు బొబ్బిలిపురవరమునఁ
బరగు శ్వేతాచలపతి నరవర
మందిరోత్తరభాగమందుఁ జెన్నొందు కం
దనపుఁగప్పుల సొంపు తళుకు లొలుకు
పక్కారాపచ్చకంబముల నీలపురాల
మేలిగోడల చాల మిక్కుటంపు
బేడామిను మొనలు బెనఁగు నునుకడాని
గుమ్మముల్ గల గోపురమ్ములు నలు

గీ. గవనుల వెలయఁ జెలఁగు మంగళతరాల
యమున రుక్మిణిసత్యభామాది మదవ
తులు గొలువ నిల్చి నీకు నతాలు సలిపెద
భవ్యగుణజాల! వేణుగోపాలబాల!

సీ. ముంజేత మురుగులు మురిడీలు వెలుఁగ దం
డల బాజుబందులు డంబుమీఱ
చౌల మేల్ముత్యంపుఁ జౌకట్లు దనర శి
రంబున మణికిరీటం బెసంగ
నలుత బంగరు చంద్రహారముల్ తులకింపఁ
గొనచెవి బావిలీ మినుకులీన
మొలఁ గుందనపు నిగ్గు మొలత్రాడు చెలువంద
వ్రేళ్ళను రత్నముద్రికలు చెలఁగ

గీ. రమణ నేతెంచు నీయొయారంబుఁ జూడ
ముద్దుగులుకంగ దేవిడీవద్ద నిలుచు
నతను యుద్ధంబునకు యోధయైన గాథ
భవ్యగుణజాల! వేణుగోపాలబాల! ( R 433 )

# రేగులగడ్డ సాంబశివకవి

## ( క్రీ.శ. 1880 ప్రాంతము )

"కందుల చినవెంకన్నార్యా" అను మకుటముతో ముగియు కందపద్యశతకము నీతఁడు రచించెను. ఇది నీతిస్తుత్యాత్మకము - ఈతఁడు జోగాంబా గోపనల పుత్రుఁడు - కృతినాయకుఁ డగు కందుల చినవెంకన్న వైశ్యుఁడు. చేరిసెట్టి కులమువాఁడు.

క॥ శ్రీగౌరీ వాక్సాధుల కే గణపతి యిష్టసిద్ధు లిచ్చి మనిపెనో
యాగణపతి మీకీవుత వే గరిమన్ గందుల చినవేంకన్నార్యా!

అని మొదలు - ఇందు 103 పద్యము లున్నవి. (R 420)

# గొడవర్తి అప్పలాచార్యుఁడు.

( క్రీ.శ. 1870 ప్రాంతము )

"వరగుణాధార చాంపేయ వనవిహార! బాలగోపాల రాధికా కేళిలోల!"

అను మకుటముతో "చాంపేయశతకము" అను పేర నొక సీసపద్యశతకము నీతఁడు రచించెను. ఇది సమగ్రముగ దొరకుచున్నది. ఈతఁడు శతకాంతమున తన్నుఁ గూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు.

సీ. తర్క వైశేషికోదర్క పాతంజల
వైయాసికీతంత్రి వాగ్విశేష
పరిచయ సాహిత్య పాండిత్య మిసుమంతఁ
గలుగఁజేసితి వని గర్వమంది
కొకిబికి శబ్దముల్ కొన్ని దొంతరవెట్టి
తద్దివ్యనామాంకితముగ గలిపి
అల గొడవర్త్యప్పలాచార్యదాసుఁడు
పద్యశత మొనర్చి పాదయుగళి
దార్చె నైగొని యాచంద్రతారకముగఁ
బ్రబలఁజేయుము ధరణి శుభప్రచార
వరగుణాధార చాంపేయ వనవిహార
బాలగోపాల రాధికా కేళిలోల! ( R 439 )

## శాంతలూరి తిరుమలాచార్యుఁడు

(క్రీ.శ. 1880 ప్రాంతము)

ఈతఁడు, విశిష్టాద్వైతమతప్రవర్తకుఁడగు శ్రీరామానుజాచార్యుని స్తుతించుచు, "రామానుజార్యాగ్రణీ" అను మకుటముతో నొక మత్తేభ శార్దూల వృత్తశతకము రచియించినాఁడు. శతకమున 108 పద్యము లున్నవి. గ్రంథకర్త తన్నుగూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు.

శా. భారద్వాజుఁడఁ దిర్మలాఖ్యుఁడను గోపాలార్యపుత్రుండ సత్
సారప్రాభవ శాంతలూరి కులసంజాతుండ యుష్మద్గుణ
శ్రీరంజిల్లఁగ భక్తిపద్యశతముం జెల్వొప్ప నర్పింతు మత్
ప్రారంభంబు ఫలింపఁజేయను దయన్ రామానుజార్యాగ్రణీ!

## పచ్చమెట్ట పాపయకవి

( క్రీ.శ. 1850 ప్రాంతము )

ఈతఁడు వైశ్యకులజుఁడును వదాన్యుఁడు నగు మగటపల్లి కామయశ్రేష్ఠిపై యొక శతకముఁ జెప్పెను. శతకమంతయు కందపద్యమయము. చక్కని కవిత.

క. చెఱువు, గుడి, తోఁట, బావియు
ధరఁ బుట్టి నశించు స్థిరతఁ దాల్పదు తిరమై
పరఁగుఁగదా పద్యము హి మ
కరునివలెన్ మగటపల్లి కామయచంద్రా!

ఈతఁడే 'మహిషాసురమర్దనీ శివా!' అను మకుటము గల మఱియొక శతకము రచించెనట. అందొక పద్యము మాత్రమే లభించుచున్నది.

# అయ్యనకోట పార్థసారధి

( క్రీ.శ. 1851 - 1918 )

ఈతఁడు సత్యవిజయ మను ప్రశస్తమగు నచ్చతెనుఁగు ప్రబంధము రచించెను. కులాల కులజుఁడు. ఈతని కుమార శతకము లోకనీతివిలసితము.

కం. ధరణిఁ గులాలుఁడు కవికుంజరుఁ డయ్యనకోట పార్థసారథి నీకున్
వరవిద్య బుద్ధి యేర్పడ విరచించెను కందశతము వెలయఁ గుమారా!

కం. కాలము గడచిన మగుడదు
కాలము కంటెను ధనంబు గలుగదు ధాత్రిన్
గాల మమూల్యపదార్థము
కాలము గడుపకుము వ్యర్థగతిని కుమారా!

# వడ్డాది తిమ్మరాజకవి

( క్రీ.శ. 1853 - 1917 )

తూర్పు గోదావరి జిల్లా వేగాయమ్మపేట (దొడ్డమపేట) యీకవి నివాసస్థలము. ఈతఁడు పండితవర్యుఁడైన భాగవతుల వాసుదేవశాస్త్రి శిష్యుఁడు. దాక్షారామభీమేశ్వరకందశతకము, శ్రీరామావతార మను ఏకాశ్వాసప్రబంధము, ఆంధ్రబిల్హణీయకావ్యమును యీకవి రచనలు. కోటగోపాలకందసహస్రమును, గీతాతరంగిణి యను పేర కేశవనామకృతులు కూడ రచించెనట! భక్తరక్షణ శతకకర్త యగు వడ్డాది భీమశంకరకవి యీతని తమ్ముఁడు. భీమేశ్వర శతకకర్త యగు భావరాజు వేంకటాచలపతిరాయకవి యీతని శిష్యుఁడు.

## భీమేశ్వర కందశతకము

క. ఇల నీదు నామ రుచి యగ్గలమారా! చెఱకుపానకము కంటెను, ద్రా
క్షల కంటెఁ, బాల కంటెను, బులకండము కంటె దక్షపురభీమేశా!

క. నీ చల్లనిచూడ్కి మెయి ననూచానుని నన్నుఁ గన మనోజ్ఞముగాఁగన్
దోఁచుఁగద మద్భవ మహో పూచినతంగేడె దక్షపురభీమేశా!

క. కందశతకంబు బ్రహ్మానందముతో నంకితం బొనర్చెద నీపే
రందగ నందంబుగ మేల్ పొందుపడఁగ నిపుడు దక్షపుర భీమేశా!

క. ప్రవిమల వడ్డాదికులార్ణవ పూర్ణిమచంద్రుఁ దిమ్మరాజకవీంద్రున్
భవుకము విడి కావుము నను భువనహితావేశ! దక్షపురభీమేశా!

# దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి

( క్రీ.శ. 1853 – 1909 )

శ్రీపీఠికాపురసంస్థానాస్థానకవులైన దేవులపల్లి కవిద్వయమున ప్రథముడు సుబ్బరాయశాస్త్రి. ఈతఁడు మందేశ్వర శతకమును రచించెను. ఇది మత్తేభశార్దూలవృత్తములతో రచితము. మందేశ్వరా అను మకుటము. ఈతని కుమార శతకము సంస్కృతకృతి కనువాదము. తేటగీతములు గలది.

## మందేశ్వరశతకము

శా॥ రాజుల్ భోజులవంటివా రొదవనారా! కాళిదాసోపమ
శ్రీజాగ్రత్కవిరాజులుం గల రిలన్ శ్రీరామచంద్రోపముల్
క్ష్మాజానుల్లల రేని వాయుజనిభుల్ దాసుల్ గలా రేల యీ
యోజల్ పిండికొలంది నిప్పటియుగా నూహింప మందేశ్వరా!

మ॥ వినయంబే సుగుణంబగున్ బరఁలకున్ బ్రేమంబుఁ బుట్టించి లా
లనముం జెందును మెప్పునేర్చి బహుభాషా లాభంబునుం బొందు భ
క్తిని సంధించి సమర్చలం గొనును బ్రీతి న్నించి మేలొందు నో
పు నటుల్గాన జగానఁ దాదృశగుణంబుం గాన మందేశ్వరా!

కుమారశతకము

గీ. ఘనున్నైనను వసులోప మొనరెనేని
లాఘవముఁ జెందు నతఁడు తూలంబు కరణి
తెలివిచే దీని లెస్సగాఁ దెలిసి నీవు
వసువు లార్జింపు మయ్యా తప్పక కుమార!

కం॥ మానం బూనకు మలసతఁ
బూనకు బ్రల్లదములాడఁ బూన కలత్యం
బూనకు బ్రజరాఁ గని హిత
మానట్టుల మున్నె పలుకుమయ్యా కుమారా!

# వడ్డాది సుబ్బారాయఁడు
## (క్రీ.శ. 1854 - 1938)

అద్యతనాంధ్రవాఙ్మయమున, నత్యధిక వ్యాప్తి గల "భక్తచింతామణి" అను శతకమునకుఁ గర్త వసురాయడు వర్తమానాంధ్రకవిజ్యేష్ఠుఁడు. ఈశతకము భక్తులపాలిటి చింతామణి. జాతి, మత వివక్షతలేక, సర్వప్రజానీకము చదువఁదగిన పద్యకృతి. ఈ విద్వత్కవి రచించిన గ్రంథములు పెక్కులు. వానిలో వేణీసంహారమునాటకము, శ్రీసూక్తివసుధ్రికాశకము, ఆర్తరక్షామణీశతకము, వసురాయచాటూక్తి

ముక్తావళి మాఖ్యములు. ఈతడు నందనందన శతకమును రచియించెను. మయూరకవిరచిత సూర్యశతకమును దెలిఁగించెను. ఈ కవినిగూర్చి విపులముగ వ్రాయఁదగియున్నను గ్రంథవిస్తరభీతిని విరమించితిని.

భక్తచింతామణీశతకము —

శ్రీమద్భానుసహస్రమండలవిభాసీ! సచ్చిదానందమూ
ర్తీ! మాయాపరికల్పితాఖిలజగచ్ఛ్రేణీ! దయాంభోనిధీ!
స్వామీ! నీ మహిమంబు లా నిగమముల్ వర్ణింపలే వన్నచో,
నే మూఢాత్ముఁడ నే మెఱుంగుదును? దండ్రీ! భక్తచింతామణీ!

శా. నాలో నాకె మహాద్భుతంబగు జగన్నాథా! త్వదీయక్రియల్;
నేల న్నూతనసూక్ష్మబీజమున లేక, నీ వ్యూహ నాయందు నుం
తేలా గానది ముం దెఱుంగ నది; యుట్టే నీకృపం బద్యమై
నా(?)లుం జక్కని పూల మొక్కన లెఁ; దేవా! భక్తచింతామణీ!

మ. అడగం ద్రొక్కుచు గడ్డిపువ్వులను, గుందాదుల్ తలన్ దాల్చు నై
పడి, దీనాళిని ధిక్కరించి, ఘనులం బూజించు లోకంబు; గ
న్పడు నే ప్రేముడియందు? నీవు నిజమాభక్తుండవు, నీవారిలోఁ
గడవారిన్ గడుగారవించు; మునిపక్షా! భక్తచింతామణీ!

ఆర్తరక్షామణీశతకమునుండి :—

శ్రుతులున్ శాస్త్రములున్ బురాణముల్ దారుల్ మంచివై మర్త్యసం
తతికిం జూపు హితోక్తులన్; నడచి తన్మార్గంబులందున్ మను
ష్యతతి ధన్యం బొనరించుకొంట కుపదేశంబీయఁ గష్టాలయం
బ్రతు కీ వంతయు భారవోసితివి రామా! యార్తరక్షామణీ!

పదధూళిన్ శిల భామ యయ్యె ప్రబలుల్ పైకెత్త శక్యంబుగా
నిది విల్లెక్కిడుచోఁ దునింగె, నృపులన్ వెన్నాడి మయ్యేడు మా

ర్లు దలల్ గొట్టిన దిట్ట నీయెదురఁ గేల్మోడ్చెన్ జరిత్రింబు నీ
యది చిత్రం బతిమానుషంబుగద రామా! యార్తరక్షామణీ

ఆం. సా. ప. సం 22 సం. ౧.

ఈ శతకమును వసురాయకవి క్రీ.శ. 1933 - 34 లో రచించెను. ఇది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటిత మైనది.

శ్రీసూక్తివసుప్రకాశకము నుండి :—

ఉ॥ శ్రీయుత సత్ప్రవర్తనముఁ జెందక స్వేచ్ఛఁ జరించు బిడ్డ లేఁ
బ్రాయమునందు శిక్ష ఋజుపద్ధతి నేర్పక ముందు శక్యమే
కాయలు పొట్లతీఁగలను గల్గుడు రాలను గట్టకుండినన్
వేయి జనించువంకరలు వెన్కనుఁ దీర్పఁ దరంబె మిత్రుఁడా!

చ॥ ఒడయని పాల నెంత చనవుండిన నీచు మహాత్మ కన్న నె
క్కుడగునె? వాఁడు గర్వపడఁగూడదు వారలయొద్దఁ బిల్లి యె
ప్పుడు నవగోధసౌధమునఁ బొందుగ నుండిన యంతమాత్ర నె
వ్వడువున నెక్కుడౌను బురబాహ్యగజేంద్రము కంటె మిత్రుఁడా!

ఉ॥ సారవిహీనమై బహుళసంకటముల్ గలిగించు హేయసం
సారము పామరుల్ ప్రియతమంబుగ నెంచి చరింతు రెట్లనన్
ధారుణి మాంసశూన్యమును దంతవిఘాతముఁ బూతిగంధమా
తోరపుటెమ్మకం గని కుతూహలమందదె కుక్క! మిత్రుఁడా!

ఆద్యతనకాలమున నీతిబోధక విషయగ్రంథములలో నీ గ్రంథమును మించినది లేదు. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారీ గ్రంథము నెంతయో కొనియాడుచు, వసురాయకవి కోరకుండగనే, ఒక పెద్ద ప్రశంసాలేఖను వ్రాసియున్నారు. అది సూక్తివసుప్రకాశకముతో ముద్రితమైయు

న్నది. ఈ గ్రంథమువలన వసురాయని "ఆంధ్రభర్తృహరి" యని గౌరవింపనగును.

సూర్యశతకము - వసురాయుని శతకరచనలలో నెన్నదగినది మయూరమహాకవి సంస్కృతసూర్యశతకానువాదము. ఇది తొలుత శ్రీకొక్కొండ వేంకటరత్నంపంతులుగారి "ఆంధ్రభాషాసంజీవనీ" పత్రికలో కొంతప్రకటితమై యావెనుక "సరస్వతీ" పత్రికలో క్రీ. శ. 1898 లో పూర్తిగ ప్రకటితమైనది. మయూరుని ప్రౌఢవాగ్గుంభనమునకు వసురాయని మధురవాగ్గుంభనము దీటై మాఱుమ్రోగినది. మచ్చునకు ప్రథమశ్లోకము, భాషాంతరీకరణము నిచ్చుచున్నాను.

శ్లో॥ జంభారాతీభ కుంభోద్భవ మివదధత స్సాంద్ర సిందూరరేణుం
రక్తాసిక్తా ఇవౌఘై రుదయగిరి తటీ ధాతుధారా ద్రవస్య
ఆయాంత్యా తుల్యకాలం కమలవనరుచే వారుణావిభూత్యై
భూయాసు ర్భాసయంతో భువన మభినవా భా నవో భానవీయాః

శా. శ్రీజంభారి కరీంద్రకుంభయుగళీ సిందూరశుంభద్రజో
రాజివ్యాప్తినొ, ప్రాగహార్యతటనిర్యద్ధాతుధారాద్రవ
ప్రాజస్రాగ్రితనో, సరోద్గమసరోజాభాప్తినో బొల్చు తత్
భ్రాజన్నవ్యజగద్విభాసిఘృణు లైశ్వర్యంబు మీకిచ్చుతన్.

శ్రీవసురాయని యాంధ్రానువాదము పాశ్చాత్యఖండవాసులచే పేర్కొనఁబడినది. కెనడాదేశమందలి కొలంబియావిశ్వవిద్యాలయమువారు ప్రకటించిన మయూరసంస్కృతసూర్యశతకమున తత్సంపాదకులగు George Quakenboss దొరవారు "The Telugu Translation

by V.Subbarayudu, Rajahmundry" అని క్రీ. శ. 1917 లో నుట్టంకించినారు. ఇట్లు ఖండాంతరవాసుల కిది తెలిసినను, శతకవాఙ్మయసర్వస్వమున వసురాయకవి జీవితమున నీ సూర్యశతకవిషయమే విస్మరింపఁబడినది.

( చూ. పుటలు 416 - 431 )

## కాకర్ల సుబ్బయ్యపంతులు
( క్రీ.శ. 1855 - 1915 )

ఈతఁడు సంజీవరాయశతకము రచించెను. ఇందు రెండువందల పద్యములు గలవు. చక్కని కవిత.

కం॥ కంద మొకటైన లోకుల
కందముగాఁ జెప్పి మెప్పుఁగని యెఱుఁగని నా
కందములు ముందుమాటల
చందము సంజీవరాయ! సన్మనిగేయా!

కం॥ ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతమతములందుఁ దారతమ్యము తెలుఁగం
గాఁతలిడి భక్తిమఱతురు
చాతురి సంజీవరాయ! సన్మనిగేయా!

## దేవులపల్లి తమ్మన్నశాస్త్రి
( క్రీ.శ. 1856 - 1912 )

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి సోదరుఁడగు యీ తమ్మనశాస్త్రి సకలేశ్వర, సత్యనారాయణశతకములను

రచించెను. ఈయన అద్యతనాంధ్రమహాకవియగు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి జనకుడు!

సకలేశ్వరశతకము

క॥ నిలుకడలేని మనంబును
చెలువ మొకించుకయు లేని చెలిపాత్రియంబున్
వలపొదవని కూటమియుం
జెలువొందునె సత్త్వకాళ! శ్రీసకలేశా!

సత్యనారాయణశతకము

శా॥ ఏలా ప్రోవవు నమ్మి యున్న మము నీవే ప్రోవకున్నం గృపా
శీలా! ప్రోచెడువార లెవ్వరిక నీచిత్తంబునన్ వేడుగా
నాలోచింపక యార్తరక్షణకళాభ్యాసోన్నతిం జూపుమీ
జాలంబు న్విడనాడి రత్నగిరివాసా సత్యనారాయణా!

# కల్లూరి వేంకటరామశాస్త్రి

( క్రీ.శ. 1857 - 1928 )

ఈతఁడు ప్రసిద్ధపండితుఁడు. "కోటిలింగేశ్వర శతకము"ను "కోటిలింగేశ్వరా" అను మకుటముతో రచించెను. అందలి యీక్రింది పద్యము గుప్తార్థప్రకాశిక పీఠికలో పేర్కొనఁబడినది.

మ॥ మనుపంజాలుదు వీవు మాతృపితవై మమ్మర్థనాకేశమూ
ర్తిని విశ్వంబు సృజించి ప్రోచియును, బేర్మిన్ నేహనానాస్తికిం
చన యన్నట్టి శ్రుతిప్రకారమున వీజాగ్రల్లలాటాంతపా
ఠీని దున్మాడెడు సాక్షి నీ కెరఁగెదన్ శ్రీకోటిలింగేశ్వరా!

# దేవగుప్త సన్యాసిరాజకవి

## ( క్రీ.శ. 1857 – 1918 )

ఈకవి (1) శ్రీమద్భగవద్గీతాశాస్త్రము (2) మీరాబాయిచరిత్రి (3) నందకథానందలహరి (అముద్రితము) (4) మాతృదేవతాస్మృతి (5) సర్వేశ్వరశతకము (6) భక్తవత్సలశతకము (7) సతీమణిశతకము (8) సచ్చిదానందశతకములను, (1) పుష్పాంజలి (2) చైతన్యచరితామృతము (అసంపూర్ణరచన) అను గద్య గ్రంథములను రచించెను. జన్మస్థలము విశాఖమండలములోని చోడవరం గ్రామ సమీపమున నున్న ఫకీరుసాహెబుపేట అను పల్లెటూరు.

### భక్తవత్సలశతకము

ఉ. వాసిగ దేవగుప్త మన వర్ధిలె నా యిలు పేరు, పేరు స
న్యాసి నృపాలుఁ, డన్వయము నామము వన్నెను నెక్క భక్తి వి
శ్వాసము లెప్ప నీయెడ నెనంగఁగఁ జేసి, కృపార్ద్రదృష్టి నీ
దాసుని జేసి, జన్మము కృతార్థముఁ జేయవె భక్తవత్సలా!

### సచ్చిదానంద శతకము

సీ. పరమాణువులతోడ బ్రహ్మాండము లొనర్చు
పోఁడవై తగు సూక్ష్మబుద్ధి వీవ,
బ్రహ్మాండభాండముల్ పరమాణువు లొనర్పఁ
జాలు మహాబలశాలి వీవ,
తలఁచిన దంతయుఁ దత్క్షణంబునఁ జేయు
నఘటనాఘటన సమర్థుఁ డీవ

యది యిది యన కెవ్వ రెద్ది వేఁడినఁ గూర్మి
దయచేయు నట్టి యుదారుఁ డీవ,
యట్టి ధీశాలి, బలశాలి, నైంద్రజాలి,
బలుకృపాశాలిఁ గొలువక పాలుమాలి
యేలఁ గొఱమాలు వారి ప్రాపేల మాకు?
నతహృదయవర్తి! సచ్చిదానందమూర్తి!

ఈకవి, సుతులలో (1) అచ్యుతరామయ్య (2) సుందరరామయ్యలు కూడ కొన్ని గ్రంథములు రచించిరి.

## నాగేంద్రకవి *

( క్రీ.శ. 1700 )

ఈతఁడు "రమాధీశ్వరశతకము" అను పేర విష్ణుస్తుత్యాత్మకమైన శతకమును రచించెను. కవి వివరములు తెలియరాలేదు. నాగేంద్రుఁడే శతకకర్త యనుటకు నందలి యీక్రిందిపద్యము ప్రమాణము.

శా॥ నాగేంద్రాఖ్యుఁడ నౌదుఁగాని ముఖముల్ నాకేమి వేయున్నవో
భోగానందసువర్ణధర్మగుణసంపూర్ణప్రభావుండనో
ధీగంభీరపదప్రతిస్ఫురణఁ గీర్తింతున్ వచోరూఢి నీ
వే గీర్వాణమునీంద్రవంద్యపద గోవిందా! రమాధీశ్వరా!

* ఈకవి, దిట్టకవి రామచంద్రకవి, వరహాగిరి వరాహవేంకటనృసింహకవియును తృతీయభాగమునఁ జేర్చవలసినవారిని పొరపాటున చతుర్థభాగమునఁ జేర్పవలసివచ్చినది.

కవి విశిష్టాద్వైతమత సంప్రదాయము వాఁడని యీ క్రింది పద్యములవలనఁ దెలియనగుచున్నది.

శా. శ్రీరామానుజదేసికోత్తమ మహాసిద్ధాంతమార్గక్రియా
సారాచారవిశేషతీర్థతనుఁడై స్వాంతంబులో నెప్పుడున్
క్రూరత్వంబు శమింపకుండిన వివేకుల్ చూతురా పుణ్యునిన్
వీరేమన్న పురాతిశైత్యమతి గోవిందా! రమాధీశ్వరా!

శా. త్రయ్యంతార్థవిచారగమ్య భగవత్సంబంధ దీక్షాంగిరై
జియ్యాళ్వారిమహాప్రబంధనిగమశ్రీసూక్తినిం దేలియున్
వియ్యంబైన రుచిప్రపన్నుల యెడన్ లేకున్నఁ దచ్చిహ్నముల్
వెయ్యారైనను మీఁదుమిక్కిలిని గోవిందా! రమాధీశ్వరా!

నాగేంద్రకవి, తెలంగాణా రాష్ట్రమండలి యోరుగల్లు నివాసి యని, నాగనాథకవి యని పీఠికాకారు లూహించిరి. కాని యీ నాగనాథుఁడు పశుపతి నాగనాథుడు, శైవుఁడు, క్రీ.శ. 1369 నాటివాఁడు. ప్రస్తుతశతకకర్త విశిష్టాద్వైతి. కావున నిరువురును నొకటి యగుట పొసగదు. ఆనందసుందరచాతుర్యలీలావిలాసప్రబంధకర్త నాగేంద్రకవి యొకఁడు గలడు. ఆతఁ డీతఁడే యైన ప్రబంధకర్త నాగేంద్రకవి పదునేడవశతాబ్దివాఁడు. కావున నీశతకకర్తయు నప్పటివాఁడే.

---

# దిట్టకవి రామచంద్రకవి
( క్రీ.శ. 1750 ప్రాంతము )

కవికుటుంబ మగు దిట్టకవివంశమునఁ బుట్టిన యీతఁడార్వేలనియోగి. కాశ్యపగోత్రుఁడు. శకుంతలాపరిణయము, సేతుమాహాత్మ్యము, రామకథాసారమును రచించిన పాపరాజకవి యీతని తాత. రంగారాయచరిత్రమను (బొబ్బిలి యుద్ధము) వీరరస ప్రధాన చారిత్రక ప్రబంధము రచించిన నారాయణకవి యీతని తండ్రి. రామచంద్రకవి సంస్కృతాంధ్ర కవితావిశారదుఁడేగాక శాపానుగ్రహసమర్థుఁడు. ఈతని ప్రతిభ యీ క్రింది పద్యమువలనఁ దెలియనగును.

"క. దిట్టకవి రామచంద్రుఁడు దిట్టిన రాయైనఁ బగులు దీవించిన యా
బెట్టైన చెట్టుచిగురగు గట్టిగ నొల్లింటి భీమకవి కాఁబోలున్.

ఈతఁడు ఫసలీ ౧౧౭౯ లో నున్నట్లుగా నూజివీటి సంస్థానమునందలి రికార్డులవలనఁ దెలియుచున్నది. కావున నీతఁడు క్రీ.శ. 1750 ప్రాంతమువాఁడు. ఈతని నివాసము కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గొట్టుముక్కల. మఱియు ఉయ్యూరు తాలూకాలోని పెదమద్దాలిగ్రామమున గూడ నీతఁడు నివసించెను. ఈతని కృతులు - (1) రఘుకులతిలక శతకము (2) మహిషాసురమర్దనీశతకము (3) ఉద్దండరాయ శతకము (4) రాజగోపాలశతకము (5) హేలావతీదండకము (6) వాసిరెడ్డివంశచరిత్రి (ఒక ప్రబంధమునఁ గృత్యాది).

## దిట్టకవివారి వంశవృక్షము

### ఆర్వేలనియోగులు - కాశ్యపగోత్రులు




1. రఘుకులతిలకశతకము- ఇది కందపద్యశతకము. 101 పద్యములున్నవి. నాల్గవచరణమున మకుటము "రఘుకుల తిలకనిటలతటనటదలకా" అని యుండుటచేత సర్వత్రతవర్గ యతి.

క|| నానాటికి నానూటికి తేనై, చెఱకై, యనంటితెఱఁగై, తేఱయై
యానందమొసగు నీయభిధానము రఘుతిలక నిటతటదలకా!

ఈ క్రింది పద్యములు సంస్కృతభాషలోనే రచితమైనవి,

క|| పాహిప్రచేతస కవికవితా వ్యాచిక్రింసాభిరామ హర్షితహృదయా
యాచకకాంక్షాఫలసంధాచణ రఘు....... .......... ........

క|| మామవతేవదాసోహం కామితఫలదప్రభావ కరుణాసింధో
త్వామేవ నహి శరణ్యాం ధామగ రఘు......................

క|| శ్రీమద్భూమశుభప్రదనామన్ త్వామంతరేణ నహి శరణం మే
మాముద్ధర భద్రాచలధామా రఘు.........................

క॥ ప్రాచుర్యసమధిక మనీషాచణ గిట్టకవిరామచంద్రుని శతకం
బాచరణసేయనగు భద్రాచల రఘు.........................

2. మహిషాసురమర్దనీశతకము— "మహిషాసురమర్దని పుణ్యవర్ధనీ" అను మకుటము ౧౦౧ చంపకోత్పలములు.

చ॥ హరిహయశాఖలేఖిని మహాంబుధికజ్జలపాత్రిభూతలాం
బరములు సంపుటస్థలులు పంకజసంభవమూర్తివక్త్ర లే
ఖరి హరిదశ్వుఁ డట్టియిన గాని లిఖింపఁ దరంబె నీమనో
హరగుణజాలసంఖ్య మహిషాసురమర్దని పుణ్యవర్ధనీ!

ఇది మహిమ్నమునందుగల "అసితగిరిసమస్యాత్కజ్జలం సింధుపాత్రే సురతరువరశాఖా లేఖనీపత్రముర్వీం" అను శ్లోకము ననుసరించి వ్రాయఁబడినది.

చ॥ వికసిత చంపకప్రసవవిశ్రుతతామసటాభిగుప్తన
క్షిక మృదుభావలక్ష్మిపరికీర్తిత కుంకుమపంకలిప్తహ
స్తిక కరలక్ష్మిఁ గేర శివదేవునిగేహిని వైన లోకనా
యకివి గదమ్మ యమ్మ మహిషా ................

ఉ॥ శ్రీరమణీవిశేషగుణచిహ్నిత నీవు భవత్కృపాప్తిచే
ధీరుఁడఁ గాశ్యపాన్వయుఁడ దిట్టకవీంద్రుఁడ రామచంద్రుఁడన్
గారవమొప్ప వృత్తశతకంబు రచించితి దీని సన్మణీ
హారముగా గ్రహింపు మహిషా...................

3. ఉద్దండరాయశతకము- ఇది మద్దాలి యందలి యుద్దండరాయని కంకితము. ఈ శతకరచనచే నీతని 'యుద్దండకవి' యనవచ్చును. ఏలననగా నీ శతకమున మకుటమిట్లున్నది.

మ॥ ........................................... మద్దాలి యుద్దండరా
య జయశ్రీసువిధేయ భక్తజనగేయా నిత్యభాగ్యోదయా"

పై మకుటమువలన శతకమంతయు నేకప్రాస (జప్రాస) తో చెప్పఁబడినది. మఱియు నేకయతి నియమమున్నది. (అకారయతి) కాబట్టి అన్నియును మత్తేభవృత్తములే తప్ప వేఱువృత్త ముపయోగించుటకు వీలులేదు. అయినను చక్కని శైలిలో కవి రచియించియున్నాఁడు.

మ॥ అజకాంతన్ భజియించి, భాగవతులం బ్రార్థించి దండంబునన్
గజవక్త్రుం బ్రణుతించి తొంటికవులం గైవారముల్సేసి ప్రే
మ జోహజ్జోహ రటంచు సాగిలియెదన్ మద్దాలి యుద్దండరా
య! జయశ్రీసువిధేయ! భక్తజనగేయా! నిత్యభాగ్యోదయా!

మ॥ త్రిజగత్పూజ్యములైన నీపదము లర్థిన్ సేవఁ గావింతు నిన్
భజియింతు న్నిరతంబు మ్రొక్కెదు మదిం భావించి కీర్తింతు సా
మజసంరక్షక విశ్వకారకహరీ! ॥ మద్దాలి ॥

మ ॥ ద్విజరాడ్వాహన నేను దిట్టకవి సూతిన్ గశ్యపక్షేంద్ర గో
త్రిజుఁడన్ నామము రామచంద్రుఁడు భవద్దాసుండ నాయందుఁ బ్రే
మ జిగుర్పం శతకంబుఁ గైకొనుము శ్రీమద్దాలి ॥....

4. గొట్టుముక్కలరాజగోపాలశతకము- ఇది "గొట్టుము క్కలపురౌకా రాజగోపాలకా" అను మకుటముగలది. ఏక యతి (కవర్గయతి) నియతి గలది. మంచిధారాశుద్ధిగలది.

శా॥ శ్రీభద్రస్థితు లాశ్రితావళుల కక్షీణానుకంపన్ సదా
లాభప్రాప్తులుగా నొనర్చు నజు లీలామోహనాకార మా
యాభీరున్ నినుఁ గూర్చి మ్రొక్కెదు ననల్పాకల్పతల్పాయిత
క్ష్మాభృత్పన్నగ గొట్టుముక్కల పురౌకా! రాజగోపాలకా!

శా॥ హేలాసమ్మిళితత్రిమూర్తిరుచియై హేరంబుఁ బ్రార్థించుచున్
కాళీదాస మయూర మాఘ ముఖులం గైవారముల్ సేసి నిన్

.హాలాయంబుగఁ బూజసేతుఁ గవనవ్యాపారవిస్తారవా
గ్జాలాబ్జంబుల గొట్టుముక్కల ......................

మ. పరగం గ్రిందటి జన్మజన్మముల నిన్ బ్రార్థింపలేనైతి ని
న్నరరూపంబునఁ గొల్వఁగంటి నిటతో నాకబ్బె సన్ముక్తి సు
స్థిరమై యర్జునసాహసార్ధభగవద్గీతారహస్యప్రియం
కర వాచాలక గొట్టుముక్కలపురౌకా రాజగోపాలకా!

# వరహగిరి వరాహవేంకటనృసింహకవి

( క్రీ.శ. 1790 ప్రాంతము )

ఈతఁడు సూర్యనారాయణ శతకమును రచియించెను. యాజ్ఞవల్క్యశాఖీయుఁడు. భారద్వాజగోత్రుడు. విశాఖమండల వాస్తవ్యుఁడు. ఈ శతకమున నాతఁడు అరసవిల్లి సూర్యనారాయణుని నిట్లు పేర్కొన్నాడు. అరసవిల్లి విశాఖకుత్తరమున శ్రీకాకుళముజిల్లాలో నున్నది.

శ్రితసంపత్సుమవల్లియౌ నరసవిల్లిన్ మల్లికాద్యుల్లసత్
లతికావేల్లితసాల బాలకుసుమారామస్ఫురద్ధామని
ర్మిత గేహంబునఁ బద్మినీముఖలతల్ సేవింప ధాత్రీసురా
ర్చిత లీలాకృతి నొప్పు నిన్ను దలఁతున్ శ్రీసూర్యనారాయణా!

శతకము మంచి ధారాశుద్ధి గలిగినది.

మ॥ ఘనటత్వాత్కర దీప్తమూర్తులగుచున్ గన్పట్టు చంద్రాదులన్
గనుఁగొంచుం గణకుల్ సుఖార్తి ఫలసంఘాతల్ గదా యంచు గొ
బ్బున నూహింతురు కాదు నే భువనముల్ పుట్టించి రక్షించి తుద్రిం
చి నటింపంగల కర్త నీవు గలుగన్ శ్రీసూర్యనారాయణా!

శా॥ లోకాలోకము దాఁటి చండకిరణాలోకవ్యస్వకాయప్రభా
నీకంబొప్ప ననేకలోకతిమిరోన్మేషంబు వారించి య
స్తోకాసక్తివిశేషజంతుతతి నెంతోఁ బ్రోచు నిన్ జిత్తనా
ళీకాభ్యంతరసీమ నిల్పి కొలుతున్ శ్రీసూర్యనారాయణా!

శా॥ భారద్వాజపవిత్రగోత్రజుఁడ విప్రశ్రేష్ఠవంశ్యుండ వి
ద్యారక్తుండ వరాహవేంకటనృసింహాఖ్యుండ సద్భక్తి నిం
పారం గొల్చుచు నీకు వృత్తశతకం బర్పింతు వాగ్దోషముల్
చేరంజూచి కృపన్ సహింపుమదిలో శ్రీసూర్యనారాయణా!

## కరహ్వాలు నరహరిరాజామణిశెట్టి

(క్రీ. శ. 1859 - 1910)

ఈతడు విజయనగరసంస్థానాధీశ్వరుఁడై, ఆంధ్రభోజుఁడను ప్రఖ్యాతివహించిన ఆనందగజపతిమహారాజావారి ఆస్థానమున సామాజికుఁడై యుండెను. ఈతఁడు వ్యాయామఖేలనములను, కవిత్వరచనయందును నసమానప్రజ్ఞ చూపి, సమకాలీనులను మెప్పించెను. భల్లాణచరిత్రము, సొద్దుకత, వనకుమారిచరిత్రము, లలితాలతావిలాసము మున్నగు ప్రద్యకావ్యములే కాక, రెండుశతకములను రచించెను.

1. అనుభవరసికశతకము– "అనుభవరసికుండెఱుంగు ననుటొప్పగదా" అనుసమస్యకుఁ బూరణము – శతకము లభ్యముకాలేదు.

2. గోపాలకృష్ణమూర్తిశతకము- ఇందు నూఱు సీసపద్యములు గలవు. తన జనకుఁడును, గ్రంథరచయితయు, ప్రసిద్ధ రాజకీయోద్యోగియునైన కర్నూలు నరహరి గోపాలకృష్ణమ్మ సెట్టిగారి జీవితచరిత్రయిందు గలదు. మచ్చునకు :—

సీ. శ్రీరమణీమణీ చిరకృపాంభోరాశి
లబ్ధశృంగార విలాసయుతుఁడు
హిమవన్నగాత్మజాకమనీయకుచకుంభ
మృగనాభికలిత శరీరధనుఁడు
వాణీకరద్వయాభాసితవీణా ని
నాదపీయూష పాన ప్రియుండు
మదరసానందితమత్తభృంగనికాయ
భూరిఝంకార పరిమోదితుండు

గీ॥ వాసవాద్యభినుత వాయు వరసుతుండు
చెలఁగి మోక్షంబు నిచ్చి రక్షింతు రెలమి
సకలభూపాలరింఛోళి చక్రవర్తి
శ్రీరసత్కీర్తి గోపాలకృష్ణమూర్తి!

సీ॥ శ్రీలఁ జెలంగెడు చెన్నపురంబున భాసిల్లు నరహరి వంశమందు
ధీరుఁడై తనరిన తెన్నరంగయ్యకు వేంకటలక్షుమాంబకును బుట్టి
యేఁబది యైదేండ్లు నింపుగా నలరుచు తనపేరు నిల శాశ్వతముగఁ జేసి
వర సర్వధారి సంవత్సరమునను వైశాఖము శుక్లపక్షంబు నందు

గీ॥ షష్ఠి సౌమ్యవాసరమున సారసాప్తుఁ
డపరగిరి కేగి నపుడు నీ వరిగి తౌర
సకల.................................

సీ॥ శ్రీతుంగభద్రానదీతీరమున కందనోలిపురంబున నుండువాఁడ
దేవీపదాబ్జ తుందిలమకరంద బిందు నికాయపాన కుతూహలుండ

గురు విప్ర దేవ భక్తుండ నాంధ్రనిలింప భాషానురక్తుండ బంధుప్రియుడ
అఖిలపురాణేతిహాస ప్రమోదుండ త్యాగ భోగ వివేక ధర్మపరుడ
గీ॥ నీదు తనయుండ రాజామణి యనువాడ
సీసశతకంబుఁ జేసితి చిత్తగింపు
సకల.........................................

# కొండ రామకవి

( క్రీ.శ. 1860 ప్రాంతము )

ఈతఁడు ''గవిరంగనాథశతకము'' అను నొక సీస పద్యశతకము రచించెను. ఇది క్రీ.శ. 1878 లో ముద్రిత మైనది. గజపురమనగా ''ఆనెగొంది'' (శత. స. 126 – 133) ఈ శతకము చాలవఱకు నరసింహాశతకము ననుసరించినది.

సీ. సరసిజాపతి నీదు చరితంబు వర్ణింప నలినగర్భునకైన నలవికాదు
నరుఁడనే నిన్నెన్నఁ దరమానె నాకును పంచకావ్యశ్లోక పఠనలేదు
అమరనైషధముల నభ్యసింపఁగలేదు ఆంధ్రగీర్వాణంబు లరయలేదు
గణలక్షణప్రాసక్రమముఁ దెలియఁగలేదు వేదపురాణము ల్వేదుకలేదు
గీ. గురుకృపాలబ్ధవరముచే గూఢభక్తి నిన్ను నుతిసేయఁ బూనితి నీరజాక్ష
గజపురంధామ! శృంగారకలితసోమ! మంగళోద్దామ శ్రీగవిరంగధామ!

ఇది నరసింహాశతకములోని,

''సీ. పద్మలోచన సీసపద్యముల్ నీమీద
చెప్పఁబూనితినయ్య చిత్తగింపు
గణయతిప్రాసలక్షణము చూడఁగలేదు
పంచకావ్యశ్లోకపఠనలేదు
అమరకాండత్రయం బరసి చూడఁగలేదు
శాస్త్రీయగ్రంథముల్ చదువలేదు

నీకటాక్షంబున నే రచించెద గాని
ప్రజ్ఞ నాయది కాదు ప్రస్తుతింప”

అను పద్యానుకరణము.

## అడిదము సన్న్యాసికవి

( క్రీ.శ. 1860 ప్రాంతము )

ఈతఁడు సుప్రసిద్ధుఁడగు నడిదముసూరకవి భిన్నోదర సోదరుఁ డగు రామకవి మనుమడు. నృసింహాకవి పుత్రుఁడు. ఈతని శతకకృతులు రెండుగలవు. రెండును నముద్రితములు.

1. కేశవశతకము – ''కేశవా'' అను మకుటము. ఉత్పల మాలికలతో రచితమైనది. 101 పద్యములు గలవు.

ఉ. శ్రీరమణీముఖాబ్జ సరసీరుహబాంధవ శక్రముఖ్యబృం
దారక వార్ధివార్ధిజ ముదంబున నిన్ను భజించెదన్ ననున్
గారవ మొప్పఁగన్ గరుణఁ గావుము భక్తసుఖప్రదాత యో
వారిరుహాయతేక్షణ కృపాయుతవీక్షణ! కృష్ణ కేశవా!

ఉ. మంగళ మబ్ధిజారమణ మంగళమాతతవిస్ఫురద్దయా
మంగళ మవ్యయా పరమమంగళ దివ్యచరిత్ర శ్రీహరీ
మంగళ మార్యసేవ్య రవిమండలమండిత దివ్యభూషణా
మంగళ మాదిదేవ జయమంగళ మో పరమేశ కేశవా!

ఉ. దాసజనప్రమోద యడిదమ్మ కులమ్మునఁ జందురుండు నా
భాసిలు నారసింహకవివర్యుని పుత్రుఁడ నీ భటుండ స
న్న్యాసి సమాహ్వయుండ వికచాంబుజనేత్రభవత్పదాంబుజా
వాసిత మానసుండ నఘభంజన నన్గరుణింపు కేశవా!

2. రుద్రశతకము. రుద్రా యను మకుటము. కందపద్యములు.

క. శ్రీమద్గిరికన్యానన తామరససరోజమిత్ర ధరణీధర స
ద్ధామ శరజ్జలదార్జున వామాంగా భక్తదత్త భద్రా రుద్రా!

క. అక్షీణదయాసంయుత వీక్షణ నిజచరణకమల విన్యస్త మనః
ప్రక్షీణ కలుషజనసంరక్షణ ననుఁ బ్రోవ వేగరమ్మా! రుద్రా!

క. సేవించితి నీ పదములు భావించితి దేవుఁడ వని పరమాత్మక సం
భావించితి నిను నామది వేవేగమ వచ్చి కావు కృప నను రుద్రా!

క. అడిదము నృసింహకవి తనయుఁడ సన్న్యాసి యను నాఖ్య యొప్పన్నీభృ
త్యుఁడ నన్ను దయామతివై యెడపక కరుణించుచుండు మీశ్వర రుద్రా!

[ R-307 (b) (c) ]

# తిరువాయిపాటి వెంకటకవి
## ( క్రీ.శ. 1840 ప్రాంతము. )

ఈతఁడు తెలింగాణాలోని నల్లగొండ మండలమున కొలనుపాక నివాసి. సాతాని వైష్ణవుఁడు. పరాంకుశుని కుమారుఁడు. మణవాళజియ్యరు మనుమఁడు. ఈతఁడు యాదగిరీంద్ర శతకము అనుపేర యాదగిరిక్షేత్రాధిదైవత మగు నృసింహునిపై నొక శతకము రచించెను. యాదగిరినరసింహా యను కందపద్యశతకమును రచించెనట. అది లభ్యము కాలేదు. ఈశతకము "యాదగిరీంద్ర మొక్కెదన్" అను మకుటము గలది. కవిత్వ మంత ప్రౌఢముగాదు.

శ్రీనరసింహ దోష గజసింహ రమేశ మహానుభావ యో
భానుసహస్ర తేజ భవబంధవిమోచన భక్తరక్షణా
దీనదయాపరా సుగుణదీపిత తావక పాదపద్మముల్
ధ్యానముచేసి నిన్ను మదిఁదల్చెద యాదగిరీంద్ర మ్రొక్కెదన్.

శతకములో దశావతారములు రామకథ యున్నది,

శ్రీతిరువాయిపాటి కులశేఖరుఁడౌ మణవాళజియ్యగం
డాతని పుత్రుఁడౌ వరపరాంకుశసూనుఁడ వేంకటాఖ్యుఁడన్
శ్రీతరుణీశ! నీకథలఁజేసి ధరాతలమందు భూజనుల్
చేతమున న్నుతించు నెడఁ జేకొన యాదగిరీంద్ర మ్రొక్కెదన్.

## దిట్టకవి రామయోగి

( క్రీ.శ. 1845 ప్రాంతము )

ఈతఁడు దిట్టకవివంశీయుఁడు. నారాయణకవికి వరుసకు మనుమఁడు. తండ్రి సుందరరామసూరి. తాత యాదవరాయకవి. వీరి సంబంధమును మొదట నొసగిన వంశవృక్షమున జూడనగును. ఇతఁడు రుక్మిణీపతిశతకము రచియించెను. ఈ కవి ప్రతిభావిశేషము లీ శతకపీఠిక యం దిటుల నుట్టంకింపఁబడినవి.

"రామయోగికవి సంస్కృతమున నసాధారణపండితుఁడు. ఒకమా ఱీకవి తన ప్రభువర్యునితోఁ గాంచీనగరమునకేఁగి యటనున్న మహాపండితులతో వ్యాకరణశాస్త్రమునఁ జాలదినములు వివదించి విజయమంది, బ్రహ్మరథము, పీతాం

బహుసత్కృతి. నూటపదియాఱురూపాయలు సభాసత్కారము సేలువులు బహుమతినంది గృహాభిముఖుఁ డాయెనట. నాఁడు మొదలు నేఁటివఱకుఁ గాంచీనగరవాసులు, ఆంధ్రులు విద్యావినోదములలో గడుసరు లనియు నెవరిచే జయింపఁబడని కాంచీనగరపండితుల నాంధ్రనియోగి జయించెననియుఁ జెప్పుకొనుచుందురని కవివంశీయులు చెప్పుచున్నారు." వ్యాకరణశాస్త్రపారంగతుఁడును, పండితోత్తముఁడును నగు రామయోగికవి రచించిన యీ శతకప్రసక్తినిఁ గూర్చి ప్రత్యేకముగాఁ జెప్పవలసిన దేమియులేదు. ఇక్కవి సంస్కృతమునఁ బెక్కుగ్రంథములకు వ్యాఖ్యానములు, మతవిషయకఖండనగ్రంథములు రచియించెను. కవి తన యుత్తరవయస్సులోఁ దనగ్రంథసముదాయముతో మచిలీపట్టణమున నివాస మేర్పఱచుకొనెను. ఉప్పెన వచ్చుటచేఁ గవివ్రాసిన గ్రంథములన్నియుఁ జరాస్తియంతయు సముద్రార్పితమైనదనియు నెటులో యీ రుక్మిణీపతిశతకము మాత్రము బైటపడినదనియుఁ గవివంశీయు లెఱింగించిరి.

ఈతఁడు వ్రాసిన యీ శ్లోకములవలన నీతని సంస్కృతకవితానైపుణి తెలియఁగలదు.

శ్లో॥ మేఘస్స్వనీరదఘనాఘనతాప్రసిద్ధ
స్సంపస్య కేవలఘనం సరదం ప్రసిద్ధ
శ్రీనారయప్రభువరం సరదం ప్రసిద్ధమ్

సంపస్యకేవలఘనం ముఖవర్ణభేదీ
మోఘోభవత్యనుపమోహిసరాజవర్యః.

శ్లో॥ విరాజితేతోకవిరాజరాజతా
సభాకరే సంస్థితి మేతి హంసతా
సరాజహంసస్సమదీపిసర్వదా
సదాఖ్యయా నారయభూపవర్యః.

రుక్మిణీపతిశతకము తెనుఁగుకృతి గావున యంత ప్రౌఢ ముగ నుండదు. కవివంశీయుఁడగుటచే ధారాశుద్ధియున్నది. అనుప్రాసాభిశోభితము.

ఉ. శ్రీకర! సారవాగమృతశీకర! చారుకలాకరాస్యచా
మీకర! చేలభీకర సమీకరమాకరవారిజాత మై
త్రీకర! పాదపల్లవసుధీనుతమానితదీనమానవా
నీక రథాంగ బంధు రజనీకరలోచన రుక్మిణీపతీ!

ఉ. యోగము లెన్మిదింట నవయోగముఁ జెందఁగనీక చక్రిసం
యోగఫణీంద్రమస్తకము నూర్ధ్వముఁజేసి ఫణాసుధీప్తిచే
నూఁగఁగనీని దేహములనొప్పు మునీంద్రులచిత్తవీధులన్
రాగిలుపాదపద్మము శిరంబునఁ జేర్పుము రుక్మిణీపతీ!

అని వ్రాసి తన యోగి నామము సార్థకము గావించినాడు.

## కందుకూరి వీరేశలింగము పంతులుగారు
### ( క్రీ.శ. 1848 - 1919 )

ఆద్యతనాంధ్రవాఙ్మయమున యుగపురుషులని చెప్పఁదగిన వీరేశలింగముపంతులవారు, రెండుశతకములను రచి

యించినట్లును, అవి ఖిలమైనట్లును, పంతులుగారే తమస్వీయ చరిత్రము రెండవప్రకరణమున నిట్లు చెప్పుకొనియున్నారు.

"కవిత్వము చెప్పుటకారంభింపఁగానే మొట్టమొదట గోపాలస్వామిమీద నొకటియు, మార్కండేయస్వామిమీద నొకటియు, రెండు కందపద్యశతకములను జెప్పితిని. ఆరెండు శతకములును చిరకాలముక్రిందటనే యెట్లో నశించినవి. అవి యిప్పుడున్నను ప్రశస్తముగా నుండియుండవు. కాని చిన్నప్పటి కవిత్వ మెట్లుండెనో తెలిసికొనుటకు మాత్ర మాధారములై యుండును. వీనిలో మొదటిది మార్కండేయశతకము. దానిలో ప్రతిపద్యాంతము "మార్కండేయా" అని యుండును. రెండవది గోపాలశతకము. దానిలోఁ బ్రతిపద్యాంత పాదమును "శ్రీరాజమహేంద్రవరపురీగోపాలా" అని యుండును. ఈ కడపటిశతకములోని యీ క్రిందిపద్య మొకటి మాత్ర మభాగ్యోపాఖ్యానములో మొదట వేయుటచేత నిప్పటికి నిలిచియున్నది.

క. శ్రీరమణీహృల్లోలా! కారుణ్యాలవాలవాల! కాంచనచేలా!
ఘోరాహవజయశీలా! శ్రీరాజమహేంద్రవరపురీగోపాలా!

(స్వీయచరిత్ర పుట 62 - 63)

## సత్యవోలు సోమసుందరకవి
(క్రీ.శ. 1851 - 1936)

ఈ సత్కవి సంగీతసాహిత్యములలో నసమానప్రజ్ఞ గలిగినవాఁడు. బహుగ్రంథరచయిత. ఈయన నియోగి.

వేంకటరాయమంత్రిపుత్రుఁడు. "శాంకరీవరపరిలబ్ధసారమృదువాక్చలితాతతగీతసాహితీపరిచయుఁడన్" అని కవియే వ్రాసికొనియున్నాఁడు.

ఈతని శతకకృతులలో రాజశేఖరశతక మొకటియే లభించినది. కొలఁదిగ నీతిపద్యము లున్నను నీ శతకము భక్తిరసశతకములలో నొకటి. ఇందు తొలుతగలపద్యములు కొన్ని యంత్యనియమము తోడను, కొన్ని ముక్తపదగ్రస్తముగ వ్రాయఁబడియున్నవి. కవిత నిరర్గళధారాశోభితమై మనోహరముగా నున్నది.

కులశేఖరాళ్వారులు చెప్పిన ముకుందమాల యందలి యీ క్రిందశ్లోక మీ శతకము 87 వ పద్యమున గలదు.

శ్లో. కృష్ణ త్వదీయపదపంకజ పంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

ఉ. భాసుర తావకాంఘ్రి వరపంకజ పంజర మద్యవర్తిగాఁ
జేసెద నిప్డె మామకవశీకృతమానసరాజకీరమున్
శ్వాసకఫాతిరోగములు వారక కుత్తుక నొత్తువేళ నా
యాసముచేత నీస్మరణ యాలెటు లీశ్వర రాజశేఖరా!

చ. నిటలతటాంజలిప్రణతనీరజగర్భశిరఃకిరీట సం
ఘటితమసారనీలరుచికాండమదాళిపరంపరాంచితో
ద్భటభవదీయపాదనవపంకజయుగ్మము సర్వసంపదల్
పటుతరలీలఁ గూర్చు నిజభక్తుల కిద్ధర రాజశేఖరా!

# గంగాధరుఁడు

( క్రీ.శ. 1860 ప్రాంతము. )

ఈతఁడు నియోగి. ఆపస్తంబసూత్రుఁడు. రాజమ్మకు పట్టాభిరామామాత్యునకుఁ గుమారుఁడు. ఈతఁడు రెండుశతకములను రచియించెను. 1. కీరవాణిశతకము 2. శ్రీరమణీమనోహరశతకము. ఈ కవి తూర్పుగోదావరీ మండలమున పిఠాపురప్రాంతములు నివాసముగాగలవాఁడు.

శ్రీరమణీమనోహరశతకము చంపకోత్పలమాలికలతో చెప్పఁబడినది. మధ్యమధ్య మత్తేభశార్దూలవృత్తములున్నవి మకుటము మాఱినది. ఇందులో 300 పద్యము లున్నవి. కావున "త్రిశతి" యనవచ్చును.

ఉ॥ శ్రీరమణీయ హృజ్జలజ సేవితము న్నిగమార్థపూరమున్
భూరితరంగమంగళనభోఘుని కెల్లను నాలవాలమున్
సారమరందవిస్ఫురిత సారసనూభవదంఘ్రియుగ్మమున్
గోరి భజింతు నెమ్మదిని గూరిమి శ్రీరమణీమనోహరా!

శా॥ మత్తేభంబులు చంపకంబులు మహోమాధుర్యశార్దూలముల్
బొత్తుల్ గూర్చిన వృత్తముల్ వరుస మేల్పొందంగఁ బద్యంబు లే
నిత్తుఁ భక్తిని చిత్తజారిచెలికి న్నింపొందఁ బూదండగా
గొత్తల్ జిత్తమునందు వెల్లివిరియఁ గోవర్ధనోద్ధారకా!

కవి తన స్వవిషయము నిందుఁ జెప్పికొన్నాడు. ఇట్టివారు చాలకొలఁదిగా నుందురు.

ఉ. దార నశించె, వెన్క దగ దాయలు వృత్తిహరించి రంత నా
గారము నొక్కవిప్రునదిగాఁ దెగనమ్మితి మున్నె నా వయ
స్సారము దగ్గఁ జేరినది సారవిహీనపుఁ జోటు నింక నా
కేరి మహాత్మ నీపయిని నెన్నగ శ్రీరమణీమనోహరా!

ఇందలి పద్యములు కడు సులభములై యాత్మీయత నెఱుకపఱచును.

ఉ. కాయ మపాయమయ్యె! నిను గన్గొన నేరుపు చాలదయ్యె! యో
నాయన రాగదయ్యె! రఘునందను దాసుఁడ గానటయ్యె నీ
మాయలు నాయెడం దగదు మానగదయ్యె! యనాథనయ్య నన్
బాయకుమయ్య భక్తజనపాలక శ్రీరమణీమనోహరా!

# తూములవారి వేంకటరంగకవి

(క్రీ.శ. 1860 ప్రాంతము)

ఈతఁడు మీనాక్షీశతకమును రచియించెను. ఇది సీసపద్యశతకము –

వేంకటేశుని చెల్లెలై వెలయు గౌరి
కరుణ గల యమ్మ మీనమ్మ వరము లిమ్మ!" అను మకుటము.

ఈతఁడు దక్షిణదేశీయుఁ డగు తెలుఁగుకవి. పాండ్య దేశమున మధురవద్ద బందులకుడి యను గ్రామ మీతని కాపురము. ఈతని వృత్తాంత మీ క్రిందిపద్యమువలనఁ దెలియనగును.

సీ. క్షితిని బందులకుడి చెలఁగఁ బుణ్యాలయం
బుగను గ్రామాధికాపురముగలిగి

వెలనాటిలో యజుర్వేదుండు హారితస
గోత్రుఁ డాపస్తంభసూత్రుఁ డలరఁ
దూములూరి కులాబ్ధి సోముండు వేంకట
రంగయ్య పౌత్రుండు ప్రబలుఁడైన
వేంకట .....................తనూజుండు
వేంకటరంగయ్య విమలుఁ డేను

గీ. శ్రీకరంబున నీపైని సీసపద్య
శతక మొనరించితిని కొమ్ము శాశ్వతముగ
వేంకటేశుని చెల్లెలై వెలయు గౌరి
కరుణగలయమ్మ మీనమ్మ వరము లిమ్మ.

ఈ శతకమున మధురమీనాక్షి వివాహాదివర్ణనములు సరసముగా సంసారిపక్షముగా వర్ణితములైనవి. నెల్లూరఁ బ్రసిద్ధులు, భాషాపోషకులు తూములూరి శివరామయ్యపంతులు గారు నేడు గలరు. ఈ కవి వారివంశీయుఁడై యుండనగును. ఇది శతకసముచ్చయమున ముద్రితము.

## ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి

( క్రీ.శ. 1860 - 1916 )

మయూరమహాకవిరచిత సంస్కృతసూర్యశతకమునకు ఆకొండి వారొనర్చిన యనువాదము సరళమైనది. అది ముద్రితమై వ్యాప్తిలో నున్నది.

ఇది వసురాయని సూర్యశతకానువాదముతో సమకాలికముగా వెలసినది. ఆ కాలమున రాజమహేంద్రవరమున

ప్రకటితమగుచున్న చింతామణిపత్రికలో ముద్రితమై తిరిగి 1950 లో వావిళ్ళవారిచే ముద్రితమైనది. కాని వసురాయని శతకమునకున్నంత వ్యాప్తి దీనికి లేదు. మొదటి శ్లోకమునకు భాషాంతరీకరణము.

చ॥ తొలుదెస హత్తికుంభముల తోరపు చెందిరపున్ రజంబునన్
బలె నుదయాద్రి సానువుల భాసిలు జేగురుటేటి వెల్లువన్
బలె నపు డొప్పు నంబుజనిభన్ బలె నెఱ్ఱని డాలు మీఱు వే
వెలుఁగు వెలుంగు మీకు శుభవృద్ధి నిరామయసిద్ధిఁ జేయుతన్.

మ॥ సమయాకృష్ట విసృష్ట పుష్కల పయస్సంప్రీణితాత్మప్రజి
మ్మమితాఘ ప్రభవద్భవాబ్ధికలముఁ బ్రాంచత్పవిత్రాధిగా
జము ప్రోహప్రతిదిక్ప్రకీర్ణము పునస్సాయంనివృత్తము గో
సమజ మ్మర్కజ మిచ్చు మీ కమిత హర్షశ్రీప్రకర్షమ్ములన్.

## అల్లమరాజు రంగశాయికవి

### ( క్రీ.శ. 1861 - 1936 )

ఈతఁడు రచించిన శతకములు (1) రఘురామశతకము (2) పరమాత్మశతకము (3) సర్వేశ్వరశతకము (4) గోవిందశతకము (5) లక్ష్మీశతకము (6) మాధవశతకము (7) కుక్కుటలింగశతకము (8) గోపాలస్వామిశతకము (9) మల్లికార్జునశతకము అనునవి. ఉపలబ్ధములైన శతకముల నుండి మచ్చు పద్యములు.

## లక్ష్మీ శతకము

శా॥ కాణాదర్షి వరప్రణీతమగు తర్కం బే నెఱుంగం జుమీ
పాణిన్యారచితంబు వ్యాకరణ మొప్పం గొంచె మీక్షించితిన్
వాణీనైపుణి లేదు రాజసభలన్ వాదింపలే నమ్మ నే
వాణిజ్యంబును నే నెఱుంగ నిఁక నంబా! లక్ష్మి రక్షింపుమా!

## రఘురామశతకము

ఉ. శ్రీలలితోక్తులం గృతి రచించు తటిన్ ఘనమా కవి శ్రీమన్
బాలిశుఁ డే నెఱుంగుఁ గవివర్యుఁడె గాక సుతాళిఁగన్న యి
ల్లాలె యెఱుంగుఁ గాక ప్రసవాగతగర్భవతీశ్రమంబు గొ
డ్రాలది యే మెఱుంగు రఘురామ దయాహృదయా! శుభోదయా!

## మాధవ శతకము

శా॥ శ్రీపీఠాపురమందు భక్తులను రక్షింపం దలంపూని తత్
వ్యాపారంబుల చక్కఁ జేయుచుఁ గిరీటాద్యుత్తమాలంక్రియల్
దీపింపం జెలువొప్పు మోము దగఁ గుంతీదేవిచేతం బ్రతి
ష్ఠాపూజల్ గని యున్న నిన్ గొలిచెదన్ స్వామీ హరీ! మాధవా!

# కొత్తపల్లి లచ్చయ్య

## ( క్రీ.శ. 1863 – 1898 )

ఇతఁడు పిఠాపురము సమీపమున నున్న చెందుర్తి వాస్తవ్యుఁడు. తెలంగాణి వైదిక బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రి రామన్న, తల్లి సుబ్బమ్మ. ఎనమండ్రన్నదమ్ములలో నితఁడు నాల్గవవాఁడు. ఈకవి కుటుంబము చిరకాలము రావువారి సంస్థానమునే ఆశ్ర

యించుకొనియుండెను. ఇతఁడు దాశరథివిలాసమును, సూర్య శతకమును, చెల్లయ్యమ్మారావుశతకమును రచించెను. ఇతఁడు శరీరానారోగ్యముగల వాఁడగుటచే, ఆరోగ్యేచ్ఛతో మొదట దుష్కరప్రాససూర్యశతకమును రచించెను. పిదప తిరుపతి క్షేత్రమును దర్శించి వచ్చి శ్రీవేంకటేశ్వరుని కంకితముగా దాశరథీవిలాసమును రచించెను. ఇతఁడు ఆశుకవిత్వము చెప్పువాఁడు. సమస్యాపూరణమున నిపుణుఁడు. ఎవ్వరేకథ, నేరీతిని చెప్పుమన్న నారీతిని - బొబ్బిలిపాట - శారదకావ్యము - కోలాటపుపదములు మొదలగు రీతులలో ఆశుధారను గ్రామ మధ్యముగ రాత్రులు వీధులలో నిలువబడి, పాడి, జనరంజనము సేయువాఁడు. అనారోగ్యవంతుఁడగుటచే వివాహము చేసికొనలేదు. ఇతఁడు నవ్వు పుట్టించునట్లు మాట్లాడువాఁడు.

1. సూర్యశతకము. సంయుక్తాక్షరప్రాసకందములు

క. శ్రీభ్రాజితకరవిమతౌఘభ్రోద్ధూత ప్రభంజనాభీలమహా
ద భ్రానుకంప మహిత సదాభ్రాగ్య విహార తోషితార్యా సూర్యా!

క. బ్రధ్నచతురాగమాగమ బుధ్నప్రభాకర దినేశ పూషణనామా
గృధ్న నిరాకరణ యహిర్బుధ్నాచ్యుత విధిమయ స్వాహాస్వా! సూర్యా!

క. ఈక్రమమున భవదంకితమై కార్విలఁగ వినెడునారి యఘములు గాలన్
గాక్రొత్తపల్లిలచ్చనచే క్రొత్తగనయ్యె సంతసింపుము సూర్యా!

2. చెల్లయ్యమ్మారావుశతకము - కవి తన పోషకులౌఁగు శ్రీచెల్లాయ్యమ్మారావు బహద్దరు వారిపై చెప్పిన శతకము.

క|| శ్రీవెలయ సార్వకాలము మీా విమలాన్వయ సమృద్ధి మీాఱ సదయుఁడై
దీవన లొసఁగుచు వరలక్ష్మీ విభుఁడు దలంచునమ్మ చెల్లయ్యమ్మా!

ఈ శతకము నీతి విలసితమై మనోహరముగ నుండును.

క|| ఎట్టి కులంబునఁ బుట్టిన నెట్టి గుణాగుణ విభేద మెఱిఁగిన నరుఁడో
ల్పుట్టున దొట్టిన కర్మము నెట్టకుఁడుపకుండదమ్మ! చెల్లయ్యమ్మా!

క|| భూసురకవి సుజన మనోల్లాసతకై క్రొత్తపల్లి లచ్చయ వేడ్కం
జేసి యొక శతకరత్నము జేసెం గడు మెచ్చవమ్మ చెల్లయ్యమ్మా!

# దశరథరామకవి

(క్రీ.శ. 1864 ప్రాంతము)

ఈ కవి దాట్ల వేంకటపతిరాజుగారి ప్రేరణచే సీతాపతీశతకము రచించెను. 'రామ తీర్థగిరిధామా రామ! సీతాపతీ' అను మకుటము.

శా|| దానక్షాత్రములన్ భవత్పదయుగధ్యానంబులన్ స్వామికా
ర్యానూనస్పృహ నీడులేక మను దాట్లాఖ్యాన్వయోద్యత్కుమం
దా నీభాగ్యచిరాయురుజ్జ్వలులనొందఁగ నీకృపాపాంగదృక్
స్థానం జేయుము రామతీర్థగిరివాసా! రామ సీతాపతీ!

ఇట్లే రామతీర్థగిరి గేహా - అను మకుటములు గలవు. ఆద్రిగోరసుధాకరశాకసమేఘు సంగతిని వ్రాసినాఁడు.

( శా.శ. 1786 )

## మోదుకూరి అమరకవి

(క్రీ.శ. 1860 ప్రాంతము)

ఈతడు గోపబాలశతకము రచించెను. కంపపద్యములు 'శ్రీగోపబాలకరుణాలోలా' అను మకుటము. ఈతఁడు గుర్వార్యునకుఁ బౌత్రుఁడు, జోగయ్య పుత్రుఁడు.

క. శ్రీసత్పండితనగర నివాసనతవ్యాసతప్త వసుమయవాసా!
భాసానర్ఘ్యకిరీట వికాసా శ్రీగోపబాల కరుణాలోలా!

## హరి అచ్యుతశర్మ

ఇతడు గోపబాలశతకమును రచియించెను. - చంపకోత్పలములు - 'గోపబాలకా' అను మకుటము - 104 పద్యములు. శా.శ. 1789 క్రీ.శ. 1867 లో రచితము.

ఘనముగ శాలివాహన శకంబులు వేయిని నేడు నూఱులు
న్ననుబది తొమ్మిదౌ ప్రభవ మిందుల చైత్రపు శ్వేతపక్షమం
దనువుగ సప్తమందు హరి యచ్యుతశర్మ రచించినాఁడ దీ
నిని విను వ్రాయు వారలను నెప్పుడుఁ బ్రోవగ గోపబాలకా!

## నతగాని మాధవకవి

( క్రీ.శ. 1870 ప్రాంతము )

"రామదైవాగ్రణీ" అను మకుటముతో రామస్తుత్యాత్మకమైన రామముక్తావళీశతకమును మాధవకవి రచిం

చెను. ఇందు 109 పద్యములు గలవు. ఈతఁడు పరాశర్య గోత్రుఁడు.

శ్రీమద్భూమిసుతాకుచస్తబక కాశ్మీరద్రవామేడితా
భామాల్యాంబుజ రాగరత్నరుచి బాలార్కప్రభామండల
శ్రీమోదావహ తారహార సుమనస్సింధుప్రవిష్టోరు బా
హామధ్యాంబరసీమ, రమ్యగుణధామా! రామదైవాగ్రణీ!

శ్రీమద్భవ్యపరాశరాన్వయ సుధాసింధూజ్జ్వలత్పూర్ణిమా
సోముండౌ నతగాన మాధవకవీశుం డెన్నెఁ జేసెన్ సదా
క్షేమం బిచ్చుఁ ద్వదర్పణంబు గదురక్ శ్రీరామముక్తావళీ
నామగ్రంథము దీని నిల్పు కృపతోనన్ రామదైవాగ్రణీ!

ఈ మకుటముతోడనే యీతఁడు రామనవరత్నములను రచించినాడు. అది యచ్చు టచ్చుట క్రిమిదష్టమైనది.

శా. "శ్రీవైకుంఠపురాగ్రణీ నిజశుభశ్రీణాఖిలైశ్వర్యల
క్ష్మీవల్లూజ్జ్వల దివ్యరత్నభవన శ్రీస్వర్గదికార్యయా
................చితజాత్మజక్షితిపకాంతారత్నగర్భాఖ్యపా
రావారామృతధామ! ధామనిధి రామా! రామదైవాగ్రణీ"

## మా. శేషాచలనాయుఁడు

( క్రీ.శ. 1876 ప్రాంతము )

ఈతఁడు 'శివమహేశ' అను మకుటముతో నొక ఆటవెలది పద్యశతకమును రచియించియున్నాఁడు. కవిని గూర్చి విశేషములు తెలియకపోవుటచే, ముద్రితశతకముఖపత్రము నిందు పొందుపఱచుచున్నాను.

"ఆన్ధ్రభాష నభ్యసింపఁగోరు బాలురకు సకలవివేకహృదయ
రంజకంబగునటుల, మా॥ శేషాచలనాయని
వారిచే రచియింపఁబడి

ఇది

రా॥ సుబ్రహ్మణ్యశాస్త్రులవారిచే పరిష్కృతముగావించి
మో. కృష్ణమరాజుగారి
స్వకీయమగు విబుధమనోహారిణీముద్రాక్షరశాలయం
దచ్చుగూర్పించి ప్రచురింపఁబడియె
1876 సంవత్సరం."

ఈ శతకము చెన్నపురిలోని కపాలీశ్వరశివున కంకితము. వీరశైవవేదాంతవిషయికము.

ఆ. వె. విఘ్నరాజు నాకు విఘ్నముల్ గాకుండ
శుభము లిచ్చు గాక సుస్థిరముగ
వేఁడుకొనెద మిమ్ము వేమారు మదిలోన
చెన్నపురినివాస! శివమహేశ!

ఆ. వె. బసవరాజసామి పాదారవిందముల్
మ్రొక్కి గొల్చె దేను మోదమలర
మిమ్ము వేడుకొనెద మీదాసదాసుండ
చెన్నపురినివాస! శివమహేశ!

ఆ. వె. అల్లమయ్య నెప్పు డాత్మలో నుంచుక
భజనసేతు సతము భక్తితోడ
మీరు గానరామి మిమ్మెట్లు గందునో
చెన్నపురి నివాస......................

ఆ.వె. ప్రమథగణములార ప్రమథాధిపతులార
పరమపదనివాసభవ్యులార
మిమ్ము వేడుకొనెద మీదాసదాసుండ
చెన్నపురినివాస.........................

ఇందు 130 పద్యములు గలవు.

# పెట్ల జగన్నాథాచార్యుఁడు

( క్రీ.శ. 1879 ప్రాంతము )

ఈతఁడు శ్రీకాకుళమండలమునకు (ఉత్తరవిశాఖమండలము) ముఖ్యస్థానమైన శ్రీకాకుళ వాస్తవ్యుఁడు. ఈతని గూర్చిన విషయములు తెలియుటకు ముఖపత్రము నిచ్చుచున్నాను.

"శ్రీకాకుళపురవిహారవర లాంగుళ్యానదీతీర నివాసులగు శ్రీరుద్రకోటీశ్వరచరణారవిందవందన కుతూహలుండును శ్రీవిశ్వబ్రహ్మకులజుండును, సుజనవిధేయుండును, నగు పెట్ల జగన్నాథాచార్య ప్రణీతంబైన రుద్రకోటీశశతకము.

ఇది

పండితుల సహాయముచే పరిష్కరింపఁబడి పిళ్ళారిసెట్టి రాఘవయ్యనాయనివారి శ్రీభారతీనిలయమను ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1879 సం. నవంబరు 25 తేది.

మచ్చునకు :—

క. శ్రీలలనావల్లభ! హర! కాలారీ! కృత్తివాస! కామితఫలదా!
శూలాయుధపాణి! శ్రీకాళహస్తి పురవిహార రుద్ర కోటీశ శివా!

పై పద్యమును బట్టి కందపద్యములన్నియు ఏకయతి ఏకప్రాస నియమముతో నున్నట్లు తెలియగలదు. శతకము నందలి మఱియొకపద్యము వలన నీతఁడు చల్లమాంబా సాంబయల పుత్త్రుఁ డని తెలియుచున్నది.

## జూలూరి లక్ష్మణకవి

( క్రీ.శ. 1880 ప్రాంతము )

ఈతఁడు మధ్వబ్రాహ్మణుఁడు. బ్రౌనుదొరవారి వద్ద పండితుఁడుగా నుండి, మను వసుచరిత్రాది ప్రబంధములకు వ్యాఖ్యాతయైన అప్పయపండితుని మనుమఁడు. శేషమాసుబ్బనార్యుల పుత్త్రుఁడు. అప్పయపండితుఁడు క్రీ.శ. 1830 నాటి వాఁడు. ఆయన చరిత్ర మీ శతకకవులచరిత్ర (524 పుట) లో గలదు.

లక్ష్మణకవి "ముకుందరాఘవశతకము" అను పేర 250 పద్యములలో రామాయణ కథను రచించినాడు. బాల కాండాది విభాగమిందుఁ గలదు. కవిత నిర్దుష్టమై ప్రౌఢమౌ యున్నది.

ఉ. శ్రీవసుధాత్మజా మృదులచిత్త సరోజమిళింద! నిత్య సం
భావిత విశ్వమంద! పరిభావితచంద్రముఖారవింద! భా
షావరశంకరేంద్రనుత సద్గుణబృంద! సుకీర్తికంద! సం
సేవకచాతకప్రకరమేచకకంద! ముకుందరాఘవా!

ఉ. రామకథామృతంబు రుచిఁద్రావి భవంబుఁ దొరంగి మానవ
స్తోమము ముక్తిఁ జెందఁ గృపతో నిటుచేసితిగాక వార్ధి ని
చ్చామతి దాఁటుటెంత! దనుజచ్చట దుంచుట యెంత నీదు లీ
లామహిమంబుఁ జిత్రము దలంపఁ దలంప ముకుందరాఘవా!

తన పితామహుఁడగు అప్పయార్యు నిట్లు స్తుతించినాఁడు.

చ. స్థిరమతి వాణిఁ నెంచి, కవిశేఖరుల న్వినుతించి, యాంధ్ర వా
గ్గరిమకు నన్నపార్యుఁ డనఁగాఁజను జూలురి యప్పయార్య మ
ద్గురునిఁ బితామహుం గొలిచి కూర్చెద రామ భవత్కథావళిన్
వరుసగఁ జిత్తగింపుముఁ గృపామతితోడ ముకుందరాఘవా!

# నె. చెంగల్వరాయకవి

## ( క్రీ.శ. 1880 ప్రాంతము )

ఈతఁడు రచించిన సాంబశివశతకము క్రీ.శ. 1880 లో కో. అనంతాచార్యులవారిచేఁ బరిష్కృతమై, చెన్నపురి ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. అం దీతఁడు రాజానగరనివాసి యని చెప్పఁబడియున్నది. హైద రాబాదుప్రాంతమువాడు కానోపును. కవిత్వశైలి సామాన్య మైనది. 110 పద్యములు.

క. పులుగంటి వంశపావనుఁ డల సుబ్రహ్మణ్యగురు పదాబ్జముల మదిన్
నిలిపి నిను బ్రస్తుతించెద నలఘుగుణా! చిత్తగింపు హరసాంబశివా!

క. క్షితివిశ్వకర్మ కులజుఁడ చతురుండగు సుబ్బయకును సావిత్రమకున్
సుతుఁడను చెంగయనాముఁడ కృతినిచ్చితి నీకుఁ గావు శ్రీసాంబశివా!

క. సంబళ్ మీాలే కల్ల చిదంబరమున గగనలింగమై దాగితివే
సంబళ్ మడుగను బ్రత్యక్షంబైతే దానికదియె సరి సాంబశివా!

పై పద్యముల వలన నీతని వృత్తాంతము తెలియ గలదు. చివరపద్యమున భావము మనోహరముగా నున్నది.

# కేశవదాసు

## ( క్రీ.శ. 1880 ప్రాంతము )

ఈతఁడు "సప్తగిరీశ్వరశతకము" అను పేర వేంకటే శ్వరస్తుత్యాత్మకమగు నొక శతకము రచియించియున్నాఁడు. 108 చంపకోత్పలమాలికలు గలవు. "సప్తగిరి వేంకటేశ్వరా" యనియు "వెంకటేశ్వరా" అనియు మకుటములు గలవు.

ఉ॥ శ్రీగురుపాదపద్మములఁ జిత్తమునందు భజించి భక్తితో
నాగమవేత్తలం దలచి యార్యుల మ్రొక్కి కవీశ్వరాళికిన్
రాగముమీాఱ కేల్మోగిచి రమ్యముగా శతకంబుఁ గూర్చెదన్
సాగరపుత్రికారమణ సప్తగిరీశ్వర వెంకటేశ్వరా!

ఉ. దంతము లూడి వీక్షణలు దప్పి శిరంబును కంపమొంది దు
శ్చింతపయోధిలో మునిఁగి ఛీపడి చావక మున్న మానవుం
డంతకుఁ జేరనీని క్రమమారసి నీ మహనీయసత్కృపం
బొంతముఁ జేసికోవలయు సుస్థిరభక్తిని వేంకటేశ్వరా!

కవినిఁ గూర్చి శతకమున విశేషములు తెలియలేదు. కావున గ్రంథము ముఖపత్రమున గల విషయము నిచ్చుచున్నాడను.

"సప్తగిరీశ్వరుని శతక మను యీ గ్రంథము శ్రీ కేశవాచ్యుతుని సభవారలలో నొక్కడైన తిరుక్కైకొండ్రం నేటి వుడాక్టరు పొన్నుస్వామి మొదలారి గారి ప్రార్థనవల్ల కేశవదాసాఖ్యునిచే రచియింపంబడి శ్రీసరస్వతీభండార ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడియె.

1889 సం॥ తిరువల్లిక్కేణి (మదరాసు)

## సారెపాక వేంకటకవి

(క్రీ.శ. 1880 ప్రాంతము)

ఈతఁడు రామశతకమును రచించెను. కందపద్యాత్మకము. 101 కందపద్యములు.

క. శ్రీమన్నామపయోదశ్యామ మహీపుత్రికాహృదంబుజతేజో
ధామ కృతిభక్తలోకక్షేమ ధరాధిపలలామ సీతారామా!

క. భూవిబుధుడ నభినందిత కోవిదుఁడను సారెపాక కులసంభవుఁడన్
శ్రీవేంకటాఖ్యుఁడను............నిన్నువినుతి చేసెద రామా!

క. ఈ శతకము నతి భక్తిన్ వ్రాసినఁ జదివినను వినిన వారికిఁ గోర్కుల్
వే సమకూరును...........వాసుఁడ వగు నీదు సత్కృపను రఘురామా!

ఈతఁడు బ్రాహ్మణుఁడని పైపద్యమువలన స్పష్టము. ఇతరవివరములు తెలియవు. (R 401)

# మతుకుమల్లి కృష్ణశాస్త్రులు

( క్రీ.శ. 1880 ప్రాంతము )

అజచరిత్రాది బహుమహాగ్రంథములను రచియించిన మతుకుమల్లి నృసింహకవి తనయుఁ డగు కృష్ణశాస్త్రిలు "వీరభద్రశతకము" అను నొక సీసపద్యశతకమును, రచించి యున్నాఁడు. అది క్రీ.శ. 1880 ప్రాంతముల పోలవరమునకు జమీందారులైన శ్రీరాజా కొచ్చెర్లకోట వెంకటజగన్నాథ రావుబహద్దరు వారి ప్రేరణచే రచితమైనది. అప్పటికి మైనర్లను నీతరువాత, భాషాపోషకాగ్రిగణ్యులు, కీర్తిమూర్తులు నైన శ్రీరాజా కొచ్చర్లకోట రామచంద్రివేంకటకృష్ణా రావుగారి కభ్యుదయముగా నిది వెలసినది. గోదావరీమండలమున పట్టిసమునందలి వీరభద్రుని పేర 109 పద్యములలో రచితమైనది. కవితాశైలి కమనీయమైనది. క్రీ.శ. 1884 లో విశాఖపట్టణమున ఆర్ష ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

సీ. శ్రితపంకజపతంగ! కృతసూర్యసుతభంగ!
మానిసన్నుతశృంగ! మహిమతుంగ
నతచేతనపతంగ! హితకరస్థకురంగ!
హృతమదవదనంగ! భృతమతంగ
పతమాళితతగంగ! భవ్యదృష్టిశరంగ!
సప్తకంధినిషంగ! సమఃభంగ!
నుతిమధురసభృంగ! వితతర్ష భతురంగ!
ధవళవిలసదంగ! ధనదసంగ

గీ|| దక్షరూక్షాధ్వరధ్వంస దక్షరౌద్ర భద్రకాళీమనోనీరభవదినేంద్ర
భవ్యగోదావరీ మధ్య పట్టసాఖ్య విపులగిరివర నిర్ణిద్ర వీరభద్ర.

ఈ శతకమున విశేషమేమనగా నెత్తుగీతియంతయు మకుటమే.

సీ. కాశ్యపగోత్రప్రకాశ శీలుఁడు మతు
కమల్యాన్వయ మహాత్ము డధిక
పండితవంశ్యుండు భాసురమాల్యశై
లవరనివాసి విలసనశాలి
లక్ష్మీనృసింహానులలిత కృపాలబ్ధ
కవితాచమత్క్రియాకలితుఁడైన
కృష్ణశాస్త్రియు మీకు కృతి శతకం బను
పతకంబు నర్పించె పరమపురుష
గీ. దక్షరూక్షాధ్వరధ్వంసదక్షరౌద్ర భద్రకాళీమనోనీరభవదినేంద్ర
భవ్యగోదావరీమధ్య పట్టసాఖ్య విపులగిరివర నిర్ణిద్ర! వీరభద్ర!

# పున్నోజు రామయ్యకవి
## (క్రీ.శ. 1880 ప్రాంతము)

శ్రీశైలభ్రమరాంబావరప్రసాదుఁడైన యీ సత్కవి "శంభో దయాంభోనిధీ" అను పేర శివస్తుత్యాత్మకమగు శతకమును రచించెను. ఇది ధారాశుద్ధికలిగి, శైవవేదాంతమును శివయోగసంప్రదాయములను వివరించుచు, అన్నమయ్య సర్వేశ్వరశతకముతో సమానముగ నున్నది.

శా. శ్రీరమ్యంబగు నీపదాబ్జయుగమున్ జేజాచి సద్భక్తితో
నారాధించెడి దాసకోటి పరిచర్యల్ చేసి విజ్ఞాన సు

త్కారుణ్యంబు గ్రహించి మోక్షపద మాకాంక్షించి భావించి సం
సారాంబోధి తరింపఁజేతు వినతుల్ శంభో దయాంభోనిధీ!

కవి విశ్వబ్రహ్మకులజుఁడు. శేషయ వీరభద్రాంబల పుత్త్రుఁడు.

శా. విశ్వబ్రహ్మకులుండ శేషయసుసాధ్వీ వీరభద్రాంబ పు
త్త్రైశ్వర్యాకృతి రామసత్కవిని లింగారాధనార్థంబుగన్
విశ్వంబందు రచించి తీ శతకమున్ వేదాంతమార్గంబునన్
శశ్వత్ప్రాజ్ఞులు సంతసింప శివ శ్రీశంభో దయాంభోనిధీ!

శా. అంభోరాశి జలంబు దోయిగొని యర్ఘ్యంబెత్తి సంభోధిలో
శుంభద్భల్లిల నొసంగు భంగి శివసంస్తోత్రంబు గావింతు నీ
యంభోజాత భవాండ తాండవ కృతాద్యాధార నిస్సాత్మ నే
సంభావించుట హాస్తిసన్మశకవత్ శంభో దయాంబోనిధీ!

ఈ శతకమే కాక లింగమూర్తిపాట, భ్రమరాంబా దండకము అను రెండు కృతు లీతఁడు రచించినాడు.

శ్రీగురుచరణంబు లింగమూర్తీ - నాదు - చిత్తమందుసన నిల్పు లింగమూర్తీ

అని మకుటము, ఇది గేయరచన. 110 పంక్తులు గలవు. భ్రమరాంబాదండకము ప్రౌఢశైలి గల దండకము. ఈ గ్రంథము లన్నియు శ్రీ పరిమి వీరాచార్యులవారి వలన క్రీ.శ. 1884 లో శైవసిద్ధాంతముద్రాక్షరశాలలో ముద్రితములైనవి.

# నిష్టల కామకవి

( క్రీ.శ. 1880 ప్రాంతము )

ఈతఁడు రామశతకము - కందపద్యములతో రచించెను.

ఇది నిష్టల కామ సుధీ గదితం బిందలి పదార్థ గత దోషములన్
దుదముట్ట దిద్దుఁడని సమ్మదమునఁ గోరెదను గవుల మది నిడి రామా.

ఇందు 105 పద్యము లున్నవి.

# కస్తూరి శివరాజయ్య

( క్రీ.శ. 1886 ప్రాంతము )

ఈతఁడు ఉమామహేశ్వరశతకమును రచియించెను. గ్రంథకర్త ముద్రణకాలమునాటివాఁ డనుటకు ముఖపత్రము నిం దిచ్చుచున్నాను.

"హైదరాబాద్ యిలాకా జగిత్యాల కస్తూరిశివరాజయ్యగారిచే రచియింపఁబడినది. సదరు గ్రంథకర్తచేఁ బరిష్కరింపఁబడి సికింద్రాబాదు కంభంపాటి రంగనాయకులు, ముత్యం శరభయ్యగార్లచే శారదానిలయముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడియె. చెన్నపురి 1886.

"ఉమామహేశ్వరా" అను మకుటము. 108 పద్యములు. చంపకోత్పలములు. మచ్చునకు పద్యములు -

శ్రీకర భక్తమానసవశీకర రౌప్యనగేంద్రవాస చా
మీకర శైలచాపపరమేశ్వరపూర్ణకృపాసముద్రశు
భ్రాకర కోమలాంగ శశిభాస్కరవహ్నివిశాలనేత్ర గ
త్నాకర రాణ్ణిషంగజగదాకర శ్రీమదుమామహేశ్వరా!

ముదమున వాసుదేవగురుమూర్తిపదాబ్జము లెల్ల ప్రొద్దు నా
హృదయసరోజపీఠమున నుంచియు......................

భక్తికలుంగు మాత్రమున 18 వ పద్యము.

కుంభిని పద్మశాల వరకోనయ నెయ్యపు ధర్మపత్ని గం
గాంబ కుమారులిద్దరము కార్యధురంధరు లింగయార్య నే
రంబవిహీనుతన్ మృగమదాన్వయజాతుఁడ రాజయాఖ్యుఁడన్
అంబరకేశ నిన్ను గొనియాడితి శ్రీమదుమామహేశ్వరా.

అక్షయపద్యవర్గ మమలాత్మక మేకముఖాఖ్యముఖ్యరు
ద్రాక్షలు తద్రహస్యవిదితార్థము సూత్రము మేరుదివ్యపం
చాక్షరి నస్మదీయకృతహార ముదాగతిఁ దాల్చి సత్కటా
క్షేక్షణ మమ్ము బ్రోవు భువనేశ్వర శ్రీమదుమామహేశ్వరా.

సరసకవీంద్రులార ఘనసజ్జనులార కవీంద్రులార మ
ద్విరచితమైన పద్యవితతిన్ బహుదప్పులు గల్గెనేని సా
దరమున దిద్దరయ్య ప్రమదంబున హస్తయుగంబు మోడ్చి మీ
చరణసరోరుహంబు లనిశంబు దలంచి నుతించి మ్రొక్కెదన్

# శ్రీపతి పండితారాధ్యుల శరభసాళ్వం అయ్యవారు

(క్రీ.శ. 1886 – 1924)

వీరు పూర్ణమల్లికార్జునయ్యవారి శిష్యులు. శ్రీపతి పండితారాధ్యుల లింగమూర్తి అయ్యవారికిని శ్యామలాంబ

కును పుత్రులు. కౌశికగోత్రులు. ఉభయభాషాకవులగు వీరు తెలుఁగున, మాతృరిరంసోపాఖ్యానము అను ప్రబంధమును అగస్త్యేశ్వరశతకమును క్రీ.శ. 1923 లో రచించిరి. ఈ శతకశైలినిఁ జూపుటకు రెండుపద్యము లుదాహరించుచున్నాను. ఈ యగస్త్యేశ్వరుఁడు ఈమని గ్రామమున వెలసినమూర్తియే!

మ|| ఘనుఁడై శంకరపార్వతీనిలయముల్ గట్టించి, బంగారుచే
నను వౌ శృంగములెత్తి కీర్తిగని నిత్యం బాప్తులన్ బంధులన్
తనియంజేయు సుసాహితీకవనతత్త్వజ్ఞానపారీణు మ
జ్జనకుం గొల్చెద లింగమూర్తి నెదలో సాంబా యగస్త్యేశ్వరా!

మ|| కరులం గోరితినా విశేషధనముల్ గాంక్షించి తెమ్మంటినా
హరులన్ వేడితినా పురంబులను నాకై గూర్పవే మంటినా
వరసౌధంబుల నీయమంటిన మది న్యాయంగ లేనంటి నీ
చరణాబ్జంబుల భక్తి నాకొసఁగుమో శర్వా! యగస్త్యేశ్వరా!

# అన్నావధూతస్వామి

( క్రీ.శ. 1886 ప్రాంతము )

ఈతఁడు హైదరాబాదుప్రాంత వాస్తవ్యుఁడు. ఈతని వేములవాడ రాజేశ్వరశతకమును గూర్చిన వివరము లిచ్చుచున్నాఁడను. ముఖపత్రమున నిట్లున్నది.

"శ్రీమత్ బృహద్వసిష్ఠసంప్రదాయకులైన శ్రీమత్పరమభూమానందస్వామి యను అన్నావధూతస్వామివారిచే రచియింపబడిన - వేములవాడ రాజేశ్వరుని శతకము - ఇది

సికింద్రాబాద్ లష్కర్ ఆకులబజారులో నుండెడి ముత్యం శంభయ్యగారు, కంభంపాటి రంగనాయకులుగారు వీరలచే శారదానిలయముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడియె - చన్నపురి 1886 జనవరినెల.

ఇది పదశతకము. వేదాంతవిషయికము. ఉదాహరణకు –

1. శ్రీరాజరాజేశ్వరా పార్వతీ చిత్తబిసరుహ (విషరుహ) భాస్కరా
కారణాచార్యవర్యా! మద్గురవే కటకంఠ శ్రీరాజేశ్వరా!

2. వేములవాడవాసా - వేదాంతవేద్య హృత్పద్మభృంగా
స్వామినే నీవాఁడను ననుఁ బ్రోవు - సర్వజ్ఞ రాజేశ్వరా!

# పరవస్తు మునినాథకవి

## (క్రీ.శ. 1890 ప్రాంతము)

ఈతఁడు సాతానివైష్ణవుఁడు. "లక్ష్మీశతకము" అను కందపద్యశతకము రచియించెను. ఈ శతకము మిక్కిలి ప్రౌఢమైనది. కవి తన్నుఁగూర్చి శతకములో నిట్లు చెప్పుకొన్నాఁడు.

క. భువి శ్రీమచ్ఛేషమఠపరవస్తు జియ్యరు శిరోఽగ్రరత్న కృపాపాం
గవిభావితాష్ట ఘంటాకవితాద్రివిణాఢ్యుఁడనుత గంగాలక్ష్మీ!

క. అనుపమ కవితా రచనా ఘన పరివీణుండ మదకుకవిమూర్ధ్న విలుం
ఠన కుశలహస్త పల్లవుఁడను మునినాథాభిధానుఁడను శ్రీలక్ష్మీ!

క. మందార మంజరీ మకరందఝరీ మాధురీధురాభరణవచో
బృందంబులు నీపేరిట.కందంబులు చెప్పవాఁడ నైకొను లక్ష్మీ!

క. కందంబులు కవి మధురస కుందంబులు సకల దీన కోకిలచయమా
కందంబులు భక్తజనానందంబులు శతకముగ నొనర్తును లక్ష్మీ!

క. ప్రణవాకారిణి విష్ణు ప్రియణయిని, ప్రణతప్రజార్తి భంజన నిపుణీ!
ప్రణుతజన మందిరప్రాంగణ విలసత్పారిజాతకద్రుమ లక్ష్మీ!

# ముదిగొండ చినమల్లనారాధ్యులు

( క్రీ.శ. 1890 ప్రాంతము )

వీ రుద్భటారాధ్యవంశోద్భవులు. భారద్వాజసగోత్రులు, తల్లి లింగాంబ. తండ్రి వీరేశలింగము. వీరు సంస్కృతాంధ్రకవనదక్షులగుటయే గాక నాడీ విజ్ఞాన శాస్త్రమున నత్యంతనైపుణ్యమును సంపాదించినవారు. వీరు వేములవాడ రాజేశ్వరునిపై రాజలింగశతక మను సీసపద్య శతకము జెప్పిరి. అందుండి యొక పద్య ముదాహరించుచున్నాను.

సీ. జనని గర్భమునుండి ధనము తేడెవ్వండు
తల్లి పోయెడివేళ తగిలిరారు
కోటీశ్వరుండైన కూటికోసమె కాని
పూడ్చిపెట్టిన సొమ్ము పుచ్చుకోడు
ఘనధనం బార్జించి కనులఁ జూచుటె కాని
తనమేన నొక్కింత దాల్చఁ డెపుడు
మరుగైన స్థలమందు స్థిరముగా నుంచియు
దానధర్మము లేక దాచి దాచి

గీ. ఆఖరుకు చోరులకునానో, అగ్నికానో
భూపతుల కానో యెన్నంగ భూమి కానో

తేనెటీఁగలు గూర్చిన తేనె పగిది
రమ్యవేములవాడ శ్రీరాజలింగ!

వీరు తే 4-9-1906 దీని శివసాయుజ్యము చెందిరి.

## పండితారాధ్యుల వీరేశలింగము

( క్రీ.శ. 1890 ప్రాంతము )

ఈతఁడు రెండుశతకములను రచియించెను. భవానీ శతకము ఇది భవానీస్తుతి. కందపద్యాత్మకము. రెండవది రాజరాజేశ్వరీశతకము. ఇది మత్తేభ శార్దూల వృత్తసహితము. మొదటిదానిలో నేఁబదిపద్యములు, రెండవది పూర్తిగను లభించినవి. ఇవి రెండు గాక శనైశ్చరనక్షత్రమాల యను నిరువదేడు పద్యములు గల కృతిని రచించెను.

రాజరాజేశ్వరీ శతకమున తొలిపద్యము.

శా. శ్రీమత్పద్మభవాదినిర్జరశిరశ్శ్రేణీకిరీటాగ్రభా
గామూల్యాఖిల రత్నకాంతి నికరవ్యాకీర్ణపాదద్వయీ
సామోదార్భుత వినోది రాజగమనా! శశ్వచ్చిదానందనీ
క్షేమారోగ్యసుఖప్రదాన నిపుణా! శ్రీరాజరాజేశ్వరీ!

భవానీశతకము

క. శ్రీకరదివ్యపదాబ్జా పాకారి ప్రముఖదేవ పంక్తిస్తుత్యా
లోకేశ వినుత రాజ్ఞీ చేకొనుము మదీయకవిత క్షితిని భవానీ!

క. పలుమరు నీపాదంబులఁ గొలుతును నాకోర్కులిమ్ము గురుకరుణా
జలనిధివై పనియింపుము వెలయఁగ నాయెడఁద తమ్మివిరిని భవానీ!

క. ఎన్ని విధంబుల వేడినఁ గన్నడ సేసెదవుగాని కరుణింపవు నీ
కన్న మఱి వేల్పులేరెడ నున్నారా తెల్పు మందు నొకని భవానీ!

## ఇవటూరి సానందారాధ్యులవారు

( క్రీ.శ. 1896 )

వీరు కృష్ణాజిల్లా గన్నవరంతాలూకా పమిడిముక్కల వాస్తవ్యులు. మహాప్రసిద్ధమై శైవగురుపదారూఢమైన ఇవటూరివంశమున జన్మించినవారు. సుబ్బమాంబా చినమల్లికార్జున దంపతుల తనయులు. సంస్కృతాంధ్రాంగ్లభాషాకోవిదులు. వీరు నవీనకాలమం దపూర్వమని చెప్పదగిన బ్రహ్మచర్యదీక్ష నవలంబించిన మహనీయులు. వీరి షష్టిపూర్తి మహోత్సవము ఆంధ్రాస్థానకవి, ఆంధ్రవ్యాస, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి అధ్యక్షతను 1956 డిసెంబరునెలలో జరిగినది. వీరు రచించిన రెండు శతకములు శాంకరీ, భ్రమరాంబాచెన్నమల్లేశ్వరశతకములు అద్యతన శతకవాఙ్మయమున ప్రత్యేకవిశిష్టతగలవి. ఒక్కొక్కశతకము నుండి రెండు పద్యము లుదాహరించుచున్నాను.

ఉ. కాంచనచేలుఁడైన సిరికాంతుఁడు శౌరి ఫలంబుఁగోరి నిన్
గాంచ సహస్రవర్షములు గాఢతపం బొనరించె నంచు మే
లెంచి పరాశరాత్మజుఁడు హెచ్చుగ వ్రాసిన వ్రాఁతనైన వీ
క్షించక తద్విరుద్ధముగఁ జెప్పెడువారికి లగ్గె శాంకరీ!

ఉ. వింటిని వేదధర్మముల విజ్ఞత శాస్త్రములందు మర్మముల్
గంటిని. నీస్వరూపమును గానగ సాధనమైన భక్తియం

దుంటిని చిత్తశుద్ధి చెలువొందగ నొందుచు నెట్టులైన నీ
యింటికిఁ జేర నేఁడు తపియించుచు నుంటిని కావు శాంకరీ!

భ్రమరాంబాచెన్నమల్లేశ్వరశతకము. ఇది ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరశతకమును జ్ఞప్తికిఁ దెచ్చును.

మ. సిరిపైఁగోరిక, యాజవంజవముపై చిత్తంబు, హాస్యంబుపై
పరమానందము, భూమిపై మురువు, దివ్యారామవిత్తంబుపై
పరసమ్మోదము, కాంతపై మనసు నేభవ్యుండు వర్జించు నీ
పరధామంబును వాఁడె పొందు భ్రమరాంబా చెన్నమల్లేశ్వరా!

మ. తానే లోకము సంస్కరించు నను చింత న్మగ్ని గర్వోన్నతిం
దానే యన్నిటఁ గర్తనంచు సతమున్ దర్పోన్నతిం బొంగుచున్
నీ నామంబును నీదు కర్తృతను దా నిందించు మూర్ఖుండు ఛీ
భ్రాంతై పుట్టక మర్త్యుఁడయ్యె భ్రమరాంబాచెన్నమల్లేశ్వరా!

## పిన్నమరాజు బలరామకవి

ఈ సత్కవి పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకా ఆలమూరు పెద్దకరణము. క్రీ.శ. 1912 నాటికి నీ దిగువ కృతులు రచించిరి. వానిలో శతకకృతులు —

1. శ్రీ కేశవశతకము ముద్రితము
2. శ్రీరమారమణకృష్ణశతకము ,,
   శ్రీమదంతర్వేదిలక్ష్మీనృసింహశతకము ,,
4. శ్రీకమలాదేవ్యంకితశతకము. అముద్రితము
5. శ్రీరంగనాథశతకము ,,

6. శ్రీమత్సుబ్రహ్మణ్యశతకము — అముద్రితము
7. శ్రీమానసబోధశతకము — ,,
8. శ్రీఆపన్నివారణకృష్ణశతకము — ముద్రితము
9. వేంకటశైలపతిశతకము — అముద్రితము

వీనిలో నొక్క అంతర్వేది లక్ష్మీనృసింహ శతకము లభ్యమైనది. ఇది సీసపద్యశతకము. ధారాళమైన శైలి నున్నది.

సీ. జలజసంభవముఖ్య విలసితస్తుత దివ్యమంగళాకృతి కృపామహితమూర్తి
సకలవిశ్వాకీర్ణ సారసారసహీర శరదిందు శరకీర్తి సారవర్తి
నిశ్చలేంద్రియసక్త నిర్మలాత్మ భటాళి సర్వార్థ సంరక్షు చక్రవర్తి
సజ్జనాహితలోక చటులాంతకోద్వృత్త పూర్ణభీకరమూర్తి పుణ్యకీర్తి
గీ॥ అఖిలజగదేక శరణాగతానువర్తి సర్వకామిత ఘటనైక చక్రవర్తి
వేదసద్వర్ణితాంతర వేదివర్తి శ్రితవినుతకీర్తి లక్ష్మీనృసింహమూర్తి!

ఈతఁడు యాజ్ఞవల్క్య శాఖీయుడు. భారద్వాజ గోత్రుఁడు. పిన్నమరాజు రాజన రామమాంబల తనయుడు. పైన వివరించిన తొమ్మిది శతకములు కాక బంధురవృత్త రామాయణాది బహుగ్రంథములను(26)రచించిన కవి. ఈశతకము క్రీ.శ. 1915 లో దర్భా జగన్నాథశాస్త్రిగారిచే సరి చూడఁబడి నర్సాపురం సువర్ణముఖీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

# కంతేటి వీరయ్య

ఈతఁడు నూజివీడు పురవాసి. శ్రీ తిరుమణిసెట్టి కోటేశ్వర గురు శిష్యుఁడు. "రాజయోగి" అను మకుటముతో నూఱు గీత పద్యములు గల వేదాంత విషయిక శతకము రచించెను.

శ్రీకరంబగు విజ్ఞాన సిద్ధి కొఱకు
సద్గురుస్వామి చరణాంబుజములఁ దలఁచి
హరిహర హిరణ్యగర్భుల కాత్మ మెుక్కి
రమ్యముగఁ దెల్పెదను విను రాజయోగి!

గురుపదంబున కర్థంబుఁ గోరి వినుము
ప్రథమవర్ణంబు ప్రకృతిగాఁ బరఁగుచుండు
దానిపై వర్ణ మజ్ఞాన ధ్వంసకారి
రమ్యముగఁ దెల్పెదను విను రాజయోగి!

విష్ణు పూజించి కొందఱు వేద్యులైరి
శివుని పూజించి కొందఱు సిద్ధులైరి
అద్వయ బ్రహ్మ మెఱుఁగక యధములైరి
రమ్యముగ..................రాజయోగి!

మేటి తిరుమణిసెట్టి శ్రీ కోటయార్య
కరుణ కంతేటి వీరయ్య కవిత నూరి
జనుల కానందసుధ లొల్కఁగను రచించె
రమ్యముగ........ ..........రాజయోగి!

గౌరీ ముద్రాక్షరశాల 1914.

# నాగపూఁడి కుప్పుస్వామయ్య

( క్రీ.శ. 1863 - 1941 )

సుప్రసిద్ధవిమర్శకులును, విద్వాంసులును నగు నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు క్రీ.శ. 1887 సంవత్సరమున శ్రీకాళహస్తీశ్వరుని పేర నొక శతకము రచియించి దానిని క్రీ.శ. 1918 లో ప్రకటించిరి. ఆ శతకమునకు పీఠికగా శ్రీకాళహస్తిక్షేత్రవర్ణనమును నిరువదియేడు పుటలలో రచియించిరి. కుప్పుస్వామయ్యగారి వచనరచన నిర్దుష్టమై నిరవద్యమై వెలయుచుండును. శ్రీకాళహస్తీశ్వరశతకము నూఱు మత్తేభశార్దూల వృత్తములు గలిగి, ధారాశుద్ధి గలిగి, గ్రంథకర్త సంస్కృతాంధ్రభాషాపాండిత్యము, భక్తిపటుత వెల్లడి సేయుచున్నది.

శా. నాళీకాసన వారిజోదర మరున్నాథాది గీర్వాణులున్
నీలీల ల్పొగడంగఁ జాలరనఁగా నేరంగ నా కేగతిం
బోలు న్నీపయి భక్తి నన్నుఁ బురికొల్పెం గావున నిన్ను గా
రీలోలు న్నుతియింపఁ బూనితి మదిన్ శ్రీకాళహస్తీశ్వరా!

శా. మోక్షద్వారకవాటకుంచికయనం హోమత్తశుండాలహ
ర్యక్షం బెద్దడి యిర్లప్రొద్దు విషయోద్యద్దందశూకావళీ
పక్షీంద్రం బురుగర్బవాతమశుభ ప్రాగ్భారఘోరాటవీ
శిక్షావహ్నియు నీదు నామమె కదా! శ్రీకాళహస్తీశ్వరా!

# నిడుదవోలు సుందరము
( క్రీ.శ. 1864 – 1931 )

ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు పితామహులు నిడుదవోలు సుందరము పంతులుగారు. ప్రాచీనాంధ్రవిద్వల్లోకమునకుఁ జిరపరిచితులు. వీరు పార్థివలింగపూజాధురంధరులు. వీరి శతకకృతులు.

1. సత్యవ్రతిశతకము. సతతముసంతసమొసంగుసత్యవ్రతికిన్ అను సమస్యాపూరణము. క్రీ.శ. 1900 లో వాగ్వల్లి పత్రికలోఁ బ్రకటితము.

2. సింహాచలవిహారశతకము. "శ్రీసింహాచలవిహార శ్రితమందారా!" అనుమకుటము. ఏకప్రాస.

3. హరహరశంభో శివ శతకము. ఏకప్రాస హరహర శంభో మొదలు – శివా! సంబోధన.

4. సర్వేశ్వరసహస్రము – సర్వేశ్వరా అను మకుటము. ఇందు పార్వతీపరిణయాది కథలు గలవు.

5. విశ్వనాథప్రభూతిశతి.

1. సత్యవ్రతి శతకము. ( ముద్రితము )

క. కృతు లొసగును భూపతికిన్ చతుర వచోరస మొసంగు సరసోన్నతికిన్
నుతు లొసగు ధృతజ్ఞాతికి సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.

శతకాంతమందు :—

క. క్షితిశ్రీమహితానందనృపతి యాజ్ఞం జెప్పితిఁ స్తవమె వాస్తవమో
మతి నూరు గతులఁ దలచిన సతతము సంతస మెసంగు సత్యవ్రతికిఁ

2. సింహాచలవిహారశతకము. (అముద్రితము)

క. శ్రీసతి రొమ్మున కొమ్మున భూసతి మెఱయంగ నాది భూదారమవై
భాసిల్లి తీ నగంబున శ్రీ సింహాచలవిహార శ్రితమందారా!

శతకాంతమందు :—

నీ సదనంబును గని సంతోసంబున పద్యశతకమునుం గూర్చితి నే
నీ సుందర మనువాఁడను శ్రీసింహాచలవిహార శ్రితమందారా!

3. హరహరశంభో శతకము. ( అముద్రితము )

క. హరహరశంభో శంకర గిరిజామానసవిహార కిల్బిషహర భా
స్వరదివ్యకాంతిధర నీ చరణంబులె శరణమయ్య సత్యంబు శివా!

క. హరహరశంభో హరియును పరమమునీంద్రులును పరమభాగవతులు నె
వ్వరు కనుగొనలేని మహోత్తర దివ్యాకృతివి నీవు ధర్మేశ శివా!

4. సర్వేశ్వరసహస్రము (అముద్రితము) ఇందు పార్వతీ పరిణయము, హాలాస్యక్షేత్రమహాత్మ్యము మున్నగు కథా వస్తువులు గలవు.

శ్రీలావణ్య రసాత్మ సంతతులకున్ శృంగారధామంబ స
త్పాలాపాగ్రిజజన్మభూమి బహుశాస్త్రజ్ఞానసంపన్నభూ
పాలాధిష్ఠితసింహపీఠి బహుళవ్యాపారవిట్శూద్రమై
హాలాస్యమ్మను క్షేత్రి మెప్పెసగు బాండ్యక్షోణి సర్వేశ్వరా!

తన మైత్రావికి సాక్షి పోలి ఫణికాంతాలోక మత్యంత ర
క్తిని వెన్నాడగ చందనాగురు లసద్దేహుండునై వచ్చె గు
ప్పున కైలాసమునుండి యోషధిపురంబున్ జేరు మార్గంబు వా
సనల న్నింపుచు పెండ్లిజూడ మలయేశస్వామి! సర్వేశ్వరా!

చ తు ర్థ భా గ ము స మా ప్త ము

# శతక కవుల చరిత్రము

## అతిత్వరలో ఐదవ భాగము
## వెలువడుచున్నది



★ సంస్కృత శతకములకు ఆంధ్రానువాదములు రచించిన కవులు.

★ సంస్కృతమున శతకములు రచించిన తెలుగుకవులు.

★ శ్రీ ఆదిభట్ట నారాయణదాసు
శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు
శ్రీ వేంకటరామకృష్ణ కవులు
శ్రీ భోగరాజు నారాయణమూర్తి
శ్రీ దువ్వూరి రామిరెడ్డి
శ్రీ రెంటాల వేంకటసుబ్బారావు
శ్రీ కూచి నరసింహము
శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము
శ్రీ దాసు శ్రీరాములు
శ్రీ ఆదిపూడి సోమనాథరావు
శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులు

మొదలగు అనేక శతక కవుల దివ్యచరిత్రలతో -
పద్యరత్నములతో వెలువడుచున్నది.

ప్రకాశకులు:- కమలకుటీర్ (ప్రెస్ & పబ్లికేషన్స్)
నరసాపురము (ప॥ గోదావరి)

# అకారాద్యనుక్రమణిక

ఇందు

శతక కవుల నామములు అకారాదిగ నున్నవి.
వారు రచించిన శతకముల పేరులు వారి నామముల
కెదురుగా ముద్రింపఁబడినవి.



ఈ గ్రంథములో వివరించిన శతక కవుల నామముల చివర
యీ గ్రంథములోవారి చరిత్రముగల పుట సంఖ్య కూడ
చేర్చబడినది.



ప్రతి శతకము యొక్క పేరు మాత్రమే యిందు ముద్రించ
బడినది. పాఠకులు ప్రతి శతకము పేరు చివరను
'శతకము' అని చేర్చి చదువుకొనవలెను.
(ఉదా:- రామచంద్ర, శివ, = రామచంద్రశతకము,
శివశతకము.)



ఇంతవరకును తెలిసిన మొత్తము శతకముల సంఖ్య
రమారమి - 1200.
మొత్తము శతక కవుల సంఖ్య రమారమి — 900.



సంపాదకులు
శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.,
శ్రీ వంగూరి నరసింహారావు.

# అకారాద్యనుక్రమణిక

అ

## క

## గ



## ఘ



## చ



* కంచెర్ల గోపన్న - రంగశాయి, జానకీపతి, మహీజాధిపా, భావనారాయణ, రామతారక, ఆర్తరక్షామణీ, మానసభోధ మొదలగు శతకములు కూడ రచించినట్లు అనుమానింప వీలగుచున్నది.

జ

| | |
|---|---|
| నాగలింగదాసు కె. | భక్తావన |
| నాగానందస్వామి ఎన్. | నాగానందచిద్విలాస |
| నారసింహదాసు చిత్తూరు | ప్రసన్నాంజనేయ<br>మనసానంద |
| నార్ల పేరయ్య గా. | వేంకటాచలరమణ |
| నారాయణ చిలకమర్తి | వేణుగోపాలబాల |
| నారాయణకవి అయ్యలరాజు 276 | ఆంజనేయ |
| ,, క్షైవరపు 685 | అనఘనారాయణ |
| ,, వేదుల | నిర్గోప్యపతగరథతనయ, రామ |
| ,, తాళ్ళూరి | జగత్ప్రభు |
| నారాయణదాసు ఆదిభట్ల | సీతారామ, మృత్యుంజయ, సత్యవ్రత, సూర్యనారాయణ, (తెలుగు) కాశీ, రామచంద్ర, (సంస్కృతము) వేల్పునంద (అచ్చ తెనుగు) |
| ,, వి. | శివ, ముకుంద |
| ,, ఎ. | సూర్యనారాయణ |
| నారాయణపిళ్ళె | రామచంద్ర |
| నారాయణమూర్తి సి. | సాంబ |
| ,, తరిగొప్పుల | దశరథరామ |
| ,, భోగరాజు | పార్థివలింగ, శివ |
| ,, ఎస్. | రామలింగేశ్వర |
| నారాయణయ్య పి. | చెన్నకేశవ |
| నారాయణరాజకవి ఎన్. | జగన్నాథయోగి |
| నారాయణరాజు యస్. | లోకనాథ |
| నారాయణశాస్త్రి చర్ల | మహిమ |
| ,, ద్వివేది | మురారి |
| నారాయణాచార్యులు చిలకమర్తి 612 | వేణుగోపబాల |

## భ



## మ

## వ

| | |
|---|---|
| వేంకటకృష్ణయ్య గ. | చెన్నకేశవ |
| ,, భావరాజు | కోటిలింగ |
| వేంకటకృష్ణారావు ఎ. | రంగ, హనుమత్, లక్ష్మి |
| వేంకటకృష్ణరాయశర్మ పాపరాజు | కోటిలింగ, జనార్దన |
| వేంకటకృష్ణశాస్త్రులు ములుకుట్ల | కోదండరామ |
| వేంకటకృష్ణారావు వి. | కోడికంటిరామ |
| వెంకటాచలం తురగా | భావనారాయణ, భక్తరక్షామణి |
| వెంకటదాసు యస్. | రామ |
| ,, జలదంకి | వేంకటేశ్వర |
| ,, కటకము | గొల్లపల్లిరఘునాథ |
| వెంకటనరసింహకవి | శ్రీరామరామ |
| వేంకటనరసింహము సరికొండ | రామ |
| వేంకటనరసింహశాస్త్రి జి. | సత్యనారాయణ |
| వేంకటనరసింహాచార్యులు సేనాధిపత్యం | జానకీపతి |
| వేంకటనృసింహకవి పైడిపాటి 209 | రామచంద్ర, మన్నారుకృష్ణ |
| వెంకటప్పయ్య కలవకొలను | రామచంద్ర |
| ,, బాపట్ల | హరి |
| వెంకటప్పయ్యశాస్త్రి వి. | తులసీ |
| వెంకటప్పారావు నందగిరి | విప్రపురిఆదికేశవనీస, రామ, శ్రుతశైలహనుమచ్ఛతకము, |
| వేంకటరంగాచ్చార్యులు పరవస్తు | మహాప్రభు |
| వేంకటరత్నము డి. | మాలేశ్వర |
| వేంకటరమణదాసు వరిగంటి | రామ |
| ,, మునునూరి | ,, |
| ,, వి. | పార్థసారధి |
| వేంకటరమణమ్మ కళ్ళేపల్లి | వరలక్ష్మి |
| వేంకటరమణయ్య ఘంటసాల | మురారి |
| వేంకటరమణరెడ్డి పి. | నారాయణ |

శ

| | | | |
|---|---|---|---|
| సుబ్బయ్య | మద్దాలి | 624 | శ్రీహరి |
| ,, | చింతా | | వేంకటేశ్వర |
| సుబ్బయ్యపంతులు | కాకర్ల | 833 | సంజీవరాయ |
| సుబ్బరామకవి | వి. | | సోమేశ్వర |
| సుబ్బారాయకవి | ఎక్క. | | కంఠ |
| ,, | అన్నమరాజు | | కోదండరామ |
| ,, | బొగ్గవరపు | | సీతారామచంద్రప్రభో |
| సుబ్బరాయశాస్త్రి | దంతుర్తి | | భావన |
| ,, | దేవులపల్లి | 828 | మందేశ్వర, సీతా, |
| సుబ్బారాయుడు | ఎన్. | | సనాతనగోపాల, సంతాన<br>గోపాల, వేంకటేశ్వర |
| సుబ్బారాయుడు | వడ్డాది | 829 | నందనందన, శ్రీనారసింహ<br>ప్రకాశకము, సూర్య, శివ<br>చింతామణి, ఆత్మ ... మణి,<br>వసురాయ ... వళి |
| సుబ్బారాయకవి | అనంతరాజు | 790 | సదాశివేశ్వర |
| సుబ్బారావు | గార్లదిన్నె | | కృష్ణ |
| సుబ్బారావు | వావిలకొలను | | తిల్వగిరిలింగ |
| సుబ్బుసెట్టి | | | జయరామ |
| సుబ్రహ్మణ్యం | చింతపెంట | | రామలింగేశ్వర |
| సుబ్రహ్మణ్యం | ఆ. | | కందపద్యనీతి |
| సుబ్రహ్మణ్యకవి | జంగం | | చెన్నకేశవ |
| సుబ్రహ్యకవి | అల్లమరాజు | | సింహాద్రిరామాక్షప, పాప<br>యమంత్రి, కృష్ణభూపాల |
| సుబ్రహ్మణ్యకవి | మంగళపల్లి | 800 | అన్నవిల్లిపురమార్గాంకా!<br>జగద్బాంధవా! |
| ,, | వేములపాటి | | వల్లూరిపార్వతీ |

హ



సంపూర్ణము

